# ఖాదీ అర్థశాస్త్రం

## మహాత్మా గాంధీ

అనువాదం :

కొడాలి ఆంజనేయులు

అహమదాబాద్ నవజీవన్ ట్రస్టువారి అంగీకారముమేరకు
మదరాసు గవర్నమెంటు ముద్రణాలయ
సూపరింటెండెంటు వారివలన
ముద్రింపబడినది

1958

(ఉద్యోగరీత్యా ఉపయోగమాత్రమునకు)

వెల రూ. 10.

# తొలి పలుకు

భారత దేశములోని భయంకర దారిద్ర్యమూ, బ్రిటిష్ ప్రభుత్వకాలంలో బుద్ధిపూర్వకముగా ఏనచేతి పరిశ్రమలు నాశనం చేయబడినందున అది అభివృద్ధిఅయిన వేగమూ, చిన్ననాడే గాంధీగారి మనస్సులో బాగా నాటుకొనిపోయినవి. ఆ దారిద్ర్యమును నివారించేటందు కాయన మార్గోపాయాలను ఆలోచిస్తున్నారు. 1908 నాటికే ‘ హింద్ స్వరాజ్ ’ లేక ‘ ఇండియన్ హోమ్ రూల్ ” అని ఆయన రచించిన గ్రంథంలో, “ పురాతనము పవిత్రము అయిన చేమగ్గములను ” గూర్చి ప్రసంగిస్తూ, లాయర్లనూ డాక్టర్లనూ రాటమును చేపట్టవలెననీ, ధనవంతులు దానిని ప్రోత్సహించేటందుకు తమ ధనమును వినియోగించవలయుననీ సలహాయిచ్చియున్నారు. దారిద్ర్య నివారణోపాయమునుగూర్చి అన్వేషిస్తూన్న సమయంలో నిజమైన స్వదేశీతత్వం ఆయన మనస్సుకు తట్టింది. అది అంతకు పూర్వమే ప్రబోధింపబడుతూన్నది కాని యథాతథంగా దాని ఆంతరంగిక భావము వ్యక్తం కాలేదు. “ మనకు ఎక్కువ దూరస్థులుగా ఉండేవారికి కాక అత్యంత సమీపస్థులుగా నుండేవారికి మాత్రము ఉపకారం చేసేటందుకు మనం ఉపయోగపడుతూండడమే స్వదేశీ తత్వ ” మని ఆయన వివరించియున్నారు. మనిషి యొక్క ప్రాథమిక భౌతికావసరములయెడ శ్రద్ధవహించి, ఆయన స్వయంగా ఉత్పత్తి చేసుకొన్న వస్తువుల వలనగాని లేక ఆయనకు అత్యంత సమీపస్థులుగానున్నవారు తయారు చేసిన వస్తువుల వలనగాని వాటిని తీర్చడం ముఖ్యం. ఆహారము, దుస్తులు, గృహము ఇవి ప్రాథమికావసరములు. మన ఆహారాన్ని మనం పండించుకొని సరఫరా చేసుకొనే వ్యవస్థ

శ్యాన్ని మనమింకా పూర్తిగా పోగొట్టుకోలేదు కాని, క్రమ క్రమంగా దానినికూడా పోగొట్టుకొంటున్నాము. వస్తువుల విషయంలో మనం స్వయం సంపూర్ణంగా ఉండడమే కాక అమ్ముకోవడానికి విదేశాల కెగుమతి చేసుకోవడానికీ కూడా తగినంత ఎక్కువ ఉత్పత్తి చేసుకోగల్గుతూ ఉండేవారము. ఇల్లు ఇంకొకచోటనుండి దిగుమతి చేసుకోడానికి వీలులేని వస్తువు. కనుక మనిషికి కావలసిన ఇల్లు ఎలాగనే కట్టుకోవలసి ఉంది. అయితే అందుకు కావలసిన సామానులు, పైభావం ప్రకారం స్వదేశీ కాకపోవచ్చును. వస్తువుల విషయంలో నిజమైన స్వదేశీపైన బలాత్క్రమణ జరిగింది. అందు వలన గాంధీజీ దృష్టిని ఈ విషయమే అన్నిటికన్నా మొట్ట మొదట ఆకర్షించి, ఒకప్పుడు మన గ్రామ్యావసరాలన్ని తీర్చేటందుకేగాక, ఇతర దేశాలనుండి ఐశ్వర్యమును ఆకర్షిం చేటందుకుకూడా ఉపయోగపడుతూ, చారిత్రకాంశములు లభ్యమైన అత్యంత పురాతనకాలమునుండి మనతో వాణిజ్యం చేసిన వివిధ దేశాల ప్రజల పొగడ్తలను కన్న లలిత కళ యగు ఈ పరిశ్రమ నశించిన హేతువులనుగూర్చి పరిశీలన చేయడానికాయనను ప్రోత్సహించిఉండడం సహజమే.

నిజానికి 1908 లోనూ ఆ తరువాత చాలాకాలం వర కున్నూ గాంధీజీకి నూలు వడుకు వృత్తినిగూర్చిగానీ ఆ కళను గూర్చికానీ తెలియనే తెలియదు. ఆయన రాటం చూచి కూడా ఉండలేదు. యంత్రాలయాలలో ఉత్పత్తియై సర ఫరా చేయబడిన నూలును మాత్రమే నేయగలిగినప్పటికీ, చేనేత పరిశ్రమను ప్రోత్సహించినందువలన భారత దేశంలో ఉత్పత్తియైన బట్టను సరఫరా చేసే సమస్య పరిష్కారం అవుతుందని ఆయన భావించారు. అయితే విదేశీమిల్లు యజమానులవలెనే స్వదేశీ యంత్రాలయాధికారులుకూడా

లాభాల ఉద్దేశంతోనే ప్రవర్తిస్తున్నారనీ, మిల్లు బట్టలతో చేనేత వస్త్రాలు పోటీ చేయ ప్రారంభించినట్లయితే, మిల్లులు నూలు ధరను పెంచగలవనీ, మిల్లునూలుకు తోడు మిల్లునేత కూడా అభివృద్ధి అయినప్పుడు కానీ, లేక పోటీ తప్పించుకోవడానికిగానీ, ఈ పనికి చేమగ్గాలకు నూలు సరఫరా చేయడం కూడా మిల్లులు మానవచ్చుననీ, ఆయన త్వరలోనే గ్రహించారు. కాబట్టి ఆయన నూలు ఉత్పత్తికోసం కూడా ఉపాయాలు వెదకడం ప్రారంభించారు. ఆ అన్వేషణ ఫలితంగా చరఖా తిరిగీ కనుగొనబడింది.

నిజానికి భారత దేశంలో చరఖామీద నూలు వడికేపని యెప్పుడూ విరమింపబడలేదు. కాని గాంధీజీ మాత్రం చరఖాను యెరుగరు. ఆయన చరఖాను కనుగొన్న విధానమును గూర్చి ఆయన ఆత్మకథయందు ఒక చిత్రగాథవలె మూడధ్యాయములలో వర్ణింపబడినది. ఆయన చాలా కృషి చేసి దానిని కనుగొన్నారు. ఆయన దానిని తెలుసుకొన్న పిమ్మట దాని శక్తిసామర్థ్యములను గూర్చినీ, అది ఆర్థికంగా లాభదాయకమై ఎక్కువ మంచి నూలును ఎక్కువగా ఉత్పత్తి చేయగలిగేటట్లు అభివృద్ధి చేయడానికిన్నీ, తన పరిశోధనాన్వేషణములను ప్రారంభించారు. ఈ పరిశోధన కడచిన ఇరవై ఐదు సంవత్సరాలనుండీ ఎడతెగకుండా జరుగుతూ ఇప్పటి కప్పుడే చెప్పుకోతగిన ఫలితాలను కలిగించింది.

రాటమూ, రాటం ఉత్పత్తిచేసిన ఖాదీ, ఈ రెండూ భారత జాతీయ మహాసభ వారిచే ఆమోదింపబడే టంతవరకు, వాటికి ఊరూ పేరూ లేదు. 1921 లో బెజవాడలో సమావేశమైన అఖిలభారత కాంగ్రెసు సంఘమువారు తిలకు స్వరాజ్య నిధికి ఒక కోటి రూపాయీలు వసూలు చేయవలెనని కోరడమే కాక, విదేశీ వస్త్ర బహిష్కారమును జరు

ప్రదంగా కొనసాగించేటందుకు పీటుగా ఇరవై లక్షల రాటాలనుకూడా స్థాపించవలెనని తీర్మానించిరి. రాటము స్వాతంత్ర్య చిహ్నంగా పరిణమించి జాతీయ పతాక మధ్యమున స్థానం సంపాదించుకొన్నది. ఆ రోజులు స్ఫూర్తిమంతమైన కార్యోత్సాహంగల రోజులు. 1921 వ సం|| జూన్ 30 వ తేదీనాటికి కోటి రూపాయలకు మించి వసూలు చేయబడింది. ఆ సమ్మట వేల కొలదీ కాంగ్రెసు కార్యకర్తలు భారత దేశమంతటా చర్ఖా మీద తమ దృష్టి కేంద్రీకరించారు. దేశంలోని మారుమూల ప్రదేశాలలో వేలకొలదీ రాటాలు పనిచేయడం కల్పించింది కాని అవి సరిగా లేక మృతప్రాయంగా ఉన్నవి. ఆ స్థితిలో కూడా సుందరమైన బీహారు కొల్లిట్టి, ఆంధ్ర దేశంలో సన్నతమైన నూలును అవి ఉత్పత్తి చేయడం మానలేదు. చర్ఖాను ఉత్సాహకరంగా ప్రోత్సహించడంలో కాంగ్రెసు కార్యకర్తలు ఒకరితో ఒకరు పోటీపడ ప్రారంభించారు. 1921 లో ప్రారంభించబడిన జాతీయ కళాశాలలలోను విద్యాపీఠములలోనూ నూలు వడుకుట తప్పక సరిగా నేర్పవలసిన ముఖ్య విషయంగా వారి పాఠ్యావళిలో చేర్చబడింది. నూలు వడకడమూ, చర్ఖాలను వాటి భాగాలను నిర్మించడమూ ఒక ప్రత్యేకతగా చేసుకొని అనేక ఆశ్రమములు స్థాపింపబడినవి. చేతితో వడుకుట, చేతితో నేయుటను పునరుద్ధరించి ప్రోత్సహించుటకు కాంగ్రెసు సంఘాలు తిలకు స్వరాజ్య నిధిలో చాలా భాగమును వెచ్చించినవి. సబర్మతియందలి గాంధీజీయొక్క సత్యాగ్రహాశ్రమం అందుకొక పరిశోధనా సంస్థయైనది. అత్యంతమైన ఉత్సాహం ప్రదర్శింపబడినది కాని, అప్పటికది చాలావరకు అశిక్షితంగా ఉంది. ఖాదీ సందేశాన్ని మారుమూల గ్రామాలకు ఉత్సా

హాంతో తీసుకొనిపోయిన కాంగ్రెసు కార్య కర్తలకే నూలు వడికే నేర్పు లేదని చెప్పినందువలన ఎవరినీ చులకనగా మాటాడి నట్లర్థం కాకూడదు. గాంధీజీ, ప్రారంభంలోనే ఈ లోపమును గ్రహించి కాంగ్రెసు కార్యకర్తలు వడకడంలో నేర్పరులు కావలెననీ, జాతీయ పాఠశాలలు నూలు వడకడం నేర్పే విద్యాలయాలు కావలెననీ, ఆశ్రమములన్నీ నూలు వడుకుటకు, ఖాదీని వ్యాపకం చేసేటందుకు కేంద్రములుగా నుండవలెననీ పట్టుపట్టారు. ఖాదీ ఉపయోగమునకు మంచి ప్రోత్సాహమీయబడినది. పెద్ద పెద్ద మొత్తాలు వెచ్చింపబడి అనేకమంది కార్యకర్తలు దాని వ్యాప్తికొరకు నియోగింపబడుటచేతను, ఇదియేగాక ఢిల్లీ విశాల కాంగ్రెసు నిర్మాణము వలనను, సీటుస్నేటినీ మించి విదేశీ వస్త్ర బహిష్కరణమును జయప్రదంగా ఆచరణలోకి తీసుకొని వచ్చేటందుకు దాని ఉపయోగమును గూర్చి నిరంతరం ప్రబోధిస్తూ దేశమంతటా గాంధీజీ విడా తెరిపి లేకుండా చేసిన సంచారముల మూలమునను, సెప్టెంబరు కాబోలు 1921 అక్టోబరులో చొక్కా టోపీకూడా త్యజించి అంగవస్త్రము చడ్డీ ధరించడంతోనూ, స్వరాజ్య సంపాదనమునకు కాంగ్రెసు కార్యక్రమంలో చర్ఖాయున్నూ ఖాదీయున్నూ ప్రధాన విషయాలుగా పరిణమించినవి. దేశమందలి వివిధ ప్రాంతాలలో వడికే వారిలోనూ నేసేవారులోనూ అధిక సంఖ్యాకులు ముసల్మానులూ హరిజనులూ కావడంచేత, ఖద్దరు ఉద్యమం సాంఘికైకమత్యమును అనగా హిందూమహమ్మదీయుల ఐక్యతను పెంపొందించేటందుకు అంటరాని తనమును నిర్మూలించేటందుకూ సహాయావకాశములను కల్పించింది. అందుకు బదులుగా జాతీయకార్యక్రమంలోని ఈ విష

యములనుండి ఖద్దరుఉద్యమం, తన పురోగమనమునకు సహకారమునుకూడా పొందింది.

రాష్ట్ర కాంగ్రెసు సంఘాలు పెద్ద యెత్తున ఖాదీ ఉద్యమాన్ని స్థాపించినవని నేను పైన చెప్పియున్నాను. ఖాదీని ఉత్పత్తిచేసి కోరినవారందరికీ దానిని అందచేయడం అవసరమయింది. ఆ పని అత్యుత్సాహంతో ఆరంభింపబడింది. తిలకు స్వరాజ్యనిధికి విరాళంగా యీయబడిన నాణెములను లెక్కించడంద్వారా స్వరాజ్యోద్యమవిజయమును అంచనా వేయగలిగినయెడల, ఖాదీ ధారులయిన స్త్రీ పురుషుల సంఖ్యను చూపించినన్నీ, పనిచేస్తూన్న రాట్నాలను లెక్కపెట్టినన్నీ కూడా దానిని ప్రత్యక్షంగా నిరూపించగలము. అహమ్మదాబాదు కాంగ్రెసుకు కావలసిన యావత్తు బట్టా ఖాదీలోనే వాడబడడం వలనను, అక్కడి ప్రదర్శనంలో ఖాదీయున్నూ అదితయారయ్యే ముందు పొందే అన్ని పరిణామాలున్నూ అత్యంత ప్రాముఖ్యంగా ప్రదర్శితములు కావడం చేతన్నూ, ఆ కాంగ్రెసు ఉద్యమవిజయాన్ని స్పష్టంగా రుజువుచేసింది. ప్రతియేటా జరిగే కాంగ్రెసు మహాసభలలో అటువంటి ప్రదర్శనము లిప్పుడాకర్షవంతమ్మలైన లక్షణాలుగా పరిణమించినవి. 1922 ప్రారంభంలో గాంధీజీ ఖైదు చేయబడినప్పటికే ఖాదీ ఉద్యమం తగినంత అభివృద్ధియై తనిఖీ, అదుపూ, అవసరమైనవి. 1922 డిశంబరులో జరిగిన గయా కాంగ్రెసు ప్రదర్శనంలో ముడి వస్తువులను సేకరించి బాగు చేయడం మొదలుకొని, తయారైన వస్తువును అంగడిలో అమ్మడం వరకునూ గల ఖాదీ నిర్మాణమునందలి అన్ని అంతరువులునూ ప్రదర్శింపబడినవి. ఖాదీ అంటే కేవలం చేతితో వడికిన నూలుతో, చేతితో నేయబడిన దూది బట్ట మాత్రమే కాదు. ఉన్ని పట్టు బట్టలుకూడా ఖాదీలో ఇమిడిఉన్నవి;

తివాచీలు మొదలైనవి నేసే జనపనారవంటి ముతగనారలు కూడ అందు ప్రదర్శింపబడినవి. వివిధ ప్రాంతాలనుండీ తీసుకొని రాబడిన నిపుణులు వాటి అంతరువులను చక్కగా ప్రదర్శించిరి. ఇదంతా ఖాదీ ఉద్యమాన్ని ప్రోత్సహించి అనంతావకాశాలతో దానిని దేశవిస్తృతోద్యమంగా చేసి వైచినది. 1923 డిశంబరులో జరిగిన కాకినాడ కాంగ్రెసునందు, "అఖిల భారత కాంగ్రెసు సంఘంవారి సాధారణ తనిఖీక్రింద యావద్భారత దేశంలో ఖద్దరు నిర్మాణమును స్థాపించి సాగించేటందుకున్నూ, సాధారణ నిధులనుండి అందుకు ప్రత్యేకించబడే సొమ్ముకుతోడు, ఋణములతోసైతం మరికొంత సొమ్మును వసూలు చేసేటందుకున్నూ సంపూర్ణాధికారములతో" ఒక అఖిల భారత ఖాదీ బోర్డు ఏర్పాటు చేయబడవలెనని తీర్మానించేటంతవరకూ ఆ ఉద్యమం విస్తరించింది.

మఱుసంవత్సరం చాలావరకు ప్రారంభ కార్యక్రమం లోనూ, దేశంలో ఖాదీ నిర్వహణమునకు కల ఎక్కువ అవకాశములనుగూర్చి సౌకర్యములను గూర్చి పరిశోధించడం లోనూ పరీక్షించడంలోనూ గడచిపోయింది. అసంఖ్యాకములుగా కేంద్రాలు పనిచేస్తున్న సంగతికూడా తెలిసింది. ఆసంవత్సరాంతంలో తమ యాజమాన్యంకింద, రూ 949, 348 ల విలువగల ఖాదీ ఉత్పత్తి చేయబడినట్లు బోర్డువారు నివేదించారు. ఇదిగాక వ్యక్తులకు సంబంధించిన సంస్థలు కూడా ఎక్కువగా ఖాదీ ఉత్పత్తిచేసినవి. రెండు కోట్ల రూపాయిల విలువగల వడుకు నూలు దేశంలో ఉత్పత్తియై ఖర్చవుతూన్నట్లు అంచనా వేయబడింది. ఖద్దరు ఉత్పత్తి చేసేటందుకు కేంద్రాలున్నూ, అమ్మేటందుకు భాండారములున్నూ స్థాపించబడినవి. ఖాదీ నిర్మాణ కౌశల్యమునకు దాని వ్యాప్తికి సంబంధించిన ఖోగట్టాను సరఫరా చేయడా

నికీ, గ్రంథాలను ప్రచురించడానికీ కార్యాలయాలు స్థాపించబడినవి. ఐచ్ఛికంగా వడకడం ప్రోత్సహింపబడింది. ఆ సంవత్సరంలో ఆ పనికి ఎనిమిది లక్షలకు పైగా పెట్టుబడి పెట్టబడింది.

1925 సెప్టెంబరు 22 వ తేదీని పాట్నాలో జరిగిన అఖిల భారత కాంగ్రెసు సంఘంవారి తీర్మానానుసారంగా, నూలు వడకుటను ఖద్దరునూ అభివృద్ధిచేసే నిమిత్తం, రాజకీయులకు రాజకీయ పరివర్తనములకు రాజకీయ సంఘములకు లోబడనట్టిన్నీ, వాటి ద్వారా పుట్టే మార్పులను పొందనట్టిన్నీ, కాని కాంగ్రెసుకు ఒక అంగంగా ఉండేటట్టిన్నీ అఖిల భారత చరఖా సంఘం అనే ఒక నిపుణుల సంస్థ స్థాపింపబడినది. దానికి స్వతంత్రమైన ఉనికి స్వతంత్రాధికారాలు ఉండినవి. అప్పటినుండి ఈ సంస్థ ఉద్యమాన్ని సాగించి మహాత్మాగాంధీ సహాయంతో అందుకు గావలసిన నిధులను సేకరించింది. తరువాత ఈ సంఘం, చారిటబిల్ సొసైటీల చట్టం (XXI ఆఫ్ 1860) క్రింద రిజిస్టరు చేయబడింది.

ప్రతియేటా ఉత్పత్తి అవుతూ అమ్మకం అవుతూన్న ఖాదీ, పరిమాణంలో అంతకంతకు పెరిగి పోతూండడమే గాక, నాణ్యంలో కూడా ఆనవాలు పట్టడానికి వీలులేనంతగా హెచ్చింది. నిరంతరం సంఖ్యాబలంలో పెరిగిపోతూన్న నిపుణులయిన కార్యకర్తలు, ఖాదీ పరిశ్రమలను, ఉత్పత్తి కౌశల్యమును, అమ్మకపు విధానమును అభివృద్ధి చేయడంలో నిమగ్నులై ఉంటున్నారు. ఈ సంఘంలో 1926 మొదలు 1940 వరకూ గల మూడు పంచ వర్షములలో జరిగిన అభి

వృద్ధి, ఈ క్రింది అంకెలను ఒకసారి చూచినయెడల తెలియ గలదు.

| పంచవర్ష కాలం. | ఉత్పత్తి — రూపాయిలలో. | అమ్మకం, రూపాయిలలో. |
|---|---|---|
| 1926-30 | 1,53,72,883 | 2,00,59,517 |
| 1931-35 | 2,07,38,757 | 2,76,95,553 |
| 1936-40 | 2,20,59,673 | 2,76,44,467 |

ఈ జరుగుతూన్న సంవత్సరం, ఉత్పత్తి అమ్మకం ఈ రెండు విషయాలలో కూడా తక్కిన అన్ని సంవత్సరాలకంటె ఎక్కువ ప్రఖ్యాతం కాబోతుందని తోస్తున్నది. ఈ ఉద్యమం ఎంత ఉపకారం చేసింది అనే సంగతి, ఖాదీ ఉత్పత్తిలో నియోగింపబడిన శిల్పకారులకు, 1925 నుండి 1940 వరకు రూ 3,59,41,900 ముట్టినవని తెలుసుకొన్న యెడల, కొంత వరకు గ్రహించవచ్చును. ఈ ఉద్యమం సహజంగా ఒకప్పుడు హెచ్చుగానూ మరొకప్పుడు తగ్గుగానూ ఉంటూ వచ్చింది. ప్రారంభంలో కొన్ని సంవత్సరాలు నష్టం కూడా వచ్చింది. అయితే ఇప్పుడు మాత్రం వ్యాపార సరళిలో సరిగా నిలదొక్కుకొని ఉందని చెప్పతగిన స్థితికది వచ్చింది. అయితే ఇది ముఖ్యంగా ఒక ధర్మసంస్థ. అయితే ఈ ధర్మం, ఇచ్చిన వానికీ పుచ్చుకొన్నవానికీ కూడా క్షేమం చేకూరుస్తుంది. ఇది బిచ్చం పెట్టేదికాదు. పని చేయించి, పనికితగిన ప్రతిఫలాన్నిస్తుంది. శారీరక ప్రతిబంధకాల వల్ల ఇతర పనులేవీ చేయలేనివారు కూడా చేయగలిగిన పని యిది. కాబట్టి అఖిల భారత చరఖా సంఘం, సోమరితనాన్నీ స్తబ్ధత్వమునూ ప్రోత్సహించేదికాదు; పైగా మన తీరిక గంటలలో, ఉపయోగకరమూ లాభకరమూ అయిన పని చేయడానికి ప్రోత్సాహకంగా ఉంటుంది.

ఖాదీ ఉత్పత్తీ, అమ్మకం [illegible] ముఖ కార్యక్రమములే అయినప్పటికీ కేవలం అందుకొఱకే అఖిల భారత చరఖా సంఘం పనిచేయడంలేదు. మిల్లు బట్టనుగానీ, అధమం విదేశీ బట్టనుగానీ తొలగించడానికి కావలసిన యావత్తు బట్టనూ తానే ఒంటరిగా సరఫరా చేయగలనని అది ఆశించి ఉండలేదు. అమ్మకానికి అంగడిలోకి పంపబడుతూన్న ఖాదీ యొక్క విశుద్ధతను గూర్చి ధ్రువపత్రములిస్తూ, ఖాదీని ఉత్పత్తిచేసి అమ్మేటందుకు, వ్యక్తులను తదితర సంస్థలనూ కూడా అది ప్రోత్సహించింది. భారతదేశపు మిల్లులలోనూ లేక పరాయి దేశాల మిల్లులలోనూ కూడా తయారైన నూలుతో కొంతవరకుగానీ పూర్తిగాగానీ నేయబడిన బట్ట ఎక్కువగా, చేతితో వడికిన నూలుతో చేమగ్గం మీద తయారైన బట్టగా చలామణీ అవుతూవుండడంచేతను, కొన్ని మిల్లులు ఖాదీవలె కనిపించే బట్టను తయారుచేసి ఖాదీ అనే పేరుతోనే పంపుతూన్నట్లు కనిపెట్టి ఉండడంచేతను, అలా ధ్రువ పత్రము లీయడం అవసరమయింది. నిజమయినఖాదీ, ఖరీదులకు సంబంధించినంత వఱకు మిల్లులతో పోటీ చేయడానికి ఎప్పుడూ ప్రయత్నించలేదు. అందువల్ల బట్టల వర్తకులకు ఉత్పత్తిదారులకూ కూడా, మిల్లు బట్టను, కొంత వరకు మిల్లు నూలుతో తయారుచేసినబట్టను, లేక పూర్తిగా మిల్లు నూలుతో తయారుచేసిన బట్టను, ఖాదీ అనే పేరుతో అమ్మి ఎక్కువ లాభం పొందవలెననే దురాశ కలగడానికి వీలయింది. ఈ ధ్రువ పత్ర విధానం, ఎక్కువ ఖరీదు పెట్టడానికి ఇచ్ఛగించినవారికి నిజమైన ఖాదీని నిరూపించింది.

ఈ ఉద్యమ ప్రారంభ సంవత్సరాలలో ఖాదీ ఉత్పత్తి కేంద్రాలన్నీ, సాధ్యమైనంత తక్కువ ఖరీదులో ఉత్పత్తిచేయడానికే ప్రయత్నిస్తూ ఉండేవి. ఇక ఖాదీ శాఖలు సాధ్య

మైనంత కారు చౌకగా అమ్మడానికి కృషి చేసినవి. అందు మూలాన, వడికే వారికీ నేసేవారికీకూడా తక్కువ మజూరీ యిచ్చితీరవలసిన పరిస్థితి సహజంగా యేర్పడింది. అసలు చేసే పని యేమీ లేకపోవడంచేత, మజూరీ యెంత తక్కువ వయినప్పటికీ మనఃపూర్వకంగా పనివాళ్లందుకు ఒప్పు కొన్నారు. ముఖ్యంగా వడికే వారికిచ్చే మజూరీ తగి నంత తక్కువగా ఉండడంచేత కొన్ని రకాల ఖాదీ, మిల్లు మీద చేయబడిన ముతక నెంబరు నూలుతో కూడా పోటీ చేయగలిగి ఉండినది. వడికేవారి పేదరికాన్ని మన స్వార్థం కోసం వినియోగించుకొంటూండడం వలననే యిది సాధ్య మవుతూన్నదని తెలుసుకొని, ఈ పద్ధతివలన మనం తొల గించవలెనని తలపెట్టిన దారిద్ర్యమును తొలగింప జాలమని మహాత్మాగాంధీ తేల్చుకొన్నారు. కనుక ఆయన, వడికే మని షికి ఈయబడుతూన్న అత్యల్పమయిన మజూరీకి బదులుగా జీవించడానికి తగిన మజూరీ ఈయవలెనని అఖిల భారత చరఖా సంఘమునకు సూచించాడు. వడికే మనిషికిగానీ, నేసే మనిషికిగానీ, యే పని మనిషికీకూడా, రోజుకు 8 గం టలు నిజాయితీగా కౌశల్యంతో చక్కని పనిచేస్తే యెడల ఎనిమిది అణాలకు తక్కువ ఈయరాదనికూడా అఖిల భారత చరఖా సంఘమున కాయన ఒక లక్ష్యము నేర్పాటుచేశారు. అప్పటికి వడికే మనిషి సగటున రోజుకు ఒక అణా కూడా సరిగా సంపాదించుకోవడంలేదు. నూలుకు ఒక అణాకు బదులుగా ఎనిమిది అణాలు మజూరీ యిచ్చినందున ఖాదీ ధర అమ్మకం కానంత ఎక్కువగా పెరిగి ఉండేది. కనుక ఒక్కసారిగా ఎనిమిదణాలకు పెంచడం అసంభవమనితోచింది. కాని రెండున్నర అణాలు మొదలు మూడణాల వరకూ పెంచి

ఆ పెంపుదల ఖాదీ ఉత్పత్తి కార్యక్రమం పైన ఎట్టి ఫలితం కలిగించిందో పరిశీలించుటకు ప్రయత్నించబడింది.

ఆ మజూరీని నిర్ణయించేందుకు ఎక్కువ విశదంగా చాలా దూరం లెక్కకట్టి పరిశీలించవలసి వచ్చింది. వడికేవారు తమ యిళ్లలో పనిచేస్తూ ఉంటారు. వడకడంలో అందరికీ సమానమైన నైపుణ్యం ఉండదు. అందరూ సమాన వేగంతో వడకనూ లేరు. అందరికీ సమానమైన మంచి పరికరములు కూడా ఉండవు. యంత్రాలయంలో వలె అందరూ సమానంగా ఏవో కొన్ని గంటలు వడకరు. 8 గంటలు నైపుణ్యంతో పని చేసినందుకు 2½ లేక మూడణాలు మజూరీని నిర్ణయిస్తూ ఒక సూత్రము ప్రతిపాదింపబడే ముందు, వికేంద్రీకరణం వలన ఆచరణలో పొడచూపుతూ వచ్చిన కొన్ని సమస్యలను పరిష్కరించవలసి వచ్చినది. నూలు సాధారణంగా తూకము వేసుకొంటూ ఉంటారు. పత్తి ధర ఆయా ప్రదేశాలలో మారుతూ ఉండడంచేత, వడికినందుకు జీవనభృతికి సరిపోయే మజూరీని నిర్ణయించడంలో ఆ ధరను ప్రత్యేకించవలసి ఉంటుంది. అనేకమంది నిపుణులు, వారిలో ముఖ్యంగా పేర్కొనబడతగిన వినోబాభావే కూడా, తాము రోజుకు యెనిమిది గంటలూ వడికి చూచారు. సగటున లెక్కకట్టి, వడికే మనిషి జీవన భృతిని సంపాదించుకొనేటందుకు వీలుగా వివిధ రకాల నూలుకు మజూరీ నిర్ణయించబడింది. అయితే పైన నిర్ణయింపబడిన కాలము సరిగా వినియోగింపబడక పోయినా, వడికే మనిషికి వడకడంలో మామూలు నైపుణ్యంగానీ లేక వేగంగానీ లేకపోయినా లేక ఆయన పరికరములు ఉండవలసినంత బాగా ఉండకపోయినా సహజంగా, తక్కువ మజూరీ వస్తుంది. చాలా మంది కార్యకర్తలకు ఈ ప్రయోగ ఫలితములను గూర్చి చాలా అపోహ

లుండినవి. ఖాదీ అమ్మకం అత్యంతం తగ్గిపోతుందని వారి భయం. వడికే వారికి తక్కువ మజూరీ ఇస్తూంటేనే మిల్లు బట్టతో పోటీ చేయజాలకుండా ఉన్న ఖాదీ, వడుకు కూలి రెండింతలుగానీ మూడింతలుగానీ హెచ్చించినప్పుడు తప్పని సరిగా ధర ఉంచాలి పెరిగి అమ్మకం తగ్గిపోతుందని వారు భయపడ్డారు. కాని గాంధీజీ చాలా పట్టుదలగా ఉన్నందున అఖిల భారత చరఖా సంఘంవారు మజూరీ హెచ్చించడానికే నిర్ణయించారు. ఇది 1935 లో జరిగింది. అమ్మకం తగ్గిపోతుందని సహజంగా అనుకొన్నప్ప టికీ, ఎక్కువ మజూరీని నిర్ణయించినందువలన నూలు ఎక్కువ నాణ్యముగా ఉండేటట్లు నికరుచ్చి చేయవచ్చుననీ, పనివాని పరికరములు నైపుణ్యము వేగమూ కూడా అభివృద్ధి అయ్యేటందుకు ప్రయత్నములు జరుగవచ్చుననీ వారాశిం చారు. ఈ పని అంతకూ అనగా నూలు వడకడంలోనూ నిర్మాణంలోనూ కూడా ఎక్కువ సమర్థులైన కార్యకర్తలు కావలసి వస్తారు.

ఉత్పత్తి కేంద్రమును దర్శించిన ప్రతి మనిషికీ ఒక పెద్ద లోపం కనిపించింది. అమ్మకం కోసం ఖాదీ ఉత్పత్తిచేసే వారిలో వడికేవారుగానీ నేసేవారుగానీ ఖాదీ ధరించడం లేదు. ఇందుకు కారణం వారు సంపాదించిన కొద్ది మజూ రీతో, మిల్లు బట్ట కంటె ఎక్కువ ప్రియమైన ఖాదీ కొనేటం దుకు వారికి సావకాశం లేకపోవడమే. అంతేకాదు ; వారి కింకా ఎక్కువ యితర అవసరాలుండడంవలన తమకు కావల సిన వరకైనా తాము వడుకుకొనేటందుకు నేసు కొనేటందుకు వారికి వీలు లేకుండా పోయింది. మజూరీ హెచ్చించబడి నప్పుడు, ఖాదీధారులుగానున్నవారు మాత్రమే వడికేటం దుకుగానీ నేసేటందుకుగానీ నియోగింపబడవలెనని కూడా

అప్పటి పరతులలో ఒక పరతు యేర్పాటు చేయబడింది. మజూరీ హెచ్చించబడినందున వడికే వారిలో చాలామంది వెంటనే అందు కంగీకరించారు. మజూరీలో స్వల్ప భాగం మినహాయించి, వడికే మనిషికి కావలసిన బట్టకు తగినంత పైకం సమకూడేటంతవరకూ దాని నొక చోట నిల్వచేసే పద్ధతి ఒకటి ప్రవేశపెట్టబడింది. ఈ విధంగా వడికే వారి కెక్కువ మజూరీ లభింపగానే, వారుత్పత్తిచేస్తూన్న బట్టకు వారు వతను దారులుగాగానీ వినియోజకులుగాగానీ కూడా అయినారు. చివరి రెండు పంచాబ్దములకు సంబంధించి పైన ఉదాహరింపబడిన అంకెలలో ఎక్కువ భేదం కనిపించడం లేదు. ఇందుకు కారణం మజూరీ హెచ్చింపబడినందున ఖాదీ ధర ఎక్కువ కావడమే. ఈ ప్రయోగం చాలాదూర వ్యాప్తమైన సిద్ధాంతంమీద ఆధారపడి ఉన్నది. అనగా పని వాళ్లందటికీ జీవనానికి కావలసిన భృతి యేర్పాటుచేయబడవలె ననే సిద్ధాంతంపైన ఆధారపడిఉంది. ఈ సిద్ధాంతానికి యితర పరిశ్రమలతోనూ ఇతర వ్యవస్థలలో ఈయబడు తూన్న భృతులతోనూ కూడా సంబంధం ఉంది.

అనుకొన్నట్లుగానే తరువాతి సంవత్సరాలలో, ఖాదీ ధరలు పెరిగిపోవడంవలన అమ్మకం పడిపోవడమున్నూ, ఖాదీ నాణ్యం ఎక్కువకావడమున్నూ ఖాదీ ఉత్పత్తిదారులు ఖాదీ ఎక్కువగా వాడడమున్నూ జరిగింది. ఈ విధంగా కనీస వేతనములు నిర్ణయింపబడని 1934 నాటినుండి, కనీస వేతన ములు పూర్తిగా యేడాది అంతా ఆచరణలోకి వచ్చిన 1936 లో అఖిల భారత చరఖా సంఘంవారి శాఖల వల్లనూ ధ్రువపత్రములుపొందిన వ్యక్తులద్వారానూ సంస్థల ద్వారానూ జరిగే ఖాదీ ఉత్పత్తి అమ్మకములు పడిపోయిన

సంగతి గమనింపబడింది ; ఈ క్రింది అంకెలను బట్టి ఆ స్థితి తెలియగలదు :

| సంవత్సరం. | మొత్తం ఉత్పత్తి రూపాయలలో | చదరపు గజాలలో | మొత్తం అమ్మకం రూపాయలలో |
|---|---|---|---|
| 1934 | 33,98,370 | 95,56,788 | 46,59,125 |
| 1936 | 27,74,029 | 64,88,926 | 36,73,690 |
| 1940 | 51,36,983 | 95,51,438 | 77,62,750 |

1934 మొదలు 1936 వరకూ పడిపోయిన ఖాదీ ఉత్పత్తి అమ్మకములు రూపాయిలలో ఆలోచించేయెడల దాదాపు సమమైన దామాషాలోనే ఉన్నవి. అనగా క్రమంగా నూటికి 79, 78గా ఉంది. కాని గజాలలో ఆలోచించే యెడల ఇంకా ఎక్కువ పడిపోయింది. అనగా నూటికి 67 ఉంది. ఇందుకు కారణం, 1934 తో పోల్చుకొన్నప్పుడు కూలి ఎక్కువై, 1936 లో ఖాదీ ఉత్పత్తి ఎక్కువ ప్రియం కావడంచేత వెనుకటి పెట్టుబడితోనే తక్కువ పరిమాణం ఉత్పత్తిచేయబడడం కానీ అమ్ముబడడం కానీ జరిగింది. కాని 1940 లోని అంకెలను తీసుకొన్నప్పుడు, ఉత్పత్తి అమ్మకముల విషయంలో తిరిగీ 1934 లోని గజములను. అందుకొన్నట్లున్నూ, రూపాయిలకు సంబంధించినంతవరకు 1934 అంకెలకు చాలా మించిపోయినట్లున్నూ కనపడుతుంది. కూలి హెచ్చించినందువలన తాత్కాలికంగా పడిపోయిన ఉత్పత్తి అమ్మకములు రెండూ ఈవిధంగా భర్తీకావడమేకాక ఇంకా పెంపొందినవి. అయితే ఇంక యితరవిధంగా పొందిన అభివృద్ధి అద్భుతంగా ఉంది. వడికేవారికి చెల్లింపబడిన మజూరీ 1934 లో, రూ 6,80,011 అయితే 1940 లో 20,90,378 వరకూ పెరిగింది. వడికేవారూ నేసేవారూ కూడా చాలా వరకు ఖద్దరుధారులైనారు. కాబట్టి పూర్వం కనిపిస్తూవచ్చిన అసందర్భం లేకుండా పోయింది. ఉత్పత్తిదారులకు చేయ

బడిన అమ్మకముల అభివృద్ధి ప్రశంసనీయంగా ఉందని ఈ దిగువ అంకెలనుబట్టి తెలియగలదు. అయితే ఈ అంకెలు యెప్పుడూ పూర్తియైన అంకెలు కావు.

వడికేవారు—

| సంవత్సరం. | మొత్తం సంఖ్య. | ఖాదీ ధారులు. | మొత్తంలో ఖాదీధారుల శాతం. | రూపాయలలో ఇవ్వబడిన మజూరీ. | రూపాయలలో కొనబడిన ఖాదీ. |
|---|---|---|---|---|---|
| 1936 | 1,03,383 | 9,781 | 9·3 | 7,23,461 | 1,37,631 |
| 1940 | 2,54,968 | 60,553 | 23·7 | 14,40,583 | 3,47,436 |

నేతవారు—

| సంవత్సరం. | నియోగింపబడిన నేతవారి మొత్తం సంఖ్య. | ఖాదీధారులు. | మొత్తంలో ఖాదీధారుల శాతం. |
|---|---|---|---|
| 1936 | 10,106 | 3,400 | 33·6 |
| 1940 | 14,447 | 9,448 | 65·2 |

ఇక్కడ మనం గమనించవలసిన పరిణామం ఒకటిఉన్నది. వడుకు మజూరీ హెచ్చినందున ధ్రువపత్రములు పొందిన ఉత్పత్తిదారులపైన తనిఖీ చాలా కష్టమైంది. అఖిలభారత చర్ఖాసంఘమువారు నిర్ణయించిన మజూరీలకంటె తక్కువ మజూరీ ఈయవలెననే దురాశ వారిలో చాలామందికి యెక్కువగా పెరిగింది. ఆ కారణంగా అనేకమందియొక్క ధ్రువపత్రములను అఖిల భారత చర్ఖా సంఘము రద్దుచేయవలసి వచ్చింది. అందువలన ధ్రువపత్రములు పొందిన సంస్థలద్వారా జరిగే ఉత్పత్తి నిర్బంధంగా తగ్గిపోయింది. ఇంతవరకూ పరిష్కారంకాకుండా ఉన్న సమస్య మరొకటున్నది. అది ధ్రువ పత్రములు పొందని ఖాదీ అమ్మకమునకు సంబంధించిన సమస్య - అనగా అఖిలభారత చర్ఖాసంఘమువారు నిర్ణయించిన మజూరీలకంటె తక్కువ మజూరీలతో ఉత్పత్తి చేయబడిన ఖాదీ అమ్మకమునకు సంబంధించిన సమస్య. ఈ రకపు

ఖాదీకూడా చాలా అమ్ముడు పోతూనే ఉంది. అది యెక్కువ చౌక కావడంచేత తొందరగా అమ్ముడు పోతూంది. అంతేకాక, చాలామంది కాంగ్రెసువాదులు సైతం జీవనభృతి సిద్ధాంతాన్ని సరిగా అవగాహన చేసుకోలేదు. వడికేమనిషి చెమటవోడ్చి పనిచేసినప్పటికీ అతని కీయబడు మజూరీ స్వార్థపరుల లాభంకోసం ఈయబడుతూన్నట్లు న్యాయంగా చెప్పతగి ఉన్నప్పటికీ లెక్కచేయక కాంగ్రెసువాదులు చేతితో వడికిన ఖద్దరు దొరికితే చాలు సంతృప్తి పడుతున్నారు. ఖాదీ బాగా అభివృద్ధియై వ్యాపించవలెనంటేనూ, ఖాదీలోని అంతరంగిక సిద్ధాంతం నిలపెట్టబడవలెనంటేనూ, ఖాదీ సందేశాన్ని యితరులకు అందించే కాంగ్రెసు వాదులైన స్త్రీపురుషులు ఎక్కువ చౌకయై ధ్రువపత్రములు పొందని ఖాదీని కొనే ఆకర్షణకు లోనుగాకుండా ఉండాలి. నిజమైన ఖాదీని కొనేటందుకు వారికి శక్తి లేనట్లయితే, వారి ఉపయోగమునకు కావలసిన నూలు వడుకుకొని వారి అవసరములను తీర్చుకోవడం కంటె ఎక్కువ హీలైన పని లేదు. అందువలన వారి కసలు ఖాదీకొనే అవసరమే పూర్తిగా తొలగిపోగలదు.

ఈ విషయం ఖాదీ ఉద్యమంలోని మరొక మిక్కిలి ప్రాముఖ్యమైన దృక్పథాన్ని జ్ఞప్తికి తెస్తూన్నది. అది స్వయం సంపూర్ణ కార్యక్రమం. గాంధీజీ వ్రాసినట్లుగా "మిల్లు బట్టలతో పోటీపడే అందచందాలు గల ఖాదీని పట్టణస్థులకు సరఫరా చేస్తూ, తదితర పరిశ్రమలవలెనే ఏ కొద్దిమంది శిల్పకారులకో కేవలం పని కల్పించడం కాక వ్యవసాయమునకది ఒక అనుబంధవృత్తిగా ఉండవలెననియే ఖాదీ ఉద్యమము యొక్క సందేశం. ఈ సందేశనిర్వహణమునకది స్వయం పోషకముగా నుండి, గ్రామాలలో దాని ఉపయోగం వ్యాప్తి

చెందవలసి ఉంది. గ్రామస్థులు తమకు కావలసిన అన్నమును తాము వండుకొంటూన్నట్లు, తమ రొట్టైను తాము చేసుకొంటూన్నట్లు తమ ఉపయోగమునకు కావలసిన ఖాదీని తామే ఉత్పత్తి చేసుకోవలెను. తమకు కాగా ఏమైనా మిగిలితే వా రమ్ముకోవచ్చును." ఒక నిర్ణీత ప్రదేశమును కానీ, ఒక వర్గంవారినిగానీ వారికి కావలసిన బట్టల విషయములో స్వయం సంపూర్ణంగా చేసేటందు కప్పు డప్పుడూ ప్రయత్నాలు చేయబడుతూనే ఉన్నవి. ఈ పని కష్టమైనదే కాని మనకు తరతరాల నుండీ అలవాటుగా వస్తూన్న అల సత్వమును విడిచిపెట్టినయెడల అది నమ్మడానికి వీలులేనంత తేలిక కాగలదు. "కొంతకాలంవరకూ అయినా తనదీ అని చెప్పుకోడానికి వీలుగల కొంచెం పొలం ఉండి, దానిలో నిత్యమూ పనిచేస్తూఉండే మనిషి, తానూ తన కుటుంబం లోని వారూ కేవలం తీరికసమయాలలో చేసిన కృషి ఫలితంగా తనకు కావలసిన ఖాదీని తయారు చేసుకోగలడు. అయితే దాదాపు ఏమీ ఖర్చులేకుండా ప్రతిమనిషీ ఎలా తనకు కావలసిన ఖాదీని తాను తయారుచేసుకోగలడో తెలిపేటందుకు తగిన శిక్షణ లేక విద్యమాత్రమే అతనికి కావలసి ఉంది." ఈ విధంగా స్వయం సంపూర్ణతను పొందుతూన్న స్త్రీపురుషుల సమూహం అంతకంతకు పెరిగి పోతూన్నది. వడుకు మజూరీని హెచ్చించినందున పెరిగిన ఖాదీ ధరవలన వారిస్థితి మారదు. చరఖాసంఘం యొక్క వివిధశాఖలు, అవసరమైనచోట్లకు ఉపాధ్యాయులను పంపడం వల్లనూ స్వోపయోగం నిమిత్తం వడుకు కొన్న నూలు నేసేటందుకూ నూలుకు మారుగా బట్ట లిచ్చేటందుకూ సౌకర్యములను కల్పించడం మూలముననూ, ఈ ఆదర్శాన్ని ప్రోత్సహిస్తూన్నవి. మంచి దృఢనిశ్చయంతోనూ

శక్తిసామర్థ్యములతోనూ నిర్వహించవలసిన స్వయంసంపూర్ణ ప్రణాళికలోనే ఖాదీయొక్క అంతిమవిజయము ఉన్నదనే మాట సత్యం.

అయితే ఖాదీ, మిల్లుబట్టనూ విదేశీబట్టనూ తొలగించే టందుకు మాత్రమే ఉద్దేశింపబడలేదు. ఇతర విషయాలలో కూడా గ్రామాల స్వయంసంపూర్ణత కది చిహ్నంగా ఉంటూన్నది. ఇతర గ్రామపరిశ్రమలన్నీ చుట్టూతిరుగుతూ ఉండే సూర్యుడది. మనం చరఖాద్వారా స్వరాజ్యాన్ని సంపాదించగలం. "ఖాదీ అనగా అత్యంతసత్యమైన స్వదేశీ తత్వం; ఆకలితో అలమటించే లక్షలాది ప్రజలతో ఐక్యం కావడం." "కాంతివిహీనములైన గ్రామస్థుల కళ్లలో తేజస్సునూ ఆశాకిరణమునూ ప్రసరింపచేసేటందుకూ, చరఖాసందేశమును గ్రామాలలో వ్యాపింపచేసేటందుకూ, ఏకాగ్రచిత్తంతో పనిచేసే దేశాభిమానమూ వివేకమూ కల నిస్స్వార్థపరులైన భారతీయులు తండోపతండములుగా ఉంటేనే గాని చరఖాపునరుద్ధరణం సాధ్యంకాదు. ఇదే సరియైన వయోజనవిద్యకు సహకారోద్యమమునకూ దారితీసే బ్రహ్మాండమైన ప్రయత్నం. నిశ్శబ్దమూ నిశ్చయమూ ప్రాణ ప్రదమూ అయిన చరఖా పరివర్తనమువలెనే, అదికూడా నిశ్శబ్దంగా నిశ్చయమైన మార్పును దీసికొని వస్తుంది. అన్ని మతాల సామాన్యప్రజకూ సంబంధించిన స్వరాజ్యానికి చరఖా దారితీసి తీరుతుంది. గ్రామాలను తమ అర్హస్థానాలలో చరఖా పునఃప్రతిష్ఠచేసి యెక్కువ తక్కువలనే వ్యత్యాసాన్ని నిర్మూలిస్తుంది. జాతికి అహింసలో నమ్మకం ఉంటేనే తప్ప చరఖా స్వరాజ్యం తీసుకొనిరాలేదు సరికదా అది కదలను కూడా కదలదు," చరఖా అహింసల మధ్యనూ గాంధీజీ భావించిన స్వరాజ్య అహింసలమధ్యనూ గల ఈ

సహజసంబంధమునే అర్థంచేసుకోవలసి ఉంది. ఈ భావాన్ని ఊహించి, దీని చుట్టూ ఒక సిద్ధాంతాన్ని నిర్మించి, అన్నిటి కంటెనూ ఎక్కువగా, దీనిని ప్రతికించేటందుకు ప్రయత్నించిన గాంధీజీ మాటలకంటె భిన్నంగా మరొకటేదీ ఈ సత్యాన్ని నిరూపించలేదు.

ఈ తరువాతి పుటలలో, ఖాదీ అర్థశాస్త్రమే కాకుండా గాంధీజీ మనస్సులో ఖాదీఉద్యమభావం రూపొందిన మొదటి రోజులనుండీ అది అభివృద్ధి అవుతూవచ్చిన చరిత్రకూడా వివరంగా చర్చింపబడినట్లు పాఠకునకు తెలియగలదు. ఈ సందర్భంలో గాంధీజీ కావించిన యావద్భారత పర్యటనముల క్రమము, నిర్వర్తించిన ప్రయోగములు, ఎదురొన్న చిక్కులు, సాధించిన విజయము, యివన్నీ పాఠకున కుత్సాహ జనకములుగా నుండగలవు.

22 డిశంబరు, 1941 రాజేంద్రప్రసాద్

# విషయసూచిక

# స్వదేశీ

[1916 ఫిబ్రవరి 14 వ తేదీని మద్రాసులో మిషనరీ మహా సభలో ఈయబడిన ఉపన్యాసం.]

అసలు నేను మీతో ప్రసంగించడానికి విశేష సంశయం లేకుండా అంగీకరించలేదు. నేను మాట్లాడవలసిన విషయాన్ని నిర్ణయించుకోవడంలోకూడా చాలా శ్రమపడ్డాను. నేను చాలా సున్నితమైనట్టిన్నీ కష్టమైనట్టిన్నీ విషయాన్ని ఎన్నుకొన్నాను. స్వదేశీనిగూర్చి నాకుగల వింత అభిప్రాయాలవలన అది చాలా సున్నితం. నా అభిప్రాయాలకు తగినట్లు వెల్లడించేటందు కవసరమైన భాషా ప్రభుత్వం నాకు లేకపోవడంవలన అది కష్టం. నా ఉపన్యాసంలో మీకు తప్పకుండా చాలా లోపాలు కనిపిస్తవి. ముఖ్యంగా, నేను చెప్పబోయే విషయాలలో నే నిదివరకే ఆచరిస్తూ ఉండనిది కానీ, నా శక్తి వంచన లేకుండా ఆచరించేటందుకు నేను సంసిద్ధంగా లేనిది కానీ లేదని చెప్పినప్పుడు, ఆ లోపాలను గూర్చి మరింత ఎక్కువగా నేను మీ సౌమ్యభావంపైన ఆధారపడి ఉండవచ్చునని నే నెఱుగుదును. కిందటి నెల మీ రుపన్యాసానికి బదులుగా ప్రార్థన కొక వారం వినియోగించడం నాకు ప్రోత్సాహకరంగా ఉంది. నేను చెప్పబోయే విషయం ఫలప్రదం కావలయునని నేను హృదయపూర్వకంగా ప్రార్థించాను. ఆ విధమైన ప్రార్థనతోనే మీరు నా మాటను ఆశీర్వదిస్తారని నాకు తెలుసును.

చాలా ఆలోచించిన పిమ్మట నా అర్థాన్ని బహుశా అత్యుత్తమంగా విశదీకరించగల స్వదేశీ నిర్వచనమునకు నేను వచ్చాను. ఎక్కువ దూరదేశాలు కాక మన అత్యంత

సన్నిహిత పరిసరాల ఉపయోగం కోసం సేవకోసమూ మాత్రమే మనకు పరిమితిని కల్పిస్తూన్న మనలోని భావమే స్వదేశీ. ఇదేవిధంగా మతం విషయంలో ఈ నిర్వచనమునకు కావలసిన గుణములను పరిపూర్తి చేసేటందుకు నేను నా పూర్వుల మతమునకే కట్టుబడి ఉంటాను. నా కత్యంత సన్నిహితంగానున్న మత పరిసరముల ఉపయోగమదే. అందులో లోపమున్నట్లు నేను తలంచేయెడల దానినుండి ఆ లోపమును తొలగించడంమూలకంగా దానిని సేవిస్తాను. ఇక రాజకీయరంగంలో దేశీయ సంస్థలనే ఉపయోగించుకొంటూ వాటిలో ధ్రువంగా కనిపించే లోపాలనుండి వాటిని బాగుచేస్తాను. ఆర్థిక వ్యవహారాలలో నాకు సన్నిహితులైన ఇరుగు పొరుగువారుత్పత్తిచేసిన వస్తువులనే నేనుపయోగిస్తూ వాటిలో కనిపించే లోపాలను తొలగించడం మూలకంగా వాటిని సమగ్రంగానూ కార్యసాధకములుగానూ చేస్తాను. అటువంటి స్వదేశీని ఆచరణలోకి తీసుకొని వచ్చేటందుకు మన తరంలో సాధ్యం కాదని తోస్తూన్నది. కనుక, వేలకొలది సంవత్సరాలు పడుతుందని సూచింపబడుతూన్నది. కొన్ని తరాలవరకూ పూర్తిగా సాధించడానికి వీలులేకపోయినప్పటికీ మనము స్వదేశీని వీడకుందుము గాక.

పైన సూచించబడిన మూడు స్వదేశీ శాఖలనూ యికకూడ సంగ్రహంగా పరీక్షింతుము గాక. హిందూ మతం మార్పు సహించని మతం అయింది. కనుక అందులోని స్వదేశీ తత్వంవలన అది ఒక బలవత్తరమైన శక్తిగా పరిణమించింది. ఆ మతంలో యితర మతస్థులను చేర్చుకొనే పద్ధతి లేదు. కనుక దానికి అత్యంతమయిన సమానభావం ఉంది. పూర్వమది విస్తరించేటందుకెంత అవకాశముండీ ఉన్నదో

ఇప్పుడుకూడా అంత అవకాశమూ ఉన్నది. అది బౌద్ధ మతమును లీనం చేసుకొన్నది. అంతేకాని, దానిని జయ ప్రదంగా తరిమివేసిందని తలంచడం తప్పనుకొంటాను. స్వదేశీ తత్వం కారణంగా, హిందువుడు మతాం తరుడు కావడానికి ఒప్పుకోడు. అంతమాత్రంలో ఆయన తన మతమే పరమోత్తమమైనదిగా భావిస్తున్నాడనడానికి వీలు లేదు. అందులో కొన్ని సంస్కరణలను ప్రవేశ పెట్టి దానికి పూర్ణత్వమును తేవచ్చునని ఆయనకు తెలుసును. నేను హిందూమతాన్ని గుఱించి చెప్పిన విషయమే ప్రపంచంలో తదితర గొప్ప మతాలకుకూడా వర్తిస్తుందని నా అభిప్రాయం. అయితే హిందూమతానికి సంబంధించినంతవఱకు అది ముఖ్యంగా వర్తిస్తుంది. ఇక్కడే నేను చెప్పేటందుకు ప్రయత్నిస్తూన్న విషయం చెప్పవలసి ఉంది. నేను చెప్పినదానిలో యేమైనా సారం ఉంటే, ఇదివరకు చేసినదానికీ ఇప్పుడు చేస్తూన్న దానికీ ఇండియా కృతజ్ఞతకు మిక్కిలి పాత్రములైన భారతదేశపు మిషనరీ సంస్థలు, యితరులను తమ మతంలో కలుపుకొనే ఆశ యాన్ని విడిచిపెట్టి, పరోపకార కార్యక్రమమును కొన సాగిస్తూన్నందువలన మఱింత బాగా పనిచేసి క్రైస్తవమత మునకు సేవచేయగలవు కాదా ? దీనిని మీరు నా అవినయంగా భావించరని ఆశిస్తున్నాను. నేను హృదయపూర్వకంగా తగు అడకువతో ఈ సూచన చేస్తున్నాను. అదీకాక నేను చెప్పేమాటలను శ్రద్ధగా వినవలసిందని మిమ్ములను కోరే టందుకు నాకు కొంత హక్కున్నది. నేను బైబిలును అర్థం చేసుకొనేటందుకు చాలా కృషి చేశాను. అది నా మత గ్రంథాలలో ఒక భాగమని నా అభిప్రాయం. దాదాపు భగవద్గీతతో సమానంగా క్రీస్తు ప్రవచనంలోని

భావంకూడా (Sermon on the Mount) నా హృదయంలో అధిష్ఠిస్తూన్నది. 'జ్యోతిర్గమయ' అనే గీతాన్ని, అటువంటి ఉత్తేజకరములైన అనేక తదితర గీతాలను చదివేటప్పుడు భక్తిలో నేనే క్రైస్తవునకూ తీసిపోను. వివిధ శాఖలకు చెందిన సుప్రసిద్ధ క్రైస్తవ మత ప్రబోధకుల ప్రభావం చాలా నామీదఉంది. వారిలో కొందఱు నాకిప్పటికీ స్నేహితులుగా ఉన్న ప్రత్యేక గౌరవంకూడా నేను పొందుతున్నాను. కాబట్టి నేను చేసిన పై సూచనను, పక్షపాత బుద్ధిగల హిందువు చేసినదిగాగాక, క్రైస్తవ మతమునం దెక్కువ అభిమానముకలిగి, అడకువతో నిష్పాక్షిక ధర్మచింత చేయగల మనిషి చేసినదిగా భావించ కోరుతున్నాను. "విశ్వసంచారం చేయుము" అనే దివ్య సందేశం కొంత సంకుచితంగా వ్యాఖ్యానించబడి అసలు భావం మఱుగుపడేటట్లు చేయబడకుండుగాక! చాలా సందర్భాలలో మతం మార్పు నామమాత్రమని నా అనుభవం. అది ఎవరూ కాదనజాలరు. కొన్ని సందర్భాలలో ఆ బోధ హృదయానికి కాక పొట్టకు నచ్చుతూన్నది. మతం మార్పుజరిగిన ప్రతి సందర్భంలోనూ, దానికి వెనుక ఒక సంక్షోభం ఉంటూన్నది. అది లేకుండా చేయవచ్చునని నాధైర్యం. ప్రతి గొప్ప మతంలోనూ కూడా నూతన జన్మము, హృదయపరివర్తనము, పూర్తిగా సాధ్యంకాగలవని నా అనుభవంవలన చెపుతున్నాను. నేనిప్పుడు చాలా క్లిష్టమార్గాన నడుస్తున్నానని నాకు తెలుసు. కాని ఈనాడు విరోపాఖండములో జరుగుతూన్న భీభత్సంవలన శాంతిదూతయైన జీసస్ సందేశాన్ని యూరపు సరిగా అర్థం చేసుకోలేదనీ, ప్రాచ్యదేశాలనుండి దానికి జ్యోతిని ప్రసరింప

చేయవలసి ఉందనీ చెప్పి, ఈ విషయాన్ని ముగించేటందుకు నేనేమీ క్షమాపణ కోరనక్కరలేదు.

ధార్మిక విషయాలలో ఒకవిధంగా మీకుగల విశిష్టస్థానమునుబట్టి మీ సహాయమును నేనర్థించాను. రాజకీయ విషయాలలోకూడా మీ సహాయాన్ని అభిలషించేటందుకు నేను సాహసిస్తున్నాను. మతానికి రాజకీయాలతో యేమీ సంబంధం లేదనే సంగతి నేను విశ్వసించను. మతంతో సంబంధంలేని రాజకీయాలు కేవలం భూస్థాపితం చేయతగిన శవం వంటివి. నిజానికి మీరు సందడిలేకుండా మీ విధానాన్ని మీరనుసరిస్తూ రాజకీయాలపైన మీ పలుకుబడిని ప్రయోగించగలరు. మతాన్ని రాజకీయాలనుండి విడదీయవలెనని యిప్పటికీకూడా జరుగుతూన్న ప్రయత్నంలాటి ప్రయత్నం జరిగి ఉండనియెడల, రాజకీయాలు తఱచుగా కనిపించేటంత అథోగతి పాలయియుండేవి కావు. ఈ దేశపు రాజకీయ జీవితం ఆనందదాయకంగా ఉందని ఎవ్వరూ అనుకోరు. స్వదేశీభావాన్ని అనుసరిస్తూన్న నన్ను, దేశీయసంస్థలు గ్రామ పంచాయతీలు ఆకర్షిస్తూన్నవి. భారతదేశం నిజమైన ప్రజాస్వామ్యదేశం. కాబట్టే అది ఇంతవరకూ ఎన్నో దెబ్బలను తట్టుకోగలిగింది. రాజులూ చక్రవర్తులుకూడా భారతదేశంలో పుట్టినా, పరదేశీయులైనా పన్నులు వసూలుచేసేటందుకు తప్ప ప్రజానీకంతో సంబంధం కలిగిఉండలేదు. ప్రజలు ప్రభుత్వానికిచ్చేది యిచ్చివేసి, ఇక తమకు తోచిన పని చాలావరకు తాము చేసుకొంటూ ఉండేవాళ్లు. విశాలమైన కులనిర్మాణం సమాజముయొక్క ధార్మికవాంఛలనే కాక రాజకీయావసరములనుకూడా తీర్చేది. గ్రామస్థులు తమ కులనిర్మాణంద్వారానే తమ అంతరంగిక వ్యవహారాలను పరిష్కరించుకొంటూ

పాలకవర్గంవారి ఎట్టి వత్తిడినైనా తట్టుకోకలిగిఉండేవారు. తన కులపద్ధతినుండి, అద్భుత నిర్మాణ శక్తిని కల్పించుకోగలిగిన జాతిని కాదనడం సాధ్యంకాని పని. పది లక్షలమందికి పైగా ఉన్న యాత్రికులకు కావలసిన సదుపాయాలను, ఏమీ కష్ట పడుతూన్నట్లు కనుపించకుండా చేయకలిగిన నిర్మాణ కౌశల్య మెట్టిదో నిరుడు హారిద్వారం కుంభమేళాకు వెళ్లి వచ్చిన వారికి తెలిసిఉంటుంది. అయినప్పటికీ మనలో నిర్మాణశక్తి లేదని చెప్పుకోవడం ఒక పరిపాటి అయిపోయింది. నూతన సంప్రదాయాలలో పెరిగిన వారి విషయంలో యిది కొంతవరకు నిజమేనేమో నని నాభయం. స్వదేశీ తత్వమునుండి దాదాపు అనర్థ దాయకంగా పరిణమించేటంత దూరస్థులం కావడంచేత మనం భయంకర క్లిష్టపరిస్థితిలో పడ్డాము. విద్యావంతులమైన మనము పరాయి భాషలో విద్యాభ్యాసంచేశాము. కాబట్టి మనం ప్రజాసామాన్యంలో పరివర్తనం కలిగించలేకపోయి నాము. మనము ప్రజల ప్రతినిధులం కావలెనని కోరుతూం టూము. కాని కాలేము. వారాంగ్లేయోద్యోగస్థులను ఎలా చూస్తారో మననుకూడా అలాగే చూస్తారు. వారి హృదయాలు మనకెవరికీ విప్పిచెప్పరు. వారి కోరికలు మన కోరికలు కావు. కాబట్టి మనకూ వారికీ దూరం. ప్రతి నిధులకూ ప్రాతినిధ్యం వహింపబడుతూన్న ప్రజకూ మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు లేకపోవడం తప్ప నిజంగా నిర్మాణ శక్తి లేకపోవడంకాదని మనం గమనిస్తూన్నాము. కడచిన యాభై సంవత్సరాలలో మన దేశ భాషలలో మనము విద్యా భ్యాసంచేసి ఉండినయెడల, మన పెద్దవాళ్లూ మన నౌకర్లూ మన యిరుగుపొరుగువారూకూడా మన జ్ఞానంలో భాగస్థులయి ఉండేవారు. రామాయణ మహాభారతములవలెనే మన

బోసు మనవారే కనిపెట్టిన విజ్ఞానవిషయాలు ప్రతియింటా నిక్షేపాలవలె ప్రకాశించి వుండేవి. మామూలు ప్రజకు సంబంధించినంతవరకు, ఆ కనిపెట్టబడిన విషయాలు విదేశీయులచే కనిపెట్టబడినట్లే. అన్ని శాఖలలోనూ విద్యాబోధనము దేశభాషలలో ఉన్నట్లయితే ఆశ్చర్యకరమైన అభివృద్ధి కలిగి ఉండేదని నేను ధైర్యంగా చెప్పగలను. గ్రామాల ఆరోగ్యరక్షణ మొదలైన సమస్యలు చిరకాలం కిందనే పరిష్కరింపబడి ఉండేవి. ఒక ప్రత్యేక విధానం ప్రకారం గ్రామ పంచాయతీలు సజీవంగా శక్తివంతములై ఉండేవి. తన అవసరాల కనుగుణంగా భారతదేశం దాదాపు స్వయంపరిపాలన అనుభవిస్తూ ఉండేది. భారత పవిత్ర భూమిలో సంఘటిత హత్యాకాండను గూర్చిన అవమానకర దృశ్యమునకు ఆస్పదం కలిగేదికాదు. ఇప్పటికికూడా సంసరించేటందుకు తగిన సమయం తప్పిపోలేదు. ఇంకే ఇతరులుకానీ సంస్థలుకానీ చేయలేని సహాయాన్ని మీరు తలచుకొంటే చేయగలరు.

ఇక స్వదేశీయొక్క అంతిమ భాగమునుగూర్చి ఆలోచిద్దాం. ఆర్థిక పారిశ్రామిక జీవితంలో స్వదేశీకి వినాశనకరంగా దూరస్థులు కావడమే ప్రజాసామాన్యముయొక్క నిరుపేదతనమునకు చాలావరకు కారణం. వాణిజ్య వస్తువులను పరదేశాలనుండి దిగుమతి చేయించుకోనియెడ ఈనాడు భారతదేశం సకల సౌభాగ్యాలతో తులదూగుతూ ఉండేది. కాని అలా జరగలేదు. మనము దురాశాపరులం. ఇంగ్లాండు కూడా అంతే. ఆంగ్ల భారతదేశాల పరస్పర సంబంధం పొరపాటున తటస్థించిన మాట స్పష్టం. ఇంగ్లాండు మాత్రం ఇండియాతో ఉండడం పొరపాటు కాదు. భారత ప్రజల కొలుకు కాపాడవలసిన ధర్మనిధిగా ఇండియాను తమ చేతులలో

ఉంచుకోవడం తమ రాజనీతి అయినట్లు ఇంగ్లాండు స్పష్టంగా ప్రకటిస్తూన్నది. ఇదే నిజమయితే లాంక్‌షైరు నైదొలగాలి. స్వదేశీ సిద్ధాంతం ప్రమాదరహితమైనదే అయితే, లాంక్‌షైరు తాత్కాలికంగా కొంత దెబ్బ తిన్నప్పటికీ అపాయంలేకుండా వైదొలగిపోగలదు. స్వదేశీ కసితీర్చుకొనేటందు కవలంబింపబడిన బహిష్కారోద్యమంకాదని నాఅభిప్రాయం. అది అందరూ అనుసరింపతగిన ధార్మిక సిద్ధాంతమని నా భావం. నే నార్థికశాస్త్రవేత్తనుకాను. కాని ఇంగ్లాండుకు కావలసినది యావత్తూ అది ఉత్పత్తిచేసుకొంటూ స్వయం సంపూర్ణదేశం కావడం తేలిక అని ఒక సమగ్రమైన వ్యాసమును నేను చదివాను. ఇది కేవలం హాస్యాస్పదమైన ప్రతిపాదనకూడా కావచ్చును. ప్రపంచంలోకెల్లా ఎక్కువగా దిగుమతులుచేసుకొనే దేశం ఇంగ్లాండు కావడమే ఈ విషయాన్ని రుజువుచేసే ప్రముఖతార్కాణము. కాని భారతదేశం తన బ్రతుకు తెలివు తాను చూచుకొనే ముందు లాంక్‌షైరుకోసం కానీ ఇంకే యితర దేశంకోసం కానీ మనజాలదు. అయితే అది తన బ్రతుకు తాను బ్రతకవలెనంటే తనకు కావలసిన వస్తువులను తన దేశంలోనే ఉత్పత్తిచేసుకోవాలి. అలా ఉత్పత్తి చేసుకొనేటందుకు సహాయంచేయబడాలి. కాని అది వినాశకరమూ ఉన్మాదభూయిష్ఠమూ అయిన స్పర్థ అనే సుడిగుండంలో పడిపోనక్కర లేదు. స్పర్థ, భ్రాతృహత్యా అసూయా అనే అనేకమయిన చెడుగులకు దారితీస్తుంది. కాగా ప్రపంచ వ్యాపారస్థులతో పోటీకి దిగకుండా భారతదేశంలోని కోటీశ్వరులను ఎవ్వరాపగలరు? శాసనంవలన కాదన్నమాట నిశ్చయం. కాని ప్రజాభిప్రాయ బలమువలనను, సముచితమైన ప్రబోధం వలనను మనం కోరుతూన్న పద్ధతిని చాలావరకు పని జరుగ

గలదు. చేనేత పరిశ్రమ మరణావస్థలలో ఉన్నది. నిరుటి నా సంచారంలో నేసేవారిని సాధ్యమైనంత ఎక్కువమందిని చూడవలెనని ప్రత్యేక శ్రద్ధతీసుకొన్నాను. వారికావృత్తి ఎలా పోయిందో, గౌరవప్రదమై ఒకప్పు డభివృద్ధిలోనున్న ఆ వృత్తిని వారి కుటుంబా లేవిధంగా విడిచి వెళ్లవలసివచ్చిందో తెలుసుకొన్నప్పుడు నా మనస్సు బాధపడ్డది. మనము స్వదేశీ సిద్ధాంతాన్ని అనుసరించేయెడల, మన ఇరుగుపొరుగు వారిలో సరియైన వృత్తిలేనివారు ఉండి ఉంటారనుకొని, వారిలో మన అవసరాలను సరఫరా చేయగలవారిని తెలుసుకొని, వారు ఎలా పని ప్రారంభించవలెనో వారికి తెలియని యెడల తెలియచెప్పడం మన విధి. అప్పుడు భారతదేశంలోని ప్రతి గ్రామమూ స్వావలంబితమూ స్వయంసంపూర్ణమూ అయిన కేంద్రమయి, స్థానికంగా ఉత్పత్తికాని అవసర వస్తువులను మాత్రం, తన వస్తువులను వెలపెట్టి యితర గ్రామాలనుండి తెప్పించుకోగలదు. ఇదంతా అర్థంలేని ప్రలాపంగా తోచవచ్చును. నిజానికి భారతదేశమే అర్థరహితమైన దేశం. సదయుడైన ఒకానొక మహమ్మదీయుడు పరిశుభ్రమైన నీరు త్రాగేటందు కిస్తాంటే నిరాకరించి గొంతెండపెట్టుకోవడం అర్థరహితంకాదా మరి! అయినప్పటికి ముస్లిం గృహంలోని నీరు త్రాగేకంటే, దాహంతో చచ్చిపోయేటందుకైనా వేలకొలదీ హిందువులు ఒప్పుకొంటున్నారు. భారతదేశంలో తయారైన బట్టలను మాత్రమే ధరించవలెననీ, ఇండియాలో ఉత్పత్తిఅయిన ఆహారమును మాత్రమే భుజించవలెననీ, వారి మతం కోరుతూన్నట్లు ఒకసారి వారికి నమ్మకం కలిగిన యెడల ఈ అర్థంలేని మనుష్యులు తక్కిన వస్త్రములను ధరించడానికీ తక్కిన ఆహారమును భుజించడానికీ

నిరాకరించగలరు కూడా. కర్జన్ ప్రభువు తేనీరు త్రాగడం శిష్టాచారం చేశాడు. ఆ పాడు ఓషధి జాతిని పూర్తిగా ముంచి వేస్తూన్నది. లక్షలాది స్త్రీ పురుషుల జీర్ణకోశము నది ఇదివరకే ధ్వంసం చేసింది. అంతేకాక అసలే తక్కువ ఆదాకలవారి కది అదనపు పన్నుగా పరిణమిస్తూన్నది. హార్డింజి ప్రభువు స్వదేశీని శిష్టాచారం చేయవచ్చును. అప్పుడు దాదాపు భారతదేశం యావత్తూ విదేశీ సరుకులను ప్రతిజ్ఞా పూర్వకంగా బహిష్కరించగలదు. భగవద్గీతలో ఒక శ్లోకం ఉంది. గొప్పవాళ్లను సామాన్య ప్రజలనుసరిస్తూంటారని దానిలోని భావం. సంఘంలో ఆలోచనా శక్తిగలవారు స్వదేశీ ప్రతిజ్ఞను తీసుకొన్నట్లయితే, కొంత కాలం చాలా అసౌకర్యంగా ఉన్నప్పటికీ, ఈ చెడుగును నిర్మూలించడం తేలిక అవుతుంది. జీవితంలో ఏ విషయానికి సంబంధించినదైనా శాసనం ద్వారా జోక్యం కలిగించుకోవడమంటే నాకు పడదు. కాని అది మహా అయితే అసలు దానికంటె తక్కువ చెడుగు అవుతుంది. అయినప్పటికీ విదేశీ సరుకులమీద నిక్కచ్చిగా రక్షణ పన్ను వేయవలెనని నేను వాదిస్తాను. ఆ పన్నును నేను కావలెనని ఆహ్వానిస్తాను. సహిస్తానుకూడా. బ్రిటిష్ వలస రాజ్యమైన నేటాలు, మరొక బ్రిటిష్ వలస రాజ్యం మారిషస్ నుండి దిగుమతి అయ్యే పంచదార పైన పన్నువేసి తన పంచదార పరిశ్రమను రక్షించుకొన్నది. స్వేచ్ఛా వ్యాపారమును భారతదేశం పైన బలవంతంగా రుద్ది ఇంగ్లాండు దేశానికి అపచారం కావించింది. ఈ పద్ధతి ఇంగ్లాండుకు క్షేమం కావచ్చును. ఇండియాకు మాత్రం హాని.

ఇండియా తన ఆర్థిక జీవితంలో మాత్రం స్వదేశీని అవలంబింప చాలదని అనేకసార్లు హెచ్చరింపబడుతూన్నది. ఈ

అభ్యంతరాన్ని చెప్పేవారు స్వదేశీ ఒక జీవిత నియమమని భావించడం లేదు. వారి దృష్టిలో ఇది కేవలం దేశాభిమానంతో కూడిన పని అనీ, ఇందుకేమైనా స్వార్థ త్యాగం చేయవలసి ఉంటే అందుకు ప్రయత్నించ నక్కరలేదనీ వారి అభిప్రాయం. ఇక్కడ వర్ణింపబడే స్వదేశీ, వ్యక్తులు తమకు శారీరకంగా అసౌకర్యము కలిగినప్పటికీ యేమీ లక్ష్యం చేయక నడచుకోవలసిన ధార్మిక శిక్షా విధానమే. ఈ స్వదేశీమైకంవలన, భారతదేశంలో తయారు కాలేదన్నే కారణంతో, సూదినిగానీ గుండు సూదినిగానీ, ఉపయోగించేటందుకు వీలుపడదని గాబరాపడ నక్కరలేదు. ఈ నాడు అవసరమని భావింపబడుతూన్న వందలకొలదీ వస్తువులతో పని లేకుండానే గడుపుకోవడ మెలాగో స్వదేశీ ప్రియుడు నేర్చుకోగలడు. అంతేకాక ఈ నాడు స్వదేశీ అసంభవమని వాదించి దానిని మనస్సులలోనుండి నెట్టివేస్సే వారంతా, ఇంతకూ అది నిశ్చల ప్రయత్న పూర్వకంగా అందుకోదగిన ఆదర్శమనే మాట విస్మరిస్తున్నారు. తాత్కాలికంగా, మన దేశంలో లభించని వస్తువులను ఇతర దేశాలవి ఉపయోగించుకొంటూ కొన్ని నిర్ణీత వస్తువుల విషయంలో మాత్రమే స్వదేశీ సిద్ధాంతానికి కట్టుబడి ఉన్నప్పటికీకూడా మనం స్వదేశీ ఆదర్శాన్ని అందుకొనే ప్రయత్నంలో ఉన్నట్లే.

ఇక స్వదేశీ విషయంలో చెప్పబడుతూన్న మరొక అభ్యంతరాన్నిగూర్చి నే నాలోచించవలసి ఉంది. శిష్టాచారానుగుణ్యమైన నైతిక ధర్మశాస్త్రం ప్రకారం యెంత మాత్రమూ సమర్థనీయం కాని అత్యంత స్వార్థపూరిత సిద్ధాంతమని స్వదేశీకి అభ్యంతరం చెప్పేవారు దానినిగూర్చి అంటూంటారు. స్వదేశీని ఆచరించడం తిరిగీ అనాగరిక

పద్ధతులను అవలంబించడమని వారి అభిప్రాయం. ఈ విష యాన్ని గూర్చి నే నింకనూ వివరించి చెప్పజాలను. అయితే, అడకువకూ ప్రేమకూ అనుగుణంగా ఉండే సిద్ధాంతం ఒకట్రి స్వదేశీయే యని నేను చెప్పగలను. నా కుటుంబమునకే నేను సేవచేయ లేని స్థితిలో నున్నప్పుడు యావద్భారత దేశానికి సేవచేయవలెనని భావించి అందుకు పూనుకోవడం అహంకారం. నేను నా కృషిని నా కుటుంబమునెడల కేంద్రీకరించి, దాని ద్వారా యావజ్జాతినీ, ఇంకా మీ కిష్ట మైతే, యావత్ప్రజానీకమునూ కూడా సేవిస్తూన్నట్లు భావించడం ఎక్కువ ఉచితం. అదే అడకువ, అదే ప్రేమ. ఈ పని చేయడంలోని ఉద్దేశమే దానిలోని గుణాన్ని స్పష్టం చేస్తుంది. ఇతరులకు నావలన కలుగుతూన్న కష్టాలను పరి గణించకుండా నా కుటుంబానికి నే నుపకారం చేసుకొంటూ ఉండవచ్చును. ఇందుకు తార్కాణంగా ప్రజలనుండి డబ్బు గుంజడానికి వీలైన ఉద్యోగాన్ని నే నంగీకరించి భాగ్యవంతు డనై నా కుటుంబము కోరే అక్రమ వాంఛలను అనేకం నేను తీరుస్తూ ఉండవచ్చును. అప్పుడు నేను నా కుటుం బాన్నికానీ దేశాన్నికానీ సేవిస్తూన్నట్లు కాదు. అలాకాక దేవుడు నాకు కాళ్ళూ్ చేతులూ యిచ్చింది, నేను పనిచేసి నన్నూ నామీద ఆధారపడి ఉన్నవారినీ పోషించుకొనేటం దుకేనని నేను గ్రహించవచ్చును. అప్పుడు నేను నా జీవి తాన్నీ, నాకు ప్రత్యక్ష సన్నిహితులైన వారి జీవితాన్నీ కూడా తక్షణం నిరాడంబరంగా చేయగలను. ఇలా చేయ డంలో ఇతరు లెవ్వరికీ అపకారం కలుగకుండా నేను నా కుటుంబాన్ని పోషించుకొన్నవాడనవుతాను. ప్రతి మనిషీ ఈ జీవిత విధానాన్నే అనుకరించినయెడల ఆదర్శ రాజ్యాన్ని మనం పొంది ఉండగలము. అందరూ ఒకేసారి ఆ స్థితికి

రాలేరు. కాని ఈ సత్యాన్ని గ్రహించి ఆచరణలో పెట్టే వారందరూ ఆ శుభ దినముయొక్క రాకకు ఎదురుచూస్తూ అందుకు స్పష్టంగా దోహదం చేయగలరు. ఈ జీవిత విధానం ప్రకారం, తక్కిన దేశాలన్నిటినీ మినహాయించి ప్రత్యేకం నా దేశాని కుపకారం చేస్తూన్నట్లు నేను కని పించినప్పటికీ, యే యితర దేశానికీ నే నపకారం చేయడం లేదు. నా దేశాభిమానంలో సమష్టి వ్యష్టి భావములు రెండూ ఉన్నవి. నేను పూర్తియైన అడకువతో నా పుట్టిన దేశానికి మాత్రమే నా దృష్టిని పరిమితం చేసుకోవడంలో వ్యష్టి భావమున్నూ, కాని నా ఆ సేవ యితర దేశాలకు ప్రతికూలంగాగానీ పోటీగాగానీ ఉండకపోవడంవలన సమష్టి భావమున్నూ ఉన్నవి. 'ఇతరుల హక్కులకు హాని కలిగించని విధాన నీ ఆస్తిని నీవనుభవించుము' అనే తత్వం కేవలం న్యాయశాస్త్ర సిద్ధాంతమే కాదు; అది జీవితమున కొక ఉత్కృష్టాదర్శంకూడా. అహింసను కానీ ప్రేమను కానీ సరియైన ఆచరణలో పెట్టేటందుకది మూలం. ద్వేషపూరిత మైన దేశాభిమానం 'మరణం కలిగిస్తుందనీ' ప్రేమపూర్వక మైన దేశభక్తి 'ప్రాణం పోస్తుందనీ' ప్రబోధిస్తూ దానిని శిష్టాచారంగా చేసి, మీ ఆచరణవలన దానిని పునీతం కావించడం ఉత్కృష్ట ధర్మ పరిపాలకులగు మీ కర్తవ్యం.

# 2
# స్వదేశీ తత్వం

స్వదేశీ ఉద్యమం వట్టి అర్థరహితమైన స్థితిలో ఉన్నదనే ఆపాదన సరియైనది కాదనుకోవడానికి వీలులేదు. స్వదేశీ ద్వారానే దాదాపు పూర్తిగా స్వరాజ్యం సంపాదించవచ్చునని మనం గ్రహించడం లేదు. మన వివిధ ప్రాంతీయ భాషలందు మనకు గౌరవం లేనియెడలను, మన బట్టలను మనం అసహ్యించుకొనేటట్లయితేను, మన దుస్తులే మనకు హేయంగా తోస్తేనూ, పవిత్రమైన శిఖను తాల్చడం మనకు సిగ్గుగా ఉంటేనూ, మన ఆహారం మనకు అరుచి అనిపిస్తేనూ, మన శీతోష్ణస్థితి మనకు సరిపడకపోతేనూ మన వాళ్లు మనకు మొరటుగా కనిపించి మన సహవాసానికి పనికి రాకపోతేనూ, మన నాగరికత మనకు తప్పుగా తోచి పరాయి సభ్యత ఆకర్షవంతంగా ఉంటేనూ, సంగ్రహంగా చెప్పవలసివస్తే మనదైనదల్లా మనకు చెడ్డదై పరాయిది మనకు పరమానందంగా ఉన్నట్లయితే స్వరాజ్యమనగా మన కేవిధంగా అర్థం అవుతుందో నాకు తోచడం లేదు. పరాయి దేశముయొక్క ప్రతి విషయాన్నీ మనం అనుకరించవలసియున్నయెడల, విదేశీ సభ్యత ప్రజా సామాన్యంలో వ్యాపించలేదు గనుక మనం నిశ్చయంగా విదేశీ సంరక్షణకింద యింకా చాలా కాలం ఉండవలసిన అవసరం కలదు. మనం స్వరాజ్యముయొక్క విలువను గ్రహించగలగడానికి ముందు, స్వదేశీని ప్రేమించడమే కాక దానికొఱకు ఉద్వేగపడాలి. మనం చేసే ప్రతి పనిలోనూ స్వదేశీ అంకితం కావాలి. జాతీయమైన ప్రతి విషయమూ మొత్తం

మీద సలక్షణంగా ఉన్నదనే భావంతో మాత్రమే స్వాత్యజ్య నిర్మాణం జరుగగలదు. ఈ అభిప్రాయం సరియైనదైతే, స్వదేశీ ఉద్యమం తీవ్రంగా నడవాలి. స్వరాజ్యోద్యమాన్ని సాగించిన ప్రతి దేశమూగూడా స్వదేశీ తత్వాన్ని పూర్తిగా అవగతం చేసుకొన్నది. ప్రాణాపాయ స్థితిలోకూడా స్కాచి హైలాండర్లు తమ దుస్తులను వీడలేదు. మనం హైలాండర్లను 'రవికల దండు' అని హాస్యంగా అంటూంటాము. కాని ఆ రవికకు వెనుకనున్న బలమునుగూర్చి ప్రపంచానికి బాగా తెలుసు. ఆ దుస్తులు అసౌకర్యంగా ఉన్నప్పటికీ, శత్రువుల బారికి తేలికగా అగ్గం కావడానికి వీలు కలిగినప్పటికీ స్కాట్లండులోని హైలాండర్లు మాత్రం వాటిని విడచిపెట్టరు. ఈ ఉదాహరణను నేను తీసుకొనిరావడం మన లోపాలను మనం నిక్షేపించు (కాపాడు) కొంటూండవలెనని చెప్పేటందుకు కాక, మన జాతికి సంబంధించినవి మనకు కొంచెం అసౌకర్యంగా ఉన్నప్పటికీ వాటిని అంటి పట్టుకొని ఉండవలెననీ, మనవాటికంటె విదేశీయులవి ఎక్కువ సౌకర్యంగా తోస్తూన్నప్పటికీ వాటిని విడనాడవలసిందనీ చెప్పేటందుకే ఉద్దేశింపబడింది. మన సభ్యతలో లోపించిన విషయాన్ని సరియైన మన ప్రయత్నాలవలన పూరించుకోవచ్చును. ఈ సమావేశంలోని ప్రతి సభ్యునికీ స్వదేశీ తత్వం పట్టుపడుతుందనీ మన కెన్ని గొప్పచిక్కులూ ఎంతఅసౌకర్యమూ తటస్థించినప్పటికీ మన మీ స్వదేశీ ప్రతిజ్ఞను ఆచరణలోకి తీసుకొనిరాగలమనీ నే నాశిస్తున్నాను. అప్పుడు స్వరాజ్యం మనకు తేలికగా లభిస్తుంది. *

---

* 1917 అక్టోబరులో గోధ్రాలో జరిగిన ప్రథమ గుజరాతు రాష్ట్రీ రాజకీయ మహాసభలో ఈయబడిన అధ్యక్షోపన్యాసమునుండి.

# 3

# స్వదేశీలో స్వరాజ్యం

ఇండియాకు కావలసిన నిజమైన సంస్కరణము సరియైన అర్థంలో వాడబడే స్వదేశీ. తక్షణం మనం పరిష్కరించవలసిన సమస్య మన దేశపరిపాలనమును ఎలా నడపవలెనా అనేది కాదు. మనకు కావలసిన అన్న వస్త్రాలను ఎలా సేకరించుకోవలెనా అనేదే. 1918 లో బట్టలను కొనుక్కొనేటందుకు, ఇండియానుండి అరవై కోట్ల రూపాయిలను వెలుపలకు పంపినాము. ఆ ప్రకారం విదేశీ వస్త్రాలను కొనుక్కోవడం మనం కొనసాగించేయెడల, భారతీయ నేత పారిశ్రామికునకు, నూలు వడికేవానికీ వస్తుతః మరొక వృత్తి చూపకపోగా పైపెచ్చువారికి అంత మొత్తమూ ముట్టకుండా చేస్తున్నాము. అందువలన మన జనసంఖ్యలో అధమం పదవ వంతును క్రూరంగా అర్ధోపవాసాలు చేయించడమున్నూ, తక్కినవారిలో అధిక సంఖ్యాకులను తక్కువ తినిపించడమున్నూ జరుగుతూన్నది. మధ్య తరగతులవారిదివరకే చాలీచాలని భోజనం చేయవలసివస్తూన్నదనీ, మన బిడ్డలకు కావలసినన్ని పాలు లభించడం లేదనీ కన్నులున్నవారికి తెలియగలదు. సంస్కరణప్రణాళిక ఎంత ఉదారంగా ఉన్నప్పటికీ అద్యతన భవిష్యత్తులో మన సమస్యనది పరిష్కరించ చాలదు. కాని స్వదేశీ యిప్పుడే పరిష్కరించగలదు.

ఈ సమస్యా పరిష్కారమునుగూర్చి పాంచాలం నాకు మరింత విస్పష్టంకావించింది. పాంచాల దేశపు రమణీ

మణులు వారి స్త్రీల నేర్పరితనాన్ని ఇంకా పోగొట్టుకో కుండా ఉన్నందుకు భగవంతునకు మనం కృతజ్ఞులంగా ఉండాలి. వారిలో ఎక్కువవారూ తక్కువవారూకూడా ఇప్పటికీ నూలువడికే నేర్పు తెలిసినవారే. చాలామంది గుజ రాతీ స్త్రీలు చేసినట్లుగా వారు తమ రాటాలను ఇంకా తగులవేయలేదు. వారు నావడిలో నూలు బంతులను విసిరి వేస్తూండడం చూస్తే నాకత్యంతానందం కలిగింది. వడక డానికి తగిన అవకాశం తమకున్నట్లు వారంగీకరిస్తున్నారు. యంత్రంమీద తయారైన నూలుకంటె, వారు వడికిన నూలుతో నేయబడిన ఖాదీ శ్రేష్ఠతరమైనదనికూడా వారొప్పు కొంటున్నారు. మన పూర్వీకులు విదేశీ అంగళ్లలో కొన కుండా కొద్ది కష్టంతో బహు సులభంగా వారికి కావలసిన బట్టలను తయారుచేసుకోగలిగినారు.

మనం తొందరలో మేల్కొనియెడల, సుగమము, మనోజ్ఞమూ అయిన ఈ కళ నశించిపోయే అపాయస్థితిలో ఉంది. పాంచాలదేశం దీని అవకాశాలనుగూర్చి ధ్రువ పరుస్తూన్నది. అయితే ఆ రాష్ట్రంకూడా అంతకంతకు తొందరలో ఈ అవకాశాలను పోగొట్టుకొంటూన్నది. వడుకు నూలు ఉత్పత్తి యేటేటా తగ్గిపోతూన్నది. అనగా మన ఇండ్లలో అంతకంతకు పేదఱికం పెచ్చు పెరుగుతూన్న దనీ సోమరితనం ఎక్కువవుతూన్నదనీ అర్థం. వడకడం మానివేసిన స్త్రీలు వట్టిమాటలతో కాలక్షేపంచేయడంకంటె ఎక్కువ ఉపయోగకరమైన పని ఏమీ చేయడంలేదు.

ఈ దుస్థితిని మాన్పవలెనంటే ఒక పని అవసరం. విద్యా వంతుడైన ప్రతి భారతీయుడూ తన ధర్మాన్ని తాను స్పష్టంగా గుర్తించేయెడల తన కుటుంబంలోని స్త్రీలకు తత్క్షణం ఒక

రాట్నాన్ని బహుమతీచేసి నూలు వడికే కళను నేర్చుకొనే టందుకు తగిన సావకాశాలను కల్పించగలడు. అప్పుడు ప్రతిరోజూ లక్షలాది గజాల నూలును ఉత్పత్తిచేయవచ్చును. విద్యావంతుడైన ప్రతి భారతీయుడు, అటువంటి నూలుతో ఉత్పత్తిచేయబడిన బట్టలను ధరించడానికి అనుగ్రహించేయెడల ఆయన మన దేశంలో సాధ్యమైన ఒకే ఒక కుటీర పరిశ్రమను పునర్నిర్మాణం చేసేటందుకు సహాకరించిన వాడు కాగలడు.

కుటీర పరిశ్రమ లేని భారతీయ కృషీవలుడు బాగుపడడు. భూమిలో పండిన పంటతో వాని జీవనం గడవదు. అతనికి మరొక ఉపవృత్తికావాలి. నూలు వడకడం చాలా సులభం ; చాలా చౌక ; చాలా మంచిదీని. ఇందుకు మన మానసిక దృక్పథంలో తీవ్ర పరివర్తనం కలుగవలెను. అది తీవ్ర పరివర్తనం కనుకనే స్వదేశీ ద్వారానే స్వరాజ్యానికి మార్గం కలదని నేనంటున్నాను. సంవత్సరానికి 60 కోట్ల రూపాయిలాదా చేసుకోగలిగి అంత పెద్ద మొత్తాన్ని నూలు వడికే వారికీ నేసేవారికీ వారి యిండ్లలో పంచిపెట్ట గలిగే జాతి తన సమాజాభివృద్ధికి తగినట్లుగా ప్రతి పనినీ తాను నిర్వర్తించుకొనేటందుకు సమర్థత, కార్య తత్పరత్వము, నిర్మాణ కౌశల్యమూకూడా కలిగిఉంటుంది.

అయితే కలలుకనే సంస్కారి "నాకు బాధ్యతాయుత ప్రభుత్వం వచ్చేదాకా ఆగండి! మన స్త్రీలు నూలు వడక కుండానూ, మన సాలీలు బట్టలు నేయకుండానూ, భారతీయ పరిశ్రమను నేను కాపాడుతాను" అని నెమ్మదిగాం చెపుతూంటాడు. ప్రాజ్ఞులుకూడా సరిగా యిలాగే అంటూం టారు. ఇందులో రెండు అసంగత విషయాలున్నవని

నేనన సాహసిస్తున్నాను. భారతదేశం రక్షణ పన్నుకొఱకు వేచి ఉండక్కాలదు. రక్షణ జట్టు ఖరీదును తగ్గించదు; అంతే కాదు; రక్షణ యిచ్చినంతమాత్రంతో అన్నాతురులైన లక్ష లాది ప్రజలకు ప్రయోజనం కలుగదు. కాని వడుకు పరి శ్రమను పునరుజ్జీవింపచేసి అదనపు సంపాదనను చేకూర్చడం ద్వారా మాత్రమే వారికి సహాయంచేయగలము. కాబట్టి రక్షణ పన్ను ఉన్నా లేకపోయినా, వడుకునూలు పరిశ్ర మను పునరుద్ధరించి చేనేతను ప్రోత్సహించవలసిన పని మాత్రం ఉంది.

యుద్ధం జరుగుతూన్నప్పుడు అమెరికా ఇంగ్లాండు దేశాలలో దొరికినవాళ్లందరూ, నౌకా పరిశ్రమాలయందు పడవల నిర్మాణంకోసం నియోగింపబడ్డారు. వారు అద్భుత వేగంతో వాటిని నిర్మించారుకూడా. నాయిష్టం వచ్చినట్లు జరుగనిస్తే అందుబాటులోఉన్న ప్రతి భారతీయుణ్ణీ వడకడం నేయడం నేర్చుకొనేటట్లుచేసి, స్త్రీగానీ, పురుషుడుగానీ ప్రతిరోజూ కొంత నిర్ణీతకాలం ఆ పనిచేసే యేర్పాటు కావిం చగలను. పాఠశాలలూ కళాశాలలు సువ్యవస్థాపిత కేంద్రాలుగా తయారయి ఉన్న కారణాన ముందు వాటి ద్వారా ప్రారంభంచేస్తాను.

యంత్రాలయాలను హెచ్చించినందున ఈ సమస్య పరి ష్కారంకాదు. బయటకుపోయే ధనప్రవాహాన్ని పూర్తిగా ఆపేటందుకు వాటికి చాలాకాలం పట్టుతుంది. అదీకాక అవి ఆ అరవైకోట్లను మన యిళ్లలో పంచిపెట్టజాలవు. అవి ధనాన్నీ శ్రామికులనూ ఒకచోట కేంద్రీకరింపచేసి ఇదివరకే చిక్కైన ఈ సమస్యను మఱింత క్లిష్టదశకు తీసు కొనిరాగలవు.

—యంగిండియా, 10-12-1919

# 4
# స్వదేశీ

జాతీయవారం, పదమూడో తేదీ మంగళవారంనాడు ముగిసింది. హిందూ మహామ్మదీయ సఖ్యతకూ, రౌలట్టు చట్టాన్ని రద్దు చేయించవలెననే నిశ్చయమునకూ, సత్యాగ్రహ తత్వమునకూ,అన్నివిధాలా అది ప్రశంసింపదగిన ప్రదర్శనంగా జరిగింది. ఈయబడిన ఉపన్యాసాలు గంభీరంగానూ పూర్వంకంటె ఎక్కువ విషయానుగుణంగానూ ఉన్నవి. నివేదికలు చేరినంతవరకు ఏ సభలలోనూ గల్లంతు లేదు.

కాని స్వదేశీనిగూర్చి ఏమిటి? స్వదేశీకూడా సత్యాగ్రహతత్వము సత్యాగ్రహ కార్యకలాపములద్వారా ప్రభవించినది కాదా? నిస్సందేహంగా అవును. కాని అన్నిటిలోకీ స్వదేశీపని యెక్కువ నిర్మాణయుతమైనది. అది గట్టి పనిచేసినంతగా ఉపన్యాసాల కెక్కువ సావకాశమీయదు. ప్రతి సంవత్సరం ఉపన్యాసాల మూలకంగాగాని ప్రదర్శనాలద్వారా గాని యాభైకోట్ల రూపాయలను ఆదా చేసికోవడం సాధ్యంకాని పని. ప్రతియేటా బయటకుపోతూన్న యీ ధనప్రవాహాన్ని అరికట్టడంకంటె కూడా యిందులో యింకా యెక్కువ విశేషం ఉంది. ఇందులో భారత స్త్రీల గౌరవం యిమిడిఉంది. మిల్లులలో పనిచేస్తున్న స్త్రీలు కొన్ని ఆకర్షణలకూ, వారర్గంకాకూడని కొన్ని అపాయాలకూ పాల్పడవలసివస్తూన్నదని యంత్ర పరిశ్రమతో యేమాత్రమైనా సంబంధంఉన్న ప్రతి మనిషికీ తెలుసును. ఇళ్లలో పని కుదరక చాలమంది స్త్రీలు రోడ్లు మరమ్మతుచేసే పనికి ఒప్పుకుంటున్నారు. ఈ పని

యెటువంటిదో యెరిగిఉన్నవారుమాత్రమే యిందులో స్త్రీలు గురియవుతూన్న అపాయాలను అర్థం చేసికోగలరు. వారికి రాటాన్నివ్వండి. రాటము దగ్గిర కూర్చొని పనిచే యడంకంటే యే స్త్రీ యింకేపనికీ దేవులాడ నక్కరలేదు. అది వ్యవసాయానికి ఉపవృత్తిగా ఉండి, నిరంతరం పెరిగి పోతూన్న మన పేదరిక సమస్యను పరిష్కరించడానికి దానంతటది తోడ్పడగలదు. ఈ విధంగా మన కోరికలను తీరుస్తూ మన చిక్కు సమస్యలను పరిష్కరించేటందుకు స్వదేశీ నిజమైన కామధేనువు. మన గౌరవాన్ని కాపాడుతూ మనకు బ్రతుకు తెరువును చేకూర్చే వృత్తి మనకు మత ధర్మమవుతుంది. ఈ ఉత్కృష్టమైన ఆదర్శం ఎలా సిద్ధించగలదు? ఇందుకు జవాబు సులభమే. ఈ సమస్యా ప్రాముఖ్యతను గుర్తించినవారు, ఈ దిగువ పద్ధతులలో అన్నిటినిగానీ, లేక యే ఒక్కదానినిగానీ అవలంబించి పని చేయవలెను :—

1. నీవు స్త్రీవైనా పురుషుడవైనా నీఅంతట నీవు వడకడం నేర్చుకో. నీకు పైకం కావలసిఉంటే మజూరీ తీసుకో. లేదా ఆధమం ప్రతిరోజూ ఒక గంట పనిని దేశానికి సమర్పించు.

2. కాలక్షేపంగాగానీ లేక వృత్తిగాగానీ నీవు నేత నేర్చుకో.

3. ప్రస్తుతం ఉన్న చేమగ్గాలకు రాటాలకు ఇంకా అభివృద్ధి కల్పించి నీవు భాగ్యవంతుడవైతే ఆ చేసేవారికి ప్రతిఫలం ముట్టచెప్పు.

4. స్వదేశీ ప్రతిజ్ఞ తీసుకొని చేతితో వడికి చేతితో నేసిన బట్టను అభిమానించు.

5. మీ స్నేహితులలో అటువంటి బట్టను ప్రవేశపెట్టి పేద సోదరీమణులు వడికిన నూలుతో నేయబడిన ఖాదీలో ఎక్కువ శిల్పమూ మానవత్వమూ కలదని విశ్వాసం కలిగి ఉండు.

6. నీవు పిల్లలను కన్న తల్లివైతే నీ పిల్లలకు పరిశుభ్రమైన జాతీయ సంస్కారం కలిగించి, వారిని లక్షలాది ప్రజలకు అందుబాటులో నున్నట్టిన్నీ, మిక్కిలి తేలికగా ఉత్పత్తి చేయడానికి వీలైనట్టిన్నీ ఖాదీని ధరించేటట్లు చెయ్యి.

అప్పుడు స్వదేశీ అనగా, అందులోని ప్రతి ఒక్క భాగము తదితర భాగాలతో సరిగా సమన్వయం చేసుకొంటూ నడుస్తూండే అత్యుత్తమ వ్యవస్థా నిర్మాణమని అర్థమవుతుంది. అటువంటి సంస్థను మనం నిర్మించుకోగలిగిన యెడల, స్వదేశీ విజయం పొందడం నిశ్చయం కావడమే గాక నిజమైన స్వరాజ్యంకూడా మనకు సహజంగా లభించ గలదు.

—యంగ్ఇండియా, 21-4-1920

# 5

# ఖద్దరు ప్రయోజనాలు

స్వదేశీ ఉద్యమం తరంగాయితంగా పురోగమిస్తూ ఉండి ముసల్మానులుకూడా హిందువులవలె ఉత్సాహంతో దానిని అవలంబిస్తూన్నప్పుడు, స్వదేశీ అభివృద్ధికి కావలసిన అత్యుత్తమ పద్ధతులనుగూర్చి ఆలోచించడం ఉచితం. మన అవసరాలను తీర్చగలిగినంత బట్టను మనం ఉత్పత్తి చేయడం లేదని స్వదేశీలో అతినూతనంగా ప్రవేశించిన వ్యక్తికికూడా అర్థమవుతుంది. కాబట్టి మనం కేవలం మిల్లు బట్టను ఉపయోగించి నట్లయితే, పేదవాళ్ళ కవసరమైన దానిని వారికి మట్టకుండా చేయడము మాత్రమే కాగలదు. లేదా కనీసం మిల్లు బట్ట ధర పెంచడమైనా అవుతుంది. కాబట్టి స్వదేశీని ప్రోత్సహించేటందుకు, ఇంకా ఎక్కువ బట్టను ఉత్పత్తి చేయడం ఒకటే మార్గం. మిల్లులు కుక్కగొడుగులవలె పుట్టజాలవు. కనుక మనం చేతితో వడికిన నూలుతో, చేతితో నేయబడిన బట్టపైన ఆధారపడి ఉండాలి. బహుశా నూలు నేడున్నంత ప్రియంగా ఎన్నడూ లేదు. నూలుమీద మిల్లులు విపరీతంగా లాభాలు తీస్తూన్నవి. చేతితో వడకడంవలన నూలు ఉత్పత్తికి దోహదమై, దాని ధర చౌక అవుతుంది.

అయితే నూలు వడికి, దానిని బట్టగా తయారు చేయడ మెలా అనేదే ప్రశ్న. ప్రమాణవస్త్రము (Standard cloth) ధరించేటందుకు యోగ్యమైనదిగా గుర్తింపబడేయెడల బజారులోని అంగళ్లను చేతితో వడికిన నూలుతోనూ చేతితో

నేసిన బట్టతోనూ మంచివేయవచ్చునని నా అనుభవము వలన నే నెఱుగుదును. ఈ బట్టను ఉత్తర హిందూస్థానంలో ఖద్దరని అంటారు. బొంబాయి రాష్ట్రంలో ఖాదీ అంటారు. ఖద్దరునుండి చీరలుకూడా తయారు చేయవచ్చునని చూపిన సరళాదేవికి మనం కృతజ్ఞులం. జాతీయవారంలో ఖద్దరు చీరా, ఖద్దరు రవికా ధరించినందువలన తన మనోభావాలను ఎక్కువ బాగా వెల్లడించగలనని ఆమె తలంచింది. అలా జరిగింది కూడా. ఆమె ఖద్దరు చీరతోనే విందులకు హాజరయింది. స్నేహితులది అసంభవమని భావించారు. మిక్కిలి నాజూకైన పట్టుచీరలను ఢకాకు మజ్లినులనూ తప్ప తదితర వస్త్రాల నెప్పుడూ ధరించని మహిళ, మోటు ఖద్దరు భారాన్ని మోయజాలదని వారనుకొన్నారు. అటువంటి భయాలన్నిటినీ ఆమె అబద్ధం చేసింది. సున్నితమ్మైన పట్టు చీరలు కట్టుకొన్నప్పుడు కనిపించిన దానికంటె, ఖద్దరు చీరతో తక్కువ సౌందర్యంగాగానీ, తక్కువ చురుకుగా గానీ ఆమె కనిపించలేదు. "నీవా చీరతో అందవికారంగా కనిపించనియెడల నీ వెక్కడికైనా పోవచ్చు; ఏ సమావేశానికైనా హాజరు కావచ్చు. నీవల్ల అది సలక్షణంగా ఉన్నట్లు నీకు కనుపిస్తుంది." ఇటువంటి మాటలతో ఆమెను ఖద్దరు చీరతోచూచి, ఆమె మేనమామయైన ఆ మహాపురుషుడు డాక్టరు రవీంద్రనాథ టాగూరు ఆశీర్వదించాడు. భారతదేశంలోకల్లా ప్రముఖులైన ఇరువురు కళాభిజ్ఞులు ఖద్దరులో యేమీ అందవికారం ఉన్నట్లు నుకో లేదని చూపేటందుకే ఈ పుణ్య వృత్తాంతము నిక్కడ నేను వివరిస్తూన్నది. భారతదేశమునందలి విజ్ఞానవంతమ్మైన కుటుంబాలలో నేను ప్రవేశపెట్టడానికి సాహసిస్తూన్నది ఈ ఖద్దరు బట్టనే. స్వదేశీ ఉద్యమముయొక్క నేటి బాల్య

దశలో దాని తక్షణ విజయం దీనిమీదనే ఆధారపడి ఉన్నది. అత్యంత సున్నితమైన ఢాకా మజ్లీను కంటె కూడా, ఎప్పుడైనా సరే నాకు, దాని సంబంధాలనుబట్టి ఖద్దరే ఎక్కువ రమణీయంగా కనిపిస్తుంది. నేడు వస్తులు ఉంటూన్నవారికి ఖద్దరు సహాయపడుతుంది. లజ్జాకరమయిన జీవితమునుండి ఉద్ధరింపబడినట్టి స్త్రీలకుగానీ, లేక పనికోసం బయటికి పోక, వృత్తిలేని కారణాన సోమరులుగానుండి తమలో తాము కయ్యాలాడుకొనే స్త్రీలకుగానీ యిది సహాయం చేస్తుంది. కాబట్టి ఖద్దరును ఆత్మ ఆవరించి ఉంది. దానికి పూర్తిగా వ్యక్తిత్వం ఉంది. దీనిని ఉత్పత్తి చేయడమునందలి ఆయా దశలన్నిటిలో యెవ్వరెవ్వరే యే పని చేస్తూ వచ్చారో, దీనిని ధరించిన మనిషి తెలుసుకోగలడు. మన అభిరుచి పాడుకాకుండా ఉన్నట్లయితే, వేసంగిలో సైతం, ఒంటి నంటుకొనిపోయే బట్టకంటే కూడా దీనినే ఎక్కువగా కోరుకొంటాము. నేను చెప్పిన దానిలోని యథార్థమును గూర్చి యిప్పుడు దానిని ధరిస్తున్నవారు యిష్టమైన యెడల తమ ఆమోదమును వెల్లడించవచ్చును.

—యంగిండియా, 21-4-1920

# 6

# చరఖా సంగీతం

భారతదేశములోకెల్ల బహుశా అత్యంత పురాతన యంత్రంయొక్క సంగీతం, మఱొకసారి నెమ్మదిగానూ నిశ్చయంగానూ సమాజాన్ని ఆవరిస్తూన్నది. భారతదేశంలోని రాణులు మహారాణులు దేశంకోసం నూలువడికేటంత వరకున్నూ, రాణాలు మహారాణాలు చేమగ్గాల వెనుక కూర్చొని జాతిక్షేమంకోసం బట్టలను నేసేటంతవరకున్నూ తాను సంతృప్తిపడజాలనని పండిత మాలవ్యాజీ ప్రకటన చేశారు. తన టోపీలను తాను తయారు చేసుకొన్న ఔరంగజేబు తార్కాణం వారికి ఉండనే ఉంది. అంత కంటెను ఎక్కువ గొప్ప చక్రవర్తి కబీరుకూడా నేతనేసే మనిషే. తన పద్యాలలో ఆ వృత్తిని అనశ్వరంగా చేశాడు. ఐరోపాఖండం సైతాణవలలో చిక్కకముందు అక్కడి రాణులు నూలు వడుకుతూ దానిని ఉత్కృష్టమైన వృత్తిగా భావించారు. "స్పిన్‌స్టరు" "వైఫ్" అను ఈ రెండు పదాలే, వడకడం నేయడంలాంటి కళలకుగల పూర్వ గౌరవాన్ని ప్రతిబింబింపచేస్తూన్నవి. 'ఆదామ్ త్రవ్వ ఈవ్ వడికినప్పుడు ఇక ఆర్యుడెవ్వరు? అనే వాక్యంకూడా పై విషయాన్నే జ్ఞప్తికి తెస్తూన్నది. సరే! ఇక మన పుణ్యభూమిలో నీ పురాతన వృత్తి నవలంబించవలసిందిగా భారతదేశపు సంస్థానాధీశులను పండిజ్జీ ప్రోత్సహించగలడని ఆశింతుముగాక! భారతదేశపు నిజమైన స్వాతంత్ర్యం కానీ అభ్యుదయంకానీ పునరుద్ధరింపబడడం ఆయుధాల చప్పుడుపైన ఆధారపడిలేదు. రాటపు సంగీతాన్ని ప్రతి యింట్లోనూ

తిరిగీ ప్రవేశ పెట్టడంపైననే అది చాలావరకు ఆధారపడి ఉంది. బీభత్సంగా ఉండే హార్మోనియం, కాన్సర్టినా, ఏకార్డియన్ వంటి సంగీత వాయిద్యములకంటె మధురతరమైన సంగీతాన్ని అది ప్రసాదిస్తుంది. వాటికంటె ఎక్కువ లాభప్రదంగాకూడా ఉంటుంది. రాటం చేపట్టవలసిందని భారత రాజకుటుంబాలవారిని పండిత మాలవ్యా అప్రతిమాన ప్రాజ్ఞ్యంతో ప్రోత్సహింప ప్రయత్నిస్తూండగానే, గొప్ప వంశంలోపుట్టి పెరిగిన శ్రీమతి సరళాదేవి చౌధ్రాణీ, నిండు మనస్సుతో ఉద్యమంలో ప్రవేశించింది. ఆమె కడనుండీ తదితరులయొద్దనుండీవచ్చే వార్తలన్నిటిని బట్టిచూస్తే, ఆమెకు సంబంధించినంతవరకు స్వదేశీ ఒక వ్యసనంగా పరిణమించింది. మజ్లిన్ చీరలామెకు అసౌకర్యంగానున్నట్లు, వేసంగిలోకూడా ఖద్దరు చీరలు ధరించడమే ఆమెకు సంతృప్తి ఐనట్లు ఆమె అంటూన్నది. ఆమె జిహ్వకంటె కూడా ఆమె ఖద్దరు చీరలు స్వదేశీనిగూర్చి ఎక్కువ వక్తృత్వంతో చెపుతూన్నవి. ఆమె అమృతసరం లూధియానా మొదలగు నగరాలయందలి సభలలో ఉపన్యసించి శ్రీమతులు రతన్‌చంద్, బుగ్గాచౌధరీలనూ,— ఏప్రిల్ 30 వ తేదీ భీకర నిశాసమయంలో, జనరల్ డయ్యర్ యొక్క కర్ఫ్యూ ఉత్తరువును లెక్కపెట్టక, మరణించినట్టి మరణిస్తూన్నట్టి శతసంఖ్యాకులగు జనులమధ్య, చనిపోయిన తన భర్త యొక్క చల్లని తలను ఒడిలో పెట్టుకొని ఒంటరిగా కూర్చొన్న పుణ్యశ్లోకయగు రత్నాదేవినీ, తనవడుకు సంఘాలలో సభ్యులుగా చేర్చగలిగింది. ఈ మహిళామణులకు నేను నా అభినందనాలను సమర్పించేటందు కుత్సహిస్తూన్నాను. వారు తమ రాట్నసంగీతమువలనను తాము దేశసేవ చేస్తూన్నామనే భావమువల్లనూ చిత్తశాంతి పొందె

దరుగాక. అమృతసరంలోని తక్కిన స్త్రీలు సరళాదేవి కృషికి సహాయపడతారనీ అమృతసరంలోని పురుషులీ విషయంలో తమకర్తవ్యమును తాము గుర్తిస్తారనీ ఆశిస్తున్నాను.

బొంబాయిలో ప్రసిద్ధ కుటుంబాలలోని స్త్రీలు యిప్పటికే వడకడం ప్రారంభంచేశారని పాఠకులకు తెలిపే ఉంది. ఇంతకు పూర్వమే ఈ కళను నేర్చుకొని సేవ సదనంలో ఇప్పుడు దీనిని ప్రవేశపెట్ట ప్రయత్నిస్తూన్న డాక్టర్ శ్రీమతి మేనకాబాయి బహదూర్ జీకూడా ఈ శ్రేణిలో చేరింది. ఘనతవహించిన జనీరా బేగం సాహెబాయున్నూ ఆమె సోదరి మిసెస్ అటియాబేగం రెహిమానున్నూ ఈ కళను అభ్యసించేటందు కిదివరకే అంగీకరించారు. ఈ ఉత్తమ స్త్రీలు వడకడం నేర్చుకొని, ప్రతిరోజూ కొంత నూలును నిర్ణీత ప్రమాణంలో మతధర్మంగా దేశానికి సమర్పిస్తారని నా నమ్మకం.

ఈ ఉత్కృష్టమైన కళను పునరుద్ధరించే ప్రయత్నంచూచి నవ్వే మిత్రులున్నారని నాకు తెలుసును. మిల్లులు, కుట్టు యంత్రాలు, టైపు రైటర్లూ, ఉన్న ఈ రోజులలో పల్లెటూరి పాతరాట్నాన్ని పైకి తీయగలననుకొనేవాడు వెఱ్ఱివాడు తప్ప మఱొకడుండడని వారు నాకు జ్ఞాపకం చేస్తూంటారు. అయితే కుట్టుయంత్రంవలన సూది ఇప్పటికీ తన స్థానాన్ని కోల్పోలేదనీ టైపురైటరు ఉన్నంత మాత్రంతో చేయి తన నైపుణ్యమును పోగొట్టుకోలేదనీ ఈ స్నేహితులు విస్మరిస్తున్నారు. పూటకూళ్లు కొంపలతోపాటు కుటుంబాలలో వంట యిళ్లు ఉన్నట్లే, వడుకు యంత్రాలతోపాటు రాట్నం ఎందుకు ఉండకూడదో యెంతమాత్రమూ కారణం కనిపించడంలేదు. నిజానికి టైపు రైటర్లూ కుట్టుయంత్రాలూ పోతే పోవచ్చును. కాని సూదీ ఈకకలమూ చిరస్థాయిగా

ఉంటవి. మిల్లులు నాశనం కావచ్చును. రాటం మాత్రం దేశానికవసరం. ఎక్కడ రాటం తమ స్వల్ప సంపాదనకు తోడు మరికొంత అదనపు ఆదాయాన్ని తిరిగీ చేకూరుస్తున్నదో ఆ పేదల కుటీరములకుపోయి, అక్కడివారిని చరఖా 'తమకు సంతోషం కల్పిస్తూన్నదా' అని అడిగి తెలుసుకోండని సంశయాత్ములగు వారికి సలహా యిస్తున్నాను.

శ్రీ రేవాశంకర జగ్జీవన్ ఇచ్చిన బహుమతి ఫలప్రదమయ్యే సూచనలు కనిపిస్తూండడం మన అదృష్టం. కొద్ది కాలం లోనే పునరుజ్జీవింపచేయబడిన రాటం భారతదేశంలో ప్రత్యక్షంకాగలదు. అది దక్షిణాపథమునందలి ఒకానొక ఓర్పుగల శిల్పియొక్క అద్భుత సృష్టి. అది మామూలు వస్తువులతో చేయబడింది. దానిలో పెద్ద చిక్కేమీ లేదు. అది చౌకగా ఉంటుంది. దానిని తేలికగా మరమ్మతు చేయవచ్చును కూడా. మామూలు రాటంకంటె దానిమీద ఎక్కువ దారం వస్తుంది. అయిదేళ్ల పిల్లవాడుగానీ పిల్లగానీ దానిమీద వడకవచ్చును.

ఈ నూతనయంత్రం అనుకొన్నట్లుగా ఉన్నా ఉండక పోయినా, చే వడుకు చేనేతల పునరుద్ధరణం భారతదేశపు టార్థిక నైతిక పునరుజ్జీవనానికి అత్యంతం తోడ్పడగలదని నా విశ్వాసం. వ్యవసాయానికితోడు లక్షలాది ప్రజా సామాన్యానికి మరొక చిన్న వృత్తి ఉండాలి. అనేక సంవత్సరాలకిందటివరకు నూలు వడకడం కుటీర పరిశ్రమగా ఉండేది. పస్తులు ఉండకుండా లక్షలాది ప్రజలను రక్షించవలెనంటే వారి యిళ్లలో నూలువడుకు వృత్తిని తిరిగీ అవలంబించేటందుకవకాశాలు కల్పించాలి. ప్రతి గ్రామానికీ తిరిగీ ఒక సొంత నేత మనిషి ఉండాలి.

—యంగిండియా, 21-7-1920

# 7

# స్వదేశీ

'చరఖా సంగీతం' అనే శీర్షిక కింద నేను వ్రాసిన వ్యాసాన్ని ఈ మధ్య ఒకనాడు విమర్శిస్తూ 'లీడరు' పత్రిక నేనెన్నడూ అనుకోని అభిప్రాయాలను నాకాపాదించింది. స్వదేశీ యొక్క నిజమైన విలువను గ్రహించేటందుకు ప్రచారంలోనున్న కొన్ని మిథ్యావాదాలను సరిదిద్దడం అవసరం. మిల్లు నూలుకూ మిల్లు బట్టకూ బదులుగా చేతితో వడకిన నూలునూ చేనేతబట్టనూ ప్రవేశ పెట్టేందుకు ప్రయత్నించడంవల్ల, నేను అభ్యుదయ కాలాన్ని వెనుకకు మరలిస్తూన్నట్లు 'లీడరు' అభిప్రాయ పడుతూన్నది. ఇప్పుడు నేనాయత్న మెంతమాత్రమూ చేయడంలేదు. మిల్లులతో నాకు తగాదా లేదు. నా అభిప్రాయాలు నమ్మడానికి వీలు లేనంత సులభమైనవి. ఇండియాలోని ప్రతి మనిషికీ సంవత్సరానికి 13 గజాలు బట్ట కావలసి ఉన్నది. ఇందులో సగం కంటె తక్కువగానే ఈ దేశంలో ఉత్పత్తి అవుతూందని నేననుకొంటున్నాను. ఇండియా తనకు కావలసిన ప త్తియావత్తూ యిక్కడే ఉత్పత్తి చేసుకొంటుంది. ఈ దేశం జపానుకూ ల్యాంకషైరుకూ కోట్లకొలదీ బేళ్ల ప త్తిని ఎగుమతి చేస్తుంది. అందులో చాలాభాగం తయారైన బట్టల రూపంలో తిరిగీ ఈ దేశానికి దిగుమతి అవుతుంది. ఇండియా తనకు కావలసిన యావత్తు బట్టనూ, యావత్తు నూలునూ చేతితో నేయడం వలననూ చేతితో వడకడం ద్వారానూ ఉత్పత్తి చేసుకోగలిగిన స్థితిలో ఉండికూడా అలా చేస్తూన్నది. ప్రధాన వృత్తియైన వ్యవసాయానికి తోడు ఇండియాలో మరొక అదనపు

వృత్తికి అవసరం ఉంది. లక్షలాది ప్రజలకు సరిపోయిన అటువంటి వృత్తి నూలువడకడం ఒక్కటే. ఒక శతాబ్దంకిందట అది దేశీయులంతా చేసేపనిగా ఉండేది. ఆర్థిక సంక్షోభమూ, ఆధునిక యంత్రాలు, చేవడుకు చేనేతలను నాశం చేసినవనేమాట వాస్తవంకాదు. ఈస్టిండియా కంపెనీ వారవలంబించిన అవినీతికరమైన అసామాన్య పద్ధతుల మూలమున ఈ గొప్ప పరిశ్రమ నాశనమయింది. జాతీయాభిరుచిలో పరివర్తనం కలిగించి ఎక్కువ కృషి చేసినందువలన, మిల్లు పరిశ్రమకు హానిచేయకుండానే ఈ గొప్ప పరిశ్రమను పునరుద్ధరించవచ్చును. బట్టల లోటును భర్తీచేయడానికి ప్రస్తుతం మిల్లుల అభివృద్ధి చికిత్స కాజాలదు. చేవడుకు, చేనేతలవల్ల ఆ లోటును తేలికగా భర్తీ చేయవచ్చును. ఈ వృత్తి పునరుద్ధరింపబడిన యెడల అది ఈ దేశంనుండి యేటేటా పోతూన్న అరవై కోట్ల రూపాయలను పోకుండా ఆపివేయగలదు. ఆ సొమ్మును లక్షలకొలది పేదగాండ్రకు వారి కుటీరములలోనే పంచి పెట్టవచ్చును. కాబట్టి ప్రజలను పీల్చి పిప్పిచేస్తూన్న భారతదేశ దారిద్ర్య సమస్యను స్వదేశీ దానంతటదే కొంతవఱకైనా పరిష్కరించగలదని నా అభిప్రాయము. అనావృష్టి కాలాలలో అది అమర్చి పెట్టిన భీమాపట్టగాకూడా ఉపయోగపడుతుంది:

అయితే దీనిని పునరుద్ధరించేటందుకు రెండు పనులు చేయవలసి ఉంది. ఖద్దరు నందభిరుచిని గలిగించడం, ఏకినదూదిని పంచిపెట్టేటందుకూ డబ్బిచ్చి నూలును సేకరించేటందుకూ ఒక సంస్థను నిర్మించడం.

ఒక్క సంవత్సరంలో, ప్రకటనలేకుండా కొద్దిమంది కావించిన కృషిఫలితంగా, అనేకవేల రూపాయలు గుజ

రాతులోని వేలకొలది పేదరాండ్రకు పంచిపెట్టబడినవి. వారు తమ పిల్లలకు పాలు వస్త్రాలు కొనుక్కోవడానికి కొన్ని కాసులు సంపాదించుకోగలిగినందుకు సంతోషపడుతున్నారు.

'లీడరు' పత్రిక ప్రయత్నించిన వాదం పంచదార పరిశ్రమకు వర్తించదు. ఇండియా అవసరాలను తీర్చేటందుకు తగినంత చెఱకు ఇండియాలో ఉత్పత్తికావడం లేదు. పంచదార జాతీయ పరిశ్రమగాగానీ అదనపు పరిశ్రమగాగానీ యెన్నడూ లేదు. విదేశీ పంచదార ఇండియా పంచదారను తొలగించలేదు ఇండియాకు పంచదార అవసరం లెక్కువైనందున ఇంకా ఎక్కువ పంచదారను దిగుమతి చేసుకొంటూన్నది. ఈ దిగుమతివలన బయటకు పోయేధనం, విదేశీ వస్త్రాల దిగుమతివలనపోయే ధనప్రవాహంవంటిది కాదు. పంచదారను ఎక్కువగా ఉత్పత్తి చేయడమంటే, శాస్త్రీయ వ్యవసాయాన్ని ఎక్కువచేయడం; చెఱకును పిప్పిచేసేటందుకూ పంచదారను మృదువుగా చేసేటందుకు ఉత్తమమైన యంత్రసామగ్రిని ఎక్కువగా తెప్పించడం; కాబట్టి పంచదార పరిశ్రమ అంతరువువేరు. స్వదేశీ పంచదార వాంఛనీయమే. కాని స్వదేశ వస్త్రం అత్యంతావసరం.

యంగిండియా, 18-8-1920

# 8

# స్వరాజ్య రహస్యం

స్వదేశీ ప్రాముఖ్యతనుగూర్చి, ఆవిషయంలో వర్తకులు చేయవలసిన ఎక్కువ త్యాగమునుగూర్చి, కాంగ్రెసు తీర్మానం సరిగానే వక్కాణించింది. కడచిన నూటయాభై సంవత్సరాలనుండీ బయటకుపోతూన్న ఆర్థిక ప్రవాహాన్ని, ఇండియా బుద్ధిపూర్వకంగా ప్రోత్సహిస్తూగానీ లేక సహిస్తూగానీ ఉన్నంతవరకు భారతదేశం స్వాతంత్ర్యం పొందజాలదు. విదేశీవస్తు బహిష్కారమంటే విదేశీవస్త్ర బహిష్కరణం కంటె ఎక్కువగానీ తక్కువగానీ కాదు. విదేశీ వస్త్రాల మూలకంగా పోయే అత్యంత ధన ప్రవాహాన్ని మనం బుద్ధిపూర్వకంగా పోనిస్తున్నాము. అనగా బట్టలకోసం ప్రతి సంవత్సరం మనం అరవైకోట్ల రూపాయలు చెల్లిస్తున్నాము. ఆ ధనప్రవాహాన్ని ఆపేటందుకు ఇండియా జయప్రదంగా కృషి చేయగలిగే యెడల, ఆ ఒక్క పని వల్లనే అది స్వరాజ్యం పొందగలదు.

విదేశీ వస్త్రోత్పత్తిదారుని దురాశను తృప్తిపఱిచేటందుకు భారతదేశం బానిసగా చేయబడింది. ఈస్టిండియా కంపెనీ ఈ దేశంలో అడుగుపెట్టినప్పుడు మనకు కావలసిన యావత్తు బట్టనూ మనము ఉత్పత్తి చేసుకోగలిగి ఉండడమే గాక, ఎగుమతికూడా చేస్తూండగలిగేవాళ్లము. ఇక్కడ వివరించవలసిన అవసరంలేని పద్ధతులద్వారా, ఇండియా వస్తుతః తనకు కావలసిన బట్టలకోసం పూర్తిగా విదేశీ ఉత్పత్తిపైన ఆధారపడి ఉంటూన్నది.

కాని మనమలా ఆధారపడి ఉండనక్కర లేదు. తన బిడ్డలందుకోసం కృషిచేసినట్లయితే, ఇండియాకు కావలసిన యావత్తు బట్టనూ అది ఉత్పత్తిచేసుకోగలదు. మిల్లులలో తయారైన బట్టకు అదనంగా ఉత్పత్తి చేయగల చేనేతవారు తగినంతమంది అదృష్టవశాత్తు ఇంకా ఇండియాలో ఉన్నారు మనకు కావలసిన యావత్తు బట్టనూ తక్షణం మిల్లులు ఉత్పత్తి చేయవు, చేయశాలవుకూడా. ఈక్షణానికికూడా మిల్లులలో తయారయ్యే బట్టకంటె, చేనేతవారే యెక్కువ బట్టను నేస్తున్నారనే సంగతి పాఠకునకు తెలియకపోవచ్చును. కాని మిల్లులు సన్నని విదేశీ నంబర్లలో ఐదుకోట్ల గజాలు సరుకు ఉత్పత్తిచేస్తున్నవి. అది ముతక నంబర్లలో నలభైకోట్ల గజాలకు సమానం. విదేశీవస్త్ర బహిష్కరణము జయప్రదం కావడానికి మార్గం నూలు ఉత్పత్తి యెక్కువచేయడమే. ఈ పని చేతితో వడకడంవల్లనే జరుగగలదు.

అటువంటి బహిష్కారాన్ని ఆచరణలోకి తెచ్చేటందుకు మన వర్తకులు విదేశీ దిగుమతిని ఆపివేసి, ఇండియాలో ఇదివరకు నిలవచేయబడిన విదేశీ బట్ట అంతా నష్టానికైనాసరే, ముఖ్యంగా విదేశీ క్రేతలకే అమ్మివేయడం అవసరం. వారు పత్తి వ్యాపారంలో లాభం సంపాదించే ఉద్దేశం మానుకోవాలి. పత్తి యావత్తూ ఇక్కడ ఉపయోగంకోసం ఉంచివేయాలి. విదేశీ పత్తిని కొనడం పూర్తిగా మానివేయాలి.

మిల్లు యజమానులు తమ మిల్లులను లాభంకోసంగాక, అవి దేశంయొక్క సొత్తు అనుకొని పనిచేయాలి. కాబట్టి వారు సన్నని నూలును ఉత్పత్తిచేయడం మాని, ఇక్కడ వ్యాపారానికి కావలసిన బట్టను మాత్రమే నేయాలి.

గృహస్థులు గృహిణులూ అందచందాలనుగూర్చి తమ కిది వరకుగల అభిప్రాయాలను కనీసం తాత్కాలికంగానైనా మార్చుకొని, శరీరాచ్ఛాదనంకోసం యెల్లప్పుడూ ధరించని నాజూకు బట్టలను ఉపయోగించడం నిలిపివేయాలి. నిష్క ళంకమైన తెల్లని ఖద్దరులోని కలాసౌందర్యమును గ్రహించి అందులోని మెత్తని గొగ్గితనాన్ని మెచ్చుకోగలిగేటందుకు తగిన శిక్షణ పొందాలి. లోభి తన ద్రవ్యాన్ని వాడుకొన్న ట్లుగా గృహస్థు తన బట్టలను వాడుకోవడం నేర్చుకోవాలి.

దుస్తులనుగూర్చి గృహస్థులు అభిరుచులను మార్చుకొన్నప్ప టికీ, నేతవారు నేసేటందు కెవరో ఒకరు నూలువడకాలి. ఈ పని ప్రేమకొరకుగానీ డబ్బుకోసంగానీ ప్రతివారూ తీరిక సమయాలలో వడుకుతూండడంవల్ల జరుగుతుంది.

మన మొక ఆధ్యాత్మిక యుద్ధంలో చిక్కుకొని ఉన్నాము. మనం సాధారణ సమయాలలో జీవించడం లేదు. అసాధారణ కాలాలలో ఎప్పుడూ సాధారణ వ్యవహారాలు తాత్కాలికంగా ఆపివేయబడతవి. ఒక్క సంవత్సరంలో స్వరాజ్యం సంపాదించే యత్నంలో మనమున్నామంటే, తక్కినవన్నీ విడిచిపెట్టి మన ధ్యేయం మీదనే మనం కేంద్రీకరించవలెనని అర్థం. కాబట్టి భారత దేశంలోని విద్యార్థులందరూ ఒక్క సంవత్సరం పాటు తమ మామూలు చదువులన్నిటినీ మానివేసి చేతితో వడికిన నూలును ఉత్పత్తి చేయడానికి తమ కాలాన్ని వినియో గించవలసిందని నేను సూచించ సాహసిస్తున్నాను. అది మాతృదేశానికి వారు చేయగలిగిన అత్యుత్కృష్ట సేవ. స్వరాజ్య సంపాదనకువారు మిక్కిలి సహజంగా చేయగలిగిన సాహాయ్యం. కడచిన యుద్ధంలో మన పరిపాలకులు

ప్రతి యంత్రాలయాన్నీ, తుపాకి గుండ్లను తయారుచేసే ఆయుధాగారంగా మార్చివేసేటందుకు ప్రయత్నించారు. ఈ మన యుద్ధంలో ప్రతి జాతీయ పాఠశాలా కళాశాలా కూడా, దేశంకోసం నూలుకదుళ్లను తయారుచేసే యంత్రాలయంగా మార్చివేయబడవలెనని నేను సూచిస్తున్నాను. ఈ పనివలన విద్యార్థులకు పోయేదేమీ లేదు. వారికెప్పుడూ ఇకముందూ కూడా ఒక రాజ్యం లభిస్తుంది. ఇండియాలో బట్టకఱవు వుంది. ఈ క్షామ నివారణకు సహాయపడడంలో నిశ్చయంగా సుగుణం ఉంది. విదేశీ నూలునుపయోగించడం పాపం; విదేశీ నూలును ఉపయోగించకపోవడంవలన కలిగిన లోటును భర్తీచేసేటందుకు వీలుగా స్వదేశీ నూలును ఎక్కువ ఉత్పత్తిచేయడం పుణ్యం.

నూలు ఉత్పత్తి అంత అవసరమే అయితే ప్రతిపేద వానికీ ఆ పనికేమైనా ఎందుకు మట్టచెప్పకూడదని ప్రశ్నించడం సహజం. చేతితో నూలు వడికే పని నేత, వడ్రంగం వగైరాలవలె పూర్వమెన్నడూ వృత్తిగా ఉండలేదు. ఇప్పుడూ కాదు. భారతదేశానికి బ్రిటిష్ పరిపాలన రాక మునుపటి ఆర్థిక విధానమందు, తీరిక సమయాలలో నూలు వడకడం భారత స్త్రీలకు గౌరవ వృత్తిగా ఉండేది. ప్రస్తుతం మనకుగల వ్యవధిలో, ఈ కళను స్త్రీలలో పునరుద్ధరించడం దుస్తరం. కాని ఈ పని, నమ్మడానికి వీలులేనంత సులభం. దేశముయొక్క ఈ పిలుపును అందుకోవడం విద్యార్థులకు సుకరంకూడా. పురుషుల యొక్కయు, విద్యార్థులయొక్కయు ప్రతిష్ఠను యిది కించపఱుస్తుందని యెవ్వరూ దీనిని అక్షేపించకండి. స్త్రీలకు ఎక్కువ తీరిక ఉంటుంది. కనుక ఈ కళ వారిలోనే ఉండిపోయింది. ఇందులో లాలిత్యమూ సంగీతమూ ఉండి ఎక్కువ

శ్రమ లేనందువలన కూడా ఈ పని స్త్రీల ప్రత్యేక ధనమయింది. స్త్రీ పురుషులకిరువురికీ సంగీతం లలితంగా ఉన్నట్లే యిదికూడా లలితంగా ఉంటుందనే మాట నిజం. నూలు వడకడంలో స్త్రీల శీలరక్షణ, క్షామ నివారణ, ధరల చౌక—ఈ అన్నీ ఇమిడి ఉన్నవి. అందులో స్వరాజ్య రహస్యం ప్రచ్ఛన్నంగా ఉంది. మన పూర్వులు విదేశీ ఉత్పత్తిదారుని దుష్టప్రభావములకు లోనయిన పాపానికి నూలు వడికే పనిని పునరుద్ధరించడమే మనం కావించుకోవలసిన కనీస ప్రాయశ్చిత్తం.

విద్యార్థులు నూలు వడికే పనికి పూర్వ గౌరవాన్ని పునరార్జించిపెట్టగలరు. ఖద్దరును త్వరితంగా శిష్టానుమతం చేసే విధానమునకు వారు తోడ్పడగలరు. ఎందుకంటే తల్లిదండ్రులనబడే వారెవ్వరూ తమ పిల్లలు వడికిన నూలుతో తయారుచేయబడిన బట్టను ధరించడానికి నిరాకరించరు. విద్యావంతులీ కళను ఆచరణ పూర్వకంగా గుర్తించినప్పుడు భారతదేశపు నేతపనివాళ్ల దృష్టినిది ఆకర్షించక తప్పదు. పంజాబు దేశీయుని, సైనిక వృత్తినుండి గాక, ఇతర దేశాల నిరపరాధులైన స్వతంత్ర ప్రజలను హత్యకావించే పనినుండి తప్పించవలెనంటే మనం తిరిగీ వాని నేత వృత్తిని వానికిచ్చివేయాలి. పంజాబులో శాంతియుతంగా జీవించే జూలా జాతి నామావశేషంగా ఉన్నది. పాంచాల దేశపు నేతవాడు నిరాడంబరమైన తన వృత్తిని తాను తిరిగీ చేపట్టేటట్లు సావకాశం కలిగించే పని ఆ రాష్ట్రపు విద్యావంతులది.

పాఠశాలలలో ఈ మార్పును తీసుకొనిరావడమెంత సుకరమో, మన పాఠశాలలనూ కళాశాలలనూ ఈ పద్ధ

తులమీద ఎంత వేగంగా జాతీయం చేసేటందుకు వీలు కలదో, ముందు సంచికలో నిరూపించగలనని ఆశిస్తున్నాను. జాతీయం చేయబడిన మన పాఠశాలలలో నేను ప్రవేశ పెట్ట బోయే నూతన విషయాలేమిటని ప్రతి చోటా విద్యార్థులు నన్ను ప్రశ్నిస్తున్నారు. నేను తప్పకుండా నూలు వడ కడం ప్రవేశ పెడతానని ఖచితంగా చెప్తున్నాను. మన పూర్వపుటుపేక్షాభావం వలన కలిగిన కొఱత తీరేటందుకు ఈ పరివర్తన సమయంలో నూలు వడికే పనికీ తక్షణం జాతీయోపయోగకరములగు తదితర కార్య కలాపాలకూ, ప్రత్యేక శ్రద్ధ వహించవలసి ఉంటుందని ఇంతకుముం దెప్పుడూ అనుకోనంత స్పష్టంగా ఇప్పుడనుకొంటున్నాను. ఈ నూతన పాఠావళిని అభ్యసించేటందుకు విద్యార్థులే ఎక్కువ సాధన సామర్థ్యములను కలిగిఉంటారు.

అభ్యుదయ కాలాన్ని వెనుకకు మరలించేటందుకు నేను కోరుతున్నానా ? మిల్లుల స్థానంలో చేనూలు చేనేతలను ప్రవేశ పెట్టవలెనని నా అభిప్రాయమా ? రైలుకు బదులుగా మోటుబండిని ఉపయోగించవలెనని నా కోర్కెయా ? యంత్రాలను పూర్తిగా ధ్వంసం చేయడం నాకిష్టమా ? ఈ ప్రశ్నలు నన్ను కొంతమంది పత్రికా విలేఖకులూ, ప్రజా సేవకులూ అడిగారు. అందుకు నా జవాబిది : యంత్రాలు అంతర్ధానమయితే దుఃఖమూ పడను, వాటిని అనర్థంగానూ భావించను. కాని ప్రతి యంత్రాన్నీ ప్రతిఘటించవలెనన్నే అభిప్రాయం నాకు లేదు. మన మిల్లులలో తయారుచేయ బడే నూలుకూ బట్టకూ తోడుగా మఱికొంత ఉత్పత్తి చేసి, ఇండియానుండి బయటకు పోయే కోట్లను పోకుండా కూడ బెట్టి, ఆ ద్రవ్యాన్ని కుటీరాలలో పంచిపెట్టడమే నేను ప్రస్తుతం చేయదలచుకొన్న పని. భారత దేశంలోని

ప్రజలు తీరిక సమయాలలో నూలు వడకడానికి సంసిద్ధు లయ్యేటంతవరకూ నేనీ పని చేయజాలను. అందుకు నూలు వడకడం బ్రతుకు తెఱువుగాకంటె కూడా కర్త వ్యంగా ప్రజలలో ఎక్కువ వ్యాపకమయ్యేటట్లు నేను సాహసించి సూచించిన పద్ధతులనే మనమవలంబించవలెను.

—యంగిండియా, 19-1-1921

# 9

# మిలుల చేనూలు

"సర్వెంటు ఆఫ్ ఇండియా" పత్రిక నూలు వడకడాన్ని కూడా అవహేళన చేసింది. ఆ అవహేళన, విషయాలు తెలియనందువలన చేయబడిందని ఇప్పుడే రుజువు చేయగలను. నూలు వడకడం స్త్రీల శీలాన్ని కాపాడుతుంది. నేడు బహిరంగమైన రోడ్లమీద పని చేస్తూ తమ మానుషానికి భంగం కలిగే అపాయంలో తలచు ఉంటూన్న స్త్రీలు తమ్ము తాము రక్షించుకోవడానికిది సహాయపడుతుంది. అదీకాక నూలు వడకడంతప్ప, లక్షలాది స్త్రీలవలంబించతగిన వృత్తి మఱొకటి నాకు తెలియదు. ఇప్పటికే అనేక మంది స్త్రీలు తమ పవిత్ర గృహావరణములకు చేరుకొని నూలు వడకడం చేపట్టి, ఆ వృత్తి ఒకరికే తమ మహాభాగ్యమని చెప్పుకొంటున్నారని ఆ అపహాస్యం చేసిన విలేఖకునకు నేను తెలుపవలసి ఉంది. సంగీత సాధనానికి ఉన్న గుణాలు రాటానికీ కలవని నేనంటాను. ఎందువల్లనంటే అన్నానికీ బట్టకూ అలమటిస్తూన్న స్త్రీ పియానోకు అనుగుణంగా శ్రుతికలుపుతూ నృత్యం చేయడానికి ఒప్పుకోదు. కాని రాటం పని చేస్తూన్నప్పుడు స్త్రీలు ఆనందవికాసంతో ఉండడం నేను చూచాను. అందుకు కారణం ఆ పల్లెటూరి పని ముట్టు తమకు కూడూ గుడ్డా ఈయగలదనే సంగతి వారికి తెలిసి ఉండడమే.

నిజంగా భారతదేశపు నిరంతర దారిద్ర్య సమస్య నది పరిహరించడమే గాక కఱువును కూడా నివారిస్తుంది.

సాగు నీటి సరఫరా నిర్మాణాలను గూర్చి, కష్ట నివారణ కార్యములను గూర్చి ఉన్న అపకీర్తిని నేనెటిగినంతగా ఈ హాస్యం చేసే విలేఖకు డెటిగిఉండకపోవచ్చును. ఈ పనులు చాలావరకు మోసం. కాని నాకు సలహా యిస్తూన్న బుద్ధిమంతులు ప్రతి యింటా రాటాన్ని ప్రవేశ పెట్టేటందుకు శ్రద్ధచేసినట్లయితే, అదే దాదాపు క్షామ నిరోధమునకు సంపూర్ణ రక్షణ కాగలదని నేను వాగ్దానం చేస్తున్నాను. ఆప్టిగ్రియాను ఉదాహరించడంలో అర్థం లేదు. మా ప్రజల దరిద్రమును గూర్చి వారి అసమర్థతను గూర్చి నేను ఒప్పుకొంటాను. ఇండియా 'కామధేనువు' ను గూర్చి మాత్రమే నేను యోజించగలను. ఇండియాకు రాటమే కామధేనువు. ఈస్టిండియా కంపెనీ పరిపాలనకు ముందు ఇండియాలో ఇంటింటా రాటముండేది. భారత దేశం పత్తి పండించే దేశం గనుక, బయటనుండి ఒక గజం నూలును దిగుమతి చేసుకోవడం పాపంగా భావించాలి. ఆ విలేఖకుడుదాహరించిన అంకెలు అసంబద్ధంగా ఉన్నవి.

1917-18 లో ఇండియా 62·7 కోట్ల పౌనుల నూలును ఉత్పత్తి చేసీ కూడా, అనేక కోట్ల గజాల విదేశపు నూలును దిగుమతి చేసుకొన్నది. దానిని మిల్లులూ చేనేత వారూ కూడా నేశారు. నేడు మిల్లులు నేసే బట్టకంటె ఎక్కువ బట్టను మన నేతపనివారు నేస్తూన్నారనే సంగతి కూడా ఆ విలేఖకునకు తెలిసినట్లు కనిపించదు. అయితే అందులో ఎక్కువ భాగం విదేశీ నూలు. కాబట్టి మన నేతపనివారు విదేశాలలో నూలు వడికేవారికి సహాయం చేస్తున్నారన్నమాట. ఇందుకు బదులుగా మనం మరొక పని చేస్తూన్నట్లయితే నేనెక్కువ లెక్క పెట్టి ఉండే

వాణ్ని కాదు. నూలు వడకడం దాదాపు నిర్బంధంగా నిలిపివేయబడినప్పుడు దానికి బదులు, బానిసత్వము అల సత్వమూ తప్ప మఱొక పని యేమీ లేకపోయింది. మన మిల్లులు ఈ రోజున మనకు కావలసినంత నూలును తయారు చేయలేవు. ఒకవేళ చేయగలిగినా బలవంతంమీద గాని ధరలు తగ్గించవు. మిల్లు యజమానులు స్పష్టంగా ధనార్జనాపరులు. కాబట్టి వారు జాతీయావసరములనుబట్టి ధరలను సక్రమంగా నిర్ణయించరు. కనుక నిరుపేదలగు గ్రామస్థుల చేతులలో కోట్లాది రూపాయీలను ఉంచేటందుకే చేతితో నూలు వడికే పని ఉద్దేశింపబడింది. తీరిక కాలాన్ని సద్వినియోగం చేసేటందుకు ప్రతి వ్యావసాయిక దేశానికీ ఒక ఉపవృత్తి అవసరం. ఇండియా విషయంలో అటువంటి వృత్తి ఎప్పుడూ నూలు వడకడమే. ఏ వృత్తి ప్రపంచానికి కన్నెఱ్ఱగా ఉండినదో, దేని నాశనము భారత దేశపు అద్భుత వస్త్రపరిశ్రమలో ఒకప్పుడు సంపూర్ణంగా ప్రస్ఫుటమైన అప్రతిమాన కళావైదగ్ధ్యము యొక్క అంతర్ధానమునకూ బానిసత్వమునకూ దరిద్రమునకూ కారణభూతమయిందో, ఆ వృత్తియొక్క పునరుద్ధరణ ప్రయత్నం స్వప్నగతాదర్శమవుతుందా ?

ఇక కొన్ని అంకెలు: ఒక బాలుడు నాలుగు గంటలు పని చేస్తే రోజుకు పావు పౌను నూలు వడకగలడు. కాబట్టి 64,000 మంది విద్యార్థులు రోజుకు 16,000 పౌనుల నూలు వడకగలరు. ఒక నేత మనిషి 2 పౌనుల నూలును నేయగలిగితే 8,000 మంది నేతవాళ్లను వారు పోషించగలరు. నూలు వడకడం బహుళ వ్యాప్తిచేసేటందుకున్నూ వడుకు నూలు ఉత్పత్తికి ఇంకా అదనం చేకూర్చేటందుకున్నూ ఈ పవిత్ర సంవత్సరంలో, ఈ యేటి ఉత్పత్తి అంతటినీ మించి

పోయేటట్లు విద్యార్థులూ తదితరులూకూడా వ్రతంగా నూలు వడకవలెనని కోరబడుతూన్నారు. ఆ పని చేయడానికి మన దేశీయులు చాలా సోమరులుగా ఉండవచ్చును. కాని అందరూ ఈ పనికితలొంక చేయివేస్తే యిది నమ్మడానికి వీలులేనంత తేలిక పని. ఇందుకు కావలసింది చాలా తక్కువ త్యాగం. ఇందువలన ఏమిజరుగక పోయినా ఏటేటా పోయే అరవై కోట్ల రూపాయలు మాత్రం ఆదా అవుతవి. ఈ విషయం నేను అనేకమంది మిల్లు యజమానులతోనూ, అనేకమంది అర్థశాస్త్రజ్ఞులతోనూ, వ్యాపారస్థులతోనూ చర్చించాను. కాని యే ఒక్కరూ కూడా యిక్కడ ప్రతిపాదింపబడిన పరిస్థితిని కాదనజాలక పోయినారు. 'సర్వెంటు ఆఫ్ ఇండియా' ముఖ్య విషయమునుగూర్చి శ్రద్ధగా సరియైన విషయ పరిజ్ఞానంతో విమర్శ చేయవలెనని అనుకొంటున్నాను.

—యంగిండియా, 19-2-1921

# 10

# స్వదేశీ

అనన్య సాధారణమైన తీవ్ర పద్ధతిలో జరుగవలసిన స్వదేశీ ప్రచారం దాని క్రమంలో అది వచ్చింది. అది సహాయ నిరాకరణ కార్యక్రమంలో ఒక భాగంగా ఉండినది; ఇప్పుడుంటూన్నదికూడా. ఆ కార్యక్రమ మంతటిలోకీ అది పెద్దదీ సురక్షితమైనదీ, నిశ్చితమైనదీ అని నా అభిప్రాయం. దాని ప్రస్తుతరూపంలో, ఇంతకంటె ముందుగా దానిని చేపట్టడానికి వీలు లేకపోయింది. రాట్నాన్ని గూర్చి దేశం స్పష్టంగా అర్థంచేసుకోవలసి వచ్చింది. పురాతనపు మూఢవిశ్వాసాలను, పూర్వద్వేషాలను పోద్రోలవలసివచ్చింది. కేవల బ్రిటిష్ వస్తు బహిష్కరణమూ సకలవిదేశీ వస్తు బహిష్కరణమూ కూడా సమానంగా నిష్ప్రయోజనకరములన్న సంగతి దేశం గ్రహించవలసి వచ్చింది. వస్త్ర పరిశ్రమ విషయంలో స్వదేశీ వ్రతమును విడచినందువలననే తన స్వాతంత్ర్యాన్ని పోగొట్టుకొన్నదనీ, తిరిగీ చేతితో వడికిన నూలుకూ చేతితో నేసిన బట్టకూ పూనుకొన్నట్లయితే మరల తన స్వాతంత్ర్యాన్ని పొందగలదనీ దేశం తెలుసుకోవలసి వచ్చింది. ఈ ఉపవృత్తి పోయినందున భారతదేశపు శక్తి పీల్చి పిప్పి చేయబడినంతగా సైనిక వ్యయము వలన కూడా జరుగలేదనీ, భారతీయ జీవితంలో కఱువులు నిత్య సంఘటనలు కావడం యిందువల్లనేననీ, దేశం అవగాహన చేసుకోవలసి వచ్చింది. ప్రతి రాష్ట్రంలోనూ రాటమునందు విశ్వాసంగల మనుష్యులు కావలసి వచ్చింది.

ఖద్దరు ఉపయోగము యొక్క సౌందర్యాన్ని ప్రజలు గ్రహించవలసివచ్చింది.

ఇప్పుడివన్నీ జరిగినవి. ఈ జాతీయ ధర్మాన్ని పునరుద్ధరించేటందుకు కోటి మంది స్త్రీ పురుషులూ కోటిరూపాయిలూ కావలసిఉంది. ఏవో కొన్ని చర్ఖాలనుగూర్చిన సమస్య కాదిది. ఆరు కోట్ల యిళ్లలో ప్రతిఒక్క దానిలోనూ చర్ఖానుస్థాపించడాన్ని గూర్చిన సమస్య. ఇండియాకు కావలసిన యావత్తు బట్టనూ ఉత్పత్తిచేసి పంచిపెట్టవలసిన సమస్య. అది ఒక కోటి రూపాయిలతో జరిగే పనికాదు. కాని భారత దేశం ఒక కోటి రూపాయిలను ఒక కోటి మంది మనుష్యులను యిచ్చి, 30 జూన్‌లోగా సరిగా పనిచేస్తే 20 లక్షల రాటాలను ఇంటికొకటి వంతున ప్రవేశపెట్టేయెడల అది దాదాపు స్వరాజ్యానికి సంసిద్ధంగా ఉన్నట్టే. ఎందువల్లననగా ఈ పనివలన జాతి అంతలో, జాతిని ఉత్తమంగా ఆత్మవిశ్వాసంకలదిగా స్వయం సమృద్ధంగా చేయగలిగిన అన్ని గుణాలూ సృజింపబడగలవు. జాతి స్వేచ్ఛగా చేసిన కృషివలన విదేశీ వస్త్రాలను పూర్తిగా బహిష్కరించగలిగినట్లయితే స్వరాజ్యానికది సంసిద్ధంకాగలదు.

అప్పుడు భారతదేశపు నగరాలలోని అనేక కోటలు భారత స్వాతంత్ర్యానికి అవమానకరంగానూ భయంకరంగానూ తోచడానికి బదులు ఇండియాలోని పిల్లల కేళీ స్థలాలు కాగలవని వాగ్దానం చేస్తున్నాను. ఇంగ్లీషువాళ్లకూ మనకూ ఉండే సంబంధాలప్పుడు నిష్కళంకంగా ఉండగలవు అప్పుడు లాంక్‌షైరు వోటు మలిన రహితంగా ఉంటుంది. ఆంగ్లేయుల కిష్టమైతే, వారు మనతో సమానంగా స్నేహితులవలె ఒకేఒక ఉద్దేశంతో—ఇండియాకు లాభం

చేకూరుస్తూ సహాయపడే ఉద్దేశంతో—ఇండియాలో ఉంటారు. ఆంగ్లేయులు గౌరవ ప్రదమైన షరతులతో మనతో సహకారం చేయవలెననీ లేదా మన దేశం నుండి వారు విరమించవలెననీ తెలియ చెప్పేటందుకే అసహాయోద్యమం ఉద్దేశింపబడింది. మన ఆత్మగౌరవానికీ ప్రతిష్ఠకూ అనుగుణంగా వాటిని స్పష్టంగా వివరించి చెప్పేటందుకే ఆ ఉద్యమం. అయితే దానిని ఏ పేరు పెట్టియైనా పిల్చుకోండి! దానిని 'స్వదేశీ' అనండి! 'మితపానము' అనండి. ఈ కడచిన నెలలలో చేసిన పని అంతా వృథా అనుకోండి. అశేషజనమూ నూలు వడికేటట్లు, త్రాగుడు నేరమయ్యేటట్లు చేయడంలో, దేశీయులతో సహకరించవలెనని ప్రభుత్వాన్నీ మితవాద మిత్రులను కోరుతున్నాను. ఈ రెండు ఉద్యమాల ఫలితమును గూర్చి యేపక్షంవారూ కూడా ఊహించనక్కరలేదు. కాయనుబట్టి చెట్టును తెలుసుకోవచ్చును.

—యంగిండియా, 20-4-1921

# 11

# చరఖా సందేశం

రాట్నాన్ని శ్లాఘిస్తూ ఒకానొక విలేఖకుడు వ్రాసిన చిన్న వ్యాసాన్ని 'ఇండియన్ సోషల్ రిఫార్మరు' పత్రిక ప్రకటించింది. ఆయన తన అభిప్రాయాలను ప్రకటిస్తూ, వడికే వాళ్లకు విసుగు పుట్టని విధాన ఈ ఉద్యమ నిర్మాణం జరుగవలెననే ఆశలను వెలువరించాడు. అమృతలాల్ ఠక్కర్ వ్రాసిన అమూల్యమైన లేఖలో (సర్వెంటు ఆఫ్ ఇండియాలో ప్రకటింపబడింది) కథియవాడులోని తన ప్రయోగములను గూర్చి వ్రాస్తూ, కర్షక స్త్రీలు చరఖాను చేపట్టారని చెబుతున్నాడు. చరఖాతో వారు విసిగి పోతారనడానికి వీలు లేదు. ఎందువల్లననగా పూర్వంనుండీ అది వారికి జీవనాధారంగా ఉండి అలవాటైనపని. ఆ వృత్తి శుష్కించి పోవడానికి కారణం నూలు కావలెననే వారు లేక పోవడమే. శిష్టాచారంగాగానీ వ్యసనంగాగానీ వడకడం ప్రారంభించిన పట్టణవాసులకు విసుగు పుట్టవచ్చును. ఈ నాడు దేశానికి అత్యంత ప్రయోజనకరముగానున్న పనికి వారి తీరిక సమయాలను వినియోగించడం విధిగా భావిస్తున్న వారు మాత్రమే విశ్వసనీయులు కాగలరు. పాఠశాలకు పోయే పిల్లలు నూలు వడికే వారిలో మూడవ వర్గంవారు. జాతీయ పాఠశాలలలో చర్ఖాను ప్రవేశ పెట్టడం ద్వారా మహత్తమ ఫలితాలు కలుగగలవని నా ఆశ. ఇండియాలోని ఏడు లక్షల యాభై వేల గ్రామాలలో విద్యావ్యాపకం చేయడాని కత్యంత శక్తివంతమైన పరికరంగా చర్ఖాను గూర్చి నమ్మే ఉపాధ్యాయులు, శాస్త్రీయ పద్ధతుల మీద దానిని

నడిపే యెడల, విసుగు పుట్టే అపాయం లేకపోగా అదనపు పన్నులు లేకుండానూ, అవినీతికరమైన ప్రభుత్వాదాయం మీద ఆధారపడకుండానూ సామాన్యజనుల విద్యాభ్యాసానికి కావలసిన ఆర్థిక సమస్యను పరిష్కరించే సావకాశాలుకూడా దేశానికి చాలా ఉన్నవి.

రాటమ్ముపైన సన్నని నంబర్ల నూలు తీసేటందుకు ప్రయత్నించవలెనని 'ఇండియన్ సోషల్ రిఫార్మరు'కు వ్రాసిన విలేఖకుడు సూచిస్తున్నాడు. ఆ పని యిదివరకే ప్రారంభమైనదని ఆయనకు నేను నచ్చచెప్పవలసి ఉంది. అయితే ఢాకా మజ్లినువంటి నూలును తీయడానికిగాని లేక చివరకు ఇరవయ్యో నంబరునూలును తీయడానికిగానీ కూడా కొంతకాలం పడుతుంది. కడచిన సెప్టెంబరు నెలలో మాత్రమే చేతితో నూలు వడికే పని పునరుద్ధరింపబడినదనీ, డిశంబరులో మాత్రమే దానిని గూర్చి భారతదేశం కొంతవరకు నమ్మడం మొదలుపెట్టిందనీ తెలుసుకొన్నప్పుడే జరిగిన అభివృద్ధిని అద్భుతంగా పరిగణించాలి.

చేతితో వడికిన నూలును, వడికినంత త్వరగా నేయడం లేదని ఆ విలేఖకుడు చేసే ఆరోపణ కొంత వరకు నిజమే. కాని దాని పరిష్కారం, ఇప్పుడున్న నేతవారిని పడుకునూలు నేయవలసిందని ప్రోత్సహించడంలో ఉన్నంతగా, మగ్గాల సంఖ్యను ఎక్కువ చేయడంలో లేదు. వడకడంకంటె నేయడం చాలా చిక్కులతో కూడిన పని. అది వడకడం వలె ఉపవృత్తి కాకపోగా పూర్తియైన జీవనాధారంగా ఉంది. అందువల్ల అది ఎన్నడూ పూర్తిగా మరణించలేదు. ఇండియాలోకి దిగుమతి అయ్యే యావత్తు బట్టను, బాకుండా చేసేటందుకు తగినన్ని మగ్గాలు తగినంతమంది నేసేవాళ్లు ఇండియాలో ఉన్నారు. మన మగ్గాలు—మద్రాసు మహా

రాష్ట్రం, వంగదేశాలలో వేలకొలదీ ఉన్న మగ్గాలు- జపాను మాంఛేస్టరులనుండి దిగుమతీ అవుతూన్న సన్న నూలును నేయడంలో నిమగ్నములై ఉన్న సంగతి గ్రహించ వలసి ఉంది. చేతితో వడికిన నూలును నేసేటందుకు వీటిని మనముపయోగించుకోవాలి. అందుకొఱకు సన్నగా ఆడం బరంగా ఉండి నిరుపయోగములైన మజ్లినులను గూర్చిన మన అభిరుచిని మన జాతి మార్చుకోవలసి ఉంది. శరీరాన్ని ఆచ్ఛాదించడానికి బదులు బట్టబయలుచేసే మజ్లినులనేతలో నాకేమీ శిల్పం కన్పించదు. శిల్పాన్నిగూర్చి మన అభి ప్రాయం మారాలి. సాధారణ పరిస్థితులలో, అందరూ సన్ననిబట్ట నేయడం వాంఛనీయమని అనుకొన్నప్పటికీ ప్రస్తుత సమయంలో మనం స్వతంత్రులము సావలంబకు లము కావడానికి బ్రహ్మాండమైన ప్రయత్నం చేస్తూన్నప్పుడు, మన వడుకు నూలుతో తయారైన బట్టతో మనం సంతృప్తిపడి ఉండాలి. కాబట్టి మనం ఒకవైపు మన ముతకబట్టలతో తృప్తిపడవలసిందని సౌందర్యాభిలాషులను కోరుతూ మరొక ప్రక్క ఎక్కువ సన్నంగానూ, ఎక్కువ మృదువుగానూ ఉండే నూలును వడకవలసిందని వడికేవాళ్లను ప్రబోధించాలి.

మిల్లు యజమానులు, తమ ఉత్పత్తులపైన వేసిన ధరలు తగ్గించాలని ఆ వి లేఖకుడు కోరుతున్నాడు. స్వదేశీ ప్రియులు ఖద్దరు ధరించడం తమ ధర్మమని అనుకొంటూ న్నప్పుడు, అవసరమైనన్ని చర్ఖాలు పనిచేస్తూన్నప్పుడు, నేసేవాళ్లు వడుకు నూలునే నేస్తూన్నప్పుడు, మిల్లు యజ మానులు ధరలు తగ్గించక తప్పదు. తమ లాభాలను పెంపొందించుకోవడమే ప్రధానాశయంగా పెట్టుకొన్నవారి దేశభక్తినిగూర్చి కేవలం ప్రార్థించడం దాదాపు నిష్ప్రయోజనమనిపిస్తుంది. బహిరంగనిమిత్తాలలో ఖద్దరు ధరిస్తూ

ఇతర సమయాలలో మంచి పోస్టైన ఇంగ్లీషు సూటులను వేస్తూండడం, ఖద్దరు ధారులుగా నున్నవారే చాలా ఖరీదు గల సిగరెట్లు తాగుతూండడం, మొదలైన పరస్పర విరుద్ధ విషయాలా లా విలేఖకునిచే ఎత్తిచూపబడినవి. అవన్నీ ఈ నూతన శిష్టాచారం బలపడినకొద్దీ కాలక్రమేణా అంత ర్థానం కావాలి. విదేశీ వస్త్ర బహిష్కారము పూర్తి కాగానే, ప్రస్తుత అసంబద్ధ విషయాలకు స్వస్తిచెప్పి ప్రజా హృదయంలో నాటుకొన్న నిరాడంబర గార్హస్థ్య లక్షణముల ఆదర్శాని కనుగుణంగా ఉండేటట్లు, జాతీయ జీవితమును సంస్కరించుకోగలమని నా దృఢనిశ్చయం. మనమప్పుడు ప్రపంచంలోవి దుర్బలతర జాతులను స్వార్థం కోసం వినియోగించుకోవడం పైననూ, ప్రశాంత జీవితమును దాదాపు అసంభవంగా చేసిన నౌకా విమాన దళాల రక్షణ కింద మత్తిల్లిన భౌతిక సభ్యతను చేపట్టడంపైననూ, ఆధార పడి ఉన్న సామ్రాజ్య తత్వంలోకి లాగబడము. పై పెచ్చు, ప్రపంచంలోని దుర్బలతర జాతులనుగానీ తెగలనుగానీ, పశు బలం వలనగాక స్వార్థత్యాగంవలన రక్షించడానికి తాము చేయతగినంత గొప్ప సహాయాన్ని చేయగల ప్రజాసత్తాక రాజ్యాల కూటమిగా ఆ సామ్రాజ్య విధానాన్ని సంస్క రించగలము. భావ ప్రపంచంలో ఇంతకు తక్కువ పరివర్త నమును దేనినీ అసహాయోద్యమముద్దేశించడం లేదు. రాటమునకు సంపూర్ణ విజయము కలిగినప్పుడే అటువంటి మార్పు రావడానికి సావకాశముంది. ఇండియాకు ముఖ్యా వసరాలయిన అన్న వస్త్రాల విషయంలో అది స్వయం సంపూర్ణముగానుండి ఆకర్షణలకూ దండయాత్రలకూ లొంగని స్థితిని పొందగలిగినప్పుడే, ఆ సందేశము నీయడానికి దాని కర్హత కలుగుతుంది. యంగ్ఇండియా—29-6-1921

# 12

## ఇండియాలోని ప్రతి ఆంగ్లేయునికీ *

విదేశీ వస్త్ర బహిష్కారంలోనూ, మద్యపాననిషేధోద్యమంలోనూ మాకు సహాయంచేయవలెనని మిమ్మలను కోరుతున్నాను.

ఆంగ్లేయ చరిత్రకారులు రుజువుచేసిన ప్రకారం లాంక్ షైరు బట్టలు ఇండియాపైన బలవంతంగా రుద్దబడడమే గాక, ఈ దేశపు ప్రపంచ విఖ్యాత పరిశ్రమ బుద్ధిపూర్వకంగా ఒక పద్ధతి ననుసరించి ధ్వంసం చేయబడింది. కాబట్టి, ఇండియా యిప్పుడు, ఒక్క లాంక్ షైర్ దయపైననే గాక, జపాన్, ఫ్రాన్సు, అమెరికాల దయపైనగూడా ఆధారపడి ఉంది. ఇండియాకు సంబంధించినంతవరకు దీని అర్థమేమిటో కొంచెం ఆలోచించండి. మేము ఇండియానుండి యేటేటా బట్ట కోసం బయటకు (ఇంచుమించుగా) అరవై కోట్ల రూపాయిలు పంపుతున్నాము. మా బట్టకు తగినంత పత్తిని మేము పండించుకొంటున్నాము. మా పత్తిని ఇండియానుండి బయటకు పంపి, అక్కడ దానిని బట్టగా తయారుచేయించుకొని నావలమీద మళ్లీ ఆ బట్టను ఇండియాకు తెప్పించుకోవడం పిచ్చికాదా? ఇండియా నటువంటి నిస్సహాయ స్థితిలోకి దించడం న్యాయ్యమా ?

ఒక నూటయాభై ఏండ్ల కిందట మా బట్టను యావత్తూ మేము ఉత్పత్తిచేసుకొన్నాము. మా స్త్రీలు తమ కుటీరాలలో సన్నని నూలువడికి, వారి భర్తల సంపాదనకు తోడు

* ఇండియాలోని ప్రతి ఆంగ్లేయునికీ అనే వ్యాసమునుండి.

కొంత అదనపు ఆదాయాన్ని చేకూర్చారు. గ్రామాలలోని నేతవారు దానిని నేశారు. మా దేశంవంటి విశాలమైన వ్యావసాయిక దేశంలోని ఆర్థిక విధానమునందది ఆవశ్యకమైన భాగంగా ఉండేది. మా విరామకాలాన్ని సద్వినియోగం చేసుకొనేటందుకది చాలా సహజంగా సహాయపడ్డది. ఈనాడు మా స్త్రీలు తమ హస్తకౌశల్యాన్ని పోగొట్టుకొన్నారు. అందువలన లక్షలాది ప్రజలు తప్పనిసరిగా సోమరులయినారు. దేశానికి దరిద్రస్థితి పట్టింది. చాలామంది నేతవారు ఊడుపు పనిచేస్తున్నారు. కొంతమంది జీతం పుచ్చుకొని సిపాయిలుగా పనిచేస్తున్నారు. కళానైపుణ్యంగల నేతవాళ్లలో సగం మంది నిర్మూలమైనారు. సున్నితంగా చేతితో వడికిన నూలు లభించకపోవడంచేత, తక్కిన సగం మంది నేతవారూ దిగుమతీ అయిన విదేశీ నూలును నేస్తున్నారు.

కాబట్టి ఇండియాలో విదేశీ వస్త్ర బహిష్కారమంటే ఏమిటో బహుశా ఇప్పుడు మీ కర్థమయి ఉంటుంది. అది ప్రతీకారంగా ఉద్దేశింపబడలేదు. ప్రభుత్వంవారీనాడు ఖిలాఫతు అన్యాయానికీ, పంజాబు దురంతాలకూ పరిహారం కల్గించి, ఇండియా తక్షణం స్వరాజ్యం పొందేటందుకు సమ్మతించినాకూడా, బహిష్కారోద్యమం ఇంకా కొనసాగుతూ ఉండవలసిందే. స్వరాజ్యమనగా, కనీసం దేశముయొక్క ఆర్థిక స్థిరత్వానికి ముఖ్యమైన పరిశ్రమలను భారతదేశంలో నిలుపుకొనేటందుకు, వాటి ఉనికికి భంగకరంగా ఉండే దిగుమతులను నిషేధించేటందుకూ అయినా అధికారం ఉండడమే. జాతీయ శరీరానికి వ్యవసాయమూ, నూలు వడకడం, రెండూ రెండు ఊపిరితిత్తులు. ఎలాగైనా సరే అవి రెండూ క్షీణించకుండా రక్షింపబడాలి.

ఈ పని ఇంకా ఎంతమాత్రం ఆలస్యం కావడానికి వీలు లేదు. వ్యవసాయానికి సహాయకారిగా ఉండే మంచి లాభప్రదమైన మరొక వృత్తికోసం జాతి యావత్తూ ఆల్లాడుతూన్నప్పుడు, విదేశీ ఉత్పత్తిదారులయొక్కయు భారతీయ దిగుమతిదారులయొక్కయు ప్రయోజనాలను గూర్చి ఆలోచించడానికి వీలు లేదు.

ఇది విదేశీ వస్తువుల కన్నిటికీ సంబంధించిన సాధారణ బహిష్కారోద్యమమని మీరు పొరపాటు పడకూడదు. అంతర్జాతీయ వ్యాపారంతో సంబంధం లేకుండా భారతదేశం ఏకాకిగా ఉండవలెనని కోరడం లేదు. ఇండియాకు వెలుపల ఉత్తమంగా తయారుచేయబడిన వస్తువులను, వస్త్రాలు కాక తక్కినవాటిని, ఉభయ పక్షాలకూ అనుకూలమైన షరతులతో, ఇండియా కృతజ్ఞతాపూర్వకంగా స్వీకరిస్తుంది. అంతేకాని ఏ వస్తువునూ బలవంతంగా దానికంట కట్టకూడదు. భావికాలములో ఏమి ఉన్నదో తొంగిచూడవలెననే కోరిక నాకు లేదు. కాని కొద్దికాలంలోనే ఇండియా దేశం ఇంగ్లాండుతో సమానప్రతిపత్తితో సహకారం చేసే సావకాశం కలుగుతుందని మాత్రం నేను నిశ్చయంగా ఆశిస్తున్నాను. వర్తక సంబంధాలను పరిశీలించేటందు కది తగిన తరుణం. విదేశీ వస్త్ర బహిష్కారాన్ని కొనసాగించేటందుకిప్పటికి మీ సహాయాన్ని అభిలషిస్తూన్నాను.

—యంగిండియా, 13-7-1921

# 13

# భారత మహిళలకు

ప్రియ సోదరీమణులారా !

లోకమాన్య తిలకు జ్ఞాపకార్థం బొంబాయిలో జూలై 31 వ తేదీని ప్రజ్వలింపచేయబడిన హోమాగ్నితో ప్రారంభమైన విదేశ వస్త్రబహిష్కారమును పూర్తిచేసేటందుకు తుది తేదీ సెప్టెంబరు 30 అని నిర్ణయించడంలో అఖిల భారత కాంగ్రెసు సంఘం అతి ప్రాముఖ్యమైన తీర్మానం చేసింది. ఇంతవరకూ మీరు సన్నంగానూ అందంగానూ ఉన్నట్లు భావించిన ఖరీదుగల చీరలూ తదితర దుస్తులూ కల పెద్ద కుప్పకు నిప్పంటించే భాగ్యం నా కొసగబడినది. తమ విలువగల దుస్తులను నా కీయడంలో సోదరీమణులు సముచితంగానూ వివేకంగానూ ప్రవర్తించినట్లు నే ననుకొంటున్నాను. వాటిని నాశనంచేయడం, ఆర్థికంగా వాటిని ఎంత అత్యుత్తమంగా ఉపయోగించేటందుకు వీలుకలదో అంత అత్యుత్తమంగానూ వినియోగించినట్లే. మహామారీ సంసర్గదూషితములైన వస్తువులను విధ్వంసంచేయడం అత్యుత్తమ ఆర్థిక వినియోగమైనట్లే అదీని. రాజకీయ జీవితంలో ఎక్కువ ప్రమాదకరములైన వ్యాధులనుండి తప్పించుకొనేటందుకు ఈ శస్త్రచికిత్స అవసరం.

కడచిన పండ్రెండు నెలలలో భారతదేశపు స్త్రీలు మాతృదేశం పక్షాన అద్భుతకార్యాలను నిర్వర్తించారు. మీరు కారుణ్యదేవతలవలె నిశ్శబ్దంగా పనిచేశారు. మీరు మీ అందమైన నగలను, డబ్బునూకూడా త్యాగంచేశారు. ధన

సేకరణకోసం మీ రింటింటికీ తిరిగారు. మీలో కొందరు పికెటింగులోకూడా సహాయపడ్డారు. నాజూకైన రంగు రంగుల చీరెలను ఉపయోగిస్తూ, రోజు కొన్ని మార్పులు చేసే అలవాటుగల మీలో కొందరు, ఇప్పుడు స్త్రీల సహజ పవిత్రతను స్మరింపచేసే పరిశుభ్రమైన తెల్లని బరువు ఖాదీని ధరిస్తున్నారు. ఇదంతా మీరు ఇండియాకోసం, ఖిలాఫతు కోసం, పంజాబుకోసం చేశారు. మీ మాటలోకానీ మీ పనిలోకానీ మాయా మర్మం లేదు. మీది కోప ద్వేషాలతో కళంకితంకాని స్వచ్ఛతమమైన త్యాగం. యావద్భారత దేశంలో మీరు ఐచ్ఛికంగానూ ప్రేమపూర్వకంగానూ నా పనికి కలసిరావడం చూస్తే దేవుడు నా పక్షాన ఉన్నట్లు నాకు నమ్మకం కలిగింది. ఈ సంగతి నేను మీ యెదుట ఒప్పుకోవాలి. లక్షలాది భారత మహిళలు మన పోరాటానికి ఉత్సాహంతో సహాయపడుతూండడంకంటె, అది ఆత్మ పరిశుద్ధతగల ఉద్యమమని చెప్పేటందుకు వేరే సాక్ష్యం అవసరం లేదు.

ఇదివరకే మీరు చాలా యిచ్చిఉన్నారు. ఇంకా ఎక్కువగా ఈయవలసిఉంది. తిలకుస్వరాజ్యనిధిలో ప్రధానభాగం పురుషులు భరించారు. అయితే స్వదేశీకార్యక్రమం పరిపూర్తికావడం అందరిలోకీ ఎక్కువగా మీరు పాల్గొంటే జరుగుతుంది. మీ విదేశీబట్టలను పూర్తిగా మీరిచ్చివేస్తేనే గాని బహిష్కరణోద్యమం సాధ్యంకాదు. కోరిక ఉన్నంత వరకూ సంపూర్ణత్యాగం సాధ్యంకానిపని. బహిష్కరణ మంటే సంపూర్ణత్యాగం. మనం దేవుడిచ్చిన పిల్లలతో కృతజ్ఞతాపూర్వకంగా సంతృప్తిపడుతూన్నట్లే, ఇండియా ఉత్పత్తిచేసిన బట్టతోకూడా సంతృప్తిపడేటందుకు సంసిద్ధం కావాలి. పరాయివాని కసహ్యంగా కనిపిస్తూన్నప్పటికీ తన

బిడ్డను తాను పారవేసిన తల్లిని నే నెకర్రూడా చూడలేదు. కాబట్టి ఇండియాలో ఉత్పత్తి అయిన వస్తువులనుగూర్చి దేశ భక్తిగల భారతమహిళలుకూడా అలాగే ఉండాలి. చేతితో వడికి, చేతితో నేయబడినవాటిని మాత్రమే భారతదేశములో ఉత్పత్తియైనట్లుగా మీరు భావించవలెను. ఈ పరివర్తన కాలంలో కావలసినంత ముతక ఖాదీమాత్రమే మీకు దొరుకు తుంది. మీ అభిరుచికి తగినట్లు దానికెంతైనా అంద చందాలు కల్పించుకోవచ్చును. కొన్ని నెలలవరకూ ఈ ముతక ఖాదీతో మీరు సంతృప్తిపడగలిగినట్లయితే, ఒకప్పుడు ప్రపంచానికి కన్నెఱ్ఱగానుండి నిస్ప్రహ కల్పించిన ఆనాటి రంగు రంగుల నాజూకు దుస్తుల పునరుద్ధరణ విషయంలో ఇండియా నిరాశ చెందనక్కర లేదు. ఆరునెలల పాటు ఆత్మ నిగ్రహం కలిగిఉంటే, ఈనాడు కళానైపుణ్యమనుకొనే దానిని, అలా తప్పుగా అనుకొంటున్నామనీ, నిజమైన కళాభిజ్ఞత కేవలం బాహ్య రూపములోగాక దానికి వెనుక నున్న విషయాన్ని గ్రహించడంలో ఉన్నదనీ అర్థమవుతుంది. అది నేను గట్టిగా చెప్పగలను. నిర్జీవంగా చేసే శిల్పమూ ఉంది, సజీవంగా చేసే శిల్పమూ ఉంది. పాశ్చాత్యదేశాల నుండిగానీ దూర ప్రాచ్యదేశాలనుండిగానీ మనం దిగుమతి చేసుకొంటూన్న నాజూకు బట్టలు, మన లక్షలాది సోదరీ సోదరులను అక్షరాలా చంపివేయడమేకాక, మన ప్రియ సోదరీమణులను వేలమందిని లజ్జాకరమైన వృత్తిలోకి దింపినవి. నిజమైన శిల్పం, ఆనందమూ, సంతృప్తీ కలిగిస్తూ శిల్పుల పవిత్రతకు ప్రతిబింబంగా ఉండాలి. అటువంటి శిల్పంమనలో పునరుద్ధరింపబడవలెనంటే మీలో ఉత్తములైనవారు ప్రస్తుతం ఖాదీ ధరించి తీరాలి.

స్వదేశీ కార్యక్రమం జయప్రదం కావడానికి ఖాదీ ధారణ మవసరం కావడమేకాక, మీలో ప్రతి ఒకటరూ మీ విరామ సమయాలలో నూలు వడకడంకూడా అవశ్యకమే. నూలు వడకవలెనని నేను పిల్లలకూ పెద్దవాళ్లకూకూడా సూచించాను. వారిలో వేలకొలది ప్రతిదినమూ వడుకుతున్నారని నాకు తెలుసు. కాని ఆ వడికేభారం ముఖ్యంగా, పూర్వంవలెనే, యిప్పుడుకూడా మీ మీదనే పడవలసి ఉంది. రెండు వందల సంవత్సరాలకిందట భారత స్త్రీలు ఇండియా కోసమేకాక విదేశాలకోసం కూడా వడికేవారు. వారు కేవలం ముతక నూలేకాక, ప్రపంచంలో కెల్ల సన్నని నూలు వడికేవారు. మన పూర్వులు వడికిన నూలుయొక్క సన్నదనాన్ని యే యంత్రమూ యింతవరకు అందుకోలేక పోయింది. ఈ రెండు నెలలలోనూ ఆ పిమ్మటనూ, కోరిన వారికల్లా ఖాదీని సరఫరా చేయవలెనంటే మీరు వడుకు క్లబ్బులు వడుకు పోటీలూ యేర్పాటుచేసి భారతదేశపు అంగళ్లను చేతితో వడికిన నూలుతో ముంచివేయాలి. అందుకోసం మీలోకొందఱు వడకడంలో, యేకడంలో, రాటాలను మరమ్మత్తుచేయడంలో నిపుణులు కావాలి. అనగా నిరంతరం కృషిచేయాలన్నమాట. నూలువడకడం ఒక బ్రతుకు తెఱువుగా మీరాలోచించకూడదు. మధ్యతరగతివారి కుటుంబాలకిది అదనపు ఆదాయాన్ని చేకూరుస్తుంది. నిరుపేదలైన స్త్రీలకిది నిస్సందేహంగా బ్రతుకు తెఱువే. రాటం పూర్వంవలెనే, వితంతువునకు ప్రేమాస్పదమైన సన్నిహిత మిత్రం. ఈ నా ప్రార్థనను చదివే మీకందఱికీ అది ఒక ధర్మం. భారతదేశంలోని భాగ్యవతులైన స్త్రీలందరూ ప్రతి దినమూ కొంత నూలు వడికేటట్లయితే వారు నూలు చౌక చేయగలగడమే కాక, మరొకవిధంగాకంటె, చాలా ఎక్కువ

తొందరలో అవసరమైన సన్నదనాన్ని దానికి తీసుకొని రాగలరు.

కాబట్టి ఇండియాయొక్క ఆర్థిక నైతిక మోక్షం ముఖ్యంగా మీ చేతులలో ఉంది. భావిసంతానాన్ని పెంచి, పెద్దచేసేది మీరే గనుక భారతదేశపు భవిష్యత్తు మీ ప్రార్థనలపైన ఆధారపడివుంది. మీరు భారతదేశపు పిల్లలను నిరాడంబరులు, దైవభీతిపరులు, ధైర్యశాలురూ అయిన స్త్రీ పురుషులుగా పెంచి పెద్దవారిని చేయవచ్చును. లేదా చలికీ కష్టానికీ ఓర్చుకోలేని దుర్బలులుగాను, విదేశీ నాజూకు తనాల కలవాటుపడి, పిమ్మట వాటిని విడిచిపెట్టడానికి కష్టపడేవారు గానూ తయారుచేయవచ్చును. ముందురాబోయేకాలదివారాలలో భారత మహిళ లెంతగట్టివారో తెలియగలదు. మీ నిర్ణయమును గూర్చి నాకేమాత్రమూ సందేహం లేదు. తన ఆత్మవిశ్వాసాన్ని కోల్పోయేటంతగా భారతదేశముయొక్క ఐశ్వర్యాన్ని స్వార్థంకోసం వినియోగించుకొన్న ప్రభుత్వం చేతులలో కంటె, ఇండియాయొక్క భవితవ్యంమీ చేతులలో చాలా ఎక్కువ క్షేమంగా ఉంటుంది. మహిళా సమావేశాలలో ప్రతి ఒక్కదానిలోనూ జాతియోద్యమానికి మీ ఆశీర్వాదాలను కోరాను. మీరు నిష్కళంకమైనవారు, నిరాడంబరమైన వారు, తగినంత దైవభక్తికలవారు కావడం చేత ఆ ఆశీర్వాదాలు ఫలప్రదం అవుతవనే నమ్మకంతో నేనలా కోరాను. విదేశీ వస్త్రాలను విడిచిపెట్టి, మీ తీరిక సమయాలలో ఎడతెగకుండా నూలువడకడంవల్ల మీ ఆశీర్వాదాలు ఫలప్రదమయ్యేటట్లు మీరు చేయగలరు.

సెలవు,
మీ ప్రేమాస్పదుడైన సోదరుడు,
యం. కె. గాంధీ.

—యంగిండియా, 11-8-1921

# 14

# విధ్వంసంలోని నీతి

మిస్టర్ ఆండ్రూస్ కడనుండి వచ్చిన జాలికరమైన చకరీని ఈ దిగువ ఉత్తరములోని విషయాలను తమతో కలిపి నేను పాల్గొనడం పాఠకులు ప్రశంసిస్తారని నిశ్చయంగా భావిస్తున్నాను.

“మీ విదేశీ వస్త్రదహనం పేదలకు సహాయంచేసే ఉద్దేశంతోనే నని నాకు తెలుసును. కాని అక్కడ మీరు పొరపడ్డారని నా అభిప్రాయం. మీరు విదేశీ వస్త్రాలను పూర్తిగా గానీలేక ఎక్కువ భాగంగానీ బహిష్కరించగలిగితే, మిల్లు బట్టలధర పెరిగి పేదవాళ్లకు దెబ్బతగులుతుందని స్వతస్సిద్ధంగా నాకు కనిపిస్తూన్నది. దానికి తోడు ‘విదేశీ’ అనే మాటలో జాతితత్వ ప్రబోధం సూక్ష్మంగా యిమిడి ఉంది. దానిని రోజుకు రోజుకూ నిరోధించవలసిందేగాని ప్రకోపింప చేయకూడదు. అందమైన బట్టలుకల ఆ పెద్దకుప్పను మీరు తగులపెడుతూన్నప్పటి దృశ్యం నన్నెక్కువ విభ్రాంతుణ్ని చేసింది. అత్యంత సుందరమగు మన ఈ ప్రపంచమునుగూర్చి మనం మరచిపోయి స్వార్థపరత్వంతో ఇండియాపైననే శ్రద్ధవహిస్తూన్నట్లు కనిపిస్తూన్నది. అది తిరిగీ ఆ పాతకాలంనాటి కుత్సితజాతీయతకు దారితీస్తూందేమోనని నా భయం. అలా అయినట్లయితే, నేటి ఐరోపా ఖండం యే విషచక్రమునుండి తప్పించుకోవడానికి నిరాశతో ప్రయత్నిస్తున్నదో ఆ విషచక్రంలోకే మనంకూడా పోతాము. కానీ నేను దానినిగూర్చి వాదించలేను. అది నన్ను విభ్రాంతుణ్ని చేసిందనీ నాకది దాదాపొక విధమైన హింసగా తోచిందనీ మాత్రం మరల చెప్పగలను; అయినా హింస అంటే మీకెంత అసహ్యమోకూడా నాకు తెలుసు. ఈ విదేశీ వస్త్రసమస్యను మతంగా చేయడం నాకెంతమాత్రమూ యిష్టంలేదు.

త్రాగుడు, గంజాయి, నల్లమందు, అంటరానితనం, జాత్యహంకారం, మొదలయిన ప్రధాన నైతిక దురభ్యాసములపైన మీరు బ్రహ్మాండమైన దెబ్బలు కొడుతూ భయంకరమగు పశువు వృత్తినిగూర్చి ఎంతో అద్భుతంగా, అందంగా, మార్దవంగా, ప్రస్తావించడంచూస్తే నాకు మహదానందం కలిగింది. కాని విదేశీ వస్త్రాలను బహిరంగంగా తగులపెడుతూ, వాటిని ధరించడం మతధర్మానికి అపచారం చేయడమని చెప్పడం, తోడి స్త్రీ పురుషులయొక్కయు విదేశీయులయొక్కయు విదేశాలలోని తోడి సోదరీ సోదరులయొక్కయు ప్రశస్తమైన చేతిపనిని ధరిస్తే మైలపడతారంటూ దానిని నిప్పులోవేసి నాశనంచేయడం—ఇదంతా నాకెంత విపరీతంగా కనిపిస్తూన్నదో నేను మీకు చెప్పలేకున్నాను. 'నేను నీకన్న ఎక్కువ పవిత్రుణ్ని' అని ఫారసీవాడు ఇతరులనుగూర్చి నిర్ణయించి అనేటట్లుగా నేనుకూడా కనిపిస్తానేమో అనే సందేహంతో మీరు నాకిచ్చిన ఖద్దరు ధరించేటందుకిప్పుడు నేను దాదాపు భయపడుతున్నానన్న విషయం మీకు తెలుసునా? ఈ విధంగా నేను మున్నెప్పుడూ అనుకొనిఉండలేదు.

మీరు చేసినపని యేదైనా నాకు కష్టంకలిగించినప్పుడు, 'ఇది నాకు కష్టం కలిగించింది' అని నేను మీకెంత గట్టిగా చెప్పవలసినవాడనో మీకు తెలుసును.

నేను మీ కిందుతో పంపిన మాడరన్ రివ్యూ వ్యాసాలను, మీ జీవితంలోని తత్వాన్ని నేను తెలుసుకోగలిగానన్న దృఢనిశ్చయంతో, ఎంతో సంతోషంగా ఆసక్తితో వ్రాశాను. ఇప్పుడు, మీరు హింసాపూర్వకమైన, వికారమైన, అస్వాభావికమైన, పనియేదో చేస్తూన్నట్లు నా మనస్సు మీకడ ఘోషపెడుతూన్నది. మీ సోదరుడేదో తప్పుచేస్తూన్నట్లు మీరనుకొన్నప్పుడు అతనిపైన మీ ప్రేమ బలవత్తరమైనట్లే, పూర్వంకంటె మీమీద నా ప్రేమ ఇప్పుడెక్కువ బలవత్తరమయింది. మీ భావమేమిటో నాకు చెప్పండి! తగులవేయడాన్ని గురించి మీరు 'యంగిండియా'లో వ్రాసినది నాకొక్క ముక్కకూడా నచ్చలేదు."

సరిగా ఆయనఅంతే. నేను చేసినపని యేదైనా ఆయనకు కష్టం కలిగించినప్పుడల్లా, నా జవాబుకోసం వేచి ఉండ

కుండానే ఉత్తరాలతో ఆయన నన్ను ముంచివేస్తాడు. (అలాచేయడం కేవలం ఇదే మొదటిసారికాదు.) అందుకు కారణం, ప్రేమప్రేమతో ముచ్చటించడమది. అంతేకాని వాదం చేయడంకాదు. అది మనస్సులో ఉన్న దుఃఖమంతా వలపోయడం. అందువలననే విదేశీ వస్త్ర దహనంపైనకూడా ఆయన ఆలా వ్రాశారు.

మిస్టరు ఆండ్రూస్ ప్రేమ పూర్వక భాషలో వ్రాసిన విషయాలే, నాతో యిదివరకే ఏకీభవించకుండా ఉన్న విలేఖకులు కోపంతో కఠినంగా అసభ్య భాషలోకూడా వ్రాశారు. ఆండ్రూసు మహాశయుని మాటలు అనురాగ విచారములను సూచించే మాటలు కావడంచేత నామనస్సులో నాటుకొని పూర్తిగా జవాబు వ్రాయవలెననిపిస్తూన్నది. ఇతరులు వ్రాసినవి తీవ్రంగానూ, ద్వేషపూరితంగానూ ఉన్నందువలన, ఫలితం కలుగకపోగా, మాటకుమాట అనడానికి నాకు కోరిక గానీ సమర్థతగానీ ఉన్నట్లయితే, కోపంతో కూడిన ప్రతి వాదాన్ని ప్రకోపింపచేసిఉండేది. ఆండ్రూసు మహాశయుడు వ్రాసిన ఉత్తరం సత్వర స్వరాజ్య సంపాదనకు తగినంత అహింసా పూర్వకంగాఉన్నది.

అయితే ఇవన్నీ ప్రస్తావన సందర్భంలో చెప్పినమాటలు-నేనుమాత్రం ఎప్పటికీ వలెనే తగులపెట్టడం అవసరమనే దృఢ నిశ్చయంతోఉన్నాను. జాతితత్వవిధానముపైన ప్రత్యేకంగా నేను నొక్కిచెప్పిన దేమీ లేదు. మిత్రుల మధ్యగానీ నాకు నచ్చిన సతర్కటుంబాలలోగానీ సరిగా నేనీ పనేచేసి ఉండేవాణ్ని. ఒకానొక చర్య మన ప్రియతములకు అత్యంత సన్నిహితులకు మంచిగా తోస్తుందా అనేదే నేను చేసే పనులన్నిటికీగానీ, యిచ్చే సలహాలకు

గానీ, ప్రమాద రహితమైన గుర్తుగా తీసుకొంటాను. ప్రేమపూర్వకంగా నమ్ముతూన్న ఈ విషయాన్ని నేను ప్రబోధించడంలో అసందిగ్ధతగాని అసందర్భంగానీ లేదు. నేను మిత్రులకు శత్రులకు కూడా సమానంగానే ఉండాలి. నా మిత్రులను తఱచుగా కలత పెడుతూండే నా పనులు చాలా సరియైనవనే నిశ్చయం ఈ విశ్వాసం వలననే నాకు కలుగుతూన్నది.

నా ఒకానొక ప్రియ స్నేహితునికీ నాకూ నిరంతర కలహ కారణమైన చక్కని దూరదర్శినీ యంత్రం సముద్రంలో పారవేయబడిన సంగతి నాకు జ్ఞాపకం ఉంది. మొట్టమొదట ఆయన సందేహించాడు, కాని ఆయనకొక స్నేహితుడు బహుమానంగా యిచ్చిన విలువగల ఆ చక్కని వస్తువును విధ్వంసం చేయడంకూడా న్యాయమనే సంగతి తరువాత గ్రహించాడు. మనిషియొక్క నైతికాభ్యుదయానికి అభ్యంతరంగా ఉండే అత్యంత మూల్యములైన బహుమతులను కూడా పరిహారంగానీ అనుమానంగానీ లేకుండా ధ్వంసం చేయవలసి ఉంటుందని అనుభవం వలన తెలుస్తూన్నది. ప్లేగువ్యాధితో సంసర్గం కలిగిఉన్నట్లయితే, తాతల తరాలనుండీ అనుభవిస్తూన్న అమూల్య వస్తువులను సైతం అగ్నిహోత్రునకు అర్పించడం పవిత్ర ధర్మంగా భావించబడదా? నా ప్రియపత్నియొక్క ప్రియమైన గాజులనుగూర్చి, ఆమెకూ నాకూ తగవేర్పడిన కారణాన నా వయస్సులో వాటిని నేను ముక్కలు ముక్కలుగా పగలగొట్టిన సంగతి నాకు బాగాజ్ఞాపకం. పైగా అవి ఆమె తల్లి అరణమిచ్చినవికూడానని నాకు గుర్తు. నేనా పని ద్వేషం వలన కాక ప్రేమ వల్లనే చేశాను. అది అజ్ఞాన జనితమని నా పరిణత వయస్సులో యిప్పుడు తెలుస్తూన్నది.

ఆ విధ్వంసం మాకు సహాయపడ్డది. మే మెక్కువ సన్నిహితులమైనాము.

అన్ని విదేశీ వస్తువులను బహిష్కరించవలెనని నాకిష్ట చెప్పినట్లయితే, అది జాతి తత్వము, రాష్ట్ర తత్వము, క్రూరత్వముకూడా అవుతుంది. విదేశీ వస్త్రాలనన్నిటినీ బహిష్కరించవలెననియే నాకిష్ట చెప్పుతున్నాను. ఈ నియమంలో కావలసినంత భేదం ఉంది. ఇంగ్లీషు లీవరు గడియారములను కానీ జపాన్ వార్నిష్ పనులనుగానీ రాకుండా చేయడానికి నేను కోరడం లేదు. కాని అత్యంత శ్రద్ధతో తయారుచేయబడి, అతి జాగరూకతతో నిల్వచేయబడిన యూరోపు ఖండపు ఉత్కృష్టతమమైన సారాయములను అన్నిటినీకూడా నేను ధ్వంసంచేస్తాను. సైతాను యొక్క మాయా జాలములు చాలా సున్నితంగా పన్నబడి ఉంటవి. తప్పుకూ ఒప్పుకూ మధ్యనున్న సరిహద్దుగీత కనిపించనంత సన్నంగా ఉన్నప్పుడు అవి అత్యంతం ఆకర్షవంతంగా ఉంటవి. కాని ఆ గీతమాత్రం అక్కడ మార్పు లేకుండా స్థిరంగా ఉండనే ఉంది. దానిని అతిక్రమించడం అంటే నిశ్చయంగా మృతి అన్నమాటే.

ఇండియా ఈ రోజున జాతితత్వం కలిగి ఉంది.

అత్యంత ప్రయత్నపూర్వకంగా మాత్రమే ప్రజల దుష్టోద్రేకాలను నిరోధించేటందుకు నాకు సాధ్యమవుతూన్నది. జనసామాన్యం యావత్తూ ద్వేషోద్రేకంతో ఉన్నారు. వారు దుర్బలులై, తమ దౌర్బల్యాన్ని తొలగించుకోవడం ఎలాగో ఎంతమాత్రమూ తెలుసుకోలేని స్థితిలో ఉండడమే అందుకు కారణం. వారి ద్వేషాన్ని మనుష్యులమీదనుండి వస్తువులమీదకు మార్చాను.

విదేశీ వస్త్రాలమీది ప్రేమయే మనకు విదేశీ అధికారాన్నీ పేదరికాన్నీ అన్నిటికన్నా హీనంగా అనేక కుటుంబాలకు అపయశస్సునూ తెచ్చిపెట్టింది. కతియవాడ్‌లోని ' అంటరాని కులానికిచెందిన ' నేతవాళ్లనేకమంది వాళ్ల వృత్తిపోయినందున బొంబాయి మున్సిపాలిటీలో వీథులూడ్చే పనికి తయారైనారన్న సంగతి పాఠకునకు తెలియకపోవచ్చు. ఇది జరిగి చాలాకాలం కాలేదు. వీరి జీవితం చాలా కష్టాలపాలై, వీరిలో చాలామంది పిల్లలను కోల్పోవడమే కాక నైతికంగానూ శారీరకంగానూ కూడ పతనమైనారు. కొంతమంది, తమ కొమార్తెలయొక్కయూ, చివరకు భార్యలయొక్కయు కళంకాన్ని నిస్సహాయులై కళ్లారాచూడవలసివస్తూన్నది. గుజరాతులో ఈ తరగతికి చెందిన స్త్రీలనేకమంది, ఇళ్లలో పనిదొరకనందున, రోడ్లమీద పనిచేస్తూ, యేదో ఒక విధమైన ఒత్తిడికిలోబడి తమ మర్యాదనుకూడా విక్రయించుకోవలసి వస్తూన్నదన్న సంగతి పాఠకు లెఱుగకపోవచ్చును. పాంచాల రాజ్యంలో, స్వాభిమానంగల నేత పనివాళ్లు, వృత్తిలేక కత్తి పుచ్చుకొని, అభిమానవంతులు, నిరపరాధులూ అయిన అరబ్బులను, తమ అధికారులు ఆజ్ఞాపించినంతమాత్రాన చంపడానికి సాధనాలైనారు. వారీ పని తమ దేశంకోసం చేయలేదు. బ్రతుకు తెరువుకోసం చేశారు. ఇది జరిగీ యెన్నోయేళ్లు కాలేదు. ఈ సంగతి కూడా పాఠకునకు తెలిసిఉండకపోవచ్చును. ఈ వంచితులైన జీతగాళ్లను వాళ్ల హంతకవృత్తినుండి తప్పించడానికి జయప్రదంగా ప్రబోధించడం దుస్తరం. ఒకప్పుడు గౌరవప్రదమై కళానైపుణ్యంతోకూడిన వృత్తి యిప్పుడు వారిచే అవమానకరంగా భావింపబడుతూన్నది. ప్రపంచ విఖ్యాత

మైన ‘ శబ్నము ’ ను నేసిన ఢకా నేత పనివారు గౌరవ హీనులుగా భావింపబడి ఉంటారనడానికి వీలులేదు.

విదేశీ బట్టను స్పృశించడం పాపమని నేను భావించే యెడల యిప్పుడందులో ఏమైనా ఆశ్చర్యం ఉందా ? బహు సున్నితమైన జీర్ణకోశంగల మనిషి బలమైన ఆహారములను తినడం పాపంకాదా ? ఆయన వాటిని మాననైనా మానాలి, నాశనమైనా చేయాలి కాదా ! మంచాన పడిఉన్న కుమారుడు నాకొకడుండి, తాను తినకూడని బలమైన ఆహారాలను అతను సంతోషంగా కావలెననేయెడల వాటినేమి చేయాలో నాకు తెలుసు. వాటికోసమతడు దేబిరించకుండా చేసేటందుకు, నా మట్టుకు నాకు వాటిని జీర్ణంచేసుకొనేశక్తి ఉన్నప్పటికీ, నేనుకూడా వాటిని తినడంమాని, వాటిని తిన్నందువలన కలిగే పాపమతనికి బోధపడేటట్లు, అతని కట్టెదుటనే వాటిని నిర్మూలిస్తాను.

ఉత్కృష్టనైతిక దృక్పథమునుండి, విదేశీబట్టను వినాశనం చేయడం సరియైన సిద్ధాంతమేయైన యెడల, స్వదేశవస్త్రాల ధర పెరిగే అవకాశం మనలను భయభ్రాంతులనుగా చేయనక్కరలేదు. ఉత్పత్తిని ప్రోత్సహించేటందుకు వినాశనం శీఘ్రతమమైన విధానం. ఒక మహోద్యమంవల్లనూ శీఘ్ర విలయం వల్లనూ, భారతదేశం తన మాంద్యమును నిర్బంధపు సోమరితనమునూ విడచి చైతన్యం పొందవలసి ఉన్నది. 1905 లో కామరూపదేశాన్నిగూర్చి, అస్సాం గెజెటీరు కర్త మిస్టరు ఏలె౯ యిలా వ్రాశాడు.

“ ఇటీవలి సంవత్సరాలలో దిగుమతి అయిన బట్టను ఉపయోగించడం యిష్టంగా ఉంటూన్నది. ఈ కొత్త

మార్పు ప్రోత్సహించ తగినది కాదు. ఎందువల్ల ననగా పూర్వం మగ్గం దగ్గర వినియోగింపబడే కాలం, సాధారణంగా మరే యితర ప్రయోజనకరమైన పనికీ వినియోగింపబడడం లేదు."

నేను మాటాడిన అస్వామీయులు ఈ మాటల యథార్థమును సిగ్గుపడుతూ గ్రహించారు. శరీరానికి బాహ్యపదార్థమెటువంటిదో ఇండియాకు విదేశీబట్ట అటువంటిది. శరీరారోగ్యమునకు బాహ్య పదార్థ నిర్మూలన మెంత అవసరమో, ఇండియాకు విదేశీ బట్టల విధ్వంసమంత అవసరం. స్వదేశీ యొక్క తక్షణావసరాన్ని ఒకసారి గుర్తిస్తే విదేశీ వస్త్ర విధ్వంసం విషయంలో మధ్యమార్గం లేదు.

సంపూర్ణ స్వదేశీ తత్వంలోకి మారిపోవడంవలన, మనకు సంకుచితత్వంగానీ ప్రత్యేకత్వంగానీ పెంపొందుతుందనికూడా భయపడనక్కర లేదు. ఇతరుల పవిత్రతను కాపాడడానికి ముందు, భోగపరాయణత్వం వలన మన శరీరాలు శిథిలం కాకుండా మనం చూచుకోవాలి. భారతదేశ మీ నాడు ఇతరుని ఇష్టప్రకారం కదిలే స్థాణువుకంటె వేరుకాదు. తనకు తాను పునీతం కావడం ద్వారా అనగా ఆత్మనిగ్రహ స్వార్థ త్యాగాల మూలాన భారతదేశం చైతన్యవంతమయినట్లయితే అది తనకూ సమస్తమానవానీకానికీకూడా శ్రేయోదాయకంగా ఉండగలదు. అది, అతి భోగపరాయణత్వం, దురాక్రమణ, దురాశలతో అభ్యున్నతికి వచ్చినట్లయితే, కుంభకర్ణునివలె వినాశహేతువై తనకూ మానవజాతికీకూడా హానికరంగా పరిణమిస్తుంది.

స్వదేశీలో గట్టి నమ్మకమున్న మనిషికి, ఖాదీ ధారణమునందు ఫారసీకుని ఆత్మసంతృప్తి ఉండనక్కర లేదు.

ఫారసీ ధర్మప్రతిపాలకుడు. స్వదేశీ దృక్పథమునుండి ఆలోచించేయెడల ఖాదీ ధారి, తన ఊపిరి తిత్తులను తానుప యోగించుకొనే మానవుని వంటివాడు. ఇతరులు దానిని దురుద్దేశంతో నిర్వర్తిస్తూన్నప్పటికీ, లేక దాని ఉపయోగంలో గానీ అవసరంలో గానీ నమ్మకంలేక దాని నసలు మానివేసినప్పటికీ, మన సహజ కర్తవ్యాన్నిమాత్రం మనం నిర్వహించి తీరవలెను.

—యంగిండియా, 1-9-1921

# 15

## పేదవాని పద్ధతి

అఖిలభారత కాంగ్రెసుసంఘంచే ఆదేశింపబడిన విదేశీ వస్త్ర బహిష్కరణమును పరిపూర్తిచేసేటందు కింకా కొద్ది రోజులు మాత్రమే మిగిలి ఉన్నవి. ప్రతి కాంగ్రెసుకార్యకర్తా బహిష్కరణోద్యమమునందు ప్రత్యేకశ్రద్ధ వహించే యెడల ఇప్పటికింకా తరుణం దాటిపోలేదు. స్వదేశీ లేకుండా—అనగా విదేశీవస్త్ర బహిష్కరణమూ కావలసిన బట్ట యావత్తూ చేతితోవడికిన నూలుతో చేనేతద్వారా ఉత్పత్తిచేసుకోవడమూ జరుగకుండా, స్వరాజ్యం రాదనీ స్వరాజ్యం లేనియెడల ఖిలాఫతు పంజాబు సమస్యలు పరిష్కారం కావనీ ప్రతి ఒకడూ తెలుసుకొనేయెడల, మనం వాంఛిస్తూన్న బహిష్కరణమునూ, మనం కోరుతూన్న ఉత్పత్తినీకూడా ఆచరణలోకి తీసుకొనిరావడం కష్టం కాకూడదు.

ఒకసారిగా తమ విదేశీబట్టలను మార్చివేయడానికి చాలామంది కష్టంగా భావిస్తారని నాకు తెలుసు. తాము త్యజించిన బట్టకు బదులుగా తగినంత ఖాదీని కొనుకోలేని లక్షలాది నిరుపేదలున్నారు. వారికి నేను మద్రాసు సముద్ర తీరాన యిచ్చిన సలహాయే తిరిగీ యిస్తున్నాను. వారొక అంగవస్త్రంతో సరిపెట్టుకోవాలి. యేడాదిలోని వేసగి నెలలలో, మన శరీరరక్షణకు మన శీతోష్ణపరిస్థితులలో అంతకంటె అవసరంలేదు. దుస్తుల విషయంలో అంతపట్టింపు అక్కరలేదు. భారతదేశము పురుషుల సంస్కృతికి

చిహ్నంగా సంపూర్ణ శరీరాచ్ఛాదన ఎన్నడూ విధించి ఉండ లేదు.

ఈ సలహా నేను సంపూర్ణ బాధ్యతతో యిస్తున్నాను. ఇందుకుదాహరణంగా ఉండేటందుకు, కనీసం అక్టోబరు 31 వ తేదీవరకు నా టోపీని చొక్కాయినీ విడిచిపెట్టి, అంగ వస్త్రంతో సరిపెట్టుకొని, అవసరమైనప్పుడు నా శరీరరక్షణకు చద్దరు ధరిస్తాను. నేననుసరించడానికి తయారుగా లేని యేవిషయాన్ని గూర్చి సలహా యిచ్చేటందుకు నేనెప్పుడూ సందేహిస్తూనే ఉంటాను కాబట్టినీ, విదేశవస్త్రాలను పీడిన పిమ్మట మారు దుస్తులకు శక్తిలేనివారికి మార్గదర్శిగా ఉండి వారిపని తేలిక చేయవలెననే ఆందోళనతోనూ నే నీ మార్పును అవలంబిస్తున్నాను. ఈ త్యాగాన్ని దుఃఖ చిహ్నంగాకూడా అవలంబించడం నా కవసరమని నేను భావిస్తున్నాను. మా ప్రాంతాల వట్టితల వట్టి శరీరమూ అందుకు చిహ్నం. సంవత్సరాంతం దగ్గరకువస్తూన్నకొద్దీ, మనం ఇంకా స్వరాజ్యం లేకుండా ఉన్నందున, మనం దుఃఖంలో ఉన్నామనే విషయం అంతకంతకెక్కువగా నాకు తెలుస్తూన్నది. నా తోడి కార్యకర్తలు, వారిపనికి అవసరమని తోస్తేనేతప్ప టోపీని చొక్కాయినీ విడిచిపెట్టవలెనని నేనను కోవడం లేదు.

తగినంతమంది కార్యకర్తలు ఉండేయెడల, ప్రతిరాష్ట్రమూ ప్రతిజిల్లా కూడా, ఒకనెలలో దాని అవసరాలకు సరిపోయినంత ఉత్పత్తి చేసుకోగలదని నా నిశ్చితాభిప్రాయం. అందుకొఱకు స్వదేశీపని తప్ప తక్కిన కార్యకలాపాలను పూర్తిగా ఆపివేయవలెనని నా సలహా. త్రాగేవాడు పవిత్రీకరణమునొక్క నూతన తత్వాన్ని గ్రహించగలడనే నమ్మ

కంతో మద్యదుకాణములనుండి పికెటర్లనుకూడా ఉపసంహ రిస్తాను. ఖైదు, జీవితంలో మామూలు సంఘటనగా భావించ వలసిందనీ, దానినిగూర్చి యేమీ ఆలోచించవలదనీ ప్రతి అసహాయవాదికీ నేను సలహా యిస్తున్నాను. అక్టోబరు నెలలో కేవలం విదేశీవస్త్రాలను సేకరిస్తూ, ఉత్పత్తికి తగిన ఏర్పాట్లుకావిస్తూ సమావేశాలనుండి ఉద్రేకాలనుండీ దూరంగాఉంటూ సక్రమంగా నడచుకోగలిగినయెడల, అవ సరమైతే అప్పుడు శాసనోల్లంఘన ప్రారంభమునకుకూడా తగిన సుస్థిరశాంతి వాతావరణాన్ని సృజించగలము. మన నైతికబలాన్నీ, నిర్మాణకౌశల్యమును, ఆదర్శప్రాయమైన ఆత్మ నిగ్రహశక్తినీ-పూర్ణస్వదేశీ కవసరమైన ఈ అన్నిటినీ మనం ప్రదర్శించచేయెడల, ఇంకేమీ అవసరం లేకుండానే మనం స్వరాజ్యం పొందగలమని నా సునిశ్చితాభిప్రాయం.

—యంగ్ఇండియా, 29-9-1921

# 16

## గొప్ప రక్షకుడు

శాంతినికేతన కవి ప్రస్తుతఉద్యమమునుగూర్చి ఒక ఉత్తేజకరమైన వ్యాసాన్ని 'మాడరన్ రివ్యూ' లో వ్రాశారు. ఆ పదచిత్రావళిని ఆయన ఒక్కడే రచించగలడు. అది అధికారానికీ బానిస చిత్తవృత్తికీ ప్రతికూలంగా చేయబడిన పటిష్ఠమైన అసమ్మతి. అనగా భయంవలనగానీ ఆశవలనగానీ ఒకానొక ఉద్రేకపూరితమైన ఉన్మాదాన్ని-అది యే పేరుతో పిలవబడుతున్నప్పటికీ—అంధప్రాయంగా ఆమోదించడమునకు ప్రతికూలమైన అసమ్మతి. మనము సహనము వీడరాదనీ ఎంత గొప్పవారలమైనా అధికారాన్ని చలాయించరాదనీ అందరు కార్యకర్తలకూ అంగీకారమైన సముచితోద్బోధకమది. మన తర్కానికిగానీ హృదయానికిగానీ అనుకూలంగా లేనిది ప్రతిదీ తక్షణం నిరాకరింపబడవలసినదే నని కవీశ్వరుడు మనకు సలహాయిస్తున్నాడు. మనకు స్వరాజ్యం రావలెనంటే, ఎన్ని కష్టనష్టాలకైనా ఓర్చుకొని మనకు తెలిసిన సత్యంకోసం మనం నిలబడవలసిందే. తన సందేశం అంగీకరింపబడనంత మాత్రంతో కోపంచెందే సంస్కర్త ప్రియుడూ, అడవులకుపోయి పరిశీలిస్తూ, నిరీక్షిస్తూ, ప్రార్థిస్తూ ఉండడమెలాగో నేర్చుకొనవలసిఉంది. ఈ విషయాలన్నిటితో ఎవ్వరైనా హృదయపూర్వకంగా ఏకీభవించవలసిందే. సత్యంకోసం న్యాయంకోసం నిలబడ్డందుకా కవీశ్వరుడు దేశీయుల కృతజ్ఞతకు పాత్రుడు. మన ఆలోచనాశక్తిని మరొకరిపరం చేసినయెడల, మన ప్రాథమికస్థితికంటె అంతిమస్థితి ఎక్కువహీనంగా ఉంటుందనేమాట నిస్సంశయం.

నేను చెప్పినదానినీ చేసినదానినీ అంతా, దేశం ఆలోచన లేకుండా, అంధప్రాయంగా అనుసరించిందని తెలుసుకొన్నప్పుడు నేను తీవ్రంగా విచారపడవలసివస్తుంది. క్రూరుని కొరడా దెబ్బకు బలవంతంగా లొంగిపోవడం కంటె కూడా, ప్రేమకు గ్రుడ్డిగా వశం కావడం ఎక్కువ ప్రమాదకరమని నాకు బాగా తెలుసును. క్రూరాత్ముని బానిసకు ఆశ ఉన్నది. ప్రేమకు బానిసయిన వానికేమీ ఆశ లేదు. దుర్బలుని సబలునిగా చేసేటందుకు ప్రేమ అవసరమే; నమ్మకం లేనివానిని వినిపించడానికి బలవంతపెట్టే ప్రేమ క్రూరంగా పరిణమిస్తుంది. మంత్రంయొక్క విలువ తెలియకుండా దానిని గొణుగుతూ ఉండడం మనుష్యలక్షణం కాదు. కాబట్టి చర్ఖాయొక్క పిలుపును కేవలం బానిసలులాగా అనుకరించేవారందరినీ, ధైర్యంగా తిరుగుబాటు చేయవలసిందని మన కవీశ్వరుడు చెప్పడం మంచిదే. మన ఔత్సుక్యం మనతో ఏకీభవించని వారందరికీ ప్రతికూలంగానూ అసహనంగానూ లేక దౌర్జన్యంగానూ కూడా ప్రత్యక్షం కావచ్చును. కాబట్టి ఆయన వ్యాసం మన అందరికీ ఒక ఉపదేశంగా ఉపయోగపడుతుంది. స్వమతోన్మాదము, సోమరితనము, అసహనము, అజ్ఞానము, అలసత్వముల లాంటి శత్రువులు మనను సమీపించకుండా ముందుగానే మనకు తెలియపరుస్తూన్న రక్షక సైనికుడుగా నేను కవీశ్వరుని గూర్చి భావిస్తున్నాను. మనం ఆలోచించడం మానివేయకుండా జాగ్రత వహించవలసిన అవసరాన్ని గూర్చి కవీశ్వరుడు చెప్పినదంతా నే నామోదిస్తూన్నప్పటికీ, దేశంలో ఈనాడెక్కువగా బుద్ధివిధేయత ఉన్నదనే సిద్ధాంతాన్ని నే నంగీకరిస్తూన్నట్లు అనుకోకూడదు. హేతువాదమునకే నేను పదే పదే ప్రబోధించిఉన్నాను. అదృష్టవశాత్తూ దేశం రాట్నాన్ని అఖిలార్థప్రదాయిగా అనుకొన్నయెడల, అది చాలా సందే

హించి గట్టిగా ఆలోచించిన పిమ్మటనే అలా అనుకొన్నదని నేను కవీశ్వరునికి నచ్చచెప్పవలసిఉంది. చర్ఖాలోని సత్యాన్ని భారతీయవిద్యావంతు లిప్పటికైనా గ్రహించి ఉంటారని నేను గట్టిగా అనుకోవడం లేదు. పైన కనిపించే మురికి బట్టే అడుగున ఉన్న అసలువస్తువుగా పొరపాటుపడరాదు. చర్ఖా పట్టి గుడ్డినమ్మకంవలన ఆమోదింపబడుతూన్నదో లేక సహేతుకంగా అవసరమని ఆమోదింపబడుతూన్నదో, కవీశ్వరుడింకా ఎక్కువ లోతుగా పోయి ఆలోచించాలి.

కవీశ్వరునీ నౌకరునూకూడా రాటంవిధిగా తిప్పవలెనని నేను నిజంగా కోరుతున్నాను. యుద్ధకాలంలో కవీశ్వరుడు తన వీణనూ, లాయరు తన లా రిపోర్టులనూ, విద్యార్థి తనపాఠ్య గ్రంథాలనూ, దూరంగా పెడతారు. యుద్ధమయినపిమ్మట కవీశ్వరుడు యథార్థస్థితిని ఆలాపనచేస్తాడు ; ప్రజలు తమలో తాము తగవులాడుకోవడానికి తగిన వ్యవధి ఉన్నప్పుడు తన లా పుస్తకాలను తిరగవేసే అవకాశం లాయరుకు లభిస్తుంది. ఇల్లు తగలబడిపోతూంటే ఇంట్లో ఉన్నవారంతా బయటకు వచ్చి మంటలు చల్లార్చడానికి తలొక బొక్కెనా తీసుకొంటారు. నా చుట్టూ ఉన్నవారంతా అన్నంలేక చచ్చిపోతూంటే, ఆ ఆకలిగొన్నవారికి అన్నంపెట్టడమే అప్పుడు నేను చేయవలసినపని. భారతదేశములో అనుదినమూ మానవత్వము నశింపచేయబడుతూండడంవలన అది తగలబడుతూన్న ఇంటివంటిదనీ, అక్కడ ఆహారసంపాదనకు తగిన వృత్తిలేనందున అది ఆకలితో మరణావస్థలో నున్నదనీ నా నమ్మకం. ఖుల్నాలోని ప్రజలాకలితో బాధపడడం వారు పని చేయలేక పోవడంవలనకాదు. పనిలేకపోవడంవలన దత్త మండలాలలో వరుసగా యిప్పుడు నాలుగో కరువు నడుస్తూన్నది. ఒరిస్సా నిరంతరక్షామంతో పీడింపబడుతూం

టుంది. ఇండియా అంటే మన నగరాలు కావు. ఇండియా ఏడున్నర లక్షల గ్రామాలలో ఉన్నది. నగరాలు గ్రామాల వల్ల జీవిస్తున్నవి. అవి తమ ఐశ్వర్యాన్ని యితర దేశాల నుండి తీసుకొనిరావడంలేదు. యూరపు, అమెరికా, జపాను దేశాల పెద్ద పెద్ద కంపెనీలకు పట్టణవాసులు, దళారీలు కమీషన్దారులూను గడచిన రెండువందల సంవత్సరాల నుండీ రక్తాన్నిపీల్చడంలో విదేశకంపెనీలకు నగరాలు సహాకారంచేసినవి. భారతదేశం రోజురోజుకూ ఎక్కువ పేదదేశ మవుతూన్నదనే నానమ్మకం అనుభవంమీద ఆధార పడి ఉంది. దాని పాదాలలోను కాళ్లలోనూ రక్తప్రసారం దాదాపు ఆగిపోయింది. మనం శ్రద్ధతీసుకోక పోయినట్లయితే అది పూర్తిగా మరణిస్తుంది

పనిలేక ఆకలితో అల్లాడే జనానికి పని రూపంలోనూ, మజూరీ కింద లభించే ఆహార రూపంలోనూ మాత్రమే ప్రత్యక్షమయ్యేటందుకు దేవుడు సాహసిస్తాడు. మనిషి తన ఆహారంకోసం పని చేసేటందుకే దేవుడు వానిని సృజించాడు. పని చేయకుండా భుజించేవారు దొంగలని ఉద్ఘాటించాడు. ఇండియాలో నూటికి ఎనభైమంది సంవత్సరంలో సగం రోజులు దొంగలవుతున్నారు. కాబట్టి ఇండియా ఒక పెద్ద ఖయిదు కావడంలో ఆశ్చర్యమేముంది? ఇండియాను రాటం వైపుకు మరలిస్తూన్న వాదం ఆకలి ఒకటే. అన్నిటిలోకీ రాటముయొక్క పిలుపు అత్యుదాత్తమయింది. అందుకు కారణం, దాని పిలుపు ప్రేమయొక్క పిలుపు. ప్రేమయే స్వరాజ్యం. అవసరమైన శారీరక కృషికి వెచ్చించిన కాలం, మనస్సును సంకుచితం చేస్తుందని చెప్పగలిగే యెడల, రాటం విషయంలోకూడా అలా అనవచ్చును. దాదాపు మరణావస్థలో ఉంటూ, జంతువులకంటె హీన

స్థితిలోనున్న లక్షలాది ప్రజలనుగూర్చి మనం ఆలోచించవలసి ఉంది. మరణావస్థలోనున్న మన దేశంలోని లక్షలాది స్త్రీ పురుషులకు రాటం పునరానందదాయక మవుతుంది. అన్నంకోసం పని చేయ నవసరం లేని నేనెందుకు వడకవలెను ? అని ప్రశ్నించవచ్చును. నాకు చెందని దానిని నేను తింటు న్నాను కనుక ; నా దేశీయులను దోచుకొని తిని బ్రతుకు తున్నాను గనుక ; మీ జేబులోపడిన ప్రతి పైసా మీకెలా వచ్చిందో ఆలోచిస్తే, నేను వ్రాసిన దానిలోని యథార్థం మీకే తెలిసివస్తుంది. బలవంతంగా తమకు తటస్థించిన సోమరి తనాన్ని ఎలా వినియోగించవలెనో తెలియునియెడల ప్రజా సామాన్యానికి స్వరాజ్యంలో అర్థం లేదు. కొద్ది కాలంలో స్వరాజ్య సంపాదన సాధ్యమే. కాని రాటమును పునరుద్ధ రించినందువల్లనే అది సాధ్యమవుతుంది.

నేను అభివృద్ధిని కోరుతున్నాను. నేను స్వయం నిర్ణయ మును కోరుతున్నాను. నేను స్వాతంత్ర్యాన్ని కోరుతు న్నాను. కాని వీటన్నిటినీ కోరుతూన్నది ఆత్మకోసం. చెకు ముకి యుగంకంటె ఉక్కుయుగం ఎక్కువ అభ్యుదయకర మైనదా అని నా అనుమానం. నేను నిష్పక్షపాతంగా ఉంటాను. మన బుద్ధి విశేషమున్నా, తక్కిన అన్ని శక్తు లున్నా ఆత్మోన్నతికి మాత్రమే వినియోగింపబడవలెను. ఆధునిక పరికరములు కలిగిన మనిషి, మానవ సమాజంకోసం చిరస్థాయిగా ఉండే నూతన విషయాలు కనిపెట్టే అవకాశా లను ఊహించుకోవడంలో నాకు కష్టం లేదు. కాని తన దారికి వెలుగుచూపేటందుకొక చెకుముకి ముక్కా మేకూ తప్ప మరేమీ లేని మనిషి, నూతన స్తుతి గీతాలను గానం చేస్తూ పీడిత ప్రపంచానికి ఈ భూమిపై శాంతి సౌహార్ద్ర సందేశాన్ని ఈయగల అవకాశమును ఊహించుకోవడం

నాకు కొంచెం కష్టమవుతూన్నది. రాటంకోసం చేసే వాదం, అసలు పనియొక్క ఉత్కృష్టతను గమనించేటందుకు చేయబడే వాదం.

రాటాన్ని పోగొట్టుకోవడంవలన మన ఎడమ ఊపిరి తిత్తిని పోగొట్టుకొన్నామని నా అభిప్రాయం. అందువలన మనం ప్లుత క్షయవలన పీడింపబడుతున్నాము. రాటాన్ని పునరుద్ధరించడంవలన ఈ క్షయ వ్యాధి అరికట్టబడుతుంది. అన్ని ప్రదేశాలలోనూ అందరూ చేయవలసిన పనులు కొన్ని ఉన్నవి. కొన్ని ప్రదేశాలలోనే అందరూ చేయవలసిన పనులు కొన్ని ఉన్నవి. కనీసం ఈ పరివర్తన కాలంలోనైనా ఇండియాలో అందరూ రాటం తిప్పవలసిన పని ఉన్నది. అత్యధిక సంఖ్యాకులు ఎల్లకాలమూ తిప్పవలసి ఉంది.

మనకు విదేశీబట్టపైనగల ప్రేమయే రాటాన్ని గౌరవ స్థానంనుండి భ్రష్టంచేసింది. కనుకనే విదేశీ వస్త్రధారణ పాపమని నా అభిప్రాయం. ఆర్థిక నైతిక విషయాల మధ్య సున్నితమైన భేదాన్నికానీ, మఱెటువంటి భేదాన్నిగానీ నేను గమనించడం లేదని ఒప్పుకొని తీరాలి. వ్యక్తియొక్కగానీ జాతియొక్కగానీ నైతిక క్షేమమునకు హాని కలిగించే ఆర్థిక వ్యవహారాలు అవినీతికరములైనవి. కనుక పాప భూయిష్ఠములు. కాబట్టి, ఒక దేశం ఇంకొక దేశాన్ని పీడించుకొని తినేటందు కనుమతించే ఆర్థిక విధానాలు అవినీతికరములు. పస్తులు ఉంటూన్న కూలీలు చెమటవోడ్చి చేసిన వస్తువులను కొని వాడుకోవడం పాపం. అమెరికా గోదుమలను తిని, నా పొరుగు ధాన్యపువర్తకునికి బేరం పోగొట్టి, అతనిని పస్తు పెట్టడం పాపం. అదేవిధంగా, నా పొరుగున వడికేవారు నేసేవారు తయారుచేసిన బట్టలవలన, నాకు బట్టలు లభించడమే

కాక వారికి కావలసినకూడూ గుడ్డా దొరుకుతుందని తెలిసి ఉండికూడా, నేను రీజెంటు వీధిలోని అతినవీనమైన నాజూకు బట్టలను ధరించడం పాపం. ఆ నాపాపం బద్ధలవుతూన్నదన్న జ్ఞానంతో, విదేశీ వస్త్రాలను అగ్నిహోత్రునికి ఆహుతి చేయడంద్వారా పాపప్రక్షాళనం చేసుకొని, అప్పటినుండీ నా పొరుగువారు తయారుచేసిన ముతక ఖాదీతోనే నేను తృప్తిపడి ఉండాలి. ఒకప్పుడు వదిలివేసిన రాట్నాన్ని తిప్పే టందుకు నా ఇరుగుపొరుగువారిష్టపడరని నాకు తెలిసినప్పుడు నేనే దానిని చేపట్టి ప్రచారంలోకి తీసుకొనిరావాలి.

నేను తగులబెట్టవలసిందని కోరుతూన్న బట్టలు, మన మహాకవి వేనని ఆయనకు చెప్పడానికి సాహసిస్తున్నాను. అవి పేదవాళ్లవనికానీ సరియైన బట్టలు లేని వాళ్లవనికానీ ఆయనకు తెలిసి ఉన్నట్లయితే, ఆయన చాలాకాలం కిందటనే ఆ పేదల సొత్తు వారికి తిరిగీ యిప్పించి ఉండేవారు. నా విదేశీ బట్టలను తగులబెట్టడం నా అవమానాన్ని తగుల బెట్టడం. వారి కత్యవసరంగా కావలసిన పనికి బదులుగా వారి కక్కర లేని బట్టలనిచ్చి, వస్త్రవిహీనులను నే నవమా నింప తలచుకోలేదు. వారికి నేను పోషకుడుగా ఉండే పాపం చేయను. వారిని దరిద్రులుగా చేయడానికి నేను తోడ్పడ్డానని తెలుసుకొన్న తరువాత, వారికి నేను పాఱ వేసిన అన్నమునుగానీ, నేను వదిలవేసిన బట్టలనుగానీ ఈయను. వారికొక విశిష్టస్థానమునిచ్చి, నా అన్నవస్త్రా లలో ఉత్తమమైన వాటిని వారికందచేస్తూ, వారితోకలసి పనిచేస్తాను.

అసహాయోద్యమంకానీ, స్వదేశీ ప్రణాళికకానీ, ఏదే ఒకొక్కరికో సంబంధించిన ప్రత్యేక సిద్ధాంతం కాదు. అస

హాయోద్యమము, అహింసా స్వదేశీలనుగూర్చి యిచ్చిన సందేశం, ప్రపంచానికీయబడిన సందేశమని ఎలుగెత్తి చాటడానికి నా అడకువ నా కభ్యంతరం కలిగించింది. అది ఈయబడిన చోటనే అది ఫలించకపోయినట్లయితే తప్పక అది అపజయం పొందవలసిందే. ప్రస్తుతం, నైచ్యము, దరిద్రము, మహామారీ వ్యాధులూ తప్ప, భారతదేశం ప్రపంచంతో పాల్గొనేది మఱేమీ లేదు. ఇక భారతదేశం తన పురాతన శాస్త్రాలనా ప్రపంచానికి పంపవలసింది! అవి అనేకసార్లు ముద్రితములై ప్రచురింపబడినవి. విగ్రహారాధనచేసే అవిశ్వాస ప్రపంచం వాటి వంక చూడనుకూడా చూడదు. వాటి వారసులమూ రక్షకులమూ అయిన మనము వాటి ననుసరించకపోవడమే అందుకు కారణం. కాబట్టి ఏదైనా ప్రపంచంతో నేను పాల్గొనడానికి ముందు నాకు ఉండవలెను కదా! మా సహాయనిరాకరణము ఆంగ్లేయులతోనూ కాదు పాశ్చాత్యులతోనూ కాదు. ఆంగ్లేయులు నిర్మించిన విధానముతోను, భౌతిక సభ్యతా, దానిని అనుసరించి ఉండే దురాశా దుర్బలాలను స్వార్థంకోసం వినియోగించుకోవడం - వీటితోనే మా సహాయ నిరాకరణము. మాకు మేము విరమించుకోవడమే మా సహాయ నిరాకరణము. ఆంగ్ల పరిపాలకుల షరతులమీద మేము వారికి సహాయం చేయ నిరాకరించడమే మా సహాయ నిరాకరణం. "మా షరతులమీద మీరువచ్చి మాతో సహకారం చేయండి! అది మీకూ మాకూ ప్రపంచానికీ అందఱికీ క్షేమం" మాకు నిలవడానికి కాళ్లు లేకుండా చేసే పద్ధతికి మేము ఒప్పుకోము. మునిగిపోతూన్న మనిషి యితరులను రక్షింపచాలడు. మనం యితరులను రక్షించేటందు కర్హతను సంపాదించవలెనంటే, ముందు మనలను మనం రక్షించుకొనేటందుకు ప్రయత్నించాలి.

భారత జాతీయత మా ఒకరి క్షేమంకోసమే కాదు. అది దురాక్రమణకారిగానీ విధ్వంసకారిగానీకూడా కాదు. అది నిర్దుష్టమైనది, ధర్మనిష్ఠకలది. అందువలన లోకహితకర మైనది. భారతదేశం మానవానికంకోసం మరణించడానికి కోరుకొనే ముందు, బ్రతకడం నేర్చుకోవాలి. నిస్సహా యంగా పిల్లినోట్లో చిక్కుకొన్న ఎలుకలకు, తాము తప్పులు సరిగా చేసిన త్యాగమువలన యేమీ గుణం కనిపించదు.

తన కవితాస్వభావాని కనుగుణంగా కవీశ్వరుడు ముందు చూపుచూస్తూ మనంకూడా అలా ఉండవలెనని భావిస్తాడు. ప్రభాతోదయవేళ పక్షులు స్తుతి గీతాలు పాడుతూ ఆకాశానికెగిరే రమణీయ దృశ్యాన్ని, కౌతుక పూర్ణదృష్టితో మనం చూచేటట్లాయన చిత్రిస్తున్నాడు. ఈ పక్షులు పగటి ఆహారాన్ని భుజించి విశ్రాంతి తీసుకొనగా, వాటి రెక్కల నరాలలో రాత్రి నూతన రక్తం ప్రవహించడంచేత ఎగుర గలుగుతూండినవి. కాని బకరుచికిరున పక్షులనెంత ప్రోత్సాహపఱచినా రెక్కలుకూడా కదలించలేకపోవడం చూచే దురదృష్టం నాకు పట్టింది. భారతీయాకాశము కింద నున్న మానవశకుంతము, తాను నిద్ర నటించినప్పటికంటె కూడా, మేలుకొంచినప్పు డెక్కువ దుర్బలమవుతూన్నది. లక్షలాది ప్రజలకది నిత్యజాగరణమో లేక నిత్యసమాధియో అవుతుంది. ఆ బాధ వర్ణనాతీతము. అది అనుభవైక వేద్యమే. బాధపడే రోగులను, కబీరు పాటతో ఓదార్చడం నాకు సాధ్యంకాదని తెలుసుకొన్నాను. క్షుద్బాధా పీడిత

మైన ప్రజానీకానికి కావలసిందొకటే పదార్థం—పుష్టికర మైన ఆహారం. అది వారికి ఉచితంగా ఈయబడదు. వారు సంపాదించుకోవాలి. వారు దానిని చెమటవోడ్చి మాత్రమే సంపాదించుకోగలరు.

నియతం కురు కర్మత్వం కర్మజ్యాయో హ్యకర్మణః ॥

* * *

యజ్ఞార్థాత్ కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః ।
తదర్థం కర్మ కౌంతేయ ముక్తసంగః సమాచర ॥

సహయజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః ।
అనేన ప్రసవిష్యధ్వమేష వోఽస్త్విష్టకామధుక్ ॥

దేవాన్ భావయతానేన తే దేవా భావయంతు వః ।
పరస్పరం భావయంతః శ్రేయః పరమవాప్స్యథ ॥

ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యంతే యజ్ఞభావితాః ।
తైర్దత్తానప్రదాయైభ్యో యో భుంక్తే స్తేన ఏవ సః ॥

యజ్ఞశిష్టాశినః సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః ।
భుంజతే తే త్వఘం పాపా యే పచంత్యాత్మకారణాత్ ॥

అన్నాద్భవంతి భూతాని పర్జన్యాదన్నసంభవః ।
యజ్ఞాద్భవంతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః ॥

కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షర సముద్భవమ్ ।
తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్ ॥

ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః ।
అఘాయురింద్రియారామో మోఘం పార్థ స జీవతి ॥

—గీతా. అధ్యాయం 3 *

* నీకు నియమితమైన కర్మ నీవు చేయవలెను. కర్మ చేయకపోవడం కంటె చేయడం ఎక్కువ ఉత్తమం.

ఈ శ్లోకాలలో ఈనాడు భారతదేశానికి సంసారవిధి యైన రాటముయొక్క యథార్థమంతా యిమిడి ఉందని నా అభిప్రాయం, ఈ నాటినిగూర్చి మీరు జాగరూకతకలిగి ఉంటే రేపటినిగూర్చి దేవుడే జాగ్రత్త వహిస్తాడు.

—యంగ్ఇండియా, 13-10-1921

---

*  *  *

ప్రపంచాన్ని బంధించే కర్మగాక, పవిత్ర కర్మ మరొకటి ఉంది. అది భక్తిపరమైన ఆత్మను బంధించదు; అట్టి ఐహికకర్మను కోరికలేకుండా చక్కగా చెయ్యి. అప్పుడు నీ దైవకార్యాన్ని చక్కగా నిర్వర్తించ గలవు.

మనుష్యులందరూ సృజించబడినప్పుడు, మనుష్యులతోపాటు యజ్ఞాన్ని కూడా సృజించి ప్రజాపతి ఆదిలోనే యిలా అన్నాడు. "ఈ కర్మ చేయండి! యజ్ఞం చేయండి! యజ్ఞంతోపాటు మీరు అభ్యుదయ పరం పరాభివృద్ధిని పొందండి! ఇది మీకు కామధేనువు కాగలదు. ఈ కామ ధేనువు మీకు సకలైశ్వర్యములనూ చేకూర్చగలదు. దీనిద్వారా దేవతలను పూజించండి! దేవతలు మీకు శ్రేయస్సును చేకూర్చగలరు. నీ కర్మను యజ్ఞంద్వారా దేవతలకు సమర్పించినప్పుడు వారు నీకు ఇష్టభోగాల నీయ గలరు. తన కర్మఫలాన్ని దయామయుడైన దైవానికి సమర్పించక ఎవడు భుజిస్తాడో వాడు దొంగ అవుతున్నాడు. ఎవ్వరు యజ్ఞశిష్టమైన అన్న మును భుజిస్తారో వారు సర్వపాపములనుండి విడివడతారు. తమకోసం మాత్రమే ఎవ్వరు విందును ఏర్పాటు చేస్తున్నారో వారు పాపం భుజించి పాపం గ్రోలుతున్నారు. అన్నంవలన భూతాలు నిలుస్తూన్నవి. వర్షము నుండి అన్నం వస్తూన్నది. వర్షం యజ్ఞంవలన కలుగుతూన్నది.

యజ్ఞం కర్మవలన సముద్భవమవుతూన్నది. కర్మ బ్రహ్మవలన కలుగుతూన్నది. బ్రహ్మ అక్షరమునుండి సముద్భవమవుతూన్నది కాబట్టి బ్రహ్మ సర్వగతం; యజ్ఞమునందు నిత్యమూ ప్రతిష్ఠితమయి ఉంది. ఈ విధంగా ప్రవర్తితమవుతూన్న ప్రపంచ చక్రాన్ని ఎవ్వడు అనుసరించడో, వాడు ఇంద్రియ వ్యామోహంతో, వ్యర్థంగా, అవమానకరమైన నష్టజీవితాన్ని గడుపుతున్నాడు.

—భగవద్గీత, 3 వ అధ్యాయము

# 17

## కొన్ని ప్రశ్నలు

ప్ర. : యంత్రాలు నాగరికతకు అనర్థహేతువులని మీరంటారు. అయితే మీరు రైళ్లలోనూ మోటారులలోనూ ప్రయాణం చేయడానికెందు కొప్పుకొంటున్నారు?

ఉ. కొన్ని విషయాలనుండి మీరు వైదొలగుతూండినప్పటికీ, ఒక్కసారిగా వాటినుండి తప్పించుకోలేరు. నేను యిమిడి ఉన్న ఈ మట్టిఘటం నా జీవితానికి అనర్థహేతువు. కాని నేను దానిని సహించవలసి ఉంది. అంతే కాదు దానిని తృప్తిపఱచవలసి ఉంది కూడా. అది ఈ స్నేహితునికి తెలుసు. కడచినయుద్ధంలో ఒక్కతీరుగా జరిగిన హత్యాకాండకు యంత్రయుగం జవాబుదారీ కాదని ఈయన నిజంగా సందేహిస్తున్నాడా? ఊపిరి తిరుగని వాయు ప్రయోగాలు మొదలైన భయంకర కృత్యాలు, మనలను ఒక్క అంగుళం ముందుకు తీసుకొని పోలేదు.

ప్ర. :—అత్యుత్తమము అత్యంతం చౌకా అయిన అంగడిలో కొనవలెనన్న ఆర్థిక సూత్రం తప్పా?

ఉ. ఆధునిక అర్థశాస్త్రవేత్తలు నిర్ణయించిన ప్రధాన సూత్రాలన్నిటిలో ఎక్కువ అమానుషమైన సిద్ధాంతం ఇది ఒకటి. పైగా యిటువంటి కుత్సిత ప్రయోజనాల ననుసరించి యెప్పుడూ మానవ సంబంధాలను నియమించవము. ఆంగ్లేయుడు, ఇటాలియన్ కూలీ (అనుకోండి) చౌకగా వస్తూన్నప్పటికీ, ఇంగ్లీషు బొగ్గుకూలీకి (న్యాయంగా) ఎక్కువ

యిచ్చి తెచ్చుకుంటాడు. చాకగా కూలీలను తెచ్చుకోవడానికేమాత్రం ప్రయత్నించేసినా అది విప్లవానికి దారితీస్తుంది. విశ్వాసపాత్రుడుగా ఉండి ఎక్కువజీతం పుచ్చుకొనే నా నౌకరును, తక్కువ జీతంతో అంత విశ్వాసపాత్రుడూ అయి, ఎక్కువ సమర్థతగల మరొక నౌకరు దొరికినాడన్న కారణంతో తీసివేయడం నాపాలిటి పాప మవుతుంది. నీతినీ భావప్రవృత్తులనూ పరిగణించని ఆర్థిక విషయాలు, సజీవంగా కనిపిస్తూన్న మాంసమూ, ప్రాణమూ లేని మైనపు బొమ్మలవంటివి. ప్రతి సందిగ్ధ సమయంలోనూ ఈ కొత్త ఆర్థిక సిద్ధాంతాలు ఆచరణలో భగ్నమవుతూనే ఉన్నవి. వాటిని మార్గదర్శకసిద్ధాంతాలుగా ఆమోదించే జాతులు గానీ వ్యక్తులు గానీ నాశనం కావలసిందే. మతధర్మాన్ననుసరించి తయారుచేయబడే ఆహారంకోసం ఎక్కువ పైకం చెల్లించే ముసల్మానుని యొక్కయు, ఆచారానుసారంగా పరిశుద్ధంకాని ఆహారాన్ని భుజింప నిరాకరించే హిందువుని యొక్కయు స్వార్థత్యాగంలో కొంత ఉత్కృష్టత ఉంది. ఇంగ్లాండు, జపాను దేశాల చాక అంగళ్లలో మన బట్టలను కొనడం మొదలుపెట్టినప్పుడే మనపని అయింది. మన ఇరుగు పొరుగువారు తమ కుటీరాలలో తయారుచేసిన బట్టలను కొనడంయొక్క ధర్మప్రాముఖ్యతను మనం గుర్తించినప్పుడు మనం తిరిగి సజీవులం కాగలము.

ప్ర. :—దేశంలో అనేకమంది అర్ధ దిగంబరులుగా నుండి, రాబోయే శీతకాలాన్ని తలంచుకొని గడగడలాడుతున్న

సమయంలో మీ ప్రదర్శనాగ్నుల అందం (ఆధ్యాత్మికమో మరేదో కటో) ఏమిటో వివరించగలరా?

ఉ. ఆ! ఇంగ్లండులోని ప్రజలు ఇంటిలో వండిన అన్నం తిన్నట్లుగానే, చేతితో వడికిన నూలుతో తయారైనబట్టను ధరించవలెననే ప్రధాన సిద్ధాంతాన్ని సాపరాధంగా అలక్ష్యం చేయడంవల్లనే, ఈ అర్ధదిగంబరత్వం తటస్థించిందని నాకు తెలుసు. నేను విడిచివేసిన బట్టలను వారికియడం, వారి వేదనను యింకా కొనసాగించడమే అవుతుంది. కాని ఈ ప్రదర్శనాగ్నులవలన ప్రభవించిన వేడిని చిట్టచివరి పీలిక తగులబెట్టబడేవరకూ ఉంచినట్లయితే అది శాశ్వతంగా ఉండిపోతుంది. అప్పుడు ప్రతి శీతకాలములోను మన జాతి అంతకంత కెక్కువగా తేజోవంతమవుతుంది.

—యంగిండియా, 27-10-1921

# 18

## సహకారము

చేతితో నూలువడికేపని అభివృద్ధికావడం అనగా ప్రపంచ మిదివర కెన్నడూ చూడని మహత్తమమైన స్వచ్ఛంద సహకారం పెంపొందడమేనని బహుశా చాలా తక్కువ మంది కార్యకర్తలు గమనించి ఉంటారు. అంటే అత్యంత విశాల ప్రదేశంలో అక్కడక్కడా వ్యాపించి ఉన్న లక్షలాది ప్రజలు తమ నిత్యజీవనంకోసం పనిచేసుకొంటూ కావించుకొనే పరస్పర సహకారమని దాని అర్థం. వ్యవసాయానికి సహకార ప్రయత్నం ఎక్కువ అవసరమనేమాట నిశ్చయం. కాని చేతితో నూలువడికేటందుకు, అంతకంటెను మహత్తరము, ఎక్కువ విశ్వసనీయమూ అయిన సహకారమవసరం. గోదుమ పంట, మనిషియొక్క నిజాయితీవలన కంటె ప్రకృతియొక్క ఋజువర్తనంవలన ఎక్కువగా పండుతుంది. మన కుటీరాలలోని నూలు ఉత్పత్తి కేవలం మనుష్యుల నిజాయితీపైన ఆధారపడి ఉంది. లక్షలాది ప్రజలు హృదయపూర్వకంగా తెలివితేటలుగలిగి సహకరించక పోయినట్లయితే, చేతితో నూలువడికే పని సాధ్యంకాదు. నూలువడికే స్త్రీపురుషులకు ఏకడం తెలియనియెడల, వారికి ఏకులు సరఫరా చేసేటందుకున్నూ, ధాన్య విక్రేతకువలెనే వారి నూలుకు కూడా ఒక స్థిరమైన అంగడిని నిర్ణయం చేసేటందుకున్నూ ఒక తరుణం రాక తప్పదు. నూలువడికే పని, ప్రజాసామా

న్యంలో పెరిగిపోతూన్న పేదరికాన్ని ఇంద్రజాలంతో తోలి వేసినట్లు తోలివేయగలదని నే ననడం ఏమైనా వింతగా ఉం టుందా? చైనా దేశంలోని యంత్రాల అభివృద్ధిని తెలియ పరుస్తూ, ఒక పత్రికలో కత్తిరింపబడిన ముక్కను నాకొక ఆంగ్లేయమిత్రుడు పంపినాడు. నేను చేతితో నూలు వడక డాన్నిగూర్చి ప్రబోధించడంలో, యంత్రాలపైన నాకుగల అభిప్రాయాలను ప్రచారం చేస్తున్నానని ఆయన నిశ్చయంగా అనుకొని ఉంటాడు. అటువంటిపని నేనేమీ చేయడం లేదు. ఇండియాలోని వృత్తిలేమిని, దానివలన తటస్థించిన సోమరి తనమునూ తొలగింపగలిగే యెడల, ఎటువంటి పెద్దయంత్రాల నైనా ఉపయోగించడం నా కిష్టమే. పేదరికాన్నీ, పని లేమినీ, ఐశ్వర్యాన్ని అసంభవం కావించే పరిస్థితినీ పార ద్రోలడానికి, చేతితో నూలువడకడ మొక్కటే ఉపా యంగా నేను సూచించాను. అసలు రాటమే అమూల్య మైన చిన్న యంత్రం. భారతదేశపు ప్రత్యేక పరిస్థితుల కనుగుణంగా, నా చేత నయినంతవరకు దానికి కొన్ని అభివృద్ధి కరములయిన మార్పులనుకూడా చేయించాను. కాబట్టి భారతదేశమునూ మానవజాతినీ ప్రేమించే వ్యక్తి ఇండియా యొక్క హీనత్వమునూ దీనత్వమునూ పోగొట్టేటందుకు ఆచరణ యోగ్యమైన విధానాన్ని ఆలోచించడమే ఇక చేయ వలసిన పని. మానవబుద్ధికి గోచరంకాగల యే నీటి సరఫరా ప్రణాళికయైనప్పటికీ, యే వ్యవసాయాభివృద్ధికర కార్యక్రమ మయినప్పటికీ, విశాల భారతదేశంలో అక్కడక్కడా వ్యా పించి ఉన్న ప్రజ-సామాన్యానికి శ్రేయోదాయకంగా

ఉండేటట్లుగానీ లేక నిరంతరం నిరుద్యోగంతో పీడింపబడు తూన్న మానవానీకానికి పని కల్పించేటందుకుగానీ సహాయ పడజాలదు. సగటున రోజుకు ఐదు గంటలు మాత్రమే పని చేస్తూ, అది తన కోరిక ప్రకారం కాక, తప్పుకోరాని పరి స్థితులనుబట్టి చేస్తూన్న జాతినిగూర్చి ఊహించుకొనేయెడల ఇండియాయొక్క నిజస్వరూపం మీకు బోధపడగలదు. ఈ దృశ్యాన్ని పాఠకుడు చిత్రించుకోదలచినప్పుడు, నగర జీవితం లోని కోలాహలం, ఫ్యాక్టరీ జీవితంలోని పీడాకరమైన శ్రమ, తేయాకు తోటలలోని బానిసత్వమూ-ఇవన్నీ అతని మనస్సు నుండి తొలగించుకొని తీరాలి. భారత ప్రజాసముద్రంలో ఇవన్నీ నీటిబిందువులు మాత్రమే. ఆయన భారతీయ అస్థి పంజరాన్ని భావించుకోతలచినయెడల, భారతదేశంలో నూటికి ఎనభైమంది తమ పొలాలలో పనిచేసుకొంటూ, సంవత్సరానికి నాలుగు నెలలు పనిలేకుండా ఉంటున్నారనీ, అందువలన దాదాపు పస్తులుండవలసిన పరిస్థితిలో జీవిస్తున్నా రనీ, గ్రహించి తీరాలి. ఇది మామూలుస్థితి. పదే పదే వచ్చే కరువులు తప్పనిసరిగా పనిదొరకని ఈస్థితికి మరింత దోహదం చేస్తున్నవి. వారి అత్యల్పాదాయమునకు తోడు మరికొంత సంపాదించుకొనేటందుకు ఈ స్త్రీ పురుషులు తమ కుటీరములలో తేలికగా చేయతగిన పని యేమిటి? అది చేతితో నూలువడికే పని తప్ప మరొకపని యేదీ కాదనే విషయాన్ని ఇంకా ఎవ్వరైనా సందేహిస్తున్నారా? మన కార్యకర్తలు పూనుకొన్నట్లయితే, కొద్ది నెలలలో అది సార్వ జనీనం కాగలదని పునరుద్ఘాటిస్తున్నాను. ఇప్పటికే అది

సార్వజనీనమయ్యే పరిస్థితిలోకి చాలావరకు వచ్చింది. దానిని సరిగా ఏర్పాటు చేయడానికి తగిన నిపుణులు మాత్రమే కావాలి. ప్రజలు సంసిద్ధంగానే ఉన్నారు. పైగా చేతితో నూలు వడకడాన్నిగూర్చి అత్యంతానుకూలమైన పరిస్థితి యేమిటంటే, అది ఇదివరకెప్పుడూ ఎఱుగని కొత్త పని కాక పోవడం, ఇటీవలివరకూ కూడా ఆ పనికి ప్రజలలవాటు పడి ఉండడమూను. అయితే దానిని తిరిగీ జయప్రదంగా ప్రవేశ పెట్టవలెనంటే ప్రపంచంలోకల్లా పెద్ద యెత్తున సహకారం లభించాలి. నైపుణ్యంతోనూ ఋజువర్తనంతోనూ కృషి చేయాలి. భారతదేశ మీసహకారాన్ని సాధించగలిగినట్లయితే, ఆ ఒక్క పనివల్లనే ఇండియాకు స్వరాజ్యం లభించిందనే విషయాన్ని ఎవ్వరు కాదంటారు?

—యంగిండియా, 3-11-1921

# 19

## భారతదేశవు ఆర్థిక విషయాలు

ఇండియా ప్రభుత్వంవారి ఉత్తరువుల ప్రకారం, మిస్టర్. ఏ. సి. కొట్రో, సి.బి.ఇ.చే తయారుచేయబడ్డ భారత వస్త్ర పరిశ్రమనుగూర్చిన ఒక కరపత్రాన్ని నాకొక మిత్రుడిచ్చాడు. దాని ఉపోద్ఘాతంలో ఈ విధంగా ఉంది. 'ఈ కరపత్రంలో వెల్లడించబడిన అభిప్రాయాలు కానీ, చేయబడిన ప్రకటనలు కానీ, ఈ గ్రంథకర్తవని మాత్రమే గ్రహించవలసి ఉంటుందని ప్రభుత్వంవారి కోరిక. అలాగే అయితే అటువంటి కరపత్రాల వ్యయమును ఇండియా ప్రభుత్వంవారు, పన్నులు చెల్లించేవారి పైనవేసి ఎందుకు బాధపెట్టాలి? నా దగ్గరనున్న కరపత్రం ఆ పరంపరలో పదవారవది. ప్రభుత్వంవారీ సమస్యను గూర్చిన రెండు పక్షాల వాదనను ప్రచురిస్తారా?

ఇప్పుడు నేను సమీక్షచేయబోతూన్న కరపత్రం స్వదేశీ ఉద్యమానికి జవాబుగా ఉద్దేశింపబడినది. అది చాలా పెద్ద కరపత్రం. అందులో మిగుమతులయొక్కయు చేతితో నేయ బడిన వాటితో సహా ఇళ్ళలో జరిగేబట్టల ఉత్పత్తియొక్కయు పరిస్థితిని తెలిపే పటాలుకూడా చాలా ఉన్నవి. కాని అది స్వదేశీ ఉద్యమాన్ని గూర్చి పరిశీలించేటందుకు సహాయకారి కావడంలేదు. ఇంత శ్రమచేసిన ఈ గ్రంథకర్త, ప్రస్తుతోద్య మాన్నిగూర్చి కాని, దానిఅవకాశమును గూర్చికానీ పరిశీలించే టందుకేమీ కృషిచేయలేదు. దేశంలో అత్యంత నిర్మాణయుత మయిన సహాకారోద్యమాన్ని గూర్చి సానుభూతితో ఆలో చించి వ్యవహరించడానికి బదులుగా, దానియెడల పూర్తి

మైన అవహేళనతోనూ నిష్ప్రయోజకమైన తృణీకార భావంతోనూ భారత ప్రభుత్వం ప్రవర్తిస్తూన్న దనడమే బహుశా ఆ ప్రభుత్వ విధానాలపైన చేయగలిగిన ఆరోపణ లలోకెల్ల పెద్ద ఆరోపణ.

ఆ గ్రంథకర్తవాద మిది:

1. ఉద్యమం జయప్రదమైనట్లయితే, రక్షణ పన్నుగా గాక, నిషేధపు పన్నుగా పరిణమిస్తుంది.

2. ఇది భారత దేశపు పెట్టుబడిదారును భాగ్యవం తుణ్ణిగా చేసి వినియోజకునికి శిక్షగా పరిణమిస్తుంది.

3. ఇక్కడకు వచ్చే దిగుమతులు పోటీకి వచ్చే దిగు మతులు కావు. ఇండియాలోకి దిగుమతి అవుతూన్న బట్ట లలో చాలా భాగం ఇండియాలో ఉత్పత్తి అవుతూన్న తర హాది కాకపోవడమే అందుకు కారణం.

4. అటువంటి బట్టలను బహిష్కరించడంవలన కలిగే ఫలితం ఖరీదులు హెచ్చడమే కాని, ఆ హెచ్చింపు ధరలకు తగిన ప్రయోజనమేమీ వుండదు.

5. సరఫరాను బట్టీ, కావలసిన సరుకును బట్టీ ధర ఉం టుందనే ఆర్థిక సూత్రానికే ఈ బహిష్కరణం ప్రతి కూలం కావడం చేతనూ, వినియోజకునకు కూడా ఇది వ్యతిరేకమైనదవడం వల్లనూ, తుదకిది అపజయం పొంది తీరు తుంది.

6. నూలు వడికే పని నిర్మూలమైనందుకు నేనూ విచార పడ్డాను. కాని సహజకారణాలవల్ల, అనగా కాలం కలసి వచ్చే పనిముట్లను కనిపెట్టడంవలన, అలా తప్పని సరిగా జరుగవలసి వచ్చింది.

7. భారత వ్యవసాయకుని పతనానికాతడే బాధ్యుడు. ఒకప్పుడెంతో బాగుండే పత్తి వ్యవసాయాన్ని ఆయన అల సత్వంవలన అలక్ష్యం చేశాడు.

8. కాబట్టి పత్తియొక్క నాణ్యమును పెంపొందించడమే నేను వ్యవసాయకునకు చేయగలిగిన పరమోత్తమమైన సేవ.

9. " ఈ పనికిమాలిన రాటాలను ప్రతి యింట్లోనూ పెట్టి నింపడంకంటె, ఆయన పత్తి వ్యవసాయాన్ని, ముఖ్యంగా పొడుగు పింజ పత్తి ఉత్పత్తిని పర్యాప్తం చేసేటందుకు ప్రచారం కావిస్తే, ఆయన ప్రభావం యిప్పుడేగాక ముందింకా అనేక తరాలవరకూ నిలచి ఉంటుంది, " అని ఆ గ్రంథకర్త ముగించాడు.

కాబట్టి భారతదేశముయొక్క ఆర్థిక మోక్షమునకు యేది అత్యంతావసరమని నేననుకొంటున్నానో, దానినే ఈ గ్రంథకర్త కేవలం పొరపాటుగా భావిస్తున్నాడన్న విషయం పాఠకుడు గ్రహించగలడు. కనుక ఈ సందర్భంలో మాకు రాజీ లేదు. నాచే ఉదాహరింపబడిన ఇండియా ప్రభుత్వంవారి ఉపోద్ఘాతంలో యేమి ఉన్నప్పటికీ, ఈ గ్రంథకర్త మాత్రం ప్రభుత్వ వైఖరినే ప్రకటిస్తున్నాడు. కనీసం ఈ ఉద్యమంలోనైనా కలిసి పనిచేయవలెనని ప్రభుత్వం వారినీ సహకారవాదులనూ కూడా నేనాహ్వానించాను. అందులో యిమిడి ఉన్న రాజకీయాలలో వారికి నమ్మకం లేదు కనుక వారు వాటిని లక్ష్యపెట్టనే అక్కరలేదు. ఒక వేళ వారు అనుకొన్నదానికి విరుద్ధంగా, చర్ఖాయొక్క పెంపు రాజకీయాధికారముయొక్క అభివృద్ధిగా పరిణమించేయెడల వారందుకు విచారపడవలసిన అవసరం లేదు

కదా! ఖాదీ మీద యుద్ధం సాగించేకంటె, దాని ప్రయోజనాన్ని ప్రచారంచేసి, భారత వ్యవసాయకునికి నష్టదాయకంగాను, విదేశీ ఉత్పత్తిదారుకు లాభదాయకంగాను వారు వ్యవహరిస్తున్నారనే భయంకరమైన అనుమానాన్ని వారు నిర్మూలించి ఉండవలసింది. నా ఆహ్వానం ఎప్పటికీ అలాగే ఉంటుంది. జాతీయ కార్యక్రమంలోని యితర భాగాల విషయంలో యేమి జరిగినా, స్వదేశీమాత్రం ప్రస్తుత రూపంలో శాశ్వతంగా ఉండగలదని నా జోస్యం. ఇండియాలోని దారిద్ర్యాన్ని పారద్రోలవలెనంటే స్వదేశీ అలా ఉండి తీరవలసిందే.

ఆర్థిక శాస్త్రం నాకు తెలియకపోయినప్పటికీ, ఆర్థిక శాస్త్రగ్రంథాలలో ఉదాహరింపబడిన సిద్ధాంతాలనబడేవి, మీడులు పారసీకులయొక్క ధర్మసిద్ధాంతాలవలె ఎప్పటికీ మార్పుచెందనివికానీ, అన్ని కాలాలలోను అందటికీ వర్తింపచేయతగినవి కానీ కావని నేను ధైర్యంగా చెప్పగలను. ఇంగ్లాండు దేశపు ఆర్థిక వ్యవహారాలు జర్మనీ ఆర్థిక వ్యవహారాలకు భిన్నంగా ఉన్నవి. ప్రభుత్వ ధన సహాయంతో పెంపొందిన బీటు పంచదారవలన జర్మనీ భాగ్యవంతమయింది. విదేశీ దుకాణాలను స్వార్థంకోసం వినియోగించుకోవడంతో ఇంగ్లాండు భాగ్యవంతమయింది. ఒక చిన్నప్రదేశంలో సాధ్యమైన పని 1,900 మైళ్ల పొడుగు, 1,500 మైళ్ల వెడల్పుగల ప్రదేశానికి సాధ్యంకాకపోవచ్చును. ఒక దేశముయొక్క ఆర్థిక విషయాలు ఆ దేశపు శీతోష్ణస్థితిని బట్టి, భూగర్భ స్థితిని బట్టి, నైసర్గిక స్థితినిబట్టి, నిర్ణయింపబడతవి. ఈ అన్ని ముఖ్య విషయాలలోను ఇండియా పరిస్థితు ఇంగ్లాండు పరిస్థితులకు భిన్నంగా నున్నవి. ఇంగ్లాండుకు మాంసంగా ఉండేది చాలా

సందర్భాలలో ఇండియాకు విషమవుతుంది. ఇంగ్లాండు శీతోష్ణ స్థితిలో గోమాంసపు తేనీరు మంచిదికావచ్చు. కాని ధార్మిక నిష్ఠగల ఇండియాయొక్క ఉష్ణస్థితిలో అది విషంగా పరిణమిస్తుంది. బ్రిటిష్ ద్వీపాలలోని ఉత్తర భాగంలో మంచి నిషా గలిగిన విస్కీ అవసరం కావచ్చును. భారతీయుని విషయంలో అది, వానిని పనికిమాలినవానిగా చేస్తుంది. సంఘంకూడా ఒప్పుకోదు. స్కాట్లండులో కోటు తప్పని సరి; కాని ఇండియాలో అది సహించడానికి వీలులేని బరువు. ఏ దేశము పారిశ్రామిక దేశమో, ఏ దేశపు ప్రజానీకం నగరాలలో నివసిస్తూంటుందో, లేక నివసించగలదో, ఏ దేశపు ప్రజలితరదేశపు ప్రజలను పీడించకుండా బ్రతికేటందుకు లెక్కపెట్టక తమ అసహజ వ్యాపారరక్షణకోసం అధికతమమైన నావికాదళాన్ని పోషిస్తూంటారో, ఆ దేశానికి స్వేచ్ఛావ్యాపారం ఆర్థికంగా మంచిదికావచ్చును. (పాఠకుడు గ్రహిస్తూన్నట్లు నేను దాని నీతిని ప్రశ్నిస్తూన్నప్పటికీ కూడా) కాని ఇండియా విషయంలో స్వేచ్ఛావ్యాపారం అపాయంగా పరిణమించి బానిసత్వం తెచ్చిపెట్టింది.

ఇక, మిస్టరు కౌబ్రో ప్రతిపాదనలను గూర్చి :

1. ఈ ఉద్యమం స్వచ్ఛందమైన నిషేధపు పన్నుగా ఉపయోగించేటందుకే ఉద్దేశింపబడింది.

2. కాని అది పెట్టుబడిదారుకు అనవసర లాభం కలుగకుండాను, వినియోజకునకు హాని కలుగకుండాను ఉద్దేశింపబడింది. పరివర్తనదశలో బహు స్వల్ప కాలం మాత్రం, ఇప్పటివలెనే కుటీర పరిశ్రమల ధరలు బాగా పెరిగిపోవచ్చును. అయితే వినియోజకులలో అత్యధిక

సంఖ్యాకులు, ఉత్పత్తిదారులు కూడా కాగలరు గనుక ఆ ధరల పెరుగుదల తాత్కాలికం మాత్రమే. ఇంటిదగ్గర వంట ఎలా ఎక్కువ ఖరీదు కాదో, ఇంటి వంటకు బదులుగా హోటలు వంటను పెట్టించడానికి ఎలా వీలు లేదో ఆలాగే కుటీరాలలో తయారైన నూలూ, బట్టా విషయం కూడా. అవి అయినా ఎక్కువ ఖరీదు కావు. మన జన సంఖ్యలో యిరవై అయిదు కోట్లకుపైగా నూలు వడికి, ఆ నూలు తమకు సమీప ప్రదేశాలలోనే నేయించుకోగలరు. ఈ జనసంఖ్య తమ భూములను అంటి పట్టుకొని ఉండి సంవత్సరంలో కనీసం నాలుగు నెలలు పనిలేకుండా ఉంటున్నారు.

ఆ తీరిక సమయాలలో తాము వడికి నేయించుకొన్న యెడల, వారి ఖాదీతో యే మిల్లు బట్టా పోటీ చేయలేదు. ఈ విధంగా ఉత్పత్తిఅయిన బట్ట, వారికి సాధ్యమైనంత చౌకలో లభించే బట్ట. ఈ పనిలో తక్కిన జనం పాల్గొననియెడల, ఈ ఇరవై ఐదు కోట్ల మంది ఉత్పత్తి చేసిన బట్టలో తమకు కాగా మిగిలిన బట్టను, వారికి తేలికగా సరఫరా చేయవచ్చును.

3. ఇండియా మిల్లులలో ఉత్పత్తి అయిన వాటితో పోటీచేసే వాటికంటె, పోటీచేయనివే ఎక్కువగా దిగుమతి అవుతూన్న మాట నిజం. కాని నా కార్యక్రమంలో ఆ ప్రశ్నే ఉదయించదు. ఎందుకనగా విదేశాలపైన వాణిజ్య యుద్ధం సాగించడం కాదు నా కార్యక్రమంలోని ప్రధానాశయం. భారతీయుల తీరిక కాలాన్ని సరిగా వినియోగించడంద్వారా, భారత దేశంలో పెరిగిపోతూన్న పేదరికాన్ని సమాజపద్ధతులతో పారద్రోలడమే మా ఆశయం.

4. బహిష్కార విధానంయొక్క అంతిమ ఫలితం, బట్ట ధర పెరిగిపోవడం కాదని యిదివరకే నిరూపించి ఉన్నాను.

5. సరఫరాను బట్టీ, కావలసిన సరుకును బట్టీ ధర ఉంటుందనే ఆర్థిక సూత్రానికి నాచే సూచింపబడిన ఈ బహిష్కరణ విధానం ప్రతికూలం కాదు. సరఫరాకు, కావలసినంత ఉత్పత్తిచేయడంవలన, ఆ సూత్రాన్నే యిది భగ్నం చేస్తూన్నది. అతి సున్నితమైన బట్టలను వాడుతూ, మన ఊహాకందని అనేక మిశ్రమ రంగులు గల వివిధరకాల వస్త్రాలను ప్రోత్సహించే వారు తమ అభిరుచిని మార్చుకోవలెనని ఈ ఉద్యమం కోరుతూన్నది.

6. ఈస్టిండియా కంపెనీ ప్రతినిధులు బుద్ధిపూర్వకంగా మిక్కిలి అమానుషమైన పద్ధతి ప్రకారం, చేతితో నూలు వడికే వృత్తిని విధ్వంసం చేసినారన్న విషయం ఈ పుటలలో నేను నిరూపించి ఉన్నాను. క్రమానుగతమైన క్రూరవిధానంద్వారా కృత్రిమంగా విధ్వంసం చేయబడక పోయినట్లయితే, ఏ యంత్రాలవలననూ కూడా ఈ జాతీయ కళా పరిశ్రమకు స్థానభ్రష్టత్వం కలిగి ఉండేది కాదు.

7. పత్తి పంట క్షీణదశకు రావడానికి బాధ్యత భారత వ్యవసాయకునిదని నేను చెప్పజాలను. నూలు వడకడం నాశనమయినప్పుడే, అందుకు కావలసిన ప్రోత్సాహమంతా హరింపబడింది. ప్రభుత్వం వ్యవసాయకుని విషయంలో ఎప్పుడూ శ్రద్ధవహించనే లేదు.

8. నా కార్యక్రమం, ఇప్పటికే వ్యవసాయకుని దృష్టిని పత్తిని అభివృద్ధి చేసే పనికి మఱల్చిందని నేను సగర్వంగా భావిస్తున్నాను. కళాభిజ్ఞులైన దేశీయులు సన్న నూలు కావలెనని కోరడంచేత, పొడుగుపింజ పత్తి అవసరమవు

తుంది. పత్తి వ్యవసాయమొక్కటే ఇండియా యొక్క పేదరికాన్ని పోగొట్టదు. ఎందువల్లననగా, అప్పటికి కూడా తప్పని సరిగా తటస్థించిన సోమరితనం మాత్రం ఎప్పటివలెనే ఉండిపోతుంది.

9. కాబట్టి ఆర్థిక దుస్థితిని సహజంగా, నిరాడంబరంగా, ఖర్చు లేకుండా, వ్యాపార సరళిని పరిష్కరించగల గౌరవం ఒక్క చర్ఖాకే కలదని నా అభిప్రాయం. కనుక ఆ గ్రంథ కర్త అజ్ఞానంవలన సూచించినట్లు చరఖా నిష్ప్రయోజనం కాకపోవడమే కాక, ప్రతి యింట్లోనూ తప్పనిసరిగా ఉండవలసిన ఉపయోగకరమైన వస్తువు. అది జాతీయాభ్యుదయానికి చిహ్నంకావడంచేత స్వాతంత్ర్యానికి కూడా చిహ్నమే అవుతుంది. అది వ్యాపారయుద్ధానికి చిహ్నం కాదు. వ్యాపారశాంతికి చిహ్నం. ప్రపంచంలోని యితర దేశాలకిది విద్వేషసందేశాన్ని కాక సుహృద్భావ స్వయంసహాయసందేశాన్ని ప్రతిపాదిస్తుంది. ప్రపంచ సౌభాగ్యాన్ని స్వార్థంకోసముపయోగించుకొంటూ ప్రపంచశాంతికి భంగకరంగాఉండే నౌకాదళము యొక్క రక్షణ దీనికవసరంలేదు. కాని లక్షలాది ప్రజలు తమఇళ్లలో స్వయంగా తమ ఆహారాన్ని తయారుచేసుకొంటూన్నట్లే, తమనూలును తమయిండ్లలోనే వడుకుకోగల ధర్మనిష్ఠ ఒక్కటే దీనికి కావాలి. నేను చేసిగానీ చేయకపోయిగానీ ఉన్న అనేక తప్పిదాలకు నన్ను భావి సంతానం తిట్టిపోయవచ్చును. కాని చరఖాయొక్క పునరుద్ధరణాన్ని సూచించినందుకు మాత్రం నేను వారి ఆశీర్వాదాలను పొందగలనని నా విశ్వాసం. నాయావద్విశిష్టమూ నేను దానిపైన ఒడ్డుతున్నాను. రాట్నపుచక్రం తిరిగినప్పు

డల్లా అది, శాంతి ప్రేమ సుహృద్భావములను పడుకుతుంది. దాని విధ్వంసం భారతదేశానికి బానిసత్వమును తెచ్చిపెట్టి నట్లే, స్వచ్ఛందమైనదాని పునరుద్ధరణం, అందులోని అన్ని సుగుణాలతో పాటు, భారత స్వాతంత్ర్యంగా కూడా పరిణమించగలదు.

—యంగిండియా, 8-12-1921

# 20

## మిల్లు బట్ట

చేతితో వడికిన నూలుతో చేతితో నేసిన ఖాదీయే—దూదీ, ఉన్నీ, పట్టూ కూడా కావచ్చు—ఈనాడు పరిపాటిగా వాడుకలో ఉండే, జాతీయార్థిక నిర్మాణంలో మిల్లుబట్టయొక్క స్థానమేమిటని తరుచు ప్రశ్నింపబడుతూంటుంది. గ్రామాలలోని లక్షలాది ప్రజలు నేడు రాటముయొక్క సందేశాన్ని అందుకొని, అర్థంచేసుకొని ప్రచారం చేస్తున్నట్లయితే, మన కుటుంబ ఆర్థికవ్యవస్థలో, విదేశీమిల్లుబట్టకుగానీ, స్వదేశ మిల్లుబట్టకుగానీ స్థానం లేదని నాకు తెలుసును. అంతేకాక మిల్లుబట్ట పూర్తిగా అంతర్ధానమైనందున మనజాతి మరింత ఎక్కువ సౌఖ్యంగా ఉంటుందికూడా.

ఈ ప్రకటనకు యంత్రాలతోగాని, విదేశీ వస్త్ర బహిష్కారప్రచారంతోకానీ యేమీ సంబంధము లేదు. ఇది అచ్చంగా భారతప్రజానీకముయొక్క ఆర్థిక పరిస్థితులకు సంబంధించిన సమస్య మాత్రమే.

అయితే మన భారతప్రజానీకానికి ఏకైక శరణ్యమన దగిన రాటమువైపుకు త్వరలో వారిని మరలించే అద్భుత సంఘటన యేదైనా దైవప్రేరితంగా తటస్థిస్తేనే తప్ప, లేనియెడల కనీసం ఇంకా కొన్ని సంవత్సరాలవరకైనా, ఇండియన్ మిల్లులు ఖాదీ ఉత్పత్తికితోడుగా పనిసాగించవలసి ఉంటుంది. మిల్లు పరిశ్రమను జాతీయనిధిగా పరిగణిస్తూ దాని అర్హస్థానాన్ని వారు గుర్తించేటట్లు, మనగొప్ప మిల్లుయజమానులకు నచ్చేవిధానం ప్రబోధించగలమని మనం గట్టిగా

ఆశించవలసివుంది. ప్రజాసామాన్యానికి నష్టదాయకంగా ధనమార్జించవలెనని మిల్లుయజమానులు కోరకూడదు సరి కదా, పైపెచ్చు జాతీయావసరముల కనుగుణ్యంగా వారి వ్యాపారాన్ని దిద్దుకొని, వంగరాష్ట్ర విభజనాందోళన సమయంలో వారిపైన న్యాయంగా ఆరోపింపబడిన నిందను తుడిచివేసుకోవలసివుంది. ఇండియాలోని మిల్లుయజమానులు మాంచెస్టరుధోవతీలకంటె తమధోవతులు తక్కువనాణ్యం కలవైనప్పటికీ, తమ ధోవతులకు మాంచెస్టరు దోవతులకంటె యెక్కువధర వేస్తున్నారని, ఇప్పటికికూడా కలకత్తానుండీ తదితర ప్రదేశాలనుండీ ఆరోపణలు వస్తూన్నవి. ఈ విషయం నిజమే అయితే, ఇది చాలా దేశాభిమానవిరుద్ధమైన పని. ఇటువంటి దురాశవలన ఉద్యమానికీ దేశానికీ కూడా నష్టం. దేశం నూతనజన్మయెత్తి క్లిష్టస్థితిలో నున్నప్పుడు అత్యధికమైన ధరలువేస్తూ, కేవలం ప్రజా ఉద్యమానికి దూరంగాఉండడమేగాక, తమకేమీ పట్టనట్లు అలక్ష్యంగా ఉండడం నిజంగా క్రూరం.

మిల్లు యజమానుల కిష్టమైతే, విశాల దృక్పథంతో పరిస్థితిని బాగా అర్థంచేసుకొని, ఖాదీ ఉద్యమాన్ని పెంపొందనిస్తూ ప్రజల వాంఛలను పరిశీలించి, దేశముయొక్క నూతనావసరాల కనుగుణంగా తమ ఉత్పత్తులను సరిదిద్దుకోవచ్చును.

కాని వారలాచేసినా చేయకపోయినా భారతస్వాతంత్ర్యోద్యమగమనము ఒక సంఘంమీదగానీ, మతాలమీద గాని ఆధారపడి ఉండేటందుకు వీలులేదు. ఇది ప్రజానీకానికి సంబంధించిన మహోద్యమం. ప్రజలు స్వాతంత్ర్యంకోసం త్వరితంగా పురోగమిస్తున్నారు. సువ్యవస్థాపితమైన పెట్టుబడి దారీవర్గంవారి సహాయంతోగానీ, వారి సహా

యం లేకగానీ, వారు ముందుకు నడచితీరాలి. కాబట్టి ఈ ఉద్యమం పెట్టుబడిదారీ వర్గంతో నిమిత్తంలేని ఉద్యమంగానే ఉంటుంది. కాని వారికి ప్రతికూలమైనది మాత్రం కాదు. పెట్టుబడిదారీ వర్గంవారు ప్రజాసామాన్యానికి సహాయపడితే అది వారి కీర్తిని ఇనుమడింప చేయడమేగాక, ఆశుభదినం త్వరితంగా రావడానికికూడా తోడ్పడుతుంది.

పూర్వంకూడా ఇందుకు భిన్నంగా జరుగలేదు. ఇండియా చరిత్రలో పెట్టుబడిదారీ వర్గానికీ కార్మికవర్గానికీ ఎప్పుడూ కలతలులేవు. చాతుర్వర్ణములను గూర్చిన భావన, ఎంత ధార్మిక సంబంధమైనదో అంత ఆర్థిక రాజకీయ సంబంధములు కలదికూడా. ముఖ్యంగా ధార్మిక సంబంధము కలిగి, పేదల కుపకారదాయకమైన మహమ్మదీయ సంస్కృతి కూడా మిశ్రమనుయినందున, పరిస్థితి చెడుగా పరిణమించ లేదు. ఇస్లాంమతం, ఎక్కువ వడ్డీలకు అప్పులీయడం అక్రమాలా నిషేధించిన కారణాన, ధనాన్ని అధికంగా కూడబెట్టడంకూడా అది నిషేధించినట్లే కనిపిస్తుంది.

ఈ ప్రస్తుత తరుణంలోకూడా ధనికవర్గం దూరంగాఉందని చెప్పడానికి వీలులేదు. తిలకు స్వరాజ్యనిధికి అత్యంతౌదార్యంతో విరాళమిచ్చినది అడకువగల ధనికుడే. కాని మిల్లు యజమానులలో అత్యధిక సంఖ్యాకులీ ఉద్యమానికి దూరంగా ఉన్నారని సవిచారంగా ఒప్పుకోని తీరాలి. బట్టల పరిశ్రమ ఈ దేశంలోకల్లా పెద్ద పరిశ్రమ. అది యేదో ఒక నిర్ణయానికిరావలసిన తరుణం వచ్చింది. ఆ నిర్ణయం చేసుకొంటుందో, అటూ ఇటూ కాకుండా ఉంటుందో ?

యంగ్ఇండియా, 23-2-1922

# 21

## రాటం

[1922 ఫిబ్రవరి 15 వ తేదీని గాంధీజీ బార్డోలీ నుండి సర్ డానియల్ హామిల్టన్‌కు రాటమునుగూర్చి ఒక ఉత్తరం వ్రాశారు. సర్ డానియల్ జవాబుతోసహా ఆ ఉత్తరాన్ని యిక్కడ ఉదాహరిస్తున్నాము. సం.]

### I

ప్రియమైన అయ్యా,

నాతో మీరొకగంట మాట్లాడకోరుతూన్నట్లు మిస్టర్ హాడ్జి నాకు వ్రాస్తూ, అందుకు తగిన అవకాశాన్ని నేను కల్పించవలెనని ఆయన నాకు సూచించారు. ఆ పని సంతోషంగా చేస్తున్నాను. రాటమునుగూర్చి తప్ప తక్కిన నా యితర కార్యక్రమమునుగూర్చి మీకుత్సాహం కలిగించేటందుకు మీకాలాన్ని నేను వినియోగించుకోదలచుకోలేదు. నా బాహ్య కార్యక్రమమంతటిలోకీ రాటమే అత్యంత శాశ్వతమైనదనీ అత్యంత ప్రయోజనకరమైనదనీ నా నమ్మకం. భారత దేశమునందలి లక్షలాది కుటీరములలోని ఆర్థిక దుస్థితిని పరిష్కరించగలిగినది రాటమని నావాదం. దానిని బలపరచడానికి కావలసినంత సాక్ష్యం ఉంది. రాటం కరువులకు ప్రతికూలంగా, ప్రయోజనకరమైన భీమాగాకూడా ఉంటుంది.

గొప్ప వైజ్ఞానిక శాస్త్రజ్ఞుడయిన డాక్టరు పి. సి. రే ను మీరెఱుగుదురు. కాని ఆయన రాటమునందు చాలా అభినివేశం కలవాడయినాడన్న సంగతి మీకు తెలిసిఉండకపోవచ్చును. ఆధునికార్థంలో ఇండియా పారిశ్రామిక దేశం కానక్కర

లేదు. 1,900 మైళ్ల పొడవు 1,500 మైళ్ల వెడల్పుగల ఈ విశాలదేశంలో 750,000 గ్రామాలు అకడకడా వ్యాపించియున్నవి. ప్రజలు తమభూమిని అంటిపట్టుకొని ఉన్నారు. అత్యధిక సంఖ్యాకులైన జనులు చాలీచాలని తిండితో బ్రతుకుతున్నారు. ఇందుకు వ్యతిరేకంగా ఎవరేమి చెప్పినా, ఈ దేశంలో ఒక కొననుండి మరొక కొనవరకూ కళ్లుతెఱచుకొని ప్రయాణంచేస్తూ, లక్షలాది ప్రజలతో సన్నిహితంగా కలుసుకొన్న పిమ్మట, పేదరికం పెరుగుతూన్నదనడానికి సందేహించ నక్కరలేదు. కనీసం సంవత్సరంలో నాలుగు నెలలు లక్షలాది ప్రజలకు పనిలేక తప్పనిసరిగా సోమరితనంతో ఉంటున్నారనడానికికూడా సందేహంలేదు. వ్యవసాయానికి విప్లవకరములయిన మార్పులవసరంకావు. భారతీయ వ్యవసాయకునకొక అదనపువృత్తి కావాలి. రాటమును ప్రవేశపెడితే ఆయనకది అత్యంత సహజమైన వృత్తి అవుతుంది. చేమగ్గంకాదు. రాటం ప్రతియింట్లోనూ ప్రవేశపెట్టడానికి వీలయినది. నూరు సంవత్సరాల కిందటివరకూ అది ప్రతియింట్లోనూ ఉంటూవచ్చింది. చేమగ్గం అలా ప్రతియింట్లోనూ పనిచేయడానికి వీలులేనిది. ఆర్థిక వత్తిడివలనగాక బుద్ధిపూర్వకమైన బలప్రయోగము వలన రాటం నిర్మూలింపబడిందని నమ్మకమైన రికార్డులద్వారా రుజువుకాగలదు. కాబట్టి రాటాన్ని పునరుద్ధరించడంవలన భారతదేశపు ఆర్థిక సమస్య ఒక్కదెబ్బలో పరిష్కారం కాగలదు. మీ రిండియాను ప్రేమిస్తున్నారనీ, ఇండియాయొక్క ఆర్థిక నైతికాభ్యుదయములను గూర్చి మీకు మిక్కిలి శ్రద్ధఉందనీ నాకు తెలుసు. మీకు గొప్పపలుకుబడి ఉందని కూడా నే నెఱుగుదును. రాటం పక్షాన మీ పలుకుబడిని వినియోగించుకోవలెనని నాకోరిక. జయప్రదమైన సహ

కార సంఘాలను స్థాపించేటందుకది ప్రబలతమమైన శక్తి. లక్షలాది ప్రజల సహకారంలేనిదే ఈఘనకార్యాన్ని యెన్నటికీ జయప్రదంగా సాధించలేము. ఇప్పటికే వేలకొలది స్త్రీలను అవమానకరమైన జీవితమునుండి తప్పించేటందుకు తగిన సాధనమని రుజువవుతూండడంచేత, యిది ఆర్థికంగానే కాక నైతికంగాకూడా ప్రయోజనకరమైన పరికరము.

యంత్రాలనుగూర్చిన నావింత అభిప్రాయాలను మీరు విని ఉండవచ్చును. అందువలన మీరు ముందుగానే ఒక ప్రతికూలాభిప్రాయానికి రాకుండా ఉండగలరని ఆశిస్తున్నాను. యంత్రాలద్వారా ఇండియాలో ఏ ఇతర పరిశ్రమను అభివృద్ధి చేసినప్పటికీ నేను ప్రతికూలంగా చెప్పేదేమీలేదు. ఇండియాలోగానీ ఇండియాకు వెలుపలగానీ ఉన్న పెద్దపెద్ద మిల్లులలో తయారైన బట్టను ఇండియాకు సరఫరాచేయడం, ఇండియాలోని ముఖ్యకేంద్రాలలోని, రొట్టెల పరిశ్రమాలయాలనుండి చౌకగా రొట్టెలను సరఫరాచేసి భారతీయ గృహాలలోని పొయ్యిని విధ్వంసంచేయడంవంటిదనీ అది మొదటిరకపు ఆర్థిక ప్రమాదమనీ నా అభిప్రాయం.

మీ విశ్వాసపాత్రుడు,

యం. కె. గాంధీ

II

వారేక్‌హిల్

లోటన్

ఎస్సెక్సు, 8 మార్చి 1922

ప్రియమైన గాంధీజీ,

మీరు ఫిబ్రవరి 15 వ తేదీని వ్రాసిన ఉత్తరం ఇప్పుడే చేరింది. మీ ఉత్తరాన్ని అందుకోవడం నాకు చాలా

సంతోషం. మీ ఈ ఉత్తరమునకు మన ఉభయుల స్నేహితుడూ అయిన మిస్టరు పోడ్జికి నేను చాలా ఋణ పడి ఉన్నాను. కాని, నేను ఇప్పుడిప్పుడే తీవ్రమైన శస్త్ర చికిత్సనుండి తేరుకొంటూ ఇంకా నా గదిలోనే ఉంటున్నాను. ఈనాటి మెయిలులోనే నేను మీ ఉత్త రానికి దీర్ఘంగా వ్రాయజాలకపోయినందుకు మీరు నన్ను మన్నిస్తారనుకొంటాను. ముందు వ్రాయగలనని ఆశిస్తు న్నాను. ఈలోగా మీరు చరఖానుగూర్చి వ్రాసిన విషయాలను పురస్కరించుకొని, భారతీయ గ్రామ జీవిత మునుగూర్చి నాకు తెలిసినదానినిబట్టి, ఆధునిక ఆర్థిక సహాయం కలిగించి మంచి అవకాశ మిస్తే యెడల, రాటమేగాక చేమగ్గంకూడా ఆవిరిశక్తి యంత్రంతో జయ ప్రదంగా పోటీ చేయగలదని నేను చెప్పగలను. ఏడాదిలో నాలుగు నెలలు వ్యవసాయపుపనులు లేకచాలావరకు వ్యర్థంగా కాలక్షేపం కావడానికి బదులు, ఇందు కుపయోగ పడ్డందున అయ్యేఖర్చేమీ లేకపోవడమే అందుకు కారణం.

బ్రహ్మాండమయిన ఫ్యాక్టరీ విధానము వలని చెడుగులను గూర్చి మీ అభిప్రాయంతో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను. పనిచేయని భాగస్వాములకు పంచిపెట్టే లాభాలను బట్టి గాక, పరిశ్రమలో పనిచేసేవారి శరీరాలపైన ఆత్మల పైన భావాలపైన కలిగించే పరివర్తనమునుబట్టి పరిశ్రమ యొక్క విలువ కట్టవలసిఉంది. కొనేవానికి కొద్ది అణాలు కలసివచ్చే బట్టప్రియం; బొంబాయి బారకీసులలో నివసించే స్త్రీపురుషులయొక్కయు పిల్లలయొక్కయు జీవితాల నది చౌక చేస్తున్నది గనుక అది ప్రియం. అనుచితమైన ధన రూపంలోకంటె ఉచితమైన జీవితరూపంలో లెక్కింపతగిన

స్వరాజ్యశక్తి ఇండియాలో పెంపొందగా చూడవలెనని నా కోరిక. మీ కోరికకూడా అదేనని నా అభిప్రాయం. ధనబలానికి బానిసలుగా గాక యజమానులుగా నున్న ముప్పయి రెండు కోట్ల జనులు కలిగిన జాతి ప్రపంచంలో మహోత్తమమైన జాతిఅవుతుంది. ఇటువంటిస్వరాజ్యాన్ని కొలది సంవత్సరాలలోనే పొందవచ్చును. దానికి మార్గం, వరి, గోధుమలు పండే పొలాలను విస్తరింపజేయుడంగాని, విప్లవమనే సహారా యెడారి కాదు. ఆయితే ఆర్థిక వ్యవహారాలను గూర్చిన విషయం పెద్దది. ఈ రోజున నేను దానిని గూర్చి చర్చించజాలను. కాని కొద్దికాలంలో చర్చించవచ్చును.

ఈలోగా మీరు ప్రభుత్వంపైన యెక్కువ కఠినంగా ఉండరని ఆశిస్తున్నాను. నేనుకూడా ప్రభుత్వాన్ని తీవ్రంగా విమర్శించడంలో యెవ్వరికీ తీసిపోలేదు. ఇంకా విమర్శింప వలసి వస్తుందనికూడా అనుకొంటున్నాను. ఉప్పు పన్నును రెట్టింపు చేయుడమూ పోస్టేజీని హెచ్చించడములను గూర్చి నేను గట్టిగా వ్యతిరేకంగా ఉన్నాను. ఎంతచెప్పినా ఎంతచేసినా, భారతదేశాన్ని ఐక్యం కావించి ఒకజాతి కావడానికవకాశం కల్పించింది ఈ ప్రభుత్వమే. పాత ప్రభుత్వానికి లయకారకుడుగా గాక నిపుణుడైన నూతన యుగ నిర్మాతగా మిమ్ములను నేను భావించవలెనని నా కోరిక. నాకేమీ స్వార్థం లేదు. నూతన భారతదేశ నిర్మాణంలోనే నేవిధంగానైనా తోడ్పడగలిగినయెడల ఆపని సంతోషంగా చేస్తాను.

ప్రేమ పూర్వక నమస్కారములతో.

మీ ఋజువర్తనుడు,

యంగిండియా, ౯-౫-౧౯౨౨. డి.యమ్.హామిల్టన్.

# 22

## స్వేచ్ఛావ్యాపారము - రక్షణ

తాతా ఉక్కు పరిశ్రమకు రక్షణయిచ్చే ఉద్దేశాన్ని గూర్చి, నా అభిప్రాయాలను తెలియచేయవలసిందిగా నేను కోరబడ్డాను. అందువల్ల ప్రస్తుత తరుణంలో యేమి ప్రయోజనమున్నదో నాకు తెలియడంలేదు. ఉక్కు పరిశ్రమనుగూర్చిన ఈ ప్రతిపాదనలోని గుణా గుణాలు కూడా నాకేమీ తెలియవు. అయితే, నేను పెట్టుబడిదారీ వర్గానికి శత్రువుననీ, నాకధికారం ఉంటే యంత్రాలనూ వాటి ఉత్పత్తులనుకూడా నాశనంచేస్తాననీ లోకంలో వున్న అపోహను తొలగించేటందుకీ అవకాశం తీసుకొంటున్నాను. నిజమేమిటంటే, నేను రక్షణ కావలెనని గట్టిగా కోరేవాడను. తాను ఉత్పత్తి చేసిన సరుకులను, నిస్సహాయమైన ప్రజానీకముపైన రుద్దేటందు కెగుమతీచేసి, బయటనుండి కారు చౌకగా తనకు కావలసిన సామగ్రిని సరఫరా చేయించుకొనకోరే ఇంగ్లాండుకు స్వేచ్ఛా వ్యాపారం శ్రేయస్కరం కావచ్చును. కాని స్వేచ్ఛా వ్యాపారం భారత దేశపుకుటీరపరిశ్రమలనుపూర్తిగా విధ్వంసం చేయడంద్వారా భారతీయ కర్షకవర్గాన్ని పాడుచేసింది. పైగా రక్షణ లేకుండా యేకొత్తవ్యాపారమూ విదేశీ వ్యాపారంతో పోటీచేయ లేదు. ప్రభుత్వంవారి గ్రాంటువలనను, దిగుమతి పన్నువలననూ, నేటాల్ తన పంచదార పరిశ్రమను పెంపొందించుకొన్నది. ప్రభుత్వగ్రాంటుల విధానంద్వారా జర్మనీ బీటు పంచదారను అభివృద్ధి చేసుకొన్నది. నేనెప్పుడూ చేతితో వడికిన నూలు మీదనే పక్షపాతం గలిగి ఉన్నప్పటికీ, మిల్లు పరిశ్రమకు

రక్షణ ఈయడం నాకు సదా సంతోషమే. ప్రయోజన కరములైన అన్ని పరిశ్రమలకూ నిజంగా నేను రక్షణ యిస్తాను. భారత దేశము యొక్క ఆర్థిక నైతిక క్షేమాన్ని ప్రభుత్వం నిజంగా కోరుతూన్నదని నేను తెలుసుకొన్నప్పుడు, నా ప్రభుత్వ ప్రాతికూల్యం చాలావరకు తగ్గిపోగలదు. విదేశీ బట్ట యావత్తు నిషేధింప బడేటంతవరకూ వస్త్ర పరిశ్రమకు ప్రభుత్వంవారు రక్షణ ఈయవలసిఉంది. ప్రభుత్వంవారు కొనేబట్ట యావత్తూ ఖాదీలోనే కొని చర్ఖాను ప్రచారంలోకి తీసుకొని రావాలి. తమ ఆదాయాన్ని గూర్చిన ఆలోచన లేకుండా, త్రాగుడు, నల్లమందు గంజాయి వ్యాపారాన్ని నిషేధించి, అందులో నష్టమైన రెవిన్యూ మేరకు సైనిక వ్యయాన్ని ప్రభుత్వంవారు తగ్గించాలి. అటువంటి సంతోష ప్రదమైన సంఘటన జరిగినప్పుడు నా ప్రతికూలతకు కారణమే ఉండదు. అప్పుడు సంస్కరణలనుగూర్చి నిజమైన చర్చ జరగడానికి మార్గమేర్పడుతుంది. ఈ పై చర్యలు రెండూ గౌరవ ప్రదమైన రాజీకిముందు, ప్రభుత్వంవారి హృదయ పరివర్తనమును స్పష్టంగా ప్రదర్శించ గలవని నా అభిప్రాయం.

యంగిండియా, 15-5-1924.

# 23

## సామ్రాజ్యవస్తు బహిష్కరణము

సామ్రాజ్యవస్తు బహిష్కారోద్యమం ఎప్పటికి కప్పుడు ప్రజలదృష్టిని ఎలా ఆకర్షించ కోరుతూన్నదో ఆశ్చర్యంగా ఉన్నది. అహింసా పూర్వక అసహాయోద్యమ దృక్పథం నుండి చూచేయెడల అది యెంతమాత్రమూ సమర్థనీయం కానట్లు కనిపిస్తుంది. కేవలమది ప్రతీకారోద్యమం కావడం వలన దండాత్మకంగా కూడా ఉంటుంది. కాబట్టి కాంగ్రెసు అహింసా పూర్వక అసహాయోద్యమమును అంటిపెట్టుకొని ఉన్నంతవరకూ, విదేశీవస్తు బహిష్కరణమునకు వెలియైన ప్రత్యేక బ్రిటిష్ వస్తు బహిష్కరణ విషయం తలపెట్ట డానికే వీలులేదు. ఈ అభిప్రాయం కల కాంగ్రెసు వాదిని నేనొకడనే అయినయెడల, కడచిన ప్రత్యేక కాంగ్రెసులో చేయబడిన తీర్మానాన్ని రద్దుచేయించేటందుకు, వచ్చే కాంగ్రెసులో నేనే ఒక తీర్మానాన్ని ప్రతిపాదించవలసి ఉంటుంది.

అయితే ప్రస్తుతం ఈ బహిష్కరణమును గూర్చిన నైతిక సిద్ధాంతాన్నిగాక దాని ప్రయోజనాన్ని గూర్చియే చర్చించ దలచుకొన్నాను. మితవాదులు కూడా ఈ బహిష్కారోద్య మంలో జోక్యం కలిగించుకొన్నారని తెలిసినంత మాత్రంతో దీనినిగూర్చి ప్రశ్నించేటందుకు మనం జంక నక్కరలేదు. పైగా, కాంగ్రెసునూ, వారునూ చేపట్టిన ఈ ప్రతీకార బహిష్కరణోద్యమం వలన ప్రయోజనం లేకపోగా పై పెచ్చు మరొకసారి మన చేతకాని అక్కసును వెళ్లపోసు కోవడం అవుతుందని నాతోపాటు వారుకూడా ఏకీభవించే

యెడల, కృతనిశ్చయులై ఉత్సాహంతో యావద్విదేశీ వస్త్ర బహిష్కరణోద్యమాన్ని చేపట్టి విదేశీ వస్త్రాలకు బదులుగా భారతదేశపు మిల్లుబట్టలను గాక, చేతితో వడికిన నూలుతో తయారైన ఖాదీని ప్రవేశపెట్ట వలసిందిగా వారిని నేను ప్రార్థిస్తాను.

బహిష్కరణోప సంఘంవారి నివేదికను చదివే భాగ్యం నాకు కలిగింది. బ్రిటిష్ వస్తు బహిష్కరణ విషయంలో గాని, సామ్రాజ్య వస్తు బహిష్కరణ విషయంలోగాని పూర్తిగా మనం చేయగలిగినదంతా అందులో ఉదాహరింప బడినది. ఆ విషయంలో అంతకు మించి చెప్పడాని కేమీ లేదు. అయితే ఆ నివేదిక ఆ బహిష్కారోద్యమానికి అనుకూలంగా గాక ప్రతికూలంగా అప్రతిహతమైన వాదాన్ని ప్రతిపాది స్తున్నది. సామ్రాజ్య వస్తువులలో అత్యధిక భాగమైన రైల్వే సామగ్రివంటి దానిని, ప్రభుత్వంవారు కానీ ఇంగ్లీషు కంపెనీల వారు కానీ దిగుమతి చేయించుకొంటున్నారు. అత్తరులు, సబ్బులు, బూటు మొదలైన చిన్న చిన్న వస్తువు లను, బహిష్కరణమంటే ఎప్పుడూ ఇష్టం ఉండని భోగా సక్తులగు భారతీయులు చాలావరకు తెప్పించుకొంటున్నారు. ఈ సంగతి ఆ నివేదికలోనే స్పష్టంగా ఉన్నది. ఆ అంకెలను మనం జాగ్రత్తగా పరిశీలించినయెడల, ఈ చిన్న చిన్న వస్తువుల బహిష్కారమును, కాంగ్రెసు వాదులూ మిత వాదులూకూడా కలిసి సమర్థతతో నిర్వహించినప్పటికీ, సంవత్సరానికి కోటి రూపాయిల మొత్తంకంటె ఎక్కువ ఉండదని తెలుస్తుంది. అటువంటి బహిష్కారోద్యమం వలన కెన్యాలోని ఆంగ్లేయులను కానీ, లేక మొత్తం ఆంగ్లేయు లను కానీ, వారి రాజనీతిని మార్చుకొనేటట్లు చేయగలమని నమ్మేమనిషి చాలా సాహసుడైన ఆశావాదియై ఉండాలి.

కాని, బొంబాయి మున్సిపల్ కార్పొరేషన్ వారి సామ్రాజ్య వస్తు బహిష్కార తీర్మానము, రాయిటరుచే ఉచితంగా కేబిలు చేయబడి నప్పుడది తేలికగా ఎంత ఆందోళన కలిగించిందో చూడండి! అని విమర్శకు డంటాడు. బ్రిటిష్ వ్యాపార పద్ధతులు మాకు బాగా తెలుసును. అటువంటి ఆందోళనలను చూచి అనవసరంగా మనం ఉత్సాహ పడకూడదు. 'ఇంగ్లాండుకు హాని చేయ పూనుకొన్న నీతినియమాలు లేని భారతీ యాందోళకులకు' ప్రతికూలంగా చెప్పినదల్లా నమ్మే ప్రజాసామాన్యాన్ని రెచ్చగొట్టడానికి అటువంటి ఆందోళన తఱచు చేయబడుతూంటుంది. ఒకవేళ వారి కటువంటి ఉద్రేకం కలుగకపోతే, అది వ్యాపారమునందలి ప్రతి పరివర్తనమును ప్రతి నడకనూ అర్థంచేసుకోగలిగిన బ్రిటిష్ వ్యాపారస్థుల సూక్ష్మబుద్ధికి గుఱుతు. అటువంటి సూక్ష్మబుద్ధి వలననే, ఊహించడానికి వీలైన యేఆకస్మిక సంఘటనను ఎదుర్కోవడానికైనా వారెప్పుడూ సంసిద్ధంగా ఉంటారు. కాబట్టి ఇంగ్లాండు దేశముయొక్కగానీ, లేక యేయితర దేశముయొక్కగానీ ఉద్రేకాలపైనా, ప్రశంసలపైనా మనం ఆధారపడి ఉండరాదని నేను ప్రజలను కోరుతున్నాను. వారు భయపడినట్టిగానీ, శ్లాఘించినట్టిగానీ మనచర్య, దానంతటది తగినంత ఫలప్రదమైనది కాకపోయినట్లయితే, మన చర్యను గూర్చి వారి భీతిగాని స్తుతిగానీ మన ఆదర్శాన్ని అందుకొనేటందు కెప్పుడూ తోడ్పడదు.

మనకోపం మనలను గుడ్డివాళ్లనుగా చేయకపోయినట్లయితే, మన జాతీయావసరములకు కొన్నిటికి మనం బ్రిటిష్ వస్తువులపైన ఆధారపడి ఉన్నట్లు మనం గుర్తించిన వెంటనే, బహిష్కార తీర్మానమునుగూర్చి మనం సిగ్గుపడవలసి ఉంటుంది. ఇంగ్లీషు గ్రంథాలు, ఇంగ్లీషు మందులు

లేకుండా మనకు గడవనప్పుడు, జినీవా గడియారాలు మనం తెప్పించుకోగలము గనుక ఇంగ్లీషు గడియారాలను బహిష్కరించ వలెనా? మనకు ఇంగ్లీషు గ్రంథాలవసరం గనుక అవి తెప్పించుకోక మనకు తప్పనప్పుడు బ్రిటిష్ గడియారములను, పరిమళ ద్రవ్యాలనూ దిగుమతి చేయించుకొంటూన్నవాడు అతని వ్యాపారాన్ని త్యజిస్తాడని మనం ఎలా అనుకొంటాము? నా ఇంగ్లీషు దాయి ఒక ఆమె నేను భుజించిన దానికంటె ఎక్కువ భుజించవలెననీ, నిద్రించిన దానికంటె ఎక్కువ నిద్రించవలెననీ ఎన్నోవిధాల ప్రేమతో నన్ను బలవంత పెడుతూండడం చేత నే నామెను 'సర్వాధికారి' అని పిలవడం నాకిష్టంగా వుండేది. ఆమే హౌస్ సర్జనూ కలసినన్ను క్షేమంగా ఒక ప్రైవేటు వార్డుకు చేర్చిన తరువాత ముసిముసినవ్వులు నవ్వుతూ కళ్లలో దావుడు మూలాత లాంటే మెఱుపు చూపుతో ఆమె నన్నుచూచి నెమ్మదిగా ఇలా అన్నది: "సమస్త బ్రిటిష్ వస్తు బహిష్కార తీవ్ర వాదులైన మీరు, బ్రిటిషు. శస్త్రచికిత్సా పరికరముల నుపయోగిస్తూన్నట్టినీ, బ్రిటిషు మందులను త్రాగిస్తూన్నట్టినీ, బ్రిటిష్ సర్జను యొక్క శాస్త్రజ్ఞానంతోనూ బ్రిటిష్ దాయియొక్క ఉపచారంతోనూ మీ ప్రాణాన్ని కాపాడుకో వలసివచ్చిందికదా" అని, నా గొడుగుతో మీకు నీడ యిస్తూన్నప్పుడు నాకు నవ్వువచ్చి ఆపుకోలేకపోయినాను. మిమ్ములను మే మిక్కడకు తీసుకొనివచ్చినప్పుడు మీకు నీడ యిచ్చిన గొడుగు బ్రిటనులో తయారైనదన్న సంగతి మీకు తెలుసునా? సామ్రాజ్యాలకు ఆదాయి విజయ ప్రమోద భరితమైన తన వ్యాఖ్యానాన్ని ముగించగానే ప్రేమ పూర్వకమైన ఆమె ఉపదేశం కింద నేను పూర్తిగా పరాజితుడను కాగల

నని, ఆమె వాస్తవంగా విశ్వసించింది! కాని అదృష్ట వశాత్తూ ఆమె ఆత్మవిశ్వాసాన్ని నేనిలా అని కల్లోలపరచ గలిగాను. 'అసలు విషయాలను యథాతథంగా తెలుసు కోవడం మీ రెప్పుడు ప్రారంభిస్తారు? కేవలం బ్రిటిష్ వస్తువైనంత మాత్రంతో నేను దేనినీ బహిష్కరించనని మీకు తెలుసునా? నేను బహిష్కరించేది కేవలం పూర్తిగా విదేశీ వస్త్రాలు. ఇండియాలోకి ఎక్కువగా విదేశీవస్త్రాలు దిగుమతి కావడంచేత, లక్షలాది మా ప్రజలు దరిద్రులైన కారణాన నే నలా చేయవలసి వచ్చింది.' అంతేకాక నే నామెకు ఖాదీ ఉద్యమంలో ఉత్సాహంకూడా కల్గించకలిగాను. బహుశా ఆమె ఖాదీలోకిమారి ఉంటుందేమో కూడా. ఏమైనప్పటికీ ఖాదీలోఉండే న్యాయాన్నీ, దాని అవసరాన్నీ, ప్రయోజనాన్నీ ఆమె గ్రహించింది; కాని ఆమె, పూర్తిగా వ్యర్థమైన అర్థం లేని బ్రిటిష్ వస్తు బహిష్కారోద్యమాన్నిగూర్చి (న్యాయంగానే) నవ్వివేయగలిగింది.

ఈ ప్రతీకార బహిష్కరణోద్యమాన్ని ప్రోత్సహించే వారందరూ తమ యిళ్లనూ తమ వస్తువులనూ చూచుకొంటే వారి స్థితి ఎంతహాస్యాస్పదమో, నేనా వర్గానికి చెందిన వాడననుకొని నన్నుగూర్చి నాదాయి గ్రహించినట్లుగా, వారు కూడా గ్రహించగలరనడానికి సందేహంలేదు.

కెన్యాలోని నా దేశీయులకు న్యాయం కలుగచేయవలెననే కోరికలోగాని, సాధ్యమైనంత త్వరలో స్వరాజ్యాన్ని సంపాదింపవలెననే అభిలాషలోగాని నే నెవ్వరికీ తీసిపోను. కాని కోపంతో కూడిన అసహనం మన ఆదర్శాన్ని భగ్నం చేస్తుంది. అన్ని పక్షాలూ—మితవాదులు, కాన్సిలు ప్రవేశ వాదులు నో చేంజర్లు ఈ అందరూ జయప్రదంగా కలిసి

చేయగలిగిన పనిలో చేతులు గలిపి మనధ్యేయాన్ని అందుకోడాని కేమభ్యంతరము ? ఇందుకు నే నిదివరకే జవాబిచ్చాను. కాని తరువాతి సంచికలో ఈ విషయాన్ని పూర్తిగా పరిశీలించి, ఈ ఒకటే పరిష్కార మార్గమే మన కెందుకుసాధ్యమో నిరూపించగలను.

యంగిండియా, 15-5-1924.

## 24

## విదేశీ వస్త్రాలను బహిష్కరించండి.

క్రిందటివారం, సామ్రాజ్య వస్తు బహిష్కారోద్యమము యొక్క నిరర్థకతను నిరూపించడానికి ప్రయత్నించాను. ఫలప్రదమూ, అత్యావశ్యకమూ అయిన ఒకేఒక బహిష్కారోద్యమమునుండి, అది జాతీయ దృష్టిని మరలిస్తూన్నందువలనకూడా అపాయకరంగా ఉందని నేను మనవి చేస్తున్నాను. అహింసను మన ఆలోచననుండి తొలగించినట్లయితే, మన ధ్యేయాన్ని సాధించడానికి రాజకీయాలలో అహింస ఒక్కటే సరియైన ఉపాయమని నాతో ఏకీభవించనివారున్నూ, అహింసా పద్ధతులు అపజయం పొందినవని సంతృప్తి చెందినవారున్నూ, యితర ఉపాయాలు అంతకంటె ఎక్కువ ఫలప్రదంగా ఉంటవని అనుకొనే యెడల వారు వాటిని అవలంబించడం న్యాయమేగాక కర్తవ్యంకూడా నని నే ననేః సార్లు అంగీకరించి ఉన్నాను. అయితే, ప్రస్తుత విధానం నిలిచి ఉన్నంతవరకూ, సామ్రాజ్య వస్తు బహిష్కరణమెంత మాత్రమూ ఆచరణీయంకాదు. నాకు తెలిసినంతవరకు అహింసకు, అందులో యిమిడిఉన్న సమస్తమునకూ ప్రత్యామ్నాయంగా ఉండతగినది సాయుధ విప్లవము. అందుకు తగిన సన్నాహాలను మనము చేయకోరినట్లయితే, సామ్రాజ్యవస్తు బహిష్కారోద్యమం న్యాయసమ్మతం కావడమేగాక, దానికి జాతీయ కార్యక్రమంలో అవసరమైన స్థానంకూడా ఉంటుంది. దాని ఉనికీ దానికోసం చేసే తీవ్ర ప్రచారములూ, మన అశక్తత మనకు తెలిసివచ్చేకొద్దీ మన రక్తాన్ని అంతకంతకు వేడెక్కించి తీరుతవి. కాబట్టి

అటువంటి ప్రచారం యొక్క సహజ ఫలితం అన్నిచోట్లా క్రమ శిక్షణలేని దౌర్జన్యంగా పరిణమిస్తుంది. అప్పుడది అణచివేయబడినప్పటికీ పరవాలేదు. అప్పటికికూడా అది సాయుధ విప్లవమునకు శిక్షణగా భావింపబడుతుంది. ఒక్కొక్కసారి అణచివేయబడునప్పుడల్లా అది ఎక్కువ మందిని భయభ్రాంతులుగానూ, కొద్ది మందిని మఱింత పట్టుదల కల వారుగానూ చేసేమాట నిశ్చయం. ఆ విధంగా కృత నిశ్చయులైన కొద్దిమందిలోనుంచి, బలియందీనైలెంటును కూడా చుట్టు ముట్టిన సిపాయి దళమువంటి దొకటి ఉద్భ వించవచ్చును. మన జాతీయోద్యమ కార్యకర్తలు ఇండియా నూతన చరిత్రను సృజించచాలదనీ, యిరోపా ఖండపు దేశాలు చేసినట్లుగానే చేయవలెనని ఒక నిర్ణయానికి వచ్చేయెడల, వారి సామ్రాజ్య వస్తు బహిష్కరణోద్యమమును అర్థంచేసు కొని స్తుతించగలను. అది యెన్నటికీ జయప్రదం కాకపోయి నప్పటికీ, దానిని ఆదర్శంగానే ఉంచుకోవలసి వస్తుంది. ఎందు వల్లననగా అది అవసరమైన ఉద్రేకాన్ని ఉత్పత్తి చెసే టందుకు కావలసిన ఫ్యాక్టరీలలో ఒకటిగా భావింపబడు తూన్నది. ఇండియా ఇష్టపడితే కాలంతో పాతవడి పోయిన పద్ధతిని అవలంబించడానికి దానికి హక్కున్నది. ఆ హక్కును ఆమెకడనుండి తీసివేయడానికి ప్రపంచంలో ఎవ్వరికీ సాధ్యంకాదు.

కాని సాయుధ విప్లవ పంథా ఇండియాకు పనికిరానిదని నేను నమ్మకంగానూ ధైర్యంగానూ చెప్పగలను. ఒక వేళ ఇండియా ఆ మార్గాన్నే అవలంబించే యెడల అది ఈ దిగువ పరిణామాలకు సంసిద్ధం కావలసి ఉంటుంది.—

(1) తరతరాలవరకు విదేశ పరిపాలనకు లోబడియైనా ఉండాలి.

(2) పూర్తిగా హిందూపరిపాలనకో లేక పూర్తిగా ముసల్మాను పరిపాలనకో దాదాపు శాశ్వతంగా లొంగియైనా ఉండాలి.

కేవలం హిందూ ఇండియాను సాధించలేక పోయినయెడల ఆంగ్లేయులతో సాధ్యమైనంత మంచి షరతులతో రాజీచేసుకోవడానికి సంసిద్ధంగా ఉన్నహిందువులనూ, ఇండియాపైన కేవలం ముసల్మానుల పరిపాలనను బలవంతంగా ప్రవేశపెట్టగలిగేటంత వఱకూ ఆంగ్లేయుల అధికారాన్ని సరిపెట్టుకొని ఊరుకొనే ముసల్మానులనూ నే నెఱుగుదును. ఈ అల్పసంఖ్యాకులను ఒప్పించేటందుకు నాకు వాదంలేదు. వారలా ఎండమావులకోసం శ్రమ పడుతూండ వలసిందే. కాని విదేశీ అధికారమును సహించలేని అత్యధిక సంఖ్యాకులున్నారనీ, భారతదేశాన్ని ఆ అధికారం నుండి తప్పించడానికి తగిన విధానము కొఱకు వారాత్ర పడుతున్నారనీ కూడా నాకు తెలుసును. వివేకవంతులు కేవలం అహింసా పద్ధతిని అవలంబించే యెడల, హిందువులు, ముసల్మానులు, ఇంకా వివిధ మతాలకు చెందిన తదితరులు కూడా సమాన ప్రతిపత్తిమీద పాల్గొనడానికి వీలైన స్వరాజ్యం వారూహించగలిగిన కాలం కంటెకూడా చాలా తక్కువకాలంలోనే సంపాదించేటందుకు సాధ్యంకాగలదని నేను వారిని ఒప్పించడానికి నిరాశచెందను. అంతేకాదు అటువంటి స్వరాజ్యం ఇంకే యితర పద్ధతి వల్లను లభ్యంకాదని కూడా వారిని ఒప్పించగలను.

కాని ప్రస్తుతం, కాంగ్రెసు సిద్ధాంతాన్నిబట్టి కాంగ్రెసు వాదులు దౌర్జన్యానికి దారితీసే వాతావరణాన్ని కల్పించకూడదని నా అభిప్రాయం. కొనసాగని సామ్రాజ్యవస్తు బహిష్కార

ణోద్యమం అటువంటి వాతావరణాన్ని కల్పించి తీరుతుంది. కాబట్టి ఆ బహిష్కార తీర్మానము కాంగ్రెసు సిద్ధాంతానికి ప్రతికూలం గనుక అది చెల్లకూడదనే వరకూ నేను పోతున్నాను. కాని ఈవిషయం నిర్ణయించ గలిగింది కాంగ్రెస్సే.

కాబట్టి ఇందుకు బదులుగా నేను పాఠకుని దృష్టిని విదేశ వస్త్రబహిష్కరణము పైన కేంద్రీకరింప చేయ తలపెట్టినాను. మితవాదులూ, జాతీయ వాదులు, కాంగ్రెసు వారు, ఈ అందరూ విదేశీమిల్లు బట్టలనూ, ఇండియను మిల్లు బట్టలనూ పూర్తిగావిడిచి పెట్టి తమస్వోపయోగం నిమిత్తం చేతితో వడికిన నూలుబట్టలను వాడుతూన్న యెడలను, ప్రతిరోజూ ఒక నిర్ణీత కాలంవరకు తమకు తాము ధర్మనిష్ఠతో నూలువడకుతూ, తమకుటుంబం లోని ప్రతిమనిషినీ అలాచేసేటట్లు ప్రోత్సహిస్తూన్న యెడలను, తమశక్తికొలదీ తమయిరుగు పొరుగు వారిలో రాట్నాన్ని, ఖాదీవాడుకను ప్రవేశపెట్టగలిగిన యెడలను, భారత జాతి ఒకటి సంవత్సరంలో విదేశీ వస్త్రబహిష్కారాన్ని కొనసాగించ గలదని నేను సూచిస్తున్నాను. వారేసందర్భంలోనూ విదేశీ మిల్లు బట్టలను ఎలాధరించకుండా ఉంటారో అలాగే ఇండియా మిల్లు బట్టలను కూడా ధరించకుండా ఉండాలి. ఈ రెండు నిషేధాలకూ గల వ్యత్యాసాన్ని నేను నిరూపించ వలసిఉంది. విదేశీ వస్త్ర బహిష్కార మెప్పుడూ ముఖ్యావసరమే. మిల్లు బట్టకు శాశ్వత జాతీయ బహిష్కరణ మనేది లేదు. కాని ప్రస్తుతం కావలసిన బట్ట యావత్తూ ఇండియాదేశపు మిల్లులు మాత్రమే ఎన్నటికీ సరఫరా చేయలేవు. రాటము చే మగ్గమూ సరఫరా చేయగలవు. అయితే చర్ఖా వలన ఉత్పత్తి అయిన ఖాదీ, అందటిలోనూ యింకా బాగా వాడుకలోకి రావలసిఉంది. భారతదేశంలోని మేధావంతులు

మొదలుపెడితేనే ఈ పని జరుగుతుంది. కాబట్టి వారు ఖాదీ మాత్రమే వాడవలసిఉంది. మన మిల్లులకు మన ప్రోత్సాహమవసరం లేదు. వారి సరుకులు బాగా ప్రచారంలోనే ఉన్నవి. అంతేకాదు, ప్రజలకు మిల్లులపైన అధికారం లేదు. అవి ధర్మసంస్థలు కావు. అవి స్పష్టంగా స్వార్థపరత్వంకలవి. వాటి ప్రచారం అవి చేసుకొంటున్నవి. వారు కాలపరిస్థితులను గమనిస్తూన్నట్లయితే, వారి బట్టను చౌక చేసి ప్రస్తుతం ఖాదీ వాడబడుతూండని ప్రదేశాలలో దానిని సరఫరా చేస్తూ విదేశీ వస్త్ర బహిష్కారానికి వారు తోడ్పడగలరు. వారి కిష్టమైతే ఖాదీతో పోటీ పడకుండా, ఖాదీకి తోడుగా పని చేసేటందుకు ఒప్పుకొని తృప్తిపడ వచ్చును. ప్రతి జాతీయోద్యమ కార్యకర్తా ధార్మిక నిష్ఠతో మిల్లు బట్ట వాడుకను మానివేస్తేనే తప్ప, విదేశవస్త్ర బహిష్కారం తక్షణం జరుప్రదం కాదు. నిజానికీ ప్రతిపాదన మిక్కిలి తేలిక. దీనికోసం యేవిధమయిన వాదము అవసరం లేదు. ఖాదీ అమ్మకం కావలెనంటే విద్యావంతులకు దానిపైన పక్షపాతం కుదరాలి.

సామ్రాజ్య వస్తు బహిష్కారమునకు విభిన్నమై దానికి ప్రత్యామ్నాయంగా ఉండే విదేశ వస్త్ర బహిష్కారము త్వరలో ఫలప్రదమయ్యేటందుకు తగిన ఉపాయంగా, ఖాదీ యొక్క ఉపయోగమును గూర్చి యింతవరకూ పరిశీలించాను. ఖాదీకి గల ఈశక్తికి తోడు, పస్తులు ఉంటూన్న లక్షలాది ప్రజలకది ఆహారం చేకూర్చే శక్తికూడా ఉండడం వలన దాని స్థితి అప్రతిహతమవుతూన్నది.

చర్ఖావాతావరణం ఎందుకు సృజింపబడవలెనో, జాతీయక్షేమముకోసం చర్ఖా అవసరాన్ని గుర్తించిన ఆబాలగోపాలమూ ప్రతిరోజూ కొంతకాలం మతధర్మంగా ఎందుకు

నూలు వడుకుతూండవలెనో బహుశా యిప్పటికి తేలికగా తెలిసి ఉంటుంది. ఇండియాలోని కర్షకులు ప్రపంచమంతటిలోకీ ఎక్కువ కష్టపడేవారు, బహుశా ఎక్కువ సోమరులూ కూడా; ఆ కష్టంకాని, ఆ సోమరితనంకానీ వారికి తప్పని సరిగా తటస్థించినవే. వారి పొలాలు పండేటందుకు వారు పనిచేసి తీరాలి. ఈస్టిండియా కంపెనీవారు నూలు వడికే వృత్తిని నిర్మూలంచేసినందున వారికి చేతినిండా పని లేక వారు సోమరులు కావలసివచ్చింది. మనం ముందుగా ఒరవడిపెడితే రైతులు తిరిగీ చర్ఖాను చేపట్టగలరు. శుష్కోపదేశాలు వారికేమీ నచ్చవు. వేలకొలదీ ప్రజలు పరమార్థంగా వడుకుతూన్నప్పుడు ఖాదీకి మామూలు ధరను మనం నిలిపినట్లయితే వడికిన వాళ్లకు ఎక్కువ మజూరీ ఈయడానికి వీలవుతుంది. 1919 లో నేను పాంచాలంలో సంచారం చేసినప్పుడు పంజాబు సోదరీమణులు ప్రేమపూర్వకంగా మణుగుల కొలదీ వడుకు నూలు నామీద వేశారు. కాబట్టి సత్యాగ్రహాశ్రమంలో తయారు చేయబడిన ఖాదీఎక్కువ చౌకగా అమ్మగలిగాను. నా యిష్టమైతే, వృత్తి కోసం నూలు వడికే వారికి ఎక్కువ మజూరీయిచ్చి, ఖాదీ ధర తగ్గించకుండా ఉండేటందుకు నా కవకాశముంది. కాని నేనలా చేయలేదు. ఎందువల్లనంటే, ఖాదీ ఉద్యమం ప్రారంభదశలోనున్న ఆ నాడు అలక్ష్యంగా వడకబడిన నూలుకు కూడా, ఎక్కువ మజూరీ అనగా పౌనుకు 4 అణాలు కూడా యిస్తూండే వాడను. కెన్యా నిర్ణయంవలన కష్టం కలిగిన మితవాదులు, కాంగ్రెసు వాదులు, కెన్యాలోని తెల్లవలస జాతుల నెత్తిని నిష్ప్రయోజకమైన సామ్రాజ్య వస్తు బహిష్కారమును విసిరి వేయడంకంటె, తమక ష్టమితం చిక్కినప్పుడు ఖాదీ ఉద్యమాన్ని సంపూర్ణ జయప్రదం చేసేటం

దుకు ప్రయత్నించి సమస్త విదేశ వస్త్ర బహిష్కారము నెందుకు నిరాటంకం చేయకూడదు? విదేశ వస్త్ర బహిష్కారము కెన్యా భారతీయులకు దుఃఖోపశమనంగా ఉండడమే గాక స్వరాజ్యమును కూడా సంపాదించి పెట్టగలదని నేను రుజువు చేయవలసి ఉందా?

యంగిండియా, 22-5-1924

# 25

# యంత్రపు నూలు - చేనూలు.

ఒకప్పుడు రాటముపైన ప్రమాణంచేసిన ఒకానొక మిత్రుడు ఈ విధంగా అంటున్నాడు:—

"మీ కార్యక్రమం నిరర్థకం. యంగిండియా, నవజీవన్ పుటలలో పాత తుక్కులను ప్రమోదకరంగా చేసేటందుకు మీ శరీరాన్ని బుద్ధినీ ఎందుకు వృథాగా వినియోగిస్తారు? అవి చదివినందువల్ల ఇక నాకేమీ ప్రయోజనం లేదు. రాటం నిష్ప్రయోజకమైనదని నా కనుభవంవలన తెలిసి వచ్చింది. ప్రజలు ప్రథమోత్సాహ పరంపరలో కొన్న రాటాలు పుచ్చిపోతూన్న సంగతి మీకు తెలుసునా? అవి గిట్టుబాటు కావు.

ఇంతకన్న మంచి పని యేదైనా మీరు చేయవలెనని నా సలహా. చేనూలుకు బదులుగా యంత్రపు నూలు తయారు చేయించండి. ప్రతి తాలూకాలో నూలు మిల్లొకటి కట్టించండి. లాభాలను జాతిపరం చేయండి. దేశాభిమానులు మాత్రమే, లాభాలకుగాక దేశభక్తితో మిల్లులను నడపాలి. స్థానికంగా నేసే వారికి మాత్రమే ఆనూలు పంచి పెట్టండి. ఆ నేసినబట్ట ఆయా తాలూకాలలో మాత్రమే పంచి పెట్టబడవలెను. అందువల్ల కాలము, రవాణా ఖర్చుకూడా కలిసివస్తుంది. ముందు ఒక తాలూకాలో ఈ విధంగా యేర్పాటుచేయండి. మీరు మహోపకారం చేయగలరు."

ఈవాదం పైకి చక్కగా కనపడుతూన్నది కనుకనూ, తనకు తోచినప్రకారం చర్ఖానుగూర్చి కృషిచేసిన మనిషి కడనుండి రావడంచేతనూ, ఈ మిత్రుని అభిప్రాయాలవంటి అభిప్రాయాలుకల వారికొఱకు, దీనిని నేను పరిశీలింప పూనుకొన్నాను. ఖాదీ ఉద్యమం ఎప్పటినుండి ప్రారంభమయిందో అప్పటినుండీ ఈ ప్రణాళికకూడా ఉన్నదన్న సంగతి పాఠకునకు నేను చెప్పవలసిన అవసరం లేదు. సామెత చెప్పినట్లు, చెల్లని నాణెమువలె అది ఎప్పటికప్పుడు తిరిగివస్తూనే ఉన్నది.

వస్తువులు చేయకుండా బ్రతుకవలెనంటే అదనపు సంపాదన అవసరమైన లక్షలాది జనానికిది వృత్తిని కల్పించి స్వాల్పాదాయాన్ని సమకూరుస్తుందన్న ప్రధాన సత్యాన్ని ఈ మిత్రుడు మఱచిపోయినాడు. ప్రతి యింట్లోనూ చేమగ్గాన్ని ప్రవేశపెట్టడం సాధ్యంకాదు. ప్రతి ఇంట్లోను ఒక రాటం, ప్రతి ఊళ్ళోనూ ఒక మగ్గం—ఇదీ సిద్ధాంతం. ప్రతి తాలూకాలోనూ ఒక నూలు మిల్లు స్థాపించబడినట్లయితే అనేకమందిని కొద్దిమంది వినియోగించుకొనే స్వార్థవిధానము, జాతిపరం చేయడంగా అది పరిణమిస్తుంది. తాలూకా మిల్లులో అందరూ నియోగింపబడజాలరు. అంతేకాక 2,000 తాలూకాలకు సరిపోయే మిల్లులకు కావలసిన యంత్ర సామగ్రిని దిగుమతీ చేయించుకోవలసి వస్తుంది. మిల్లుల పరిపాలనకొఱకు, మిల్లులను నడిపేటందుకు, నిపుణులకు శిక్షణ ఈయవలసి ఉన్నది. చరఖావలె, మిల్లు కుక్కగొడుగు లాగున పెరుగజాలదు. చరఖా పోతే అనుకొనేవారుండరు. మిల్లు దివాళాతీస్తే ఆ తాలూకా ప్రజలలో కావలసినంత గందరగోళం పుడుతుంది. కాబట్టి ఆ మిత్రుడు చేసిన సూచన యెంతమాత్రమూ ఉచితంగా లేదని నా అభిప్రాయం. కాని ఆయనకందులో నమ్మకముంటే, ప్రయత్నంచేయవలసిందని నేనాయనకు సలహాయిచ్చాను. నేను మాత్రం నాపని చేయవలసిందే. మఱొకటి నన్నాకర్షించదు. చర్ఖాలో నాకు స్వతస్సిద్ధమైన శోభ కనుపిస్తుంది. దాని లోపాన్ని గ్రహించజాలని మోటుమనిషినేమో నేను. కాని నాతప్పు నేను తెలుసుకోవడం నాకయిష్టంకాదు.

ఈ మిత్రుని ఉత్తరంచేరిన రోజునే, మిల్లు పరిశ్రమలో తనకు పది సంవత్సరాల అనుభవం ఉన్నదని వ్రాసిన మఱొక

మిత్రుని ఉత్తరంకూడా ఒకటి చేరింది. మిల్లు నూలు తయారుచేయడము, చేతితో నేయడము ఈ రెండూ ఆయన పరీక్షించాడు. ఇప్పుడు చేతితో వడికిన నూలు, చేతితో నేసిన బట్ట—ఈ రెంటి వ్యాపారమూ చేస్తున్నాడు. చివరకు చేయివే ఆదినుండి అంతమువరకూ ఆర్థిక విపత్తును పరిహరించగలదన్నాడు. ఈ అనుభవానికి ఎంత విలువవుంటే అంతవరకే యిస్తున్నాను. ఈ ప్రయోగం యావత్తూ చాలా అస్పష్టంగా ఉండడంచేత దీనినిగూర్చి స్థిరమైన అభిప్రాయం యిచ్చేటందుకు వీలు లేకుండా ఉంది. కాని ఈ రోజున రాటం ఒక్కటే అనేక పేద కుటుంబాలకు సౌఖ్యావహంగా ఉండకలదనే మాటమాత్రం నిజం. దానికి ప్రతిగా మఱొకవస్తువేదీ ఉపయోగపడదు. రాటాన్ని గూర్చి తప్ప యింకే యితర వస్తువునుగూర్చి ఈ కింది విషయాలను చెప్పడానికి వీలులేదు.

ఇందులో చేసిన కృషి వృథా కాదు, ఇందులో ఆశాభంగం లేదు. ఇందులో యే కొంచెమైనా, మనిషిని పెద్దకష్టం నుండి రక్షిస్తుంది.

యంగిండియా, 26-6-1924.

# 26

# మిల్లుల పక్షప్రవాదం

ఒక విలేఖకుడిలా వ్రాస్తున్నాడు

"మీరు చెప్పేదానిప్రకారం, స్వరాజ్య సంపాదనకు ఖద్దరున్నూ రాటమున్నూ ఉత్కృష్ట సాధనాలు. మీ ఉదారాశయాలను కానీ, మీ స్వార్థత్యాగమును కానీ కాదనడానికి వీలులేదు. పూర్తిగా ఖద్దరునే వాడవలెనని మీరు పట్టుపడుతూండడంచేత, అనేకమంది మిల్లు యజమానులను, చాలామంది మిల్లులలోని భాగస్వాములనూ భయంకర కష్టనష్టాల పాలు చేస్తున్నారన్న విషయం మీరెలా గుర్తించడం లేదో అర్థం కావడంలేదు. మిల్లు యజమానులు తమ మిల్లులపైన పెద్ద పెద్ద మొత్తాలను వెచ్చించి ఉన్నారు. ఇక భాగస్వాముల మాట; వారిలో చాలామంది మామూలుగా కాలక్షేపం చేయడానికికూడా సరిపోని ఆర్థికస్థితికలవారు. వారు, మిల్లులు బాగా అభివృద్ధికావడంచూచి షేరులమీదవచ్చే పెద్ద పెద్ద లాభాలతో సుఖంగా జీవిద్దామని గంపెడాశతో, ధైర్యంగా వారికున్నది యావత్తు మిల్లులలో షేరులకింద వేసుకొని కూర్చున్నారు. దిగువ తరగతులలో ఉండి గౌరవమన్నదేమో ఎఱుగక, ఏలాగో అలా జీవించడానికి వీలు కలిగిన అధిక సంఖ్యాకులకు అభ్యుదయం చేకూర్చవలెనని మీరిలా అనుకోవడంవలన, వారితో సమాన సంఖ్యలోనో కనీసం ఒక పెద్ద సంఖ్యలోనో ఉన్న, ఉన్నతమధ్యమ తరగతులకు చెందిన జనుల విధ్వంసమునకు మీరు నిశ్చయంగా కారకులవుతున్నారు.

2. సమస్త మానవానీకమునందు సానుభూతి కలిగి స్వార్థ రహితమైన భావాలతో మహాత్ముడుగా పేరొందిన మీరు ఒకవంక ఖద్దరునూ రాటమును తగినంతగా ప్రోత్సహిస్తూ, మఱొకవైపున మిల్లు యజమానులకు, అధిక సంఖ్యాకులుగా నున్న వారి భాగస్వాములకూ సహాయపడుతూ, మీ ఉత్కృష్ట బుద్ధి కౌశల్యము నుపయోగించి ఎవ్వరికీ అన్యాయం జరుగకుండా మధ్యమార్గాన్ని తొక్కడం మీకు సముచితంగా ఉంటుంది.

3. తప్పకుండా విదేశీవస్త్రాలను బహిష్కరించండి; కాని, ఖద్దరుగానీ మిల్లు బట్టకానీ ఎవరి యిష్టానుసారంవారు ధరించ నీయండి! అందువల్ల చాలామంది ఉన్నత మధ్య తరగతుల వారికి సహాయంచేసినవారవుతారు."

ఇది జాలికరమైన ఉత్తరం. ఈ విలేఖకుని భయాలు నిజాలు కావలెనని నా కోరిక. అప్పుడు మిల్లులకూ భాగ స్వాములకూ రాగలదనుకొన్న వినాశకాలం, వారికీ భారత దేశమునకూ కూడా స్వాతంత్ర్యోదయకాలంగా పరిణ మిస్తుందని ఆయన గ్రహించగలడు. ఆ నాడు భారతదేశం నూతన జీవితంతో స్పందిస్తూంటుందనీ, మధ్య తరగతుల వారు తమ మనుగడను, యిప్పటివలె పస్తులు పడుకొనే రైతులనుండి కాక ఐశ్వర్యవంతులైన కర్షకులనుండి పొంద గలరనీ, వ్యవసాయకులు, తమకవసరమై తమంతతాము ఉత్పత్తిచేసుకోలేని వస్తువులను సంతోషంగా తమ పంటను వెలపెట్టి పొందగలరనీ ఆయన తెలుసుకోగలడు. మిల్లులకు స్థానభ్రష్టత్వం కలిగించేటంత ఖాగా రాటం స్థాపించబడక పూర్వమే, తానూ తనతోడి భాగస్వాములు, మిల్లుల డైరెక్టర్లూ ఈ అందరూ ప్రజలతో సహకరించవలెనని,

కొంచెం ఆలోచిస్తే ఆ విలేఖకునికే బోధపడగలదు. రాటం భారత దేశపు మిల్లు బట్టకు తాకిడీకలిగించగలిగేముందు దాదాపు అరవైకోట్ల రూపాయల విలువగల విదేశీ బట్టకు చోటు లేకుండా చేయవలసి ఉన్నదనే విషయం ఈ విలేఖకునకు కొంత దుఃఖోపశాంతిని చేకూర్చుగాక! ఇక ఈ పుటలలో నే నుదహరించిన కారణాలనుబట్టి మనలో ప్రతిఒక్కరూ ఇండియన్ మిల్లుబట్టను కూడా మినహాయించి కేవలం ఖాదీని గూర్చియే ఆలోచించాలి. నా ప్రోత్సాహంకాని మరెవ్వరి ప్రోత్సాహంకాని మన మిల్లులకు అవసరంలేదు. వాళ్ల సొంత ప్రచారకులు వాళ్లకున్నారు. వాళ్ల వస్తువులను ప్రకటించుకొనే విధానాలుకూడా వింతయినవి. కాంగ్రెసు నిర్మాణంలో ఉన్నవారికి మిల్లు బట్టకట్టే స్వేచ్ఛ ఈయడం ఖద్దరును చంపడమే బజారులో ఖాదీకి గిరాకీ రావలెనంటె, దానికీ యతగినంత రక్షణ ఈయడ మవసరం.

ఈ విలేఖకునికీ, ఈయనవలె ఆలోచించేవారికీ చింతోపశమనం కలగడానికింతమాత్రం చాలు. మిల్లులకూ మధ్య తరగతుల వారికీ తటస్థించబోయే కష్టాలనుగూర్చి అజ్ఞాన జనితమైన భయంతో ఈ ఉత్తరం వ్రాయబడకపోయినట్లయితే, ఇది హృదయం లేకుండా చేసినపని అనిపిస్తుందని ఆ విలేఖకునికి నేను జ్ఞాపకంచేయవలసిఉంది. 'గౌరవం అనగా ఏమో తెలియక పవిధంగానైనా జీవించగల దిగువ తరగతుల లోనివారు' అని విలేఖకుడన్న మాట కర్థమేమిటి? దిగువ తరగతులలో ఉన్నవారికి 'గౌరవమనగా యేమో తెలియద'ని ఆయన నిశ్చయంగా చెప్పగలడా? వారి కేవిధమైన మనః ప్రవృత్తులూ లేవా? కోపం వచ్చేమాట అంటే వారికి బాధ కలుగదా? వారే విషయంలో తక్కువవారు? పేదరికం తప్ప! ఆ పేదరికానికైనా మధ్యతరగతులవారమైన మనమే

బాధ్యత వహించవలసివుంది. దిగువ తరగతులవారు, కేవలం చేతికీ నోటికీ సరిపుచ్చుకొనే జీవితమును గడపడమే కాదు, వారిలో అధిక సంఖ్యాకులు సగం తినీ తినకా కాలక్షేపం చేస్తూన్నారన్న సంగతి విలేఖకునకు తెలుసునా? 'దిగువ తరగతుల' వారికొరకు మధ్యతరగతులవారు బుద్ధిపూర్వకంగా నష్టాలు పొందుతూన్నయెడల, మధ్య తరగతులవారు తమ స్వార్థంకోసం దిగువ తరగతులవారి నుపయోగించు కొన్నందుకు కావించే కొద్ది పరిహారమవుతుంది. ఈ విలేఖకుడు ప్రజాసామాన్యపు దృష్టినుండి ఆలోచించి చర్ఖాను చేపట్టి, తనకన్న తక్కువ స్థితిలోనున్న దేశీయులతో లీనం కాకోరుతున్నాను.

ఈ విలేఖకుడు మఱొక సంగతికూడా జ్ఞాపకం ఉంచుకోవాలి. 'దిగువ తరగతుల' వారికి నష్టదాయకంగా, సకల మానవాభ్యుదయదృష్టితో మిల్లులయెడ నేను మృదుత్వం వహించవలెనని ఈయన చెప్పినట్లే, ఆ కారణంతోనే, యితర స్నేహితులుకూడా విదేశీ మిల్లులయెడల సహితం మృదుత్వం వహించవలెనని నన్ను కోరవచ్చును. విదేశీ మిల్లులు సామాన్య ప్రజాక్షేమానికి భంగం కలిగించిన మాట నిజమైనంతగా, వారు నన్నలా కోరేమాటకూడా నిజమే అయితే విదేశీ మిల్లులకు నష్టం కలిగినప్పటికీ, సామాన్యజనం చర్ఖాను తిరిగీ చేపట్టేటట్లు చేయవలెనని నా మానవాభ్యుదయ దృష్టి నన్ను ప్రేరేపిస్తుంది. అప్పుడుకూడా, అవసరమైతే, ఎవరి పేదరికంవలన తామైశ్వర్యవంతులైనారో వారికోసం ఆ స్వదేశీ మిల్లు యజమానులుసైతం నష్టపడవలసిఉంది.

రాట్నాలను తయారుచేసే ఒకానొక సాహసవ్యాపారి మన గ్రామాలలో చాక రాట్నాల పరిశ్రమాలయాలను స్థాపించి కుటుంబాలలో యిక వంటపని లేకుండా చేసేయెడల, ఆ సాహస వ్యాపారానికి ప్రతికూలంగా జాతిఅంతా తిరుగు బాటుచేస్తుందని నా అభిప్రాయం. ప్రజాక్షేమానికి ప్రతి కూలమైన మిల్లులను నేనేకారణాన వ్యతిరేకిస్తూన్నానో పై ప్రాతికూల్యతకు కూడా అదే కారణం.

యంగ్ ఇండియా, 17-7-1924.

# 27
# ఉత్పత్తిలో లోపమా?

వివేకవంతుడైన ఒకానొక మిత్రుడిలా వ్రాస్తున్నాడు:

"కడచిన 'యంగిండియా' సంచికలో మీరు ఖాదీ యొక్క అధికోత్పత్తినిగూర్చి, అమ్మకములను ఏర్పాటుచేయ వలసిన అవసరాన్నిగూర్చి వ్రాశారు. బొంబాయి వంటి నగరాలు, మిగిలిపోయిన ఖద్దరును తీసుకోవలెననికూడా మీరు కోరిఉన్నారు. అమ్మకం చేసేటందుకు కావలసిన ఏర్పాటు లేకపోతే ఉత్పత్తివిధానంలో లోపం ఉన్నట్లుకాదా? ఈనాడు మిల్లు బట్టకంటె ఖాదీ చాలా ఎక్కువ ప్రియం. పైగా దాని ఖరీదునది సరిపుచ్చుకోగలిగేటంతకాలమది జీవిస్తుందో లేదో కూడా సందేహం. ప్రస్తుతం ఖాదీ ప్రేమతో కొట్టుకొనిపోతూన్నవారున్నూ, ఎక్కువ డబ్బున్న వారూ మాత్రమే, ఖాదీ అనే భోగలాలసత్వము ననుసరించ గలరు. మీరు వ్రాసిన వ్యాసం ఒక విధమైన ప్రభుత్వ సహాయం ఉండవలెనని సూచిస్తూన్నది. అంతమాత్రంతో ఏమవుతుంది? ఉత్పత్తి విధానంలో లోపం ఉన్నప్పుడు, ప్రభుత్వ సహాయంయొక్క ఉద్దేశంకూడా భగ్నమవుతుంది. మీ మాటలను సరిగా వ్యాఖ్యానించుకొనేయెడల బట్టకు సంబంధించినంతవరకు గ్రామాలను స్వయంసంపూర్ణములుగా చేయవలెనని ఖాదీ ఉద్యమం ఉద్దేశిస్తూన్నట్లు కనిపిస్తుంది; అనగా ప్రతి కుటీరములోనూ తమకు కావలసిన నూలును తామే వడుకోవలెనన్నమాట. అయినప్పుడు ఈ దృష్టిలో ఉత్పత్తి ఎక్కువగా జరుగుతూన్నదనడానికి వీలా? ఎన్ని గ్రామాలు స్వయం సంపూర్ణములైనవి? లేక ఎన్ని కానున్నవి?

మీరు సూచించినట్లుగా, అంతర రాష్ట్రీయ ఖాదీ వ్యాపారం వాంఛనీయం కానట్లయితే, ఖాదీని సేకరించి పట్టుశాలలో నిలవ చేయడంకూడా అంత వాంఛనీయంకాదు. అది ఇతరంగా పోల్చి చూచినప్పుడు ఎక్కువ ప్రియం కావడంచేత దాని అమ్మకం గిట్టుబాటు కాకపోవడమే అందుకు కారణం. ప్రజలను ఉద్రేకపరచి అమ్మకం చేయించవచ్చును. కాని అది ఎప్పుడూ అంత మంచి మార్గంకాదు." ఖాదీ కేవలం ప్రియంగా కనబడుతుంది. ఒకే నిడివిగల ఇతర బట్ట యొక్క ఖరీదుతో ఖాదీ బట్ట ఖరీదును పోల్చడం తప్పని నేనీ పుటలలో యిదివరకే చెప్పిఉన్నాను. ఒక మనిషియొక్క అభిరుచిలో కలిగిన పరివర్తనమునుబట్టి ఖాదీయొక్క చౌకదనం ఉంటుంది. ఖాదీ ధారణ, అలంకారం కోసం దుస్తులను వేసుకోవడమనే సంప్రదాయ సిద్ధమైన అభిప్రాయాన్ని, ఉపయోగంకోసం వేసుకోవడమనే అభిప్రాయంలోకి మారుస్తుంది. ఖాదీ చాలాకాలం మనదనే విషయంలో భిన్నాభిప్రాయంవుంది. ఈ భిన్నాభిప్రాయం బహుశా అనుభవభేదాలపైన ఆధారపడి ఉంటున్నది. ఒకే తీరున వడకగలిగే స్థితికి మనము రానంతవరకు ఈ భిన్నానుభవం తప్పనిసరిఅవుతుంది. చెదురు చెదురుగా నాలుగు సంవత్సరాల మాత్రమే చేయబడిన ఈ కృషి చేతితో వడికిన నూలు నొక ప్రమాణమైన నాణ్యంలోకి తీసుకొని వచ్చేటందుకు నిజంగా సరిపోదు. ప్రారంభదశలో ప్రతి చిన్న పరిశ్రమా కష్టపడవలసిందే. ఈ స్నేహితుని వివేకం, భావ ప్రవృత్తిని గమనించడంలేదు. ప్రపంచంలో భావ ప్రవృత్తి అత్యంత శక్తివంతమైనది. మన అన్నం మనం ఇంటికడనే వండుకొంటున్నాము. ఆధునిక ఆర్థిక శాస్త్ర ప్రకారం ఇళ్లలో వండుకొనే వంట చౌకగా ఉంటుందని మనమలా చేయడం లేదు; దాని వెనుక తరతరాల

నుండి వస్తూన్న భావ ప్రవృత్తి ఉండడంచేత అలా జరుగుతూన్నది. వస్తువు ఖరీదు, పని, వంటచెఱకు, పాత్ర సామగ్రుల అరుగుదల, అద్దె,—ఇవన్నీ లెక్క కట్టుకుంటే ఇంట్లో వండిన అన్నం కంటె హోటలులో తయారైన అన్నం ఎక్కువ చౌకగా ఉంటుందని, అర్థశాస్త్ర పాఠాలు చదువుకొనే బాలుడు కూడా నిరూపించగలడు. ప్రస్తుతం ఖాదీకి ప్రభుత్వ సహాయం అవసరం. తన ఇటీవలి ప్రకటనలో ఆచార్యరే చేసిన అత్యంత సమంజసమైన సూచన కనుగుణంగా, ప్రభుత్వం చేయని పనిని ప్రజలు దేశాభిమాన భావంతో నిర్వర్తింపవలసి ఉన్నది. ఖాదీ ఉద్యమోద్దేశమును గూర్చి ఈ విలేఖకుడు సరిగానే నిర్వచించాడు. ప్రజాసేవ చేయవలెనని కోరుతూన్న మనం, రాటం యొక్క అవసరాన్ని గుర్తించి, దానిపైననూ అది ఉత్పత్తి చేసిన వస్తువులపైననూ అభిరుచిని కల్గించుకొనే యెడల, ఆ ఉద్దేశం పూర్తిగా సఫలమవుతుంది. ఒరిస్సాలోని అస్థి పంజరాలపైన ఈ రాటం పారవేస్తే వారు దీని వంక కూడా చూడరు. కాని నేను వాళ్ళలో చేరి వడకడం ప్రారంభిస్తే, నీటికి చేప ఎక్కినట్లు ఈ పనికి ఎక్కివస్తారు. సామాన్య ప్రజలెప్పుడూ గొప్పవాళ్ళు చెప్పినట్లు చేయరు; చేసినట్లు చేస్తారు. కాబట్టే నూలు వడికే తీర్మానం చేయవలసి వచ్చింది. గ్రామాల యెడ మన బాధ్యతను గూర్చిన నిజమయిన భావాన్ని, అది కలిగిస్తూన్నది. ఖాదీ వడకడము నందభిరుచి కలిగే వాతావరణమును సృజించి, ఖాదీని చౌక చేస్తుందది. ఈ నూలు వడికే తీర్మానం దేశంలో శ్రద్ధగా ఆచరింపబడినట్లయితే ఇందులో మన మిదివర కెప్పుడూ ఊహించనంత శక్తిఉంది.

యంగ్ ఇండియా, 7-8-1924.

# 28
# వృథా శ్రమా!

కాకినాడ ఖద్దరు ప్రదర్శన ప్రారంభ సమయంలో ఆచార్య రే యిచ్చిన ఉపన్యాసాన్ని శ్రీ యం. యన్. రాయి పరామర్శచేస్తూ కిందటి మేలో 'వెల్ ఫేరు' పత్రికలో వ్రాసిన వ్యాసాన్ని ఒక స్నేహితుడు నా దృష్టికి తీసుకొని వచ్చాడు. అది పూర్తిగా రెండు నెలల నుండి నా కాగితాలలో పడిఉంది. ఇంతకు పూర్వం ఆ వ్యాసాన్ని చదువ జాలకపోయినందుకు నేను విచారపడుతున్నాను. అది చదివిన తరువాత డాక్టరు రే వాదాన్ని గూర్చి శ్రీ రాయి చేసిన ఖండన ఈ పుటలలో అనేకసార్లు ఖండింపబడినట్లు నేను భావిస్తున్నాను. అయితే పాఠకులకు జ్ఞాపకశక్తి తక్కువ గనుక ఆ వాదం యావత్తు వరుసగా తిరిగీ నేనికకూడ వ్రాయడం బహుశా ఉచితంగా ఉంటుందని నా అభిప్రాయం. చర్ఖానుగూర్చి చేసిన కృషి యావత్తు 'వృథాశ్రమ' అని డాక్టరు రే యొక్క విమర్శకుని భావం. రైతుకు చరఖా ఒక ప్రత్యేక సందేశమిస్తూన్నదనీ, అది అతని విశ్రాంతి సమయాన్ని సరిగా వినియోగించుకోనేటందుకు వీలు కలుగజేస్తూన్నదని డాక్టరు రే వాదంలోని ప్రధాన విషయం. వినియోగించడానికి రైతుకు విశ్రాంతి కాలమనేదే లేదని విమర్శకుని వాదం. అతనికి ఉన్న విశ్రాంతి అతని కవసరమైనదే. చేయతగిన పనికంటె యెక్కువ పని ఎనిమిది నెలలు చేస్తున్నాడు గనుక అతడు నాలుగు నెలలు విశ్రాంతిగా ఉంటున్నాడు. ఈ నాలుగు నెలలూ కూడా అతనిచేత చరఖా దగ్గర పనిచేయించేయెడల, యెనిమిది నెలలూ అతను చేయ

వలసిన పనిలో సమర్థత ఆ పూటికాపూడు తగ్గిపోతూంటుంది. అనగా విమర్శకుడు చెప్పేదానినిబట్టి చర్ఖామీద పని చేయ డానికి దేశీయులకు విశ్రాంతి లేదు.

భారత దేశపు కర్షకవర్గమునుగూర్చి విమర్శకుని కేదైనా అనుభవం ఉంటే ఆ అనుభవం చాలా స్వల్పమన్నట్లు నాకు కనబడుతూన్నది. పైగా చర్ఖా ఎలా పనిచేయ వలెనో, నిజంగా ఈ రోజున అది ఎలా పనిచేస్తూన్నదో ఆయన ఊహించుకోగలిగినట్లు కూడా లేదు. రైతులు చర్ఖా కడశ్రమ చేయనక్కరలేదు. కష్టపడి పనిచేసిన తరువాత, అది ఒక విధంగా ఆనందదాయకమైన కాలక్షే పంగా ఉంటుంది. అది ఒక శాశ్వత సంప్రదాయంగా భారత మహిళలకు పరిచయం చేయబడింది. వారు తీరిక సమయాలలో వడుకుతూంటారు. కష్టజీవులలో అధిక సంఖ్యాకులు సగటున రోజుకు ఒక అరగంట వినియోగిస్తే, వారు తమకు కావలసిన నూలేగాక ఇతరులకుకూడా ఈయగలిగినంత వడకగలరు. అలా వడికేమనిషి సంవత్స రానికి కనీసం రు 1-11-0 అదనపు ఆదాయం సంపాదించు కోవచ్చును. వస్తువులు వడుకొనే మనిషికది తక్కువ అదనపు ఆదాయంకాదు. మనకు కావలసిన యావత్తు బట్టనూ నేయగల నేతవారున్నూ మగ్గాలున్నూ భారత దేశంలో ప్రస్తుతం ఉన్నట్లు అందరూ ఒప్పుకొంటూనే ఉన్నారు. కనుక ఇక చేతితో వడకడమును గూర్చిన దొక్కటే సమస్య. రైతులాపనికి పూనుకొంటే, పెద్ద పెట్టుబడిపెట్టవలసిన అవసరం లేకుండా, బట్ట విషయంలో భారత దేశపు స్వావలంబన సమస్య పరిష్కారం కాగలదు. ఈ పనివలన కనీసం ఆరుకోట్ల రూపాయిలను భారత దేశపు కుటీరాలలో పనిచేసుకొంటూన్న లక్షలకొలదీ నూలు వడికే

వారికీ, వేలకొలదీ ఏకేవారికీ నేసేవారికీ పంచిపెట్టి ఆ మేరకు రైతుల సంపాదనా సామర్థ్యాన్ని పెంపు చేయడం తటస్థిస్తుంది.

తమ సంపాదనకుతోడు అదనంగా కొంత సంపాదించుకోవడానికిగానీ, తమ విశ్రాంతికాలాన్ని సరిగా వినియోగించుకోవడానికిగానీ రైతులకు మరొక ఉపవృత్తి అవసరమనే విషయం ప్రపంచమంతటికీ అనుభవమే. తీరిక సమయాలలో భారతస్త్రీలు దేశానికి కావలసిన యావత్తు నూలు వడికేవారు. అది జరిగి ఇప్పటికి ంకా చాలా కాలం కాలేదన్న సంగతి కూడా మఱవరాదు. ఈ మాటలలోని యథార్థం వడుకుపనిని పునరుద్ధరించిన పిమ్మట అద్భుతంగా నిరూపింపబడింది.. ఈ ఉద్యమం అపజయం పొందిందనుకోవడం పొరపాటు, నిజానికి కార్యకర్తలు కొంతవరకు అపజయం పొందారు. కాని ఎక్కడవారు బాగా పనిచేస్తే అక్కడల్లా ఈ పని కొనసాగింది. దానికింకా స్థిరత్వం ఏర్పడలేదన్నమాట వాస్తవం. ఇందుకు కారణం దాని ఏర్పాటు అసంపూర్ణంగా ఉన్నందువలనను, తాము స్థిరంగా నియమింపబడతామనే నిశ్చయం ఇప్పటికీకూడా వడికేవారికి లేకపోవడంవలనను, పాంచాల, కర్ణాటక ఆంధ్రాలలోను తమిళనాడులోని కొన్ని భాగాలలోనూ కల పరిస్థితులను పరిశీలించవలెనని శ్రీ రాయిని నేనాహ్వానిస్తున్నాను. వడుకు వృత్తికి ఎటువంటి అవకాశాలు కలవో ఆయనే స్వయంగా తెలుసుకోగలడు.

ఇండియా కఱువులకు నిలయం. స్త్రీ పురుషులు రాళ్లు పగులగొట్టడం మంచిదా ? లేక ఏకడం వడకడం మంచిదా ?

నిరంతరక్షామ పరిస్థితులవలన ఒరిస్సా ప్రజలు భిక్షాపువృత్తికి దిగవలసివచ్చింది. వారిచేత యిప్పుడు పనిచేయించడం కూడా కష్టతమమయినపని. వారు క్రమంగా చచ్చిపోతున్నారు. వడుకు పనిని పునరుద్ధరించడమొకటే వారికి ఆశాజనకంగా ఉంటుంది.

అభ్యుదయ వ్యవసాయ పద్ధతులమీద ఎక్కువపట్టుదలగా ఉన్నాడు శ్రీరాయి. ఇది అవసరమే. కాని ఈ వడుకు పని ఆ ఉద్దేశింపబడిన అభ్యుదయ విధానమునకు బదులుగా స్థాపింపబడదు. పైగా యిది అందుకు మార్గదర్శిగా ఉంటుంది. ఈ అభివృద్ధికి మధ్యలో విపరీతమైన అడ్డంకులు కలవు. ప్రభుత్వమువారి అయిష్టత, పెట్టుబడి లేకపోవడం, రైతు కొత్తవిధానాలను అవలంబించడానికి మూర్ఖంగా ఒప్పుకోకపోవడం, ఈ అన్ని అడ్డంకులనూ తరించాలి. వడుకుపనిలో ఈ గుణాలు కలవు.

1. విరామము కలవారికీ, కొన్ని కానులు సంపాదించు వలెననే కోరికగలవారికీ తక్షణం వృత్తి కల్పిస్తుంది.

2. వేలాదిమందికి ఈ పని తెలుసును.

3. తేలికగా ఈ పని నేర్చుకోవచ్చును.

4. ఇందుకోసం పెట్టుబడి దాదాపు అవసరం లేదు.

5. రాటం తేలికగానూ చౌకగానూ తయారుచేయబడుతుంది.

6. ఒక పెంకు ఒక కదురుతో నూలు వడకవచ్చుననే సంగతి మనలో చాలామందికి తెలియదు.

7. కఱువు కాటకాలలో అది తక్షణ సహాయాన్ని చేకూర్చగలదు.

8. విదేశబట్టలను కొనే నిమిత్తం ఇండియా వెలుపలకు పోయే ధన ప్రవాహాన్ని, అది ఒకటే అరికట్టగలదు.

9. ఆవిధంగా ఆదా అయిన సొమ్ము అర్హులైన పేదలలో దానంతటదే పంపకమయ్యేటట్లు చేయగలిగినదదే.

10. దానికి కలిగిన కనీసవిజయం, అందువలన ప్రజలకు తక్షణం కలిగిన లాభమన్నమాట.

11. ప్రజలలో సహకారమును కలిగించేటందుకది అత్యంతశక్తివంతమైన పరికరము.

అయితే ఈ పని జరగడంలో ఉన్న చిక్కులివి: ఇందుకు కావలసిన కార్యకర్తలను సరఫరా చేయగలిగిన మధ్య తరగతులలో ఈ పనియందు నమ్మకం లేకపోవడం ఒక చిక్కు. నాజూకుగా కనిపించే మిల్లుబట్టకు బదులుగా ఖద్దరు వాడడానికి ప్రజలకు యిష్టం లేకపోవడం అంతకన్నా పెద్ద చిక్కు. ఈ పరివర్తన కాలంలో ఖాదీ ప్రియంగా ఉండడం మరొక అదనపు చిక్కు. తగినంతమంది ప్రజలు వడుకునూలు తీర్మానానికి అనుకూలంగా పని చేసినట్లయితే, మిల్లుబట్టతో ఖాదీ బట్టను పోటీ చేయించవచ్చును.

అయితే ఈ ఉద్యమం జయప్రదం కావలెనంటే ప్రజలు కొంత త్యాగం చేయవలసినమాట నిజం. రైతుల కోరికలను మనస్సులో పెట్టుకొని విదేశముల పోటీనుండి వారిని రక్షించ నిశ్చయించుకొన్న మన ప్రభుత్వమున్నట్లయితే ఈ ప్రత్యక్షత్యాగంకూడా అవసరం లేకుండా ఉండేది. జాతీయ ప్రభుత్వం చేయగలిగిన పని మధ్యతరగతులవారు కొంతకాలం బుద్ధిపూర్వకంగా చేసేత్యాగం ద్వారా జరుగగలదు.

ఇందులో వృథాశ్రమ అనేదిలేదు. డాక్టరు రే ఇంతకు పూర్వం వేలకొలది సోదరీమణులకు పదో కొంత

బిచ్చం పెడుతూండేవాడు. ఇప్పుడు వారికి గౌరవ ప్రదమైన వృత్తి కల్పించి వారిని పూర్తిగా గాకపోయినా కొంతవరకు గానీ స్వావలంబకులుగా తయారుచేస్తున్నాడు. ఇప్పుడా స్త్రీలు వృథాశ్రమ చేస్తున్నారనగలమా? వారు బిచ్చమైనా ఎత్తుకోవాలి, పస్తయినా ఉండాలి; అంతేకాని వారికి వేరే వృత్తి లేదు. యువకులు గ్రామాలవెంట సంచారంచేసి, వారి కోరికలను తెలుసుకొని, వారికోసం బాధపడుతూ వారికి సహాయంచేయడం వృథాశ్రమ అవుతుందా? ధనవంతులైన వేలాదియువకులూ యువతులూ చాలీచాలని తిండితో జీవించే లక్షలకొలదీ జనసామాన్యాన్ని గూర్చి ఆలోచించి వారికోసం ప్రతిరోజూ ఒక అరగంట ప్రత్యేకించి మతధర్మంగా నూలు వడకడం వృథాశ్రమ కాగలదా? స్త్రీగానీ పురుషుడుగానీ పనిలేనప్పుడు కొన్ని కానుల కొఱకునూలువడికినయెడల అంతవరకైనా అదిలాభ మేకదా! స్త్రీగానీ పురుషుడుగానీ త్యాగదృష్టితో వడికినప్పటికీ అదీ లాభమే కదా? అంతాలాభమూ ఏమీ నష్టమూలేనిపని ఏదైనా ఉన్నదంటే అదినూలువడకడమే.

యంగిండియా, 21-8-1924

# 29

# బానిసత్వ చిహ్నం

ఇండియాకు దిగుమతి అయిన బట్టలమీద పన్ను వేయబడి నప్పుడు, కేవలం లాంకుషైరు ప్రయోజనంకోసం పత్తితో ఉత్పత్తి అయిన ఇండియా సరుకులమీదకూడా పన్ను విధింపబడినది. దానినిగూర్చి ప్రతిఘటనలూ, పునరాలోచన వాగ్దానాలూ చేయబడినప్పటికీ ఇంతవరకూ అది అలాగే ఉంది. ఇండియాయొక్క ప్రయోజనాలు ఇంగ్లాండు ప్రయోజనాలకు లోబడి ఉండవలసిన విషయాన్ని ఈ పన్ను నిరంతరం జ్ఞాపకం చేస్తూన్నది. మిల్లులో తయారైన నూలుకు బదులుగా చేతితో వడకబడిన నూలుకు ప్రాముఖ్యత ఈయవలెనని, నిజమైన ఉద్వేగంతో గట్టిగా నేను వాదించడం మాత్రమే ఎరిగిఉన్న స్నేహితులు, ఇండియన్ మిల్లునూలుకు నేను ప్రాముఖ్యత ఈయడం అర్థంచేసుకోలేరు. కాని కొంచెం ఆలోచిస్తే ఈ రెండు విధానాలకూ కల సంబంధం అర్థమవుతుంది. ఇండియా ఆర్థిక స్వాతంత్ర్యమును పొందవలెనంటేనూ, ఈ దేశపు రైతువర్గం నిరంతర దారిద్ర్యము నుండి బయటపడవలెనంటేనూ, కఱవు మొదలైన దైవికకష్ట సమయాలలో రైతులకు గౌరవప్రదమైన వృత్తి లభించవలెనంటేనూ భారతీయ దుకాణములనుండి పూర్తిగా విదేశ వస్త్రాలను పారద్రోలవలెను. తమ ప్రధాన వృత్తిని రక్షించుకోవడం భారతీయుల జన్మహక్కు. కాబట్టి ప్రస్తుతం కొంత కాలంవరకూ పేదలకు నష్టదాయకంగా పరిణమించినప్పటికీ, నేను విదేశీ పోటీకి ప్రతికూలంగా ఇండియన్ మిల్లులను రక్షించవలసిఉంది. మిల్లు యజమానులు దేశాభిమాన

శూన్యులై, తమకు లభించిన ఏకాంతిక వ్యాపారం monopoly) వలన ధరలు హెచ్చించినప్పుడు మాత్రమే ఆ నష్టం కలుగుతుంది. కాబట్టి భారతదేశంలోని పత్తి ఉత్పత్తులపైన పన్నును తీసివేసి, నిషేధాత్మకమైన దిగుమతి పన్నును విధించవలసినదని ప్రతిపాదించేటందుకు నేను వెనుతీయను.

ఆలాగే, పై విధానాని కనుగుణంగా, ఇండియను మిల్లులకు ప్రతికూలంగా చేనూలు ఖాదీకి రక్షణ యిస్తాను. విదేశీ పోటీని తప్పించుకోగలిగినట్లయితే కష్టం లేకుండా ఖాదీ రక్షింపబడుతుందని నాకు తెలుసు. ప్రజాభిప్రాయం బాగా శక్తివంతమైనప్పుడు విదేశీ వస్త్రాలు దేశంలోకి రాకుండానే చేయవచ్చును. ఆ శక్తియే మిల్లులకు ప్రతికూలంగా ఖాదీని రక్షించగలిగేమాట నిశ్చయం. అయితే మిల్లులతో అనుచితమైన తగాదా లేకుండానే ఖాదీ తన స్థానాన్ని తాను పొందగలదని నా దృఢవిశ్వాసం. అయితే ఖాదీకి అనుకూలంగా ఉండేవారు పరిమిత సంఖ్య కావడంచేత, వారంతా, ఇండియా మిల్లులలో తయారైన నూలును, బట్టనూ కూడా మినహాయించి ప్రత్యేకం ఖాదీని గుటించిన పక్షపాతంతో ప్రచారంచేయవలసిన అవసరం ఉంది. ఈ విషయంలో వారి యిష్టానికి విడిచిపెట్టడం ఖాదీని చంపడమవుతుంది.

—యంగిండియా, 28-8-1924

# 30

# పతిత ప్రజ కోసం

బారిసాలులో ఇప్పటికి దాదాపు మూడు సంవత్సరాల కిందట మన భోగలాలసత్వమునకు బలియైన పతిత సోదరీ మణులను కలుసుకొనే భాగ్యం నాకు లభించింది. అందులో కొందఱు 'రోజుకు రెండు మూడు రూపాయిలను సంపాదిస్తాము, అంతమాత్రం సంపాదించే వృత్తి మాకు చూపించండి' అన్నారు. కొంతసేపు నాలో నేను కుంగిపోయినాను. కాని, తక్షణం స్మృతి తెచ్చుకొని యిలా అన్నాను. 'నా ప్రియ సోదరీమణులారా! అలా కాదు! రోజుకు రెండు మూడు రూపాయిలువచ్చే పని యేదీ మీకు నేను సూచించ లేను. కాని మీరు వస్త్రులు పస్తుకోవలసివచ్చినప్పటికీ మీ వృత్తిని మానివేయవలెనని నేనడుగుతున్నాను. కాని రాటం ఒకటి ఉన్నది. దానిని మీరు చేపట్టినట్లయితే, అది మీకు తోడ్పడం కాగలదు.'

భారతదేశంలోని పతిత ప్రజానీకంలో ఈ పతిత సోదరీ మణులు ఒక చిన్న భాగం మాత్రమే. ఒరిస్సాలోని ఆ తోలు, ఆ బొమికలూకూడా ఒక విధంగా ఆ ప్రజానీకంలో భాగమే. మొదటివారు మన భోగలాలసత్వమునకు బలియై నట్లే రెండవవారు మన అజ్ఞానమునకు బలియైనారు. రెండవ వారి సందర్భంలో, మన కామాసక్తత కాక, ధనాశా పరత్వం, వారిని తోలూ ఎముకలూగా క్షీణింపచేసింది. మనం భాగ్యవంతులం కావడానికే వారలా నెత్తురు ఓడుస్తూ న్నది.

అయితే ఇప్పుడు దేవునిదయవలన మధ్య తరగతికి చెందిన విద్యావంతులమైన మనము, మన పతిత సోదరీమణులతోనూ క్షుధాతురులైన సోదరులతోనూ లీనం కావలెనని ఆత్రపడు తున్నాము. వారి బ్రతుకుకొఱకే మనం స్వరాజ్యమును వాంఛిస్తున్నాము. మన మందఱమూ గ్రామాలకు పోయి గ్రామస్థులకు సహాయపడచాలము. మన పతిత సోదరి, మనం పవిత్రులం కావలెనని నిత్యం జ్ఞాపకం చేస్తూంటుంది. కాబట్టి ప్రతిరోజు వారిని తలుచుకొని వారికొఱకు కరుణ వహించడమెలా ? ప్రతిరోజూ వారికి మనమేఉపకారం చేయగలం ? సాధ్యమైనంత తక్కువ పని చేయకోరేటంత దుర్బలులం మనం. ఏమిటా తక్కువ పని ? రాటపు పని తప్ప మఱొకటి నాకు తోచడంలేదు. మనపని తేలికగా ఉండాలి; అందఱూ చేయతగినదిగా ఉండాలి;—అందరూ అనగా పండితులు, పామరులు, సజ్జనులు, దుర్జనులు, యువకులు, వృద్ధులు, సబలులు, దుర్బలులు, ఏ మతస్థులైనా సరే చేయతగినదిగా ఉండాలి. ఒక పని ఫలప్రదం కావలె నంటే అందరూ అదే పనిచేయాలి. రాటం ఈ అన్ని వరతులకు సరిపోయి ఉంది. కాబట్టి స్త్రీగానీ, పురుషుడు గానీ ప్రతిరోజూ ఒక అరగంట వడికేయెడల సాధ్యమైనంత ఎక్కువ సమర్థతతో ప్రజలకు సేవచేస్తున్నట్లే భారత దేశంలోని పతిత మానవకోటికాయన హృదయపూర్వకంగా వివేకవంతమైన సేవచేస్తున్నాడన్నమాట. ఆ సేవద్వారా స్వరాజ్యాన్ని ఆయన ఎక్కువ దగ్గరకు తీసుకొనిరాగలుగు తున్నాడు.

సార్వజనిక సమాజ జీవితానికి రాటం పునాది. అది లేకుండా శాశ్వత ప్రజాజీవితాన్ని నిర్మించడం అసంభవం. మనదేశంలో అట్టడుగున ఉన్న జనంతో మనకు నిరంతర

సంబంధాన్ని కల్పించగలిగిన ప్రత్యక్ష బంధనమది. అందువల్ల అది వారికాశాజనకంగా ఉండగలదు. మనము దానికింకా అనేక విషయాలను తోడుచేయవచ్చును. లేదా తోడు చేయవలెను. అయితే ముందుగా దానిని స్థిరం చేసుకోవాలి. తెలివిగల తాపీ మనిషి పై అంతస్థు కట్టడానికి ముందు పునాది గట్టిగా ఉందో లేదో చూచుకొంటాడు. ఆనిర్మాణం పెద్దదిగా ఉండేకొద్దీ పునాది ఎక్కువ లోతుగానూ ఎక్కువ బలంగానూ ఉండవలసివస్తుంది. కాబట్టి ఆటం ఫలప్రదం కావలెనంటే భారతదేశంలో నూలు వడకడం సార్వజనీనం కావాలి.

నూలు వడకడం ఉన్నతవర్గాలకూ సామాన్య జనానికీ సంబంధం కలిగించే కొక్కెంగా ఉండడమేకాక, వివిధ రాజకీయపక్షాలకుకూడా అది సన్నిహితత్వం కలిగిస్తుంది. అది అన్ని పక్షాలకూ సంబంధించి ఉంటుంది. వారి వారి యిష్టములనుబట్టి తక్కిన అన్ని విషయాలలోనూ వారంతా ఏకీభవించక పోవచ్చును. కాని కనీసం ఈ విషయంలోనైనా వారేకీభవించగలరు.

కాబట్టి, దేశాన్నీ, మిక్కిలి నిరుపేదలనూ, పతితులనూ, ప్రేమించే ప్రతి ఒకర్రూ, రోజుకు ఒక అరగంట, మంచి పురిగల తిన్నని నూలును, వడికేటందుకు దేవునిపేరుతో వారి కోసం శ్రమచేయవలెనని నా కోరిక. ఇది దేశానికి చెల్లించవలసిన మొక్కుబడివలె అఖిల భారత ఖాదీ బోర్డుకు మత ధర్మక్రమంగా సమర్పించబడవలెను.

—యంగిండియా, 4-9-1924

# 31

# యంత్రాలను గూర్చి

రామచంద్రన్ తరువాతి ప్రశ్న వేశాడిక :

'మీరు యంత్రాలన్నిటికీ ప్రతికూలమేనా బాపుజీ?' రామచంద్రన్ యొక్క అమాయకపు ప్రశ్నకు చిరునవ్వుతో ఆయన యిలా అన్నాడు 'ఈ శరీరమే అత్యంత సున్నితమైన యంత్రమునకు నిదర్శనంగా ఉన్నప్పుడు నేనలా ఎలా ఉండగలను ? రాటం కూడా ఒక యంత్రమే ; పళ్లు కుట్టుకొనే చిన్నపుల్ల ఒక యంత్రం. నేను అభ్యంతరపెట్టేది యంత్రాల పిచ్చకు, అంతేకాని కేవలం యంత్రాలకు కాదు. వేలకొలదీ మంది పని లేకుండా వీధులలో పడి ఆకలితో చచ్చిపోయేటంత వరకూ 'శ్రమ కలిసి రావడం' కోసం మనుష్యులు ప్రయత్నం చేస్తూనే ఉంటారు. మానవసంఘంలో యేదో ఒక భాగానికిగాక అందరికీ శ్రమ, కాలమూ కూడా కలిసి వచ్చే పని చేయవలెనని నా కోరిక. ఐశ్వర్యం యే కొలది మంది చేతులలోనో కరడు గట్టుకొని పోకుండా అందరి చేతులలోనూ ఉండవలెనని నా ఆశయం. ఈ నాడు కేవలం లక్షలాది ప్రజలపైన యే కొద్దిమందో స్వారిచేయడానికి యంత్రం ఉపయోగపడుతూన్నది. దానికి వెనుక నున్న ప్రేరేపణ దురాశ కాని, శ్రమ కలసి రావలెననే ధర్మబుద్ధి కాదు. ఈపరిస్థితుల నిర్మాణమునకు ప్రతికూలంగానే నా శక్తి కొలదీ నే నెప్పుడూ పోరాడుతూన్నది.'

అప్పుడు రామచంద్రన్ ఆసక్తితో ఇలా అన్నాడు: 'ఐతే బాపూజీ ! మీ రసలు యంత్రాలకు ప్రతికూలంగా కాదు పోరాడుతూన్నది? ఈ నాడు ప్రత్యక్షంగా మనకు కని

పిస్తూన్నవాటి దుర్వినియోగాలకు ప్రతికూలంగా నన్న మాట.

'నేను నిస్సందేహంగా "అవును" అని చెప్పాలి; ఐతే వైజ్ఞానిక సత్యాలు గాని ఆవిష్కరణములు (discoveries) గానీ కేవలం దురాశకు పరికరములు కాకూడదు. అప్పుడు శ్రామికులు శక్తికిమించిన పని చేయవలసి ఉండదు. యంత్రాలు ఆటంకంగా ఉండడానికిబదులు సహాయంగా ఉండగలవు. యంత్రాలను అన్నిటినీ నిర్మూలం చేయవలెనని నా ఆశయం కాదు. పరిమితం చేయవలెనని నా ఆశయం.' రామచంద్రన్ ఇలా అన్నాడు: 'తార్కికంగా వాదించినకొద్దీ విద్యుచ్ఛక్తితో నడపబడే చిక్కు యంత్రాలన్నీ పోవలెననే విషయం గర్భితంగా ఉన్నట్లు కనిపిస్తూన్నది.'

'అవి పోవలసిందే' అన్నారు గాంధీజీ 'కాని ఒక విషయం నేను స్పష్టం చేయాలి. మనం అన్నిటిలోకీ ఎక్కువగా ఆలోచించవలసింది మనిషినిగూర్చి. మనిషియొక్క అవయవాలను క్షీణింప చేసేటందుకు యంత్రం ఉపయోగపడకూడదు. అందుకు తార్కాణంగా నేను తెలివిగల మినహాయింపొకటి సూచిస్తాను. సింగరు కుట్టుయంత్రం విషయం తీసుకోండి. ఇంతవరకు కనిపెట్టబడిన ఉపయోగకరమునైన కొద్దివస్తువులలో అది ఒకటి. దాని నిర్మాణమును గూర్చి ఒక ప్రణయగాథ ఉంది. తన భార్యా, చేతులతో కష్టపడి విసుగు పుట్టేటట్లు కుట్టడం, అంచులు అల్లడం చూచి, సింగరు, కేవలం ఆమెయందు ఉండే ప్రేమచేత, ఆమెను అనవసర శ్రమనుండి తప్పించడానికి, కుట్టుయంత్రాన్ని కనిపెట్టాడు. కాబట్టి ఆయన తన భార్యా శ్రమ తగ్గించడమేకాక, కుట్టు యంత్రాన్ని కొనగలవారందరి శ్రమాకూడా తగ్గించాడు.

'అయితే ఆ సందర్భంలో, ఈ సింగరు కుట్టుయంత్రాల నిర్మాణమునకు యంత్రాలయమొకటి ఉండి అందులో విద్యుచ్ఛక్తిచే నడపబడే సాధారణపు యంత్రాలు ఉండవలెను కదా?' అన్నాడు రామచంద్రన్.

రామచంద్రన్ ఆసక్తితో అడిగిన అడ్డు ప్రశ్నకు బదులుగా చిరునవ్వుతో గాంధీజీ ఇలా అన్నారు. 'అయితే, అటువంటి యంత్రాలయాలు, జాతిపరం చేయబడవలెనని కానీ లేక, ప్రభుత్వ యాజమాన్యం కింద ఉండవలెనని కానీ చెప్పేటందుకు తగినంత సోషలిస్టునే నేను. అవి అత్యంతం ఆకర్షవంతంగా ఉండే ఆదర్శ పద్ధతులమీద దురాశకు బదులు ప్రేమను ప్రయోజనంగా పెట్టుకొని లాభంకోసం కాక ప్రజా శ్రేయస్సుకొఱకు పనిచేస్తూండాలి. శ్రామికవర్గాల స్థితిగతులలో ఒక మార్పు రావలెనని నా కోరిక. ఐశ్వర్యం కోసం పిచ్చిగా పరుగులెత్తడం ఆగిపోవాలి. శ్రామికునకు జీవనభృతికి కావలసిన జీతంతోపాటు, కేవలం దాస్యవృత్తిగా ఉండని పని కూడా నిత్యం ఉండేటట్లు నిశ్చయించుకోవాలి. ఈ పరిస్థితులలో, యంత్రం మీద పనిచేసేవానికేగాక, యంత్రాలయొకర యజమానికీ రాజ్యానికీకూడా యంత్రం శ్రేయస్కరంగా ఉంటుంది. అప్పుడు ప్రస్తుతపు వెఱ్ఱిపరుగు ఆగిపోయి (నేను చెప్పినప్రకారం) శ్రామికవర్గం ఆకర్షవంతమైన ఆదర్శపరిస్థితులలో పనిచేస్తుంది. నా మనస్సులో నున్న మినహాయింపులలో ఇది ఒకటి మాత్రమే. కుట్టుయంత్రానికి వెనుక ప్రేమ ఉంది. మనము వ్యక్తిని గూర్చియే అన్నిటిలోకీ యెక్కువగా ఆలోచించవలసి ఉంది. వ్యక్తియొక్క శ్రమను తగ్గించడం ఉద్దేశంగా ఉండాలి. నిజమైన మానవ శ్రేయస్సు ప్రయోజనంగా ఉండాలికాని దురాశ కాకూడదు.

ఇందు కుదాహరణంగా వంకర కదుళ్లను తిన్నగా తీయడాని కొక యంత్రం కావలెనని ఎప్పుడైనా కోరుతాను. కమ్మరులు కదుళ్లు చేయడం మానవలెనని కాదు నా అభిప్రాయం; వారు కదుళ్లు చేస్తూ ఉండవలసిందే! కాని కదురు వంకర పోయినప్పుడు దానిని తిన్నగా తీయడానికి ప్రతి వడికే మనిషి దగ్గర ఒక యంత్రం ఉండాలి. కాబట్టి, దురాశస్థానే ప్రేమను స్థాపించండి. అంతా చక్క బడుతుంది.' *

యంగిండియా, 13-11-1924

* 'గాంధీజీతో ఒక ఉదయం' అని మ. దే. వ్రాసిన ఒక వ్యాసమునుండి.

# 32

# వడకడం సభ్యత్వమునకు అర్హత

విశేషంగా చర్చింపబడిన 'వడకడం సభ్యత్వమునకు అర్హత' అనే విషయమును గూర్చినదే రామచంద్రన్ వేసిన చివరి ప్రశ్న. ప్రారంభములోనే తాను వడకగలనని గాంధీజీకి రామచంద్రన్ నచ్చ చెప్పినాడు. కానీ గాంధీజీ ఉపవాసాన్ని గూర్చి విన్నతరువాతనే, శాంతినికేతనంలోని ముగ్గురు స్నేహితులతో కలసి తాను వడకడం ప్రారంభించినట్లు ఒప్పుకొన్నాడు. అందరూ వడకవలెననే విషయంలో కూడా తనకు విశ్వాసమున్నట్లు ఆయన గట్టిగా అంగీకరించాడు. కాని, కాంగ్రెసు తన సభ్యులను వడకవలసిందని ఎలా నిర్బంధించ కలదో ఆయన కర్థంకాలేదు. 'ప్రోత్సాహం తప్ప నిర్బంధ పద్ధతి పనికిరాదు.'

గాంధీజీ యిలా అన్నాడు:

'అలా అయితే మీరు ఆండ్రూసునుకూడా మించిపోతున్నారు. ఆయన కాంగ్రెసు, తన సభ్యులను నిర్బంధించడం కూడదంటారు. కాని వడకుటనుగూర్చిన నియమాలతో, ఒక ఐచ్ఛికమైన వడుకు సంఘాన్ని నియమించి అందులో సంతోషంగా సభ్యుడు కావడాని కొప్పుకుంటారు. అటువంటి సంఘానికికూడా మీరభ్యంతరపెడుతున్నారు.' రామచంద్రన్ మాట్లాడకుండా కూర్చున్నాడు.

అప్పుడు గాంధీజీ ఆయన వాదానికి ఆనందిస్తూ మళ్లీ యిలా అన్నాడు:

'అయితే సరే! తన సభ్యులు త్రాగకూడదనడానికి కాంగ్రెసు కేమైనా హక్కున్నదా? అదికూడా వ్యక్తిస్వాతంత్ర్యాన్ని నిరోధించడం అవుతుందా? త్రాగకూడదని ఆదేశించే హక్కును కాంగ్రెసు చలాయించినయెడల యేమీ అభ్యంతరం ఉండదు. ఎందువల్ల? త్రాగుడు వలని అపకారాలు అందరికీ తెలిసినవే కాబట్టి. ఇండియాలో ఈ నాడు లక్షలాది ప్రజలు వస్తులు పడుకోవలసిన పరిస్థితిలో అత్యంత దరిద్ర నిమగ్నులై ఉండగా విదేశీ బట్టను దిగుమతిచేయడం బహుశా అంతకంటె ఎక్కువ అపకారమని నేనంటున్నాను. ఒరిస్సాలో ఆకలితో అల్లాడుతూన్న లక్షలాది ప్రజలను గూర్చి ఆలోచించండి! నేనక్కడకు వెళ్లినప్పుడు క్షామ పీడితులను చూచాను. అక్కడ ఒక పరిశ్రమాలయానికి యాజమాన్యం వహించి సదయుడైన సూపరింటెండెంటు ఒకాయన ఉండడం అదృష్టం. అక్కడ వారి పిల్లలను కూడా చూచాను. వారు కళగా, ఆరోగ్యవంతంగా, ఆనందంగా తివాచీలు, బుట్టలు మొదలగునవి అల్లుకొంటూ ఉన్నారు. వడుకు పని లేదు. తక్కిన పనులు ఎక్కువ వాడుకలో ఉండడమే అందుకు కారణం. అయితే వారి ముఖాలలో సంతోషంతో పని చేస్తూన్న వికాసం కనిపించింది. కాని నేను క్షామ పీడిత ప్రజలకడకువచ్చి యేమి చూచాను?. వారు కేవలం చర్మమూ, బొమికలతో చావ సిద్ధంగా ఉన్నారు. ఆ స్థితిలో వారెందుకు ఉన్నారు? వారే పరిస్థితులలోనూ పనిచేయరు. మీరు వారిని కాల్చి వేస్తామని బెదిరించినప్పటికీ వారు కాల్చి వేయబడడానికైనా ఒప్పుకుంటారు గానీ నిజాయితీగా పనిచేయడానికి ఒప్పుకోరు. పనిమీద ఉండే విముఖత త్రాగుడుకంటెకూడా చెడ్డది. త్రాగుబోతుచేత కొంత పనిచేయించవచ్చును. త్రాగుబోతుకు

కొంత హృదయం ఉంటుంది. వానికి తెలివి ఉంటుంది. పనిచేయ నిరాకరించే ఈ క్షుధార్తులు కేవలం జంతువులవంటివారు. ఇటువంటి మనుష్యుల కడనుండి పని పుచ్చుకోవడమనే సమస్య నెలా ఇప్పుడు పరిష్కరించడం ? వడకడం సార్వజనీనం చేయడం తప్ప మరొక మార్గం నాకు కనిపించడంలేదు. ఇండియాలోకి దిగుమతి అయిన ప్రతి గజం విదేశీ వస్త్రం, క్షుధార్తులైన పేదల నోళ్లనుండి ఒక అన్నపు ముద్దను లాగివేయడంగా పరిణమిస్తుంది. భారత దేశంలో క్షుధార్తులైన లక్షలాది ప్రజలకు తమ ఆహారాన్ని సంతోషోల్లాసములతో సంపాదించుకొనేటందుకు తగిన సావకాశాన్ని కల్పించడమే తక్షణం మనం చేయతగిన పని అని నేను గ్రహించగలిగినట్లుగా మీరు కూడా గ్రహించగలిగేయెడల, మీరు 'వడకడం సభ్యత్వమునకు అర్హత' గా ఉండడానికి వ్యతిరేకించరు. వడకడం అత్యావశ్యకమని అంగీకరించే స్త్రీ పురుషులతో కూడిన సంస్థగా కాంగ్రెసును నేను భావిస్తున్నాను. ప్రతి సభ్యునికీ వడకడం నిర్బంధం చేస్తే, ఆ సంస్థయొక్క సభ్యత్వాన్ని అది ఎందుకు బలిష్టం చేయకూడదు. ప్రోత్సహించడమంటారు మీరు. కాంగ్రెసులోని ప్రతి సభ్యుడూ ప్రతినెలా క్రమంగా కొంత నూలు వడుకుతూండడం కంటె ఎక్కువ మంచి ప్రోత్సాహమేముంటుంది. తాము వడకకుండా యితరులను వడకమని చెప్పడం కాంగ్రెసు సభ్యులకు ఎలా మర్యాదగా ఉంటుంది. ?

రామచంద్రన్ ఎక్కువ ఔత్సుక్యంతో యిలా అన్నాడు, 'వడకని వారిని మీరు కాంగ్రెసునుండి ఎలా తొలగించగలరు ? ఇతర విధాల వారు దేశానికి విలువగల సేవచేస్తూండి ఉండవచ్చును.'

గాంధీజీ యిలా అన్నారు :

'ఎందుకు పీలులేదు. ఆస్తికలవారికే వోటునడానికీ కారణ మేమిటి? సభ్యుడు కావడాని కొక మనిషి నాలుగణాలెందుకు చెల్లించాలి? ఆయన వయస్సుకూడా ఒక అవసరమైన అర్హత అని ఎందుకనుకోవాలి? ఇటలీలోని పనిమిదేండ్ల అద్భుత వైణికునకు వోటు అర్హత ఉన్నదా? జాన్ స్టూ ఆర్టు మిల్ యెంత ధీశాలి యయినప్పటికీ ఏడు సంవత్సరాల వయస్సులో గ్రీకులాటిన్ భాషలలో ఆయన కెంత పాండిత్యం ఉన్నా, ఆ వయస్సునాటి కాయనకు వోటు లేదు. ఈ అద్భుత ప్రతి భాశాలు రెండును వోటు లేకుండా మినహాయింపబడ్డారు? వోటుకే అర్హత లేర్పాటు చేయబడినప్పటికీ కొంతమంది మినహాయింపబడ వలసిందే. చాలామంది ఈనాడు నా వాదం అంగీకరించరు. కాని ఏలాగయినా గాంధీ చెప్పినదే బాగుంది అని ప్రజలు అనుకొనేరోజు ఒకటి వస్తుందని నాకు నమ్మకం ఉంది. అది నా మరణానంతరం కావచ్చును. *

యంగ్ ఇండియా. 20-11-1924

---

* గాంధీజీతో ఒక ఉదయం అని మ. దే. వ్రాసిన ఒక వ్యాసము నుండి.

# 33

## రాటం

ఈ ఉపకారం ఎలా చేయడం? నేనికరాడ రాటానికి అగ్రస్థాన మిస్తున్నాను. దానికి ప్రతికూలంగా నేను చాలా విన్నాను. అయితే ఈ రోజున దేనిని నిందిస్తున్నారో, దానినే సుదర్శన చక్రమని పూజించేకాలం చాలా దగ్గరలో ఉందని నాకు తెలుసును. మనంతట మనం దానిని చేపట్టకపోతే పరిస్థితుల బలవంతము వలననైనా మనం దానిని చేపట్టక తీరదని నాకు నమ్మకం ఉంది. రాటమునుగూర్చి పరిశీలించడమే భారతీయ అర్థశాస్త్రి పరిశీలనం. క్షీణించిపోతూన్న గ్రామ పరిశ్రమలను పునరుద్ధరించేటందుకది తప్పని సరి అవుతుంది. నేను నూలు వడకడం ఒక వృత్తిగా భావించడం లేదు. అన్ని మతాలలోని అన్నితరగతులవారూ అన్ని శాఖలవారూ నిర్వర్తించవలసిన పరమ ధర్మంగా నేను దానిని భావిస్తున్నాను.

శారీరక శ్రమయందు విశ్వాసంగల జాతులకే భవిష్యత్తు ఉన్నదని ఒకానొక అమెరికన్ గ్రంథకర్త అన్నాడు. అంతు లేకుండా పెరిగిపోతూన్న నిర్జీవ యంత్రాలను పూజించటంతో దేశాలు విసుగెత్తి పోయినవి. అప్రతిమానములైన సజీవయంత్రాలను అనగా మన శరీరాలను మనం తుప్పుపట్టేటట్లు వదలివేసి విధ్వంసం చేసుకొంటూ, వాటి స్థానే నిర్జీవ యంత్రాలను నిలపడానికి ప్రయత్నిస్తున్నాము. శరీరం పని కోసం పూర్తిగా వినియోగింపబడవలెనని దైవ శాసనం. దానిని మనం నిర్లక్ష్యం చేయజాలము. శరీర యజ్ఞమునకు (శరీర కృషికి) రాటం శుభ చిహ్నం. ఈ యజ్ఞం చేయ

కుండా ఎవడు భుజిస్తాడో వాడు దొంగతనం చేస్తున్నాడు. ఈ యజ్ఞమును విడనాడినందున మనం దేశద్రోహులమై అదృష్టదేవత రాకుండా తలుపు గడియ వేసుకొన్నాము. అస్థిపంజరాలవంటి శరీరాలు కల అసంఖ్యాకులగు స్త్రీ పురుషులే ఇందుకు నిదర్శనం. ప్రజల యిష్టంవచ్చిన దుస్తులను ధరించే విషయంలోకూడా నేను జోక్యం కల్పించుకొంటూన్నానని గౌరవనీయుడైన నామిత్రుడు శాస్త్రిగారంటున్నారు. ఇది ముమ్మాటికీ నిజం. అవసరమైనప్పుడెల్లా ఆ పని చేయడం ప్రతి జాతీయ సేవకునియొక్క కర్తవ్యమూను. దేశీయులు పంట్లం తొడుగుకోవడం ప్రారంభిస్తే తప్పకుండా నేను దానిని ఎలుగెత్తి ప్రతిఘటిస్తాను. అది మన శీతోష్ణస్థితికి బొత్తిగా పనికిరాదు. విదేశీ బట్టలను దేశీయు లుపయోగించకుండా ప్రతిఘటించడం ప్రతి భారతీయుని కర్తవ్యమూను. ఆ ప్రతిఘటన, నిజంగా ఆ బట్ట విదేశీ అయినందుకు కాక, దాని దిగుమతితోపాటు అది తీసుకొనివచ్చే దరిద్రమునకు ప్రతికూలంగా చేయబడుతూన్నది. మన జవరును బ్రెజీని విడచి, మన దేశీయులు స్కాట్లండు నుండి ఓట్సునూ రష్యా నుండి రైనీ దిగుమతి చేయించుకొంటూన్నట్లయితే, నేను నిజంగా వంట యింట్లోకి కూడ బలవంతంగా చొరబడి, వారిని గట్టిగా మందలించి ధర్నా కూర్చొని, నా మనస్సులోని ఆ క్రోశాన్ని వారికి వినిపిస్తాను. అట్టి బలవంతపు జోక్యాలు యిటీవల జరిగినవికూడా. కడచిన ఐరోపా ఘోర సంగ్రామ సమయంలో ప్రత్యేకం కొన్ని పంటలను పండించవలెనని ప్రజలు నిర్బంధింప బడ్డారు. ప్రభుత్వాలు ప్రజలు అన్నపానీయము లకుకూడా కంట్రోళ్లు పెట్టినవి.

గ్రామాలలో సేవచేయవలెనని కోరేవారు రాటమును గూర్చి పరిశీలించకుండా ఉండజాలరు. దాని ద్వారా, వందల

కొలదీ వేళకొలదీ స్త్రీ పురుషులు తమ జీవనభృతిని సంపాదించుకోగలగడమే కాక అంతకు రెట్టింపు దేశానికి తిరిగీ సమర్పించగలరు. ఈ పనికి చాలా నిర్మాణం కావాలి. ప్రతి గ్రామస్థునితోనూ పరిచయంగలిగి ఉండాలి. అప్పుడతనికి ఆర్థిక రాజకీయ విషయాలలో ప్రాథమిక జ్ఞానం కలిగించడం యెవ్వరికైనా సుకరం కాగలదు. గ్రామాలలోని పిల్లలకు నిజమైన విద్య చెప్పడంకూడా ఈ పనిలో చేరిఉంది. గ్రామాలలోని లోపాలను, గ్రామాల కోరికలను ఆంతరంగికంగా తెలుసుకొనేటందు కీపని వీలు కలిగిస్తుంది.

ఈ ఖాదీపనిలో, సంస్థానాధిపతికీ అతని ప్రజకూ కలతలు కలగడానికి వీలులేదు. పైగా వారి బాంధవ్యం యెక్కువ సరళంగా ఉంటుందని కూడా అనుకోవలసి ఉంది. కార్యకర్తల అక్కఱపైన ఈ అనుకొన్న ఫలితం కలగడం ఆధారపడి ఉంటుంది కాబట్టి ఈ రాజకీయ మహాసభను రాటానికి ప్రాముఖ్యత ఈయమని అడిగేటందుకు, నేను సిగ్గుపడడమూ లేదు సందేహించడమూ లేదు.*

యంగ్ ఇండియా 8-1-1925

---

* భావనగరంలో మూడవ కతియవాడు రాజకీయ మహాసభలో యీయబడిన అధ్యక్షోపన్యాసమునుండి.

# 34
# స్వదేశీ—జాతీయత

ఒక మిత్రుడు వ్రాసిన ఈ దిగువ విషయం నా కాగితాలలో చాలా కాలం నుండీ ఉన్నది ;

"'మహాత్మా గాంధీ" అని రోమేన్ రోలాండు వ్రాసిన గ్రంథం మీరు నిస్సందేహంగా చదివి ఉంటారు. ఆ పుస్తకంలోని 176 వ పుటలో ఈ భాగం కనిపిస్తున్నది."

'ఇది అత్యంత సంకుచితమై,అతి పరిశుద్ధమైన జాతీయతా విజయం కాక మరేమిటి? ఇంటిదగ్గరే ఉండు; తలుపులన్నీ మూసుకో; ఏ మార్పూ చేయకు. ప్రతిదాన్నీ అంటిపట్టుకొని ఉండు. ఏమీ ఎగుమతి చేయకు. ఏమీ కొనకు. శరీరాన్నీ ఆత్మనూ ఉన్నతికై తెచ్చుకొని పరిశుద్ధం చేసుకో. నిజంగా ఇది మధ్యకాలపు సన్యాసుల ప్రవచనం. గాంధీవంటి విశాల హృదయంగల మనిషి తన పేరు దీనితో సంబంధించి ఉండడాని కంగీకరిస్తున్నాడు. (డి. బి. కలేల్కారుయొక్క 'గాస్పెల్ ఆఫ్ స్వదేశీ'కి పీఠిక సందర్భంలో)

మిమ్ములను అత్యంతం శ్లాఘించే వారికడనుండి ఇది రావడంవలన మీరు దానికి ప్రత్యుత్తరం చెప్పవలసిఉంది. నవంబరు 27యంగిండియా పత్రికలో, ఆండ్రూస్ మహాశయుని వ్యాసం కింద 'జాతీయతను గూర్చిన సత్యం' అనే శీర్షికతో భారతీయ స్వదేశీ కలుషితమైనది కానీ జాతి తత్వంతో కూడినది కానీ కాదని వ్రాశారు మీరు. తరువాతి సంచికలో ఈ వాదాన్ని ఇంకా విస్తరింపచేసి, ఈ అద్భుత గ్రంథమును రచించిన గ్రంథకర్తయొక్కయు దానిని చదివే అసంఖ్యాకులైన పాఠకులయొక్కయు భయములను పోగొట్టకూడదా?"

డి. బి. కలేల్కరు కరపత్రమునకు సంబధించినంతవరకు నా స్థితి యిది. అది గుజరాతీ కరపత్రమునకు అనువాదం. నా పీఠిక ఆ మూలమునకు. డి. బి. కలేల్కరు నాకు గౌరవ నీయుడైన సహచరుడు. కాబట్టి కరపత్రం చదువకుండానే గుజరాతీలో ఒక ఆరు పంక్తులు పీఠిక వ్రాశాను. అక్క-

డక్కడా కొన్ని వాఖ్యాలు మాత్రం చూచాను. స్వదేశీ మీద నా మిత్రుని అభిప్రాయాలు నాకు తెలుసును. నేను వాటితో ఏకీభవించేటందుకు నాకేమీ కష్టం లేదు. కాని ఆండ్రూసు మహాశయుని కోరిక మీద నేనా అనువాదం చదివాను. కొన్ని చోట్ల ఆ చెప్పిన విధానం సంకుచితంగా ఉన్నదని నేనంగీకరిస్తున్నాను. వాటిని గూర్చి నేను శ్రీ కలేల్కారుతో కూడా చర్చించాను. అనువాదంలో అవి సంకుచితంగా అర్థం అవుతూన్నవని ఆయన అన్నాడు. కాని అందుకాయన బాధ్యుడు కాడు. నా సొంత అభిప్రాయాలకు సంబంధించినంతవరకు యంగిండియాలోని నా వ్రాతలు, నా స్వదేశీకానీ ఇంకా అవసరమైతే కలేల్కారు స్వదేశీకానీ, ఆ కరపత్రం వలన కలిగే ఊహాకు తావిచ్చే టంత సంకుచితమైనది కాదని విస్పష్టం చేస్తూన్నవి.

ఆ కరపత్రమునకు సంబంధించినంతవరకిది చాలును. స్వదేశీని గూర్చిన నా నిర్వచనం అందటికీ తెలిసినదే. నాకత్యంత సన్నిహితంగానున్నవానికి నష్టదాయకంగా నాకు దూరంగానున్న పొరుగువాని కుపకారం చేయరాదు. అందులో కసిగానీ, శిక్షోద్దేశం కానీ యెన్నడు లేదు. అది యే విధంగానూ సంకుచితం కాదు. నా ఔన్నత్యమునకు కావలసిన దానిని ప్రపంచంలో యెక్కడనుండియైనా నేను కొంటాను. నా అభ్యున్నతికి అభ్యంతరం కలిగించేదానినిగానీ, ఎవరినిగూర్చి నేను మొట్టమొదటగా జాగ్రత తీసుకోవలెనని ప్రకృతి నియమించినదో వారికి హాని కలిగించే దానినిగానీ, అదియెంత సున్నితంగానూ సుందరంగానూ ఉన్నప్పటికీ, ఎవ్వరి దగ్గర నుండియైనా సరే నేనుకొన నిరాకరిస్తాను. ప్రపంచంలోని ప్రతిభాగమునుండీ, ప్రయోజనకరమైన సముచిత

సాహిత్యాన్ని నేను కొంటాను. నేను ఇంగ్లాండునుండి శస్త్రచికిత్సా పరికరములను, ఆస్ట్రియానుండి గుండుసూదులను, పెన్సిళ్లను, స్విట్జర్లాండునుండి గడియారాలను కొంటాను. కాని అత్యంత సున్నితమైన నూలుబట్టను ఒక్క గజం కూడా ఇంగ్లాండునుండికానీ, జపాను నుండికానీ ప్రపంచంలోని మరి యే యితర దేశమునుండికానీ కొనను. అందుకు కారణం అది భారత దేశంలోని లక్షలాది జనసామాన్యానికి హాని చేసింది. ఇంకా ఎక్కువగా చేస్తూన్నది కూడా. ఇండియా దేశంలో ఆకలితో బాధపడే లక్షలాది నిరుపేదలు వడికి నేసినబట్టను కాదని, అంతకన్న ఎక్కువ నాణ్యమైనదైనప్పటికీ విదేశబట్టను కొనడం పాపమని నా అభిప్రాయం. కాబట్టి నా స్వదేశీ ముఖ్యంగా చేతితో వడికిన నూలుతో తయారుచేయబడిన ఖాదీచుట్టూ తిరుగుతూ ఇండియాలో ఉత్పత్తి అయినట్టిగానీ కావడానికి వీలున్నట్టిగానీ ప్రతివస్తువుకూ విస్తరిస్తుంది. ప్రపంచక్షేమం కోసమే నేను ఇండియా అభ్యున్నతిని కోరుతున్నాను. ఇతరదేశాల విధ్వంసంపైన ఇండియా అభ్యుదయం పొందవలెనని నా కోరిక కాదు. కాబట్టి ఇండియా బలిష్ఠమై శక్తివంతమైనదైతే, తన శిల్పకళా నిధానములను ఆరోగ్యకరములయిన పరిమళ ద్రవ్యములను బయటి ప్రపంచంలోకి పంపుతుంది. నల్లమందు, మత్తుకలిగించే ఇతర పానీయముల వ్యాపారంవలన భారతదేశానికి ఎంత భౌతిక ప్రయోజనం కలిగినప్పటికీ ఆ వస్తువులను ప్రపంచానికి పంప నిరాకరిస్తుంది.

యంగిండియా, 12-3-1925

# 35
# చేమగ్గం

బొంబాయి ప్రచురణ శాఖా డైరెక్టరు, అచటి వాణిజ్య పరిశ్రమల శాఖకింద జరిగిన చేనేతనుగూర్చి ఒక కర పత్రమును ప్రచారం చేయించారు. అందులోని ముఖ్యాంశముల నీకింద ఉదాహరిస్తున్నాను :

"షుమారు కడచిన యాభై సంవత్సరాలనుండి, ఎక్కువ నాణ్యంగానూ ఆర్థికంగా ఎక్కువ లాభదాయకంగానూ ఉండే పద్ధతులను పరికరములనూ, చేనేత, రంగులు వేయడం, బట్టల అద్దకం; మొదలైన పరిశ్రమలలో ప్రవేశ పెట్టేటందుకు ప్రభుత్వంవారు ప్రయత్నిస్తున్నారు."

ఈ రాజధానిలో చే మగ్గపునేత ఇంకా చాలా ప్రాముఖ్యంగానే ఉంటూన్నది. ఈ రాష్ట్రపు జనసంఖ్యకు కావలసిన మొత్తం బట్టలో నాల్గవవంతుకు పైగా చేమగ్గం సరఫరా చేస్తున్నది. కడచిన ముప్పయి సంవత్సరాలలో, విద్యుచ్ఛక్తిచే నడపబడే మగ్గము లెంతత్వరగా ఉత్పత్తి చేసినవో దాదాపు అంతత్వరగా చేమగ్గాలు తమ ఉత్పత్తిని పెంపొందించినవి.

పరిశ్రమల శాఖా యాజమాన్యంకింద నాలుగు నేత పాఠశాలలున్నూ, పడునేత ప్రదర్శనాలయములున్నూ అభివృద్ధి పొందుతూన్నవి. నిరుడవి కొనసాగింపబడినవి. మరమగ్గాలను ప్రవేశపెట్టడం అవి చేయవలసిన పనులలో ఒకటి. అందువలన ఒక్క చేనేత మనిషి చేయగలిగిన పని నూటికి నలభైవంతులు పెరుగుతుంది. ఈ పాఠశాలలలో నూలుబట్టలు నేయడం, అద్దకపు అంచులకు అనువుగా

ఉండేటట్లు చీరలను నున్నగా నేయడం, పట్టుచీరలు, శ్రోవతులు చొక్కా గుడ్డలు మొదలైనవన్నీ నేయడం, కొంచెం చిక్కగాఉండి మనోహరంగా ఉండే నమోనాలను తయారుచేయడం, ఇవన్నీ ఈ పాఠశాలల పరిసరాలలో పనిచేసే యితర చేనేతవారికి గుణపాఠంగా ఉపయోగ పడేటట్లు బాలురకు బోధింపబడుతున్నవి. ఈ అన్ని పాఠశాలలలోనూ ప్రారంభకులకు ఖాదీమగ్గాలు (గుంట మగ్గాలు) పెద్దతరగతుల వారికి చీరల మగ్గాలూ యేర్పాటు చేయబడినవి. కడచిన సంవత్సరం, మిల్లు పరిశ్రమ అంత అభివృద్ధిలో లేకపోయినప్పటికీ, చేనేత వారికిమాత్రం చాలావరకు అనుకూలంగానే ఉంది. పట్టు బట్టలను తదితర సుందర వస్త్రములను తయారుచేసేచోట్ల పనివాళ్లకు నెలకు యాభైరూపాయలు మొదలు అరవై రూపాయిల వరకు గిట్టు బాటయింది. ఖాదీ మొదలయిన నూలు మగ్గాల (గుంట) పైన నెలకు రూ 35 ల మజూరీకి మించి రాలేదు.

వ్యవసాయకులకు తీరిక కాలంలో చేనేత శిక్షణయిప్పించే ప్రయోగం ధార్వారు జిల్లాలో హొబాషాలీలో జరుగు తూన్నది. ఒక్కొక్కసారి ఎనిమిదిమంది వ్యవసాయకులు శిక్షణ పొందేటందు కాపాఠశాలలో అవకాశ మేర్పాటు చేయబడింది. దాని ఫలితంగా మొదటి జట్టులో ఆరుగురు, మరమగ్గాలు (fly shuttle looms) కొనుక్కొని శ్రద్ధగా చేనేతపనిని అవలంబించారు. తకిలీ నవారలా చేయడానికి ఉద్దేశిస్తూన్నట్లు ప్రకటించారు. కిందటి సంవత్సరం ఈ ప్రయోగం నడబడిన హుబ్లీ కొట్టేలో ఇరవైనాలుగు మర మగ్గాలు వ్యవసాయకులలో ప్రవేశ పెట్టబడినవి.

ధూలియాలోని నేతవారు, స్వయం ప్రవర్తకములైన మగ్గాలను (automatic looms) వాటికి సంబంధించిన పనిముట్లనూ చూపే ప్రదర్శనమును ప్రారంభించవలెనని పరిశ్రమల శాఖవారి కొక అర్జీపంపుకొన్నారు. ఆపని జరిగింది. కాని ఒకవిధంగా ఎక్కువ ఖరీదుగల ఆ యంత్రాలను కొనుక్కొనేటందుకు వారికి సదుపాయం లేకపోయింది. అప్పుడు ప్రస్తుత పద్ధతులన్నిటిమీదా ఎక్కువ అభివృద్ధిగా కనిపించిన ఒక చేతి యంత్రమునకు నమూనాలను తయారు చేయడానికి స్థానికంగా యేర్పాట్లు జరిగినవి. చేనేతకు పెద్ద కేంద్రమై, విద్యుచ్ఛక్తిచే నడపబడే మిల్లులతో ఆర్థిక పోటీకై నిలబడి పందలాది మరమగ్గాలు పనిచేస్తూన్న షోలాపూరులో డిపార్టుమెంటు వారిప్పుడు అనేక యంత్రాలను ప్రదర్శిస్తున్నారు. నేతపనికి సంబంధించినంతవరకు విద్యుచ్ఛక్తిచే నడపబడే మిల్లు పనివానితో చేమగ్గపు నేతమనిషి పోటీ చేయగలడు. కాని అంతకు పూర్వం చేయవలసిన ఆసుపోయడం, వలయం చుట్టడం, పడుగు వేయడం, సరిచేయడం ఈ పనులన్నీ చాలా నెమ్మదిగానూ లోపభూయిష్ఠంగానూ జరుగుతూండడం వలన వారికి చాలావరకు ప్రతిబంధకంగా ఉంటూన్నవి.

పరిశ్రమల శాఖవారిచే నడపబడిన ప్రదర్శన కార్యకలాపం యొక్క ఉపయోగమునకు తార్కాణం థానాజిల్లాలోని ఢీవాంఢిలో కనిపిస్తుంది. 1916 వ సం॥లో ఇక్కడ నేత పాఠశాలలు ప్రారంభించబడి, నేత వారిలో చాలా మర మగ్గాలు ప్రవేశ పెట్టబడినవి. ఈ పట్టణంలోని చేనేత పరిశ్రమనుగూర్చి నిరుడు లెక్కలతోకూడిన పరిశీలన జరిగింది. దాని ప్రకారం మొత్తం చేమగ్గాలసంఖ్య 1,800 లోను దాదాపు 1,500 మగ్గాలకు మరమగ్గపు సామాను కూర్చబడింది. అభివృద్ధికర పద్ధతులను చిన్న యెత్తున ప్రవేశపెట్టిన

నేత పాఠశాల మూసివేయబడినప్పటికీ, ఆ పద్ధతులు చేనేత ప్రదేశాలలో ఏవిధంగా వ్యాపకం అవుతున్నవో చూపించే టందుకిది ఉదాహరణం.

రంగులు వేయడంలోని అభ్యుదయ పద్ధతులు ప్రదర్శనాలు ఫైజ్‌పూరు, ధూలియా, చర్న్ (ఖాందేష్), మరేగాణాల యందు విజయం సాధించినవి".

వ్యవసాయకుల యిళ్లలో చేమగ్గమును ప్రవేశపెట్టే ప్రయత్నం అపజయంపొంది తీరుతుందని నేను పరిశ్రమల శాఖవారికి సూచించవచ్చునా ? అలా ప్రవేశపెట్టడం ఎంత అసంభవమో వ్యావసాయిక జీవితాన్ని ఏకొద్దిగా ఎటిగి ఉన్నా స్పష్టంగా అర్థమవుతుంది. చేనేత చాలా పెద్ద కార్యక్రమం ! అందుకు సావధానంగా పనిచేయాలి. అందు లోని వివిధ పరిణామదశలలో ఒకరికంటె ఎక్కువమంది ఏకకాలమందు పనిచేయవలసి ఉంటుంది. ఇది వ్యవసాయ కుని కుటీరంలో సాధ్యంకాదు. కాబట్టి అనాదికాలంనుండీ చేనేత ప్రత్యేకం స్వతంత్ర వృత్తిగా ఉండి, ఆపని చేసేవారి కది ఒకక్కటే జీవనాధారంగా ఉంటూవస్తూన్నది. రైతు తన యిష్టం వచ్చినప్పుడు చేసేటందుకు లేనప్పుడు మానివేసే టందుకు తగిన ఉపవృత్తి అతనికి కావాలి. లక్షలాది ప్రజ లవలంబించతగిన అటువంటి వృత్తి నూలు వడకడం ఒకక్కటే. తీరిక సమయాలను సరిగా వినియోగించుకొనేటందు కింకా కొన్ని వృత్తులిటువంటివి ఉన్నమాట నిజమే. కాని చేతితో నూలువడకడంకంటె యింకే యితర వృత్తీ లక్షలాది స్త్రీ పురుషుల కుపకారికాజాలదు. కాబట్టి పరిశ్రమల శాఖ తన ఉనికిని సమర్థించుకోగలిగిన యెడలను, వ్యకుల క్షేమంగాక జనసామాన్యపు క్షేమమును, ఇంగ్లాండు శ్రేయస్సును కాక

ఇండియా శ్రేయస్సును ఆలోచించిన యెడలను, తన దృష్టిని ముఖ్యంగా చేతితో నూలువడకు పనికి మరల్చి, దానిని గ్రామ స్థలాలలో సంస్థాపించి, దాని వివిధ పద్ధతులలో అభివృద్ధులు కావించవలెను. సంగరాష్ట్రంలోకూడా ఇటువంటి శాఖ ఒకటి నూలువడికే పనికి తన దృష్టిని మరలిస్తున్నట్లు తెలుసుకొని సంతోషిస్తున్నాను. కాని ఇంకా ఆపని ఉత్సాహంగా జరగడం లేదు. నిజంగా ప్రభుత్వానికి మంచి ఉద్దేశం ఉంటే, ప్రజలతో సహకరించి జయప్రదం చేయగలిగిన పని నూలువడికే వృత్తి ఒకటే. మనం ప్రభుత్వంతో సహకరించేటందుకు తఱచు కోరబడుతున్నాము. కాని ప్రభుత్వంవారు ప్రజలతో సహకరిస్తూ వారి కోరికలు గ్రహించి వాటిని తీర్చడం, సక్రమమైన సహజధర్మం. పత్తి మగ్గంమీదకు వచ్చేవరకూ మధ్యలో జరుగవలసిన అన్ని కార్యకలాపాలను పరిశ్రమల శాఖవారి అధీనంలో ఉంచుకోనియెడల వారు కేవలం మాంచెస్టర్‌కో జపాన్‌కో బొంబాయికో కావలసిన సరుకు సరఫరాచేసేవారుగా మాత్రమే పరిణమించగలరని సూచించ సాహసిస్తున్నాను. తన పొలంలో పండిన పంటను తన యింట్లోగానీ తన గ్రామంలోగానీ అన్ని అంతరువులలోకి మార్చుకోగలిగిన నేర్పరితనాన్ని బోధించవలసిన కర్తవ్యం పరిశ్రమల శాఖది. అప్పుడు గ్రామస్థుడు వివిధరకాల వృత్తిగలిగి ఉండి, కఱవో వరదో వచ్చి మీదపడినందున పంటలు పాడయినా, పని లేకపోయినా, ఆర్థిక కష్టాలలోపడి నిస్సహాయుడై నిలచిపోయి నష్టనుకోడు.

యంగిండియా, 14-5-1925

## 36

# కార్యకర్తయొక్క కష్టం

నా వంగరాష్ట్ర సంచారంలో నాకనేక సూచన లందచేయబడినవి. నేను వాటినవలంబించజాలక పోయినప్పటికీ వాటన్నిటినీ నేను సరిగానే అర్థంచేసుకొంటున్నాను. ఒకానొక పట్టుదలగల కార్యకర్తనుండి వచ్చినదీ దిగువ సూచన.

“ఇక్కడ పత్తిధర ఎక్కువగా ఉండడంచేతనూ, అది తక్షణం అందటికీ సరఫరా కావడానికి తగిన యేర్పాటేమీ లేక పోవడంచేతనూ చాలా కష్టంగా ఉంది. ఇందుకు ఫలితంగా బజారులో ఖద్దరు కొనేవారు. మిల్లులో తయారైన బట్టకు దాదాపు రెట్టింపుధర చెల్లించవలసి వస్తూన్నది. ఒక బట్టకు కావలసిన నూలుయావత్తు ఒక మనిషి తనకు తానే వడుకుకొని, స్థానికంగా నేతవానిచేత నేయించుకొన్నప్పటికీ కూడా చివరకు తన నూలుతో తయారైన బట్ట మిల్లు బట్టకంటె ఎక్కువ చౌకకాదని తెలిసివస్తూన్నది. పత్తి ధర ఎక్కువకావడం, దానిఫలితంగా ఖద్దరు ధర పెరగడం ఈ రెండూ సర్వసాధారణంగా అందరూ ఖద్దరు ధరించడానికీ, కనీసం ఈ రాష్ట్రంలోనైనా, తీరని అభ్యంతరాలుగా ఉన్నవి.

దేశంలో విస్తారంగా పత్తి పండించడమే ఈ పరిస్థితికి తగిన పరిహారం. కాని దురదృష్టవశాత్తు ఈ విషయంలో దాని ప్రాముఖ్యతకు తగినంత శ్రద్ధ చూపబడడంలేదు. ప్రజలలో వడుకుపనిని ప్రచారంచేసేటందుకు అక్కడక్కడా ప్రయత్నాలు జరుగుతూన్నవి. కాని వంగరాష్ట్రంలో పత్తి

వ్యవసాయాన్ని ప్రవేశపెట్టటందుకుగాని ప్రోత్సహించేటందుకుగానీకూడా నిర్మాణయుతమైన ప్రయత్నమేమీ జరుగ లేదు.

కాబట్టి మీరు వంగరాష్ట్రంలో సంచారంచేసేటప్పుడు, దేశీయ పత్తిని పండించడముయొక్క అత్యంత ప్రాముఖ్యతను అక్కడిప్రజలకూ కార్యకర్తలకూ కూడా నచ్చ చెప్పగలరని ఆశిస్తున్నాను ”

ఈ మాటలు నేను నామానవ్రతం నాడు వ్రాస్తున్నాను. ఖాదీ ప్రతిష్ఠానమునకు చెందిన సతీశబాబు నాపక్కనే కూర్చొని ఉన్నాడు వంగరాష్ట్ర పరిస్థితులు, ఎప్పుడైనా నేను తెలుసుకోవడానికి ఆశించగలిగిన వానికంటెకూడా ఎక్కువగా ఆయనకు తెలుసును గనుక ఆసూచనను జవాబుకోసం నే నాయనకిచ్చాను.

ఆయన జవాబిది :

“ వంగరాష్ట్రంలో ఖాదీ వ్యాపకమునకు నిజమైన చిక్కు పత్తిధర పెరిగిపోవడంలో ఉందని ఈ విలేఖకు డనుకొంటున్నాడు. అందుకు పరిహారంగా పత్తిపంటను ప్రవేశపెట్టి ప్రోత్సహించవలెనని సూచించబడినది.

పత్తి ప్రతిచోటా పండింపబడక పోవడం వంగరాష్ట్రంలో నిజంగా చిక్కుగానేవున్నది. కాని అది ఒక్కటే చిక్కు కాదు. అది అంతతీవ్రమైన చిక్కుకూడా కాదు. మాంచెస్టరు తనకు కావలసిన పత్తిని అమెరికా బొంబాయిలనుండి కొనుకొని, తన యంత్రోత్పత్తులను ఇండియాకు పంపుతూన్నది. నిజానికి వంగరాష్ట్రానికి కావలసిన యావత్తు పత్తినీ ఇండియాలోని యే పత్తి వ్యాపార సంస్థలనుండైనా ఆరాష్ట్రం తెప్పించుకోగలదు. వంగరాష్ట్రంలో

లక్షలకొలదీ రూపాయీల విలువగల పత్తి పండింపబడు తూన్నది. కాని అది చిట్టగాంగ్ కలకత్తా రేవులనుండి బయటకు పంపబడుతూన్నది. వంగరాష్ట్రం తానుపండించిన పత్తిలో కించిద్భాగంకూడా ఇంట్లోవడికేటందు కుపయోగించ డంలేదు. చిట్టగాంగ్ లోనూ కోమిల్లాలోనూ ఉత్పత్తి అయిన పత్తి యావత్తూ వంగరాష్ట్రం ఇళ్ళలో నూలు వడికేటందు కుపయోగించుకోవచ్చును. ఇంకా కావలసివస్తే బీహారు సంయుక్త రాష్ట్రాల అంగళ్ళనుండి తెప్పించుకోవచ్చును.

ఖాదీ వ్యాపకానికి అడ్డంకుగా ఉన్న నిజమైన చిక్కు పత్తిధర ఎక్కువకావడమూ కాదు పత్తి పంట లేక పోవడమూ కాదు. వడకవలెననీ ఖాదీని ఉపయోగించవలెననీ కోరిక లేకపోవడం, అటువంటి కోరికను పుట్టించి అందుకు తగిన సరఫరా చేసేటందుకొక సంస్థ లేకపోవడం. ఈ రెండూ ఖాదీ వ్యాపకమునకు కావలసిఉన్నవి.

ఈ చిన్న ఉత్తరం పంపిన విలేఖకుని ఆశ్రమమునే 'చాకగా' పత్తి అమ్మే కేంద్రంగా చేయువచ్చును. చాకగా అంటే న్యాయమైన బజారు ధరకు అమ్మడమని అర్థం. వడకడంలోనూ ఏకడంలోనూ ఆశ్రమం ఒక నిపుణునికి శిక్షణ ఈయవచ్చును. తరువాత మంచి ఏకులు, మంచి రాటం ఉంటే వడకడం ఆనందంగా ఉంటుందని సమీపంలో నున్న సోదరీమణులకు ప్రదర్శించి చూపవచ్చును. వడకడం కష్టంగా ఉనప్పుడే ఖాదీ వ్యాపకమునుగూర్చి ఉపాజన్యము లైన కష్టాలు కలుగుతూంటవి. సేవచేయవలెననే ఉద్దేశం కల చర్ఖానిపుణులున్న సంస్థలద్వారా వంగ సోదరీమణులకు సహాయం లభిస్తూన్నయెడల ప్రతి చిక్కూ తొలగిపోతుంది. అంతేకాదు. విశేష లాలన అవసరం లేకుండానే వ్యవసాయ కులు పత్తి పంటను ప్రవేశ పెట్టడంకూడా నేను చూడగలను.

నూలువడకడం మధ్యలో చేయవలసినపని. దానికి ముందూ, దానికి వెనుకాకూడా చేయవలసినపనులున్నవి. పత్తి పండించడం, విత్తులు తీయడం, ఏకులుచేయడం, ముందు చేయవలసిన పనులు. వాటితరువాతనే వడకడం చేయడం వస్తుంది. మనమిప్పుడు చక్కగా ఏకడం, వడకడం, నేయడం వరకే మన దృష్టిని కేంద్రీకరించవలసిఉంది. మంచి సంస్థల లోని కృతనిశ్చయులైన మనుష్యులు చేసే తీవ్రప్రయత్నం అన్ని చిక్కులనూ దాటించి వంగరాష్ట్రంలో వడుకు పనిని జయప్రదంగా విచంగలదు. అటువంటి రోజు దగ్గరలోనే చూడగలనని ఆశిస్తున్నాను. "

ఈ జవాబును నేను పూర్తిగా అంగీకరిస్తూ వడికేటందుకు స్త్రీలకువలెనే పురుషులకు కూడా సరియైన యేర్పాటు ఉండడం అవసరమని నేనంటున్నాను. పురుషుల యేర్పాటు లేనిదే స్త్రీల సహాకారంపొందడం అత్యంత దుర్లభం. మజూరీకోసం వడికే స్త్రీలను యేర్పాటుచేయగలగడానికి ముందు, ఐచ్ఛికంగా వడికేవారు చాలామంది మనకుకావాలి. భర్తలు, సోదరులు, తండ్రులద్వారా మాత్రమే చర్ఖాను అభి వృద్ధిలోకి తీసుకొనిరాగలమని మనమాశపడవచ్చును. కార్య కర్తలలో అత్యధిక సంఖ్యాకులు మగవారు. స్త్రీలేవిధంగా పనిచేస్తున్నారో చూడడానికికూడా వారికి సావకాశంలేదు. కాని నేను చూస్తూన్న వడుకుప్రదర్శనాలనుబట్టి తెరచాటున ఏమి జరుగుతూన్నదో నేనూహించుకోగలను. రాట్నాలను సరిగా చూచుకొంటే, ఇప్పుడు వడికే నూలుకు రెట్టింపు వడకవచ్చును. అనగా కొంచెం ప్రయాసతో రెట్టింపు ఆదాయం సంపాదించుకోవచ్చునన్నమాట. కదుళ్లకు బదు లుగాకడ్డీలు వాడుతూ, ఊగుతూన్న రాట్నాలమీద కొందఱు వడుకుతూండడం చూచినప్పుడు బాధగా ఉంటుంది. చక్రాలు

ఊగకుండాఉండి, కడ్డీలకు బదులు సరియైన ప్రమాణంగల కదుళ్లు పెట్టబడినట్లయితే తక్షణం రెట్టింపునూలు ఉత్పత్తి అవుతుంది.

ఇక పత్తి పండించే విషయం ఆలోచిద్దాం. వంగ రాష్ట్రంలోని అన్ని భాగాలూ పత్తి పండించేటందుకు తగినవి కావు. కాబట్టి కొంతవరకు దిగుమతి చేసుకోవలసిన అవసరం ఎప్పుడూఉంది. ప్రతి కొత్త పరిశ్రమకూ రక్షణ అవసరం. ప్రభుత్వ రక్షణ యింకా మనం పొందలేక పోవచ్చును. కాబట్టి మనంతట మనం చేసుకొనే రక్షణ ఒకటే పరిహారం. ఉచితంగా వడకడంవలన ఆ రక్షణ ఈయవచ్చును. నూలు వడకడం కాంగ్రెసు సభ్యత్వ అర్హతగా నిర్ణయించడంలో ఒక ఉద్దేశమదే. రెండవపద్ధతి పత్తి అడిగి తెచ్చి, గుజరాతులో వలె పకులను లేక పత్తిని సగం ఖరీదుకు అమ్మి, తమకు కావలసిన నూలును తామే వడుకుకొనువారికి సగం ఖరీదుకు నేయించి పెట్టడంకూడా చేయాలి. మిల్లులతో పోల్చడం నిరుపయోగమైన కాలక్షేపం. పునరుద్ధరింపబడుతూన్న వడుకునూలు కుటీర పరిశ్రమను చంపేటందుకు, జపాను మాంచెష్టర్లు తమ వస్త్రాలను దాదాపు ఉచితంగా యిచ్చివేయ వచ్చుననికూడా ఊహించడానికి వీలున్నది. అప్పుడుకూడా విదేశీ బట్టలను కానీ, మన మిల్లు బట్టలనుకానీ ఉచితంగా యిచ్చినప్పటికీ పుచ్చుకోని వారు ఉండాలి. వారివలననే రాటం వ్యాపకమై, జయంపొందుతుందని మనం ఆశించ వచ్చును.

—యంగిండియా, 21-5-1925

# 37

# వడుకుట - విద్యార్థులు

విద్యార్థులతో జరిగిన సంభాషణలను సంగ్రహంగా వ్రాసేటందుకు ప్రతివారూ కుతూహలపడతారు. కాని అది అసాధ్యమయిన పని. గాంధీజీని సన్నిహితమైన దీర్ఘ సంభాషణలోకి దించగలిగిన అదృష్టవంతులు ప్రతిచోటా వారే. ప్రతి ఆంగ్ల బాలునికీ నౌకా శిక్షణ ఎంత అవసరమో, తూర్పు బంగాళంలోని ప్రతి పిల్లవాడూ ఈతలోను పడవ నడపడంలోనూ శిక్షణ పొందడం ఎంత ప్రాముఖ్యమో, భారతీయ విద్యార్థులకు నూలు వడకడం అంత ముఖ్యావసరమని చిట్టగాంగ్ విద్యార్థులాయనద్వారా విన్నారు. కోమిల్లా విద్యార్థులు జాతీయ విద్యయొక్క నిర్వచనమును ఆయనద్వారా గ్రహించారు. మీ దేశస్థులందరికొఱకు మీలో ఒక సహృద్భావమును కలిగించగలిగినదీ, మీ దేశీయులెక్కడ ఉన్నప్పటికీ వారి కష్టాలనుగూర్చి మిమ్ములను కదిలించగలిగినదీ యే విద్యఅయితే ఉన్నదో అదే జాతీయ విద్య. మిమ్ములను దేశంకొఱకు ఆలోచించేటట్లు చేయగలిగినదీ, ఒక ప్రత్యేకవిషయం మీకు వ్యక్తిగతంగా ఎలా లాభిస్తుందా అనికాక, ఆవిజాతి అంతటికీ ఎలా ఉపయోగిస్తుందా అని అంచనా వేసేటట్లు చేయుగలిగినదీ జాతీయ విద్య. రాటంవలె సర్వత్రా ఉపయోగకరమైన వస్తువు మఱొకటి లేదు. ఢాకాలో విద్యార్థుల సమావేశం రద్దుచేయబడింది. కాని అన్ని బహిరంగ కార్యకలాపాలు ముగింపబడిన పిమ్మట విద్యార్థులు వచ్చి తనతో సంభాషించవలసిందిగా గాంధీజీ కోరినారు. అయితేవారెన్నడూ, అతి విశృంఖలమైన కలలో

కూడా అనుకోనంత ఎక్కువ పొందగలిగారు. గాంధీజీ ఎప్పుడూ కవ్వించిన కొద్దీ బాగా మాట్లాడుతారు. నూలు వడకడం కాలాన్నీ శక్తినీ వృథాచేయడమని ఒక స్నేహితుడభ్యంతర పెట్టినప్పుడూ, ఆయన సలహా శ్రమ విభజన సిద్ధాంతాన్ని గమనించడమే లేదని మరొకరన్నప్పుడూ, ఆయన తనహృదయం విప్పి యీలా అన్నారు. (రోజు రోజంతా వడకమని నేను మిమ్ములను కోరుతున్నానా? దాని నొక ప్రత్యేక స్వతంత్రవృత్తిగా అవలంబించవలసిందని నేను మిమ్ములనడుగుతున్నానా? అయితే ఇక ఎక్కడ శ్రమ విభజన సిద్ధాంతాన్ని తృణీకరించడం? తినడంలోను త్రాగడంలోను శ్రమవిభజన సిద్ధాంతాన్ని మీరనుసరిస్తున్నారా?) అని యింకాయిలా ఉద్రేకంతో సంభాషించారు గాంధీజీ. 'మనలో ప్రతి మనిషి ఏవిధంగా తనకుతాను తిని, త్రావి, దుస్తులు ధరిస్తున్నాడో ఆలాగే మనలో ప్రతి ఒక్కరూ తనకు తాను నూలువడుకుకోవాలి. అది వృథా అంటారూ మీరు? మీ దేశీయులకోసం మీకు చాలా సుహృద్భావం ఉందని మీరంటారు. మానవసహజమైన కరుణలేని ఆ సుహృద్భావం ఏమిటి? ఆవుకు లేగమీదఉన్న ప్రేమవంటి ప్రేమను కానీ తల్లికి పసిపాపమీద ఉన్న ప్రేమవంటి ప్రేమనుకానీ మీ రనుభవిస్తున్నారా? ఆవు పొదుగు, తల్లి రొమ్ము తమ బిడ్డలను చూచినంతనే పాలతో పొంగిపోతవి. అన్నం లేక బక్కచిక్కిన నీదేశీయులను చూచినప్పుడు ప్రేమతో మీ హృదయాలు పొంగిపోవునా? మిత్రులారా! నూలు వడకడం ద్వారా వారియెడ మీకుగల ప్రేమను మీరు ప్రదర్శించండి! మీరు వడికి మీరు వారి సోమరితనాని పోగొట్టండి. ఒక మిత్రుడువెళ్లి ఒక గుంపుదగ్గర చక్కగా పాడి వారి హృదయాలను కదిలిస్తాడు. అది వృథా ప్రయాస

అవుతుందా? పిచ్చిగా 'వందేమాతరం' అని వారిముందు అరిస్తేమాత్రం నిజంగా అంతే. అయితే వడకడం అంతకంటే ఎక్కువది. దానికొక ఉద్దేశం ఉంది. అందువల్ల అదనపు ఉత్పత్తి జరుగుతుంది ప్రజాసామాన్యంతో సంబంధం కలిగించడమే దాని ఉద్దేశం. దానిని గూర్చి యంత్రంవలె పనిచేయడంలోకూడా కొంత ఫలితం ఉంది. ఎక్కువ ప్రయత్నమూ ఎక్కువ తెలివీ అవసరం లేకుండా, అందరూ సమానంగా చేయగలిగినపని దాని వంటిది మరొకటిలేదు. మనలోని ప్రజ్ఞాధురీణులు మామూలు మనుష్యులు అనే భేదం లేకుండా లక్షలాది జనులు చేయగలిగినపని దీనికంటె మరొకటి లేదు. విద్యార్థులు ప్రపంచానికి ఎక్కువగా కావలసినవారు కనుక, ఈ పని ముఖ్యంగా వారుచేయాలి. వారి జీవితం ఇంకా ప్రారంభం కావలసిఉంది. ఎవ్వరూ ఇముడ్చుకోలేని కొత్త అభిప్రాయాలను వారిముడ్చుకోగలరు. వారింకా చాలా సంవత్సరాలు సేవచేయవలసిఉంది. మీరు కొత్తసీసాల లోనే కొత్తసారా పోయగలరు. కాని పాతసీసాలలో పోయజాలరు. ఉత్సాహము, శక్తి, యుక్తాయుక్తవివేకము గలిగి క్రమశిక్షితులయిన విద్యార్థుల బృందం ఏంత చేయగలదో ఊహించుకోండి! ఢక్కాలోని 11,000 మంది విద్యార్థులలో ప్రతిఒక్కరూ రోజుకు ఒకఅరగంట వడికేటందుకు శ్రమచేసినయెడల ఎంతగొప్పగా ఉత్పత్తిఅవుతుందో ఊహించుకోండి. మీరందరు ఖాదీ ధరించేయెడల, మీరందుకు వెచ్చించిన సొమ్ములో ఎక్కువభాగం వడికేవారికి లభిస్తుందని మీకు తెలుసునా? విస్తృతయంత్రనిర్మాణము గల ఇగ్లాండునుగూర్చి బహుశా మీరాలోచిస్తూంటారు. కాని ఆదేశం ఇతరజాతులను స్వార్థంకోసం వినియోగించు

కొంటూ జీవిస్తున్నది. అది మన కష్టాన్ని జయించింది. దాదాభాయినౌరోజీ మనకు కన్నులు విప్పిచూపిన హోం చార్జీలకంటెనూ ఇండియాబయటకు పోయే తదితర ధనప్రవాహములకంటెనూ కూడా ఎక్కువ విధ్వంసకరమైనది మనం పనిచేయని కారణాన కలుగుతూన్న ఆర్థికనష్టం. ఆయనకూడా ప్రచ్ఛన్నంగా పోయే ఈ ధన ప్రవాహాన్ని గమనించలేకపోయినాడు. ఆయన పద్ధతుల ప్రకారం పనిచేస్తున్న అనుచరుడుగా నేను దీనిని తెలుసుకొని, మనం సోమరుల జాతిగా తయారుచేయబడుతూన్నందున దేశాన్ని విడిచిపోయే ఆర్థికప్రవాహం అన్నిటికంటెనూ వినాశకరమయినదని చెప్తున్నాను.' అని ఇదే ధోరణిలో ఈ నిర్బంధ నిర్వ్యాపారత్వము మనదేశముయొక్క కళకాంతులను ఏవిధంగా పాడుచేసిందో ఆసంగతినీ, పూరీ జగన్నాథంలో చిక్కి శల్యావశిష్టులుగానున్న జనాన్నీ బీహారులోని పేదప్రజనూ తదితరప్రదేశాలలో రోజుకు ఒకఅణా సంపాదనను భగవత్ప్రసాదంగా భావించే స్త్రీలనూ వారికి ప్రత్యక్షం చేయగ .గేటంతవరకూ గాంధీజీ సంభాషించారు. మనస్సుకు జాలిపుట్టిస్తూ హృదయంలోకి చొచ్చుకొని పోయేటట్లు ప్రబోధించిన ఈ సంభాషణను మించగలదానిని దేనిని దేనాయనకడనుండి చాలా కాలంవరకూ వినలేదు.*

యంగిండియా, 28-5-1925

---

* 'బెంగాలులో గాంధీజీతో—III' అనే శీర్షికతో మ.దే. వ్రాసిన వ్యాసమునుండి.

# 38

# వడుకుటనుగూర్చి వ్యాఖ్యలు

## మోటబండి-చరఖా

నా వంగ రాష్ట్ర సంచారంలో చతురులైన వంగీయుల
నుండి రాటానికి ప్రతికూలంగా అని తరహాల యుక్తివాదా
లను ఎదుర్కోవలసివచ్చింది. అవి చాలావరకీ పుటలలో
పరిశీలింపబడినవి. పాఠకులు పత్రికా సాహిత్యంలో
చదివిన విషయాలను ఎప్పుడూ జ్ఞాపకం పెట్టుకోరు గనుక
పత్రికా విలేఖకుడదే విషయాని, కొంతకాలం పోనిచ్చి
జాగ్రత్తగా అప్పుడప్పుడూ మధ్యమధ్య పునరుద్ఘాటిస్తూం
డడం క్షేమం. రైళ్లకు బదులుగా మోటబళ్లను పయో
గించవలసిందని సూచిస్తారా అనీ అలా సూచించని యెడల
మిల్లులకు బదులుగా రాట్నాలను ప్రవేశపెట్టగలరని మీరెలా
అనుకుంటున్నారనీ ఈమిత్రులలో ఒకరు నన్ను ప్రశ్నించారు.
రైళ్లకు బదులు మోటబళ్లను ప్రవేశపెట్టవలెనని నేను
సూచించనికారణం నేను కోరినప్పటికీకూడా నేనలా చేయ
జాలకపోవడమే. ముప్పయికోట్ల మోటబళ్లు దూరాన్ని
నిర్మూలం చేయలేవు. కాని మిల్లులకు బదులుగా నేను
రాటాలను ప్రవేశపెట్టగలను. రైళ్లు వేగంగా పోవడమనే
సమస్యను పరిష్కరించినవి. మిల్లులది ఉత్పత్తికి సంబం
ధించిన సమస్య. భారతదేశంలో వలెనే పనిచేసే వాళ్లు
తగినంతమందిఉంటే ఉత్పత్తి విషయంలో మిల్లులతో రాటం
తేలికగా పోటీచేయగలదు. నిజానికి తన శ్రమను లెక్క
చూచుకోనకుండాఉంటే తనకు కావలసిన బట్టను గ్రామస్థుడు
మిల్లులకంటె ఎక్కువ చౌకగా ఉత్పత్తి చేసుకొనగలడు.

తన తీరిక కాలంలోమాత్రమే వడకడంగానీ నేయడంగానీ చేస్తూ ఉంటాడు గనుక అతనలా లెక్కచూచుకోనక్కర లేదుకూడా. అసంపూర్ణములూ, అసంబద్ధములూ అయిన సాదృశ్యాలు ప్రజలనెలా మోసంచేస్తవో గమనించతగి ఉన్నది. మనంచర్చిస్తూన్న విషయంలో రైళ్లకూ మోటబళ్లకున్నూ, మిల్లులకూ రాటానికిన్నీ ఉన్న భేదం విస్పష్టంగా తెలుస్తూన్నప్పుడు ఆ పోలిక ఎప్పుడూ తీసుకొని రాకూడదు. అయితే ఏపరిస్థితిలోనైనాసరే నేను యంత్రాలకు ప్రతికూలుడనని బహుశా అమిత్రుడనుకొని ఉంటాడు. నా ఇండియన్ హోమ్‌రూలు గ్రంథంలో రైళ్లనుగూర్చిన నా అభ్యంతరాలను బహుశా ఆయన మనస్సులో పెట్టుకొనిఉంటాడు. కాని ఆపుస్తకంలో నేను దావారించిన వివిధ ప్రధాన విషయాలనుగూర్చి నేను కృషి చేయడంలేదని అనేకసార్లు చెప్పి ఉన్నాను.

## వృథాప్రయాస ?

రాటంవడకడం వృథా ప్రయాస అని మరొక వాదం చేయబడింది. దానినిగూర్చి యేమీ ఆలోచన లేకుండానే ఆ వింతవాదం చేయబడింది. ఏదో ఒకఉద్దేశంతో చేసిన యేపనీ వృథాప్రయాస అనుకోవడానికి వీలులేదు. సంవత్సరంలో నాలుగు నెలలు చేయడానికి పనిలేని లక్షలాది జనులకు వృత్తి కల్పించేటందుకు దేశానికి రాటం బహూకరింపబడింది. ప్రతి అరగంటకూ రాటం కనీసం నూరు గజాల నూలు ఉత్పత్తి చేస్తూన్నదని గమనించినప్పుడు, దానిని వృథా ప్రయాస అనడానికి వీలులేదని కూడా ఈ అడ్డుప్రశ్న వేసిన వారికి నేను చెప్పినాను. ఇది వృథా ప్రయాస కాకపోగా పైపెచ్చు సరియైన ఆర్థిక ప్రతిపాదనము కూడా.

ఎందుకనగా నేర్చుకొనేటందుకు దీర్ఘకాలపు శిక్షణగానీ ప్రత్యేక నైపుణ్యంగానీ అవసరం లేక లక్షలాది ప్రజలు తీరిక సమయాలలో చేయగలిగే ఉత్పత్తిదాయకమైన ఒక వృత్తిదేశానికవసరం. అటువంటి వృత్తి చేతితో నూలువడకడం తప్ప మరొకటికాదు.

## పతితసోదరీ మణులు వడుకుట

నోఖాలీలో ఇద్దరు పతిత సోదరీమణులు వడకడమేగాక వడుకునూలుతో పూర్తిగా తమనుతాము పోషించుకొంటు న్నారని నాకు తెలియవచ్చినది, వారు చిన్నబాలికలు కాదు. నలభై సంవత్సరాలకు పైబడ్డ స్త్రీలు. ఇకవారు తమ లజ్జను విక్రయించ గలస్థితిలో లేరు. వారికీ వడుకువృత్తి లేని యెడల బిచ్చమెత్తి బ్రతుకవలసి ఉండేది. కాబట్టి నిజం మాట్లాడ వలసివస్తే తమ పూర్వపువృత్తినుండిగాక బిచ్చపు వృత్తినుండి మాత్రమేవారు మాన్పించ బడ్డారు. కాని ఈ సోదరీ మణులకు సన్నిహితంగా ఉండి వారిశ్రేయస్సును గూర్చి శ్రద్ధ తీసు కోవడం నోక పాలీకి గొప్పతనమే. వారిలో కొందరు తమ వృత్తి ని మానక పోయినప్పటికీ వడుకు పనికి పూను కొన్న ట్లునేను విన్నాను. వారి వృత్తిమానక, వడకడం ప్రారంభిం చిన ఆసోదరీ మణులకు ప్రయోజనం ఉంటుందని అనుకో వచ్చునేమో నాకు తెలియడం లేదు. ఈ పనివారి అవమాన మును మఱుగుపరచుకొనే టందుకు బాగా ఉపయోగపడ వచ్చును. అయినప్పటికీ వారికి జీవనాధారంగా నూలు వడికే పని సిఫారసు చేయబడ జాలదనడాని కేమి సందేహంలేదు. వారు అంతకు ఎక్కువగా కాకపోయినా రోజుకు ఒకటి రెండు రూపాయాలు సంపాదించు కొంటూండే అలవాటు ఉంది. కాబట్టి వారు నేత పనో, అలంకారములైన అల్లిక

పనులనో, లేక తక్కిన చక్కని కుట్టు పనులనో, బాగా అదా యంవచ్చే పనులను చూచుకోవాలి. ఈ పనికూడా పురుషుడు చేయ గలిగినది కాదు. అవసరం వచ్చినప్పుడీ పనికి పూను కొనేటందుకిది స్త్రీలకే విడిచివేయవలెను. పతిత మానవానీకము నందలి ఈ భాగమును పునరుద్ధరించే పనికి అ ప్రతిమానమైన పవిత్రతా, శీలసంపన్నతా గల స్త్రీ బయలుదేరే టంతవరకూ పడుపువృత్తి యొక్క సమస్యను ఎదుర్కొనే టందుకు వీలుండదు. తమ కామం తీర్చు కొనేటందుకుయువతులు తమ కమ్ముడు పోయేటట్లు ప్రేరేపించడం చేత పతితులైన మగవాళ్లలో, పురుషుడు చాలా పనిచేయవచ్చు ననే మాట నిస్సంశయం పడుపువృత్తి ప్రపంచం పుట్టినప్పుడే పుట్టినది. కాని ఈ నాటివలె ఎప్పుడైనా అది పట్టణ జీవితంలో నిత్యలక్షణంగా ఉండి ఉంటుందా అని నాకాశ్చర్యం. ఈ దురభ్యాసానికి ప్రతికూలంగా మానవసంఘం తిరుగుబాటు చేసి, చిరకాలంనుండీ వస్తూన్న అనేక దురాచారాలను నిర్మూలించినట్లే పడుపు వృత్తినికూడా పాతకాలపు మాటగా చేయగల కాలం వచ్చి తీరవలెను.

## దేవుని పేరుతో వడకడం

బౌరింగి పేటలోని కొంత మంది యువకులు శ్రీరామ నవమి సప్తాహంలో 3,200 గజాల నూలు వడికినాకు పంపించారు. ఈ యేడురోజులూ వృద్ధులు యువకులూ అందరూ కలసి జరిపిన రామనామ స్మరణోత్సవాన్ని వారు నాకు వివరించారు. కాని ఈయువకులా వుత్సవంలో పాల్గొనడంతో పాటునూలు కూడా వడికారు. ఇది అందరూ అనుకరించ తగిన ఉదాహరణం. నూలు వడుకుతూ దైవంమీద భక్తి నిలుపుతూన్న యువకుల ననేకమందిని నేనెఱుగుదును.

త్యాగంగా వడికే వారందరూ తమ కార్య విధానంలో వుదారమూ వుత్తమమూ అయిన పరిస్థితిని కలుపుకొని పనిచేయగలరు. నామౌనవ్రతం రోజున డక్కాలోని సంగీత విద్వాంసులు కొందరు సితారు వాయిద్యంతో నన్ను సంతోషపెట్ట కోరారు. నాకు సోమవారం కేవలం మౌనవ్రతపు రోజే కాక పత్రిక వ్రాయవలసిన రోజు కూడా కావడంచేత వారి సంగీతం వినేటందుకు నాకు వీలు కలుగదు. కాని నేను వారి కాశా భంగం కలిగించ తలచుకోలేదు. కాబట్టి వారు సితారు మీద పాడుతూ వుంటే నేను వడుకుతూ వుంటానని వారికొక సందేశం వ్రాసిపంపినాను. వారు తక్షణం ఒప్పుకొన్నారు. అందుకు ఫలితంగా నేను మామూలుకంటె బాగా వడికాను. సంగీతం వలన చేయి ఎక్కువ స్థిమితంగా ఉంది నేనెప్పుడూ ధ్వనిలేని చర్ఖా ఉపయోగిస్తాను కాబట్టి అది నేను సంగీతాన్ని ఆనందించడానికేమీ అభ్యంతరం కల్గించలేదు. పైగా సంగీతం వినవలెననే కుతూహలాన్ని అది హెచ్చించింది. వడకవలెననే కుతూహలాన్ని సంగీతం హెచ్చించింది. ఈ రెండూకూడా దేవునితో నాసమాగమమునకు అభ్యంతరం కల్గించలేదు. చెయ్యి, చెవి, హృదయం, ఈఅన్నీ సరిగా లయ తప్పకుండా పనిచేసినవి. సంశయాత్ములీ అను భావాన్ని తమకుతాము పరీక్షించుకోవచ్చును.

యంగిండియా, 28-5-1925

# 39

# పురుషుల పని కాదా?

ఒక ఆచార్యుడీవిధంగా వ్రాస్తున్నారు:

"నా మట్టుకు నాకు రాట్నంలోనూ ఖద్దరులోనూ సంపూర్ణ విశ్వాసం ఉంది. ఖద్దరు లేనియెడల భారతదేశంలోని పై తరగతులవారికీ ప్రజా సామాన్యానికీ మధ్య సాధారణ సంబంధం ఉండదని నేను పూర్తిగా అర్థం చేసుకొన్నాను. సాధారణ సంబంధంలేనిదీ ఐక్యభావంలేనిదీ ఏ దేశమూ కూడా ఏ పనీ సాధించలేదు. ఇండియా మఱి సాధించలేదు. పైగా తగినంత ఖద్దరును మనం ఉత్పత్తి చేయగలిగితే విదేశీ వస్త్ర బహిష్కారణం ఫలించి తీరుతుందనికూడా నాకు బాగా తెలుసును. ఇండియా స్వాతంత్ర్యమును సాధించవలెనంటే ఖద్దరు కార్యక్రమాన్ని జయప్రదంగా సాగించాలి.

కాని మీరు తప్పు త్రోవను ప్రారంభించారని నా అభిప్రాయం. మంచి బలంగల మనుష్యులనుకూడా స్త్రీలవలెనే వడుకుతూ కూర్చోమని చెప్పడం చాలామందికి వింతగా కనిపిస్తూన్నది. మనం ప్రస్తుతం స్త్రీలకంటె ఎక్కువగా లేమని నిందించినట్లయితే నాకది బాగా అర్థమవుతుంది. అయినప్పటికీ మనదేశంలో ఈ పని శతాబ్దాలనుండీ స్త్రీలకు సంబంధించి ఉంటూండడంచేత, మేమంతా ఈ పనికి పూనుకోజాలని మాట వాస్తవం. అయితే దేశంలోనున్న స్త్రీ జనమంతా ఈ నూలు వడికే పనికి పూనుకొన్నారనీ, పురుషులుకూడా ఈ పనికింకా తోడ్పడవలసిన అవసరం ఉందనీ, నాకు నచ్చచెప్పగలిగేయెడల, నేనీ తెచ్చిపెట్టుకొన్న అభిప్రాయాన్నికూడా తొలగించుకోవడాని కంగీకరించి ఉండేవాడను. స్త్రీజనం సన్నని విదేశీ చీరలతో చక్కగా తిరుగుతూ ఉంటే, పురుషులను రాట్నం త్రిప్పమనడం తల్లకిందులుగా కనిపిస్తూన్నది. పైగా భారత దేశంలో విదేశీ వస్త్ర సమస్యకు స్త్రీలు కారణమైనంతగా పురుషులు కారు. కాబట్టి, రాట్నముయొక్కయు, ఖద్దరుయొక్కయు ఉపయోగమునుగూర్చి స్త్రీలనుగాక పురుషులను ఒత్తిడిచేయడం, ఈ సమస్యా పరిష్కారమును గూర్చి తలకిందుగా ప్రారంభించడమవుతుంది.

తమ తమ వివిధరకాల రాజకీయ ప్రచారంతో తీరికలేని పురుషులను వారంతటు వారిని వదలివేసి, దేశంలోని స్త్రీలకు మీ సందేశాన్ని ప్రత్యక్షంగా అందించి ఉండవలసిందని వినయపూర్వకమైన నా అభిప్రాయం.

చరఖాకూ ఖద్దరుకూ సంబంధించిన మీ గొప్ప కార్యక్రమం ప్రస్తుతం స్త్రీలకు మాత్రమే వర్తింపచేసి, పురుషులను ఎక్కువ పౌరుషవంతమైన ఆయుధాలతో స్వాతంత్ర్య సంగ్రామమును సాగించనీయండి.''

ఈ ఉత్తరం సుదీర్ఘంగా ఉంది. భావను మార్చకుండా ఆయన వాదాన్ని సంగ్రహపరిచాను. పండితుడైన ఈ ఆచార్యుడు భారతస్త్రీల పరిస్థితి యెఱుగడనే సంగతి స్పష్టం. లేకున్నయెడల సాధారణంగా పురుషులు, స్త్రీలను ఉద్బోధించే ప్రత్యేకాధికారం కానీ అవకాశం గానీ లభించదనే సంగతి ఈయనకు తెలిసిఉండేది. కొంతవఱకు నేనలా చేయగలగడం నిస్సందేహంగా మంచి అదృష్టం. కాని నాకు అన్ని అవకాశాలూ కలిగించబడి నప్పటికీ, నేను పురుషులను సందర్శించినంతగా స్త్రీలను సందర్శించలేకపోయినాను. పురుషుల అంగీకారము లేకుండా స్త్రీలు యే పనీ చేయజాలరని కూడా ఆయనకు తెలియదు. రాట్నాన్నీ ఖద్దరునుకూడా అవలంబించకుండా పురుషులు స్త్రీలను అభ్యంతరపెట్టిన తార్కాణాలను అనేకం నేనుదాహరించ గలను. మూడవది పురుషులు కొత్తవిషయాలను కనిపెట్టగలిగినట్లుగానీ, మార్పులు చేయగలిగినట్లుగానీ, స్త్రీలు చేయలేరు. వడుకు ఉద్యమం కేవలం స్త్రీలకే వర్తింపచేసి ఉన్నట్లయితే, కడచిన నాలుగేళ్లలో రాట్నంలో కావింపబడిన అభివృద్ధులు కానీ, వడకడానికి నేటి ఏర్పాట్లుకానీ, జరిగి ఉండేవికావు. నాల్గవది, ఏ వృత్తియైనా ఒకర్తి పురుషులకుగానీ ఒకర్తి స్త్రీలకుగానీ ప్రత్యేకించబడి ఉన్నట్లు చెప్పడం అనుభవ విరుద్ధమయినమాట. వంట ఎకుర్తివగా స్త్రీల పని. కాని తన ఆహారం తాను వండుకోలేని సిపాయి ఎందుకూ పనికిరానివాడు. మకాములలో వంట యావత్తూ సహజంగానూ అవసరంగానూకూడా పురుషులే చేస్తూ ఉంటారు. పైగా,

కుటుంబాలకు కావలసిన వంట సహజంగా స్త్రీలు చేస్తూ ఉంటే భారీమొత్తున ఒక ఏర్పాటు ప్రకారం చేయవలసిన వంట ప్రపంచమంతటా ఎక్కడా మినహాయింపు లేకుండా పురుషులే చేస్తూ ఉంటారు. యుద్ధం చేయడం ముఖ్యంగా పురుషుల పని. కాని ఇస్లాము మతముయొక్క తొలిపోరాటాలలో అరబ్బీ స్త్రీలు భర్తలతోపాటు వీరనారులవలె పోరాడారు. సిపాయి తిరుగుబాటులో చాలా కొద్దిమంది పురుషులవలెనే ఝాన్సీరాణీ తన ధైర్యమునకు ప్రఖ్యాతి గాంచినది. ఈ నాడు ఐరోపాలో స్త్రీలు లాయర్లుగా, డాక్టర్లుగా, పరిపాలకులుగా, ప్రకాశించడం చూస్తున్నాము. షార్టుహ్యాండు వ్రాయడం టైపుచేయడం నేర్చిన గుమాస్తాలుగా పనిచేయడం దాదాపు స్త్రీల ప్రత్యేక సొత్తుగా పరిణమిస్తూన్నది. నూలు వడకడం పురుషుల వృత్తి ఎందుకు కాదు ? భారతదేశమునకు ఆర్థిక ఆధ్యాత్మికాభ్యున్నతిని తీసుకొని రాగలిగినదేదైనా (ఆచార్యుని ప్రకారం నూలువడకడం అటువంటిదేకదా) పురుషులకు పౌరుషవంతమైన దెందుకు కాదు ? వడుకు యంత్రమును కనిపెట్టింది పురుషుడేనని ఈ ఆచార్యునికి తెలియదా? ఆయన అది కనిపెట్టి ఉండనట్లయితే మానవచరిత్ర మరొక విధంగా వ్రాయబడి ఉండేది ? సూది పని ముఖ్యంగా స్త్రీలు చేసేపని. కాని ప్రపంచంలో ప్రఖ్యాతిగాంచిన కుట్టు పనివారు పురుషులే. కుట్టుయంత్రాన్ని కనిపెట్టింది పురుషుడే. సింగరు సూదిని అసహ్యించుకొని ఉన్నట్లయితే మానవసంఘానికి సింగరు, ఈ ఆస్తిని ఈయగలిగి ఉండేవాడు కాడు. పూర్వపు రోజులలో భారతస్త్రీలతోపాటు పురుషులుకూడా నూలు వడికేటందుకు జాగ్రత్త తీసుకొని ఉన్నట్లయితే, ఈస్టిండియా కంపెనీవారి వత్తిడివలన నూలు వడకడం మాని వేసినట్లు, మనం ఎప్పుడూ మానివేసి ఉండేవాళ్లంకాము.

రాజకీయవేత్త తన యిష్టంవచ్చినట్లు కేవలం రాజకీయాలలో మునిగి తేలుతూండవచ్చును. కాని లక్షలాది ప్రజల సమష్టి కృషిద్వారా మనకు కావలసిన బట్టలను తయారుచేసుకోవలె నంటే, రాజకీయవేత్తా, కవి, ప్రభువు, పండితుడు, దరిద్రుడు, పురుషుడు లేక స్త్రీ, హిందువు లేక ముసల్మాన్, క్రైస్త వుడు, పార్సీ లేక యూదుడు, వీరందరూ దేశక్షేమంకోసం నూలువడికేటందుకు మతధర్మంగా ఒక అరగంట వెచ్చించ వలసి ఉంది. మానవధర్మం, ఒకరి వర్గానికిగానీ ఒకరి స్త్రీలకుగానీ ఒకరి పురుషులకుగానీ సంబంధించిన ప్రత్యేక హక్కు కాదు. అది అందరి ప్రత్యేక హక్కును ; కాదు అందరి కర్తవ్యమూను. నేను భారతీయుడనని చెప్పుకొనే ప్రతి వ్యక్తీ కనీసం ఒక అరగంట నూలు వడకడం విధి అని భారతీయ మానవధర్మం ఆదేశిస్తూన్నది.

—యంగిండియా, 11-6-1925

# 40

## ‘లక్షలాది ప్రజకు తిండి పెట్టండి’

నలభై తొమ్మిదవ బెంగాలీ సైనిక దళంలోని ఒక సైనికు డిలా వ్రాస్తున్నాడు.

“అన్ని వైపులా ప్రపంచంలో మహా నాయకుడుగా మిమ్ములను ఒప్పుకొంటున్నారు. ఎందుకీ మహా నాయకుడు? ఇండియాలో పస్తులు పడుకొనే లక్షలాది ప్రజలను ఈ మహా నాయకుడు పోషించవలసి ఉంది. కాదా మరి? 32 కోట్ల మంది భారతీయులకు మీ రెంత కాలం అన్న వస్త్రాలను ఈయ జాలరో అంత కాలమూ మీరు స్వారాజ్యం లభిస్తుందని అనుకోకూడదు. నూరు కోట్ల రూపాయలను మీరు నాకీయ గలిగినట్లయితే తక్షణం నేను మీకు స్వారాజ్య మీయగలను. మీరు స్వారాజ్యాన్ని గూర్చి మాట్లాడుతారు. చర్ఖానుగూర్చి మాట్లాడుతారు. కాని ఉపవాసాలు చేస్తూన్న ప్రజలకు అన్నంపెట్టే విషయమునుగూర్చి మాట్లాడరు. సరియైన ఆహారం లభించని మనిషి చర్ఖాపని చేయలేడు. మొట్టమొదట ‘పొట్ట’ తరువాత బట్ట. నేను ఒక రోజంతా దిగంబరుడుగానుండగలను. కాని అన్నం లేకుండా రెండు గంటలుకూడా నేనుండలేను. మీరు భారతీయులకు అన్నంపెట్టి డబ్బిస్తే, భారత ప్రజా సామాన్యం తక్షణం మీ ఆజ్ఞలను శిరసావహిస్తారు. లేనియెడల ఒప్పుకోరు.”

‘మహా పురుషుడ’ నని నేనెప్పుడూ అనలేదు గనుకనూ అంగీకరించలేదు గనుకనూ దానిని నేను నిరాకరించవలసిన అవసరం లేకపోయినప్పటికీ, ఆ బిరుదమును ముందుగా నేను నిరాకరించి తీరాలి. ప్రతి రోజూ నేను నా అల్పత్వమునూ అసహాయతనూ గ్రహిస్తూనే ఉన్నాను. నే నింకా నా గొప్పతనాన్ని ఎన్నడూ గుర్తించలేదు. కాని ‘ఆకలితో అలమటించే లక్షలాది ప్రజలకు ఆహారమిడినందున’ నేను గొప్పవాడ నయ్యేటట్లయితే నేనా గొప్పతనంయొక్క మార్గంలోనే నడుస్తున్నాను. చర్ఖాను చికిత్సగా యిచ్చినం

దుకు అంతకు తక్కువ నేను కోరను. వస్తువులు పడుకొనే లక్షలాది ప్రజలకు కూడూ గుడ్డా యిచ్చేటందు కది నిర్మింప బడింది. దుస్తుల విషయం రెండోదిగా వస్తుందని నే నంగీ కరిస్తున్నాను. కాని చర్ఖా మొట్టమొదట అన్నం పెట్టేది గానూ తరువాత బట్ట యిచ్చేదిగానూ ఉద్దేశించబడింది. ఒక్కసారిగా నూరు కోట్ల రూపాయిలిచ్చి వేసి ఊరుకోవలె నని నేను ప్రతిపాదించలేను. ప్రతి సంవత్సరం కనీసం అరవై కోట్ల రూపాయ లిస్తూండవలెనని నా సూచన. ఆకలితో బక్క చిక్కిపోయిన ప్రజా సమూహం ఎవరూ అన్నమూ పైకమూ యిస్తే వారి మాట వింటారనే సూత్రాన్ని నేను ఆనందంగా అంగీకరిస్తాను. నేనిచ్చే బహుమతిలో రెండూ ఉన్నవి. అయితే ఎవరు ముందుగా ఈ పని చేయాలి? వైద్యుడు సరియైన చికిత్స చెప్పగలడేగాని దానిని అవలంబించేటట్లు రోగిని నిర్బంధించలేడు. ప్రజలను పీడిస్తూన్న రోగం పనిలేకపోవడమంతగా డబ్బులేక పోవడం కాదు. శ్రమయే డబ్బు. వారి కుటీరాలలోనే లక్ష లాది ప్రజలకు యే వ్యక్తి గౌరవమైన వృత్తి కల్పించగలడో ఆయన వారికి అన్న వస్త్రాలనుకూడా కల్పిస్తున్నాడు. అనగా అది డబ్బుతో సమానమేకదా! చరఖా అటువంటి వృత్తిని కల్పిస్తూన్నది. కనుక దీని స్థానే ఇంతకంటె మంచి పరికరం లభించేవరకు యిదే రంగంలో ఉండి తీరాలి.

—యంగిండియా, 18-6-1925

# 41

# వ్యవసాయము - ఖాదీ

ఒకానొక యం.ఏ., బి.యల్., ఇలా వ్రాస్తున్నాడు.

"మన దేశబంధు జ్ఞాపకార్థం, భారత స్త్రీలు దాయలుగానూ మంత్రసానులుగానూ శిక్షణ పొందేటందుకు ఒక తొమ్మిదింగు పాఠశాలను స్థాపించవలెనని మీరంతా ప్రయత్నిస్తున్నారు అయితే వంగ రాష్ట్రంలో నిరుద్యోగులుగానూ దురుద్యోగులుగానూ ఉన్న యువకులను గూర్చి మీరేమి చేయనున్నారు? మీరు విప్లవానికి ప్రతికూలంగా ప్రబోధిస్తారు. అన్ని రక్తపాత విప్లవములకూ మూలమైన 'ఆకలి' ఎంత బోధ చేసినా ఉపశమించదు. నిరుద్యోగ దురుద్యోగ సమస్యలను గూర్చి విచారించవలసిన సమయం ఇంతవరకే మించిపోలేదా? మీరు పది లక్షలు వసూలు చేస్తున్నారుకదా? నూరు లక్షలు వసూలు చేయలేరా? మాకు పొలాలు, పశువులు, కొంత రొక్కం ఈయండి. మమ్ములను తిరిగీ వ్యవసాయానికీ, చిన్న పరిశ్రమలకూ పోనీయండి. నా మనస్సు న్యాయవాద వృత్తిలో లేదు. నాకు డబ్బూలేదు భూమీలేదు; నేనేమి చేయగలను? కలకత్తా విశ్వ విద్యాలయం వారిటీపల కొన్న కొన్ని భూములను గూర్చి అడగడానికి నేను రిజిస్ట్రారుకడకు వెళ్లినాను. ఆ 2000 బీఘాలూ బీడులకింద మార్చబడినట్లు నాకు తెలిసింది.

వ్యవసాయానికి యిక్కడ మంచి అవకాశం ఉంది. నేను నా వృత్తినిమాని, వ్యవసాయకుల మధ్యకుపోయి అక్కడ జీవించవలెనని నాకు నిజమైన కోరిక ఉంది. కాని నాకు పెట్టుబడి పెట్టేవారెవరు? నాకు రూ 2000 లు మాత్రం పెట్టుబడి పెట్టండి. నేను కొనపోయే పొలాల తాకట్టుమీద అప్పుగా ఈయండి. తప్పకుండా రెండు సంవత్సరాలలో చెల్లించివేస్తాను.

నేను మిమ్మలను వ్యక్తిపరంగా ప్రార్థిస్తున్నాను. మీరు ఖద్దరు ఉద్యమానికి సహాయంచేశారు. మీరు వ్యవసాయానికి సహాయపడజాలరా? వడ్లు గోధుమలూకూడా ఖద్దరంత ఆవశ్యకములైనవేకదా! నన్ను బాగా కడుపునిండా తిననీయండి! ఆపైన నేనేమైనా చేయగలను. రెండు వేలు పెద్ద మొత్తంకాదు. నేను మిమ్ములను అప్పడుగుతున్నాను; బిచ్చంకాదు.'

ఈ ఉత్తరంలో ఉదాహరింపబడిన నిరుద్యోగ సమస్యను గూర్చి మరొక చోట పరామర్శించాను. కాని ఈ విలేఖకునితోపాటు ఇంకా యితరులుకూడా, ఖద్దరుకు సంబంధించి వ్యవసాయం మాటకూడా తెచ్చారు గనుక నా లాయరు విలేఖకుని ప్రార్థననుగూర్చి విచారించడం ఉచితం.

తాను సూచించిన వ్యావసాయిక ప్రయోగం "అపూర్వ విజయం" పొందేటందుకు కేవలం రెండువేల రూపాయిలు అప్పు పుట్టితే చాలునని అనుకోవడంలోనే ఆయన పొరపాటు పడ్డాడని ముందుగా ఆయనకు నేను తెలియచెప్పవలసి ఉంది. నిజానికి న్యాయశాస్త్రంవలెనే, వ్యవసాయానికికూడా పరిశీలనానుభవములు రెండూ ఉండాలి. ఇండియాలోని దిగంబరులకు బట్టలు లభించేటట్లు చేయడమే ఖద్దరు సందేశం యొక్క ఉద్దేశమైనట్లే విలేఖకుడు భ్రమపడుతూన్నట్లు కూడా తోస్తూన్నది. అలాకాదు. వడ్లు చేస్తూన్న పనినే ఖద్దరు చేయువలెనని ఉద్దేశింపబడినది. లక్షలాది ప్రజలకు రాటం అదనపు వృత్తిని కల్పిస్తుంది. అందువలన వారికి అదనంగా ఆదాయం వస్తుంది. దానితో నేడు వారు పొందగలుగుతూన్న చాలీచాలని ఆహారానికి తోడు మరికొంత సేకరించుకోగలరు.

భారత దేశంలో వ్యవసాయం చచ్చిపోతూన్న వృత్తి కాదు. దానికి మారుగా అభివృద్ధి కావలసి ఉంది. అయితే జాతీయ ప్రభుత్వంలోనే వ్యవసాయ సంస్కరణలు సాధ్యం కాగలవు. ప్రజా సామాన్యముయొక్క ఏకైక వృత్తియైన వ్యవసాయంవలన వారి శరీరధారణకు సరిగా సరిపోయిన దానికంటెకూడా తక్కువ లభిస్తూండడంవలన, వ్యక్తులుగా చేసే వ్యవసాయపు కృషి వారికంతగా నచ్చదు. ఈ విలే

ఖకునకు నిజంగా తన వృత్తిమీద విసుగుపుట్టి దానిని మాని వేయవలెనని కోరుతూంటే, ఆయన గాలిలో మేడలు కట్టడం మానివేయాలి. ఆయన వడకడంలో నిపుణుడు కావాలి. అప్పుడాయన తన భృతికోసం వడుకు వృత్తిలో నుండక, వంగ రాష్ట్రంలో నడపబడుతూన్న ఖాదీ, నూలు వడుకు ప్రచార సంస్థలలో నుండగలడు.

—యంగిండియా, 30-7-1925

# 42

# సైతాన్ పన్నాగాలు.

ఖద్దరుమీద ప్రేమోద్రేకం కల వారొకరు వ్రాసిన ఉత్తరము లోని ఈ దిగువభాగము చదివేటందు కుత్సాహకరంగా నుండగలదు.

"నాకు ఖద్దరులో నమ్మకముంది. ఖద్దరు సందేశం నాకు స్ఫటికంవలె స్పష్టముగా కనిపిస్తూన్నది. అది జీవితాన్ని నిరాడంబరంగా చేసి తద్వారా పవిత్రవంతంగా కూడా చేస్తుంది. సేవ అనే బంధనంవలన మనకు పేదలతో సంబంధం కలిగిస్తున్నది. జాతియొక్క శరీరాన్ని, ఆత్మనూ కూడా చంపుతూన్న పేదరికమునకు ప్రతికూలమైన భీమా అది ఒక్కటే. కనీసం నిరక్షరులైన లక్షలాది ప్రజలకు సంబంధించినంతవరకు శరీరమే లేనిది ఆత్మయొక్క ప్రసక్తియే ఉండదు! ప్రత్యక్ష యోగశాస్త్రము యొక్క అనుష్ఠానపరులు దానిని గూర్చి మాట్లాడవచ్చును. కాని లక్షలాది ప్రజలకు శరీరంలేని ఆత్మ మహాస్యాస్పదం. ఐరోపాఖండాన్ని రక్తంతోనూ, రాగ ద్వేషాలతోనూ నేడు ముంచివేస్తూన్నట్టి, హింసాయుత సాంఘిక విప్లవాలకు ప్రతికూలమైన భీమా చర్ఖా ఒక్కటే. చరఖా పై వర్గాలవారినీ, ప్రజా సామాన్యాన్నీ ఐక్యం చేస్తుంది. భారతదేశం దానిని ఆమోదిస్తూన్నంతవరకూ, బోల్షివిజముకాని దానివంటి విప్లవోత్పాతాలుగానీ సాధ్యంకావు. ఈ విషయాలు చర్ఖా యొక్క ముఖ్యావసరమునుగూర్చి నాకు నమ్మకం కలిగిస్తూన్నవి. కాని, ఒకే ఒక చిక్కు మాత్ర మున్నది. అది పనిచేస్తుందా? అది జయం పొందుతుందా? ప్రతి యింట్లోనూ దానిని పూర్వపు పూజ్యస్థానంలో తిరిగి స్థాపించగలమా? కాలం చాలావరకు మించిపోలేదా? మీరు ఖైదుకు పోకపూర్వం నే నెన్నడూ యిలా ప్రశ్నించి ఉండేవాడనుకాదు. అప్పటికింకా ఆశకు అవకాశం ఉంది. ఇప్పుడు సంపూర్ణమైన ఆశలేదు. 'పారిశ్రామిక తత్వం ప్రకృతిశక్తివంటిది. అంటాడు బెర్ట్రాండు రస్సెల్. మనం కోరినా కోరకపోయినా ఇండియా కూడా దానిలో మునిగిపోతుంది!' పారిశ్రామిక తత్వమునకు మన పరిష్కారం మనం యోజించుకోవలెనని రస్సెల్‌వంటి వా రంటారు. వారు చెప్పేదానిలో సత్యం ఉంది. పారిశ్రామిక తత్వం ప్రపంచానంతటినీ ముంచివేస్తూన్నది. అలా

మించిన పిమ్మట ఎవరి పరిష్కారమార్గాలు వారాలోచించుకొంటున్నారు. ఐరోపాఖండాన్ని తీసుకోండి! ఐరోపాఖండం విధ్వంసవుతుందని నేను నమ్మను. నాకు మానవస్వభావంలో చాలాఎక్కువ విశ్వాసముంది. త్వరగా గానీ ఆలస్యంగాగానీ, మానవస్వభావం దానికి పరిహారమును కనిపెట్టగలదు. భారతదేశం కోరుకొన్నప్పటికీ పారిశ్రామిక తత్వముయొక్క చేతులలో నుండి బయటపడి తాను విడిగా ఉండగలదా?"

ఖద్దరు నందు ప్రేమ గల వీరు, అనుకోకుండా అనివార్యంగా ఏ వాదంలోకి ఆకర్షించబడ్డారో ఆ వాదం సైతాను యొక్క పాత పన్నాగమే. అతడెప్పుడూ మనతో సగం దూరంవచ్చి, ఆకస్మికంగా, ఇక ముందుకు పోవడం ఉచితం కాదని స్ఫురింపజేస్తూ, పురోభివృద్ధి అసాధ్యమని తోచేటట్లు సూచిస్తాడు. అతడు సాధుశీలాన్ని మెచ్చుకొంటాడు. కాని మనుష్యమాత్రు డవలంబించడం కోసమది ఉద్దేశింపబడలేదని మరుక్షణంలో చెపుతుంటాడు.

ఇప్పుడీ స్నేహితునికి తటస్థించిన చిక్కు మార్పుకోరే ప్రతి మనిషికీ అడుగడుగునా తటస్థించే చిక్కే. అసత్యమూ కపటమూ సంఘాన్ని ఆవరించలేదా? అయినప్పటికీ, సత్యము యొక్క అంతిమ విజయమునందు నమ్మకం కలిగినవారందరూ, అది విజయంపొందుతుందనే సంపూర్ణవిశ్వాసంతో పట్టుదలగా పనిచేస్తారు. సంస్కారమును కోరేవా డెప్పుడూ కాలాన్ని తనకు ప్రతికూలంగా పోనీయడు. ఆయన పురాతన శత్రువును లెక్కపెట్టక పోవడమే అందుకు కారణం. పారిశ్రామిక తత్వం ప్రకృతిశక్తి వంటిదనే మాట నిజమే. కాని, ప్రకృతిని వశపఱచుకొని దాని శక్తులను జయించడం మనుష్య లక్షణం. ఎన్ని ఉత్పాతము లెదురైనప్పటికీ దృఢ నిశ్చయం కలిగి ఉండడం మానవగౌరవం. మన నిత్యజీవిత మటువంటి విజయమే. ఈవిషయం వ్యవసాయకునకు బాగా తెలుస్తుంది.

పారిశ్రామిక తత్వమంటే అల్పసంఖ్యాకు లధిక సంఖ్యాకులను వశపఱచుకోవడంగాక మరేమిటి? దానినిగూర్చి ఆకర్షణీయమైన దేదీలేదు. దానిలో తప్పని సరియైనదికూడా ఏమీ లేదు. ఆ అల్ప సంఖ్యాకుల లాలింపులకు అధిక సంఖ్యాకులు 'కాదు' అని చెప్ప నిశ్చయించుకొన్న యెడల ఆ అల్ప సంఖ్యాకులకు యే విధమైన చెఱుపూ చేసేటందుకు శక్తి ఉండదు.

మానవ ప్రకృతిలో విశ్వాసంకలిగి ఉండడం మంచిది. నాకా విశ్వాసం ఉండడంవలననే నేను జీవిస్తున్నాను. ఐతే పర్యవసానానికి అంతా బాగానే పరిణమించునప్పటికి, జాతులని పిలవబడే వ్యక్తులూ వర్గాలూ ఇంతకు పూర్వం నశించినారన్న చారిత్రక విషయమును గూర్చి, ఆ విశ్వాసం నన్ను పొరబడేట్లు చేయడంలేదు. తమ దుష్కృత్యాలవల్ల ఇంతకుపూర్వం జాతులు నశించిపోయిన వన్న విషయాన్ని రుజువుచేయడానికి ప్రత్యక్ష తార్కాణాలు రోము, గ్రీసు, బాబిలోన్, ఈజిప్టు మొదలైన అనేక దేశాలు. సునిశిత వైజ్ఞానిక బుద్ధి విశేషం వలన ఐరోపాఖండం సువ్యక్తమైన ఈ విషయాన్ని గుర్తించి వెనుకకు మరలి, అధర్మదాయక పారిశ్రామిక విధానమునుండి బయటపడేటందుకొక మార్గము నన్వేషించ గలదని ఆశించవచ్చును. కేవల పురాతన నిరాడంబరత్వమునకే తిరిగిపోవలసిన అవసరంలేదు. కాని, గ్రామజీవితమునకు ఎక్కువ ఆధిక్యత ఉండేటట్లూ పశుబలమున్నూ భౌతికశక్తిన్నీ ఆత్మశక్తికి లోబడి ఉండేటట్లూ, పునర్నిర్మాణం జరుగవలసి ఉంటుంది.

ఇక చిట్టచివరి మాట! తప్పు తార్కాణాలవల్ల మనం మోసపోరాదు. ఐరోపా గ్రంథకర్తలకు అనుభవం లేకనూ,

సరియైన భోగట్టా తెలియక పోవడంచేతనూ వారు చిక్కు-పడ్డారు. భారత దేశపు పరిస్థితులతో అన్ని విధాలా తుల తూగని యిరోపా ఖండపు ఉదాహరణాలను సమానంగా అన్ని చోట్లా వర్తింపచేయ చూచేయెడల, కొంతదూరం దాటిన పిమ్మట వారు మనలను నడిపింపచాలరు. యిరోపాలో, రష్యాతో సహా, ఇండియా పరిస్థితులవంటి పరిస్థితులు లేకపోవడమే అందుకు కారణం. కాబట్టి యూరపుకు సంబంధించి నిజం కాదగిన విషయాలు ఇండియాకు సంబంధించి తప్పకుండా నిజం కానక్కరలేదు. పైగా ప్రతి దేశమూ ప్రత్యేక వ్యక్తిత్వమును ప్రత్యేక లక్షణాలను కలిగిఉంటుందని కూడా మనకు తెలుసును. అలాగే ఇండియా కూడా. కాబట్టి భారత దేశము యొక్క అనేక బాధలకు తగిన పరిష్కారమును మన మాలోచించేయెడల దానితత్వములోని ప్రత్యేక లక్షణాలను గుర్తించి తగిన చికిత్సను ప్రతిపాదించాలి. యిరోపావలెనే ఇండియాను కూడా అదేభావంలో పారిశ్రామిక దేశంగా చేయవలెననడం అసాధ్య విషయాన్ని ప్రయత్నించడంఅని నాఅభిప్రాయం. ఇండియా అనేక తుపానులను ఎదుర్కొన్నది. ప్రతి ఒక్క తుపానూ ఇండియాపైన ఒక తుడిచివేయరాని మచ్చను గుర్తుగా నిలిపిన సంగతి నిజమే కాని ఇంతవరకూ తన వ్యక్తిత్వాన్ని ధైర్యంగా పోషించుకొన్న దేశమదే. ప్రపంచంలోని అనేక సభ్యతల పతనమును ప్రత్యక్షంగా చూచిన కొలది దేశాలలో ఇండియా ఒకటి. కాని తానుమాత్రం అక్షతంగానే ఉన్నది. మూఢ విశ్వాసము, పొరపాటు ఎక్కువ ఉన్నప్పటికీ ప్రపంచంలో తమపురాతన సంస్థలలో కొన్నిటిని నిలుపుకొన్న కొద్దిదేశాశలలో ఇండియా ఒకటి. ఐతే అదిఆపొరపాటు నుండి ఆ మూఢ విశ్వాసము నుండీ తప్పించుకొని బయటపడేటందుకు తన సహజ సామర్థ్యాన్ని యింతవరకూ ప్రదర్శి

స్తూనే ఉంది. తన లక్షలాది ప్రజలను ఎదుర్కొంటున్న ఆర్థిక సమస్యను పరిష్కరించడంలో దాని సమర్థతను గూర్చిన నా విశ్వాసం ఈనాడున్నంత వికాసంగా, ముఖ్యంగా వంగ రాష్ట్రంలోని పరిస్థితులను పరిశీలించిన తరువాత ఉన్నంత వికాసంగా ఎన్నడూ లేదు.

—యంగిండియా, 9-8-1925

# 43

# కరెన్సీ—దూది మిల్లులు

తిరుచిరాపల్లినుండి వచ్చిన విషాద వృత్తాంతమును ఈ దిగువ సంగ్రహ పరుస్తున్నాను.

“ భారత దేశపు కరెన్సీసమస్యను గూర్చినీ, ఇండియా ప్రభుత్వంవారు లండను వర్తకుల ప్రయోజనాలకు అనుకూలంగా ఉండేటట్లు మారకపు రేటును పెంచి దేశీయ పరిశ్రమలను వివిధంగా నాశనంచేయ ప్రయత్నిస్తూన్నారో దానిని గూర్చినీ, మీరిచ్చే ఉపన్యాసాలన్నింటిలో ఒక్క మాటయినా చెప్పకపోవడం విషాదకరం. భారతదేశంలో స్థాపింపబడిన మూడువందల దూది మిల్లులూ దేశానికొక సంపద కాదనీ లాంక్‌షైరు నుండి ఎక్కువ చౌకగా దిగుమతీ అయిన విదేశీ వస్తువుల వలననే, ప్రజల కెక్కువ ప్రయోజనం కలుగుతుందనీ బహుశా మీ అభిప్రాయమేమో. కడచిన ముప్పయి సంవత్సరాలనుండీ రూపాయికి ఒక షిల్లింగూ నాలుగు పెన్నీలు మారకపురేటు బాగా పనిచేసింది. అప్పుడుకూడా వినాశకరమైన ఉత్పత్తి పన్నువలన బొంబాయి దూదిమిల్లులు లాంక్‌షైరుతో పోటీచేయలేక పోయినవి. కడచిన ఎనిమిది సంవత్సరాలనుండీ నూరు మొదలు నాలుగువందల వరకూ లాభాలను పంచిపెడుతూన్న కలకత్తా జనపనార మిల్లులమీద ఉత్పత్తి పన్ను లేదు. గ్రేటు బ్రిటనునుండి దిగుమతులను ప్రోత్సహించేటందుకు, ఇండియా ప్రభుత్వంవారు 1923 లో ఒక షిల్లింగు 4 పెన్నీల మారకమును, 1924 లో ఒక షిల్లింగూ ఆరుపెన్నీలకు హెచ్చించినప్పుడు ఇండియాను ముంచివేసిన లాంక్‌షైరు సరుకులు ఎక్కువగా నిల్వఉన్నందున ప్రస్తుతం దూదిమిల్లుల వ్యాపారం చాలా మందగించి పోయింది. విదేశీబట్టలను తగుల వేయవలసిందనికానీ, నూలు వడికి ఖద్దరును ధరించవలసిందనికానీ అడిగినంత మాత్రంతో, అవి మితమయిన ధరలకు విక్రయింపబడక పోయినకాడల ప్రయోజనంలేదు. నేటి అధిక మారకంవలన లాంక్‌షైరు పోటీ, మిల్లు పరిశ్రమలకంటె ఎక్కువ త్వరగా ఖద్దరు పరిశ్రమను నాశనం చేయగలదు.

ఈ పరిస్థితులలో, లాంక్‌షైరుకు సహాయం చేసేటందుకు దూది మిల్లులపైన అన్యాయంగా వేయబడిన ఉత్పత్తి పన్నుకున్నూ, మారకపు రేటును హెచ్చించినందుకున్నూ ప్రతికూలంగా ఆందోళన చేయడం

ద్వారా భారతదేశముయొక్క పారిశ్రామిక పునరుద్ధరణకు ఎక్కువగా తమదృష్టిని మరల్చవలసిందని నేను హృదయపూర్వకంగా మహాత్ముని ప్రార్థిస్తున్నాను."

ఈపై ఉత్తరంలోని గుణమునుబట్టి కాక, పోరాటపు పద్ధతులనుగూర్చి అది వెల్లడిచేస్తూన్న విషాదకరమైన అజ్ఞానమును పోగొట్టేటందుకు మాత్రమే దానిని ప్రచురిస్తున్నాను. యంగిండియా పుటలలో, ప్రస్తుత ప్రభుత్వ విధానమునందలి అనేక లోపములనుగూర్చి, అనగా అధిక సైనికవ్యయము వంటి లోపములనుగూర్చి నేను చర్చించనట్లే, కరెన్సీనిగూర్చి కూడా చర్చించనిమాట నిజమే. బ్రహ్మాండమైన ఈ చెడుగులను నావ్రాతలు పోగొట్ట గలిగినట్లయితే ప్రతివారమూ వాటిని నేనేకరువుపెట్టి, అదేవిషయాన్ని అనేక పద్ధతులలో చెప్పేటందుకు వీలుగా స్నేహితుల సహాయాన్ని పొందుతూండే వాడను. అయితే ఇప్పుడు మనకు తెలిసిన ఈ లోపాలింకా అలాగే కొనసాగుతూన్నవంటే, వాటినిగూర్చి బహిరంగంగా పైకిచాటక పోయినందువలనకానీ, పాలకులకు తెలియక పోయినందువలనకానీ కాదని, ఈ నావిలేఖకునివలె ఆలోచించే వారంతా తెలుసుకొనవలసిఉంది. నాకంటె ఎక్కువ సమర్థులే ప్రభుత్వంవారి కరెన్సీ విధానమునందలి దుర్మార్గమునుగూర్చి బహిరంగపఱచి ఉన్నారు. కాని అందువలన ప్రయోజనం కలుగలేదు. ఆ విధానం వాద బలం వలన కాక 'వాడికత్తిమొన' వలన సమర్థింపబడుతూన్నది. నేను శ్రమ, కాలములగూర్చిన ఆర్థికవేత్తను వారికిష్టమున్నయెడల కొంతవఱకైనా వారంతటవారు చేయగలిగిన వాటిని మాత్రమే నేను పాఠకులముందు ఉంచవలెనని నా విశ్వాసం. మనం పడుతూన్న బాధలన్నిటినిగూర్చి పాఠకులను నేనుద్రేకపఱచవలసిన అవసరంలేదు.

వారు ప్రతిరోజూ అనుభవిస్తూనే ఉన్నారు. కాని వారు నిస్సహాయులు. కాబట్టి యేదో ఒక పరిహారంగానీ లేక ఒకటికంటె ఎక్కువ నేనాలోచించ గలిగినయెడల ఆ పరిహారములనుగానీ వారిముందు పెట్టడం నా ప్రత్యేక హక్కు. కాబట్టి, ప్రజానురంజకత్వమును కోల్పోవడము, పునరుక్తి వలన విసుగు కలిగించడమూ అనే ఈ రెండు ఆపదలకు లోనయికూడా అధఃపతితమైన ఈ దేశముయొక్క మోక్ష ప్రాప్తికి పాఠకుడెలా సహాయపడగలడో నాశక్తి వంచన లేకుండా చెప్పుతున్నాను.

అత్యంతా చరణయోగ్యమై మన అనేక బాధలను నిర్మూలింప చేయగలిగిన చికిత్స, విదేశీవస్త్రబహిష్కరణం. కాబట్టి నాకానంద దాయకమైన ఆ ఒకవిషయాన్ని గూర్చియే నేను పదేపదే చెప్పితీరాలి. ఖద్దరు ఖరీదులు కానీ, భారతీయ మిల్లుబట్టల ఖరీదులు కానీ బ్రహ్మాండంగా తగ్గిపోయేటంతవరకూ, ఈ దేశంలో విదేశీ వస్త్రబహిష్కరణమును ఆచరణలోకి తీసుకొని రావడం ఆపివేయవలెనని ఈ వి లేఖకుడు భావిస్తూన్నయెడల ఆయన పూర్తిగా పొరపడుతున్నాడు. దేశం తాను నిర్వర్తించవలసిన జాతీయ ధర్మాన్ని గుర్తించినప్పుడు మాత్రమే, ఎంత క్లిష్ట పరిస్థితిలోనైనా బహిష్కరణ కొనసాగింపబడుతుంది. ఒకమంచి హిందువు గాయత్రీజపం చేయడంలోని కష్టాన్నిగానీ అసంఖ్యాకములయిన కర్మకాండలను నిర్వర్తించడంలోని ఖర్చునుగానీ లెక్కించడు. మంచి ముసల్మాను, రోజుకు ఐదుసార్లు నమాజు చేయడంలో గల కష్టాన్ని లెక్కించడు. స్వర్గానికి సులభతరమైన మార్గమునుగూర్చి కూడా బేరమాడడు. సాధ్యమైనంత తక్కువ ధరకు ఇండియాలోని మారుమూల గ్రామాలకు తమ బట్టలను

తీసుకొనిపోవడం మాంచెస్టరు వర్తకులపని. కేవలం ఆర్థిక దృష్టితో చూచినయెడల మాంచెస్టరు బట్టకంటె ఎక్కువ ధర అయినప్పటికీ తమ మొరటుఖద్దరునే వరించి దానిని నిరాకరించడం గ్రామస్థుల కర్తవ్యం. తాము నిర్మించుకొన్న ప్రభుత్వమునుండి తాము పొందగలుగుతూన్న కరెన్సీ మొదలగు సౌకర్యములను వసూలుకొనేటంత ధర్మపరాయణులుగా మాంచెస్టరు వర్తకులను మన ఆందోళన చేయగలుగుతుందని మనమెందుకనుకోవాలి? మాంచెస్టరు వర్తకుడున్న స్థితిలోనే హిందూవర్తకుడున్నయెడల, అతడు మాత్రం మరొకవిధంగా ప్రవర్తించగలడా? కాబట్టి భారత పవిత్ర భూమిలోకి మాంచెస్టరు బట్టలు తదితర విదేశీ బట్టలూ విపరీతంగా దిగుమతి కాకుండా గట్టిగా ఆపగలిగిన ఒకవిధమైన శక్తిని ఉద్భవింపచేయడం మాత్రమే, ఉచితమూ ప్రయోజనకరమూ అయిన ఆందోళన. నావిలేఖకుడు యంగిండియాను శ్రద్ధగా చదవడంలేదు. చదువుతూన్నట్లయితే నాదేశముయొక్క మిల్లు పరిశ్రమయెడల నేనశ్రద్ధగాలేనని ఆయనకు తెలిసిఉండేదే. అవసరమని తోచిన ప్రతిపర్యాయము, ఆ పరిశ్రమకు నేను పొందగలిగిన యావత్తు రక్షణనూ పొందగోరుతున్నాననీ, నాకధికారం ఉన్నట్లయితే విదేశీబట్ట అంతటిమీదా నిషేధపు పన్ను విధిస్తాననీ నేను చాటుతూనే ఉన్నాను. కాని అంతటితో నాకర్తవ్యం పూర్తి అవుతూన్నది. మిల్లు పరిశ్రమకు నానుండి యితర సహాయమేమీ అవసరంలేదు. దానికి పెట్టుబడిఉంది. భారతదేశములోని అన్నిభాగాలకూ దాని ఉత్పత్తులను తీసుకొని పోయేటందుకు ఏజెంట్లు ఉన్నారు. దాని క్షేమమది బాగానే చూచుకోగలదు. దురదృష్టవశాత్తూ అది భయంభయంగా ఉంటూ జాతీయం కాకుండాఉంది.

తన కొద్దిమంది భాగస్వాముల లాభాలనుగూర్చి మాత్రం అది ఆలోచిస్తూంటుంది. తన ఉత్పత్తులను కొనే ప్రజా సామాన్యమునుగూర్చి అది ఆలోచించదు. ఆ పరిశ్రమకు ఖద్దరు శత్రువు కాదు. మిల్లు పరిశ్రమకు ఖద్దరు, ప్రేమగల దాది కాపాడినంత బాగా కాపాడుతూ జాగ్రత్తగా పెంచ వలసిన పని తెమ్మనివంటిది. కాబట్టి దానియందు నేను ప్రత్యేక శ్రద్ధవహించి ఇతరులనుండికూడా అటువంటి శ్రద్ధను పొందేటందుకు ప్రయత్నిస్తున్నాను. అది పెద్దదైన తరువాత దాని అన్నదైన మిల్లు పరిశ్రమయొక్క పోటీ కోరికను ఆలోచించేటందుకు సమయం వస్తుంది. అంత వరకూరాదు. ఖద్దరుయొక్క పునఃప్రతిష్ఠాపనమే ముందొక తరంవరకు దేశీయమిల్లు పరిశ్రమయొక్క రక్షణగా తప్పక పరిణమిస్తుందని గ్రహించేటందుకు కొంచెం స్పష్టమైన ఆలోచన అవసరం. కాని మన అజ్ఞానంవలన మనం ఖద్దరు మీద మనదృష్టిని కేంద్రీకరించనియెడల ఖద్దరు పోవడమేగాక, దానితోపాటు ఇండియాలోని మిల్లు పరిశ్రమకూడా పోతుంది.

యంగిండియా, 13-8-1925

# 44

# కొంకిపురుగు—చర్ఖా

ఆండ్రూస్ మహాశయుడొక ఉత్తరం వ్రాస్తూ దానితో పశువులను గూర్చి వార్తా పత్రిక నుండి తీసిన ఒక వ్యాసము కూడా పంపినాడు. ఈ సంచికలో మరొకచోట దానిని గూర్చి చర్చించబడినది. ఆండ్రూస్ మహాశయుని ఉత్తరమిది.

"మద్రాసులో మిక్కిలి కృషిచేస్తూండే, రాక్‌ఫెల్లర్ అంతర్జాతీయారోగ్యప సంఘమునకు చెందిన డాక్టరు మెండ్రిచ్చి ఇప్పుడిక్కడ నాతోనే ఉన్నారు. కర్షకులలో నూటికి 92 మొదలు 95 మంది వరకు కొంకి పురుగు, టైఫాయిడ్, రక్తవిరేచనాలు మొదలయిన అంటు రోగాలతో బాధపడుతున్నారనీ, మలోత్సర్జనములవలన జలాశయములు కలుషితం కావడంచేత అవి ప్రతిచోటా హెచ్చుపెరిగి పోతూన్నవనీ ఆయన నాతో అన్నాడు. ఇరవై సంవత్సరాలకిందట 'దక్షిణ రాజ్యాల'లోని నీగ్రోలే స్థితిలో ఉన్నారో సరిగా వారాస్థితిలోనే ఉన్నారని ఆయన అంటున్నాడు. సరిగా ఆ ఫలితమే ఇక్కడా కలుగుతూన్నది—జీవశక్తి లేదు. దుర్బలమైన దౌర్భాగ్య జీవితం. ఇప్పుడా రాజ్యాలలోనే, జీవశక్తి, ఐశ్వర్యమూ ఉన్నవి. మల విసర్జనములు అదుపులో ఉంచడం ద్వారా కొంకి పురుగు, టైఫాయిడ్ మొదలైన వ్యాధులు నిర్మూలింపబడడమే అందుకు కారణం. ఈ సందర్భంలో ప్రజల అలవాట్లలో మార్పులు కలిగించి గ్రామాలలోని మురుగును ఆరు నెలలవరకు నింపి, తరువాత ఆరు నెలలలో తవ్వి సురక్షితమైన ఎరువుగా చేసే సుకరమైన ఒక పద్ధతిని అవలంభించేయెడల, అందువలన కలిగే ఆర్థిక ప్రయోజనం అంచనా వేయడానికి వీలులేనంత ఎక్కువగా ఉంటుంది. చైనా జపాన్ స్టేట్సులో వారీ పద్ధతినే చాలావరకవలంబిస్తూన్నారు. చరఖా గ్రామ సమస్యను గూర్చి ప్రారంభించింది. కాని దానిని పరిష్కారం చేయలేదని నా అభిప్రాయం. ఆ ఒక్క పనిని గూర్చియే మనం శ్రద్ధవహించిన యెడల అది ఒక్కటే గ్రామ సమస్యను పరిష్కరిస్తుందని మీరనడం చాలా సంకుచితంగా ఉంది. పశువుల సమస్య ఆరోగ్య రక్షణ సమస్యాకూడా అంతముఖ్యమైనవే.

ఈ పైన ఆరోగ్య రక్షణ సమస్యనుగూర్చి ఆండ్రూసు మహాశయుఁ డుదాహరించారు. ఆరోగ్య రక్షణావసరమును నేను గుర్తించక పోలేదు. నేను చరఖాను కనిపెట్టడానికిముందు చాలాకాలం కిందటనే ఆరోగ్యరక్షణ సంస్కారినయినాను. నేటాలునందలి ఫోనిక్సు వ్యవసాయ కేంద్రములో మలమును పాతివేసి ఎరువుగాతయారుచేసే ప్రయోగాలను నేనే నడుపుతూ వచ్చాను. అక్కడ మాకు పాకీ మనిషి లేడు; మాకు మేమే పాకీవాళ్లము. ఫోనిక్సు సెటిల్మెంటులో మలం తొక్కుతామనే భయం లేకుండా వట్టికాళ్లతో యెవ్వరైనా తిరుగ గలుగుతూ ఉండేవారు. ఈ విషయం ఆండ్రూసుగారికి తెలుసును. సబర్మతీ తీరముననున్న సత్యాగ్రహాశ్రమంలో కూడా మలమూ విషయంలో ఈ విధమైన పనే జరుగుతున్నది. కాని దానిని గూర్చి నేనేమీ ప్రచారం చేయడంలేదు. అందుకు చిన్న కారణం, రోజుకు రోజుకీ పెరిగిపోతున్న దారిద్ర్యాన్ని అది తక్షణం ప్రత్యక్షంగా నివారించ లేకపోవడమే. పైగా, ఈ అనారోగ్య సమస్యను గూర్చి పనిచేయవలెనంటే పాత అభ్యాసాలకు పాత రాగద్వేషాలకు ప్రతికూలంగా పోరాడవలసిన అవసరముంది. అందుకు నిరంతరప్రబోధం కావాలి. ప్రభుత్వ సహాయం లేకుండా అదిజరిగే పనికాదు. తరతరాలనుండీ సంక్రమిస్తూ నాటుకొనిపోయిన దురభ్యాసాలు అనునయవాక్యాలతో అంతరించజాలవని అంగీకరించవలసి వచ్చినందుకు విచారపడుతున్నాను. శాసనం చేయడమే యిందుకు తగిన పరిహారమని నాకు తోస్తున్నది.

అయితే, ఈ అభ్యంతరం చరఖాకు వర్తించదు. పైగా అది ప్రతి సంస్కరణకు పురోగామిగా ఉండవలసింది. మన జాతియొక్క దృష్టిని నేను చరఖామీద కేంద్రీకరింప చేయ

గలిగిన యెడల, తక్కిన అన్ని సమస్యలనూ అదే తక్షణం పరిష్కరించగలదు. శాసనం చేయవలసిన అవసరమున్న చోట్ల, అది శాసనానికి తగిన దోహదంకూడా చేయగలదు యెంత తక్కువైనప్పటికీ, వ్యక్తికి చరఖా వలన కొంత ప్రతిఫలం తక్షణం ముట్టుతుందని తెలుసును. దానిమీద పని చేయడం చాలా తేలిక. దానికి ప్రతికూలంగా పాతుకొనిపోయిన ద్వేషంలేదు. కనీసం అమాయిక ప్రజలకు సంబంధించినంతవరకు దానినిగూర్చి కుశేషంగా చెప్పనక్కర లేదు. దానికత్యంత స్వల్పమైన పెట్టుబడి చాలును. జాతి అంతా నిర్వర్తించ గలిగిన నిర్మాణాత్మక కృషి అది ఒక్కటే. అది జయం పొందినట్లయితే అపూర్వ రాజకీయ ఫలితాలు కలుగగలవు. సహకారం లేనిదే అదీ జయం పొందదు కాబట్టి, బ్రహ్మాండమైన సహకారోద్యమానికది మార్గదర్శకం అవుతుంది. కాబట్టి చరఖా ఒక్కదానిమీద మనం కేంద్రీకరించినయెడల అదే స్వరాజ్యానికి దారితీస్తుందని నేనంటాను. ఒకవేళ ఆ ప్రతిపాదన చాలా కఠినంగా కనిపిస్తే మరొకవిధంగా చెప్పవచ్చును. చరఖాయున్నా, అది దేనిని సూచిస్తూన్నదో అదంతానూ లేకుండా స్వరాజ్యం లేదు. కాబట్టి వివేకంగల ఆర్థిక శాస్త్రవేత్త, తక్కినది దానంతటదే అనుగమిస్తుందనే జ్ఞానంతో చరఖా మీద మాత్రమే తన దృష్టిని కేంద్రీకరించగలడు.'

నేనింకా కొంచెం లోతుగా రోగనిదానం చేయవలసి ఉంది. దారిద్ర్యం ముందు బయటకు పోయే ధన ప్రవాహం అంత బాధకరంగా లేదు. మొట్టమొదట నిర్బంధంవలన తటస్థించి యిప్పుడు అభ్యాసంగా మారిపోయిన సోమరితనం ముందు దరిద్రంకూడా అంత బాధకరంగా లేదు. ధన ప్రవాహాన్ని ఆరికట్టవచ్చును. పేదరికం కేవలమొక చిహ్నం

మాత్రమే కాని ఈ చెడుగంతటికీ పెద్దమూలకారణం సోమరితనం. దానిని నిర్మూలం చేయగలిగినయెడల, ఇంకా విశేష శ్రమ లేకుండానే చాలా చెడుగులు నిర్మూలం కాగలవు. పస్తులు ఉంటూన్నజాతికి ఆశగానీ, ఉత్సాహంగానీ ఉండదు. మురికీ, రోగమూ అంటే అది నిర్లక్ష్యంగా ఉంటుంది. ఏ సంస్కరణను గురించియైనా అది 'ఏం ప్రయోజనం' అంటూంటుంది. కాబట్టి అటువంటి నిరాశా హేమంతం, లక్షలాది ప్రజలకు 'ఆశావసంతం'గా పరిణమించవలెనంటే, ప్రాణప్రదమైన చరఖాద్వారానే సాధ్యమౌతుంది.

—యంగిండియా, 27-8-1925

# 45

# చరఖాను గూర్చి

చరఖాను గూర్చిన ఆర్థిక వాదాన్ని తిరిగీ చెప్పడం అవసరమని నేననుకోవడం లేదు. 'యంగ్ ఇండియా' పాఠకులకా సంగతి బాగా తెలిసే ఉంటుంది. గాంధీజీ వెళ్లిన చోటికల్లా తీసుకొనిపోయే తక్లీ మిల్లులకు పోటీగా ఉండేటందుకు గల హక్కులనుగూర్చి ఆయన యెంతశ్రద్ధగా చెప్ప మొదలు పెట్టినారో అంత శ్రద్ధగానూ శ్రోతలు వినడం ప్రారంభించారు. ఈ విశాల దేశంలో చాలావరకు రైలు మార్గంతో కూడా సంబంధం లేకుండా వ్యాపించి ఉన్న 7 లక్షల గ్రామాల యందు నివసించే కోటాను కోట్ల ప్రజలలోని అత్యల్పాంశమునకు కూడా మిల్లులు అందుబాటులో ఉండచాలవు. జన సంఖ్యలో పదవ వంతు, ఎండు రొట్టె, ఒక చిటికెడు మట్టి ఉప్పు ఒక పూట తిని బ్రతుకుతున్నారు. కర్జన్ ప్రభువు ఉదారంగా కట్టిన లెక్కను బట్టికూడా సగటున మనిషి 1 కి నెలకు మూడు రూపాయాల కంటె ఎక్కువగా వారు సంపాదించడం లేదు. 'ఈ అత్యల్పాదాయానికి తోడుగా నెలకు అయిదు లేక ఆరు రూపాయిలు సంపాదించుకోగలగడం వారి పాలిట అదృష్టంకాదా! కాబట్టి లక్షలాది ప్రజలకు రాట మనగా అదే అర్థం.' సార్వజనీనంగా చేయ తగిన పని అది ఒకటే. ప్రత్యేకమైన తెలివి తేటలతో నిమిత్తం లేకుండా నేర్చుకోతగినది అదే. ఆశ్చర్యకరమైనంత చౌకగా ఉండేదికూడా రాటమే. భారత దేశము యొక్క ఆర్థిక దుస్థితి, క్షామము, వరద, ఈ మొదలైన సమస్యలను పరిష్కరించేటందుకు ఇంతకన్న ఎక్కువగా తగి

ఉన్న మరొక ఉపాయము నీ ఉపన్యాసకుడు నిజంగా ఆలోచించ జాలకపోయినాడు.

ఇందును గూర్చిన ఆర్థిక వాదం అప్రతి హతమైన యెడల దానినుండి వచ్చిన ఆధ్యాత్మిక వాదంకూడా సరిగా అంతే. ఇది వరకే భాగ్యవంతులైనవారి ఖజానాలను ఇంకా నింపే టందుకు మిల్లులు అత్యధిక రాదాయాలను చేకూర్చిన యెడల, రాటం ఆధ్యాత్మికంగా వాటికంటె అధిక్యం కలదన్న మాట నిశ్చయం. ఎందువల్లననగా అది ఇదివరకే భాగ్యవంతులైన వారి జేబులను నింపేటందుకు గాక, దరిద్రులై పస్తులు ఉండే లక్షలాది ప్రజల జేబులను నింపుతుంది.

డ్రమ్మండు వ్రాసిన 'ఆధ్యాత్మిక ప్రపంచంలోని ప్రకృతి నియమం' అనే గ్రంథాన్ని చాలాకాలం కిందట చాలా శ్రద్ధతో చదివాను. ఆ గ్రంథకర్తవలె సుఖువుగా వ్రాయగలిగిన శక్తి నాకు ఉన్నట్లయితే, ప్రాకృత ప్రపంచంలో ఆధ్యాత్మిక నియమం యిమిడి ఉందని అంతకంటె ఎక్కువ బాగా ప్రదర్శించి ఉండేవాడను' అన్నారు గాంధీజీ. . ముసలివాండ్లు రోగులు వికలాంగులు ఈ మొదలైన జాతులను విద్యుచ్ఛక్తి ద్వారా చంపవలెనని గట్టిగా వాదిస్తూ ఉన్మత్తులు కాని మనుష్యులు వ్రాసిన గ్రంథాలను నేను చదివాను. అది ఉత్కృష్టమైన ఆర్థిక పరిహారముకావచ్చును. కాని, మానవత్వమునకు గానీ ఆధ్యాత్మిక తత్వమునకు గానీ సంబంధించిన పరిహారం మాత్రం కాదని, రాటంలో తన దేశీయులకాయన, ఒక ఆధ్యాత్మిక పరిహారాన్ని ప్రతిపాదించారు. అది తరతరాలనుండి .వారికి తెలిసిఉన్నట్టిదే. వారు శ్రద్ధగా కృషి చేసిన యెడల, పట్టణ జీవితంలోనూ ఫ్యాక్టరీ జీవితం లోనూకల భయంకర దుష్ఫలితముల నుండి రక్షించగలది కూడా అది. ఈ

చిన్న పరికరం మనస్సుమీద కలిగించే ఆధ్యాత్మిక పరివర్తనమునుగూర్చి యింకేమైనా ఆయన చెప్పవలసిన అవసరం ఉందా? దానిని ప్రయత్నించిచూచిన అనేకమంది, వ్యాకులంతో చీకాకు పడిన మనస్సుల కది శాంతి చేకూర్చినదని ప్రకటించారు. మార్గరెట్టు రాటం దగ్గర నూలు వడుకుతూ, దాని ప్రభావం వలన రాటమునుండి వెలువడిన నూలువలెనే ఒక విలక్షణమైన పాట ఆమె పెదవులనుండికూడా వడక గలిగినదని గోతే వర్ణించినప్పుడాయన ప్రతిభా విశేషం, రాట ప్రయోజనమునుగూర్చి తరతరాలకు వరకూ నిలచి ఉండే కవితాగాన కల్పనకు కారణభూతమయింది. ఆయన తన వాదాన్ని ముగిస్తూ నూతన విషయాలను కనిపెట్టడం తనకయిష్టంకాదనీ, పదార్థం దుర్వినియోగంవలన మఱికిగా పరిణమించినట్లే, నూతన నిర్మాణములుకూడా దుర్వినియోగం చేయబడినప్పుడవి భయంకరములుగా పరివర్తనం పొందుతవనీ, మానవమర్యాదకు శాంతికీ ద్రోహంచేయని వాటిని పరిహరించవలసిందేననీ ఆయన అన్నారు.

గాంధీజీ ముగించగానే అధ్యక్షుడు ప్రశ్నలు వేయవలసిందని కోరారు. చర్చ అనుకొన్నంత ఆకర్షవంతంగా లేదని నాకు తోచింది. క్లబ్బులో హాస్యానికి ప్రసిద్ధిచెందిన హాబ్సుగారు మాట్లాడారు. కాని ఎవ్వరూ దానిని గమనించలేదు. నూలు ఎప్పటికీ అమ్ముడుపోయే వస్తువు కాదని పరిశ్రమల డైరెక్టరు చెప్పడం, బెంగాలు గ్రామమునుగూర్చి ఆయన అజ్ఞానాన్ని బయటపెట్టుకోవడంగా పరిణమించింది. ఇంట్లో వడికిన నూలును బట్టగా నేయడం సాధ్యంకాదని ఆయన చెప్పినప్పుడు తన చరిత్రనే ఆ సమయంలో ఆయన మఱచిపోయినట్లు కనిపించింది. యంత్రోపయోగమును గూర్చి యెవ్వరికీ తెలియని రోజులలోనే, లక్షల కొలదీ

గజాల బట్ట ఇండియా తీరములను విడిచిపోయిందనే సంగతి ఆయన తెలుసుకొని ఉండవలసింది.

గాంధీజీ తన చర్చలో మొదటి నుండి చివరవరకూ రాటము యొక్క రాజకీయ దృక్పథమును గూర్చి చెప్పడం బుద్ధి పూర్వకంగా మానివేశారు. కాని రోటరీక్లబ్బు సభ్యుడైన డాక్టరు సర్వాధికారి చివరకుమాట్లాడి గాంధీజీని దానినిగూర్చి చెప్పేటట్లు చేశారు. ఆయన ప్రశ్నలోని సారంశమిది: హిందూ మతానుష్ఠానమునందు ప్రముఖస్థానం వహించి, వంగ గృహంలో సచే తన వస్తువుగానుండిన రాటం మూల పడి పోవడం యెలా తటస్థించింది? రాటం ద్వారా ఉత్పత్తియైన వస్తువుయొక్క ధరకాదా దానిని బయటకు వెళ్లగొట్టింది; అప్పుడు గాంధీజీ అందులో ఆధ్యాత్మిక దృక్పథంకూడా యిమిడి ఉందన్నారు. ఎలిజెబెత్తు రాణీకున్న అధికారం తనకే ఉన్నట్లయితే తానుకూడా ఆమెవలెనే వ్యవహరించి ఉండేవాడనన్నారు. ఆమె తన ప్రజ వాలెందు 'లేసు' ను ఉపయోగించడం నేరమని చట్టం చేసింది. తమ ప్రజకు లేసు అల్లడం నేర్పేటందుకు విదేశాలనుండి పనివాళ్లను తెప్పించుకొన్నది. అంతవరకూ లేసు ఉపయోగాన్ని నిషేధించింది. గాంధీజీ పూర్తిగా స్వేచ్ఛా వ్యాపార వాది కాడు. ఆయనకు చేతనైతే విపరీతమైన దిగుమతి పన్నులను వేసి విదేశీ వస్త్రాలను పూర్తిగా దిగుమతికాకుండా ఆపగలిగి ఉండేవాడు. ఉత్సాహం తెచ్చుకొని గాంధీజీ యింకా యిలా అన్నాడు. 'ఖాదీ పరిశ్రమ యెలా మృతి పొందిందని మీరు ప్రశ్నించారు. దానికి జవాబు చెప్పడం నాకు బాధగా ఉంది. కాని చెప్పితీరాలి. అది మృతి పొందేటట్లు చేయబడ్డది' అన్నారు. ఈస్టిండియా కంపెనీ యొక్క చరిత్రను కళంకితం చేయగలిగిన ఆ భయంకర కథను

యావత్తూ ఆయన పూర్తిగా వివరించగలిగి ఉండేవారే. కాని నిగ్రహించి ఊరుకొన్నారు. 'భారతీయులచే కాక కంపెనీ సేవకుల చేతనే వ్రాయబడిన ఆ చరిత్ర పుటలను త్రిప్పినప్పుడు నిజాయితీగల ప్రతి స్త్రీయొక్కయు పురుషుని యొక్కయు నెత్తురు ఉడికిపోతుంది. తమ పైన చేయబడే దౌర్జన్యాన్ని తప్పించుకొనేటందుకు వారు తమ బొటనవ్రేళ్లను తామే నరుకుకోవలసి వచ్చిందని నేను చెప్పితే అసలు సంగతి మీకర్థమవుతుంది.' డాక్టరు సర్వాధికారి చెప్పినట్లుగా ప్రతి యింట్లోనూ చర్ఖా సజీవంగా లేదు. అది చంపివేయ బడింది. ఇప్పుడది పునరుద్ధరింపబడుతూన్నది. ప్రతి దేశము తన పరిశ్రమలను తాను నిర్మించుకోవాలి. తొలిరోజులలో దేశీయోత్పత్తుల కెక్కువ ఖరీదీయవలసివచ్చినాకూడా పరవా లేదు. 'స్వార్థంకంటె సేవను ప్రధానం'గా పెట్టుకొన్న ఈ క్లబ్బులోని మీరు, ఇండియా ప్రజల క్షేమమునకు రక్షకులు. మీరు స్వార్థమునుగాక సేవను ఆదర్శంగా ఉంచుకొని, వారి యిండ్లలో వారు బట్టలను తయారుచేసుకో గలిగి ఉండగా మాంచెస్టరు బట్టనుగానీ మిల్లు బట్టనుగానీ వాడకూడదని ప్రజలకు మీరు నచ్చచెప్పాలి.' తరువాత ఆయన, ఒక విదేశీ స్టీమరు కంపెనీకి, బ్రిటిష్ స్టీమరు కంపెనీకి, పోటీ పడగా విదేశీ స్టీమరు కంపెనీ, స్టీమరుపైభాగాన ప్రయాణంచేసే బాటసారులకు, ఒకప్పుడు రూ 91 ల ఖరీదు గల టికెట్లను గూడా ఉచితంగా యిచ్చిన సంగతి తార్కాణంగా ఉదాహరిస్తూ యిలా అన్నారు. 'మంచి పరిశ్రమ

సమేదీ అటువంటి పోటీని తట్టుకోలేదు. అవి నీతికర మైన అట్టి పోటీకి ప్రతికూలంగా ప్రపంచాభిప్రాయాన్ని మీరు ప్రబోధించాలి. నేను న్యాయమైన పోటీ కోరు తున్నాను. అంతేకాని పక్షపాతంగా ఉండవలెనని కోరడం లేదు.' ఈ ప్రత్యుత్తరం ఈయబడిన తరువాత డాక్టరు సర్వాధికారి తానా ప్రశ్న అడిగినందుకు పశ్చాత్తాప పడ లేదని నా దృఢ విశ్వాసం. *

యంగిండియా, 27-8-1925

---

* 'రోటరీ క్లబ్బులో' అనే శీర్షికగల మ. దే. వ్యాసమునుండి.

# 46

# ఒక ప్రభుత్వ ప్రయోగం

పాట్నాలో నేను చూడగలిగిన మరొక ఉత్సాహకరమైన విషయం పరిశ్రమలశాఖచే నడపబడిన కార్ఖానా. శ్రీ రావు దానికి సూపరింటెండెంటు. ఆ కార్ఖానా, మంచి వెలుతురు, మంచి గాలి, మంచి నిర్మాణము, మంచి పరిశుభ్రతా గలిగిన ఆధునిక భవనం. పాట్నాకు ప్రత్యేక విషయాలైన చేనేత,-ఆట వస్తువులను చేయడం, ఇవి ఆ కార్ఖానాలోని ముఖ్య లక్షణాలు. కోపులు నవారు నేసేటందుకు మంచి మగ్గాలు నుతింపతగి ఉన్నవి. కాని యింత శ్లాఘాపాత్రమైన ఈ కార్ఖానాలో, కేంద్రంగా ఉండతగిన వస్తువు రాటం లేకపోవడం నాకు విచారం కలిగించిందని చెప్పకతప్పదు. అభివృద్ధికరమైన ఆట వస్తు నిర్మాణంవలన పనివాళ్లకెక్కువ మజూరీ వస్తుంది గనుక పాట్నావంటి నగరంలో ఉన్న కార్ఖానాలో దానికి అర్హస్థానం ఉంది. చే మగ్గపు నేత లేని ఇండియాలోని కార్ఖానాకూడా అసంపూర్ణమే. కాని చేనూలు పరిశ్రమను గూర్చి, దానిద్వారా, ప్రస్తుతం అదనపు వృత్తిలేని కోటానుకోట్ల ప్రజాసమూహామునుగూర్చి శ్రద్ధవహించని జాతీయ పరిశ్రమలశాఖను దేనినీ సంపూర్ణమని భావించడానికే వీలు లేదు. చేతితో నూలు వడికే పనిని జయప్రదంగా నిర్వహించడంలో ముఖ్యమైన కష్టాలు రెండున్నట్లు సూచింపబడుతూన్నది ;

(1) చేతితో వడికిన నూలు మిల్లునూలుతో యెన్నడూ పోటీ చేయలేదు. అందుకు కారణం, ఇంతవరకది మిల్లు నూలంత గట్టిగా ఉన్నట్లు యెవ్వరూ అనుకోవడం లేదు.

(2) రాటంవలన చేయబడే ఉత్పత్తి గిట్టుబాటు కానంత తక్కువగా ఉంటుంది.

మంచి వడుకు నూలుతో నేయబడిన బట్ట, అదే నంబరు గల మంచి మిల్లునూలు బట్టకంటె ఎప్పుడైనా సరే ఎక్కువ కాలం మనుతుందని సంవత్సరాలకొలదీ ఖద్దరు ధరిస్తూన్న వారి అనుభవం. ఇందుకు తార్కాణంగా నా ఆంధ్రా స్నేహితులు కొందరు, ఒక్క యేడాదిలోనే చిరిగిపోయే మిల్లు ధోవతులకు ప్రతిగా నాలుగు సంవత్సరాలపై చిలుకు దాకా మనిన వారి ధోవతులను నాకు చూపించారు. అయితే నేను చెప్పేది వడుకునూలు బట్ట చిరకాలం చిరగకుండా ఉంటుందనడానికి కాదు. భారతదేశపు జన సంఖ్యలో నూటికి 85 మందిగల వ్యవసాయకులకు అదనపు వృత్తిగా ఉండే అవకాశం ఒక్క వడుకు నూలు పనికే ఉన్నదికాబట్టి, మన బట్టలనుగూర్చి మనం చేసుకొనే యేర్పాట్లన్నీ, అవి వడుకునూలుతో నేయబడినవిగానే ఉండవలెనను అభిప్రాయానికనుగుణముగా జరుగవలెను. కాబట్టి ఎక్కడ ఎలా వడకబడినప్పటికీ మిక్కిలి బాగాఉండి మిక్కిలి చౌకగా ఉండేనూలుకోసం కాదు మనశక్తిని వినియోగించవలసింది. చేతితో మిక్కిలి బాగా వడకబడి మిక్కిలి చౌకగా ఉన్న నూలుకోసం మనం ప్రయత్నించాలి. నా ప్రతిపాదన సరియైనదే అయితే దేశంలో పారిశ్రామిక శాఖలన్నీ చర్ఖాను కేంద్రంగా ఉంచుకొని దాని చుట్టూ తిరుగుతూఉండాలి. కాబట్టి పరిశ్రమల శాఖవారు రాటాలను ఇంకా అభివృద్ధిచేసి ఉత్పత్తియెక్కువ అయ్యేటట్లు చూడాలి. వారు వడుకు నూలును కొనాలి. అప్పుడు నూలువడకడం దానంతటదే అభివృద్ధిఅవుతుంది. ఎటువంటి వడుకు నూలు లభించి నప్పటికీ దానిని ఉపయోగించేటందుకు తగిన మార్గాలను

వారన్వేషించాలి. అందరిలోకీ సన్నని నూలును చేతితో వడికిన వారికి వారు బహుమానాలీయాలి. ఖాగా చేతితో వడికిన నూలును సంపాదించడానికి అవకాశమున్నంత వరకు అన్ని రంగాలనూ వారన్వేషించాలి. ఇందువలన చేనేతకు తక్కువ ప్రోత్సాహమీయవలెనని అర్థంకాదు. ఇది, చేనేతకు నూలుకూకూడా ఎక్కువ ప్రోత్సాహమీయడమేకాక సహాయాన్ని అభిలషించే వారి కత్యంతోపకారం చేయడంకూడా అవుతుంది.

అయితే చేతితో నూలు వడకడం లాభదాయకం కాదని అభ్యంతరం చెప్పబడుతూన్నది. నిజానికి ఎక్కువ తీరిక కలవారికిన్నీ, ఒకర్ర కానీ అదనంగా లభించినప్పటికీ ఆనందించే అల్పాదాయంకలవారికిన్నీ ఇది లాభదాయకమే. కనీసం పేడాదిలో నాలుగు నెలలు, లక్షలాది వ్యవసాయకులు తప్పనిసరిగా పనిలేని స్థితిలో నుండనియెడల, ఈ చర్ఖా కార్యక్రమమంటతా తుత్తునియలు కావలసిందే. ఖాదీ కార్యకర్తలు ప్రేమపూర్వకంగా తమ పనిని సాగిస్తూన్నచోట్ల, అది లాభదాయకం కావడమేకాక, తమ నూలును కొనేవారు లభించినందున గ్రామస్థులకొక అదృష్టంగాకూడా పరిణమించింది. నెలకు అయిదారు రూపాయలకు మించని ఆదాయం కలవారు, తీరిక ఉన్నవారూ, నెలకు మరి రెండు రూపాయల ఆదాయాన్ని చేకూర్చే ఈ పనిని సంతోషంగా అవలంబిస్తారు.

—యంగిండియా, 8-10-1925

# 47

# అద్భుతమైన ఉపవృత్తి

'పశ్చిమ భారతంలో వ్యవసాయాభివృద్ధి' అనే కీటింగ్సు గ్రంథమునుండి ఒక మిత్రుడీ క్రింది విషయం వ్రాసిపంపినాడు.

"వ్యవసాయకులచేత, నైపుణ్యం అక్కరలేని నూలు వడకడంవంటి పని చేయించేటందుకు ప్రయత్నాలు జరిగినవి. కాని నూలు తయారు చేసే మిల్లుల శక్తి సామర్థ్యములనుబట్టి చూచినయెడల, వ్యవసాయకుడు చాలా కాలమును వ్యర్థంచేస్తున్నాడు కాబట్టి, ఆయన ఏపని చేసినప్పటికీ, ఎంత తక్కువ సంపాదించినప్పటికీ, అసలు లేనిదానికన్న నయమేకదా అనే భావంతో మాత్రమే, ఆర్థికంగా ఆ చేతితో నూలు వడికే పనిని సమర్థించడానికి వీలవుతూన్నది. దురదృష్టవశాత్తు చాలా సందర్భాలలో, ప్రస్తుతవిషయా లాభాలాన్ని సమర్థిస్తూన్నవి. అసమానము, దుస్సాధ్యముఅయిన ఈ పోటీనిగూర్చి వ్యవసాయకులను నిరసించడం నిరాశాజనకంగా ఉంటుంది. వ్యవసాయకునకు అన్నిటిలోకి ఉత్తమమైన అదనపు పరిశ్రమ పశూత్పత్తి, దాని పెంపకం. అది ఆయనకు వృత్తిని కల్పించి అన్ని ఋతువులలోనూ ఆదాయమును చేకూర్చడమే కాక భూసారమును ఎక్కువ ఫలప్రదంగా ఉండేటందుకవసరమైన ఎరువును కూడా లభింపచేస్తుంది."

భారతదేశంలోని వ్యవసాయకుడు వ్యర్థంగా గడిపే కాలం చాలా ఉన్నదనీ ఆ కాలంలో ఏపనిచేసినా ఎంతతక్కువ చేసినా అసలు లేనిదానికంటె లాభమేననీ వివాదం లేకుండా ఒప్పుకొన్నందుకే ఈ సమస్య విలువగలదయింది. కాని ఈ విలేఖకుడు నూలువడికే మిల్లుల సామర్థ్యమును కారణంగా తీసుకొని చేతితో నూలువడికే పనిని నిరుత్సాహపరుస్తున్నాడు. కాని జాగ్రత్తగా పరిశీలించినయెడల ఈవాదం కేవలం భ్రాంతి అని తెలుస్తుంది. వ్యవసాయకుడు తన సమీపంలోని శక్తివంతమైన మిల్లులతో పోటీచేయడం లేదు.

తేలికగా చినిగిపోయే తెల్లని మిల్లుబట్టకోసం కొత్తగా అల వఱచుకొన్న అభిరుచితోమాత్రమే ఆయన, పోటీ చేయవలసి ఉంది. తన పాత అభిరుచిని పునరుద్ధరించుకొని, సుంద రము, నిరాడంబరము, మృదులము అయిన ఖద్దరువైపుకు మరలినయెడల, ఒకక్షణంకూడా సోమరితనంగా ఉండవ లసిన అపాయం ఆయనకుండదు. బాగా పనిచేసే హోటళ్లుగానీ, రొట్టెలు తయారుచేసే చోట్లుకానీ లక్ష లాది ప్రజలకు ఆకర్షవంతములుగా గానీ, పోటీగాగానీ ఉండ డంలేదు. రొట్టెల దుకాణాలలో శుభ్రంగాఉండి బాగా కాలి, మంచి పరిమళద్రవ్యములు కలిగిన బిస్కట్లకంటే తాముతయారుచేసుకొన్న మొరటుచపాతీలనే ఎక్కువగా కోరుకుంటారు వారు. ఉపవృత్తిగా సూచించబడిన పశూ త్పత్తి ఎప్పటికైనా నూలువడకడంకంటె ఎక్కువ లాభకర మైనదనేమాట సత్యమే. కాని దానికి పెట్టుబడికావాలి. ఆ ఉత్పత్తినిగూర్చిన జ్ఞానంసాధారణ వ్యవసాయకునకుండదు. ముందుగా ఎక్కువ కృషి చేస్తేనేగాని ఆ జ్ఞానం కలుగదు. కలగడానికి వీలులేదు కాబట్టి మీరెలా తిప్పినప్పటికీ, ఇండియా పరిస్థితులలో నూలువడకడంతో పోటీచేయగలిగిన మఱొక ఉపవృత్తిలేదు.

దాని అమూల్యమైనగుణం ఏ కొదిమంది వ్యక్తులకో ఎక్కువ లాభం చేకూర్చడంలోకాక లక్షలాది జనానికి సార్థకమైన వృత్తిని తక్షణం కల్పించడంలోవుంది. కాబట్టి జయప్రదంగా యేర్పాటు చేయడానికి వీలైన ఉప వృత్తి అదిఒక్కటే. కనుక పశూత్పత్తి ఎంత ఉత్కృష్ట మైన పనిఅయినప్పటికీ, అన్నిటిలోకీ ఉత్తమమైన ఉపవృత్తి నూలు వడకడమే.

యంగిండియా, 15-10-1925

# 48

## ఎవరు వడకవలెను?

[illegible] (బీహారు) ఈయబడిన సన్మాన పత్రంలో అక్కడ కార్మికులు నూలు వడకకుండుటను గూర్చి ఉదాహరింపబడిన విషయం వుత్సాహకారకమైన మూడవ విషయం. గిరిడిహ్‌లో అనేక అభ్రకపు గనులున్నవి. కాబట్టి ఆ గనులలో పనిచేసే కార్మికులు కూడా అనేకమంది ఉన్నారు. ఈ కూలీలు, నూలు వడికినందున సాధారణంగా పొందగలిగిన మజూరీకంటె ఎక్కువ మజూరీని సహజంగా తాము పొందుతున్నారు. కాబట్టి వారు నూలువడకడమే లేదు. నిజానికా సన్మాన పత్రంలో ఉదాహరింపబడినంత క్షమాపూర్వకంగా వారు చెప్పుకోనక్కరలేదు. ఎక్కువ వరుమానం వచ్చేపనిలో ఉన్నవారా పనివదలుకొని నూలువడికే పనిని చేపట్టవలసిందని నేనెప్పుడూ సూచించలేదన్నవిషయం యంగిండియా పాఠకులకు తెలుసును. వరుమానం వచ్చే యితర వుద్యోగం లేనివారు, వారుకూడా యే పనీలేని తీరిక సమయంలో మాత్రమే వడకవలెననీ వడికేటందుకు ప్రోత్సహింపబడవలెననీ నేను పదేపదే చెప్పిఉన్నాను. ఏడాదిలో కనీసం నాలుగు నెలలు, ఏ పనీలేక లక్షలాది స్త్రీ పురుషులీదేశంలో సోమరులుగా వుంటున్నారనే భావం పైననే నూలు వడకడమనే సిద్ధాంతం యావత్తు ఆధారపడివుంది. కాబట్టి రెండు తరగతుల ప్రజలుమాత్రమే వడకవలసిఉందని అనుకొంటున్నాము. ఒకరు మజూరీ కోసం వడికేవారు. వారిని గూర్చి యిదివరకే చెప్పిఉన్నాను. రెండవవారు భారత దేశంలోని ధీమంతులు. వారితరులకు వరవడిగా ఉండే

టందుకు త్యాగబుద్ధితో ఖద్దరు చౌక కావడానికి వడకవలెను. అయితే కార్మికులు నూలువడకక పోవడము నేనర్థం చేసుకో గలను. వారు ఖద్దరు ధరించకపోవడం నాకర్థం కావడం లేదు. ఇంత పెద్దసభలో ఒక్క మనిషి ఖద్దరు ధరించ కుండా ఉన్నా కూడా క్షమార్హంకాదు. గిరిదిహ్ తననూలు తాను ఉత్పత్తి చేసుకొని తనఖద్దరు తాను తేలికగా నేసు కోగలదు. భీహారులోని తదితర ప్రాంతాలనుండి తక్కిన చోట్లకంటె ఎక్కువ చౌకగా తనకు కావలసినంత తయారైన ఖద్దరును సరఫరా చేయించుకోగలది గిరిదిహ్. అయితే ఈ సన్మాన పత్రములు ఖద్దరును చర్ఖానుగూర్చి తమలోపము లను తామంగీకరిస్తున్నప్పటికీ వాటిని సన్నిహిత భవిష్యత్తులో సంస్కరించుకోవలెననే శ్రద్ధతోగాక, ఈ పరిస్థితి యిలా కొనసాగుతూన్నందుకు మనస్సంతృప్తికోసం చెప్పబడిన వేమోనని నాభయం. ఒకతప్పును సవరించుకోనేటందుకు దేశించి ఒప్పుకోవడంలో మాత్రమే గుణంవుంది. దిద్దుకోవ డానికి ప్రతికూలంగా ఏవైనా మరింత కాఠిన్యం వహించే టందుకది ఉద్దేశింపబడినయెడల అంతకంటె నిష్ప్ర యోజనమైనపని మరొకటి ఉండదు. నాకు సమర్పింప బడిన అనేక సన్మాన పత్రాలలో ఒప్పుకొన్నవిషయాలు సుస్పష్టమైన పరివర్తనాలకు పురోగాములుగా నుండగల వని ఆశిస్తున్నాను.

యంగ్ఇండియా, 22-10-1925

# 49

# మాయ ఖద్దరు

ఒకానొక ఇండియన్ మిల్లులో నేసిన మాయఖద్దరునుండి ఒక స్నేహితుడొక బొమ్మలకార్డు పంపించాడు. దానిమీద ఒక చరాకా, ఒక ప్రేకులబుట్ట, దానిముందు కొన్నినూలు పంచెలు చిత్రింపబడి ఉన్నవి. అటువంటి ఇమిటేషను ఖద్దరు ఇండియాలో దాదాపు అన్ని మిల్లులలోను ఉత్పత్తి చేయబడుతూన్నదనీ, జపాను నుండికూడా అటువంటిది ఇక్కడకు దిగుమతి చేయబడుతూన్నదనీ నా విలేఖకుడు వ్రాస్తునాడు. ఖాదీ ధరించవలెనని తెలిసి ఉన్న పేదవారు దానిపైన చరాకాబొమ్మనుచూచి, అంగళ్లకుపోయి ఆదికావలెనన్నప్పుడు, ఖాదీవలె కనిపించే ఆ వస్తువు వారికీయబడగా వారు దానిని ఎదురుప్రశ్న వేయకుండాకొని, భారతదేశము యొక్క ఆదుస్థితిని తొలగించేటందుకు తాముకొంత పని చేశామన్న నమ్మకంతో తమ్ముతాము ప్రశంసించుకొంటూంటారని కూడా ఆయన వ్రాస్తున్నాడు. మిల్లుయజమానులేమాత్రం దేశాభిమానమూ లేకుండా తమ లాభాలను సంపాందించుకోవడానికి-ప్రస్తుతం తమ మిల్లులను సాగించుకోడానికి కావచ్చును—జాతీయాభిప్రాయాన్ని మన్నించక పోవడం అత్యంత విషాదకరం. అయినప్పటికీ, ఇండియన్ మిల్లుల సహాకారంతో విదేశీవస్త్ర బహిష్కారమును సాధించగలమనుకొనేవారింకా ఉన్నారు. ఖాదీ సరియైన వర్తక సరళిలో నడపబడేముందు, జాతీయక్షేమం కోసం మిల్లుపరిశ్రమ ఉపయోగపడుతుందని అనుకోవడంలోనే మహా ప్రమాదమున్నది. ఎప్పుడో ఒకప్పుడు ఈ మిల్లులనీ

E. K.—16A

జాతీయక్షేమంకోసం నిలబడే రోజువస్తుందనే మాట నిస్సంశయమే కాని ప్రపంచమంతటికీ ప్రతికూలంగా ఖాదీ తన కాళ్లమీద తాను నిలబడగలిగేటంతవరకూ ఆ సమయంరాదు. అనగా ప్రజాసామాన్యం ఖాదీ తప్ప మరొకబట్టను ధరించడానికి నిరాకరించేటంతవరకు, జాతీయాభిరుచిలో పరివర్తనం గలిగి వారు నిజమైన ఖాదీకిన్నీ ఖాదీని పోలిఉన్న బూటకపు ఖాదీకిన్నీ గల భేదమును తేలికగా గ్రహించగలిగేటంత జ్ఞానవంతు లయ్యేటంతవరకూ, ఆ రోజు రాదని అర్థం.

యంగిండియా, 22-10-1925.

# 50

# కవీశ్వరుడు—చరఖా.

కొంతకాలం కిందట రాటమునుగూర్చి సర్ రవీంద్రనాథుని విమర్శ ప్రచురింపబడినప్పుడు అనేకమంది స్నేహితులు దానికి ప్రత్యుత్తరమీయవలసిందని నన్ను కోరారు. నేను చాలా పనిలో ఉండడంచేత అప్పుడు దానిని పూర్తిగా పరిశీలించ జాలకపోయినాను. కాని దాని ధోరణి తెలుసుకొనేటంత వరకూ దానిని చదివాను. దానికి జవాబు వ్రాయడానికి నేను తొందరపడలేదు. దానిని చదివినవారు చాలా ఎక్కువగా ఆందోళన అయినా పడ్డారు, లేదా నాకవకాశ ముండి నట్లయితే నేనప్పుడు వ్రాయవచ్చుననుకొన్న ప్రత్యుత్తరాన్ని గ్రహించ గలిగేటంత మార్పయినా పొందారు. కాబట్టి దానిని గూర్చి వ్రాసి, కవీశ్వరుని విమర్శ విషయంలోనూ, నేనిప్పుడు వ్రాసేది జవాబనేటందుకు వీలున్నయెడల దాని విషయంలోనూ, నిష్పక్షపాతమైన అభిప్రాయాన్ని నిర్ణించుకొనేటందు కవకాశం కలిగించడానికి నిజంగా యిదే సమయం.

చర్ఖాను గూర్చి కవీశ్వరుని యొక్కయు, ఆచార్య సీలు యొక్కయు అభిప్రాయాలపైన ఆచార్య రే కనపఱచిన అసహనమునకు ఆ విమర్శ ఒక తీవ్రమైన మందలింపు. చర్ఖామీద ప్రత్యేకంగా అత్యంతమయిన పక్షపాతం కలిగి ఉన్నందుకు నాకొక మృదువయిన మందలింపు. ఆర్థికంగా దాని గొప్ప విలువను కవీశ్వరుడు కాదనడం లేదన్న సంగతి ప్రజలు గ్రహించవలసి ఉంది. ఆయన ఆ విమర్శ వ్రాసిన తరువాతనే, 'అఖిల భారత దేశబంధుస్మారక చిహ్నము'ను

గూర్చి చేయబడిన విజ్ఞాపనలో సంతకం చేసిన సంగతి కూడా వారు తెలుసుకోవాలి. ఆ విజ్ఞప్తి లోని సంగతులను జాగ్రత్తగా పరిశీలించిన తరువాతనే ఆయన సంతకం చేశారు. ఆ సంతకం చేసికూడా, చర్ఖానుగూర్చి నాకంత ఆనందదాయకంగా ఉండరానిదేదో కొంత వ్రాసి, ఆ సందేశాన్ని నాకాయన పంపించారు. కాబట్టి యేమి రానుండినదో నాకు తెలిసేఉంది. కాని నాకది అసంతుష్టి కలిగించలేదు. నా అభిప్రాయాలతో ఏకీభవించనంత మాత్రంతో నాకెందుకసంతుష్టికలగాలి. ప్రతి భేదాభిప్రాయము, అసంతుష్టిని కలిగించేయెడల అన్ని విషయాలలోనూ యే యిద్దరూ ఏకాభిప్రాయం కలిగి ఉండరు గనుక, జీవితం ఆనందంలేని ఉద్రేకాలతో నిండి కేవలం కంటకంగా పరిణమిస్తుంది. పైగా నిష్కాపట్యమైన విమర్శ నాకు సంతోషం కలిగిస్తుంది. మా భేదాభిప్రాయం, మా మిత్రత్వాన్ని మరింత మనోహరం కావిస్తుంది. స్నేహితులు స్నేహితులుగానే ఉండవలెనంటే వారు చాలా విషయాలలో ఏకీభవించవలెనని కోరుకోకూడదు. అయితే ఆ భేదాభిప్రాయాలు తీవ్రంగా గానీ, కాఠిన్యంగాగానీ ఉండకూడదు. కవీశ్వరుని విమర్శలో అటువంటిదేమీ లేదని నేను కృతజ్ఞతాపూర్వకంగా అంగీకరిస్తున్నాను.

ఆ విమర్శకంతకూ మూలకారణం అసూయ అని ఒక రహస్య ప్రవాదం ఉండడంచేత ఇంత ఉపోద్ఘాతం వ్రాయవలసివచ్చింది. అటువంటి ఆధారంలేని అనుమానం, అసహనత్వము దుర్బలత్వమూగల వాతావరణాన్ని వెల్లడిస్తుంది. కొద్ది ఆలోచన అటువంటి క్రూరమైన ఆరోపణకు కల యావత్తు కారణాన్నీ తొలగిస్తుంది. నాలో యేముందని నా మీద ఆయనకు అసూయ ఉండాలి. ఏ విషయంలోనైనా

మాకు పోటీ ఉందనుకొంటే అసూయ ఉంటుంది. పైగా నా జీవితంలో నేనెన్నడూ ఒక్క చరణం కూడా కవిత్వం వ్రాయజాలకపోయినాను. నాలో కవికుండలసిన గుణాలేవీ లేవు. ఆయనంత గొప్పవాణ్ని కావలెనని నాకభిలాష ఉండడానికే వీలులేదు. అందులో ఆయన నిర్వివాదమైన ప్రజ్ఞకలవాడు. ఈ నాడు ప్రపంచంలో ఆయనకు తుల తూగే కవి లేడు. కవీశ్వరుని అప్రతిహతస్థితికీ, నా 'మహాత్మా' తనానికీ యేమీ సంబంధం లేదు. మా యిరువురి కార్య క్షేత్రాలూ వేరు. వాటికి రెంటికీ ఎక్కడా కలయిక లేదు. ఈ సంగతి గ్రహించవలసిన తరుణం వచ్చింది. కవీశ్వరుడు తాను నిర్మించుకొన్న మనోజ్ఞ ప్రపంచంలో నివసిస్తూంటాడు. అది ఆయన భావప్రపంచం. నేను మరొకరి సృష్టికి—రాటా నికి బానిసను. తన వేణుగానాని కనుగుణంగా గోపాంగన లను నాట్యం చేయిస్తాడు కవీశ్వరుడు. చర్ఖా అనే నా ప్రియ మైన సీత కోసం తిరుగుతూ జపాన్, మాంచెస్టరు మొద లైన దేశాలనే దశకంఠుని చెఱనుండి విడిపించవలెనని ప్రయత్నిస్తున్నాను నేను. కవీశ్వరుడు సృష్టికర్త—ఆయన సృష్టిచేసి, లయం చేసి, పునస్సృష్టి చేస్తాడు. నేను జిజ్ఞాసు వును. ఒక విషయం తెలుసుకొన్న తరువాత నేను దాని నంటిపట్టుకొని ఉండాలి. కవీశ్వరుడు దినదినం ఆకర్షణీయ మ్మైన నూతన విషయాలను ప్రపంచానికి సమర్పిస్తాడు. నేను చివికిపోయిన పాత పనిముట్లలో దాగియున్న అవకాశాలను మాత్రం చూపెట్టగలను. మెఱసిపోయే నూతనవస్తువు లను సృజించగలిగిన ఐంద్రజాలికునకు ప్రపంచం గౌరవ మైన స్థానాన్ని తేలికగా చూపించగలదు. నా చివికిపోయిన వస్తువులకోస మేదైనా ఒక మూల దొరకుతుందా అని నేను చాలా శ్రమపడి వెదకవలసి ఉంది. కాబట్టి మా యిద్ద

రికి పోటీ లేనేలేదు. అయితే మాయుభయులము మా పర స్పర కార్య నిర్వహణంలో ఒకరితో ఒకరు సహకరించు కొంటూంటామని నేను సవినయంగా మనవి చేసుకొంటు న్నాను.

నిజానికి కవీశ్వరుని విమర్శ కవితాస్వాతంత్ర్యమున కనుగుణంగా ఉంది. దానిని అక్షరాలా అర్థం చేసుకొనే వారు అసహ్యాకరమైన పరిస్థితికిలోనయ్యే ఆపదలో పడతారు సంపూర్ణ యశోలంకృతుడైన సోలోమన్ పొలంలోని లిలీ పువ్వు వంటివాడు కాడని ఒకానొక పూర్వకవి వర్ణించాడు. లిలీయొక్క సహజసౌందర్య ముగ్ధత్వములతో, సోలోమన్ యొక్క కుహనాకీర్తినీ, ఆయన అనేక సత్కార్యములను చేసినప్పటికీ ఆయనయొక్క దౌష్ట్యమునూ పోల్చి ఆ భే దాన్ని స్పష్టంగా సూచించాడు కవి. లేక భాగ్యవంతుడు స్వ ర్గరాజ్యంలో ప్రవేశించడంకంటె, ఒంటె సూది బెజ్జంలో దూరడం యెక్కువ తేలిక, అనే విషయంలోని కవితా స్వేచ్ఛ నుకూడ యోచించండి. ఒంటె ఎప్పుడూ సూది బెజ్జంలోనుండి దూరలేదని మనకు తెలుసును. జనకుని వంటి ఐశ్వర్యవంతులు స్వర్గ రాజ్యంలో ప్రవేశించారనికూడా మనకు తెలుసును. లేక మనిషియొక్క పళ్లు దానిమ్మగింజలవలె నున్నవను మనోహరమైన ఉపమాలంకారాన్ని తీసుకోండి. అమాయికు లైన స్త్రీలీకవిత్వంలోని అతిశయోక్తిని అక్షరాలా నమ్మి వారి పళ్లను విరూపంచేసు కొని వాటి కషాయంకలుగచేసు గొంటున్నారు. నిజమైన దృశ్యాన్ని నిరూపించడానికి కవులూ, చిత్రకారులు వారి బొమ్మల ప్రమాణాలను అతిశయింప చేయక తప్పదు. కాబట్టి చర్ఖాను గూర్చి కవీశ్వరుడు చేసిన నిరసనను, అక్షరాలా అర్థంచేసుకొనే వారాయన కన్యాయం చేయడమేగాక తమకు హానిచేసుకొంటూన్నారు.

కవీశ్వరుడు 'యంగిండియా' చదవడు. చదవవలెనని ఎవరూ అనుకోరు. చదవవలసిన అవసరం ఆయనకు లేదు. ఆయనకీ ఉద్యమాన్నిగూర్చి తెలిసిన దంతా బల్లదగ్గర కబుర్ల నుండి గ్రహించినదే. కాబట్టి ఆయన చరాఖా-పూజయొక్క అతిశయ కార్య కలాపాలుగా వేటిని ఊహించారో వాటిని గ్రహించారు.

ఇందుకు తార్కాణంగా, ప్రతిమనిషీ, స్త్రీగానీ పురుషుడు గానీ, యేయితర పనీ లేకుండా, ప్రత్యేకంగా యావత్కాలమూ వడకుతూండవలెనని నేను కోరుతూన్నట్లు ఆయన అనుకొన్నారు. అనగా కవీశ్వరుడు తన ధ్యానమును, కర్షకుడు తన నాగలినీ, లాయరు తన వకాలత్తును, డాక్టరు తన శస్త్రచికిత్సాపరికరమును విడిచివేయవలెనని నేను కోరుతున్నట్లాయన భావించాడు. ఎవ్వరినీ నేను వారి వృత్తిని మానమని చెప్పలేదు గనుక ఇది సత్యానికి చాలా దూరం. పైగా ఆయావృత్తుల కలంకారంగా త్యాగబుద్ధితో దేశం కోసం ప్రతిరోజూ ఒక అరగంట నూలు వడకవలెనని నేను కోరినాను. చేసే పని యేమీలేక ఊరికే ఉంటూ ఒకొక్క చిక్కన స్త్రీగానీ పురుషుడుగానీ తన జీవనం కోసం వడుకు కొనవలెననీ, తన స్వల్పాదాయమునకు తోడుగా ఉండేటందుకు, చాలీచాలని తిండి తింటూన్న వ్యవసాయకుడు తన తీరిక కాలంలో నూలు వడుకుకోవలెననీ మాత్రమే నేను నిజంగా కోరి ఉన్నాను. కవీశ్వరుడు ప్రతిరోజూ ఒక అరగంట వడికినట్లయితే ఆయన కవిత్వం ఎక్కువ శోభిస్తుంది. దానికి కారణం పేదవాని దారిద్ర్యదుఃఖాల నిష్పటికంటె ఎక్కువ బలవత్తరంగా అది ప్రతిబింబింపచేస్తుంది.

చర్ఖా, జాతిలో ఒకానొక మృతసామ్యమును తీసుకొని వస్తుందని కవీశ్వరుని భావం. అందువలన ఆయనకు చేత

నయితే దానిని దగ్గరకు చేరనివ్వడు. ఇండియాలోని అసంఖ్యాక ప్రజానీకమునందలి సజీవమైన ప్రధానైక్యతను గుర్తించేటందుకే నిజంగా చర్ఖా ఉద్దేశింపబడింది. మనోహరములయిన వివిధరకముల నిరంతర పరివర్తనములకు వెనుక, ప్రకృతిలో భావ రచనారూపములయందు దాక ఐక్యత కనిపిస్తూంటుంది. ఆ ఐక్యతలో ఎంత సామ్యం కనిపిస్తూన్నప్పటికీ పొరపడడానికి వీలులేదు. ఏ యిద్దరు మనుష్యులూ చివరకు కవలలుకూడా కేవలం ఒకటిగా ఉండరు. ఐనప్పటికీ మానవానీకమంతటికీ తప్పనిసరిగా చాలా సామ్యం ఉంది. రూపసామ్యానికి వెనుక అందటిలో ఒక ప్రాణం ఆవరించి ఉంది. ఈ ఐక్యభావాన్ని శంకరుడు ఆమూలాగ్రంగా తరిచించి పరమావధికి తెచ్చి, ఒకటే సత్యం, ఒకడే దేవుడు, అదే—బ్రహ్మం, తక్కిన నామరూపాలన్నీ మాయ, లేక భ్రమ, నశ్వరం అని ఉద్ఘోషించాడు. మనం చూచేదంతా మిథ్యయేనా, మనం చూడకుండా ఉంటూన్నది ఈ మిథ్యకు వెనుకనున్న సత్యమేనా అని మనం తరిచించవలసిన అవసరం లేదు. మీ యిష్టమైతే రెండూ నిజమే కానీయండి. ఈ అనేకత్వమునకు, భిన్నత్వమునకూ వెనుక, సామ్యము, పోలిక, లేక ఏకత్వము ఉన్నదని మాత్రమే నేను చెపుతున్నాను. అలాగే వివిధ రకములయిన వృత్తులకు వెనుక, వృత్తియొకటి ఎడబాయరాని ఏకత్వం కూడా ఒకటి ఉందని నా వాదం. మానవ జాతిలో అత్యధిక సంఖ్యాకులకు వ్యవసాయం సర్వసామాన్య వృత్తి కాదా? అలాగే నూలు వడకడంకూడా అచిరకాలంవరకు మానవ జాతిలో అత్యధిక సంఖ్యాకులకు సర్వసాధారణ వృత్తియే. రాజు, రైతుకూడా తినాలి, కట్టాలి. కాబట్టి ఉభయులూ తమ ప్రాథమికావసరములను తీర్చుకోనేటందుకు కాయ

కష్టం చేయాలి. త్యాగంగానూ లాంఛనంగానూ మాత్రమే అయితే రాజు అలాచేయవచ్చును. ఆయన తనకు తన ప్రజకు విశ్వసనీయుడుగా ఉండగలగడానికి ఆ మాత్రమైన తప్పనిసరిగా చేయవలసి ఉంటుంది. ఈ ముఖ్యావసరాన్ని ప్రస్తుతం యూరపు గ్రహించకపోవచ్చును. అది ఐరోపేతర జాతులను స్వార్థంకోసం వినియోగించుకొనడ మొక మత ధర్మంగా చేసుకోవడమే అందుకు కారణం. కాని అది అచిరకాలంలోనే నాశనమై తీరవలసిన తప్పు మతం. ఐరోపేతర జాతులు శాశ్వతంగా పరులస్వార్థంకోసం ఉపయోగపడడాని కంగీకరించవు. శాంతియుతము, కరుణాపూరితము, ఉత్కృష్టమూ, అయిన ఒక మార్గాన్ని చూపించేటందుకు నేను ప్రయత్నించాను. అది నిరాకరింపబడవచ్చును. అదే జరిగితే ఇక జరుగవలసినది ఉభయులకూ సంఘర్షణ. అప్పుడు ఒకరినొకరు కిందకు లాగడానికి ప్రయత్నిస్తారు. అప్పుడు, ఐరోపీయేతరులు యూరోపియనులను స్వార్థంకోసం వినియోగించుకోడానికి ప్రయత్నించిన నాడు చర్ఖాలోని సత్యం గ్రహింపబడుతుంది. మనం ఊపిరి తీసుకొనేటందుకు ఇంగ్లాండునుండి గాలి ఎలా దిగుమతి కాకూడదో, అలాగే మనం తినే తిండీ కట్టే బట్టాకూడా ఇంగ్లాండునుండి దిగుమతికాకూడదు. ఈ సిద్ధాంతాన్ని దాని తార్కిక పరమావధికి తీసుకొనిపోయేటందుకు నే నెంతమాత్రమూ సందేహించను. అందువలన వంగరాష్ట్రం సాహసించి బొంబాయినుండికానీ, 'వంగలక్ష్మి' నుండికానీ తనకు కావలసిన బట్టను దిగుమతీ చేసుకోకూడదని నే నంటున్నాను. వంగరాష్ట్రం, ఇండియాలోని తదితర రాష్ట్రాలనుకానీ, బయటి ప్రపంచాన్నికానీ, స్వార్థంకోసం వినియోగించుకోకుండా సహజమైన స్వాతంత్ర్య జీవితమును గడపవలెనంటే, తన పంటను తన

గ్రామాలలో ఎలా పండించుకొంటూన్నదో అలాగే తన బట్టనుగూడా అక్కడే ఉత్పత్తిచేసుకోవాలి. యంత్రాల స్థానం వాటికుంది. అవి స్థిరపడిపోయినవి. కాని వాటిని అవసరమైన మానవశ్రమను నిర్మూలించడాని కుపయోగపడ నీయరాదు. అభివృద్ధిచేయబడిన నాగలి ఉండడం మంచిదే. అయితే హఠాత్తుగా, ఒకానొక యంత్రమును కనిపెట్టి ఒక్కే మనిషి, ఇండియాలోని భూమిని యావత్తూ దున్ని, పంట నంతటినీ స్వాధీనంచేసుకొన్నయెడల, లక్షలాది ప్రజలు మరొక వృత్తి లేక, పస్తులుఉంటూ సోమరులు కావడంచేత మూఢులుగా పరిణమిస్తారు. ఇదివరకే చాలామంది అలా అయినారుకూడా. ఇంకా ఎక్కువమంది అటువంటి అవాంఛనీయ పరిస్థితికి దిగిపోయే అపాయం గంట గంటకూ ఉన్నది. కుటీరయంత్రంలో ప్రతి అభివృద్ధికీ నే నంగీకరిస్తాను. కాని లక్షలాది కర్షకులు తమ ఇళ్లలో ఉండి చేసుకోవడానికి వీలైన మరొక వృత్తిని కల్పించకుండా, చేతితో చేసే పనికి బదులుగా విద్యుచ్ఛక్తిచే నడపబడే కదుళ్లను ప్రవేశపెట్టడం అపరాధమని నాకు తెలుసును.

ఐర్లండు ఉదాహరణం మనకంతగా ఉపయోగించదు. ఆర్థిక సహకారముయొక్క ఆవశ్యకతను గుర్తింపజేయగలిగేటంతవరకు మాత్రమే అది సరిగా ఉంది. కాని ఇండియా పరిస్థితులు భిన్నంగా ఉండడంచేత సహకార కార్యక్రమ విధానంకూడా తప్పకుండా భిన్నంగా ఉన్నది. ఇండియా కష్టం తీరవలెనంటే 1,900 మైళ్ల పొడవు, 1,500 మైళ్ల వెడల్పుగల ఈ విశాల ద్వీపకల్పములోని అధిక సంఖ్యాక ప్రజానీకమునకు వర్తింపచేయడానికి, ప్రతి సహకారోద్యమమూ చరఖాను కేంద్రంగా పెట్టుకొని పనిచేస్తూ ఉండాలి. సర్ గంగారామ్‌వంటి వారొకరు ఆదర్శ వ్యవసాయక్షేత్రము

నొకదానిని మనకు చూపవచ్చును. కాని రెండు మూడు ఎకరాలు మాత్రమే కలిగి ఉండి, అదే ఇంకా చీలికలయ్యే ప్రమాదం ప్రతిరోజూ ఉండగానే పైసా లేని భారతీయ వ్యవసాయకునకది ఆదర్శక్షేత్రం కాజాలదు.

రాటం చుట్టూ, అనగా సోమరితనాన్ని పోగొట్టుకొని సహకారముయొక్క విలువను గ్రహించిన ప్రజలచుట్టూ చేరి, జాతీయ సేవకుడు, చలిజ్వరాలను నిర్మూలించేటందుకూ, ఆరోగ్యాభివృద్ధికీ, గ్రామ వివాద పరిష్కారమునకు, పశూత్పత్తికీ, ఇంకా అనేక ప్రయోజనకరములైన పనులకు కార్యక్రమాన్ని నిర్మించాలి. చర్ఖా కార్యక్రమం సుస్థిరంగా ఉన్న చోట్ల, అప్పటి గ్రామస్థులయొక్కయూ, కార్యకర్తలయొక్కయు శక్తి సామర్థ్యముల కనుగుణంగా పైన ఉదాహరింపబడిన అభ్యుదయ కార్యక్రమం సాగుతూనే ఉంది.

కవీశ్వరుడు వ్రాసిన వాదాలన్నిటినీ వివరంగా విమర్శించడం నా ఉద్దేశం కాదు. అంత ప్రాముఖ్యంకాని మా విభేదాలను నేను చెప్పనే చెప్పినాను. వాటిని గూర్చిన కవీశ్వరుని వాదంలో నేను ఒప్పుకోవాలని దేదీ లేదు. కాని చరఖానుగూర్చి నా స్థితి అందువలన మారవలసిన అవసరమూ లేదు. ఆయన చరఖానుగూర్చి అధిక్షేపించిన చాలా విషయాలు నేనెప్పుడూ చెప్పనే లేదు. చరఖాలో కలవని నేను చెప్పిన సుగుణాలు కవీశ్వరుని దండయాత్రవలన శిథిలం కాలేదు.

ఒకే ఒక్క విషయం నాకు బాధకలిగించింది. రామమోహనరాయుని నేను 'అల్పమేధావి' గా చూస్తున్నట్లు కవీశ్వరుని విశ్వాసం. ఇదికూడా ఆయన బల్లకడ కబుర్ల ద్వారా గ్రహించినదే. నేనా మహా సంస్కర్తను ఎక్కడా

అలా వర్ణించలేదు. ఎప్పుడూ నేనలా అనుకోలేదుగూడా. ఆయన కవీశ్వరుని కెంత మహాపురుషుడో నాకూ అంత మహాపురుషుడే. రామమోహనరాయి పేరు ఒకటి సందర్భంలో తప్ప ఇంకెప్పుడూ ఉపయోగించినట్లు నాకు జ్ఞాపకం లేదు. అది పాశ్చాత్య విద్యావిషయమును గూర్చిన సందర్భంలో ఇప్పటికి నాలుగు సంవత్సరాలకిందట కటకం యిసుకతిన్నెలపైన ఆయన పేరుపయోగించాను. పాశ్చాత్య విద్య లేకుండానే అత్యున్నతమైన సంస్కారాన్ని పొందడాని కవకాశముందని నేను చెప్పినట్లు జ్ఞాపకం. ఎవరో ఒకరు రామమోహనరాయి పేరు చెప్పినప్పుడు ఉపనిషత్తులను రచించిన అజ్ఞాత గ్రంథకర్తలతో పోల్చి చూచినప్పుడు ఆయన 'వామనుడు' అని అన్నట్లు జ్ఞాపకం. రామమోహనరాయిని 'వామనుడు' గా చూడడానికీ దీనికీ చాలా భేదం ఉంది. మిల్టన్, షేక్స్పియరులముందు టెన్నిసన్, వామనుడని నేనంటే, టెన్నిసన్‌నుగూర్చి నాకు నీచాభిప్రాయ మున్నట్లుకాదు. ఇరువురి గొప్పతనాన్ని కూడ పెంపొందించానని నేనంటాను. మాలో మాకు భేదాభిప్రాయాలున్నప్పటికీ నేను కవీశ్వరుణ్ణి పూజిస్తున్నానన్న సంగతి ఆయనకుకూడా తెలుసును. సంస్కార మహోద్యమం కాచిన అత్యంత మనోజ్ఞములైన ఫలాలలో కవీశ్వరు డొకడు. అటువంటి ఉద్యమాన్ని సాధ్యంకావించిన పురుషుని గొప్పతనాన్ని నేను కించపరచడం అసంభవం.

—యంగిండియా, 2, 115-119

# 51

# పండిత నెహ్రూ—ఖద్దరు

'టైమ్సు ఆఫ్ ఇండియా' పత్రికకు పండిత మోతీలాల్ నెహ్రూ ఎన్నడూ అనుకూలుడు కాడు. ఆయన మఱి ఇటీవల చేసిన అపరాధం అలహాబాదులో ఖద్దరు అమ్ముతూ తిరగడం. కొలది సంవత్సరాలకిందటివఱకూ కూడా, అంద మైన తన మోటారుకారులో తప్ప ఆయన ఎక్కడికీ పోతూన్నట్లు కనిపించేవాడు కాడు. కాని 'టైమ్సు ఆఫ్ ఇండియా' విలేఖకుడు తన మృదువైన భాషలో ఆయనను గూర్చి యిలా అన్నాడు. 'పండిత నెహ్రూ తనకు తానే గాడిద అవుతున్నాడని ఇండియాలోసహితం గ్రహించి ఉండాలి'—అనేకమంది నాయకులు పండితుని అనుసరించి 'టైమ్సు ఆఫ్ ఇండియా' పత్రిక ఆయనకు దాక్షిణ్యంతో ఇచ్చిన బిరుదును ఆర్జించుకొనగలరని ఆశిస్తున్నాను. ప్రతి కూలురు తిట్టినప్పుడు, ఎవ్వరైనా సంతోషించవలసివుంటుంది. వారు పొగిడితే జాగ్రత్తగా ఆలోచించాలి. రోమనులు ముఖ్యంగా గ్రీకులు పారితోషికములు తెచ్చినప్పుడు భయపడే వారు.

కాంగ్రెసు, ఖద్దరు, కాంగ్రెసువాదులనుగూర్చి,ఆయనకున్న తిరస్కారభావమును ప్రకటించేటప్పుడు టైమ్సు విలేఖకుడు మితిమీఱిపోయినాడు. దీని యథార్థమును పాఠకుడు స్వయంగా నిర్ణయించుకొనును గాక. ఆ విలేఖకుడిలా వ్రాస్తునాడు:

"అలహాబాదు నుండి ఎంతో శ్రద్ధతో ఈయబడిన తంతీవార్తవలన కాంగ్రెసు పతనము పూర్తియైనదనీ కాంగ్రెసు సిద్ధాంతమని చెప్పబడే

దంతా కేవలం నిరర్థకమైనదనీ కాంగ్రెసును బలపరచే వారిలో సహేతుకమైన రాజకీయాభిప్రాయం ఒక్కటికూడా లేదనీ ఉదాహరణపూర్వకంగా తెలుస్తున్నది."

ఆయన ఇంకా యిలా వ్రాస్తున్నాడు:

"లార్డు బర్కెన్ హెడ్, యూనియన్ జాక్ వేస్టుకోటువేసుకొని ట్రఫాల్గర్ స్క్వేరు సింహాలకింద నిలబడి నిజమైన ఊదా టోరీ రొజెట్లను అమ్ముతూండిన రోజులను, బ్రిటిష్ ఆటవస్తువుల ట్రేలను, మిస్టర్ బాల్డ్విన్ తిరుగుతూ అమ్మి సామ్రాజ్య పరిశ్రమలను ప్రోత్సహిస్తేనూ, మిస్టరు రామ్సేమాక్డనాల్డు కూలీదుస్తులలో మఫ్లర్ చుట్టుకొని లైమ్ హౌస్ కార్మికులకు ఎఱ్ఱజెండాలు అమ్ముతూంటేనూ, లేక క్లైడ్ సైడ్ బోలివిస్టు లక్కడ ఒక అంగడి పెట్టుకొని చిన్న చిన్న సుత్తులు, కత్తులు అమ్ముతూంటేనూ, అన్ని వర్గాలవారూ, ఏకగ్రీవంగా తమ నాయకులకు పిచ్చిపట్టిందని నిర్ణయించుకొంటారు."

దీనినిబట్టి సహజంగా ఊహించవలసిందేమిటంటే, వీథుల వెంట తిరిగి ఖద్దరు విక్రయించే పండిత నెహ్రూ, ఆయనతో అందు కలసి వెళ్లిన శ్రీ రంగస్వామయ్యంగార్లవంటి సుప్రసిద్ధులు పిచ్చిపట్టిపోయినారని. ఆ విలేఖకుడు వాడిన భాష అవమానకరంగా [illegible] కాక పెడ మార్గాన్నికూడా పట్టిస్తున్నది. ఖద్దరుకూ బ్రిటిష్ టోరీ తిరిగి అమ్మే 'నిజమైన ఊదా టోరీ రోజెట్లకూ' పోలిక ఉండడానికేమి అవకాశం ఉంది? తప్పుగానో ఒప్పుగానో ఉన్నతవర్గాల వారికీ ప్రజాసామాన్యానికీ మధ్య నిజమైన బంధమునకు చిహ్నంగా, ఖద్దరును వేలకొలదీ భారతీయులు పరిగణిస్తున్నారు. ఎందువల్లననగా బ్రిటిష్ ప్రభుత్వంవారు శ్రమజీవులయిన మూకప్రజానీకంపైన ఎవరిద్వారా తమ అధికారాన్ని చలాయిస్తున్నారో ఆ ఉన్నత వర్గాలవారు, బ్రిటిష్ ప్రభుత్వాన్ని పోషించేటందుకు నెత్తురు ధారపోస్తున్న ప్రజాసామాన్యమునకు ఖద్దరుద్వారానే కొద్దిగా కొంతవరకు తిరిగీ ముట్టచెప్పగలుగుతున్నారు. మితవాద రాజకీయవేత్తలు

ఇక రాటం దేశాని కపకారం చేసినదనే నిందారోపణను, ఆ ఆరోపకులే నిరూపించవలసి ఉంది. ఈ పనిలో సహజంగా వృథాశ్రమ అనేది ఉండడానికి వీలేలేదు. చేసినంతవరకు చేసి తిరిగీ ఆపని కొనసాగించేటందు కేమీ అభ్యంతర ముండదు. ఈ పనిని కొద్దిగా అలవాటు చేసుకొన్న మనిషికూడా పెద్దకీడులనుండి రక్షింపబడతాడు. ఏవో కొన్ని ఖాదీదుకాణాలు మూసివేయబడినంత మాత్రాన ఏమి మునిగిపోయింది? ఏవ్యాపారంలోనైనా అటువంటి పరిస్థితి సర్వసాధారణమే. వాటిలో పెట్టినసొమ్ము కనీసం ఇండియాలో మిగిలియున్నది. అందువలన కలిగిన అనుభవం ఖాద్యభివృద్ధి కుపయోగపడింది. అంతేకాక, కొన్ని దుకాణాలు మూసివేయబడితే వాటిస్థానంలో అంతకన్న ఎక్కువ బాగా నిర్మింపబడిన దుకాణాలనేకం అభివృద్ధి పొందిన తార్కాణాలు కలవు.

6. నూలు వడకడంకొఱకు సముచితమైనట్టి, ప్రాణదాయకమైనట్టి యే ఒక్క పారిశ్రామిక కార్యకలాపమునూ విరమించవలెనని నేనుద్దేశించి కానీ సలహాయిచ్చి కానీ ఉండలేదు. ఇండియాలో సరియైన పనిలేనివారు కోట్లకొలదీ ఉన్నారనే విషయంపైననే, రాటముయొక్క పునాది యావత్తూ ఆధారపడిఉంది. అటువంటి వారిండి యాలో ఒక్కడుకూడా లేనియెడల రాటానికి స్థానమే ఉండదు. కాని నిజానికి మన గ్రామాలకు పోయిన

ప్రతిమనిషికీ గ్రామస్థులు నెలలకొలదీ సోమరితనంగా ఉంటు న్నారనీ అది వారికి వినాశన హేతువనీ తెలుస్తుంది. మధ్యతరగతులవారు త్యాగబుద్ధితో వడకవలెనని నేను కోరే కోరికకూడా వారి తీరిక సమయాలలో వడకవలెననియే. ఈ రాటం ఉద్యమం యేపరిశ్రమకూ వినాశ హేతువుకాదు. అది ప్రాణదాయకమైన కార్యకలాపం. అందువల్లనే నేను దానిని అన్నపూర్ణఅనీ, రొట్టెపైన వెన్నఅనీ, పరశమనీ అన్నాను.

యంగిండియా, 27-5-1926

# 55

## వడకడంలో సహకారం

తనకూ తన యితర మిత్రులకూ తట్టిన ఒక ప్రశ్నకు ప్రత్యుత్తర మీయవలసిందని ఒక ప్రియ స్నేహితుడు కోరుతూన్నాడు. 'వడకడంలో సహకారం ఉందా? అది ఒక విధంగా, ప్రజలను కేవలం వ్యక్త్యభిమాన పరులుగా, స్వీయ క్షేమాభిలాషులుగా, ఏ ఒకనితోనూ మరొకనికి సంబంధం లేకుండా, అందరినీ అన్ని చిన్నచిన్న గులకరాళ్లవలె తయారుచేయదా ?

దీనికి సంపూర్ణంగానూ, సంగ్రహంగానూ, నేనీయగలిగిన నిశ్చయమైన జవాబిది : 'మీరు సువ్యవస్థాపితమైన వడుకు కేంద్రాని స్వయంగాచూచి పరీక్షచేయండి. సహకారం లేకుండా వడుకు పని జయప్రదంకాదని మీరే గ్రహించగలరు.'

ఈ ప్రత్యుత్తరం సంగ్రహంగా ఉండవచ్చును కాని, అలా వెళ్లి చూడడానికి వీలులేని వారికిది నిరుపయోగం. అటువంటి వారే చాలామంది ఉన్నారు. కాబట్టి నాకు సాధ్యమైనంత బాగా అటువంటి కేంద్రాన్ని వర్ణించి వారిని ఒప్పించేటందుకు ప్రయత్నించాలి.

నిరుడు మద్రాసులో ఒకానొక సహకార సంఘము నుద్దేశిస్తూ, నూలు వడకడంద్వారా, ప్రపంచంలోని అన్ని సహకార సంఘములలోకీ విశాలతమమైన సహకార సంఘాన్ని స్థాపించేటందుకు ప్రయత్నిస్తున్నానని చెప్పి ఉన్నాను. ఇది వ్యర్థ ప్రతిజ్ఞకాదు. ఇదిచాలా గొప్ప కోరికకావచ్చును. కోట్లాది ప్రజలు నిజంగా దానికి సహ

కారం చేస్తేనేగాని వడుకు పని, తాను ఉద్దేశించిన కార్యాన్ని నిర్వహించజాలదు కనుక నేను చెప్పినది అసత్యంగాదు.

తప్పని సరిగా తటస్థించిన సోమరితనాన్నీ దానిద్వారా సంక్రమించిన దారిద్ర్యాన్నీ తొలగించడమే ఆశయం. ఈ ఆశయం ఉత్కృష్టమైనదనే సంగతి అందఱూ అంగీకరిస్తారు. దానిని పూర్తి చేసే ప్రయత్నంకూడా తగినంత గొప్పగా ఉండాలి.

ఇందులో తొలినుండీ సహకారం ఉండాలి. నూలు వడకడంవలన మనిషి స్వావలంబనుడైనప్పటికీ, అడుగడుకూ పరస్పరం ఆధారపడవలసిన అవసరంకూడా ఉన్నట్లు ఆయనకు గ్రహింపు కలిగిస్తుందది. మామూలుగా నూలు వడికే మనిషికి తనకుకాగా మిగిలిన నూలును తక్షణం కొనేదుకాణం కావాలి. వడికిన ఆమె బట్ట నేసుకోజాలదు చాలామంది ప్రజల సహకారం లేనిదే ఆమె వడికిన నూలు కొనేదుకాణం యేర్పడదు. వ్యవసాయం చేయడంలోనూ, పంటలను విక్రయించడంలోనూలక్షలాది ప్రజల సహకారం ప కొద్దిగానైనా ఉండడంవలన మాత్రమే మన వ్యవసాయం సాగుతూన్నది. అలాగే, అంత పెద్దఎత్తునా సహకారం ఉంటేనే నూలు వడకడంకూడా సాధ్యపడుతుంది.

ఒక ఆదర్శకేంద్రం తీసుకోండి. కేంద్రకార్యాలయంలో వడికేవారి కోసం పత్తి సేకరించబడుతుంది. కేంద్రకార్యాలయంలోని పత్తిలోనుండి గింజలుతీసి దూదిచేయబడుతుంది. అది ప కేవారికి పంచిపెట్టి పకులరూపంలో తిరిగీ కేంద్రకార్యాలయంవారు తీసుకొంటారు. వారీ పకులను వడికేవారికి పంచిపెడితే వారు వారం వారం నూలు వడికియిచ్చి, తమ మజూరీనీ కొత్తగా పకులనూ తీసుకొని పోతూంటారు. ఆ

విధంగా వచ్చిన నూలును, నేతవారికిచ్చి వారు నేసిన ఖద్ద రును కేంద్ర కార్యాలయం వారమ్మేటందుకు తీసుకొంటారు. ఈ ఖద్దరు కట్టుకొనేవారికి-అనగా ప్రజలకు అమ్మబడుతుంది. ఈ విధంగా కేంద్ర గార్యాలయం కులం, మతం, రంగు భేధాలతో నిమిత్తం లేకుండా అనేకమందితో నిరంతరం సజీవ సంబంధం కలిగిఉంటుంది. అంతేకాని ఆ కేంద్రం ఎవ్వరికీ లాభాలు పంచిఈయదు నిరుపేదలనుగూర్చి తప్ప మరెవ్వరిని గూర్చి ప్రత్యేక శ్రద్ధ వహించదు. ఆ కేంద్రం ఉపయోగకరంగా ఉండవలెనంటే అన్ని విధాలా పరి శుభ్రంగా ఉండాలి. దానికీ, ఆ విశాల నిర్మాణంలోని దాని ఉపాంగాలకూ ఉండే పరస్పర సంబంధం కేవలం ఆధ్యాత్మి కంగానూ నైతికంగానూ ఉండాలి. కాబట్టి ప్రతి వడుకు నూలు కేంద్రము ఒక సహకార సంఘం. పత్తిగింజలు తీసే వారు, ఏకేవారు, వడికేవారు, నేసేవారు, కొనేవారు-ఈ అందరూ కలిసి పరస్పర సుహృద్భావము, సేవ అనే బంధనం వలన బంధింపబడుతున్నారు. ఈ సంఘంలో వస్తూ పోతూ ఉన్న ప్రతి పైసా ఎలా వెచ్చింపబడుతూన్నదో దాదాపు నిశ్చ యంగా తెలుసుకోవచ్చును. హృదయాలలో దేశభక్తి అనే అగ్నికణం ప్రకాశవంతంగా ప్రజ్వరిల్లుతూన్నట్టిన్నీ, ఏ విధ మైన వ్యసనాలకూ లోనుగాక నిగ్రహంతో పవిత్రులైనట్టిన్నీ, యువకులను ఈ కేంద్రములభివృద్ధిపొంది ఆకర్షిస్తూన్న కొలదీ, వారే, ఆరోగ్య రక్షణ, ఆరోగ్యాభివృద్ధి, చిన్నచిన్న జబ్బులకు తగిన గృహవైద్యము, మొదలైన విషయాలలో గ్రామస్థులకు ప్రాథమికజ్ఞానమును కలిగించి వారి పిల్లలకు కావలసిన విద్యను వ్యాపింపచేసేటందుకు పైతం కేంద్రస్థానములు కాగలరు. వారలా కావలెనుకూడా. అయితే అందుకింకా సమయం రాలేదు. నిజానికి ప్రారంభం మాత్రమయింది.

అయితే ఆ ఉద్యమం క్రమక్రమంగా మాత్రమే అభివృద్ధి పొందగలదు. నేయివలెనో అంతకంటె ఎక్కువగా పోష్టు బిళ్లల వలెనో ఖాదీ, బజారులో అమ్మకమయ్యే స్థితికి వచ్చే టంతవరకూ మంచి ఫలితాలను చూపించడం సాధ్యంకాదు. తన తల్లి వండిన అన్నంలోని బాగోగులను, దాని ఖరీదునూ గమనించకుండా బిడ్డ తిని దానిని ప్రస్తుతిస్తుంది. అలాగే యింకే యితర బట్టనూకొనకుండా ఖాదీని మాత్రమే కొనేటట్లు ప్రజలను ఉద్బోధించడానికి ప్రస్తుతం చాలా శ్రమ చేయ వలసి ఉంటుంది. తల్లి వండిన అన్నానికి బిడ్డ విలువ కట్టినట్ల యితే, అందుకోసం ఆమె చూపిన ప్రేమా పడినశ్రమా ఎంతో ఖరీదయినట్లు తెలుస్తుంది. భారత మాత బిడ్డలు గాఢ నిద్రనుండి మేల్కొని, ఆమె కోమాళ్లు కోమార్తెలు చేతితో వడికిన నూలు, ఆమెయొక్క కోటానుకోట్ల బిడ్డలకు ప్రియంగా తోచదని తెలుసుకోగలిగినప్పుడు, ఖాదీకికూడా అటువంటి రోజొకటి తటస్థిస్తుంది. ఈ చిన్న సత్యం మనం తెలుసుకోగలిగినప్పుడు నూలు వడుకు కేంద్రాలింతకు నూరు రెట్లభివృద్ధి పొందినందున భారత కుటీరములందలి అంధకారం లోకి ఆశా జ్యోతి ప్రసరిస్తుంది. అదే మనం కోరుతూన్న ట్టియు, ఏ విధంగా పొందవలెనో తెలుసుకోజాలకున్నట్టియూ, స్వాతంత్ర్యమునకు నిశ్చయమైన పునాదిగా నుండగలదు.

యంగిండియా, 10-6-1926.

# 56

# కొన్ని చిక్కు విషయాలు

దూరంగానున్న బర్మానుండి ఒకానొక వైద్యమిత్రుడు ఇలా వ్రాస్తున్నాడు: 'ఖద్దరుమీదనే మీ రెందుకింత పట్టుదలగా ఉంటారు? స్వదేశీనిగూర్చి ఎందుకుండరు? స్వదేశీ అసలు సిద్ధాంతం, ఖద్దరు కేవలము అంతర్భాగము కదా?'

ఖద్దరొక అంతర్భాగంగా నేను భావించడంలేదు. స్వదేశీ అనేది ఒక సిద్ధాంత పరిభాష. ఖద్దరు, స్వదేశీలో ప్రముఖ స్థానము వహిస్తున్న వాస్తవికవిషయం ఖద్దరులేని స్వదేశీ, చక్కగా పాతిపెట్టడానికిగానీ తగులపెట్టడానికికానీ తగి ఉండి ప్రాణంలేని శరీరమువంటిది. ఖద్దరుమాత్రమే స్వదేశీ వస్త్రం. కోటానుకోట్ల దేశీయుల మాటలలోనూ, పరిభాషలోనూ స్వదేశీకి వ్యాఖ్యానం చేయవలెనంటే, మనం పీల్చే గాలివలెనే స్వదేశీలో అనల్పమైనది., వాస్తవమైనదీ ఖద్దరు. స్వదేశీ అనేపేరుతో వ్యవహరింపబడుతూన్న వస్తువుయొక్క సార్వజనీనోపయోగమునుబట్టికాదు స్వదేశీని పరీక్షించవలసింది. దాని ఉత్పత్తిలోనూ లేక నిర్మాణంలోనూ సర్వజనులూ పాల్గొనడాన్నిబట్టి దానిని పరీక్షించవలెను. కాబట్టి మిల్లు బట్టను స్వదేశీ అని కొంతవరకే వ్యవహరించవచ్చును. ఎందువల్లనంటే దాని నిర్మాణమునందు ఇండియాలోని కోటానుకోట్ల ప్రజలలో అత్యల్పభాగంమాత్రమే పాల్గొంటున్నారు. ఖద్దరు నిర్మాణమునందు కోట్లకొలది ప్రజలు పాల్గొనవచ్చును. ఎంత ఎక్కువమంది పాల్గొంటే అంత ఆనందంఉంది. కోటానుకోట్ల ప్రజలక్షేమం ఖద్దరుతో సంబంధించి ఉన్నదని నా అభిప్రాయం. కాబట్టి స్వదేశీలో, ఖద్దరు అత్యధి

కాంశం. స్వదేశీకి అదే నిజమైన తార్కాణం. తక్కినదంతా దాని ననుసరించి ఉంటుంది. ఇండియాలో తయారుచేయ బడిన ఇత్తడి గుండీలు, పల్లుకుట్టు పుల్లలు లేకపోయినప్పటికీ ఇండియా జీవించగలదు. ఖద్దరును ఉత్పత్తి చేసుకొని ధరించకపోయినట్లయితే ఇండియా జీవించలేదు. ఇండియాలోని కోటానుకోట్ల ప్రజల తీరిక కాలంలో చేయవీలై, ఎక్కువ లాభకరమగు వృత్తి యేదైనా కనిపెట్టబడ్డప్పుడు ఖద్దరుకి విశిష్టమైన ప్రాముఖ్యత పోతుంది.

అయితే డాక్టరు 'మంచి ఖద్దరు చాలా ఖరీదనీ సామాన్య ఖద్దరు అసహ్యంగా వుంటుందనీ' అంటున్నారు.

ఏ ఖద్దరూ అసహ్యంగా ఉంటుందని నేనొప్పుకోను. యంత్రంమీద తయారైన మృతసమాన వస్తువువలె ఉండక పోవడం అసహ్యతకు గుర్తుకాదు. అది జీవానికి గుర్తు. ఒక చెట్టులోని లక్షలాది ఆకులు సమంగా వుండకపోవడం దాని అసహ్యతకు గుర్తుకాదు. నిజానికి చెట్టు ఆకులలోని భిన్నత్వమే చెట్టుకు సజీవ సౌందర్యం కలిగిస్తుంది. ప్రతి ఆకూ సరిగా సమానంగా ఉండేటట్లు యంత్రంతో తయారైన చెట్టును నేను చిత్రించగలను. అది భయంకరంగా కనిపిస్తుంది. ఎందువల్లననగా మనమింకా సజీవవృక్షాన్ని ప్రేమించడం మానుకోలేదు. మనం వెచ్చించిన ప్రతి అణా క్షుత్పీడితులైన లక్షలాది ప్రజల జేబులలో పడుతూన్నప్పుడు, మంచి ఖద్దరైనా చెడ్డఖద్దరైనా, దాని ఖరీదునుగూర్చి మన మెందుకు దిగులుపడాలి? ఖద్దరు కలవాటుపడిన వారిలో అధిక సంఖ్యాకులు, దుస్తులనుగూర్చివారి అభిరుచిని మార్చు కొన్నారని నా అనుభవంవలన నాకు తెలుసును. ఒకే మోస్తరునాణ్యం, ఒకే కొలతగల మాంచెస్టరు బట్టకంటె

ఖద్దరు ప్రియమైనప్పటికీ, ఎక్కువగా బట్టలను కొనడం మాని నందున. అదనపు ఖర్చును తగ్గించుకోవచ్చును. సన్నని ఖద్దరు కావలెనని కోరేవారు అన్ని ప్రముఖ ఖాదీ కేంద్రములలోనూ దానిని పొందగలరు.

ఈ డాక్టరు మిత్రుడు వడకడంలోని ఔచిత్యాన్నికూడా శంకిస్తూ, ప్రతి మనిషీ వడికినట్లయితే, జీవనంకోసం వడకు వృత్తిపైన ఆధారపడిఉన్న నిరుపేదలు నష్టం పొందుతారని కూడా గంభీరంగా సూచిస్తున్నాడు. త్యాగబుద్ధితో వడకవలెనని కోరబడ్డవారు, ఖద్దరు వాతావరణాన్ని పెంపొందించి, వడుకుపని ఇంకా తేలికకావడానికి సావకాశాలను కల్పించి నూతనావిష్కరణములవలనను, నూతన కల్పనలవలనను దానినెక్కువ లాభప్రదం కావిస్తూన్నవిషయం మీడాక్టరు మిత్రుడు విస్మరిస్తున్నాడు. త్యాగబుద్ధితో వడకడంవలన వృత్తిగా వడికేవారి మజూరీ యేవిధంగా నూ తగ్గిపోదు.

ఇంకా మఱొకస్నేహితుడిలా అడుగుతున్నాడు. 'డాక్టర్లు విదేశీ ఔషధాలను, నిర్దేశించడ మాని, ఆయుర్వేదౌషధాలను యునానీ ఔషధాలనూ నిర్దేశించవలెనా?'

ఊహించతగిన ప్రతి పరిస్థితిలోనూ, విదేశీఅయినది ప్రతిదీ విడిచిపెట్టడం స్వదేశీలో భాగంగా నేనెన్నడూ తలపెట్ట లేదు. కుటీర పరిశ్రమల రక్షణకు, మఱీ ముఖ్యంగా, యే కుటీర పరిశ్రమలు లేనందున ఇండియా దారిద్ర్యస్థితికి వస్తుందో వాటిరక్షణ కవసరమైనంతవరకు విదేశీవస్తువులను విడిచిపెట్టి, కుటీరములలో తయారైన వస్తువులనుమాత్రమే వాడవలెనని స్వదేశీనిగూర్చి నే నీయగలిగిన విశాలమైన వ్యాఖ్యానం. కాబట్టి, విదేశీ అయినంతమాత్రాన, అదియెంత లాభకరమైన దైనప్పటికీ, దానివలన యెవ్వరూ దరిద్రులు కాకపోయినప్పటికీ,

ప్రతి విదేశీవస్తువునూ విడిచివేయవలెననడం, స్వదేశీకి సంకుచితార్థమని నా అభిప్రాయం. కాబట్టి ఎక్కువ ఉప యోగకరమ్మైలై యేవిధంగానూ అభ్యంతరములు గాని విదేశీ ఔషధాలను వాడడానికి నేనెంతమాత్రమూ సందేహించను. అయితే పాశ్చాత్యయోగ్యతా పత్రములుగల వైద్యులలో చాలామందికి నిజంగా మంచిశక్తివంతమ్మైలై చౌకగా లభించే ఆయుర్వేదయునానీ ఔషధాలను తృణీకరించడమొక అపాయ కరమైన ఆచారమైపోయింది. కనుక పాశ్చాత్యవైద్య శాస్త్రం లో శిక్షణపొందినవారు, ఆయుర్వేద, యునానీ వైద్యవిధాన ములలోని అవకాశాలను గూర్చి అన్వేషించేటందు కేదైన ఉద్యమం ప్రారంభించడం అత్యంత వాంఛనీయముగా ఆద రింపబడుతుంది.

ఈ మిత్రుడు చిట్టచివరి కడిగిన ప్రశ్న కీపుటలలో అనేక పర్యాయములు ప్రత్యుత్తర మీయబడినది. 'మీరు యంత్రా లన్నిటికీ ప్రతికూలమా?' 'కాదు' అని నేను గట్టిగా జవాబు చెపుతున్నాను. కాని అవిచక్షణగా యంత్రాల నభివృద్ధిచేసే విషయానికి నేను ప్రతికూలుడను. యంత్రాల విజయప్రభ లకు నేను దిగ్భ్రమచెంది ఊరుకోను. వినాశకరమ్మైలైన యంత్రాలన్నిటికీ నేను లొంగుబాటెరుగని శత్రువును. కాని చిన్నచిన్న పనిముట్లను, పరికరాలను, కుటీరాలలోని లక్షలాది ప్రజల శ్రమను తగ్గించి వ్యక్తులకష్టం కలిసివచ్చేటట్లుచేసే యంత్రాలను నేనాదరిస్తాను.

యంగిండియా, 17-6-1926

# 57

# విశ్వకుటీర పరిశ్రమ

బెంగాల్ సివిల్ సర్వీసు ఉద్యోగి బాబూ విజయ విరీహారీ ముఖర్జి వంగరాష్ట్ర కుటీర పరిశ్రమనుగూర్చి ఒక కర పత్రమును ప్రకటించారు. దానికి కలకత్తా విశ్వవిద్యాలయపు పీరేశ్వర్ మిత్తర్ సువర్ణపతకం బహూకరింపబడినది. బాబూ విజయవిహారి నిర్ణయాలు దృఢంగా వుండకపోయినప్పటికీ, అందులోని విషయాలుమాత్రం దేశక్షేమము నభిలషించే ప్రతివారూ ఆలోచించతగినవిగా ఉన్నవి. వంగరాష్ట్రం విషయంలో యేది నిజమో దాదాపు యావద్భారతదేశం విషయంలోకూడా అదే నిజం కావడంచేత వాటికి ఇంకా ఎక్కువ ప్రాముఖ్యత వచ్చింది.

“1921 జనాభా లెక్కలప్రకారం, బెంగాలులోని ప్రతి వేయిమంది జనులకూ 68 మంది మాత్రమే పట్టణాలలో నివసిస్తున్నారు. కలకత్తాకున్నూ, ప్రధానమైన హౌరా, 24 పరగణాలు, హుగ్లీ జిల్లాలకు వెలుపలనూ మూడు పట్టణములు మాత్రం 30,000 జనాభా కలవి ఉన్నవి. కాబట్టి బెంగాలునందలి బ్రిటిష్ రాజ్యంలోని 46,695,536 జనసంఖ్యలో 13 లక్షలకు షుమారు మించీమించకుండా పట్టణాలలో నివసించే వారనీ తక్కిన వారిలో ఎక్కువ మంది గ్రామాలలో నివసించేవారనీ అనుకోవడం నిర్హేతుకం కాజాలదు.

కాబట్టి ఈ విలేఖకుడు సహజంగా యిలా వాదిస్తున్నాడు:—

“ గ్రామాన్ని అభివృద్ధిచేసి, ఏకొంచెమయినా సరిపోయే ఈ దేశంలో కూడా గ్రామస్థుల ముఖ్యావ[illegible] కావలసింది వారికి చేకూర్చడము, రాజ్యాంగ నిర్మాణంలో గ్రామమునొక సజీవ భాగంగా సంస్థాపించడమూ, దేశం నిర్వహించవలసిన ప్రధాన సమస్యలు. స్వపరిపాలనమునకు ముందు మనకు స్వగృహముండవలెనని ఐర్లండు నుద్దేశించి సర్ హొరేస్ ప్లంకెట్టు పలికిన పలుకులు ఆ దేశం విషయంలో ఎంత నిజమో బెంగాలు విషయంలోకూడా అంత నిజము. గ్రామ కుటీర పునర్నిర్మాణ ప్రయత్నముల అత్యంత ప్రాముఖ్యావశ్యకతను గ్రహించవలెనంటే, ప్రభుత్వ విధానము వలన కలిగే ఫలితమును, దానిని మార్చవలసిన అవసరమును గుర్తించక తప్పదు. పునర్నిర్మాణ కార్య ప్రణాళికలో కుటీర పరిశ్రమ సహాయకారి కావడమేకాక అత్యంతావసరం కూడా అవుతూన్నది. ”

ఇండియా అచిరకాలంకిందటనే ఒకప్పుడు ఆనందంగానూ ఐశ్వర్యవంతంగానూ ఉన్నదని, గ్రంథకర్త తేలికగా చూపగలిగినాడు. ఆయన ఎలిఫిన్‌స్టన్ వ్రాసినదానినిలా ఉదాహరిస్తున్నాడు. “ గ్రీకులు దర్శించిన ఇండియాలోని భాగాలనుగూర్చిన వర్ణనఅంతా, దేశంజనాకీర్ణమై అత్యుత్కృష్టమైన ఐశ్వర్యంతో ఆనందిస్తూన్నట్లు అభిప్రాయం కలిగిస్తూన్నది. ” ఆ ఐశ్వర్యం ముఖ్యంగా నూలువడకడం బట్టలనేయడమనే ఒకేఒకవృత్తివలన కలిగినదనికూడా ఆయన తేలికగా నిరూపించాడు. కాని ఈ నాడు చేతితో నూలువడికే పనిని పునరుజ్జీవింపచేయడం అవసరం. నేతపనికూడా ఒక ముఖ్యమైన కుటీర పరిశ్రమ అయినప్పటికీ దానంత శ్రద్ధవహించనవసరంలేదు.

ఈనాడు గమనించదగిన ఐశ్వర్యం లేదు. జనసంఖ్యలో ముప్పాతిక వంతు కేవలం వ్యవసాయంమీద ఆధారపడి ఉన్నారు. ఢాకా, ఫరీదుపురములలో వ్యవసాయోచిత

భూములలో నూటికి 92 వంతులున్నూ, మిడ్నపూరు భూములలో నూటికి 74 వంతులునూ వ్యవసాయం చేయబడుతూన్నది. వ్యవసాయంచేసేజనులలో ప్రతి ఒకరూరు సగటున ఈ మూడు జిల్లాలలో క్రమంగా 82, 83, 84, ఎకరాలు వ్యవసాయం చేస్తున్నారు. కాబట్టి అదనపు వ్యవసాయానికి చాలా తక్కువ అవకాశమున్నది. కేవలం వ్యవసాయం మీదనే జీవించే రైతులెవ్వరూ ఒకఎకరానికి తక్కువ భూమిలో జీవించేటందుకవకాశం లేదు. ఇక్కడ ఈయబడిన సగటులెక్క నిజమైన సగటులెక్కకు చాలా తక్కువ ఉంటుంది. ఎందువల్లననగా భాగ్యవంతులైన జమీందారుల విశాల భూఖండములను కూడా కలిపి ఈ లెక్క కట్టబడినది, 'కాబట్టి, అత్యున్నత ప్రభుత్వోద్యోగులలో నొకరు, ఈదేశంలో సగంమంది రోజుకు రెండు పూటలా భోజనంచేయడమంటే ఏమో ఎరుగనివారున్నారని ప్రకటించాడంటే ఆశ్చర్యంలేదు.

ఈ క్లిష్ట పరిస్థితినిగూర్చి 1877-78 నాటికే క్షామనివారణ సంఘం వారి కిందివిధంగా వివరించిఉన్నారు. 'ఇండియాలోని అధిక సంఖ్యాక ప్రజలు ప్రత్యక్షంగా వ్యవసాయంపైన ఆధారపడి ఉండడము, ప్రజలలో చెప్పుకోతగినంత మందికి సహాయకారిగా ఉండతగిన మరొకవృత్తి లేకపోవడము, భారతదేశపు కఱవుల వలని కలిగే వినాశకర ఫలితాలకు ప్రధాన కారణంగానూ వాటి నివారణోపాయములకు ప్రముఖ నిరోధకంగానూ పరిణమిస్తూన్నది. మామూలుగా కురిసే వర్షాలు కురియకపోవడం వలన, కూలి జనాని కందుబాటైన ఖరీదులలో పొందగలిగిన ఆహార పదార్థాలు వారికి లభించకపోవడమేగాక, వానిని సేకరించుకొనే సాధనాలను సంపాదించుకోవడానికి వీలైన 'ప్రత్యేక

వృత్తి'ని కూడా వారు పోగొట్టుకుంటున్నారు. 'ఋతు పరివర్తనముంకు లోనుగాని వ్యవసాయేతర పరిశ్రమల అభివృద్ధివలనమాత్రమే ఈ పరిస్థితి సంపూర్ణంగా చక్కబడగల ద'ని క్షామ నివారణో పసంఘంవారు నిర్ణయిస్తున్నారు. కర్షకులలో అధిక సంఖ్యాకులకు సంవత్సరంలో నాలుగు నెలలు మాత్రమే పని ఉంటుందనికూడా ఆ గ్రంథకర్త నిరూపిస్తున్నాడు. 'గుమాస్తాలు, ఉద్యోగస్థులు, లాయర్లు డాక్టర్లు, రాజకీయవేత్తలు, ఉపాధ్యాయులు—ఆంగ్ల విద్యావంతులమని అనుకొనే వీరందరూ జనాభాలో నూటికొకవంతుకూడా ఉండరు.' -ఈ గ్రంథకర్త తన నిర్ణయాలలో దుర్బలుడుగా నున్నాడని నే నన్నాను. ఆయన సాధ్యమైనంతవరకు అన్ని కుటీర పరిశ్రమలను పోగుచేయడంలోనే ఆ దౌర్బల్యం వచ్చిందని నా అభిప్రాయం. కంఠస్థం చేసేటందుకది బాగానేవుంది. తక్షణ పరిష్కారం కావలసిన సమస్య అంతమాత్రంతో.పరిష్కారంకాదు. జనాభాలో అత్యధిక భాగమునకు, గ్రామాలలోని శ్రమజీవులకూకూడా పరిశ్రమల ప్రదర్శనశాల కేవలం విభ్రమం కలిగిస్తుంది. వారికి అందరూ అవలంబించతగిన ఒకే ఒక పరిశ్రమఉండాలి. ఒక్కొక్కదాన్ని మినహాయించుకుంటూవస్తే, లక్షలాది ప్రజలకు సార్వజనీనంగా ఉండే పరిశ్రమ నూలువడకడం తప్ప మరొకటి లేదనే నిర్ణయానికి తప్పనిసరిగా ఎవరైనా వచ్చితీరాలి. అంతమాత్రంతో తదితర పరిశ్రమలు పరిగణింపతగినవికావని కానీ, నిరుపయోగములనికానీ అర్థంకాదు. వ్యక్తిగత దృక్పథమునుండి విచారించేయెడల, నూలువడకడంకంటె యే యితర పరిశ్రమయైనా చాలా లాభదాయకంగా ఉంటుంది. గడియారాలు చేయుడం నిస్సందేహంగా మంచి ఆకర్షవంతమూ లాభ

ప్రదమూ అయిన వృత్తి. అయితే ఎంతమంది అందులో పనిచేయగలరు? లక్షలాది ప్రజలకది యేమైనా ఉపయోగ ముంటుందా? అయితే గ్రామస్థులు తమకుటీరములను పునర్నిర్మించుకోగలిగి తిరిగీ తమ పూర్వులు జీవించిన రీతిగా జీవించ పూనుకొన్నయెడలనూ వారి తీరిక కాలాన్ని వారు సద్వినియోగం చేసుకో ప్రారంభించినయెడలనూ, తదితర పరిశ్రమలన్నీ వాటంతటనే పునరుద్ధరింపబడగలవు. ఆకలితో బకటాచికిటాన మనుష్యులముందనేక విధములైన అవకాశములనుంచి వాటిలో యిష్టమైనవాటిని వారు నిర్ణయించుకోగలరనుకోవడం వలనప్రయోజనంలేదు. వాటినేమి చేయాలో వారికి తెలియదు. బహుశా వారు అత్యంతా కర్షవంతమైన వాటికోసం పరుగెత్తి, ఆ ప్రయత్నంలో నాశనంకాగలరు. ఆకలితో బకటాచికిటాన ప్రజలకు రేవను పంచిపెడుతూన్న సమయంలో నాజీవితంలో ఒకప్పుడు దాదాపు నేను ప్రహరించబడ్డట్లు నాకు జ్ఞాపకంఉంది. నాకు పంచిపెట్టేటందుకీయబడిన సామగ్రిని పంచిపెట్టేముందు, కటకటాలలో కూర్చొని నన్నూ, ఆ సామాగ్రినీ కూడా కాపాడుకోవలసివచ్చింది. తరగతులవారీగా విభజింపబడని పరిశ్రమల జాబితాలోనుండి ప్రజలను నిర్ణయించుకోమని చెప్పినందున యేమీ పని జరుగదు. అందఱూ అవలంబించడానికి వీలైన పరిశ్రమ ఒకటేనని మనం తెలుసుకోవలసి ఉంది. అందఱూ దానిని చేపట్టక పోవచ్చును. తదితర పరిశ్రమలలో దేనినైన అవలంబించవలెనని కోరికగలవారు తప్పకుండా అలాచేయవచ్చును. కాని ప్రస్తుతం అందఱూ అవలంబింపవీలైనట్టిన్నీ, దానికి తోడుగా అధిక సంఖ్యాకులు మరొకవృత్తిని చేపట్టేటందుకు వీలులేనట్టిన్నీ ఒకేఒక వృత్తి యైన నూలువడుకు వృత్తి మీదనే జాతీయ

సాధన సంపత్తి కేంద్రీకరింపబడవలెను. జాతియొక్క దృష్టి దాని పునరుద్ధరణకు మరల్చబడినప్పుడు, ఖద్దరుకొనే వారికోసం మనం వెతుకోనక్కర లేదు. నేడు ఖద్దరు ప్రచారం కోసంవెచ్చింపబడుతూన్న శక్తీ ద్రవ్యమూ, రేపు ఎక్కువగా దాని ఉత్పత్తికీ అభివృద్ధికీ వినియోగింపబడగలవు. జాతియొక్క అలసత్వం వలన ఖద్దరుకుగల అవకాశాలను గూర్చి మనకు తెలియడం లేదు. ఆ కారణంగా ఈ జాతీయమహోద్యమములో మనశక్తి స్తంభించిపోతూన్నది. పునరుద్ధరింపబడవలసిన పరిశ్రమలలో నూలువడకడం ఒకటి అని చెప్పినంత మాత్రంతో సరిపోదు. మన గ్రామ కుటీరాలను పునస్థాపనం చేసుకోవలెనంటే, మన దృష్టిని ఆకర్షించవలసిన ముఖ్య పరిశ్రమ అదేనని నొక్కి వక్కాణించడం అవసరం.

యంగిండియా, 30-6-1926.

# 58

# మళ్ళీ మామూలు వాదమే

మనమే యే కష్టాల వలన బాధపడుతూన్నామో వాటిని పూసగుచ్చినట్లు చెప్పి, వ్యవసాయంలో చేయవలసిన అభివృద్ధులను గూర్చి చర్చించిన పిమ్మట ఒకానొక విలేఖకుడిలా వ్రాస్తున్నాడు :

"మనం వెనుక నిలబడి ఆధునిక సభ్యత ఒక వ్యాధి అని చెప్పనందున ఈ మార్పులన్నీ జరుగ చాలవు. మనం ధైర్యంగా ఆ వ్యాధిని ఎదుర్కొని, దాని మూలంగా పేరుకొన్న చెడుగులను నిర్మూలించేటందుకొక చికిత్సను కనిపెట్టాలి. ఈ ఆధునిక సభ్యత లేక సైతాన్ సభ్యత నుండి బయట పడజాలని ఒకానొక పరిస్థితికి మనం వచ్చాము. పరస్పర సంబంధములు కలిగించుకొనేటందుకు సౌకర్యాలు కల రోజులలో, యే దేశమూ కూడా ఇతర దేశాలతో నిమిత్తం లేకుండా ఒంటరిగా ఉండచాలదు. ఆర్థిక, సాంఘిక, ధార్మిక, రాజకీయ విషయాలలో, పాశ్చాత్య ప్రభావములు మన సంఘంయొక్క పునాదులనే చలింపచేస్తూన్నవి. ఈ పోరాటంలో అవివేకములు, మూఢవిశ్వాస పూరితములు, అశ్రద్ధానములు అయిన వన్నీ నశించి వాస్తవికములు, ప్రాముఖ్యములు అయిన వస్తుజాలం మాత్రమే నిలబడగలదు. మన ఎడ్లబండ్లతోనూ, ప్రమిద దీపాలతోనూ, మనమిక సంతృప్తిపడి ఉండజాలము. పొగయోడ, రైల్వేలు, మోటారు కార్లు, అచ్చు యంత్రాలనూ ప్రజా స్వామ్యము, విశ్వప్రేమ, ప్రపంచ మానవ సోదరత్వము మొదలగు అభిప్రాయాలనూ మనము తప్పించుకో లేము. ప్రాచ్యదేశాలలో జపాన్, అంతశక్తివంతమైన దేశం అవుతుందని ఎవ్వరూ అనుకోలేదు. ఆధునిక ఉత్పత్తి విధానాలను చేపట్టకుండా త్రోసి వేసి ఉన్నయెడల, ఇతర దేశాల సానుభూతికోసం యాచిస్తూ, చైనా ఇప్పుడే స్థితిలో ఉన్నదో జపాన్ కూడా సరిగా అదే స్థితిలో ఉండేది. ఇండియాయొక్క సముచితాభివృద్ధి మన ఆశయంగా ఉండాలి. ఇది ఇంద్రజాలం వల్ల జరిగే పనికాదు. మనకింకా ఎక్కువ ఆదాయం రావాలి. జాతీయాదాయం విషాదకరమైన హీనస్థితిలోకి వచ్చింది. ఏడాదికి మనిషికి 50 పౌనులాదాయానికి తక్కువ ఉన్నట్లయితే సము

చిత సభ్య జీవితమును గడిపేటందుకు సాధ్యంకాదని ఆంగ్ల ఆర్థికవేత్తలా పాధిస్తున్నారు. అయితే యిక ఇండియా సంగతి ఏమిటి? పరాయి దేశాల పోటీని తట్టుకోగలిగిన పరిశ్రమలను ప్రారంభిస్తేనే తప్ప జాతీయై శ్వర్యమును పెంపొందించడం సాధ్యపడుతుందా? ఇండియా విదేశాల మధ్య జరిగే వ్యాపారం ఇండియాకు లాభదాయకంగా ఉన్నప్పుడే. ఇండియాలోని వ్యవసాయకునకు, ఆరోగ్య రక్షణ, విద్య, సభ్యత, మొద లైన వాటినిగూర్చి ఆలోచించేటందుకు వీలుకలుగుతుంది. ఇండియా ఇంతవరకూ పూర్వుల కనుగుణంగా ప్రవర్తించి ఉండడం చేతనే జీవించి ఉండగలుగుతూన్నది. ఇప్పుడు యంత్రాలను ప్రవేశపెట్టించి పెద్ద ఎత్తున ఉత్పత్తి సాగిస్తేనేగాని ఈ పనిజరుగదు.''

ఇది పాత వాదమే. కాని పునరుద్ఘాటింపబడినది. ఇండి యాను, ఇంగ్లాండు అమెరికాలవలె చేయడమంటే ప్రపం చములో ఇంకా కొన్ని జాతులను ప్రదేశాలను, స్వార్థోప యోగంకొఱకు అన్వేషించుకోవడమనే సంగతి మన విలే ఖకుడు విస్మరిస్తున్నాడు. ఇంతవరకు ఐరోపా ఖండమునకు వెలుపల గానుండి మనకు తెలిసిన జాతులన్నిటినీ పాశ్చాత్య దేశాలవారు స్వార్థం కొఱకు తమలో తాము పంచుకొన్నట్లు కనిపిస్తున్నది. కొత్తగా కనిపెట్టడానికి నూతన ప్రపంచాలు లేవు. స్వార్థంకోసం వినియోగింపబడుతూన్న దేశాలలో ఇండియా అధికతమంగా పీడింపబడుతున్న దేశం. ఈ దోపిడ్డిలో జపానుకు కూడా భాగమున్నమాట వాస్తవం. అయితే ఇండియా చైనా లీ స్వార్థాలకు వినియోగ పడకూడ దని నిర్ణయించుకొన్నప్పుడీ స్వార్థపరుల గతి యేమవుతుంది! అప్పుడు పాశ్చాత్య దేశాలూ జపానూ కూడా విషాద పరి స్థితులలో పడవలసిందేగదా! ఇక పాశ్చాత్య దేశాల నను కరింప ప్రయత్నించే ఇండియాగతి యేమవుతుంది? పాశ్చాత్య దేశాలలో నిజంగా అవి అరుపుకోలేనంత పారిశ్రామిక తత్వము స్వార్థపరత్వమూ వ్యాపించియున్నవి. ఆ రోగంతో బాధపడుతూన్నవారే దాని చెడుగులకు చికిత్స కనిపెట్టజాలక

పోయినప్పుడా విషయంలో కేవలం కొత్తవారమైన మన మెలా వాటినుండి తప్పించుకోగలము? నిజానికి పారిశ్రామిక సభ్యత యావత్తూ కీడుచేసేదే గనుక అది ఒక జాడ్యం. మనం కేవలం పెద్ద పెద్ద మాటలతో మోసపోకూడదు. పొగ యోడలతోను టెలిగ్రాఫులతోనూ నాకేమీ తగాదా లేదు. పారిశ్రామిక తత్వంయొక్కగానీ, దానివలన స్ఫురించే యే యితర విధానముయొక్కగానీ సహాయం లేకుండా అవి నిలబడే యెడల నిలబడవచ్చును. మానవజాతియొక్క శాశ్వత శ్రేయస్సుకవి యేవిధంగానూ ముఖ్యావసరములు కావు. మనకు ఆవిరిని విద్యుత్తునూ వినియోగించుకోవడం తెలుసును పారిశ్రామిక విధానమునుండి తప్పించుకోవడం నేర్చుకొన్న తరువాత, తగిన సమయాలలో వాటిని ఉపయోగించుకో గలిగి ఉండాలి. కాబట్టి పారిశ్రామిక విధానాన్ని ఎలాగైనా సరే విధ్వంసం చేయడమే మన పని.

ఈ విలేఖకుడా విషయాన్నిగూర్చి ముందుతాను తెలుసుకోకుండానే చికిత్సను సూచించాడు. ఇతర దేశాలు నాశనమైనప్పటికీ, మార్పుల కనుగుణంగా నడుచుకొంటూండడం వలన, ఇండియా యింతవరకూ జీవించి ఉన్నదని ఆయనే ఒప్పుకొంటున్నాడు. అనుగుణంగా ఉండడమంటే అనుకరణం కాదు. నిగ్రహశక్తి, ఇముడ్చుకో గలిగిన శక్తీకలిగి ఉండడం. ఇండియా యితర సభ్యతల దండయాత్రలను తట్టుకోగలగడానికి కారణం దాని పునాదులపైన అది గట్టిగా నిలబడిఉండడమే. అనగా అది యేమీ మార్పులు చేసుకోలేదని కాదు. అది చేసుకొన్న మార్పులు దాని పెంపుదలకు కారణభూతములైనవి. పారిశ్రామిక విధానమునకది మారడం వినాశనాన్ని కోరితెచ్చుకోవడం. ప్రస్తుత దుస్థితి భరింపరానిదన్నమాట నిశ్చయమే. దరిద్రం పోవలసిందే. కాని

పారిశ్రామిక విధానం చికిత్స కాదు. ఎడ్లబండ్ల నుపయోగించడంలో కీడు లేదు. మన స్వార్థపరత్వంలో, మన యిరుగు పొరుగువారిని గూర్చి ఆలోచించక పోవడంలో కీడుఉంది. మన ఇరుగు పొరుగువారి మీద మనకు ప్రేమ లేక పోయినట్లయితే, యెటువంటి విప్లవకరమైన మార్పయినా మనకేమీ మేలుచేయదు. మన ఇరుగుపొరుగువారిని అనగా ఇండియాలో నిరుపేదలను మనం ప్రేమిస్తున్నట్లయితే వారు మన కోసం చేస్తున్న వస్తువులను వారి క్షేమంకోసం మనం వినియోగించుకొంటాము. సున్నితమ్ములైన విదేశీ వస్త్రములను కొని గ్రామాలకు తీసుకొనిపోవడమనే అవినీతికర వ్యాపారంలో పాశ్చాత్యదేశాలతో మనం సంబంధం కలిగించుకో కూడదని వారి క్షేమం కోసం తెలుసుకోవాలి.

మనం తీవ్రంగానూ శ్రద్ధగానూ ఆలోచించినట్లయితే, యితర మార్పులుచేసే ముందు, విదేశీ వస్త్రాలను విడచి, పురాతన కుటీర పరిశ్రమయైన నూలువడుకు వృత్తిని పునరుద్ధరించడమనే పెద్ద మార్పును కావించవలసిఉందని తెలుసుకోగలము. కాబట్టి పారిశ్రామిక విధానాన్ని నిరోధించవలెనంటే, మన నైతికౌన్నత్యానికి దోహదంచేసే పురాతన పరిశ్రమను పునరుద్ధరించవలెను.

పెట్టుబడి విధానమంటే నాకేమీ మొగమోటం లేదు. నేను దానిని యెదుర్కొంటాను. పెట్టుబడి ఒకేచోట పేరుకొని పోకుండా చూడవలెననీ తీవ్రతరమైన రూపంలో జాతులమధ్య మరొక యుద్ధం రాకుండా తప్పించుకోవలెననీ పాశ్చాత్య దేశాలు బోధిస్తున్నవి. పెట్టుబడిదారులు, కార్మికులూ పరస్పర విరోధులుగా నుండనక్కర లేదు. ఒక మనిషి కంటె మరొక మనిషి యెక్కువ ఐశ్వర్యవంతుడుగా నుండ

పీలులేని కాలాన్ని నాలో నేను చిత్రించుకో లేకుండా ఉన్నాను. కాని పేదలకు నష్టదాయకంగా భాగ్యవంతులింకా భాగ్యవంతులు కావడాని కిష్టపడని కాలమునూ, భాగ్యవంతులను చూచి పేద లసూయపడని కాలమునూ నాలో నేను చిత్రించుకోగలను. అత్యంత ఆదర్శ ప్రపంచంలో కూడా అసమానత్వం ఉండక తప్పదు. అయితే పోరాటము, కాఠిన్యమూ లేకుండా తప్పుకోగలము. తప్పుకోవలెనుకూడా. కలవారూ లేనివారూ కలసి మెలసి జీవిస్తూన్న తారాకాణాలనేకం యిప్పటికీ కలవు. అట్టి తారాకాణాలను మనమింకా యెక్కువ చేయాలి.

ఇండియాయొక్క భవితవ్యము, పాశ్చాత్యుల రక్తపాత విధానంలో లేదు. వారుకూడా దానిని గూర్చి విసిగి వేసారినట్లు చిహ్నాలు కనిపిస్తూన్నవి. నిరాడంబరమై, భక్తిపూరితమైన జీవితము నుండి వెలువడే రక్తపాత విహీనమైన శాంతి మార్గంలోనే దాని భవితవ్యం ఉన్నది. ఇండియా తన ఆత్మను నశింప చేసుకొనే స్థితిలో ఉన్నది. దానిని పోగొట్టుకొని అది జీవించలేదు. కాబట్టి అది 'పాశ్చాత్య దేశాల దండయాత్రను నేను తప్పించుకోజాలనని' అలసత్వంతో చేతులు ముడుచుకొని చెప్పరాదు. తన క్షేమంకోసమూ ప్రపంచ క్షేమము కోసమూకూడా దానిని నిరోధించేటందుకు తగినంత బలంగా అది ఉండాలి.

యంగిండియా, 7-10-1926

# 59

# చేమగ్గము, రాటము

ఇండియా జనాభాలో నూటికి 71 మందిని మించి వ్యవసాయకులనీ, వారిలో అత్యధిక సంఖ్యాకులు సంవత్సరంలో దాదాపు ఆరు నెలలు పని లేకుండా ఉంటూన్నారనీ, వారికొక ఉపవృత్తి అవసరమనీ, ఆ ఉపవృత్తి సార్వజనీనంగా ఉండవలె నంటే ఎక్కువ లాభదాయకమూ ఎక్కువ ఉత్తమమూ అయిన నూలువడికే వృత్తి మాత్రమేననీ, నేడు సాధారణంగా గుర్తింపబడవలసినట్లు కనిపిస్తున్నది.

ఇక ఈ వాదమును కొంచెం వివరంగా ఆలోచిద్దాం. చేతితో నూలు వడకడంవలన రోజు కొక అణా సంపాదించ గలిగిన యెడల, చేనేతవలన ఎనిమిదణాలు సంపాదించవచ్చునని ప్రతీతి. కాబట్టి ఒక మనిషి రోజుకు రెండు గంటలు పని చేస్తే చేనేతవలన రెండణాలున్నూ, నూలువడకడం వలన ఒక కానీయున్నూ అదే కాలంలో సంపాదించగలుగుతున్నాడు. అయితే ఒక కానీ అంటే ఎవ్వరికీ ఆకర్షవంతంగా ఉండదు. కనుక చేనేతపని కల్పించబడడానికి వీలుండగా, దానికి బదులు నూలువడికే పని చేయవలెనని ప్రోత్సహించడం తప్పు అని మరొక వాదం ఉంది. చేమగ్గమును సమర్థించే వారు, ఇండియాకు కావలసినంత మిల్లునూలును సంపాదించుకోవడం కష్టంకాదనీ, ఇంతవరకూ బట్టలమిల్లుల పోటీని లెక్కపెట్టని చేనేత పరిశ్రమను బ్రతికించేటందుకైనా దానిని కృతనిశ్చయంతో, ఉత్సాహంగా కొనసాగించవలసి ఉందనీ వాదిస్తారు. చేనేతకు అనుకూలురైన వారింకా కొంతమంది సుసాధ్యమైన చేనేత పరిశ్రమనుండి ప్రజల దృష్టిని మరల్చే

నూలువడకు ఉద్యమం అనుచితమైనదనీ, స్వతస్సిద్ధమైన దౌర్బల్యాలవల్ల చనిపోయిన ఒకానొక అసాధ్య పరిశ్రమకు సహాయపడవలెనని అది ప్రజలను పెడమార్గాలకు లాగుతున్న దనీ నిందించేటంత వరకూ కూడా పోతున్నారు.

పైకి చక్కగా కనిపించే ఈ వాదమునుగూర్చి ఆలోచిద్దాం. మొట్టమొదటి సంగతి, ఉపవృత్తిగా ఉండేటందుకు చేనేత ఆచరణ యోగ్యమైనది కాదు. ఎందువల్లనంటే, ఇది నేర్పడం తేలిక గాదు. భారతదేశంలో ఇది యెన్నడూ సార్వజనీన వృత్తిగా లేదు. దీనిలో పని చేసేటందుకు చాలామంది కావాలి. తీరిక సమయాలలో చేయతగిన పని కాదిది. ఇది సాధారణం గా యెప్పుడూ స్వతంత్రవృత్తిగా ఉండతగినదీ, ఉంటూన్నదీ కూడాను. చెప్పులు కుట్టడం, కమ్మరి పనులవలె, చాలా సందర్భాలలో ఇది ఒక ప్రత్యేక వృత్తిగా కూడా ఉంటూన్నది.

అంతేకాక, నూలువడకడం సార్వజనీన వృత్తిగా ఉన్నట్లు చేనేత సార్వజనీన వృత్తిగా ఉండడానికి వీలు లేదు. ఇండియాకు సంవత్సరానికి 4,661 మిలియన్ల (పది లక్షలు) గజాల బట్ట ప్రతి సంవత్సరమూ కావలసి ఉంది. ప్రతి నేతమనిషీ గంటకు సగటున ముప్పాతిక గజం ముతక ఖద్దరు నేయగలడు. కాబట్టి దేశీయ, విదేశీయ మిల్లులమీద తయారైనబట్ట అంతా బహిష్కరింపబడవలెనంటే, ఇండియాకు యేడాదికి కావల సిన బట్ట యావత్తూ తయారుచేయడానికి రోజుకు రెండు గంటల వంతున పనిచేసే 90 లక్షల మంది నేతవాళ్లు కావలసి ఉంది. అంతమంది నేతపనివాళ్లు మాత్రమే కాదు, అన్ని కుటుంబాలవాళ్లు పనిలో నిమగ్నులు కావలసి ఉంటుందని వాదించే యెడల, ఆ రెండు గంటల పనికి వచ్చే రెండణాలూ ఇంకా అనేకమందికి పంచవలసివస్తుంది. అప్పుడు రోజుకు ప్రతి మనిషికీ వచ్చే ఆదా చాలావరకు తగ్గిపోతుంది.

ఇక వడుకు నూలుకుగల అవకాశాలనుగూర్చి ఆలోచిద్దాం. ఒకప్పుడది భారతదేశంలో అందరికీ అనుకూలమైన ఉపవృత్తిగా ఉందని మనకు తెలుసును. కోట్లాది ప్రజలింకా ఆ కళను మఱచిపోలేదు. లక్షలాది ప్రజల యిళ్లలో ఇంకా రాట్నాలు ఉండనే ఉన్నవి. కాబట్టి చేతితో నూలువడకడం తక్షణం అమితంగా వ్యాప్తిచెందడానికి వీలున్నది. ఒక చేనేతవానికి, పదిమంది నూలువడికే మనుష్యులు కావలెనని అంచనా వేయబడింది. కనుక 90 లక్షల నేతపనివారికీ 9 కోట్ల మంది వడికే మనుష్యులు కావాలి. వారు ఇందుమూలకంగా అదనపు ఆదాయాన్ని చేకూర్చుకోగలరు. అది వారి తాహతుకెక్కువే. అందువల్ల మనిషికి సంవత్సరానికి రూ 40 లు సగటాదాయం ఉంటుందని, ఆ మొత్తం వారికి చాలా ఎక్కువేనని నా ఊహ. నేతపనివలె గాక, వడుకుపని పక్షణంలోనైనా విరమించవచ్చును గనుక, అన్ని తీరిక సమయాలలోనూ చేసుకోనేటందుకు వీలైన పని అది. వడుకుపని తేలికగానూ త్వరగానూ నేర్చుకోవచ్చును. వడికేమనిషి మొదటి నుండి యెదో కొంతదారం తీయగలడు.

అంతేకాక, మిల్లునూలు తప్పకుండా సరఫరా అవుతుందని నమ్మకంతో ఉండడం కూడా తప్పు. చేనేత మిల్లునేతలు రెండూ అనుబంధంగా ఉండేవి కావు. అవి పరస్పరం ప్రతికూలంగా ఉండేవి. అన్ని యంత్రాల వైఖరివలెనే బట్టల యంత్రాల వైఖరి కూడా చేతితో అయ్యే ఉత్పత్తి కెప్పుడూ ఉదాసీనం చెప్పడమే. కాబట్టి చేనేత పెద్దయెత్తున ఒక ఉపవృత్తిగా ఉండవలెనంటే, అది కేవలం మిల్లులపైననే ఆధారపడి ఉండవలసివస్తుంది. అప్పుడవి చేనేతవారికి నూలు సరఫరా చేసేటందుకు చిట్టచివరి పైసావరకూ గుంజి అవకాశం వచ్చిన వెంటనే ఆ వృత్తిని నిర్మూలం చేయగలవు.

ఇక చేతితో నూలువడకడం, చేతితో నేయడం, ఈ రెండూ పరస్పరం అనుబంధంగా ఉండే వృత్తులు. ఈనాటి వడుకు నూలు దుకాణాలు ఈ విషయాన్ని అనుభవపూర్వకంగా రుజువు చేస్తున్నవి. నేనిది వ్రాస్తున్నప్పుడు కూడా, నూలు లేక నేతవారిని ఆయా కేంద్రాల నుండి పంపివేయవలసి వస్తున్నదని నా సహచరులనుండి వచ్చిన ఉత్తరాలున్నవి.

మిల్లు నూలు నేసేవారిలో చాలామంది షాహుకారుల చేతులలో ఉన్నారని కూడా చాలామందికి తెలియదు. వారు మిల్లుల ఉత్పత్తిపైన ఆధారపడి ఉన్నంతవరకూ అలా ఉండి తీరవలసిందే. నేతమనిషి తనకు కావలసిన నూలును మధ్య దళారీల ద్వారాగాక తనసోదర శ్రమజీవియైన రైతుద్వారా పొందవలెనని గ్రామ ఆర్థిక శాస్త్రం ఆదేశిస్తున్నది.

ఇక యిప్పటికి తెలిసినంతవరకు 20 లక్షలమంది చేనేత వారు పనిచేస్తున్నారు. ఒక అదనపుమగ్గం అంటే రూ 15 ల పెట్టుబడి అన్నమాట. ప్రతి అదనపు రాటానికి 5 రూ.ల కంటె ఎక్కువ అవసరం లేదు. ఖాదీ ప్రతిష్ఠాపనంవారి రాటం రూ 2½ ల ఖరీదు మాత్రమే. సందిగ్ధసమయాలలో ఏ ఖర్చూ అవసరం లేక అప్పటి కప్పుడు తయారుచేసుకొనే తక్లీ ద్వారా పని జరుపుకోవచ్చును.

కాబట్టి సంతృప్తికరమైన గ్రామజీవిత నిర్మాణమునకు రాటం ఒకటే పునాదిగా కనిపిస్తున్నది. గ్రామ పునర్ని ర్మాణమున కది ఒకటే కేంద్రంగా ఉండతగినది.

అయితే నిరుపేద అయిన గ్రామస్థునికికూడా రెండుగంటల పనికి ఒక కానీ ఆర్థికంగా ఏమే మాత్రమూ ఆకర్షణీయం కాదని అంటున్నారు. మొదటి సంగతి ఎక్కువ ఆదా వచ్చే మనిషి

కోసం రాటం ఉద్దేశింపబడలేదు. ఈ ఖహూకరణ మాయు నకు కానూ కాదు. అయితే వేలకొలదీ స్త్రీలు ప్రతి రోజూ గానీ లేక వారానికొక పర్యాయంకానీ తామిచ్చిన నూలు కింద కొన్ని కానులున్నూ, ముడి పత్తిన్నీ తీసుకొనిపోయే టందుకు కొన్నిమైళ్లెందుకు నడిచిరావలసి వస్తూన్నది? వారికి చేమగ్గం విషయం చెప్పినప్పటికీ వారు దానిని చే పట్టరు. ఆ పని చేయడానికి వారికి సమర్థతగానీ వ్యవధిగానీ లేదు. ఇండియాలోని ప్రజాసామాన్యమును నిరంతరం పీడి స్తూన్న దారిద్ర్యమునుగూర్చి పట్టణస్థుల కేమీ తెలియనే తెలి యదు. వారి సందర్భంలో యంత్రయుగమును గూర్చి యెత్తు కుందుము గాక. మాంచెస్టరు యంత్రం, గ్రామస్థుల ఆహా రానికి అనుపానము అని చెప్పదగిన రాటాన్ని హరించినది. అంతే కాని దానికి సమానమైనదిగాని దానికంటె ఉత్తమ మైనది గాని మరొకటి ఆ స్థానాన్ని ఆక్రమించి ఉండ లేదు. కాబట్టి అటువంటివారికి రాటం ఒకటే ఆశాజన కంగా ఉంటుంది.

పెద్ద పెద్ద కోరికలతో వ్యవసాయాభివృద్ధి కోసం చేయ బడిన ఊహాజనితములైన సూచనలను గూర్చి నే నికకడ పరి శీలన చేయను. వాటికి తగినంత అవకాశం ఉన్నమాట నిశ్చ యమే. అందుకు తగిన వ్యవధీ విజ్ఞానమూ కావాలి. ఈ లోగా నిరంతరమూ పెరిగిపోతూన్న దారిద్ర్యమునకు తగిన పరిహారం తక్షణం జరుగవలసి ఉన్నది. ఆ పని రాట మొకటే నెరవేర్చగలదు. రాటం వ్యవసాయాభివృద్ధులకు గల అవకాశాలను గమనించకపోవడంగానీ తొలగించడంగానీ చేయదు. పైగా దాని కిది ప్రాతిపదికగా కూడా ఉంటుంది. అది ఎక్కడకు పోయినా గ్రామస్థుల జీవితాలలో వివిధ పరి వర్తనములను కలిగిస్తూన్నది. అంతేకాక పట్టణస్థులకు గ్రామ

ములతోనూ గ్రామస్థులతోనూ ఒకవిధమైన సజీవ సంబంధాన్ని స్థాపించగలుగుతూన్నది.

నూలు వడకడం విషయంలో మీరు చెప్పినదంతా నిజమే అయితే ఇదివరకే అది సార్వజనీనంగా ఎందుకవలంబింప బడలేదు? అని విమర్శకుడడుగుతాడు. ఈ ప్రశ్న చాలా సమంజసమైనదే. ప్రత్యుత్తరంకూడా తేలికే. ఏవిధమైన కార్యోత్సాహమూ లేక నిరాశాపూరితులై, తమకు తాముగా పని వేయబడిన యెడల పనిచేసుకొని జీవించడానికి బదులు పస్తులు పడుకొని మరణించే ప్రజలకోసం మాత్రమే ఈ రాటపుసందేశం కొనిపోబడుతూన్నది. ఇంతకు పూర్వము వారిస్థితి యిలా లేదు. కాని చిరకాలానుగతమైన అశ్రద్ధ వలన సోమరితనం వారి కలవాటయిపోయింది. మంచిశీలం కలిగి కష్టపడి పనిచేసేవారు వారి కళ్ల యెదుట రాటంవడికి నెమ్మదిగా త్రోవచూపుతూ, వారితో సజీవ సంబధం కలిగి ఆదర్శప్రాయులుగా నున్నందువలననే ఆసోమరితనం తొలగిపోగలదు. ఖద్దరు వెంటనే విడుదల కాక పోవడం కూడా మరొక పెద్ద చిక్కు. ప్రస్తుతమది మిల్లుబట్టతో పోటీ చేయలేదని నేను ఒప్పుకొంటాను. ఆవిధ్వంసకరమైన పోటీలో నేను పాల్గొనను. అంగళ్లను వశపఱచుకోవడానికి పెట్టుబడిదారులు తమ బట్టలను ఉచితంగా కూడా ఈయ వచ్చును. ఉత్పత్తిచేసే మనిషియొక్క పెట్టుబడి శ్రమయే గనుక ఆయన వారివలె వ్యవహరించజాలడు. అన్ని రేకులూ సమముగా నున్నప్పటికీ కృత్రిమమైన మృత గులాబి పుష్పమునకు, ఎగుడుదిగుడుగా నున్న రేకులుగల సజీవమైన గులాబిపువ్వుకు, పోటీ ఉండడానికి వీలున్నదా? క్రామ్‌వెల్లుయొక్క మైనపు విగ్రహానికీ జీవంతో ఉన్న క్రామ్‌వెలుకూ ఏమైనా పోటీ ఉండడం సాధ్యమా? ఖద్దరు సజీవమైన వస్తువు. కాని ఇండియా

నిజమైన కళను గ్రహించే కన్నులను పోగొట్టుకోవడంచేత బయటి నున్నదనంతో సంతృప్తిపడు తూన్నది. ఖద్దరు మీద సముచితమైన జాతీయాభిరుచిని పెంపొందించిన యెడల ప్రతి గ్రామమూ తేనెపట్టువలె నిరంతరం శ్రామికులతోనిండి ఉంటుంది. ప్రస్తుతం ఖద్దరు సంస్థల సాధన సామగ్రియావత్తూ, ఖద్దరు విడుదలకావడానికి తగినయేర్పాట్ల కోసము పూర్తిగా వినియోగింపబడుతూన్నది. ఎన్ని అడ్డంకులున్నప్పటికీ ఈ ఉద్యమము పురోగమించడం ఆశ్చర్యంగా ఉంది, నిరుడు మట్టుకు నిరుడు పన్నెండు లక్షల రూపాయిల విలువగల ఖద్దరు విక్రయించబడింది, కాని ఇంకా జరుగవలసిన పనిని తలచుకొన్నప్పుడు మాత్రం ఎవ్వరూ ఇందుకుగర్వపడవలసినది లేదు.

చేమగ్గమునకు ప్రతిగా రాటం అదనపు పరిశ్రమగా ఉండే అర్హతను గూర్చి నేనింత వరకు సంగ్రహంగా చెప్పినాను. ఇందునుగూర్చి యేవిధమైన పొరపాటు అభిప్రాయమూ ఉండకూడదు. నేను చేమగ్గమునకు ప్రతికూలుడను కాను. అది గొప్పగా అభివృద్ధికి రావలసిన పరిశ్రమ. రాటం జయం పొందినట్లయితే చేమగ్గం దానంతటది అభివృద్ధి పొంది తీరుతుంది. రాటం అపజయంపొందితే అది చచ్చితీరాలి.

ఈ వాదమును గూర్చి విమర్శ కావలెనని కోరుతున్నాను. నావాదం కాని, నా అసలు విషయాలు కాని నిలువజాలక పోయినప్పుడు నాచర్యలను నేను సంతోషంతో మార్చుకొంటాను.

యంగిండియా, 11-11-1926

# 60

## 'అభ్యుదయ' భారతదేశం

లింకొల్ ను చేంబర్ ఆఫ్ కామర్సు వారికి విదేశీ వ్యాపారమంత్రి మిస్టర్ ఏ. యం. శామ్యుయల్ ఇలా ఉపన్యసించాడు.

"ఇండియా మన వతనుదారులలో మంచి వతనుదారు. ప్రతి సంవత్సరమూ అది మననుండి 9 కోట్ల రూపాయిల విలువగల సామాను కొంటుంది. వాటిలో చాలా భాగం ఎంతమందో బ్రిటిష్ కార్మికుల చేత చక్కగా తయారు చేయబడిన వస్తువులే కాబట్టి ఇండియాతో వ్యాపారం ఏమాత్రం ఎక్కువైనా సంతోషించ వలసిందే. అందువలన మనం ఎక్కువ మంది కార్మికులను నియోగించుకొని, మన ప్రధాన రాజకీయ విధానం ప్రకారం నిరుద్యోగుల సంఖ్యను తగ్గించగలము.

మనకడనుంచి ఇండియా, ఇనుము ఉక్కు సామానులను రైల్వే సామగ్రినీ చాలా ఎక్కువగా కొన్నది. అది ఐశ్వర్యవంతంగా ఉండి దిగుమతి సరుకులను కొనుక్కొనేటందుకు చాలా సొమ్ముతో తులతూగుతూన్నది. దాని అభిప్రాయాల కనుగుణంగా ధరలు తగ్గేటంతవరకూ మాత్రం వేచి ఉంది. ఇండియాకు చాలా ఎక్కువ పరపతి ఉంది. ఇంగ్లాండు తరువాత ఇండియాకే ఎక్కువ పరపతి ఉంది. లింకొలన్ జిల్లాలోని చాలా కంపెనీలకు, ఇండియాలో సువ్యవస్థాపితములైన

విక్రయశాలలు, నిపుణుల సంస్థలు, ఇదివరకే ఉన్నవి. కాని ఇండియా లోని ప్రభుత్వ ప్రతినిధులు, సమర్థులైన నిపుణులను అసలు స్థలాలలోనే ఉంచవలెనని, కంపెనీలవారిని కోరినారు. మిక్కిలి చిక్కుగల యంత్ర సామగ్రినీ ప్రధాన యంత్రములనూ విక్రయించేటప్పుడు, వాటిలో నిపుణులైన సలహాదారు లెక్కువ మంది కావలసి వచ్చారు. వాటిని విక్రయించే మనిషి ప్రక్కనే, వాటికి బేరం చేకూర్చేటందు కొక నిపుణుడైన సలహాదారు ఉండడం అవసరమయింది. బ్రిటిష్ యంత్రాలయాల ప్రతినిధులు, ఇండియాలో యంత్రములను కొనే ఇంజనీర్లకు సన్నిహితంగా ఉండి, వారికమ్మ చూపిన యంత్రాల వివరములను బోధచేయవలసి ఉంది. ఇండియాకు దిగుమతి అవుతూన్న యంత్ర సామగ్రిలో ఇప్పటికీ నూటికి 80 వంతులు మనమే సరఫరా చేస్తున్నాము. బ్రిటిష్ కంపెనీలలో చాలా వాటికి ఇండియాలో నిపుణులైన ఏజెంట్లు ఉన్నారు. కాని ఇండియాలో మన యంత్రాలను కొనేవారు ఇంకా, బ్రిటిష్ శాస్త్రజ్ఞుల సిబ్బందినుండి తాము కోరినంత సహాయం రావడం లేదని చేసిన అపాదలను గూర్చి నాకు తెలుసును. అంతేకాక తగినంత యంత్ర సామగ్రిగానీ, యంత్రాలలోని ప్రత్యేక భాగాలుగానీ లభించడం లేదనికూడా వారంటున్నారు.

వ్యవసాయ యంత్రాలను ఇండియాలో విడుదల చేనేటందుకు బ్రిటిష్ కంపెనీలు చాలా వ్యయప్రయాసలకులోనై చివరకు తగినంత విజయం పొందలేక పోయినవి. కాని ఇండియా ప్రభుత్వం మాత్రం భారతీయ కర్షకునికి సహాయం చేయవలెనని చాలా ప్రయత్నిస్తూన్నది. మంచి వ్యవసాయ పరికరములను రైతుకందచేయడమే వారు చేయదగిన సహాయాలలో అత్యుత్తమ సహాయం. ఆధునిక పరికరముల ఉపయోగమును గూర్చి, వాటి మరమతును గూర్చి ప్రజలకు బోధించి, వాటిని కొనేటందుకు సహాయపడడానికే ఇండియాలో వ్యవసాయ, సహకార పరపతి శాఖలు స్థాపింపబడుతూన్నవి.''

మనం ఐశ్వర్య వంతులం గా ఉన్నామనీ ఇంగ్లాండు ఉత్పత్తి చేసిన యావత్తు యంత్ర సామగ్రినీ,—వ్యవసాయ యంత్ర సామగ్రినైనా సరే ఇతరదేనినైనా సరే, వారి నిపుణులతోసహా మనం తెచ్చుకొన్నయెడల మన ఐశ్వర్యం ఇంకా అభివృద్ధి అవుతుందనీ మిస్టర్ శామ్యూల్ నిజంగా నమ్ముతున్నాడు. ఈ రెండు విషయాలు కూడా సత్యానికి ఎంత దూరంగా ఉన్నట్లు మనకు కనిపిస్తూన్నవి? భారత దేశం ఐశ్వర్యవంతంగా లేదనీ, అది రోజు రోజుకూ ఎక్కువ దారిద్ర్యమును పొందు తూన్నదనీ మనకు తెలుసును. ఇంగ్లాండునుండికానీ, యేయితర విదేశమునుండి కానీ విచక్షణ లేకుండా యంత్రాలనూ యంత్రనిపుణులనూ దిగుమతి చేసుకొన్నంత మాత్రంతో ఈ దారిద్ర్య సమస్య ఎన్నటికీ పరిష్కారం కాదని కూడ మనలో కొందటికి తెలుసును. ఈ రకం దిగుమతి మన అభివృద్ధిని ఆపివేస్తుంది. మనం అంతకంతకు బానిసలంగా తయారవుతాము. మనం మన చేతులతోనూ కాళ్లతోనూ పనిచేసే శక్తిని పెంపొందించుకొనేటందుకు తగినశాస్త్రినైపుణ్యం మనం సంపాదించుకోవలసి ఉంది. అప్పుడు మన అవసరాలకు తగిన యంత్రాలను మనమే నిర్మించుకోవచ్చును. పాశ్చాత్యాను బానిసభావంతో అనుసరించడంవలన మన ఉపక్రమణశక్తీ, వివేకమూ అంతా నశిస్తుంది. దావి మూలాన సముచిత సౌఖ్యంతో జీవించ గలిగిన సామర్థ్యంకూడా పోతుంది. మిస్టర్ శామ్యుయల్ చేసిన ఉపన్యాసములవంటి ఉపన్యాసముల వలననే, రాయల్

వ్యవసాయ విచారణ సంఘములవంటి సంఘముల ఉద్దేశము గూర్చి అనుమానాలు కలుగుతూంటవి. రాయల్ వ్యవసాయ విచారణ సంఘమును గూర్చి ఈ పుటలలో ఇటీవల ఉదాహరింపబడినది.

—యంగిండియా, 16-12-1926

# 61

# సకాలంలో ఉండండి

లక్షలాది ప్రజలు పాల్గొన్న అప్రతిమాన మహోత్సవములద్వారా, జాతిపుట్టుకను సంస్మరింపచేసే చిహ్నములతో ఏక మనస్సుకలిగి ప్రవర్తించిన జాతియొక్క ఉత్కృష్టావకాశాలను నిరూపించినట్టి బహుఘటనాపూర్ణమైన ఏప్రిల్ మాసం త్వరలోనే రానున్నది. గర్వభూయిష్ఠము, ప్రతిహింసాపూర్వకము, నిర్దయాత్మకము అయిన సామ్రాజ్యతత్వం స్వసంరక్షణార్థ మేమిచేయగలదో కూడా నిరూపించి చూపిన నెల అది. మన జాతీయ జీవితంలో ఏప్రిల్ 6, 13 వ తేదీలెన్నటికీ విస్మరింప తగినవి కావు. నాటినుండీ అపకారానికి ప్రత్యపకారం చేయకుండేటందుకు, ప్రతిక్రియ కావింపకుండేటందుకే కాక, జలియన్‌వాలాలోని రక్తప్రవాహమును ఆత్మపరిశుద్ధతకోసం వినియోగించుకోవడానికికూడా మన జాతి నిరంతరకృషి చేస్తూన్నది. రాటము, ఖాదీ, అస్పృశ్యతా నివారణము, వివిధ జాతిమత సామరస్యము, ఈఅన్నిటిలో వ్యక్తమవుతూన్న అహింసాభావమును వెల్లడించేటందుకే భారతజాతి ఎడతెగని శ్రమచేస్తూన్నది. అయినప్పటికీ మన జాతి యావత్తూ పాల్గొని పనిచేయదగినది ఖాదీ ఒక్కటేననేమాట స్పష్టమే. మనం అహింసాపూర్వకంగా పనిచేయవలెనంటే సహనంతో, ప్రశాంత చిత్తంతో, మనయందు మనవిధానమునందూ అచంచల విశ్వాసంతో, నిర్మాణయుతంగా ప్రవర్తించాలి. మనం ఐకమత్యమును, బలమును, కఠోరమైన క్రమశిక్షణను, అలవరచుకోవాలి. మనకెన్ని ప్రతికూల పరిస్థితులేర్పడినప్పటికీ మన అభిప్రాయాలను

ఆచరణలోకి తీసుకొనిరావడం నేర్చుకోవాలి. బ్రిటిష్ వ్యాపారం మనపైన బలవంతంగా రుద్దబడినది. కనుకనే బ్రిటిష్ ప్రభుత్వం మనకు తప్పని సరియైనదని మనం గ్రహించాలి. బ్రిటిష్ వాణిజ్యాన్ని మనం పరిశుద్ధం చేయగలిగినట్లయితే బ్రిటిష్ సంబంధాన్నికూడా మనం బాగుచేయవచ్చును. తక్కిన ప్రపంచంతోవలెనో బ్రిటిష్‌వారితోకూడా మన వర్తక లావాదేవీలు మన షరతులమీద ఆధారపడి ఉభయులకూ లాభదాయకంగానూ, సంపూర్ణ స్వేచ్ఛా పూర్వకంగానూ జరుగవలెను. అయితే లాంక్‌షైరు బట్ట, పరుల స్వార్థపరత్వమునకు చిహ్నం. ఖాదీయో, వ్యక్తుల యొక్కయు, వర్గాలయొక్కయు, తెగలయొక్కయు జాతుల యొక్కయు, మాత్రమేగాక యావద్భారతజాతియొక్క స్వయం సహాయమునకు, స్వావలంబనమునకు, స్వాతంత్ర్యమునకు చిహ్నము. ఇండియాయొక్క క్షేమమునుగోరి స్వార్థంకోసం పరులను వినియోగించుకోవలెననే తత్వాన్ని పారద్రోలేటందుకు కష్టపడేవారెవరైనప్పటికీ, రాజు దరిద్రుడు, స్త్రీలు పురుషులు, బాలురు బాలికలు, హిందువులు, ముసల్మానులు, క్రిష్టియనులు, పార్శీలు, యూదులు, ఆంగ్లేయులు, అమెరికనులు, జపానీయులు అందరు పాల్గొనగల ఉద్యమమిది. కాబట్టి ఇదియొక అపూర్వమైన ఉద్యమం. ఇది కొంతమందికి మాత్రమే కాదు, అత్యధిక సంఖ్యాకులకే కాదు, అందఱికీ క్షేమకరమైన ఉద్యమం. ఈ రాబోయే జాతీయ వారంలో, మనం చాలా పనులు, చాలా ఎక్కువ పనులు చేయవచ్చును. కాని కనీసం మనం ఖాదీ వ్యాపకం చేతుము గాక. అందుకు మార్గాలివి :—

1. మనలో ప్రతి ఒక్కరు మనం కొనగలిగినంత ఖాదీని కొనవచ్చును.

2. మనం అమ్మగలిగినంత ఖాదీని అమ్మవచ్చును.

3. మనం వడకగలిగినంత నూలు వడకవచ్చును.

4. అఖిల భారత చరఖా సంఘానికి మనం ఈయగలిగినంత నూలును ఈయవచ్చును. ఇతరులనుండి మనం సేకరించగలిగినంత నూలు సేకరించవచ్చును.

5. కడకు మనకు ఇష్టమూ అవకాశమూ ఉంటే మనము పూర్తిగా ఖాదీపనికే అంకితం చేసుకోవచ్చును.

నేనిది వ్రాస్తూ ఉండగా నా మనస్సులో ఈ ప్రశ్న ఉదయించింది: అయితే ఇప్పుడు తక్షణం చేయవలసినదేమిటి? తమపైన ఆరోపణ లేవో తెలియక, విచారణ లేక, ఎంతకాలం ఖైదులో ఉండవలెనో ఎఱుగక, జైలు కొట్లలో కృశించిపోతూన్న బెంగాలు డిటిన్యూల గతియేమి? కాని ఈ ప్రశ్నకు నా జవాబుకూడా సుస్పష్టంగానే ఉంది. నేను వారిని ఎక్కువ తొందరగా విడిపించేమార్గం ఆలోచించగలిగి ఉన్నట్లయితే, నేను దాని నవలంబించి ఈనాడే సూచించి ఉందును; కాని అటువంటిదేమీ లేదు. ఇవి చాలా బాగుగా జరిగేటట్లు కనిపించవచ్చును. కాని యిది అత్యంత వేగముగానూ అత్యంత నిశ్చయముగానూ జరిగేటందుకు మార్గమని నా వినయపూర్వకాభిప్రాయము. కాబట్టి, ఖాదీలో నమ్మకం ఉన్నవారుగాని లేక తక్కినవానిలో వేనిలోనూ విశ్వాసంలేనివారుగాని జాతీయవారంలో వారికి చేతనైనంత ఎక్కువగా ఈ పని చేయవలెను. నిజమైన

యోధుడు దండయాత్రకు పోతూ తుదకు విజయమెలా వస్తుందని వాదంచేయడు. కాని తన కర్తవ్యమును తాను అడకువతో నిర్వర్తించినయెడల యేదో విధంగా యుద్ధంలో విజయం వచ్చితీరుతుందని ఆయన విశ్వాసం. ఆదేభావంతో మనలో ప్రతి ఒక్కరూ పనిచేయాలి. భవిష్యత్తు తెలుసుకో గలిగినశక్తి మనకులేదు. కాని మనలో ప్రతి ఒక్కరికీ మన పనిని మనం ఎలా చక్కగా నిర్వర్తించుకోవలెనో తెలుసును. మనకు చేయడానికిష్టమున్నట్లయితే సాధ్యమవుతుందని తెలిసినదానినే మనం నిర్వర్తింతుముగాక.

—యంగిండియా, 10-2-1927

# 62

# శూన్యము నుండి

చర్ఖాయొక్క విశాలావకాశాలనుగూర్చి యోజించినప్పుడు నిరాడంబరమైన దాని సందేశం సార్వజనీన మయ్యేటందు కింతకాలమెందుకు పడుతూన్నదా అని ఆశ్చర్యంకలుగుతూం టుంది. 'శూన్యము నుండి శూన్యమే వస్తుంద' అని ఒక లాటిన్ సామెత చెపుతూన్నది. చర్ఖా కనీసం ఈ సామెత యొక్క అక్షరాలను అబద్ధం చేస్తూన్నట్లు కనిపిస్తూన్నది. ప్రయోజనకరమైనదానిని దేనిని వినాశనం చేయకుండానూ దాని స్థానాన్ని ఆక్రమించకుండానూ, జాతియొక్క తీరిక కాలమును, వ్యర్థ కాలక్షేపమునూ సద్వినియోగం చేసేటందుకది ప్రయత్నిస్తూన్నది.

ఈ సోమరితనం తప్పనిసరిగా తటస్థించినా, స్వయంగా తెచ్చిపెట్టుకొన్నా, కేవలంజాతియొక్క ఆత్మను విధ్వంసం చేస్తూఉన్నది. నేను గ్రామాల మధ్యకుపోయి ఆ సమావేశ మయిన గ్రామస్థుల కళ్లలోని శూన్యదృష్టిని చూచినకొద్దీ నాకు సంక్షోభం ఎక్కువవుతూన్నది. తమ ఎడ్లతో కలసి మెలసి కష్టపడి పనిచేయడం తప్ప తాము చేయగలిగినది మరొకటేమీ లేకపోవడంచేత వారుకూడా దాదాపు ఎడ్లవలెనే తయారైనారు. లక్షలాది ప్రజలు తమ చేతులను చేతులుగా ఉపయోగించడం మానివేశారంటే అంతకన్న ఎక్కువ విషాద కరమైన పరిస్థితి మరొకటుండబోదు. మానవుల మైన మనకు ప్రకృతి దేవత ప్రసాదించిన బహూకరణ మును, నేరంగా పరిణమించేటంతవరకూ నిరుపయోగం చేసు కొన్నందున ఆమె మనమీద భయంకరంగా కసితీర్చు

కొంటూన్నది. మనకు ప్రసాదింపబడిన వస్తువును మనము పూర్తిగా ఉపయోగించుకొనక నిరాకరిస్తున్నాము. ఇంకా కొన్ని విషయాలతో పాటు మన చేతులయొక్క యంత్రరచనా తత్ప్రవృత్త పశువులనుండి మనను విడదీస్తూన్నది. మనలో లక్షలకొలదీ కేవలం వాటిని పాదాలవలె వాడుతున్నారు. అందువలన శరీరమూ బుద్ధీకూడా క్షీణిస్తూన్నవి.

రాటం ఒక్కటే ఈ వృథా దుబారాను అడ్డగించగలదు. ఆ పని అది తక్షణం చేయగలదు. అందుకు పెద్ద పెట్టుబడిగానీ తెలివిగానీ అక్కరలేదు. ఈ దుబారావలన మనం దాదాపు ఊపిరి తిరుగని స్థితిలో ఉంటున్నాము. ప్రతి ఇల్లూ ఒక వడుకు యంత్రంగానూ ప్రతి గ్రామమూ ఒక నేత యంత్రంగానూ పరిణమించినట్లయితే మళ్లీ మనకు ఊపిరి వస్తుంది. దానితో పాటు తొల్లింటి పల్లెటూరి పనితనము, పల్లెటూరి పాటాకూడా తక్షణం మనకు తిరిగీ లభిస్తుంది. అర్థాకలితో బాధపడే జాతికి మతంగానీ, కళగానీ, సంఘటనశక్తిగానీ ఉండజాలదు.

రాటాన్ని విమర్శించే వారంతా అది గిట్టుబాటుకాదని మాత్రమే అభ్యంతరం పెడుతూంటారు. అయితే దానివలన రోజుకు ఒక కానీ వచ్చినప్పటికీ, మన సగటాదాయం రోజుకు ఆరు కానులు మాత్రమేననీ, అమెరికా దేశీయునియొక్కయు, ఆంగ్లేయుని యొక్కయు సగటాదాయం రోజుకు క్రమముగా పదునాల్గు రూపాయాలు ఆరు రూపాయిలూననీ జ్ఞాపకం చేసుకొనప్పుడది గిట్టుబాటవుతుందనే గ్రహించాలి. ఏమీ లేనిదానినుండి ఏదో కొంత ఉత్పత్తి చేసేటందుకు జరుపబడే కృషియే రాటం. రాటంద్వారా మనదేశానికి అరవైకోట్ల రూపాయిలను కూడబెట్టుకొనేయెడల ఆ పెద్ద మొత్తాన్ని మన జాతీ యాదాయమునకు చేరుస్తున్నామన్నమాట. మనం దానిద్వారా అంత

మొత్తమును నిశ్చయంగా కూడ బెట్టుకోగలము. ఈ కార్యాచరణ విధానములో మన గ్రామాలను కూడా ప్రత్యేక ప్రయత్నంతో అవసరం లేకుండా సంఘటితం చేయగలము. దాదాపు ఈ మొత్తం అంతా దేశంలోని నిరుపేదలకు పంచిపెట్ట బడవలసిందే గనుక, ఆ పంపిణీ పద్ధతి న్యాయంగానూ దాదాపు సమంగానూ ఉంటుంది. ఆపద్ధతిలోని మహత్తర నైతిక మూల్యమువలన చర్ఖానుగూర్చిన అనుకూలవాదం అప్రతిహతంగా పరిణమిస్తుంది.

—యంగిండియా, 17-2-1927

# 63

# మిల్లుయజమానులు—ఖాదీ

ఉదాహరణానికి అమలనేరువంటి మిల్లు ప్రదేశానికి ఖద్దరు సందేశాన్ని తీసుకొనిపోయినందువలన ప్రయోజనం కలదా అని, అక్కడ ఒక సందేహం వెల్లడింపబడింది. 'ఇక్కడ 2,000 మంది కార్మికులున్నారు. ఇక్కడి జనసంఖ్యలో వారే ఎక్కువమంది. వారు ఖాదీ ధరించవలెనని మీరనుకొంటున్నారా ? మిల్లు యజమానులు ఖాదీధారులు కావలెనని మీ అభిప్రాయమా?' దీనికి గాంధీజీ యిచ్చిన దీర్ఘమైన ప్రత్యుత్తరం దిగువ నుదాహరింపబడినది. మ.దే.]

ఈ ప్రశ్న మీ రడుగతగినదే. కాని ఈనాడీ తరుణంలో అడుగతగినది కాదు. అందఱూ అర్థంచేసుకొనియెడల సత్యాన్ని పదిలక్షల పర్యాయములైనా పునరుద్ఘాటన చేస్తూండవలసిందే. సత్యమును ఒక్కసారి చెప్పినంత మాత్రంతో సరిపోయినట్లయితే, ఇప్పటికి ప్రతి మనిషికీ దేవునిలో నమ్మకం కలిగి ఉండేది. దేవుడు ఒక్కడేనని పదిలక్షల పర్యాయములైనా చెప్పబడిన మాట నిజం. కాని యే కొద్దిమంది హృదయాలలోమాత్రం దానిని గ్రహించగలిగినవి. నాకిప్పుడు కార్మికు లిచ్చిన మూడు వందల ముప్పయి రూపాయిల విరాళము, అంతయెత్తు బంగారము విలువకు తులతూగుతుంది. అయితే తమ సానుభూతిని వాస్తవ రూపంలో కార్మికులు చూపడమిదే మొదటి పర్యాయం కాదు తామొక సత్కార్యమునకు సహాయం చేస్తున్నామనే నమ్మకంతో మిల్లు యజమానులుకూడా అలాగే చేశారు ; ముందుకూడా చేయగలరు. వారితోపాటు నేనుకూడా శమ జీవిననే సానుభూతితో కార్మికులు సహాయపడు

తున్నారు. అయితే ఒక మనిషి తన కర్తవ్యమును గ్రహించడానికీ, దానిని నిర్వర్తించడానికీ భేదం ఉంది. ఇవి రెండూ ఏకీభవిస్తే రామరాజ్యం వచ్చితీరుతుంది. ఉదాహరణానికి బ్రహ్మచర్యంయొక్క విలువ తెలిసి దానిని నిర్వహించజాలని వారున్నారు. అలాగే ఖాదీ సందేశాన్ని గ్రహించికూడా, స్వీయ సౌఖ్యానందములమీద మోహమును జయించలేక ప్రత్యేకం ఖద్దరునే ధరించజాలని వారున్నారు. చాలామంది వచ్చి నాతో యిలా అంటారు: 'మీ సందేశం బాగానే ఉంది. కాని దానిని నిర్వహించేమార్గం మాకు చెప్పండి.' నిజమైన నమ్మకం ఉంటే ఎప్పుడో ఒకప్పుడది ఆచరణలోకి వచ్చి తీరాలి. కాబట్టి ఈ వైఖరి నన్నాశా పూరితుడనుగా చేస్తూన్నది. మీరిక్కడ 2,000 మంది కార్మికులను నియోగించి ఉండవచ్చును. కాని వారందరినీ వేలకొలది బాటు చేశారన్నమాట మరచిపోకండి. అంతేకాదు మీమిల్లులే కొద్దిమందికో మాత్రమే పనిచూపించగలవనీ, నేలను అంటిపట్టుకొని ఉండవలసినట్టిన్నీ, ఇంకా ఎక్కువపని కావలసినట్టిన్నీ లక్షలాది ప్రజలకు ఎన్నటికీ పని కల్పించచాలవనీ మీరు విస్మరింపరాదు. ఈ సమస్య వ్యవసాయ రాయల్ కమీషను ఎదుటనూ, రాజ ప్రతినిధి ఎదుటనూ ఉన్నది. దేశానికి ఈ విషయంలో నేను సమర్పించిన పరిష్కారముకంటె ఉత్తమ పరిష్కారమును ఎవరైనా సూచించగలరా అని నేను ప్రశ్నిస్తున్నాను. బోగ్రా, ఖుల్నాలలోని గ్రామ ప్రదేశాలలో తన రసాయనిక కార్యకలాపాలను డాక్టరు రే సాగించలేకపోయినాడు. తిరిగి ఆయన రాట్నాలమీదనే ఆధారపడవలసి వచ్చింది. ఒకటే మిల్లులోనే వేలకొలది కదుళ్లను కేంద్రీకరించడం కాక ప్రతి యింటినీ ఒక నూలు వడికే మిల్లుగా మార్చడం మీ ఆశయంగా ఉంచుకోండి.

మిల్లు పరిశ్రమను నేను విధ్వంసంచేయదలచుకొన్నట్లుగా తలచు నన్నడుగుతూంటారు. అదే నిజమైతే, ఉత్పత్తి పన్నును రద్దుచేయవలసిందని నేను వత్తిడిచేసి ఉండకూడదు. మిల్లు పరిశ్రమ అభివృద్ధి కావలెనని నాకోరిక. కాని దేశారిష్టదాయకంగా ఉండేటట్లుమాత్రం అభివృద్ధికావడం నాకోరిక కాదు. పైగా దేశక్షేమంకోసం ఆ పరిశ్రమ పోవలసి ఉన్నయెడల, యేమాత్రం విచారంలేకుండా దానిని పోనిస్తాను. నన్ను బలపరుస్తూన్న మిల్లు యజమానులందరికీ ఈ నావైఖరి తెలుసును. నా ఉద్యమం వారికి నష్టదాయకమైనప్పటికీ అది అభివృద్ధి పొందవలెననియే చాలామంది కోరుతున్నారు.

మిల్లు బట్టను ఉత్పత్తిచేసేవారు ఏ యితర బట్టనైనా ఎలాధరించగలరు? అని మీరు నన్నడుగుతున్నారు. మాంచెష్టరులోని ఉత్పత్తిదారులు తాము తయారుచేసిన బట్టను ధరించరని మీకు తెలుసునా? మీ మిల్లులో ఉత్పత్తి అయిన బట్టను మీరు ధరించలేకపోవడమునుగూర్చి మీరంత లెక్కపెట్టనక్కరలేదు. యోగ్యురాలైన సుదర్లాండు రాణీ హిబ్రైడ్సు ద్వీపవాసుల పేదరికమును, దౌర్భాగ్యావస్థనూ గమనించి వారికి రాటాలను మగ్గాలనూ దానంచేసింది. మాంచెస్టరు పౌరులు మిల్లుయజమానులతోసహా, హిబ్రైడ్సు ప్రజలు తయారుచేసిన చేనూలు బట్టలను, తమ మిల్లు బట్టలకంటె మూడు రెట్లెక్కువధర పెట్టికొని ధరిస్తున్నారు!

చౌకదనం కోసం నాజూకుదనం కోసం ఆశపడకండి. మీకు చౌకగా సన్నని బట్టలు కావలెనంటే కీ. శే. జోగేశ చటర్జీ చేసినట్లుగా మీ నూలు మీరు వడుకుకోవాలి. లేదా ఎక్కువ సొమ్ము వెచ్చించనయినా వెచ్చించాలి. స్వరాజ్యాన్ని

గూర్చి మాట్లాడేవారు చౌకదనము, సన్నదనములనుగూర్చి పట్టించుగా ఉండరాదు. రెండూ రమ్మన మంటే రావు. లోకమాన్యుడు చేసిన త్యాగాలను స్మరించుకొని ఆయన మీ రెటువంటి త్యాగాలు చేయవలెనని అనుకొని ఉంటారో యోచించుకోండి. అందఱు యోధులు చేయవలసిన త్యాగాన్ని గూర్చికూడా ఆలోచించుకోండి. ఎలిజబెత్తు రాణీ కాలంలో విదేశీ సరుకులపైన అధికంగా దిగుమతి పన్నులు వేయబడినవి. హాలెండు లేసులను కొన్నందుకు ఎక్కువగా శిక్షలు విధింపబడినవి. మీరు మీ పేద జనులను స్మరించుకొని, ఖాదీనే కొనవలెనని చెప్పినప్పుడు మిమ్ములనే నేమంత కోరుతున్నాను? పేదలకు బిచ్చంపెట్టి బ్రతికిస్తామని మీరనరా? రెండు తరగతులవారుమాత్రమే దానానికర్హులు. తక్కినవారెవరూ అందుకర్హులుకారు. అప్తిరేమీ ఉంచుకోక ధార్మిక విద్యను వ్యాపింప చేయడమే పనిగా పెట్టుకొన్న బ్రాహ్మణుడు, కుంటివాళ్లూ, గుడ్డివాళ్లూ మాత్రమే దానానికర్హులు. అయితే జగన్నాథపూరీలో సర్వాంగ స్వాస్థ్యం కలిగిన సోమరులకుకూడా బిచ్చంపెట్టే అన్యాయ విధానం మనకు నిరంతర లజ్జాకరంగానూ అవమానకరంగానూ నడుస్తూన్నది. ఆ అవమానాన్ని నిర్మూలించుకొనే టందుకే నేనుఖాదీ సందేశంతో దేశం యావత్తూ పైనుండి కిందివరకు సంచారంచేస్తూన్నాను.

యంగిండియా, 24-2-1927.

# 64

# కాదు, అవును

'కార్మేడ్' సకలత్యాగాలా చాలా పట్టుదల గలవాడు. ఆయన నిజాయితీ స్పష్టంగా కనిపిస్తూంటుంది. ఆయన త్యాగాలు చాలా గొప్పవి. పేదలపైన ఆయనకుగల అనురాగం కాదనడానికి వీలులేనిది. కాబట్టి ఆయన నాకు బహిరంగంగా సోద్వేగంతో చేసిన ప్రార్థనను నిజమైన దేశ భక్తుడూ మానవ శ్రేయోభిలాషీ అయిన వాని ప్రార్థనను ఎంత ఎక్కువ శ్రద్ధగా నేను గమనించవలసి ఉన్నదో అంత శ్రద్ధగానూ గమనించాను. కాని ఆయన కోరికను 'సరే' ననవలెనని నా కెంత యిచ్ఛవున్నప్పటికీ, నిజాయితీకి బదులుగా నిజాయితీగానే ఉండవలెనంటేనూ నా విశ్వాస మున కనుగుణంగానే నేను ప్రవర్తించవలెనంటేనూ నేను 'కాదు' అని చెప్పక తప్పదు. అయితే నా ఆచార ప్రకారం నేను ఆయన ప్రార్థనకు 'సరే' ననికూడా చెప్ప గలను. ఆయన కోరుతూన్న షరతులమీద ఆయనతో నేను సహకరించవలెనని ఆయనకు తీవ్రమైన కోరికఉంది. కాని దాని అట్టడుగున, ఆయన వాదం నా మనస్సుకూ, బుద్ధికీ సంతృప్తికరంగా ఉం నే 'సరే' ననవలెనను షరతు గట్టిగా ఇమిడిఉన్నది. ముఖప్రీతికోసం కానీ లేక కష్టాన్ని ఎదుర్కొ లేక కానీ 'అవును' అనడం కంటె, అచంచల విశ్వాసంతో 'కాదు' అని అనడం ఎక్కువ ఉత్తమం.

హృదయ పూర్వకంగా సహకరించవలెననే కోరిక నా కెంత ఉన్నప్పటికీ, ఏమీ త్రోవ కానరావడం లేదు. ఆయన చెప్పిన విషయాలు కేవలం కల్పితములు. ఆ కల్పిత

వృత్తాంతములపైన ఆధారపడిన ఆయన ఊహాలు నిరాధార ములు. ఈ విషయాలు నిజమైనప్పుడు వాటి దుష్ఫలితాలను నిర్మూలం చేసేటందుకు నా యావత్తు శక్తినీ వినియోగిస్తూన్నాను. నేను విచారపడుతూన్నాను. కాని మా యిరువురకూ బొత్తిగా చుక్కెదురుగాఉంది. అయితే మాయిద్దరికి కావలసింది ఒక ముఖ్యాంశం ఉంది. మేముభయులమూ కూడా మానవ శ్రేయస్సు దేశక్షేమమూ మాత్రమే మా ఆదర్శ మంటున్నాము. కాబట్టి ప్రస్తుతం మేమిరువురము పరస్పర ప్రతికూల దృక్పథములతో వ్యవహరిస్తూన్నట్లు కనిపించి నప్పటికీ ఎప్పుడో ఒకప్పుడు మేము కలుస్తామనే భావిస్తున్నాను. నాకు నాతప్పిదం తెలిసినప్పుడు దానికి తగినంత పరిహారం చేయగలనని నేను వాగ్దానం చేస్తున్నాను. ఈలోగా నాపొరపాటు, దానిని పొరపాటుగా నేను అనుకోవడంలేదు గనుక, నాకు రక్షణగానూ ఓదార్పుగానూకూడా ఉంటుంది.

కోరికలను పెంచుకొని వాటిని తీర్చుకొనేటందుకు ఎక్కువగా యంత్రాలను నిర్మించుకోవడం వలన తన ఆదర్శాన్ని అందుకోవడానికి ప్రపంచమొక్క అడుగుకూడా ముందుకు పోతూన్నదని నేనుభావించడంలేదు. అందువలన ప్రపంచం పురోగమిస్తూన్నట్లు సకలత్వాలా భావిస్తున్నాడు. 'కామ్రేడ్' సకలత్వాలాకు నేటి పరుగులు అంటే చాలాయిష్టం. కాలమునూ దూరమునూ విధ్వంసంచేయవలెననీ, పశువాంఛలను పెంచుకొని వాటిని తీర్చుకొనేటందుకు ప్రపంచం నలుమూలలకూ పరుగెత్తవలెననీ పిచ్చికోరికలు కలిగి ఉండడం నేను హృదయపూర్వకంగా ఏవగించుకొంటాను. ఆధునిక సభ్యత ఇందుకోసమే ఉన్నట్లయితే,—అది అందుకే ఉందని నేననుకొం

టున్నాను—దానినీ, దానితోపాటు ప్రస్తుత ప్రభుత్వ విధానాన్నీ, దానిని పూర్తిగా సమర్థించే దానినీ, ఈ అంతటినీ సైతాన్ పద్ధతి అని నేనంటాను. పేదల ఉన్నతి కోసమని చెప్పబడే దాని ప్రణాళికలలో నాకు నమ్మకం లేదు. దాని మారకపు విధానాన్ని నేను నమ్మను. దాని సైనిక నావికా దళములంటే నాకసనమ్మకం. స్వీయ రక్షణ అనే పేరుతోనూ, నాగరికత అనే పేరుతోనూ ఈ ప్రభుత్వం ప్రజల నెత్తురు పిండివేసింది. అది ప్రజలను బానిసలుగా తయారు చేసింది. అది బలవంతులైన వారికి అధికారాలనూ ఐశ్వర్యాలనూ లంచంగా యిచ్చింది. ముఖస్తుతి వలనగానీ, సొమ్ముల వలనగానీ లొంగని స్వాతంత్ర్య ప్రియులైన దేశాభిమానులను నిరంకుశ శాసనాల భారంతో అణచి వేయవలెనని అది ప్రయత్నించింది. నాకు బలం ఉన్నట్లయితే ఆ విధానాన్ని నేను వినాశనం చేస్తాను. దానిని నాశనం చేయగలవని నాకు తోచిన అత్యంత భయంకరాయుధాలను నేను దానిమీద ప్రయోగిస్తాను. ఆ ఆయుధాలు ప్రస్తుత పరిపాలకులను విధ్వంసం చేసినప్పటికీ వారి విధానాన్ని మాత్రం నిరంతరం కొనసాగించేటందుకే వినియోగించగలవని వాటిని నేను ప్రయోగించక మానుకొంటున్నాను. మనుష్యుల విధానాలను నిర్మూలించడంకంటె మనుష్యులనే నిర్మూలింప తలపెట్టేవారు, మనుష్యులతోపాటు వారి విధానాలుకూడా నిర్మూలింప బడతవనే తప్పు అభిప్రాయంలో ఉండి, వారి విధానాలను అవలంబించి అంతకంటె చెడ్డవారుగా పరిణమిస్తారు. అసలు చెడుగుకు మూలాలనేమిటో వారికి తెలియదు.

హింసామూలకంగా మనంకూడా ఆత్మను పోగొట్టుకొన్నందున ఆత్మవిహీనమైన విధానమును సంహరింప

జాలమని ఆ విధానమునకు మనం బలికాకుండా, సైతాన్ మనను చిక్కించుకోవడానికి పన్నిన ప్రతిపన్నాగమునుండీ తప్పించుకొంటూ గట్టిగా 'కాదు' అని చెప్పగలిగిన అసహాయోద్యమము ద్వారా మాత్రమే దానిని సంస్కరింపగలమనీ నిరూపించేటందుకే 1920 నాటి ఉద్యమం ఉద్దేశింపబడినది.

ఆ ఉద్యమం ఆగిపోవలసిన గతి పట్టినమాట నిజమే. కాని అది మృతిపొందలేదు. నావాగ్దానం కొన్ని షరతులమీద ఆధారపడిఉంది. ఆ షరతులు చాలాచిన్నవి, తేలికయినవి. కాని ఉద్యమంలో ప్రధాన పాత్ర వహిస్తూన్న వారి కవి చాలా కష్టంగా తోచినవి.

'కాంగ్రెస్' సకలత్వాలా నా పొరపాటుగాను అపజయంగానూ నమ్మాతూన్న దానిని నా బలమునకూ అచంచల విశ్వాసమునకూ నిదర్శనంగా నేను భావిస్తున్నాను. అది పొరపాటే కావచ్చును. కాని నిజం శాశ్వతంగా నిలచి ఉంటుందని నాకు విశ్వాసం ఉన్నంతవరకూ, నాపొరపాటే నాకు బలంచేకూర్చి తీరాలి; చేకూరుస్తూన్నది కూడా. బార్డోలీలో నేను వెనుక మొగం పట్టడం వివేకమయినపని అనీ, దేశానికమోఘమైన సేవఅనీ నేను భావిస్తున్నాను. ఆ నా నిర్ణయం వలన ప్రభుత్వమే ఎక్కువ దుర్బలమయింది. రాజ ప్రతినిధి కంతిమ సందేశంగా పరిగణింప బడిన దానిలోని షరతులను నిర్వర్తించవలెనని నారీచారా తరువాతకూడా నేను పట్టుపట్టి వున్నట్లయితే ప్రభుత్వం అంతకు పూర్వం పోగొట్టుకొన్నదంతా తిరిగీ పొందగలిగి వుండేది.

దక్షిణ ఆఫ్రికా ఉద్యమం అపజయం పొందిందని అనడంలో మా 'కామ్రేడ్' తప్పుచేస్తున్నాడు. అదే నిజమయితే నా జీవితం యావత్తూ అపజయం పొందినట్లే లెక్కింపబడవలెను. అప్పుడు తన పటాలంలో నన్ను చేరవలసిందని కోరడంలో అర్థమే లేదు. నేను జీవితంలో నిర్వర్తింప దలచుకొన్న మహాకార్యమునకు దక్షిణ ఆఫ్రికా మొట్టమొదట సావకాశం కల్పించింది. కడచిన యుద్ధంలో అప్పటికి నాకుగల విశ్వాసములనుబట్టి, నేనున్నూ నా సహచరులున్నూ క్షతగాత్రులైన వారికి ఉపచారం చేసేటందుకు వాగ్దానం గావించడం తప్పిదమని నే ననుకోవడం లేదు.

ఈ గొప్ప పార్లమెంటు సభ్యుడు చాలా తొందర పడుతున్నాడు. విషయ పరిశీలన చేయడం తన గొప్పతనానికి లోపంగా భావిస్తున్నాడాయన. ఖాదీ ఉద్యమం క్షీణించలేదని నేనాయనకు తెలియచెప్పవలసిఉంది. 1920 లో జరిగిన పనికి కనీసం ఇరవై రెట్లు పనిజరిగింది నిరుడు. ఇప్పుడది 1,500 గ్రామాలలో 50,000 మంది నూలువడికే వారి కుపకారం చేస్తున్నది. ఇంకా సాలీలు, చాకళ్ళు, అద్దకపు పనివారు, రంగులువేసేవారు, కుట్టుపనివారు ఎంతమందో దానివలన జీవనం చేస్తున్నారు.

ఖద్దరు దేనికి చిహ్నమని సకలత్ వాలా అడుగుతున్నాడు. అది నిరాడంబరమునకు చిహ్నం కాపట్యమునకు కాదు. పేదలకది అనుకూలంగా ఉంటుంది. అంతేకాదు మనం బాగాఉన్న రోజులలో, అత్యైశ్వర్యవంతుల యొక్కయు అత్యుత్తమ కళాప్రియులైన స్త్రీ పురుషులయొక్కయు శరీరాలనది అలంకరిస్తూ ఉండేది. మళ్లీ దాని నాస్థితికి తీసుకొనిరావచ్చును. ఖద్దరు ఉద్యమం పురాతన శిల్ప

కళలను పునరుద్ధరిస్తూన్నది. అది యంత్రాలనన్నిటినీ ధ్వంసం చేయవలెనని ఉద్దేశించడం లేదు. కాని వాటి అవసరమైన పెరుగుదలను ఆపి సక్రమ పంథాలో నడిపిస్తుంది. పేదల ఉపకారార్థం వారి కుటీరాలలోనే పని చేసుకొనేటందుకు అదియంత్రాల నుపయోగిస్తుంది. రాటమే ఒక మనోజ్ఞమైన యంత్రం.

ఖద్దరు పేదవారిని భాగ్యవంతుల బంధమునుండి విడిపిస్తుంది. పై తరగతులవారికీ అట్టడుగు జనానికి మధ్య ఒక విధమైన నైతిక ఆధ్యాత్మిక సంబంధమును కల్పిస్తుంది. భాగ్యవంతులు వారికడనుండి తీసుకొన్నదానిలో కొంత తిరిగీ పేదలకిప్పిస్తుంది.

ఖద్దరు యేఒకటీ కుటీర పరిశ్రమకు స్థానభ్రష్టత కల్పించదు. పైగా అది గ్రామపరిశ్రమలన్నిటికీ కేంద్రస్థానమవుతూన్నదనికూడా నానాటికి తెలిసివస్తూన్నది. విచ్ఛిన్నమైన్న కుటుంబంగల వితంతువుకు ఖద్దరొక ఆశాకిరణమవుతూన్నది. అయితే ఇంకా ఎక్కువ సంపాదించుకొనగలిగినయెడల అది ఆటంకంకాదు. అంతకంటె ఎక్కువ మంచిపని చూచుకొనేవారినెవరినీ అది అడ్డుకోదు. ఏదో ఒకపనిచేయవలసిన అవసరమున్నవారికి ఖద్దరు గౌరవమయిన వృత్తిని కల్పిస్తూంది జాతియొకటి తీరిక సమయాలనది సద్వినియోగం చేస్తున్నది. ఎక్కువ లాభదాయకమైన ఉద్యోగమును చూపేవారు చేసే పనినిగూర్చి గౌరవనీయుశయిన 'కాంమేడ్' గర్వంతో ఉదాహరిస్తున్నాడు. అ పని ఖద్దరు తనంతట తాను చేస్తున్న సంగతి ఆయన తెలుసుకోవాలి. అది కొంతమంది జేబులలో రూపాయలు వేయకుండా పేదల జేబులలో అణాలు వేయజాలదా

నగరాలలో పని ప్రారంభించినవారు, మంచిపని చేస్తూన్నా రన్నమాట నిజమేకాని, వారు అసలు సమస్యయొక్క అంచునుమాత్రమే స్పృశిస్తున్నారు. ఖద్దరు కేంద్ర స్థానాన్ని స్పృశిస్తూన్నది. అందువలన తక్కిన అన్నిటినీ ఇముడ్చుకొంటూన్నది.

ఈ ఓర్పులేని కమ్యూనిస్టుయొక్క ఉత్తరంయావత్తూ నగరాల మీదనే కేంద్రీకరిస్తూ, 700,000 గ్రామాలలో కనిపిస్తూన్న ఇండియా పరిస్థితులనూ, ఇండియాను గమనించడమే లేదు. నేటి ఆధునిక నగరాలు ఆరూ శరీరానికి కణతులులాగా పెరిగి ప్రస్తుతం గ్రామస్థుల జీవరక్తాన్ని పిండే దుష్కృత్యమునకు మాత్రమే తోడ్పడుతూన్నవి. ఖద్దరా పద్ధతిని సంస్కరించి, దానికి పరివర్తనం కలిగిస్తూ నగరాలకూ గ్రామాలకూ మధ్య ఉత్తమ సంబంధమును స్థాపించేటందుకు ప్రయత్నిస్తుంది. నగరాల అవమానకరములయిన అపరాధములవలన గ్రామస్థుల జీవితమునకు స్వాతంత్ర్యమునకు నిరంతరం భీతి కలుగుతూన్నది.

తనకుతాను నిర్మాణం చేసుకోవలసిన పనిని దానికున్నందువలనను, అది ఇండియా అంతటికీ వర్తించేది కనుకనూ, ఖద్దరులో అత్యుత్కృష్టమైన నిర్మాణశక్తి ఉన్నది. ఆకాశమునుండి ఖద్దరు వర్షించిన యెడల అది చాలా దుఃఖ కారణమవుతుంది. అయితే వస్తులు పడుకొంటూన్న లక్షలాది సామాన్యప్రజల యొక్కయు, మధ్యతరగతులకు చెందిన వేలకొలదీ స్త్రీ పురుషులయొక్కయు, హృదయపూర్వక సహకారంతో మాత్రమే అది ఉత్పత్తికావలసిఉన్నది గనుక అది విజయం పొందడం అంటే శాంతి పద్ధతుల ద్వారా, ఊహించడానికి వీలైనంత ఉత్తమ నిర్మాణం

జరిగిందన్న మాట. వంటచేయడం పునరుద్ధరింపబడవలసి ఉండి అటువంటి నిర్మాణమే జరుగవలసి యున్న యెడల, ఖద్దరుకే గుణమును నేనాపాదిస్తున్నానో దానికి కూడా అదే గుణాన్ని నేనాపాదిస్తున్నాను.

జమ్‌షడ్ పురంలో నేను కార్మికులలో జేసిన పనిని గూర్చి నా కమ్యూనిస్టు సఖుడు తప్పుపట్టుకొంటున్నాడు. అందుకు కారణం నేను టాటాలనుండి కాక కార్మికులనుండి సన్మానపత్రముల గ్రహించినందుకు. ఆయన అనంగీకారం బహుశా శ్రీ. శే. రతన్ టాటా అధ్యక్షత వహించినందుకు. కాని నేనుమాత్రం ఆగౌరవానికి లజ్జించడం లేదు. టాటా దయాళువు గానూ పరహితాభిలాషియైన యజమాని గానూ నాకు కనిపించాడు. కార్మికుల కోరికలన్నింటినీ ఆయన తక్షణం తీర్చాడు. తరువాత ఆయన వారి ఒడంబడికను గౌరవంగా కాపాడుతూన్నట్లుకూడా నాకు తెలిసింది. నా కార్యకలాపమునకు భాగ్యవంతులునూ పేదవాళ్లనూ కూడ అడిగి చందాలు పుచ్చుకొంటూ ఉంటాను. భాగ్యవంతులు సంతోషంగా నాకు చందాలిస్తారు. ఇది నేను నావ్యక్తివిజయంగా భావించడం లేదు. ఎంత అసమగ్రంగానైనా నేను ప్రాతినిధ్యం వహించేటందుకు ప్రయత్నిస్తూన్న అహింసయొక్క విజయమది. నేనెవరి సిద్ధాంతాలనూ విధానాలనూ ప్రతికూలిస్తూ ఉంటానో వారందఱి విశ్వాసమునకు ప్రేమకూ నేను సాధారణంగా పాత్రుడను కావడమే నాకు నిరంతరం సంతృప్తికరమైన విషయం. దక్షిణ ఆఫ్రికావారు వ్యక్తిగతంగా నా యందు విశ్వాసముంచి వారి సుహృద్భావమును నా యెడల విస్తరింప చేశారు. బ్రిటీష్ రాజకీయ తంత్ర

మునూ విధానమునూ నేను నిరసిస్తూన్నప్పటికీ వేలకొలదీ ఆంగ్ల స్త్రీ పురుషుల విశ్వాసమును నేను చూరగొంటూనే ఉన్నాను. ఆధునిక భౌతిక సభ్యతను నిరాఘాటంగా నేను నిరసిస్తూన్నప్పటికీ, నా ఐరోపా అమెరికా మిత్రవలయం నానాటికీ విస్తరిస్తూనే ఉన్నది. మళ్లీ అదికూడా అహింసా విజయమే.

ఇక నగరాలలోని కార్మికులనుగూర్చి. ఏమీ అపోహా లేకుండునుగాక ! కార్మిక సంఘ నిర్మాణమునకు నేను ప్రతికూలుడనుగాను కాని తక్కిన ప్రతి విషయం వలెనే ఇదికూడా భారతీయ పద్ధతులమీద లేక మీ కిష్టమైతే నాపద్ధతులమీద జరుగవలెనని నా కోరిక. భారతీయ కార్మికునకది సహజంగానే తెలుస్తుంది. పెట్టుబడిదారులు కార్మికులకు విరోధులని నేను భావించను. పరస్పర వారు సహకారం చేసుకోవటానికి పూర్తిగా సావకాశం ముందని నా అభిప్రాయం. నేను దక్షిణ ఆఫ్రికాలోనూ, చాంపరాన్ లోనూ, అహమ్మదాబాదులోనూ, అవలంబించిన కార్మిక నిర్మాణ విధానం పెట్టుబడిదార్లపై విరోధ భావంతో అవలంబించబడినది కాదు. ఈ ప్రతి సందర్భంలోనూ, అవసరమని తోచిన నిరోధం పూర్తిగా విజయం పొందింది. సమవిభజన నా ఆదర్శం. కాని నేను గ్రహించగలిగినంతవరకది సిద్ధించజాలదు. కాబట్టి నేను న్యాయమైన విభజనకు పనిచేస్తున్నాను. దీనిని నేను ఖద్దరుద్వారా సాధించవలెనని ప్రయత్నిస్తున్నాను. దానిని సాధించడం వలన కేంద్రంలో బ్రిటిష్‌వారి స్వార్థ విధానము అంకురం లేకుండా పోతుంది. అప్పుడు బ్రిటిష్ సంబంధం పరిశుద్ధమవుతుంది. కాబట్టి ఆ అర్థంలో ఖద్దరు స్వరాజ్యానికి దారితీస్తుంది.

నేను మహాత్ముని కర్మను. మహాత్ముని విడిచిపెట్టవలెను. నేనసహాయవాదినైనప్పటికీ నన్ను 'మహాత్ముడ'ని పిలిచి నా పాదాలకు నమస్కరించడం నేరంగా చేసే శాసనాన్ని నేను బలపరుస్తాను. నా అంతట నేను ఆ శాసనాన్ని అమలుపరచగలచోట్ల అనగా నా ఆశ్రమంలో అది నేరం.

యంగిండియా, 17-3-1927.

# 65

# రత్నగిరి ఉపన్యాసం

రత్నగిరి లోకమాన్యుని జన్మస్థానం కావడంచేత భారత దేశమంతకూ సంబంధించిన పుణ్యక్షేత్రంగా దానిని వర్ణించి గాంధీజీ యిలా అన్నారు:

మీరు లోకమాన్యుని స్వరాజ్య మంత్రము నెఱుగుదురు ఆ మంత్రమును ఆచరణలోకి తెచ్చేటందుకు నాకన్న ఎక్కువగా ప్రయత్నించిన వారెవరూ లోకమాన్యుని అనుచరులలో నున్నట్లు నేననుకోను. నా ప్రయత్నాలతో సమానంగా ప్రయత్నించినవారు చాలామంది ఉండవచ్చును. కాని నాకన్న ఎక్కువ కృషి చేసినట్లు చెప్పుకోగలవారెవరూ లేరు. స్వరాజ్యం మన జన్మహక్కు కావడమే కాక, దానిని పొందడం మన పవిత్రధర్మమనికూడా నాకు తెలుసును. స్వరాజ్యానికి మనం దూరమైనకొలదీ మానవత్వానికికూడా మన దూరమవుతున్నాము. స్వరాజ్యం లేకుండా మన సర్వశక్తులనూ సమగ్రంగా ప్రదర్శించడం సాధ్యంకాదు. లోకమాన్యుడుద్దేశించిన స్వరాజ్యం, రత్నగిరి జనానికిగానీ మహారాష్ట్రులకుగానీ కాదు. అది ఇండియా అంతటికీ, ధనికులకూ దరిద్రులకూ కూడా సంబంధించింది. పేదలకు తినేటందుకు తగినంత తిండి ఉంటేనేతప్ప స్వరాజ్యమునకర్థంలేదు. మరి మిల్లులకెందుకు ఉపకారం చేయకూడదని మీరడుగుతారు. షోలాపూరు మిల్లుల యజమాని సేత్ నరోత్తమ మొరార్జీ నా మిత్రుడు. నేనాయన కుమారుని కతిథిగా ఉన్నప్పుడు ఆయన నామీద ఎంతో ప్రేమ కురిపిం

చాడను. అంతమాత్రంతో నేను షోలాపూరు మిల్లు బట్టలనుపయోగించి 'పేదవాళ్లయిన' ఆ శేఠ్ నరోత్తముని, ఆయన కుమారునీ సేవించవలెనని అర్థమా? వారి బట్టను నేనుపయోగించినందువలన నేను పేదల కుపకారం చేస్తున్నానని వారుకూడా అనరు.

కొంకణ చాలా పేద దేశమని ప్రతిచోటా వింటూంటాను. మీరు పేదవారయితే మీ స్థితి సహించలేనిదిగా ఉండాలి. మీ ప్రాంతాలనుండి బీదవారు బొంబాయికి పోయి బ్రతుకుతున్నారని మీ రంటున్నారు. వారక్కడ బ్రతుకుతూన్నందు కెన్ని కష్టనష్టాల పాలవుతున్నారో మీకు తెలుసునా? వెలుతురు గాలీలేని కొద్ది అడుగుల పొడుగు, కొద్ది అడుగుల వెడల్పాగల చిన్ని చిన్ని గుడిసెలలో, శరీర పరిశుభ్రతతోగానీ సభ్యతతోగానీ నిమిత్తంలేకుండా అనేక మంది స్త్రీ పురుషులు కట్టకట్టుకొని జీవించవలసివస్తూన్నది. మీ తల్లులను, తోబుట్టువులను, ఆ పరిస్థితులలో బ్రతికేటందుకు మీరు పంపడానికి సంసిద్ధంగా ఉన్నారా? బొంబాయి మిల్లులకు పోయే స్త్రీలు మీ తల్లులు తోబుట్టువులూ అనీ, మగవారు మీ సోదరులు అనీ మీ రంగీకరించరా? మీ సోదరీ సోదరులు తాగుబోతుతనానికీ, అవమానకర జీవితానికీ అలవాటుపడి ఇంటికి తిరిగివచ్చి ఆ దురభ్యాసపు అంటు జాడ్యాలను వ్యాపింపచేస్తూంటే చూడడం మీ కిష్టమేనా? అక్కడ ఎలాగో ఎనిమిదణాలు సంపాదించుకోవడానికి ఇన్ని భయంకర కష్టనష్టాల పాలుకావడం అవసరమా?

మనకు నిజమైన గోసంరక్షణ అంటే ఏమో తెలియదు. కనుకనే మన పశువులు నశించిపోతూన్నవి. నిజమైన అర్థశాస్త్రమూ, సమాజ శాస్త్రమూ మనకు తెలియకపోబట్టే,

మన గ్రామాలు ధ్వంసమయినవి. చర్ఖా ఆ విధ్వంస విధాన మును నిరోధించగలదు. మన దేశంలో ప్రతిమనిషికీ రోజుకు ఎంత ఆదాయం వస్తూన్నదో మీకు తెలుసునా? మన అర్థ శాస్త్రజ్ఞులు ఒక అణా ఆరుపైసలాదావస్తూన్నదని అంటు న్నారు. అదికూడా తప్పు అభిప్రాయాన్నే కలిగిస్తూన్నది. ఒక నదియొక్క లోతు కొన్ని స్థలాలలో ఆరడుగులు, మఱి కొన్ని స్థలాలలో రెండడుగులు ఉంటే ఆ నదియొక్క సగటులోతు నాలుగడుగులని ఎవరైనా లెక్కకట్టుకొని నదిని దాట సాగినయెడల అందులో మునిగిపోకుండా ఉంటాడా? సగటులెక్కలిలాగే తప్పు త్రోవలను పట్టిస్తూ ఉంటవి. పేదవాని ఆదాయం, రాజప్రతినిధి ఆదాయం, కోటీశ్వరుని ఆదాయం, అన్నీ కలిపి సగటాదాయం తేల్చబడింది. కాబట్టి నిజమైన ఆదాయం మనిషికి మూడు కాసులు ఉండడం కూడా కష్టం. చర్ఖా సహాయంతో మఱొక మూడు పైస లదనపు ఆదాయాన్ని నేను చేకూర్చగలిగినయెడల నేను చర ఖాను నా కామధేనువనడం సమంజసంకాదా? కొంతమంది నాకు మానవాతీత శక్తులను అంటకడుతున్నారు. మఱికొంత మంది నాకు అద్భుతమైన శీలం ఉందంటున్నారు. నే నెవ్వ రినో దేవునికే తెలియాలి. సత్యాగ్రహంయొక్క శక్తిని గూర్చి అనంగీకారం ఉండేటందు కవకాశముంది. కాని చర ఖాను గూర్చిన ప్రత్యక్ష విషయాల సందర్భంలో అనంగీ కారం ఉండడానికి కారణం కలదని నేననుకోను. ఇండి యాలో దారిద్ర్యమే లేదనీ, కొన్ని కాసులైనా లేనందున ఎవరో కొద్దిమంది మాత్రమే వస్తులుంటున్నారనీ నన్నెవరైనా నేడు ఒప్పించేయెడల నేను తప్పుచేసినట్లు ఒప్పుకొని రాట్నాన్ని నిరాకరిం చేస్తాను.

కాబట్టి కొంకన్ పేద దేశమని మీరు చెప్పినప్పుడు మీ అభిప్రాయమేమో మీ మనస్సులో ఉంచుకోండి అని నేను మిమ్మలను కోరుతున్నాను. మీరు నిజంగా పేదవారే అయితే మీ దారిద్ర్యమును పోగొట్టుకొనగలిగినదీ మీ స్త్రీల గౌరవమును కాపాడగలిగినదీ చర్ఖావంటిది మఱొకటి లేదు. ముందుగా చరఖాకొఱకు దాని ఆనుషంగిక వస్తువులకొఱకూ ప్రయత్నించండి! తక్కినవి మీకు లభించగలవు. జాతీయ లక్షణము, సార్వజనీన లక్షణమూగల అటువంటి వస్తువును మీ రెలా గమనించకుండా ఉండగలరు? దానిని పరిహాస్యం చేయడంకానీ తృణీకరించడంకానీ లోకమాన్యుని అనుచరులకు ఉచితమా?

నన్నడ్డుకొట్ట ప్రయత్నించిన ఒకానొక యువకునివలెనే మీరుకూడ 'లోకమాన్యుని కిది యిష్టమే అయితే దీనిని చేపట్టవలసిందని ఏల ఆయన కోరలేదు?' అని అడుగవచ్చును. మీ ప్రశ్నవలన నేను మోసపోను. లోకమాన్యుడు స్వదేశీని గూర్చి వివరించినప్పు డాయన మనస్సులో ఖాదీ ఉన్నా లేకపోయినా, ఆయన స్వదేశీలో ఖాదీ చేరకుండా ఉండేటందుకు వీలులేదు. నేను లోకమాన్యుని వారసుడను. ఆయన నాకిచ్చిన పైతృకధనమునకు మఱికొంత చేర్చనియెడల, నేనా తండ్రికి తగిన బిడ్డను కాకుండాపోతాను. లోకమాన్యుని సందేశాన్నిగూర్చి నేను చాలా ఆలోచించాను. దానికి తోడు నా అనేక సంవత్సరాల అనుభవాన్నికూడా జోడించాను. ఆ పిమ్మట లోకమాన్యుని సందేశంలోని భావం, ఖాదీ అయితీరాలని నిర్ణయించాను. ఆయన ఏమిచేస్తూ వచ్చారో మీకు తెలుసునా? ఆయన మరణానికి ముందు కొద్ది కాలం క్రిందట జరిగిన ఒక సంగతి మీకు ముచ్చటిస్తున్నాను. ఖిలాఫతు విషయంలో మౌలానా షౌకతాలీ ఆయనను

దర్శించినప్పుడు "గాంధీ సంతకం పెట్టిన ప్రతిదానిమీద నా సంతకం పెడతాను. ఈ విషయంలో ఆయన కెక్కువ తెలుసునని నా నమ్మకం" అన్నాడు లోకమాన్యుడు. కాబట్టి స్వదేశీనిగూర్చి చెప్పినప్పుడు లోకమాన్యుని మనస్సులో ఖాదీ లేకపోయి ఉండవచ్చును. అయితే నేమి? మన మిక్కడ కళ్లజోళ్లను తయారుచేస్తున్నామనుకోండి! ఎవరో ఒకరు వచ్చి 'వాటిని మే ముపయోగించజాలము; వాటిని ఉపయోగించవలసిందని లోకమాన్యుడు మాకు చెప్పలేదు' అంటే సమంజసంగా ఉంటుందా? ఆయనను మనము అక్షరవాదప్రియుడని తోసివేస్తాము. గీత అటువంటి వానిని 'వేదవాదరతు' డని వర్ణించింది. వేదాలకు కేవలం భాషను బట్టి వ్యాఖ్యానంచేసే మనిషి వాటి అనంతార్థమును గ్రహించ లేనట్లే, లోకమాన్యుని సందేశమును అక్షరశః వ్యాఖ్యా నించేవారుకూడా దానిలోని అనంతశక్తిని జారవిడుస్తు న్నారు.

మరొకరు వచ్చి 'ముసల్మానులు మనలను తమ మతంలో కలుపుకొంటూంటే మీ ఖాదీమాట వినేవారెవరు?' అని ప్రశ్నిస్తారు. ఎవరో వచ్చి ఇస్లాం మతమును పుచ్చుకోవలసిం దని బలవంతం చేసినంతమాత్రాన మీరు ముసల్మానులయ్యే టంత అశక్తులయినారా? అని నేను ప్రశ్నిస్తున్నాను. మీలో నిజమైన 'ధర్మము' ఉంటే దానిని అతిక్రమించడాని కెవ్వ రికీ ధైర్యం ఉండదు. అయితే ఖాదీద్వారా మన ధర్మాన్ని కూడా రక్షించడానికి నేను వాంఛిస్తున్నాను. ఖాదీ అనగా హిందూ స్త్రీలకేకాక ముసల్మాను స్త్రీలకుకూడా ఉపకారం చేయడమే. బెంగాలులోని ఒక మౌల్వీ కొంతమంది ముస ల్మాను స్త్రీల కడకుపోయి, ఖాదీ ఉద్యమం హిందూ ఉద్యమం గనుక నూలు వడకవద్దని చెప్పినాడు. రెండురోజు లాయన

మాట విన్నారు. కాని మూడవనాడు పత్తికోసం మళ్లీ వచ్చారు. కాక వారేమి చేయగలరు? వారు పస్తులుండలేరు. వారికి పెట్టేటందుకు మాల్వీకడ అన్నం లేదు. ఆకలితో పీడింపబడుతూన్నప్పుడు విశ్వామిత్రునివంటి మహార్షి నిషేధిత వస్తువును దొంగిలించికూడా తినడానికి తయారైనాడని విద్వాంసుడైన మహాభారత గ్రంథకర్త వివరించి ఉన్నాడు. కాబట్టి ఆకలితో బాధపడుతూన్న ఆడదిగానీ మగవాడుగానీ దేనికి లోబడుతారో యెవ్వడూ చెప్పలేడు. కాబట్టి దారిద్ర్యమును తగ్గించుకొని మీ స్త్రీల గౌరవమును రక్షించుకోవలెనంటే మాత్రం మీరు ఖాదీని చేపట్టవలెనని చెప్పుతున్నాను.

శుద్ధి ఉద్యమంలో పాల్గొనవలెనని నన్ను కొంతమంది కోరుతున్నారు. మహమ్మదీయులు, క్రైస్తవులుకూడా తమ తమ మతాలలో కలుపుకొనే పద్ధతిని మానవలెనని నేను కోరుతూన్నప్పుడా ఉద్యమంలో నేనెలా పాల్గొనగలను? ఒకానొక ప్రత్యేక మతంలో—హిందూ మతంలోకాని, క్రైస్తవ మతంలోకాని, ఇస్లాం మతంలోకాని—కలిసిన మాత్రంతోనే మనిషి సజ్జనుడవుతాడనిగానీ, మోక్షం పొందుతాడనికానీ అనుకోవడానికి వీలులేదు. హృదయపరిశుద్ధతపైననే, శీలపరిశుద్ధతకానీ మోక్షంకానీ ఆధారపడి ఉంటుంది. కాబట్టి నేను హిందువులకు 'మీ యిష్టంవచ్చిన పనిచేయండి, కాని నావలెనే పరిపూర్ణంగా ఆలోచించి నిర్ణయానికి వచ్చిన మనిషిని మాత్రం, అతను చేయజాలని పనిని చేయమని చెప్పకండి' అని సలహా యిస్తున్నాను. ఇంతా అయితే మనిషికిగల శక్తి పరిమితమయినది. నా శక్తికి లోబడిన పనిని నేను చేయగలను నా శక్తికి మించిన పనిని నేను చేయజాలను. ఒకటే-సారిగా నేను నూరు పనులను కాదు

గదా ఒక ఆరు పనులనుకూడ చేయజాలను. ఒక్కొక్క సమయంలో ఒక్కొక్క పనిని నేను సరిగా నిర్వర్తించగలిగి నట్లయితే కృతార్థుడనైనట్లుగానే భావిస్తాను. చరఖా సాధ్యమైనంత ఉత్తమ సంఘటనోద్యమమని మీరు నాతో ఏకీభవించినట్లయితే, మీరు చేయగలిగినంత సహాయం చేయండి నాకు.

—యంగిండియా, 17-3-1927

# 66

# జీవితచక్రము - వేదాలు

ఆండ్ వాస్తవ్యుడైన పండిత శతవలేకర్ 1922 లో హిందీభాషలో 'వేదమే చరఖా' (వేదాలలో చరఖా) అనే గ్రంథంవ్రాసి నేను యరవాడా ఖైదులో విశ్రాంతి తీసుకొంటూన్నప్పుడు నాకొక ప్రతి పంపించారు. అప్పుడా పుటలను తొందర తొందరగా కుతూహలంతో చూచాను. కాని అభ్యుదయయుగంగా పరిగణింపబడుతూన్న ఈకాలంలో చర్ఖానుగూర్చి వేదాలలో ఉన్నదని తెలుసుకొన్నంత మాత్రాన మనకేమి ఒరిగిందని నాలో నే ననుకొన్నాను. మన పూర్వీకు లెప్పటివాళ్లో వాళ్ల కుటీరాలలో అనేకమైన యితర పనులు చేసినట్లుగానే, వడకడం నేయడంకూడా చేశారన్న సంగతి అందరికీ తెలిసిందే. కాని మన మా పను లిప్పుడు చేయడంలేదు. అందువల్ల ఈ పుస్తకం ఆచరణలో ఎక్కువ ప్రయోజనకరమైనది కాదు, అని నాలో నేను తొందరపడి తీర్మానించుకొని దానిని నొక ప్రక్కను ఉంచేశాను. నేను జబ్బుతో పక్కమీద ఉండి శక్తి వున్నంతవరకు నెమ్మదిగా చదవడానికి తిరిగి నా కవకాశం వచ్చింది. పండిత శతవలే కర్ దే మరొకపుస్తకం, ఆయన వ్రాతలనుగూర్చి నన్నాకర్షించింది. (దానినిగూర్చి ఎక్కువగా ముందు వ్రాస్తాను) మొదటిదాని ప్రతి మరొకటి మళ్లీ నా కిప్పుడు పంపించారాయన. అది రెండవ ముద్రణంకూడా పడ్డట్లు తెలుస్తూన్నది. ఈ పర్యాయం దానిని ఎక్కువ జాగ్రత్తగా చదివాను. గ్రంథకర్త ఉదాహరించిన ఆ మంత్రాలు కేవలం మన పూర్వులాకాలంలో వడుకుతూ

నేస్తూ వుండిరన్న విషయమును నిరూపించడమేగాక బహుశా రాటమును నూతన దృక్పథంలో చూడగలిగేటట్లు చేస్తున్నవి. వడికేవారికీ నేసేవారికీ ప్రధానమంత్రముగా పరిగణింపబడతగిన ఋగ్వేద మంత్రాలను (ఋగ్వేదం X, 53-6) గ్రంథకర్త ఉదాహరించాడు. అవి స్వేచ్ఛగా ఈ దిగువ అనువదింపబడినవి.

"దారంవడికిన తరువాత దానికి తళతళలాడే రంగువేసి, ముడుపులు లేకుండా నేసి, జ్ఞానులుచూపిన మార్గాలను రక్షించుకొంటూ, బాగా యోచనతో భావి సంతానాన్ని దివ్యజ్యోతికి తీసుకొనివెళ్లు. లేక (గ్రంథ కర్త అనువాదప్రకారం) దివ్య సంతానాన్ని పొందు. ఇది నిజంగా కవుల పని."

ఈ అనువాదం సరియైనదే అయితే-గ్రంథకర్త కేవలం తన అనువాదమేగాక గ్రిఫిత్సు అనువాదమునుకూడా తన పుస్తకంలో ఉదాహరించి ఉన్నాడు—, వేదకాలంలో కేవలం వడకడం ఉన్నదని మాత్రమేగక, అది ఉత్తమో త్తములైన స్త్రీ పురుషులకు అతి సామాన్యులకూ పైతం వృత్తిగా ఉన్నదనికూడా ఈ మంత్రం నిరూపిస్తూన్నది. అది వైదుష్యంచే నిర్మింపబడిన మార్గాలలో ఒకటనీ దానిని రక్షించడం కవులపని అనీకూడా ఆ మంత్రం తెలియచేస్తూ న్నది. మన కవీశ్వరునికి నేను రాటమును యజ్ఞవిధిగా వినయంతో సమర్పించుకొన్నప్పుడు, అత్యంత పురాతన మైనదిగా గ్రహింపబడుతూన్న వేదప్రమాణం నా వెనుక ఉన్నట్లు నాకు కొంచెమైనా తెలియదు పురాతనమూ పవిత్రమూ అయిన ఈ పరిశ్రమను, కళనూ పునరుద్ధరింప పూనుకొన్నవారందరికీ ఈ మంత్రాన్ని నేనుపదేశిస్తు న్నాను. యజ్ఞవిధిగా వారు వడికేటప్పుడు ఈ మంత్రాన్ని మననంచేసుకొంటూ ఉచ్చరించవలసిందని కోరుతున్నాను.

వారు పురోగమించేటప్పుడు ఆశాభంగాలను అపజయాలను ఎదుర్కోవలసి వచ్చినప్పటికీ, అచంచలవిశ్వాసంతో ఈ మంత్రాన్ని వారు హృదయస్థం చేసుకొందురు గాక.

ఆ గ్రంథమునుండి మరొక మనోహరమైన మంత్రాన్ని వుదాహరించవలెనని బుద్ధి పుట్టుతూన్నది. ఇదికూడా ఋగ్వేదంనుండి దే. (X, 130-1) దాని అర్థమిది.

"నూట ఒక్కమంది శిల్పులీయజ్ఞంలో పాల్గొంటున్నారు అసంఖ్యాకములయిన దారములద్వారా ప్రపంచమంతా వ్యాపిస్తుందది. వయోవృద్ధులయిన రక్షకులిరుగో. వారు "ఇక్కడ నేయండి, ఇక్కడ సరిచేయండి" అంటూ ఈ కర్మకాండలను పరిశీలిస్తున్నారు." కాబట్టి వడకడం నేయడం పురాతనకాలంలోకూడా ఒక యజ్ఞంగా పరిగణింపబడుతూండేదనీ పెద్దలు దానికి జాగ్రత్తగా రక్షణయిస్తూ ఉండేవారనీ మనకు తెలుస్తూన్నది. పురుషులు, స్త్రీలూకూడా వడకడం నేయడం చేస్తూండేవారని గ్రంథకర్త మనకు కావలసినంత సాక్ష్యం చూపించాడు. నిజానికీ పరిశ్రమ వ్యవసాయంవలెనే సార్వజనీనంగా ఉండేది. అంతే కాక కుట్టుపనికూడా ఆ రోజులలో బాగా అభివృద్ధిపొందిందని ఆయన నిరూపిస్తున్నాడు వివిధ ప్రదేశాలలో వివిధ నిమిత్తాలకు వివిధరకాల దుస్తు లుపయోగింపబడుతూండేవి. రైతుకు 'లంగోటీ' ఉంటే రాజుకు ఉత్తరీయం పరిధానం ఉండేవి. రంగులు, సాదా అంచులు, జరీ అంచులు అన్నీ ఉదాహరింపబడి ఉన్నవి వడికేవారియొక్కయు నేసేవారియొక్కయు భాషలోనుండి అత్యంత మనోహరములయిన రూపకాలంకారాలను గ్రంథకర్త ఉదాహరించి ఉన్నాడు.

ఇంత ఆలోచనా పూర్వకంగా వ్రాయబడిన ఈ గ్రంథమునుండి ఇంకా ఎక్కువభాగాలను ఉదాహరించవలెననే కోరికను నేను నిగ్రహించుకోకతప్పదు ఆనాటి యోధులు కూడా ఈ పనులను నెరవేర్చుకుండేటంత అతీతులుగా లేరని నిరూపించే మంత్రంకూడా ఒకటున్నది. వధని దుస్తులను వధువే తయారుచేయవలెనని ఉంది. ఈ ఆచారం ఇప్పటికీ అస్సాములో జరుగుతూనే ఉంది. కాని వేదశాస్త్రిం పరి

శోధకులు కనిపెట్టేటందుకు గ్రంథకర్త ఒక్క విషయమును మాత్రం వదలివేశాడు. ఆయన వేదాలను పరిశీలించగలిగి నంతవరకు, ఉన్నికీ, పట్టుకూ సరిపోయేమాటలు దొరికినవి గాని పత్తికి సరిపోయేమాట ఒకటైనా దొరకలేదట. కాబట్టి మన పూర్వులా రోజులలో ఉన్నిబట్టలు, పట్టుబట్టలను మాత్రమే ధరిస్తూ వుండేవారో, లేక అప్పటికే పత్తిని వారు కనుగొని ఉన్నారో గ్రంథకర్త చెప్పలేకుండా ఉన్నాడు.

—యంగిండియా, 2-6-1927

# 67

# లాంక్‌షైరు ముఠా

సుంకముల ఉపసంఘం (Tariff Board) వారి నివేదికను ప్రచురించడంలో జరుగుతూన్న ఎక్కువ ఆలస్యమే గొప్ప మిల్లు పరిశ్రమకు ఇంకనూ రక్షణ ఈయవలెనని చేయబడే యే సిఫారసైనా నిరాకరింపబడుతుందనడానికి దాదాపు నిశ్చయమైన సూచన. లాంకుషైరుయెడల పక్షపాతంతో జపానుకు ప్రతి... గా ప్రత్యేక సుంకమును విధించి ప్రభుత్వంవారా దేశానికి కోపం కలిగించరు. లాంక్‌షైరు మీద రక్షణ పన్ను వేసి దానికి సంతుష్టి కలిగించే ధైర్యమూ లేదు వారికి. లాంక్‌షైరు అంటే నిజంగా ప్రభుత్వమేనాయె. కాబట్టి లాంక్‌షైరుకు ప్రతికూలంగా ఇండియాకు గట్టి రక్షణ ఈయడం దాదాపు ఆత్మహత్య చేసుకోవడం వంటిది.

లాంక్‌షైరుకు తదితర విదేశీ పోటీకీ ప్రతికూలంగా ఇండియా మిల్లు పరిశ్రమయొక్క రక్షణనుగూర్చిన ఈ విషయం ఇండియాకు సంబంధించినంతవరకు చావు బ్రతుకులతో కూడిన సమస్య. లాంక్‌షైరు విషయంలో కూడా అలాగే తలంపబడుతూన్నది. ఇందులోని నిజాన్ని అర్థంచేసుకోవడానికి దిగుమతుల పట్టీని పరిశీలించవలసిఉంది. లాంక్‌షైరునుండి వచ్చే దిగుమతులు తదితర దిగుమతులన్నిటిలోకీ ఎక్కువ. బ్రిటిష్ దిగుమతులన్నిటిలోకీ దాదాపు సగం వంతు. భారతదేశముయొక్క మహత్తమ కుటీరపరిశ్రమయొక్క భస్మంపైన లాంక్‌షైరు పెరిగింది. ఈ దేశంలోని నిస్సహాయులైన కోటానుకోట్ల ప్రజలను స్వార్థంకోసముపయోగించుకొని

బ్రతుకుతూ ఉన్నదది. దేశీయ మిల్లు పరిశ్రమ నిజానికి ఆగంతుకంగా వచ్చిపడ్డట్లు భావింపబడుతూ ఉన్నది. లాంకె షైరు క్షేమంకోసము దానిని చక్కగా నిర్మూలం చేయడానికి వీలున్నయెడల చలీ చప్పుడూ లేకుండా అది అణచివేయబడు తుంది. లాంకెషైరుయొక్క మహత్తమ ప్రయోజనమునకు, ప్రతి నైతిక హేతువూ కూడా తోసివేయబడుతూ ఉన్నది. ఆ పరిశ్రమయొక్క ఉనికి లాంకెషైరుకూ ఇండియాకూ కూడా ఆపద తెచ్చిపెడుతుంది. అది ఇండియాను దరిద్రవంతంగా చేసింది. ఇండియా దారిద్ర్యం లాంకెషైరుయొక్క నైతిక పతనమునకు హేతువైనది.

దాదాపు తరించడానికి వీలుకాని ఈ అభ్యంతరము నేడు గూని తమ స్థితిని తాము కాపాడుకోవలెనంటే, ఇండియా లోని మిల్లు యజమానులు ప్రజోద్యమంలో పాల్గొని, తమకు రక్షణ యిచ్చేటట్లు ప్రభుత్వాన్ని నిర్బంధించగలిగితేనే గాని వారికాపని ఎప్పటికీ సాధ్యంకాదు. అది దేశము యొక్క హక్కు. దేశంలో ఉండవలసిన ప్రజల నిర్మాణమును గూర్చి నిర్ణయించుకోవడానికిన్నీ దేశంయొక్క ఉనికికి హాని కరంగా ఉంటారనుకొన్నవారిని నిరాకరించడానికిన్నీ దానికి హక్కున్నప్పుడు, దేశంలోకి దిగుమతీ కావడానికి తానంగీక రించతగిన వస్తువులను నిర్ణయించేటందుకున్నూ, తన ప్రజలకు హానికరంగా ఉంటవని తాననుకొన్న వస్తువులను రాకుండా చేసేటందుకున్నూ అంతకన్న ఎక్కువ హక్కున్నది.

మనకు దిగుమతీ అవుతూన్న వస్తువులన్నిటిలోకీ విదేశీ బట్టకంటె ఎక్కువ హానికరమైనది మరొకటి లేదనే విషయం నిస్సందేహం. మిల్లు పరిశ్రమ కొంతకాలంవరకు అభివృద్ధి పొందుతూ ఉండవచ్చును. అనేక కల్పిత హేతువులవలన

గానీ, ఆకస్మికంగా తటస్థించిన అనుకూలసంఘటనల వలనగానీ తాత్కాలికంగాకూడా అది అభివృద్ధికావచ్చును. కాని విదేశీ బట్టకు ప్రతికూలంగా దానికి తగినంత రక్షణ ఉండనియెడల ఎప్పుడో ఒకప్పుడది అడుగంటక తప్పదు. అపని చాలామంది అనుకొనేదానికన్న ఎక్కువ తొందరగా జరుగవచ్చును. ఎప్పుడో ఒకప్పుడు నిజమైన నిలకడగల ప్రజాచైతన్యం కలిగి తీరాలి. అది వెఱ్ఱిగాను, క్రమబద్ధమైనది కాకనూకూడా ఉండవచ్చును. కాని ఆ వెఱ్ఱికికూడా ఒక తీరు ఉంటుంది. లేక అది నేనాశిస్తూన్నట్లు అహింసాయుతమై క్రమబద్ధమైనదిగా కూడా ఉండవచ్చును. ఆ చైతన్యం వచ్చినప్పుడు దేశీయ మిల్లు పరిశ్రమ తమదేనని ప్రజాసామాన్యం గుర్తించని యెడల విదేశీ బట్టకు పట్టవలసినగతే దీనికికూడా అగ్ని జ్వాలలో ఆహుతిఅయ్యే దుర్గతి పట్టుతుంది. కాబట్టి మిల్లు యజమానులుకూడా ఖాదీ ఉద్యమంలో పాల్గొని, అయిష్టంగా ఉన్న ప్రభుత్వంనుండి బలవంతంగా రక్షణ తెచ్చుకోవలసిన తరుణంవచ్చింది. ఈ రెండూకూడా చాలా సంవత్సరాలవరకూ వర్థిల్లుతూండడానికి తగినంత సావకాశముంది. అయితే ఈ రెంటి హద్దులు యిప్పుడే నిర్ణయింపబడి కచ్చితంగా అమలు జరుగుతూండాలి. ప్రభుత్వంవారు తమకు దూరమైనప్పటికీ, వారు ప్రచ్ఛన్నంగా తమకు ప్రతికూలురైనప్పటికీకూడా అప్పుడుమాత్రమే వారికి బాగుపడడానికి సావకాశంఉంది. కాని ఇందుకు, మిల్లు యజమానులు వివేకంతో త్యాగం చేయగలిగి ఉండవలెననీ, వారందరూ కలసి గట్టిగా సంఘటితంకావలెననీ, వారి కార్యక్రమమును కొనసాగించేటందుకు దృఢనిశ్చయంకలిగి ఉండవలెననీ, ముందుగా తెలుసుకోవలెను.

ప్రభుత్వం వారి నిర్ణయమునకు ప్రత్యుత్తరంగా మిల్లు కూలీల జీతాలు తగ్గింపబడబోతున్నవన్న వాడుక అధికార రీత్యా అబద్ధమని తెలియపర్చబడినందుకు నేను సంతోషిస్తున్నాను. అలా జరిగిఉంటే అది ఆత్మహత్య అయి ఉండేది. ఇప్పుడు కావలసింది కార్మికులను ప్రతికూలం చేసుకోవడం కాదు. వారితో కలసి మెలసి పనిచేయడం ; కూలీలను కూడా, మిల్లు యజమానులతోనూ భాగస్వాముల తోనూ ఏజెంట్లతోనూ సమానంగా గుర్తించడం. భాగస్వాములు పెట్టుబడియిస్తే, కార్మికులు పెట్టుబడిని బట్టగా మార్చడానికి శరీరబలం సరఫరా చేస్తున్నారు. కాబట్టి మిల్లు యజమానులు, మిల్లు కూలీలు, ప్రజలు ఈ అంతా కలసిన యెడల ఈ అప్రతిహతమైన కలయికను అలక్ష్యంచేయడానికి ప్రభుత్వానికి ధైర్యమాగదు. ఇందుకు మిల్లు యజమానులకు తగినంత ముందుచూపు, గుండెధైర్యం, దేశభక్తి ఉన్నవా ? ఒక షిల్లింగూ ఆరు పెన్నీల మారకపుధర ఆ పెద్ద పరిశ్రమకు దెబ్బఅనీ, లాంక్‌షైరుకు కానుక అనీ వాదింపబడింది. (ఆ వాదంలో చాలా బలంఉంది) సుంకముల ఉపసంఘం వారి నివేదికపైన చేయబడిన తీర్మానం అటువంటిదే మరొక దెబ్బ. కాబట్టి లాంక్‌షైరుకు మరొక కానుక. ఈ చివరి దెబ్బయైనా మిల్లు యజమానులు సరియైన చర్య తీసుకొనే టట్లు వారికి చలనం కలిగిస్తుందో లేదో అని నాకాశ్చర్య మవుతూన్నది. ఫలదాయకమైన ప్రజోద్యమంచే బలపఱచ బడనియెడల అర్జీలుకానీ శాసనసభా తీర్మానములుకానీ యేమీ పనిచేయవు. నేను ధైర్యంచేసి సూచించిన ప్రజోద్యమం కంటె ఎక్కువ మృదువైన దానిని ఊహించడానికి సాధ్యం కాదని నా వినయపూర్వకాభిప్రాయం.

—యంగ్ ఇండియా, 23-6-1927

# 68

# సుశిక్షితంగా వడకడం

ఏప్రిల్ 21 వ తేదీగల 'స్కాట్స్మన్' పత్రిక నుండి 'లయ విలువ' అనే శీర్షికతోనున్న ఒక ముక్కను ఒకానొక ఆంగ్ల మిత్రుడు నాకు పంపినాడు. అది చేతి పరిశ్రమల ఉపాధ్యాయ సమాజంవారి యాజమాన్యం క్రింద, ఎడింబరోలో ఈస్టర్ మహాసభలో జరిగిన వడుకు ప్రదర్శనమును గూర్చిన వివరము. ఆ సమావేశమునకు డాక్టరు జాన్‌గన్ అధ్యక్షత వహించాడు. మిస్టర్ విలియం కిర్క్‌నెస్, ఉపన్యాసంతో కూడా ప్రదర్శనం చూపెట్టాడు. స్కాట్స్మన్ నుండి, ఉత్సాహజనకమైన ఆ విషయాన్ని ఈ దిగువ ఉదాహరిస్తున్నాను.

“వడకడం నేయడం అనాదికాలం నుండీ అత్యుత్కృష్టములయిన గృహపరిశ్రమలుగా ఉంటూండేవి” అన్నాడు మిస్టర్ కిర్క్‌నెస్. తొలినాటి తంతుకారులైన పెనిలోపీ అరక్నీ కన్యలను పౌరాణిక తార్కాణాలుగా పేర్కొన్నాడు. మనిషి వాయుక్రియ ననుకరిస్తూ దారం తీయడం నేర్చుకొన్న అనాదికాలం నుండి ఆ కళయొక్క చరిత్ర నాయన ఆమూలాగ్రంగా వివరించాడు. తర్కుశే (distaff) రాట్నమూ ఈ రెండూ ఏవిధంగా క్రమ పరిణామం పొందినవో ఆయన చూపించాడు. పింజ తీయడం, ఏకడం, ఉన్నిని నేతకు వీలుగా తయారుచేయడం మొదలగు వివిధ కార్యకలాపాలనూ ఆయన ప్రదర్శించి చూపినాడు. పిదప అల్లిక ఉన్ని బంతులు ప్రదర్శింపబడినవి. చేతి నేతయొక్క దశలు చూపబడినవి. తరువాత ఉపన్యాసకుని వేదికమీద పోగువేయబడిన వివిధ రకాల చేతిమగ్గాల పనిని స్వయంగా చూపించాడు.

నేతపని పాఠశాలలలో చాలాకాలం క్రిందనే స్థాపించబడిఉంది. కాని వడుకు పని విషయంలో తనకు తెలిసినంతవరకు సరియైన అన్వేషణ ఎన్నడూ జరుగలేదని మిస్టర్ కిర్క్‌నెస్ అన్నాడు. ఈ విషయంలో కొన్ని సంవత్సరాల కాలం తాను కావించిన ప్రయోగాలనుగూర్చి ఆయన

ముచ్చటించాడు, ఆయన మొదటి తరగతి పదమూడేళ్ల వయస్సుగల ముగ్గురు బాలికలతో నడిచింది. వారికి వడకడం కష్టంగా తోచింది. ఏడేళ్ల వయస్సుగల బాలికలకు నేర్పేటందుకు వీలుగా అంతకంటె ఎక్కువ తేలికయిన విధానం ఆచరణలోకి తేబడింది. వివిధ చిత్తవృత్తులు గల పిల్లల విద్యావిధానంలో వడకడంయొక్క విలువను గూర్చి ఆయన చాలా ఎక్కువగా మాట్లాడారు. వారి నా వడుకుపని తప్పకుండా స్థిర చిత్తులనుగాచేసినట్లాయన గమనించారు. భయపడే పిల్లల సందర్భంలో అది చికిత్సగా ఉండినదని ఒక డాక్టరుయొక్క అభిప్రాయాన్ని ఆయన ఉదాహరించాడు.

సరిగా అప్పుడే మిస్టర్ కిర్కునెస్సుయొక్క తరగతి పిల్లలు వేదికపైకి వచ్చి ఒక్కొక్కరే పాఠశాలలో తాము నిర్ణయించుకొని పనిచేస్తున్న రాటాల కదమూర్చని లయబద్ధంగా వాటిని తిప్పడం ప్రారంభించారు. అందువలన వారికి శ్రమకలగడానికి బదులుగా ఉత్సాహం కలిగింది. వారిలో ఇద్దరు బాలికలకు నిద్దురగుత్తు వచ్చింది. ఆ పిల్లలందరూ వారి చిత్తప్రవృత్తులవలనగాని మఱియితర కారణాలవలనగానీ మామూలు పాఠశాలా విద్యావిధానంయొక్క పూర్తిప్రయోజనమును పొందజాలని వారే. ఇక రాటాల నిర్ణయం విషయంలో అత్యంతం నెమ్మదిగా తిరిగేరాటం, మిక్కిలి తక్కువ శక్తిగల బాలికచే నిర్ణయించుకోబడినట్లును, అతి వేగంగా తిరిగేరాటం స్థిమితంగా కూర్చోవడమే చాలా కష్టంగా ఉండే బాలికచే కోరుకొనబడినట్లున్నూ తెలియవచ్చింది.

చేతి పనులలో వడుకుటనుకూడా చేర్చి పాఠశాలలో నేర్పవలసిఉందని వాదిస్తూ, వడకడం, నూరు సంవత్సరాల కిందటి వరకు ప్రతి గృహిణి యొక్క సాధన సామగ్రిలో భాగంగా ఉంటూవచ్చిందని మిస్టర్ కిర్కునెస్ అన్నాడు. దాని లయలో గాత్రచాలనమున కెక్కువ వాంఛనీయము సంతృప్తికరమూ అయిన లక్షణం ఉంది. తమ గాత్రచాలనములు లయాన్వితములుగా నున్నప్పుడు చాలా దుర్బలులైన వారు కూడా ఎక్కువకాలం పనిచేయగలరు.

తరువాతి చర్చలో పాల్గొన్న డాక్టర్ డ్రైవర్, ఒక తరహా బిడ్డకు విద్యనేర్పడంలో, ప్రథమ శ్రేణికి చెందిన వృత్తియొక్క విలువను మిస్టర్ కిర్కునెస్ వివరంగా విశదీకరించాడనడానికేమీ సందేహం లేదన్నాడు. ఈ పనివలన సాధారణ విద్యకు కలిగే విలువనుగూర్చి ఆయన చేసిన వాదనలుకూడా సమంజసమైనవే.

—యంగ్ ఇండియా, 4-8-1927

# 69

# " మజోర్కా మనిషి సాలీడు "

కోయంబత్తూరు వాస్తవ్యులైన శ్రీ బాలాజీరావుగారు కుతూహలపూర్ణమగు ఈ కింది పత్రికా శకలమును పంపినందుకు కృతజ్ఞుడను.

" పామ్ డీ మల్లోర్కా " కడ సముద్రం ప్రక్కను చర్చి నీడలో డీ బుసీయొకడు 'యెజాగ్లీటీ' (రచనను) ని ప్రోత్సహించి ఉండతగినంత దగ్గరగా ఉందది సముద్రానికి - పగలు పండ్రెండు గంటలూ ముందుకూ వెనుకకు పచారుచేస్తూ, పోయేటప్పుడు నేస్తూ, అతని దారాన్ని ఒక దానిని వెనుక పారేసి పోతూంటాడు. ప్రతి రెప్పపాటుకు ఒకడు గజం దారం వడికేటంత చురుకుగా ఉన్నాడతడు. కాబట్టి ఒక నిమిషన్నరలో తన వెనుక ఒక వంద గజాల పైచిలుకు దారం విడిచిపెట్టాడు.

"అతని పనితనము చాలా తేలికగా కనిపిస్తుంది. అయినప్పటికీ వడుకు పనివాని సహజ లక్షణ మతనికి సంక్రమించకుండా ఉన్నట్లయితే, ఆపని సాధించడమెంత అసంభవమో కూడా కనిపిస్తూనే ఉంది. ఆ పనిఅతనికి పదిహేను తరాలనుండి సంక్రమిస్తూ వచ్చింది. అతని నడుము దగ్గర నడుస్తూన్న పట్టుకోశం వలెకనిపించేటట్లుగా, తన శరీర మునకు వలయాకారంగా చుట్టబడి వెంట్రుకలవలె సన్నగానున్న గడ్డినార మోపును మోసుకొని పోతూంటాడతడు. దానిలోద కొద్దిగా అతని మోటు చక్రం మధ్య తగిలించి దానికి దూరంగా నెమ్మదిగా నడుస్తూంటాడతడు. చక్రం

అతని మగ బిడ్డ చేతిక్రింద నెమ్మదిగా తిరుగుతూంటుంది. ఆ బిడ్డ తానెప్పటికీ ప్రయాణం చేయజాలని పడవలను గూర్చి కలలుకంటూ ఆ నీల సముద్రం వంక నిర్భ్రాంత పోయి చూస్తూ ఉంటాడు. అతనుకూడా మనుష్య రూపంలో నున్న సాలీళ్ల పూర్వ తరాలకు చెందినవాడు కావడమే అందుకు కారణం.

ఈ వడికే మనిషి ఎండలో నడుస్తూన్నప్పు డాయన వ్రేళ్లు ఆ పట్టుకోశంలో, వీణావాదకుని సున్నితములైన వ్రేళ్లు తంతుల మీద ఆడుతున్నట్లు, ఆడుతూంటవి అంతట అద్భుతంగా అతనినుండి ఒక సన్నని దారం బయలుదేరి అది అతనిని తిరుగుతూన్న చక్రంతో అనుబద్ధం చేస్తుంది. అప్పు డతడు దూరంగా పోయిన కొద్దీ ఆ చక్రవేగంతో దారం పెరుగుతూ ఉంటుంది. అప్పుడు టోపీలోనుంచి అంతులేని రిబ్బనులను సృజించే పాత ఇంద్రజాలమును ఇతడు కూడా చేస్తున్నాడా అన్నట్లు తోస్తుంది.

“ఈయన, ఈయన పూర్వులు ఆరు బయట గాలిలో ఐయిదు వందల ఏళ్లనుండి వడుకుతున్నారు. ఆ చర్చి నీడ నుండి ఆయన పూర్వీకులు, బార్బరీ ఓడ దొంగలు వస్తున్నారని ముందుగానే తెలియచేసే భయంకరములైన తెరచాపలు మిన్నులు పడ్డచోట కనపడగా అనేక సార్లు చూచారు. ఓడిపోయిన మూరులయొక్క చిన్న చిన్న పడవలు, ఒకప్పుడు వారధికారం వహించిన ద్వీపమును తిరిగి జయించవలెననే వ్యర్థ ప్రయత్నంలో తీరం చుట్టూ దాగి ఉండడం కూడా వారు చూచారు.

“ అతడు వేళ్లతో అంత అద్భుతంగా నూలు ఎలా వడక గలుగుతున్నాడని మీరు ప్రశ్నించిన యెడల, తన బుజా

లను ఎగురవేస్తాడతడు. అతని నల్లని మొగం మిమ్ములను చిరునవ్వుతో చూస్తుంది. ఆయన యేమీ చెప్పలేదు. అసలా సంగతి ఆయనకే తెలియదు. ఆసహ్యకరమైన పేడపురుగుకు సాలెగూడు అల్లడం సాలెపురుగు ఎలా నేర్పలేదో అలాగే ఆయన పసితనమును మీకు చెప్పి నేర్పలేదు. ఆపని కోసం ఆయన పుట్టాడు ; అంతే.

‘‘ ఇరవై మాటల కంటె యెక్కువ చెప్పలేని వయస్సులో ఉన్నప్పుడు, నేను సరిగా నడవలేనప్పుడూ కూడా ఆ విద్య నాకు తెలుసును. అది చాలా తేలిక ; చూడండి అంటాడాయన.

‘‘ అతడింకా మఱి చిన్న కొడుకును పిలుస్తాడు. వాడు పసినాటి తప్పటడుగులు వేసుకొంటూ వచ్చి తన తండ్రి కడ నుండి, పసుపురంగు నార మోపు తీసుకొని, తొట్రుపడని చిన్ని చిన్ని అడుగులతో తిరుగుతూన్న చక్రము నుండి దూరంగా పట్టు కోశాన్ని కోపంతో చూస్తూ పోతుంటాడు. అప్పుడు అతని చిన్ని మెద్దు వేళ్లు ఆ మెత్తని పదార్థంపైన ఆడుతూ ఉంటవి. దానినుంచి అతని తండ్రివలెనే దారం తీస్తాడు. అయితే అది అంతకంటె మొరటుగా ఉంటుంది తక్కువ నైపుణ్యం గలిగి ఉంటుంది. కాని దానితో ప మనిషయినా ఉరిపోసుకోవచ్చును. లేదా కంచరగాడిదను కట్టి వేయవచ్చును. తన వడికే బిడ్డనుచూచి ఆ తండ్రి సగర్వంగా మెఱుస్తున్న కళ్లతో చూస్తూంటాడు.

—యంగ్ ఇండియా, 12-4-1928

# 70

# మద్రాసు వై.యం.సి.ఏ. లో ఉపన్యాసం

## ధార్మిక ప్రసంగము

ఈ సంస్థ అగ్రాసనాధిపతి నన్నొక ధార్మిక ప్రసంగం చేయవలసిందని కోరారు. నేనెప్పుడైనా ధార్మిక ప్రసంగం చేశానేమో గుర్తులేదు. లేక మరొక విధంగా చెప్పవలసివస్తే, నాకు జ్ఞాపక మున్నంత వరకు, నేను చేసిన ఉపన్యాసంగానీ ప్రసంగంగానీ, ధార్మిక సంభాషణ కానిది ఉన్నదేమో నాకు తెలియదు. ప్రజా జీవితమునుగూర్చి నాకు తెలిసిననాటినుండి, నేను మాట్లాడిన ప్రతి మాటకూ, చేసిన ప్రతిచేతకూ వెనుక ధార్మిక చైతన్యము అత్యంతమైన ధార్మికోద్దేశమూ ఉన్నవి. ఈ విషయములో నేను మోసపోవడం లేదనుకొంటాను. నాచర్యలను గూర్చి వినేవారికిగానీ నా మాటలను చదివేవారికిగానీ నేను ఆర్థిక రాజకీయ విషయాలూ ఇంకా అనేక సంగతులూ వ్రాసినట్లు కనిపించవచ్చును. కాని నేను వ్రాసిన ఆ ప్రతి విషయానికి వెనుక ముఖ్యంగానూ ఎక్కువగానూ ధార్మికోద్దేశం ఉన్నదని నేను చెప్పుతూన్నప్పుడు మీరామాటను ఆమోదించవలెనని కోరుతున్నాను.

నేనేమి మాట్లాడవలెనని మీరుద్దేశిస్తున్నారని అడిగినప్పుడు నాయిష్టం వచ్చిందిమాట్లాడమన్నారు. అయితే నేనీ సమావేశానికి వస్తూండగా ఈ సందేశం వచ్చింది కాబట్టి నేను మీముందు బిగ్గరగా ఆలోచించ తలపెడుతున్నాను.

నేను వేలూరులో మత ప్రచారకుడైన మిత్రునితో సత్కాలక్షేపం చేశాను. అక్కడి విద్యార్థులూ నేనూ మన

స్నులు కలసి మాట్లాడుకున్నాము. మరునాడు నాతో ఈ క్రింది విధమైన సంభాషణ జరిగింది, "మీ సంభాషణ చాలా బాగుంది. మీ ఆత్మను గూర్చిన విషయాలు మాట్లాడారు. కాని పూజ్యుడైన డికుర విషయంలో కింగ్ చార్లెస్ తలకాయవలె మీ ఉపన్యాసం మధ్యను ఖాదీ ఎలావచ్చింది? ఆధ్యాత్మిక విషయంతో ఖాదీకి సంబంధం వుండడానికి కల అవకాశమేమిటో మీరు చెప్పగలరా?" అంతటితో ఆగక యింకా ఈ సంభాషణ జరిగింది. "మితపానమును గూర్చి మీరు మాట్లాడారు. మాకది ఆనందం కలిగించింది. నిజంగా అది ఆధ్యాత్మిక విషయం. మీరు అస్పృశ్యతను గూర్చి మాట్లాడారు. ఆ విషయం ఆధ్యాత్మిక మనస్సుగలవారు మాట్లాడినా, ఆధ్యాత్మిక తత్వంగలవారు విన్నా బాగుంటుంది. కాని ఇవి రెండూ కూడా ఖాదీ సందేశం తరువాతనే వచ్చినవి. అది మాలో కొంతమందికి విసుగు పుట్టించింది." జరిగిన సంభాషణా సారాంశము జాగ్రత్తగా నా మాటలలో వివరించాను. అప్పుడు నాకు తోచిన జవాబు చెప్పినాను. ఈ ఉదయం ఆ జవాబు నింకా విస్తరించి చెప్పకోరుచున్నాను.

వడకడం అత్యుత్కృష్టమైన ఆధ్యాత్మిక సందేశం. నేను ఖాదీకి అగ్రస్థానమిచ్చి తరువాతి స్థానాన్నే అంటరాని తనమునకు మితపానమునకూ యిచ్చేమాట చాలానిజం. ఇవన్నీ నేను వేలూరులో విద్యార్థులకిచ్చిన ఉపన్యాసం చివరలో మాట్లాడాను. విద్యార్థులకు పవిత్ర జీవితం ముఖ్యమని తీవ్రంగా ప్రబోధించాను. జీవితం పవిత్రంగా ఉండకపోయి నట్లయితే వారి పాండిత్యమంతా బూడిద పాలేనని పైగా అది నిజమైన ప్రపంచాభ్యుదయమునకు ఆటంకముగా పరిణమిస్తుందనీ కూడా వారికి చెప్పాను. తరువాత ఈ మూడు విషయాలున్నా, ఉదాహరణం కోసం ఇంకా కొన్ని విష

యాలున్నా వారికి నేను చెప్పినాను. ప్రపంచములోని వివిధ ప్రదేశాలలో, కడచిన 35 సంవత్సరాలనుండి నాకుగల ప్రజాసేవానుభవమును బట్టి, కర్మ సంయోగమునకు భిన్నమైనదేదీ, ఆధ్యాత్మిక నైతిక గుణములు కలిగిఉన్నట్లు నేనింతవరకు గ్రహించి ఉండలేదు. నేను చదివినప్పటినుండీ ఆ గొప్ప శ్లోకం నాకెప్పుడూ జ్ఞాపకం ఉంటూనేఉంది. దానిని నేనెప్పుడూ నన్ను వినవచ్చినవారి కందరికి పదే పదే వినిపిస్తూనే ఉన్నాను. "నన్ను ప్రభూ ప్రభూ అని పిలిచే ప్రతి మనిషీ స్వర్గం చేరుకోడు. స్వర్గంలో ఉన్న నా తండ్రి ఇచ్ఛను నిర్వర్తించే మనిషి మాత్రమే స్వర్గాన్ని చేరుకుంటాడు." నేనా శ్లోకాన్ని ఉన్నదున్నట్లుగా ఇక్కడ ఒప్ప చెప్పలేను. కాని ఆశ్లోక మేమిటో మీరు బాగా ఎఱుగుదురు. అది చాలా నిజం. ధార్మిక ప్రజాజీవితంలో ఇరువురి ప్రముఖ తారకాణాలు నాకు జ్ఞాపకం వస్తూవున్నవి. వారు వారి కాలంలో గొప్ప సంస్కర్తలుగాను, ధార్మికత్వమునకు మూల స్తంభాలుగానూ పేరుపడ్డారు. నేనిప్పుడు మీతో 1889, 1890 సంవత్సరాలను గూర్చి మాట్లాడుతున్నాను. అప్పటికి మీలో చాలామంది పుట్టలేదుకూడా. ఆరోజులల్లో నేను మితపాన సభలకు హాజరవుతుండేవాణ్ని. ఆ సంస్కరణలో నాకుత్సాహం ఉండేది. మూలస్తంభాలనబడే ఈ ఇరువురు, గొప్ప మితపాన కార్యకర్తలుగా భావింపబడుతూండేవారు. వారు కొన్ని ఉపన్యాసాల మూలకంగా పనిచేస్తుండేవారు. మితపానంమీద ఉద్రేకపూరిత మహోపన్యాసం కావలసివచ్చినప్పుడెల్లా వారికి చాలా గిరాకీ ఉండేది. వారి పతనాన్ని నేను కళ్లారా చూచానని చెప్పవలసివచ్చినందుకు నాకు చాలా విచారం వేస్తున్నది. ఇద్దరి సంగతీ తెలిసిపోయింది. వారు కార్యకర్తలు కారు. నిరంతరం దేవుడు, ప్రభువు,

జెహోవా, అనే మాటలు వారి పెదవుల మీద ఉంటూ ఉండేవి. కాని అవి వారి పెదవుల కలంకార ప్రాయములుగా మాత్రముండేవి అవివారి హృదయాలలో మాత్రం లేవు. ఈ మితవాన వేదికను వారి నీచవాంఛలను తీర్చుకునేటందు కుపయోగించుకొనేవారు. అందులో ఒకడు సాహసవ్యాపారి. రెండవవాడు నైతిక కుష్ఠరోగి. బహుశా నేనిప్పుడేమి చెప్పబోతున్నానో మీకు తెలిసే ఉంటుంది. ఇండియాలో కూడ మితవాన వేదిక ఎప్పుడూ ఆధ్యాత్మిక వేదికగా ఉంటున్నదని నేననజాలను. అస్పృశ్యతా వేదికకూడ ఆధ్యాత్మిక వేదిక అయియుండి తీరుతుందని నేనన లేను. ఈ దేశములోనే నేడు అనేకమంది ఆ రెండు వేదికలనూకూడా దుర్వినియోగం చేస్తున్నారని ఇదివరకే నాకు తెలుసును. మీతో మాట్లాడుతూన్న ఈ సమయంలో నాకది జ్ఞాపకం వస్తూన్నది. ఇతరులు దానిని తిన్నగానే ఉపయోగిస్తున్నారు. ప్రతి విషయాన్ని ఆధ్యాత్మిక దృష్టితో భావించవచ్చుననీ, చేయవచ్చుననిన్నీ, చేయించవచ్చుననిన్నీ, సంభాషించవచ్చుననిన్నీ, లేక అదేదీ లేకుండానే వ్యవహరించవచ్చునని నీతిని బోధించేటందుకే నేనిది చెప్పవలసి వచ్చింది. రాట్నమునకూ, ఖాదీకి సంబంధించిన సందేశం ఉత్కృష్ట ఆధ్యాత్మిక సందేశం అని నేను మీసమ్ముఖాన నేడు చెప్పదలచుకొన్నాను. ఈ దేశానికది ఉత్కృష్టమైన ఆధ్యాత్మిక సందేశం. కాబట్టి అద్భుత రాజకీయ ఆర్థిక ఫలితాలందులో ఇమిడే ఉన్నవి.

## అర్థశాస్త్రము, మతము.

ఇటీవలనే ఒకనాడు ప్రొఫెసర్ శాం హిగ్గిన్ బోతమ్ అనే ఒక అమెరికన్ మిత్రుడు మాకిరువురికి ఎక్కువ కుతూహలంగా ఉండే ఒక విషయాన్ని గూర్చి వ్రాస్తూ ఇలా

అన్నాడు. ఆ ఉత్తరం యొక్క సారాంశం వ్రాస్తాను. "అర్థ శాస్త్రంతో సంబంధం లేని మతములో నాకు నమ్మకం లేదు. మతానికి విలువ ఉండవలెనంటే అవసరమైనప్పుడు అర్థ శాస్త్రదృష్టితో అది మార్పు చేయబడేటందుకు వీలుగా ఉండాలి." ఈ అభిప్రాయాన్ని నా మనస్సులోని ఒక పెద్ద గుప్తభావంతో పూర్తిగా ఆమోదిస్తూన్నాను. మిస్టర్ హిగ్గిన్ బోతమ్ కు కూడా అటువంటి గుప్తభావం లేదని నే ననడం లేదు. కాని ఆయన పక్షాన నేను మాట్లాడుతూన్నట్లు నేననుకోకూడదు. నా మనస్సులోని గుప్త భావమిది. మతానికి విలువ యేదైనా ఉండవలెనంటే అర్థ శాస్త్రదృష్టితో అది మార్పు చేయబడేటందుకు ఏవిధంగా వీలు ఉండవలెనో అదే విధంగా అర్థశాస్త్రానికేమైనా విలువ ఉండవలెనంటే అది, ఆధ్యాత్మిక దృష్టితో కాని ధార్మిక దృష్టితో కాని మార్పు చేయబడడానికి వీలుగా ఉండాలి. కాబట్టి ఈ ధార్మిక ఆర్థిక ప్రణాళికలలో పరులను స్వార్థంకోసం వినియోగించు కొనే విధానమునకుగాని అమెరికావారి స్వార్థవిధానము వంటి విధానమునకుగాని తావు లేదు. ఒక సుప్రసిద్ధ భారతీయుడు చెప్పినట్లు—ఆ సుప్రసిద్ధుడు సర్ విశ్వేశ్వరయ్యయే. ఆంగ్లేయునికి 30 మంది బానిసలుంటే 36 కూడా—నేను ఉద్దు బాటుకు లోబడి చెపుతున్నాను. అమెరికావారికి 38 మంది బానిసలుంటారు. మతంతో మారకం చేయతగిన నిజమైన అర్థశాస్త్రంలో బానిసలను ఉంచుకోవడానికి తావు లేదు. ఆ బానిసలు మనుష్యులు కావచ్చు. పశువులు కావచ్చు. యంత్రాలు కావచ్చు. అర్థశాస్త్రంలో బానిసత్వమునకే తావు లేదు. ఇక మీరు ఖాదీని తప్పించుకోజాలరని నేను మీకు చెపుతున్నాను. దాని పరిమితి అత్యంత విశాలం. మితపానోద్యమం కొంత మందిని మాత్రమే భరించగలదు. త్రాగుబోతును మద్య

నిషేధకుడుగా మార్చిన వానికది ధన్యవాదాలర్పిస్తుంది. సంస్కర్తయొక్క మాటతో మారిపోయిన త్రాగుబోతును కూడా అది ఆశీర్వదిస్తుంది. అస్పృశ్యత ఈ దురదృష్టదేశం లోని ఏడు కోట్లమందిని తన వృత్తంలోనికి తీసుకుంటుంది. మనలో ప్రతివారు అస్పృశ్యతా నివారణోద్యమంలో పని చేయరు. మీరు అస్పృశ్యునకు తప్పకుండా విద్య చెప్పించ వచ్చును. అతనికోసం మీరు నూతులు తవ్వించవచ్చును. గుళ్లు కట్టించ వచ్చును. ఇవన్నీ అతనిని స్పృశ్యుడుగా చేయ జాలవు. ఈ స్పృశ్యులుగా చెప్పబడే వారంతా తమ గర్వో న్నత్యమునుండి దిగివచ్చి అస్పృశ్యులతో సోదరులుగా మెలగితే నేతప్ప వారు స్పృశ్యులు కాజాలరు. కాబట్టి ఈ సమ స్యను గూర్చి పనిచేయడం మామూలు మనుష్యులకు చిక్కు గా వుంటుందనే సంగతి మీరు గ్రహించగలరు. సత్యాన్ని గ్రహించడం ఒక్కటే జీవితంలో పరమావధిగా పెట్టుకొన్న మనిషిగాను నే చేసేవని చాలా స్వల్పమే కావచ్చును. ఏవి ధమైన మినహాయింపూ లేకుండా అందరూ చేయతగినదాని కోసం ఇండియాలో మిక్కిలి లోతుగా వేళ్లు పాతుకొని పోయిన రోగమునకు చికిత్సగాకూడా నుండకలదాని కోసం నేను అన్వేషిస్తూన్నాను.

## ఖాదీ వృత్తం

ఇండియాలో మిక్కిలిలోతుగా వేళ్లుపాతుకొనిపోయిన రోగం త్రాగుబోతుతనంకానీ, అస్పృశ్యత కానీ కాదనే మాట నిశ్చయం. ఈ రోగాలు పెద్దవి మాట నిజమే. బహుశా వాటితో బాధపడుతూన్నవారికి ఇంకా పెద్దవిగా ఉండే మాటకూడా నిజమే; కాని అసలు రోగంతో బాధ పడేవారి సంఖ్యనుగూర్చి మీరు పరిశీలన చేసేటప్పుడు,

సరియైన చరిత్ర గ్రంథంలోని జనాభా లెక్కలను తీసుకొంటే, అనగా ఉదాహరణానికి సర్ విలియం హంటరు వ్రాసిన చరిత్రనుగానీ, రెండు సంవత్సరాల కిందట ఒకానొక ఉప సంఘము నెదుట మిస్టర్ హిగ్గిన్ బోతమ్ను యిచ్చిన సాక్ష్యాన్ని కానీ తీసుకొంటే బాగా అర్థమవుతుంది. ఇండియాలోని అత్యధిక సంఖ్యాక ప్రజలు దరిద్రంతో పీడింపబడుతూన్నారని హిగ్గిన్ బోతమ్ను అన్నాడు. ఇండియాలోని పదవ వంతు జన సంఖ్య, ఒకపూట చాలీ చాలని చప్పిడి రొట్టె ఒక్క చిటికెడు చవిటి ఉప్పుతో తిని బ్రతుకుతున్నారని సర్ విలియం హంటరు అంటున్నాడు. నేటికీ భారతదేశంలోని పరిస్థితి అలాగే ఉంది. రైలు మార్గానికి దూరంగా ఇంకా లోపలికి పోయినట్లయితే, నేను చూచినట్లుగానే మీరుకూడా గ్రామాలు పేడ కుప్పలుగా తయారవడం చూడగలరు. గ్రామస్థులు లేరక్కడ. రాబందులు కనిపిస్తూంటవి. వారికక్కడ జీవించే అవకాశం లేక పీనుగులుగా తయారైనారు.

ఇండియా కాచ రోగంతో బాధపడుతూన్నది. దానికి తగిన శస్త్ర చికిత్స చేసి, క్షుధాతురులైన లక్షలాది ప్రజల కేదైనా కొంత నేను ముట్టచెప్పవలెనన్నచో ఖాదీ తప్ప మఱొక గత్యంతరం మీకు లేదని నేను చెపుతున్నాను. ఆధ్యాత్మిక మనఃప్రవృత్తి గలిగిన మీరు, మీకన్న తక్కువ కలవారై పొట్టకు, బట్టకూకూడా చాలినంత లేని వారిని గూర్చి తలపోసినా, మీకూ వారికీ ఎడతెగని సంబంధం ఉండ వలెనని కోరుకున్నా, మీకు ఖాదీ తప్ప గత్యంతరం లేదని మఱొకసారి చెపుతున్నాను. కాని మీకది కటువుగా వినిపిస్తుంది. ఎందుకలా వినిపిస్తుందంటే అది కొత్త విషయం

కావడంవలన. చాలామంది కది పగటి కలగానూ, ఆదర్శ వాదుల స్వప్నవృత్తంగానూ కనిపిస్తూండడంవలన. నేనుఖాదీనిగూర్చి యిప్పుడు ప్రసంగించానో, ఆ వేలూరు మిషనరీ స్నేహితుడు మా సంభాషణ చివరలో యిలా అన్నాడు "సరే! అయితే ఆధునికాభ్యుదయాన్ని మీరాపగలరా? కాలాన్ని వెనుకకు నెట్టి, ఖాదీని చేపట్టి కేవలం స్వల్ప మొత్తంకోసం ప్రజలు పని చేసేటట్లు మీరు చేయగలరా?" తన ఇండియానుగూర్చి ఆయనకు తెలియదని మాత్రమే నేను చెప్పగలిగింది. వేలూరు సమావేశము నుండి నేను రెండు స్థలాలకు వెళ్లినాను. ఆ రెండూ అరణి గ్రామాలకు. అక్కడ ప్రజలనుగూర్చి నేనేమీ ఎక్కువగా తెలుసుకోలేదు. కాని వారు నాకంటె తక్కువ మంచి దుస్తులలో ఉండడం చూచాను. అలా ఉన్నవారు పదులు కారు. లక్షలున్నారు. వారు చింపిరి గుడ్డలలో కనిపించారు. యేడాదిలో నాలుగు నెలలు వారికి దాదాపు సంపాదన యేమీ లేదు. వారికి కలిగిన దానిలో ఉత్తమమయిన దిచ్చారు నాకు. వారిచ్చిన దేమిటో నేను చాలా ఆసక్తితో చూచాను. వారు నాకు కానులుకూడా ఈయలేదు. దమ్మిడీ లిచ్చారు.

## దైవకృతం

నవంబరులో ఒరిస్సాకు నాతో పూరీరండి. అది యాత్రా స్థలం. ఆరోగ్య రక్షక ప్రదేశం. సిపాయిలుండే చోటు. వేసంగిలో గవర్నరుకు నివాసస్థానం. పూరీకి చుట్టూ పది మైళ్ల దూరంవరకూ మీకు ఎముకలు, చర్మమూ కనిపిస్తుంది. వారి గుడ్డ పీలికలలో గట్టిగా ముడివేయబడి చెమటతో నానిన దమ్మిడీలను నేనీ చేతులతోనే వసూలు

చేశాను. కొల్హాపురంలో పడిపోయిన నా చేతులకంటె కూడా వారి చేతులింకా ఎక్కువగా పడిపోయినవి. ఆధునికాభ్యుదయాన్ని గూర్చి వారికి చెప్పండి. వారి దగ్గర ఊరికే దేవుని పేరు చెప్పి వారి నవమానించకండి. వారికి దేవుణ్ని గూర్చి చెప్పినట్లయితే వారు మనలను పరమ దుర్మార్గులని దూషిస్తారు. వారు దేవుడనే వాణ్ని ఎఱిగి ఉంటే, దేవుణ్ని భయంకర రూపంలో, ప్రతీకార రూపంలో, క్రూర రాక్షస రూపంలో చూచి ఉంటారు. ప్రేమ అనగా ఏమిటో వారికి తెలియదు. వారికోసం మీరేమి చేయగలరు? సంతోషంగా కనిపించే ఈ సోదరీమణులచే (అక్కడ ఉన్న స్త్రీలను చూపిస్తూ) పట్టు చీరలకు బదులుగా పనికిరాని ఆ ప్రజల మొరటు చేతులతో నేయబడిన ఖాదీ చీరలను కట్టించడం మీకు చాలా కష్టమవుతుంది. ఖాదీ ముతకగా ఉంటుంది. అది చాలా బరువుకూడా. తాకడానికి పట్టు మెత్తగా ఉంటుంది. వారు 9 గజాల పట్టు ధరించగలరు. కాని 9 గజాల ఖాదీ ధరించజాలరు. పాపం! ఒరిస్సాలోని సోదరీమణులకు చీరలులేవు. వారు పీలికలు కట్టుకొంటున్నారు. కాని వారు పూర్తిగా సభ్యతను పోగొట్టుకోలేదు. మనం పోగొట్టుకొన్నాము ఈ మాట నిజం. మనం బట్టలు కట్టుకొన్నప్పటికీ దిగంబరులమే. వారు దిగంబరులైనా బట్టలు కట్టుకొన్నవారే. వీరికోసమే నేను నిరంతరం సంచారం చేస్తూ ఉంటాను. నేను ప్రజలకుత్సాహం కల్పిస్తాను. నా అమెరికన్ మిత్రులకుకూడా ఉత్సాహం కలుగచేస్తాను. ఇంకా నిండు వయస్సురాని యిరువురు హార్వర్డు యువకులను నేను హుషారు చేశాను. వారు నా సంతకం కావలెనని కోరారు. అమెరికనులకు నా సంతకం యివ్వను అన్నాను. నేను వారితో బేర

మాడాను. 'నేను మీకు నా సంతకం యిస్తాను. మీరు ఖాదీని చేపట్టండి' అన్నాను. వారు వాగ్దానం చేశారు. నేను అమెరికన్ పెద్ద మనిషి చెప్పిన మాటను నమ్ముతాను. చాలామంది ఈ పని చేస్తున్నారు—దానినిగూర్చి మీరు పొరపాటు పడకండి—వారికీ పని యిష్టంకూడా.

కాని ఇండియాలోని స్త్రీపురుషులందరూ రాటం దగ్గర పనిచేసేంతవరకూ నాకు సంతృప్తిలేదు. అంతకన్న మంచి పరికరం మీకు లభించినట్లయితే రాటాన్ని తగుల వేయండి. వారివారి యిళ్లనుండి లేపడీయకుండా లక్షలాది ప్రజల అవసరాలను తీర్చగలిగినది ఈ ఒక్క పని మాత్రమే. ఇది చాలా బ్రహ్మాండమైన పని. ఆ పని నేను చేయజాలనని నాకు తెలుసును. దేవుడు చేయగలడని కూడా నాకు తెలుసు. ఎంత బ్రహ్మాండమైన పనియైనా ఎంత గట్టిపనియైనా ఆయన తలచుకుంటే చాలా సుళువు. దక్షిణ ఇండియాలో కొలది సంవత్సరాల కిందట వేలకొలదీ కుటుంబాలను నాశనం చేసినట్లు, గుజరాతులో నేడు వేల కొలదీ కుటుంబాలను నాశనం చేసినట్లు, ఆయన ఒక్క రెప్పపాటులో వారందఱినీ నాశనం చేయగలడు. నేనీ ఖాదీ సందేశాన్ని రాటం సందేశాన్ని దేవునిమీదనూ ఆయన సృజించిన మనిషిమీదనూ సంపూర్ణ విశ్వాసముంచి ప్రచారం చేస్తున్నాను. ఈనాడు మీరు నన్ను చూచి నవ్వ వచ్చును. దీనిని మీరు అల్పవస్తువని అనవచ్చును. మీరు నన్ను విశ్వసించక, ఈ ఎత్తులమారి రాజకీయ చతురుడు మనకు ఖాదీ చూపిస్తున్నాడు ఇంకా ఏవో చాలా రహస్యాలీయన దగ్గర ఉండి ఉంటవనికూడా మీ యిష్టం వచ్చినట్లనవచ్చును. నన్నూ నా సందేశాన్నీగూడా మీరు తప్పుగా వ్యాఖ్యానం చేయవచ్చును. "మేమీ పనులు

చేయలేము ; మేము చాలా పేదవాళ్లమనికూడా మీరన వచ్చును. మీ వాదనలతో నన్ను ఓడగొట్టి నన్ను నోరెత్త కుండాకూడా మీరు చేయగలరని నాకు తెలుసును. దేవునిలో నా నమ్మకాన్ని పోగొట్టుకోజాలనంతవరకూ మీలో నా నమ్మకాన్ని పోగొట్టుకోను. ఆ నమ్మకం నేను పోగొట్టుకోవడం అసంభవం. కాబట్టి, ఖాదీ, రాటపు సందేశాలలో నా నమ్మకం పోదు.

ఇప్పటికి నా హృదయాన్ని విప్పి నేను మీకు స్పష్టంగా చెప్పజాలకపోయినట్లయితే, ఖాదీ సందేశము యొక్క ఆ కొండవంటి ఆధ్యాత్మిక పునాదిని మీకు నేను ప్రదర్శించి ఉండజాలకపోయినట్లయితే, నేనీ ప్రయత్నంలో ఇక జయం పొందగలనని నేననుకోను. నేను జయంపొందే ఉద్దేశంతో ఉన్నానని మాత్రమే మీకు చెప్పగలను. నా పెదవులు నిజమైన సందేశాన్ని ఈయజాలక పోవచ్చును. ఎవరి పేరు మీద నేను మీకీ సందేశమిచ్చానో ఆ దేవుడే అంతా చేయ గలడు. దేవుడు మిమ్మాశీర్వదించునుగాక !

—యంగ్ ఇండియా, 15-9-1927

# 71

# ఖాదీ తత్వం

తాను ఖాదీ తత్వం అని పిలచే దానినిగూర్చినీ, ఖాదీ ఉద్యమంలోని ఆంతర్యమునుగూర్చినీ ఆయన అదే ధోరణిలో వివరించ సాగినారు:

"మన నిత్య జీవితంలో 'సంపద' యొక్క తత్వమును ఎలా తార్కాణంగా చూపవచ్చునో నిరూపించేటందుకు కొన్ని మాటలు చెప్పక పోయినట్లయితే నేను తప్పు చేసినట్లవుతుంది. మనం 'ఖాదీ తత్వం' తో బట్టలను ధరించడంకంటె ఎక్కువ బాగా ఆ తత్వమునకు తార్కాణం చూపలేమని నా వినయపూర్వకమైన అభిప్రాయం. నేను వివరిస్తూన్న భేదాన్ని దయచేసి జాగ్రత్తగా గమనించ కోరుతున్నాను. కేవలం ఖాదీని ధరించినంత మాత్రంతో మనం సందుని తత్వానికి తార్కాణం చూపగలుగుతున్నామని నేననడంలేదు. కాని మనలో 'ఖాదీ తత్వం' ఉండవలెనని చెపుతున్నాను. దుర్వృత్తిగల మగవాడూ పడుపు వృత్తిగల ఆడదీకూడా ఖాదీ ధరించవలెననియే భావించబడుతున్నారు. వారు కూడా మనతోపాటు బియ్యంకానీ గోధుమకానీ తిని జీవించవలసినట్లే ఏదో ఒక బట్టకూడా కట్టుకోవలెను. కనుక ఖాదీ కట్టుకోవలెనని భావింపబడుతున్నారు. అయితే 'ఖాదీ తత్వం' అనగా ఖాదీ ధరించడంలోగల భావమును సరిగా గ్రహించడం. ఉదయానే బయటకు పోవడానికి మనం ఖాదీ దుస్తులు వేసుకొంటూన్న ప్రతి పర్యాయము, 'దరిద్రనారాయణ' పేరుతోనూ భారతదేశంలో పస్తులు పడుకొంటూన్న లక్షలాది ప్రజల క్షేమంకోసమునూ మనము పని చేస్తున్నామని జ్ఞాపకం పెట్టుకోవాలి. మనలో 'ఖాదీ తత్వం' ఉంటే, మన జీవితంలోని ప్రతి విషయము నిరాడంబరత్వముతో నిండి ఉంటుంది. 'ఖాదీ తత్వం' అంటే అనంతమైన సహనం. నూలు వడికేవారు, నేత నేసేవారు, ఎంత ఓర్పుతో ఆ పనులు చేయవలసి ఉంటుందో ఖాదీ ఉత్పత్తినిగూర్చి ఏమాత్రమైనా తెలిసినవారికీ బోధపడుతుంది. కాబట్టి మనంకూడా 'స్వారాజ్య దారము' ను వడికేటప్పుడు ఓర్పు గలిగి ఉండాలి. 'ఖాదీ తత్వం' అంటే అనంతమైన విశ్వాసం అనికూడా అర్థం.

రాట్నం దగ్గర శ్రమపడి నూలువడికే మనిషి, తాను వడుకుతూన్న నూలు ఎంత కొంచెమైనప్పటికీ, దేశం మొత్తంమీద వడకబడిన నూలుతో కలిసినప్పుడు, ఇండియాలోని ప్రతి మనిషికీ సరిపోయినంత బట్ట సరఫరా కాగలదని ఏ విధంగా అంతులేని విశ్వాసాన్ని కలిగి ఉంటాడో అదే విధంగా, సత్యాహింసలు సమస్త ఆటంకములను తొలగించుకొని తుదకు విజయం పొందగలవని మనంకూడా నిరంతర విశ్వాసంకలిగి ఉండాలి.

'ఖాదీ తత్వం' అంటే ప్రపంచంలోని ప్రతి మానవునియందును సోదర భావం కలిగి ఉండడం. మనతోడి జీవుల కపకారిగా ఉండతగిన ప్రతిదానిని పూర్తిగా త్యజించడమే దాని ఉద్దేశం. మన దేశంలోని లక్షలాది ప్రజలలో ఆ భావమును అలవాటు చేసినంత మాత్రాన, మన ఈ భారతదేశం ఎంత బాగుపడుతుంది? నేను దేశంలో సంచారంచేసిన కొలదీ, నా కళ్లతో ప్రత్యక్షంగా పరిస్థితులను చూచిన కొద్దీ రాట్నము యొక్క శక్తి సామర్థ్యములలో అంతకంతకు నా విశ్వాసము పెరిగి బలవత్తరమవుతూన్నది. రామనామస్మరణముయొక్క శక్తినిగూర్చి మన బుద్ధితో తర్కించ ప్రయత్నించేయెడల, మన బుద్ధి మన హృదయాన్ని ఒప్పించలేదు. అయినప్పటికీ మన కానామస్మరణమును పైతృక ధనంగా ఉపదేశించిన ఆ మహర్షులు తెలివి తక్కువవారనిగానీ మంద మతులనిగానీ ఇక్కడ సమావేశమైన వారిలో ఒక్కరుకూడా అనుకోవడంలేదని నా అభిప్రాయం. అలాగే ఖాదీ తత్వంకూడా ఇప్పుడు నేను మీకు వివరించిన యావత్తు శక్తినీ కలిగి ఉన్నదని సూచిస్తున్నాను అయితే దానికి వెనుక ఒక షరతు ఉన్నది. ఆ తత్వ ప్రకటనమునకు సంబంధించి ఒకే ఒక షరతు ఉన్నది. రామ నామం మన మనస్సులలో సజీవశక్తిగా పరిణమించడానికి కారణం, దాని వెనుక దానిని మన కుపదేశించినవారి అప్రతిమానమైన తపశ్చర్య ఉండడమే. ఖాదీ ఉద్యమం విషయంలో కూడా అంతే. దానికీ, దాని వెనుకనున్న వారి తపశ్చర్య ఉండి తీరాలి. ఖాదీకోసం తమ జీవితాలను అంకితం చేసినవారు, నిరంతరం పవిత్ర జీవితంకొఱకు పట్టుదల కలిగి ఉండనట్లయితే, ఖాదీ అంటే దేశీయుల కపహాస్యం పుడుతుందని ప్రతి క్షణమూ నేననుకొంటూంటాను. ఇతర వాణిజ్య వస్తువులతో, వాటి ఎత్తులో, వాటి షరతులకు లోబడి ఖాదీ పోటీ చేయలేదని నాకు బాగా తెలుసును. ప్రజలందరూ ఉపయోగించే సాధారణ అస్త్రములవంటిది కాక, సత్యాగ్రహం ఏవిధంగా ఒక విశిష్టమైన అస్త్రమో, అదే విధంగా ఖాదీకూడా ఒక విశిష్టమైన వాణిజ్య వస్తువు. అది యితర వస్తువులన్నిటికీ సర్వ సాధారణంగా ఉండే

షరతులతో కొనసాగదు, కొనసాగజాలదు. అయితే నేనిక్కడ కూర్చొన్నట్లెంత నిశ్చయంగా ఎఱుగుదునో అంత నిశ్చయంగానూ కూడా, ఖాదీ విశిష్టమైనదనీ, అది ఈనాడు ఇండియాలోని ప్రతి వస్తువునూ కూడా అతిక్రమించగలదనీ ఎఱుగుదును. కాబట్టి మీరు నాకిచ్చిన ఈ ఖాదీ విరాళములన్నిటినిగూర్చి నేనెందుకు ఉత్సాహంగా లేనో కూడా బహుశా మీరు గ్రహించగలరు. నాకు ఖాదీయందుగల విశ్వాసంలో మీకు పదవ వంతు ఉన్నట్లయితే, మీకున్న ఐశ్వర్యంలో మీరే రెండు వందలో రెండు వేలో యిచ్చి ఊరుకొనేవారు కారనీ, ఖాదీ కిక సొమ్ము అవసరం లేనంత వరకూ యిచ్చి నన్ను సంతృప్తిపఱచి ఉండేవారనీ నాకు తెలుసును.'' *

—యంగ్ ఇండియా, **29-9-1927**

---

* 'మూడుపన్యాసాలు' అనే శీర్షికతో మ. దే. వ్రాసిన వ్యాసము నుండి.

# 72

# చేమగ్గపు నేతను గూర్చిన భ్రమ

మధురలో సౌరాష్ట్రుల సన్మాన పత్రమునకు ప్రత్యుత్తరంగా గాంధీజీ యిలా అన్నారు:

"నా వయస్సులో నాకు మాతృభూమిగా ఉన్న రాజకోటనుగూర్చి మీరుదాహరించినప్పుడు నాకు చాలా ఆనందం కలిగింది. కాని మీరు నాతో అంత సన్నిహిత సంబంధం కలుపుకోవడంవలన చాలా కష్టం ఉందనే సంగతిమాత్రం మీరు దయచేసి జ్ఞాపకంఉంచుకోవాలి. ఎందువల్లనంటే, నేను నిర్వర్తించే ప్రతికార్యంలోనూ, మీ దృష్టికి ఉత్తమమయినదని తోచినంతవరకు, నాతో మీరు సహకరించవలసిన బాధ్యతను ఇందుమూలకంగా మీరెక్కువ చేసుకొన్నారు. ఆపత్తు వచ్చినప్పు డాధారపడడానికి వీలులేని సన్నిహితులెంత ఎక్కువమంది ఉంటేమాత్రం మనిషికేమి ప్రయోజనము? కావలెనంటే మీరు నాతో అంతకంటెకూడా ఎక్కువ సంబంధం కలుపుకోవడానికి వీలున్నది. ఒక రాజ్యానికి మంత్రిగా ఉన్న వారి కొడుకునయినందుకు నేను గర్వపడుతూన్నప్పటికీ, మీతోపాటు, తోడి నేతపనివానిగా ఉన్నందుకు, పైనైతే ఇంకా ఎక్కువ గర్వపడుతున్నాను. నా తండ్రిగారప్పుడు తన అధికారంకింద ఉంచబడిన చిన్న రాజ్యముయొక్క భవితవ్యమును నేస్తూఉండిరి. మీరూ నేనూ, తరతరాలనుండీ వస్తూన్న వృత్తిద్వారా మీరున్నూ, కోరితెచ్చుకొన్నందువలన నేనున్నూ—కావలెనంటే ఈ పెద్ద దేశముయొక్క భవితవ్యమును నేయగలము. ఈ ఖాంద

వ్యాన్ని మీకు జ్ఞాపకంచేస్తూ నేనెక్కువ గర్వపడడంలో, మా తండ్రిగారియొక్క పవిత్రస్మృతికి నేనేవిధంగానూ అపచారం చేయడంలేదు. అధిక సంఖ్యాకులయిన జనుల అవసరాలను తీర్చేవిషయంలో నేనాయన అడుగుజాడలలోనే నడుచు కొంటున్నాను. మనకింకా ఎక్కువ సన్నిహిత సంబంధం ఉన్నదని నేనంటూన్నప్పుడు మీ సన్మానపత్రంలోని ప్రముఖ విషయమొకటి నాకు జ్ఞాపకం వస్తూన్నది.

"మీకు కావలసిన సన్నని పడుగునూలు, మీకు కావలసిన ప్రమాణంలో నేడు లభించనందున, విదేశీ నూలు మిల్లు నూలుల ద్వారా చేనేతను ప్రోత్సహించవలసిందిగా మీరు మీ సన్మానపత్రంలో నన్ను కోరినారు. మీతోపాటు చేనేత నేసేవారిగా ఆ సిఫారసుకు నేనెందుకంగీకరించలేకపోతున్నానో మీకు నేను చెప్పవలసిఉంది. మీ సిఫారసును నే నంగీకరించినందువలన మీకున్నూ, నా మనస్సులోని వర్గం వారికిన్నీ, మీ మనస్సులో సైతం మీరుంచుకోవలసిన వర్గం వారికిన్నీ కూడా హాని కలుగుతుందని నిరూపించగలననుకొంటున్నాను. మీలో కొంతమంది సూక్ష్మబుద్ధి వివేకం కలిగిన వ్యాపారస్థులున్నారు. మీరందరూ కూడా అలా ఉండాలి. అలా ఉన్నప్పుడే విదేశీ మిల్లులు కానీ లేక భారతీయ మిల్లులు కానీ సరఫరాచేసిన నూలుతో నేసే ప్రతి చేనేత మనిషీ మిల్లుల చేతులలోనుండి వాని దయాదాక్షిణ్యాలకు లోను కావలసి వస్తుందనే సంగతి తెలుసుకోగలరు. ఈనాడు కొంతవరకు మీ అధీనంలో ఉన్న ఈ చేనేత పరిశ్రమ, ఇప్పుడు మీరుమాత్రమే ప్రత్యేకంగా నేస్తూన్న మాదిరులను, ప్రపంచంలోని మిల్లులుగానీ ఇండియాలోని మిల్లులుగానీ నేసేటందుకు తయారైన తక్షణం మీ చేతుల నుండి ఈ వృత్తి జారిపోతుందని మీరు తెలుసుకోవాలి. నేడు

మీ ఏకచ్ఛత్రాధిపత్యంకింద ఉన్న మాదిరులను నేసేటందుకు ప్రపంచంలో సమర్థులైన అనేకమంది మిల్లు యజమానులిప్పటికే ప్రయత్నాలుచేస్తున్నారని ఇదివరకు మీకు తెలియని యెడల ఇప్పుడు నేను చెపుతున్నాను. ఈ ఏకాంతిక వ్యాపారాలను లాగివేసి ఆ వర్తకాన్ని తమ చేతులలోకి తీసుకోవలెనని నిరంతరప్రయత్నం చేయడంలో మిల్లు యజమానులది కానీ మిల్లు పరిశ్రమది కానీ తప్పుకాదు. తమ యంత్రాలను నిరంతరం అభివృద్ధిచేసుకోవడము, ప్రపంచంలోని చేతిపనులపైన ఎప్పుడూ దాడి సాగించడము నిజంగా పెద్దపెద్ద పారిశ్రామికుల ఆశయమూ, ఆదర్శమూను. ఈ వృత్తినికూడా మీ చేతులలోనుండి లాగివేసేటందుకు వారు ప్రయత్నించడం వారి ఉనికి యొక్క పరిస్థితికి నిజంగా అనుగుణంగానే ఉంది. మీరు నన్నునుకరించక పోయినట్లయితే వడుకు వృత్తికి తటస్థించిన గతే తప్పకుండా చేనేత వృత్తికికూడా పట్టితీరుతుంది. మీరిప్పుడు చేస్తూన్న పనిని నేనెప్పుడో ప్రారంభించాను—ఈ సంగతి మీకు తెలియదు—భారతదేశంలో చాలా కొద్దిమందికి మాత్రమే ఈ సంగతి తెలుసును. నేను మొట్టమొదట 1915 లోనే నేతపనివాణ్ణయినాను. నేను మొదట నేసేవానిగానూ, తరువాత వడికేవానిగానూ తయారయినాను. నేనీ చేతులలోనే విదేశీ నూలునూ మిల్లునూలునూ కూడా నేశాను. ఈ వ్యాపారంలోని రహస్యము మీకు తెలిసినదానికంటె కూడా నాకెకుడువ తెలుసునని అంటూన్నందుకు నన్ను క్షమించాలి. నేను కూర్చుండినప్పుడు—నేనే స్థలంలో కూర్చుండినానో కూడా చూపగలను—నేను చేనేత మగ్గం దగ్గర కూర్చుండి, బహుశా మీరు నేసే బట్టలో నిజంగా సగం సన్ననిబట్టనయినా నేను నేయజాలకుండా ఉండి

నష్టపు, ఆ తరవాత బట్టనే మిల్లులు నేయడానికి ఏర్పాటు చేసుకొన్నట్లయితే, నేను గానీ లక్షలాది చేనేతవారు గానీ ఎక్కడ ఉండవలసివస్తుందో అని ఆలోచిస్తూ కూర్చుండి నాను నేనిలా ఆలోచిస్తూండగానే నా మనస్సు మన గ్రామాలలో పస్తులుంటూన్న లక్షలాది సోదరీమణుల కడకు పోయింది నేను నేస్తూ, ఈ సోదరీమణుల దుస్థితినిగూర్చి ఆలోచించ ప్రారంభించాను. ఇప్పుడు నాకు విచారమూ చీకాకూ వేసిది. తరువాత మాకు నూలువడకడం నేర్పే మనిషికోసం నా సహచరులతో సహా నేను చాలా శ్రమ పడి వెదక ప్రారంభించాను. చేతితో నూలువడికే పని యింకా ఏ గ్రామంలోనైనా జరుగుతూన్నదా అని కూడా నేను వెదికాను. పంజాబ్ రాష్ట్రంలో కొంతమంది సోదరీమణులింకా వడుకుతూండిరని అప్పటికి నాకు తెలియదు. కాని నాకు నిరాశ కలుగుతూండగా ఆ రోజులలో, గుజరాతులో ఒకానొక ధైర్యవంతురాలైన వితంతువు శరణు జొచ్చాను. ఆమె అస్పృశ్యులకోసం పని చేస్తూన్నది. ఈ ఉత్తమురాలైన సోదరీమణికి నా మనస్సులోని వ్యథను వెళ్లబుచ్చుకొని, గుజరాతులో ఒక చోటనుండి మరొక చోటకు ప్రయాణం చేస్తూ, చేతితో నూలువడికే కళను ఇంకనూ తమ స్వాధీనంలో ఉంచుకొన్న సోదరీమణులను వెదికిపట్టుకొనేటంతవరకు విశ్రాంతి తీసుకోకూడదని, ఆ పని ఆమెకు అప్పగించాను. గుజరాతు రాష్ట్రంలోని విజాపూరు గ్రామంలో, తాము వడికిన నూలును తీసుకొనేయెడల వడికేటందుకు సంసిద్ధంగానున్న కొంతమంది ముసల్మాను సోదరీమణులను ఆమె వెదకి పట్టుకోగలిగింది ఆ క్షణంనుండీ ఆ మహోత్కృష్ట పునరుద్ధరణ ప్రయత్నం ప్రారంభమై ఇప్పుడు ఇండియాలోని 1,500 పై చిలుకు గ్రామాలలో

జరుగుతూన్నది. ఈ సంగతి కనిపెట్టిన తరువాతనే, నా యాజమాన్యంకింద నడపబడుతూన్న ఆశ్రమంలో ఒకర్ని గజం విదేశీనూలును కానీ మిల్లునూలును కానీ వడకరాదని నిర్ణయించుకొన్నాను.

"మరొక ముఖ్యవిషయాన్ని ఆలోచించవలసిందని నేను మిమ్మలను కోరుతున్నాను. ఇండియాలోని చేనేత ఉద్యమ చరిత్రను మీరు పరిశీలన చేసేయెడల, ప్రస్తుతం అనేకవేల మంది నేతవారు తమ వృత్తిని వదలివేయవలసివచ్చినట్లు మీకర్థమవుతుంది. మీవలెనే నేత నేసేవారు, సౌరాష్ట్రులు, నేడు బొంబాయిలో పాకీపని చేస్తున్నారు. పంజాబులో నేత నేసే మనుష్యులు కొంతమంది జీతంకోసం సైనికులుగా చేరారు. మరికొంతమంది కసాయివ్యాపారం చేస్తున్నారు. అందువలన మీ సిఫారసును నేనెందు కామోదించలేక పోయినానో మీరు గ్రహించగలరు. అంతమాత్రంతో మిల్లు నూలును నేయడం ఈనాటినుండి మీరు విడిచివేయవలెనని అర్థంకాదు. నేను మిమ్మలను ప్రోత్సహించనకోరలేదు. నేను మికోరిలి అడకువతో నడుపుతూన్న ఈ ఉద్యమంతో, మిల్లునూలును నేతను మిశ్రమంచేయవలసిందిగా, నన్ను మీరడుగవలదని నేను మీ క్షేమంకోసమే సూచించ సాహసిస్తున్నాను. అంతేకాక మీరీ ఉద్యమానికి తోడ్పడడం కూడా మీ క్షేమంకోసమే. దీనికి స్థిమితంవచ్చి, అభివృద్ధి పొంది ఇది నిశ్చలంగా ఉన్నయెడల, మీలో ప్రతి ఒకరినికీ గౌరవమైన వృత్తి లభిస్తుంది. కాబట్టి ఈ వడుకు నూలు ఉద్యమం త్వరితంగా అభివృద్ధి పొందినయెడల మీకిది సహాయకారిగా నుండకలదనికూడా సూచిస్తున్నాను"

—యంగ్ ఇండియా, 13-10-1927

# 73

# లాభప్రదమైన పత్తి పంట

పత్తి పంటదారులు కొంత పత్తిని నిల్వచేసుకొని తమ ఉపయోగం కొఱకు, దానిని నూలులోకీ ఖాదీలోకీ మార్చుకొనేటట్లు ప్రోత్సహించడాని కాక పెద్ద ఉద్యమం ఉండవలెనని ఒకానొక విలేఖకుడు సూచిస్తున్నాడు. ప్రత్తి పంటలేని ప్రదేశాలలోని రైతులు తమకు కావలసిన కూరగాయలను పండించుకొన్నట్లుగానే తమకు కావలసిన పత్తి సైతం పండించుకొనేటందుకు వ్యక్తులుగా ప్రోత్సహింపబడవలెనని కూడా ఆ విలేఖకుడు సూచిస్తున్నాడు. ఈ పద్ధతి వాడుకలోకి వచ్చినయెడల రైతులకు ఖాదీ చౌక అవుతుందని ఆ విలేఖకుని వాదం. ఖాదీ ఉద్యమం రావడానికిముందు దక్షిణాదిని కొన్ని ప్రదేశాలలో ఈ పద్ధతిని అవలంబించిన వారున్నారని ఆయన అంటున్నాడు. ఈ విధమైన ఖాదీ పంటను అభివృద్ధిచేయడానికి భారత సంస్థానాలు బాగా తగి ఉన్నవనికూడా ఆ విలేఖకుని అభిప్రాయం.

ఆ విలేఖకుని సూచనలో చాలా బలం ఉంది. రాజపుటానాయందలి బిజోలియాలోనూ, బార్డోలీ, కతియవాడులలోనూ, పత్తి పంటదారుల అవసరాలకోసం తగినంత పత్తిని నిల్వచేసుకోవలెనని వారిని ప్రోత్సహించే ఉద్యమం ప్రారంభింపబడినది. కాని కతియవారులోని రైతులు, తాము నిల్వచేసుకొన్న పత్తికి ధర యెక్కువ పలికినప్పుడు దానిని అమ్ముకోవలెననే ఆకర్షణకు లోనుగాకుండా చేయడం కష్టమనిపిస్తూన్నది. వ్యవసాయకులు ఖాదీ అర్థశాస్త్రి

మును గ్రహించేవరకున్నూ, తమ తీరిక కాలంలో తమపత్తిని నేతకు ముందుగా నిర్వర్తించవలసిన పరిణామములకు లోనయ్యేటట్లు చేసే కృషివలన, పత్తిని ఎక్కువ ధరకు అమ్ము కొన్నందున కలిగే లాభం కలిసివస్తుందనీ తాము మధ్య దళారీల చేతులలో పడకుండా తప్పించుకొనేటందుకుకూడా వీలవుతుందనీ తెలుసుకొనేటంత వరకున్నూ యిది సాధ్యం కాదు. అనగా ఖాదీ అర్థశాస్త్రమునుగూర్చి అఖిల భారత చరఖా సంఘం వ్యవసాయకులకు బోధించవలసి ఉంది. ఖాదీ కార్యక్రమంలోని అన్నిశాఖలలోనూ సమగ్రంగా విజయం పొందవలెనంటే, ఖాదీ కార్యకర్తలు పత్తిపంటదార్లతో సన్నిహిత సంబంధం కల్గించుకోవడం అవసరం. పట్టణా లకు కావలసిన ఖాదీని ఉత్పత్తిచేసేటందు కవసరమైన పత్తిని కొనడానికైనా వారు పత్తిపంటదార్లతో సన్నిహిత సంబంధం కలిగి ఉండి, ప్రస్తుతంవలె అంగడిలో కాక వారి దగ్గరనుండియే ప్రత్యక్షంగా కొనడం ఆవశ్యకం. మీరు బేరగాళ్ల చేతులలో పడకుండానూ, పత్తిధరలలో కలిగే తీవ్ర పరివర్తనాలకు లోనుగాకుండానూ, ఖాదీ ధర నిలకడగా ఉండేటట్లు చేసుకోవలెనంటే, వ్యవసాయకునితో సన్నిహిత సంబంధం కలిగించుకొని అతడు మనతో ప్రత్యక్షంగా వ్యాపారం చేసేటట్లు ప్రోత్సహించాలి. మనకు ఖాదీలో అభివృద్ధి కలిగిన కొద్దీ, వాణిజ్య ప్రపంచ మింతవరకూ అవలం బిస్తూ వచ్చిన అతి చౌకగాకొని అతి ప్రియంగా అమ్మడమనే సిద్ధాంతమునందు విశ్వాసంగల పద్ధతులకు చాలాదూరమైన పద్ధతులను మన మవలంబించాలి. ప్రస్తుతం ప్రపంచ వాణిజ్యం న్యాయంపైనా దాక్షిణ్యంపైనా ఆధారపడిలేదు. దాని ప్రధాన సిద్ధాంతం, 'కొనేవారు జాగ్రత' అని. ఖాదీ ప్రధాన సిద్ధాంతం 'అందరికీ న్యాయ్యం'. కాబట్టి

ఆత్మవినాశనకరమైన నేటి పోటీ విధానాన్ని అది నిరాకరిస్తుంది. ఖాదీ ఆర్థిక విధానం మిక్కిలి నిరుపేదలయొక్కయు నిస్సహాయులయొక్కయు క్షేమంకోసం ఉద్దేశింపబడినది. ఖాదీ కార్యకర్తలు ప్రజాసామాన్యంలో కలసిపోయి వారి విశ్వాసమును చూరగొన గలుగుటనుబట్టి దాని విజయం ఉంటుంది. వారికి నిస్స్వార్థమైన సేవ చేయడంవల్ల మాత్రమే కార్యకర్తలు వారి విశ్వాసమును చూరగొనగలరు.

పత్తి వ్యవసాయదార్లు పత్తిని నిల్వచేసే విషయంలోనూ, తదితర వ్యవసాయకులకు వారి ఉపయోగం నిమిత్తం కావలసిన పత్తిని పండించే విషయంలోనూ, భారత సంస్థానాలకెక్కువ అవకాశం ఉందని ఈ విలేఖకుడు సూచిస్తూన్నదంతా నిజమే. అయితే 'పిల్లికి గంట కట్టేదెవరు?' అనేదే మొదటి ప్రశ్న. అధిక సంఖ్యాక సంస్థానాలకు రైతుల క్షేమంతో నిమిత్తం లేదు. ఏమైనా సరే సాధ్యమైనంత ఎక్కువగా తమ ఆదాయాన్ని పెంపుచేసుకొని, అందులోనుండి మిక్కిలి ఎక్కువభాగం, స్వీయభోగాలకోసం వెచ్చించుకోవడమే ప్రస్తుతం వారి జీవితాశయంగా ఉంది. అంతేకాక తక్కిన పెట్టుబడిదారులవలెనే వారికి కూడా ఖాదీ ఆర్థిక విధానంలో యేమీ నమ్మకం లేదు. రాటం గ్రామ పరిశ్రమగా అభివృద్ధిపొందేటందుకు వీలు కలదా అని ఆలోచించడానికి చాలా జాగరూకతతో మైసూరులో ఒక ప్రయోగం నడుపబడుతూన్నది. విజ్ఞానదృష్టి గలిగి ఓర్పుతో ఆ ప్రయోగం నిర్వర్తింపబడి జయప్రదమయ్యేయెడల అది విరివిగా వ్యాపిస్తుంది.

—యంగ్ ఇండియా, 27-10-1927

# 74

# ఖాదీ మూలస్తంభము

ఈలోగా ‘మార్పు కూడదనే వారి’ (No changers) సృష్టిని మహత్తరమైన నిర్మాణ కార్యక్రమము వంకకు మరలింపవలెనని మాత్రమే కోరుతున్నాను. దానిని గ్రహించలేనివారు అసహాయోద్యమములోని, అత్యంత శక్తివంతమైనట్టిన్నీ, అత్యంతం ఆచరించ తగినట్టిన్నీ భాగమును అనగా అహింసను గ్రహించజాలరు. అహింసతో కూడని అసహాయోద్యమం ధర్మ సిద్ధాంతముయొక్క గౌరవాన్ని అందుకోలేదు. మన దండయాత్రలోని అనేక ఉపాయాలలో అదకూడా ఒక ఉపాయం మాత్రమే అవుతుంది. తక్కిన అన్ని పద్ధతులను అవతలపెట్టి, అహింసాపూర్వక అసహాయోద్యమం, నిర్దుష్టమైన ప్రతిక్రియగా భావింపబడినది. దాని నిర్మాణాత్మక భాగంలో ఖాదీ మూలస్తంభం. “డెయిలీ డిస్పాచి” పత్రికలో ఖాదీ కనుకూలంగా హారోల్డు రాబర్టుసన్ చే అద్భుతంగా ఈయబడిన యోగ్యతా పత్రమీ దిగువ నుదాహరింపబడుతూన్నది. ఈయన ‘బ్రిటిష్ ఇండియాలో చాలా సంవత్సరాలు గడిపినాడనీ, ఆకాలంలో ఇండియాలోని అంగళ్ల పరిస్థితిని గూర్చి, భారతీయ మనస్తత్వమును గూర్చి సన్నిహితంగా తెలుసుకోవలసిన వృత్తులలో ఉన్నాడనీ’ ఆ పత్రికా

సంపాదకుడు వ్రాశాడు. ఈ దిగువ విషయానికి 12 వ తేదీనాటి 'లీడరు' పత్రికకు నేను కృతజ్ఞుడనుగా ఉండాలి.

"భారత దేశం కొంటూన్న సీమనూలు బట్టల పరిమాణం ఎక్కువగా పడిపోవడానికి కారణం, యుద్ధానంతర విపర్యాసంకానీ, ఆర్థిక వత్తిడి కానీ కాదనీ, మామూలు ప్రజల పేదరికం అంతకంతెనూ కాదనీ, ఎందు వల్లనంటే 'ఇండియాలోని రైతు ఎల్లప్పుడూ భయంకర దారిద్ర్యాన్ని అనుభవిస్తూనే ఉన్నాడనీ' ఇక కొలువు లసలే కారణంకావనీ, ఎందు కనగా 'ఇండియాలో దాదాపు ప్రతి సంవత్సరమూ కరువు వస్తూనే ఉంటుందనీ' జపాన్, ఇండియా మిల్లుల పోటీయే కారణమనీ, అన్ని కారణాలలోకీ మకుటాయమానంగా ఉండే పెద్ద కారణం ఖద్దరనీ ఆయన (మిస్టర్ రాబర్ట్సన్) ఆపాదిస్తూన్నాడు. ఖద్దరే నిజమైన శత్రువని ఆయన అభిప్రాయం. దానిని గూర్చీ, దాని ప్రధాన బోధకుడు మహాత్మాగాంధీని గూర్చి ఆయన చేసిన వర్ణన చదివేటందుకు కుతూహల కరంగా ఉంటుంది. ఆయన ఇలా అంటున్నాడు:

'కాలక్షేపం కోసం పనిచేసే నైపుణ్యంలేని పనివాళ్ళు వడికిన నూలుతో తాతలనాటి మగ్గాలపై నేయబడిన దేశీయ వస్త్రమే ఖద్దరు. అది మొరటుగా, కటుకుగా, ముళ్ళుముళ్ళుగా, గొగ్గిగొగ్గిగా ఉంటుంది. ఎప్పుడూ మురికిగా కనిపిస్తుంది'—అయినప్పటికీ దానికి నిజంగా ప్రచారం ఉంది. భాగ్యవంతులయిన దేశీయులుకూడా దానితో తయారైన దుస్తులు వేసుకోవడం గొప్పగా భావిస్తున్నారు. త్వరిత గతిని పెంపొందుతూన్నట్టి 'భారత దేశము భారతీయునికే' అన్న జాతీయపక్షనినాద మునకది వాస్తవరూపంగా పరిణమిస్తూన్నది. దానిమీద వెచ్చింపబడిన ఒకరూ అణా కూడా దేశాన్ని విడిచిపోదు. దానిని ధరించిన మనిషి, ఇండియాలో వస్తులు పడుకొనే లక్షలాది జనానికి కూడు దొరికేటట్లు చేస్తున్నాడు; తన దేశ స్వాతంత్ర్యాన్ని గూర్చి చాటుతున్నాడు; ప్రథమ

శ్రేణిలోని దేశాభిమానిగా అతడు ప్రత్యక్షమవుతున్నాడు . . . . భారత దేశంలోని పరపరిపాలనకు ప్రతికూలంగా నడపబడుతూన్న పోరాటంలో మహాత్మా గాంధీచే—నిజంగా కనిపెట్టబడి—ఉపయోగింపబడుతూన్న ఆయుధములలో ఖద్దరొకటి. సగం ఋషిగానూ, సగం వెటి పట్టుదల కలవాడుగానూ, సంపూర్ణమైన దేశభక్తుడుగానూ ఉన్న మహాత్మా గాంధీ, ప్రత్యక్షంగానూ దేశీయ పత్రికల ద్వారానూ భారత దేశంలోని విద్యావంతుల హృదయాలకు నచ్చేటట్లు మాట్లాడుతున్నాడిప్పుడు. అసహాయోద్యమమును గూర్చిన ప్రస్తావన యిప్పుడు భారత దేశంలో లేనంతమాత్రాన అది మృతిపొందలేదు. అది యిప్పటికే సడీ చప్పుడూ లేని అపాయకర కార్యాచరణ పరిస్థితికి వచ్చింది . . . . గాంధీజీయొక్క ధర్మప్రచారకులు ప్రజాసామాన్యాన్ని కూడ గట్టగానే, ఇండియా ఇక తక్కువ కొనడం కాదు, అసలే కొనదు. . . . ఈ దెబ్బ కేవలం దూది సరుకులకోసమే ఉద్దేశింపబడలేదు. సమస్త బ్రిటిష్ వస్త్ర వ్యాపారాన్నీ పాడుచేయడానికే ఈ ప్రయత్నం స్పష్టంగా ఉద్దేశింపబడినది.'

ఖద్దరు వ్యాపకం కోసం మహాత్మా గాంధీ నాయకత్వం కింద పనిచేస్తూన్నవారికి ఈ వాక్యాలు ధైర్యాన్ని కలిగించి తీరుతవి. రాటంద్వారా భారతదేశానికి ఆర్థిక స్వాతంత్ర్యం లభిస్తుందనీ, దాని వెంటనే రాజకీయ స్వాతంత్ర్యం వచ్చి తీరవలెననీ ఆ గొప్ప అహింసాదూత విశ్వసిస్తున్నాడు. మిస్టర్ రాబర్ట్సన్ భయవిహ్వలుడై ఈ దిగువ సూచన చేస్తున్నాడు. 'బ్రిటిష్ ప్రభుత్వంలో విశ్వాసాన్ని పునరుద్ధరించండి. సామ్రాజ్యాభిప్రాయాన్ని కలిగించండి. బ్రిటిష్ ప్రభుత్వానికి భారత ప్రజా సామాన్యమెంత ఋణ

పడి ఉన్నదో తెలిసేటట్లు చేయండి. బ్రిటను తిరిగీ భారత దేశపు అంగళ్లను ఆక్రమించుకొంటుంది.' పత్రికా ప్రచారమును మొదలైనవి మాని వేయకుండా ఉచిత సినీమా ప్రదర్శనముల ద్వారా బ్రిటిష్ వారి కనుకూలమైన ప్రచారమును అజ్ఞానులైన సామాన్య ప్రజలలో సాగించవలెనని కూడా ఆయన ప్రబోధిస్తున్నాడు. ఈ సూచనను ఆచరణలో పెట్టినయెడల 'ఇండియా మనకు ఇంకా దక్కవచ్చును. అక్కడి మన వ్యాపారం తిరిగీ పుంజుకోవడానికి వీలు లేనంతగా ఇంకా పోలేదు. కొలది సంవత్సరాలలోనే జాతీయోద్యమ ప్రభావం బాగా వ్యాపించి ఫలప్రదం కావచ్చును. అప్పటికి కాలం మించిపోవచ్చును. కాబట్టి దానిని నిష్ఫలం చేయడానికి కావించే యే ప్రయత్నమైనా అపజయం పొందవచ్చును.' కనుక యే మాత్రమూ ఆలస్యం చేయరాదు. ఈలోగా ఇండియాలో 'ఇండియా దేశపు పత్తితో చేయబడిన లాంక్ షైరు బట్టలు' 'ఇండియాయొక్క ఉత్తమమైన వతనుదారు లాంక్ షైరు' లాంక్ షైరు బట్ట కొనడమంటే ఇండియా దేశపు వ్యవసాయకులకు సహాయపడడమే' అనేటటువంటి అభిప్రాయాలకు విస్తారంగా ప్రచారం జరగాలని ఆయన సూచిస్తున్నాడు. ఇవిన్నీ, ఇటువంటి ఉపాయాలే మరికొన్నిన్నీ వెంటనే అవలంబించని యెడల లాంక్ షైరు సరుకులకు ఇండియా అంగడి రోగపీడితమైనట్లుగాక మరణావస్థలో నున్నట్లుగా కనిపించే మాట నిశ్చయం.' ఆ విలేఖకుడు సూచించిన పెట్టుబడి దారీ స్వభావం గల ప్రచారం జాతీయోద్యమతరంగాన్ని నిరోధించగలదనుకోవడం చాలా పొరపాటు. ఈ కపట నాటకమంతా గ్రహించలేనంత అమాయకులు గారు భారతదేశ ప్రజలు.

ఆర్థిక స్వప్రయోజనాలకోసం యేర్పాటు చేయబడే ఈ ప్రచారంవల్ల కలిగే ఫలితం, ఖద్దరు ఉద్యమానికి మరింత ప్రోత్సాహమివ్వడంగా మాత్రమే పరిణమిస్తుంది. అంతే కాక ప్రస్తుతం దాని ఆర్థిక సామర్థ్యమునకంత ప్రాముఖ్యత ఈయని భారతీయులనుకూడా భిన్నదృక్పథమునుండి దానిని చూచేటట్లుగా చేస్తుంది. ఈ విధంగా సూచించబడిన ప్రచారంవలన ఖద్దరు ఉద్యమం బాగా నడుస్తూన్నదని స్పష్టంగా అంగీకరించవలసివస్తుంది. సంశయాత్ములకిది దానియందు విశ్వాసం కలిగించడానికి పనికివస్తుంది. స్వార్థపరత్వంతో చేయబడే ప్రచారంవలన కాక, భారతీయుల జాతీయ వాంఛలను చాలావరకు తీర్చడం మూలకంగా మాత్రమే, ఈ రెండు దేశాల సంబంధాలను సక్రమ పద్ధతిపైన ఉంచడానికీ ఇండియాతో లాంక్‌షైరు వ్యాపారం నాశనం కావడానికి గల కారణాలను తొలగించేటందుకూ వీలవుతుంది.”

ఖాదీ బెదిరింపుకాదని చెప్పవలసిన అవసరం లేదు. అది స్వరాజ్యంవలెనే జాతీయ జీవితమునకు ఊపిరి. ఎంతఉదారమైన ఉపకారాలకు ప్రతిగానూ కూడా స్వరాజ్యాన్ని విడవడానికి వీలులేనట్లే ఖాదీ ఉద్యమాన్ని విడవడానికి కూడా వీలులేదు. ఖాదీని త్యజించడం ప్రజాసామాన్యాన్ని అనగా భారతదేశపు ఆత్మను అమ్మివేయడం.

—యంగ్ ఇండియా, 15-1-1928

# 75

# ఒక సోదరి చిక్కు

ఒకానొక సోదరి యిలా వ్రాస్తూన్నది:

"ఒక సంవత్సరం కిందట మనలో ప్రతివారూ ఖద్దరు ధరించడం యెంత అత్యవసరమో, మీరు మాట్లాడు తూండగా విని అప్పటినుండీ దానినవలంబించవలెనని నిర్ణయిం చుకొన్నాను. కాని మేము పేదవాళ్లము. ఖాదీ చాలా ఖరీదని నా భర్తగారంటారు. నేను మహారాష్ట్ర స్త్రీని గనుక 9 గజాల చీర ధరిస్తాను. కాని నేను నా చీరను ఆరు గజాలకు తగ్గించినయెడల ఎక్కువ ఆదా చేసుకో వచ్చును. అయితే మా పెద్దవాళ్లా తగ్గింపు కంగీకరించడం లేదు. ఖాదీ ధరించడం ఎక్కువ ముఖ్యంగాని, చీర పొడుగు, ధరించే పద్ధతి ఇదంతా ఎంతమాత్రమూ ప్రాముఖ్యం కాదని నేను వారితో వాదించాను. కాని ప్రయోజనం లేకపోయింది. నూతనాభిప్రాయాలు నా తలలో దూర డానికి నా యౌవనమే కారణమని వారంటున్నారు. ధరించే విధానం బాగుండనప్పటికీకూడా ఖద్దరునే ఉపయో గించి తీరవలెనని మీరు నాకు దయయుంచి వ్రాసేయెడల నేను సూచించిన తగ్గింపుకు వారంగీకరిస్తారని నేననుకొం టున్నాను."

ఆ సోదరి కోరిన ప్రత్యుత్తరమును నేను పంపివేశాను. అయితే యితర సోదరీమణులుకూడా అనేకమంది అటువంటి చిక్కునే ఎదుర్కొనవలసి వస్తూన్నదని నాకు తెలిసినందున, ఆమె చిక్కును నేను నా దృష్టిలో ఉంచుకొంటున్నాను.

ఈ వ్రాసినవారి దృఢమైన దేశభక్తికి ఈ ఉత్తరమే తార్కాణం. ఆమెవలె పాత పద్ధతులనుగానీ పాత ఆచారాలనుగానీ తమంతట తాము విడచిపెట్టగలిగిన సోదరీమణులు చాలా ఎక్కువమంది లేరు. ఏ విధమైన కష్టమూ అనుభవించకుండాగాని లేక యే విధమైన వ్యయమూ భరించకుండాగానీ, పాత ఆచారాలు బాగున్నా బాగుండకపోయినా వాటినే అంటిపట్టుకొని ఉన్నప్పటికీ స్వరాజ్యం పొందగలిగేటట్లయితే దానిని సంతోషంగా పొందే సోదరీ సోదరులు అసంఖ్యాకులుగా ఉన్నారు. కాని స్వరాజ్యం అంత చౌక పారు సరుకు కాదు. స్వరాజ్యాన్ని పొందడానికి రాష్ట్రాభిమానాన్ని సహా త్యాగం చేయగల స్వార్థ త్యాగబుద్ధిని అలవఱచుకోవాలి.

రాష్ట్రాభిమానం జాతీయ స్వరాజ్యాన్ని సంపాదించేటందుకేగాక రాష్ట్ర స్వాతంత్ర్యాన్ని పొందేటందుకుకూడా అభ్యంతరమైనదే. ఈ సంకుచిత తత్వాన్ని పోకుండా పట్టుకొనేటందుకు పురుషులకంటె స్త్రీలెక్కువ బాధ్యులు. విభిన్నత్వం కొంతవరకవలంబించతగినదే కాని ఆ పరిమితి దాటినతరువాత, విభిన్నత్వం అనే నెపంకింద వ్యవహరింపబడే ఆచారాలు కానీ సౌకర్యాలుకానీ జాతీయతకు విరుద్ధములు. డక్కను చీర చాలా సుందర వస్తువే. అయితే ఆ అందం జాతిని త్యజించినందువల్ల మాత్రమే లభించేదయితే దానిని విడచిపెట్టాలి. కచ్ఛీశైలిగల పొట్టి చీరగానీ పంజాబీ పోథ్నేకాని ఖాదీ ధారణను చౌకచేసేటందుకు తోడ్పడే పక్షంలో అవి నిజమైన కళావస్తువులని మనం తలంచవలసి ఉంది. డక్కనీ, గుజరాతీ, కచ్ఛీ, బెంగాలీ స్త్రీలు చీరలు ధరించే విధానాలు విభిన్న జాతీయ పద్ధతులలో ఉన్నవి. వాటిలోని ప్రతి ఒకటీ

తక్కినవాటితో పాటు జాతీయమైనదే. కాబట్టి సభ్యతకు భిన్నంలేని పద్ధతిని అన్నిటికీ తకువ ప్రమాణంగల బట్టయే విధానంలో కావలసివస్తుందో ఆ విధానానికే అనుకూలంగా ఉండాలి. అది కచ్చి విధానం; ఆ చీరకు మూడు గజాల గుడ్డే కావాలి. అనగా గుజరాతీ చీరలో సగం వంతు. అందువలన నూలుకూడా తగ్గిపోయి ఎక్కువ సుఖంగా ఉంటుంది. పచ్చడోయున్నూ, రవికయున్నూ ఒకటే రంగువైతే, అది పచ్చడోయో లేక పూర్తి చీరో త్వరగా తెలుసుకోలేరు. కాబట్టి పరస్పరం ఒకరి పద్ధతిని ఒకరు అనుకరించడం, మార్చుకోవడం అత్యంతం వాంఛనీయం.

భాగ్యవంతులు అన్ని రాష్ట్రీల పద్ధతుల దుస్తులనూ ఉంచుకోవచ్చును. గుజరాతీ గృహస్థుగానీ గృహిణి గానీ బెంగాలీ అతిథులకు ఆతిథ్యమిచ్చేటప్పుడు బెంగాలీ దుస్తులు వేసుకోవడమున్నూ, ఆలాగే బెంగాలీ గృహస్థులు గుజరాతీలకు ఆతిథ్యమిచ్చేటప్పుడు గుజరాతీ దుస్తులు వేసుకోవడమున్నూ, చాలా మర్యాదగానూ దేశభక్తి పూరితంగానూ ఉంటుంది. కాని ఆ పద్ధతి భాగ్యవంతులైన దేశభక్తులకే చెల్లుబడి అవుతుంది. ఖాదీధారణకు వీలు కలిగించి దానిని చౌకచేయగల రాష్ట్రీయ విధానము మాత్రమే మధ్యతరగతులవారూ పేదలూ అయిన దేశభక్తులు సగర్వంగా అవలంబించతగిన పద్ధతి. అప్పుడు కూడా పేదలందరిలోకీ పేదలవలంబించే దుస్తుల పద్ధతిపైననే వారి దృష్టి నిలపాలి.

స్వదేశీ అనగా ఎవరిమట్టుకు వారు తమ చిన్ని నీటి పడియలో మునగడం కాదు; జాతి అనే మహాసముద్రానికి

దానిని ఉపనదిగా తయారుచేయాలి. అది నిర్మలంగా ఉండి, ఆ నిర్మలత్వమును పోగొట్టుకోకుండా ఉన్నప్పుడే ఆ మహాసముద్రానికి తన భాగాన్ని తాను సమర్పించుకొనే హక్కు ఉంచుకోగలుగుతుంది. కాబట్టి స్థానికాచారాలుగానీ లేక రాష్ట్రీయాచారాలుగానీ, అపరిశుభ్రములు అవినీతికరములు కానివన్నీ, యావద్దేశంలోనూ ప్రచారంలో ఉండవలెననే మాట స్పష్టం. ఒక్కసారి ఈ సత్యం గ్రహింపబడినయెడల, జాతీయత సర్వమానవ జాతియెడల నిర్వర్తించవలసిన ధర్మోత్సాహంగా పరివర్తనం పొందుతుంది.

దుస్తుల విషయంలో యేది నిజమో, భాషా ఆహారం మొదలైన వాటి విషయంలో కూడా అదే నిజం. ఉచిత సమయాలలో ఇతర రాష్ట్రాల దుస్తులను మనం అనుకరించవలసి ఉన్నట్లే భాషా మొదలైనవాటినికూడా మనం ఉపయోగించుకోవచ్చును. కాని ప్రస్తుతం మన మాతృభాషనూ, అంతకంటెనూ ఎక్కువగా తదితర రాష్ట్రభాషలనూ బుద్ధిపూర్వకంగాగానీ, అబుద్ధిపూర్వకంగానీ నిర్లక్ష్యంచేసి, ఆంగ్ల భాషకు ఉత్కృష్ట స్థానమిచ్చేటందుకు నిరుపయోగము, అసాధ్యము, వినాశకరమూ అయిన ప్రయత్నంలో మన శక్తినంతనూ వ్యర్థం కావించుకొంటున్నాము.

—యంగ్ ఇండియా, 2-2-1928

# 76

# చేమగ్గము—రాటము

చేమగ్గం ఒకటే నిలబెట్టతగిన పరికరమనీ, మిల్లునూలు ఉపయోగం ద్వారా మాత్రమే అది నిలవడానికి వీలవుతుందనీ తరుచు అనాలోచితంగా చేయబడే వాదమును గూర్చి శ్రీ సి. బాలాజీరావు ఈ విధంగా వ్రాస్తున్నారు.

“చర్ఖాను కించపఱచడం నిమిత్తం చేమగ్గమును పైకెత్తే వారికి దిగువ ప్రత్యుత్తర మీయబడినది. ‘చేతితో లాగే పంకాస్థానాన్ని విద్యుద్వీజనం (electric fan) ఆక్రమిస్తూండినట్లుగానే, చేతితో నేసే మగ్గముయొక్క స్థానాన్ని విద్యుచ్ఛక్తిచే నడపబడే మగ్గం ఆక్రమించి తీరుతుందని, కర్జన్ ప్రభువు ఢిల్లీ దర్బారులో ప్రకటించినప్పుడాయన తన ప్రభుత్వశాఖలోని వైజ్ఞానిక సలహాదార్ల అభిప్రాయాలను వెలువరించాడన్నమాట.’”

అయితే, మిల్లు నూలువలనగానీ, లేక రాటం మినహా మఱియే యితరమార్గం వలనగానీ, చేమగ్గంయొక్క చిరంజీవత్వం నిలబెట్టడం సాధ్యమయ్యేయెడల కర్జన్ ప్రభువు సిద్ధాంతీకరణం అప్రతిహతమైన ప్రత్యుత్తరంగా అంగీకరింపబడనక్కర లేదు. కర్జన్ ప్రభువు ఏమి జ్యోతిషం చెప్పినప్పటికీ, చేతితో వడికేపని చేమగ్గమును రక్షించగలదని ప్రతి దినమూ ఈ పుటలు స్పష్టపరుస్తూనే ఉన్నవని అనుకొంటున్నాను. నిజానికి మన జాతీయ జీవితంలో రాటం తిరిగీ తన పూర్వౌన్నత్యమును పొందగలిగినయెడల, చేమగ్గమూ అనేకములైన తదితర గృహ పరిశ్రమలూ వాటంతటవే పునరుద్ధరింపబడి తీరాలి.

—యంగ్ ఇండియా, 23-2-1928

# 77

# మన మిల్లు లేమి చేయగలవు?

మన చరిత్రలోని ఈ సందిగ్ధ సమయంలో యేదో కొంత నిజమయిన బలాన్ని ప్రదర్శించగలిగి ఉండవలెనని ప్రతి మనిషీ ఆందోళన పడుతున్నాడు. బ్రిటిష్ వస్త్ర బహిష్కరణమునుండి విలక్షితమైన విదేశీ వస్త్ర బహిష్కరణము వలన మాత్రమే అటువంటి బలాన్ని అభివృద్ధి చేసుకొని ప్రదర్శింపగలమని అంతకంత కెక్కువగా గుర్తింపబడుతూన్నది. ఈ బహిష్కరణోద్యమంలో మన మిల్లులు ఇష్టపడితే అవి ప్రముఖపాత్రను నిజానికి నిర్ణాయకపాత్రనే వహించగలవు.

ఎప్పుడో ఒకనాడు వాటికి విదేశీ ప్రభుత్వమే కావాలో ప్రజలే కావాలో అవి నిర్ణయించుకోవలసి ఉంది. నిశ్చయంగా అవి చాలావరకు ప్రభుత్వంవారి సుహృద్భావంపైన కాకపోయినా వారి సహాన ప్రవృత్తిపైన ఆధారపడి ఉన్నవి. పాడు ప్రభుత్వం కింద ఐశ్వర్యవంతులుగా ఉండడం పాపమనీ పేదరికం పుణ్యమనీ తోరే చెప్పిన మాట సత్యం. భాగ్యవంతుల భాగ్యం యావత్తు ఎల్లప్పుడూ, ఆనాటి ప్రభుత్వం మంచిదైనా, చెడ్డదైనా, దాని చేతులలోనే ఉంటుంది.

అయితే మిల్లులు తమ ఉనికికోసం ప్రభుత్వంయొక్క సుహృద్భావం పైనగానీ సహనం పైనగానీ ఆధారపడి ఉన్న మాట నిజమైతే ప్రజల సహాన సుహృద్భావములపైన అంతకు తక్కువ ఆధారపడి లేవు. ప్రజలు అజ్ఞానులుగా,

అలసులుగా, అనైక్యంగా ఉన్నంతకాలం మిల్లులు వారిని నిర్లక్ష్యంచేయగలవు. కాని కడచిన ఏడుసంవత్సరాలు మన జాతి వ్యర్థ్యంగా జీవించలేదు. ప్రజలలో కలిగిన చైతన్యం ఎన్నటికీ చావదు. ప్రజలు ఎప్పుడేవిధంగా తమ బలాన్ని ప్రదర్శిస్తారో ఎవ్వరూ చెప్పలేరు.

కాని మిల్లులు మాత్రం ఒక విశిష్టస్థానాన్ని ఆక్రమిస్తూ న్నవి. కాని అవి కొంచెం ధైర్యమూ, ప్రజాక్షేమమును గూర్చి కొంచెం విచక్షణా చూపినందువలననూ కొంచెం త్యాగం చేసినందువలననూ అవి ప్రభుత్వాన్నీ ప్రజలనూ కూడా సేవించగలుగుతవి. అవి ప్రభుత్వాన్ని తిప్పుకొని ప్రజల శ్రేయస్సును వృద్ధిపొందించగలవు.

అవి ఈ విధంగా చేయవచ్చునని నా వినయపూర్వ కాభిప్రాయం.

లాభాలు ఎక్కువగా వచ్చిన సంవత్సరాలు కొన్నీ తక్కువగావచ్చిన సంవత్సరాలుకొన్నీ కలిపి కనీసపు సగటు మొత్తం లెక్కకట్టి తమ ఖరీదులకు ప్రమాణం నిర్ణయించ వచ్చును.

బహిష్కారమును యేర్పాటుచేసే నాయకులతో, దేశా నికీ కావలసిన వస్త్రపరిమాణ నాణ్యములనుగూర్చి రాజీ మాట్లాడుకోవచ్చును.

ఖాదీ సంస్థలు తక్షణం తేలికగా ఉత్పత్తిచేయగలిగిన రకాలను తాము ఉత్పత్తిచేయడం మానుకోవచ్చును. అందు వలన ఖాదీ సంస్థలకంటె ఎక్కువ తేలికగా తాముత్పత్తి చేయగలిగిన రకాలను ఇంకా ఎక్కువగా ఉత్పత్తిచేసుకోవ డానికి తమ శక్తిని బాగా వినియోగించుకోవచ్చును.

వారి లాభాలకు సాధ్యమైనంత తక్కువ పరిమితిని యేర్పాటు చేసుకోవచ్చును. ఎక్కువ లాభంవస్తే బహిష్కారం జయప్రదంగా సాగించేటందుకు వినియోగించ వచ్చును. లేక అది అనవసరమైనట్లయితే కార్మికుల స్థితిని బాగుచేసేటందుకుపయోగించవచ్చును.

సర్వతోముఖమైన ఋజువర్తనమూ, పట్టుదల, పరస్పర విశ్వాసమున్నూ కార్మికులు, పెట్టుబడిదార్లు, వినియోజకులు —ఈ ముగ్గురి మధ్యా, గౌరవపూర్వకమూ, స్వచ్ఛందమూ అయిన సంఘీభావమున్నూ ఉండవలెనని దీనిఅర్థం. అంతే కాదు, పెద్ద ఎత్తున నిర్మాణంచేయగల శక్తికూడా కలిగి ఉండాలి. అహింసద్వారా విదేశవస్త్ర బహిష్కారమును మనం పొందవలెనంటే, నేనిప్పుడు వరుసగా వర్ణించిన పరీక్షలలో ఎప్పుడో ఒకప్పుడు ఉత్తీర్ణులమైతీరాలి.

అందుకు మనం అత్యంతం అర్హులమని నా వినయ పూర్వకాభిప్రాయం. ఇందుకోసం కావలసిన సంస్థ మనకు అపరిచితమైనదికాదు. మనకా యిచ్ఛ ఉన్నదా అనేదే ప్రశ్న. మిల్లు యజమానులకు తగినంత దేశభక్తి గానీ దూరదృష్టిగానీ ఉన్నదా? ఉన్నట్లయితే వారు నాయకత్వం వహించగలరు. నా నమ్మకాన్ని నన్ను పున రుద్ఘాటింపనీయండి! బహిష్కారోద్యమం త్వరగా కొన సాగడానికి, ఖాదీ సంస్థల యొక్కయు నిజమైన దేశీయ మిల్లులయొక్కయు కలయిక వాంఛనీయమే; కాని అత్యా వశ్యకం మాత్రంకాదు. నేను 'నిజమైన స్వదేశీ మిల్లులు' అనే పదాలను వాడాను. ఎందుకనగా ఇండియాలో చాలా దొంగమిల్లులున్నవి. అవి కేవలం ఇండియాలో ఉన్నందున ఇండియన్ మిల్లులుగా వ్యవహరింపబడుతూన్నవి. కాని

వాటి భాగ స్వాములు, పాలకులు, వాటి తత్వం ఇవన్నీ పూర్తిగా కాకపోయినా ఎక్కువ భాగం దేశీయములే. కాని దేశీయ మిల్లులు జాతీయోద్యమమును నడపక పోయినా, దానితో కలవకపోయినా, రాజకీయ చిత్తవృత్తిగల భారతదేశానికి అందుకు కావలసిన శక్తీ, విశ్వాసమూ, ఇచ్ఛా ఉన్నట్లయితే ఖాదీ ఒకటే బహిష్కారోద్యమాన్ని జయప్రదం చేయగలదని నానమ్మకం. ఆవిరి యంత్రాలు, చమురు యంత్రాలు, విద్యుద్యంత్రాలద్వారా వెలువడే శక్తి (horse power) మనకు తగినంత లేకపోయినా, కావలసిన పనికి ముఖ్యమైన అర్హత కలిగి, ఉపయోగపడవలెనని కోరుతూ, పనిలేకుండా పడిఉన్న మానవశక్తి మనకు అనంతంగా ఉంది. ఈ సజీవ శక్తినిగ్రహించి ఉపయోగించుకోగలిగిన విశ్వాసం మాత్రం ఉండాలి ; అంతే !

—యంగ్ ఇండియా, 15-3-1928

# 78

# చరఖా నిశ్చయంగా అవసరం

ఆచార్య కృపలానీయొక్క ఖాదీ దళం సంయుక్త రాష్ట్రాలలో అక్బరుపురం అనే చిన్న స్థలంలో ఏడు సంవత్సరాలు పనిచేసింది. నేను చెప్పనవసరంలేని కారణాలవల్ల వారు అక్బరుపురమును విడిచివేయవలసివచ్చింది. వారు విడిచిపోయేముందు ఆ జాలికరమైన దృశ్యములను, ఆ కేంద్రం ఏదోవిధంగా ఎలా నిలపెట్టబడిందీ, పండిత జవహరలాల్ నెహ్రూ వర్ణిస్తున్నాడు. ఆయన అఖిల భారత చరఖా సంఘమునకు వ్రాసిన ఉత్తరంలోని ఈ దిగువ భాగం చదివేటందుకు కుతూహలం కలిగిస్తుంది.

"గాంధీ ఆశ్రమం అక్బరుపురాన్ని విడిచి వెళ్ళిందని యింతకు పూర్వమే మీకు చెప్పి ఉన్నాను. తాత్కాలికంగా మేమాపని పుచ్చుకొన్నాము. ఎందుకనగా మీ నిర్ణయమునకు లోబడి మేమాపని చేయవలెనని అనుకొన్నాము. మేమా పని పుచ్చుకోకపోయిఉండినట్లయితే మధ్య అంతరాయం వచ్చిఉండేది. తిరిగీ కొత్తగా ప్రారంభించడం ఎక్కువ కష్టమయ్యేది. అంతేకాక భావప్రవృత్తికి సంబంధించిన కారణాలవల్లకూడా ఆ స్థలాన్ని విడచిపెట్టడం కొంచెం కష్టమయింది. చాలా సంవత్సరాలనుండీ అది బాగా తెలిసిన కేంద్రం. చాలామంది నేతవాళ్లు యితరులూకూడా దానితో సన్నిహిత సంబంధం కలిగి ఉన్నారు. అకస్మాత్తుగా దానిని విడిచివేయడంవలన ఆ పరిసరము లన్నిటిలో చాలా దుష్ఫలితం కలిగిఉండేది. దానిమీద ఆధారపడిఉన్న అనేక పేదకుటుంబాల ఆర్థికస్థితి తారుమారయి ఉండేదికూడా. గాంధీ ఆశ్రమమును మూసివేస్తున్నామని ప్రకటించినప్పుడు కొన్ని జాలికరమైన ఘటనలు ప్రత్యక్షంగా కనిపించినట్లు మాకు నిజంగా తెలిసింది. చాలామంది నూలు వడికే ముసలమ్మలు తమ నూలును మారపు కేంద్రంలో అమ్ముతూండేవారు. అనేకమైళ్ల దూరంనుండి కష్టపడి నడచివచ్చి ఈ కేంద్రం మూసివుండడంచూచి వారి నూలు కొనడంలేదని ఏడిచారు.

చాలామంది నేతవారూ వారి భార్యలూ కుటుంబాలూ అక్బరుపురం కార్యాలయానికివచ్చి సత్యాగ్రహం చేస్తామని చెప్పినారు. ఏడేళ్ల వారాశ్రమంకోసం పనిచేసినపిమ్మట ఇప్పుడు నట్టేట్లో విడిచిపెట్టబడ్డారు. ఈ పరిస్థితులలో ఆపని పుచ్చుకోక నిరాకరించడం మాకెంత కష్టమయి ఉంటుందో మీరు గ్రహించగలరు. అయితే కేవలం భావ ప్రవృత్తికి సంబంధించిన ఆలోచనలు ఈ సమస్యను పరిష్కరించజాలవు. అక్బరు పురానికి కొన్ని గొప్ప సుగుణాలు ఉన్నవి. కాని ఒక పెద్ద లోపం కూడా ఉంది. నేత కేంద్రంగా అది చాలా ప్రసిద్ధికెక్కింది. ఇప్పటికి కూడా ఆ సమీపంలో ఉన్న తాండాలో ఇండియాలోకల్లా అత్యంత సున్నితమైన నేతపని కొంత జరుగుతూన్నది. దురదృష్టవశాత్తూ ఈ సన్న నేత విదేశీనూలుతో జరుగుతూన్నది. దీని పేరు జమ్‌దానీ పని. పైగా అక్బరుపురం సమీపంలో చాలాకొద్దిగా వడుకుపని జరుగుతూన్నది ఈ కేంద్రం పనిచేయవలెనంటే నూలు మరొక చోటినుండి తీసుకొనిరావడం అవసరమవుతుంది. గాంధీ ఆశ్రమంవారు బీహారు సరిహద్దులనుండీ ముజఫర్‌పురం నుండీ నూలు తెస్తూండేవారని నా నమ్మకం. మాకు సంయుక్త రాష్ట్రాల ఉత్తర జిల్లాలనుండి అనగా—మొరాదాబాదు, బిజనోరు మొదలగు జిల్లాలనుండి నూలు తీసుకొనిరావడం ఎక్కువ తేలిక. నూలు పంపడంలో ఖర్చుకూడా ఎక్కువఉండదు.”

ఖాదీ నేతివలెనూ ధాన్యంవలెనూ చలామణిలో ఉన్న వస్తువైనట్లయితే ఏ కేంద్రంనుండీ ఉపసంహరించుకోవడమనే ఊహ కలిగిఉండేదేకాదు. మాకు కార్యకర్తలూ ధనమూ ఉన్నట్లయితే 1,600 గ్రామాలలో కాదు 700,000 గ్రామాలలోనూ మా ప్రతినిధులు ఉండేవారు. ఇది ఆచరణయోగ్యం కాని వట్టి ఆశ కాదు. పర ప్రభుత్వానికి ప్రతి గ్రామంలోను కనీసం ఇద్దరు ప్రతినిధులున్నారనే విషయం మనం జ్ఞాపకం ఉంచుకుంటే ఇది అసంభవంకాదని తెలుస్తుంది. బ్రిటీష్ పరిపాలనకు పూర్వమెవ్వరైనా ఇటువంటిది సూచించి ఉన్నట్లయితే, ఆయనను వినకుండా నవ్వేసి ఉండేవారు. అయితే పునరాలోచన మీద, ప్రతి గ్రామంలోనూ రాటాన్ని పునరుద్ధరించేపని 17 వ శతాబ్దంలోని

భారత దేశపు ప్రజాస్వామ్య గ్రామాలలోకి సామ్రాజ్యవాదపు బ్రిటను తన ప్రతినిధులను పంపుకోవలెనని ఆశపడడమును గూర్చి నవ్వతగిన దానిలో సగంవంతుకూడా నవ్వతగినది కాదని అర్థమవుతుంది. అక్బరుపురం సామీప్యంలోనున్న స్త్రీలు చెప్పినట్లు తెలిసిన మాటలనుబట్టి, ఈ పురాతన దేశము నందలి ప్రతి గ్రామంలోనూ రాటం ఎంత అవసరాన్ని తీరుస్తూన్నదో, దీర్చగలదో అర్థమవుతూన్నది. దాదాపు అర్థ శతాబ్దం క్రిందట తన పకరుయింటి తోడి సోదరీమణుల పవిత్ర హస్తములు వడికిన నూలుతో ప్రపంచ ప్రఖ్యాతి వహించిన జమ్‌దానీ బట్టను సగర్వంగా నేస్తూండే అక్బరుపురం సమీపంలోని సమర్థులైన నేతవారందుకోసం ఇప్పుడు విదేశీ నూలుపైన ఆధారపడి ఉండడం మన దేశభక్తికి కీర్తిదాయకం కాదు. మన అంగళ్లను ఇప్పుడు ముంచివేస్తూన్న విదేశీ నూలువంటి సన్నని బలమైన నూలును మన గ్రామస్థులు వడకగలగడానికింక ఎంతో కాలంపట్టదు.

—యంగ్ ఇండియా, 22-3-1928

# 79

# విదేశీవస్త్ర బహిష్కరణము

మిల్లులతో సన్నిహిత సంబంధం కలిగి, మిల్లులు విదేశీ వస్త్ర బహిష్కరణోద్యమమునకు సంపూర్ణ సహాయం చేయవలెనని వాంఛిస్తూన్న ఒకానొక మిత్రుడు ఇలా అడుగుతున్నాడు :

1. "ఏ పద్ధతి పైన మీరు ఖరీదుల ప్రమాణం నిర్ణయింపబడవలెనని కోరుతున్నారు? అన్ని మిల్లులూ ఒకటే మోస్తరుగా లేవనే మాట జ్ఞాపకముంచుకోండి. కొన్ని చెడ్డవి; కొన్ని మంచివి; కొన్ని మిల్లులు, ఇతరమిల్లులకంటె బట్టల కెక్కువ కలుకుదనాన్ని కల్పిస్తూన్నవి. కొన్నిటికి నిలవ సొమ్ము ఎక్కువ ఉంది; ఉత్తర హిందూ స్థానపు మిల్లులకంటె బొంబాయి మిల్లులు తక్కువ లాభాలు సంపాదిస్తవి. ఈ భేదాలు, చెప్పదగిన ఇంకా అనేక భేదాలకు తార్కాణములు మాత్రమే."

అయితే దీనికి సాధారణంగా చెప్పతగిన ఒక ప్రత్యుత్తర మిది :

"ఏ పనిరైనా చేయవలెననే యిష్టముంటే మార్గముండనే ఉంటుంది." మిల్లులు అలసత్వమును విడిచిపెట్టి తీవ్రంగా ఆలోచించ గలిగినప్పుడే తగిన సహాయం చేయగలవు. ఆ ఆలోచనకూడా, భాగస్వాములు, డైరెక్టర్లు, ఏజెంట్లు వీరి జేబులను నింపడమునుగూర్చి గాక దేశాన్నిగూర్చినదిగా ఉండాలి. అయితే ఈ సందర్భంలో నా అభిప్రాయాన్ని యింకా ఎక్కువ విస్పష్టం చేయవలెనంటే, బహిష్కారోద్యమంలో కలియదలచుకొన్న అన్ని మిల్లులు తమ వ్యత్యాసము లన్నిటినీ సమన్వయం చేసుకొని ఒక ప్రమాణమైన ఖరీదును నిర్ణయించవలసి ఉంది. అప్పుడు, కనీసం కొన్ని

మిల్లులనుండియైనా వాటికి వచ్చే లాభాలలో పెద్ద భాగం త్యాగం చేయవలెనని అర్థం. వారి దేశభక్తి సరియైనదై, అభివృద్ధికరమైనదైతే, బాగా ఉన్న మిల్లులు లోచ్చుగా ఉన్న మిల్లుల నష్టాల్ని పూడ్చగలవు. వీలున్నంతవరకు భేదాలు లేకుండా చేసుకోవచ్చును. నా మనస్సులోనున్న ప్రణాళిక ప్రకారం మొత్తంమీద మిల్లుల కెప్పుడూ నష్టముండదు. కొనేవారికి నష్టదాయకంగా ఉండేటట్లువి లాభాలు సంపాదించకూడదు.

2. "ఖాదీని ఉత్పత్తి చేయకుండేటందుకు కొన్ని మిల్లులు మాత్రమే ఒప్పుకొంటవి. తక్కువ నెంబరు నూలు మాత్రమే వడికే మిల్లుల సంగతి ఏమిటి? ఖాదీనిగూర్చిన మీ పరీక్ష యెటువంటిది?"

ఇది ఖాదీ సంస్థలూ మిల్లుల మధ్య జరిగే యేర్పాట్లకూ సామాన్య ఋజువర్తనమునకూ సంబంధించిన విషయం. ప్రస్తుతం, కొన్ని మంచి మిల్లులుకూడా, గ్రామీణ పరిసరాలలో ప్రవర్ధమానమవుతూన్న ఖాదీ వాతావరణమునుండి కేవలం అక్రమ ప్రయోజనమును పొందేటందుకు తమ బట్టకు 'ఖాదీ' అనే చీటీ అంటించడానికి సిగ్గుపడడం లేదని చెప్ప వలసివచ్చినందుకు విచారం వేస్తూన్నది. ఆచరణ యోగ్య మయిన ఒక యేర్పాటు జరిగితే, అప్పటినుండీ మిల్లులున్నూ ఖాదీ కేంద్రాలున్నూ తయారుచేసే బట్టల మధ్య ఒక హద్దు నిర్మింపబడుతుందని నేను భావిస్తున్నాను. యుద్ధ సమయాలలో తఱచు జరుగుతూన్నట్లు అప్పుడు వస్త్రోత్పత్తి పైన కంట్రోలు యేర్పాటు చేయబడుతుంది. హింసా యుద్ధంలో యే పని మనం నిర్బంధంమీద చేస్తున్నామో, అహింసా యుద్ధంలో ఆ పనినే మనం ఇష్టంమీద చేస్తాము. మనం ఇష్టంమీద అనగా కేవలం ప్రజాభిప్రాయంయొక్క ఒత్తిడివలన బహిష్కారాలు వగైరాలను ఏర్పాటు చేయ

గలగడం, మనలోనున్న అహింసా తత్వాన్ని ప్రత్యక్షంచేసే టందు కావశ్యకమైన పరీక్ష అవుతుంది.

3. "లాభాలను ఎలా క్రమపద్ధతిని నిర్ణయించడం? పత్తి ధరలు మాటిమాటికీ మనకు చీకాకు కలిగించేటంత ఎగుడుదిగుడుగా మారుతూంటు వన్న సంగతి మీకూ నాకూకూడా తెలుసునుగదా!"

ఈ ప్రశ్న పత్తి ధరను అదుపులోకి తీసుకొని రాలేమనే భావాన్ని సూచిస్తూన్నది. దేశంలోని ఉత్పత్తిదారు లందరిలో పెద్దవారంతా కలిస్తే వారు పత్తి ధరను అదుపులో ఉంచగలరు. మన పత్తి ధరలను అమెరికా నిర్ణయిస్తుంది. మనం అనాలోచితంగా, తెలివి తక్కువగా స్వార్థబుద్ధితో మన పత్తిని బయటకు పంపడమే దానికి కారణం. మనకు మనయందు, మన జాతియందు విశ్వాసం ఉంటే, మనం నిజమైన జాతీయభావాన్ని పెంపొందించుకొని ఉంటే, మనం సంపూర్ణ బహిష్కారాన్ని జయప్రదంగా సాగించి తీరాలి. అలా సాగించేయెడల పత్తి రవాణాను అదుపులో ఉంచాలి. అంతేకాదు ఇంకా అనేక విషయాలను అదుపులో ఉంచాలి. అదే బహిష్కారోద్యమం.

4. "ఋజు వర్తనము, పట్టుదల పరస్పర విశ్వాసము మొదలైన వాటిని గూర్చి మీ రెక్కువ నొక్కి చెపితే ఇక మీ పని అయినట్లే."

నాకడ బయొనెట్టు లేనందునను, ఒకవేళ ఉన్నప్పటికీ నేను దానిని ఉపయోగించ తలపనందునను, కొన్ని సుగుణాల కోసం నేను పట్టుపట్టవలసి ఉంది. అయితే ఆ సుగుణాలు కొరవడి ఉన్నవని ఈ మిత్రుని భయం. నా కాభయం లేదు—పైగా ఈనాడు అవి కావలసిన ప్రమాణంలో లేనియెడల వాటి అభివృద్ధికొఱకు వేచి ఉండేటందుకు తగినంత ఓర్పు నాకడ ఉంది. వాటిని జాతీయ గుణాలుగా మనం ప్రదర్శించనియెడల ఈ జాతి తన స్థితిని తాను ఎన్నటికీ

పొందజాలదు. హింస, మోసమువంటి పనులకు తగిన క్రమ శిక్షణ మనం పొందవలెనంటే సత్యాహింసలకు వాటిలో ఇమిడి ఉన్న ఇతర కార్యకలాపాలన్నిటికీ పొంద తగిన క్రమ శిక్షణకు కావలసిన దానికంటె ఇంకా ఎక్కువ కాలం కావలసివస్తుందనికూడా నాకు తెలుసును. ఇక నా కిందటి వ్యాసంలో నేను వదిలివేసిన ఈ దిగువ విషయాలను ఈ స్నేహితుడు నా దృష్టికి తెస్తున్నాడు :

(అ) ఈ కార్య ప్రణాళికలో చేరిన మిల్లులు, చాలా మిల్లులిప్పుడుపయోగిస్తూన్నట్లు విదేశీ నూలునుగానీ, కృత్రిమ విదేశీపట్టునుగానీ, ఇక ఉపయోగించకూడదు.

(ఆ) అవి విదేశీ భీమా కంపెనీలలో భీమా చేయకూడదు.

(ఇ) అవి విదేశీ బట్టను దిగుమతిచేసి 'స్వదేశీ' అని ముద్ర వేయకూడదు.

వీటిలో (అ) (ఇ) లలోని విషయాలు ఎన్నడో నిర్ణీతము లైనట్లుగానే నేను భావించాను. కాని, కలసి పని చేయడానికి అభ్యంతరంగా ఉండేటట్లయితే 'ఆ' మీద నేనంత పట్టుపట్టను. దేశీయ భీమా వ్యాపారాన్ని నే నెక్కువగా ఇచ్ఛగించవలసిందే. కాని మనకు విదేశపు బట్ట అడ్డంకుగా ఉన్నంతగా ఇంకేదీ లేదు. హిమాలయ పర్వతం వంటి ఈ అడ్డంకును మనం తొలగించుకోగలిగినయెడల తక్కిన గుట్టలను దాటడం మనకు సులభం.

—యంగ్ ఇండియా, 22-3-1928

# 80

# బహిష్కారోద్యమము—మిల్లు యజమాని

అహమ్మదాబాదు మిల్లు యజమాని ఒకరిలా వ్రాస్తున్నారు :

“విదేశీ వస్త్ర బహిష్కారమును గూర్చిన మీ వ్యాసములను నేను శ్రద్ధగా చూస్తున్నాను. బహిష్కారము నేర్పాటుచేయడంలో నాకు గల కొన్ని భయాలతోపాటు, కొన్ని సూచనలనుకూడా చేయవలెనని నాకు కోరికగా ఉంది. మీ విదేశీ వస్త్ర బహిష్కార ప్రణాళికలో ఇండియా మిల్లులుకూడా చేరినయెడల, బహిష్కారోద్యమంలో మనకు జయం కలగడమేకాక, మిల్లు గిడ్డంగులలో పేరుకొనిఉన్న సరుకు వెంటనే మాకు విడుదలకూడా అవుతుంది. మిల్లులు ఈ ఉద్యమంలో కల్పించుకోవడంవలన దేశానికి సేవచేయడమూ కలుగుతుంది. భాగస్వాముల ప్రయోజనాలను కాపాడడమూ అవుతుంది. ఈ రెండు లాభాలూ ఉన్నవి. ఎందువల్లనంటే భాగస్వాములకు ఒక సంవత్సరం మంచి లాభం పంచిపెట్టి, మరుసంవత్సరం లేదనేకంటే ప్రతి సంవత్సరం క్రమంగా లాభం నిర్ణయింపబడుతుంది. లాభవిలాక్రమంగా నిర్ణీతం కావడమేకాక, సరుకులు త్వరగా విడుదలకావడంచేత, ఎక్కువ వడ్డీకానీ, గిడ్డంగి ఖర్చుల తగులుబాటుగానీ ఎక్కువ ఉండదు. ఉత్పత్తి ఖర్చులో ఇది ప్రత్యక్షంగా కలిసివస్తుంది. ఈ సంస్థకిందనున్న మిల్లులు నేతకవసరమైన ప్రమాణములలోమాత్రమే బట్టను తయారుచేయవలెను. అందువలన చాలా దుబారా ఖర్చు తగ్గిపోయి దేశానికి కలిసివస్తుంది. అంతేకాక కంట్రోలింగ్ బోర్డువారు నిర్ణయించిన బట్టను మాత్రమే మిల్లులుత్పత్తిచేయవలెను. ఆ బట్టలన్నిటిపైన ‘బహిష్కార సంఘం’ వారి ముద్ర ఉండవలెను. అప్పుడు ఏ మిల్లుకూడా, ప్రమాణ వస్త్రమనే పేరుతోగానీ విదేశీ బట్ట అనే పేరుతోగానీ, ఏ బట్టనూ చలామణీ చేయడానికి వీలుండదు.

ఇక కృత్రిమపు పట్టు విషయంలో ఏమీ అభ్యంతరం పెట్టడానికి అవకాశం లేదని నేననుకొంటున్నాను. విదేశీ రంగులను, వస్త్రోత్పత్తి విధానంలో కావలసిన విదేశీ వస్తువులను తెప్పించుకొంటూనే ఉన్నారు కదా !

మిల్లులకు సంబంధించినంతవరకు విదేశీబట్టలకు చోటులేకుండా చేయడమే ఆశయంగా ఉండాలి. మీరు ఖాదీని ఉత్పత్తి చేయవలదని మిల్లులను కోరడం బాగా ఉంది. అనగా ప్రస్తుతం యేయే రకముల విదేశీ బట్టల స్థానాన్ని ఖాదీ ఆక్రమించడానికి వీలులేదో ఆయారకముల బట్టలను మాత్రమే మిల్లులు ఉత్పత్తి చేయవలెనని అర్థం. కృత్రిమపు పట్టుదారం కొయ్యగుజ్జునుండి ఉత్పత్తిచేయబడుతుంది. అది చౌకయిన భోగపదార్థం. కాబట్టి దానిని బహిష్కరించకూడదని నా అభిప్రాయం. అది విదేశీ ఉత్పత్తి స్థానాన్ని ఆక్రమించడానికికూడా పనికి వస్తుంది. విదేశీ నూలును వాడే మిల్లులను స్వదేశీ అనకూడని మాట వాస్తవమే. అయితే విదేశీ పత్తిని వాడే మిల్లును మీరేమని పిలుస్తారు? దాని ద్వారా తయారైన బట్ట స్వదేశీయా? పత్తి ధరలలో కలిగే మార్పులు విపరీతంగా ఉన్నప్పుడు తప్ప, బట్టల ధరలలో ఎక్కువ భేదం కనిపించదు. పత్తి ధర రూ 339 ల నుండి రూ 375 లకు పెరిగినప్పటికీ కూడా బట్ట ధరలలో మార్పురాలేదు. మీ స్నేహితుడీ కారణంతో భయపడనక్కరలేదు. కాని, అమెరికా దేశం ప్రపంచ పత్తి ధరలను పరిపాలిస్తూన్నంత కాలము పత్తి ధరలను అదుపులో ఉంచడం భారతీయ మిల్లులకు సాధ్యంకాని మాట నిజం. అయితే మీరు చెపుతూన్న ప్రకారం పత్తి ఎగుమతి అదుపులో ఉంచబడినయెడల ధరల ఎగుడు దిగుడులంత పెద్దవిగా ఉండవన్న మాటకూడా నిజమే. అయినప్పటికీ ఆ స్థితి రావలెనంటే స్వారాజ్యం రాకముందదేమీ సాధ్యంకానట్లు కనిపిస్తూన్నది. దాని సంపాదనకు మనమిప్పటినుండీ విదేశీ బట్టలను బహిష్కరించాలి. కాబట్టి పత్తి ధరలలో కలిగే మార్పులు ఉంటూనే ఉంటవి. కోటి బహిష్కార ప్రణాళికలో వాటి పని అవి నిర్వహిస్తూనే ఉంటవి.

ఇక మిల్లు యజమానుల ఋజువర్తనమునందు మీకు నమ్మకం కలదనడంలో మీరెక్కువగా ఆశావాదులని అనవలసివస్తుంది. అహమ్మదాబాదు మిల్లుల తిలక్ స్వారాజ్యనిధిని గూర్చి, దానిని వ్యయపరచే సందర్భంలో ప్రదర్శింపబడిన బెదరింపులను గూర్చి మీకు నేను జ్ఞాపకం చేయవలెనా? సునిశ్చితములైన హామీలులేకుండా మాతో మీరు చేతులు కలిపేయెడల మీరు తప్పకుండా దెబ్బతింటారని నా అభిప్రాయం.

బహిష్కారోద్యమం జయప్రదం కావలెనంటే, యేయే మిల్లుల యజెంట్లు నమ్మకస్తులు, నిజాయితీగలవారుగా ఉంటారో ఆయా

మిల్లులనే చేర్చుకోండి. మీతో ఒక డజను మిల్లులు మాత్రమే ఉన్నప్పటికీ కావలసినంత ప్రచారం జరుగుతుంది. ఇక తక్కినవారు తమ పద్ధతులను త్వరలో మార్చుకొంటారంటే నమ్మండి.

ఏదైనా ముఖ్యమైన పని జరుగవలెనంటే, మీరు యూరపు వెళ్ళే పెండల, మీరు తిరిగివచ్చేవరకూ వాయిదా వేయడం మంచిది. లేదా మీరు యూరపుకు పోకుండా ఉండడం నిర్ణయించుకొని, ఈ విషయాన్ని తీసుకొని పనిచేయాలి. ఈ సూచింపబడిన సమష్టి ఉద్యమం నడిపేటందుకు మీరు ఉండడం అవసరమని నా నమ్మకం. చాలామంది నమ్మకం కూడా అదే. ”

ఈ ఉత్తరం ఉత్సాహం కలిగించేటంత నిష్కపటంగా ఉంది. ఈ విలేఖకుడు ఖరీదులకు, ముఖ్యంగా బట్టల ఖరీదులకు, ప్రమాణము నేర్పాటుచేయడానికి సావకాశం కలదని నమ్ముతూన్నట్లు ఇతర మిల్లు యజమాను లనుకోవలెనని నా కోరిక. పత్తి ధరలలో కలిగే పరివర్తనాల వలన బట్టల ఖరీదులలో మార్పు కలగదని తెలుసుకోవడం కూడా ఉత్సాహకరంగానే ఉన్నది. ఈ విలేఖకుని అభిప్రాయం ప్రతికూలంగా ఉన్నప్పటికీ విదేశీ వస్త్రాలను బహిష్కరించడానికి మన కవకాశం ఉంటే పత్తి ధరలను అదుపులో ఉంచడానికి కూడా సావకాశం ఉంది. మనం చాలా ఎక్కువగా పత్తిని ఎగుమతి చేయడంవలననూ, ఆ ఎగుమతికూడా అమెరికా సరఫరాచేసే చోట్లకే చేస్తూన్నందువలనను మన పత్తి ధరలపైన అమెరికా ఆధిపత్యం సాగిస్తూన్నది. బట్టను కొనేవారి దేశభక్తిని గూర్చి మన ప్రార్థన జయప్రదం కావడానికి సావకాశం కలదని రుజువయింది. అటువంటప్పుడు, పత్తి పండించే రైతును గూర్చి కూడా మన ప్రార్థన జయంపొందడానికి వీలున్నది. విదేశీ వస్త్ర బహిష్కారోద్యమం సమగ్ర భారత జాతి యొక్క సమస్త భాగాలూ స్వచ్ఛందంగా పాల్గొ

కాని జయప్రదం కాదనే జ్ఞానంవలననే దానికంత ప్రాముఖ్యత వచ్చింది. గ్రామస్థులలో అత్యధిక సంఖ్యాకులు దృఢసంకల్పంతో హృదయపూర్వకంగా సహకరిస్తేనే తప్ప అది జయప్రదం కాజాలదు. ఆ ఉద్యమంలో నాకింకా విశ్వాసం ఉంది. ప్రజా సామాన్యం నిర్దుష్టంగానే ఉంటుందని నాకు తెలుసు. పై తరగతులవారికి విశ్వాసం లేనందున వారు మాత్రమే మన మార్గానికి అడ్డుగా ఉంటారు. వారు తమ భయమునూ అవిశ్వాసమునూ పోగొట్టుకొని ఉద్యమానికి నాయకత్వం వహిస్తే ప్రజాసామాన్యం అనుసరిస్తుంది. ఎక్కువ త్యాగం చేయవలసిన అవసరం లేకుండా ప్రజా సామాన్యం చురుకుగా పాల్గొనడాని కవకాశమున్నదీ బహిష్కారోద్యమ మొక్కటే.

మన మిల్లుల వస్త్రోత్పత్తి సందర్భంలో కృత్రిమపు పట్టును నిరపాయంగా వాడవచ్చునని ఈ విలేఖకుడు వ్రాసిన విషయంతో నేనేకీభవింపజాలకున్నాను. విదేశీ రంగులతోనూ, 'సైజు'తోనూ కృత్రిమపు పట్టును ఆయన పోల్చడం తొందరపాటు. ప్రస్తుతం మనము విదేశీ వస్త్ర బహిష్కారమును గూర్చి మాత్రమే ఉద్దేశిస్తున్నాము కాని, విదేశీ రంగులు 'సైజు' బహిష్కారమును గూర్చి కాదు. కాబట్టి, అంతవిదేశీ దారమూ, పట్టు కాని, ఉన్ని కాని, నూలు కాని అది సహజమైనదైనా సరే కృత్రిమమైనదైనా సరే బహిష్కరింపబడవలసిందే; లేక కృత్రిమపు విదేశీ పట్టు దారమును నిరపాయంగా మనం వాడగలిగి ఉన్నట్లయితే విదేశీ పత్తిదారమును గానీ, ఉన్నిదారమునుగానీ, నిజమైన పట్టుదారమునుగానీ ఎందుకుపయోగించకూడదు?

అయితే విదేశీ పత్తి విషయం వేఱు. ముడివస్తువు గనుక విదేశీ పత్తిని మనం ఉపయోగించకుండా మినహాయించవలసిన అవసరం లేదు. సంవత్సరంలో కనీసం నాలుగు మాసములు తప్పని సరిగా పని లేక వస్తులు పడుక్కోవలసిన ప్రజాసామాన్యంకోసం మనం బహిష్కరించవలసినది విదేశీ నూలు, విదేశీ బట్ట. ప్రజాసామాన్యం తమ కుటీరములలోనే నూలు వడుకుకోగలరు, బట్టలు నేసుకోగలరు.

ప్రజాసామాన్యానికి వీటితో సమానమైన పరిశ్రమను చూపకుండా వారి వృత్తులను తీసివేసేయెడల దేశీయ మిల్లు బట్టకూడా సహింపరానిదే అవుతుంది. లక్షలాది కుటీరములలోని నూలు వడుకు జాతీయ పరిశ్రమకు తోడుగా ఉన్నంతవరకు మాత్రమే, జాతీయార్థిక జీవితంలో మిల్లులకు స్థానమున్నది. ఆ కుటీర పరిశ్రమలతో పోటీపడి వాటి స్థానమును ఆక్రమించ తలచుకొన్నప్పుడు అవి జాతీయార్థిక జీవితానికి అభ్యంతరంగా పరిణమిస్తవి. గ్రామంలో నూలు వడికేవారియొక్కయు, నేసేవారియొక్కయు స్థానాన్ని ఆక్రమించడమే వాటి సహజ ప్రవృత్తి అనడాని కేమీ సందేహంలేదు. మిల్లు యజమానులు, మిల్లు యేజంట్లు, భాగసాములు, అందఱుకూడా, నిజమైన జాతీయ వాదులై, ప్రజాసామాన్యాన్ని తమ స్వార్థంకోసం గాక, ముందు ప్రజల క్షేమం తరువాత తమ లాభాలు అనే తత్వం పైన తమ వ్యవహారాలను సాగించేయెడల, వారు కేవలం బహిష్కారోద్యమంలో పాల్గొనడానికే గాక దానిని నడపడానికి కూడా తగినంతగా అర్థం చేసుకోగలరు. వారీ విషయాన్ని దూరదృష్టితో ఆలోచించినయెడల, వారికి పోయేదేమీ లేదనీ చాలా ప్రయోజనం కలుగుతుందనీ కూడా పై ఉత్తరం స్పష్టంచేస్తూన్నది. నిజానికిది

స్వతస్సిద్ధమైన ప్రతిపాదన. విదేశీ వస్త్ర బహిష్కారము ప్రజాసామాన్యాలకి నిలకడయైన పనిని చేకూర్చగలిగే మాట నిశ్చయమేయైనయెడల మిల్లులకు నిలకడయైన లాభాలను చేకూరుస్తుందనే మాట నిశ్చయమే.

అయితే కనీసం, కడచిన పదు సంవత్సరాల ప్రజా ఉద్యమంతోనూ మిల్లు పరిశ్రమయొక్క చరిత్రను బట్టి. మిల్లులు జాతియెడల నిర్వర్తించవలసిన కర్తవ్యమును గ్రహించి కాలానుగుణంగా ప్రవర్తించగలవనే ఎక్కువ ఆశ యెవరికీ కలిగించడం లేదు. ఖాదీయెడల పక్షపాతం కల్గి దానిని పెంపొందించడానికి బదులు మన మిల్లులు, ఖాదీతో అన్యాయమైన, దేశద్రోహకరమైన, అక్రమమైన పోటీలో ప్రవేశించినవి. ఆయా సంవత్సరాలలో మన మిల్లులు ఉత్పత్తిచేసిన ఖాదీ వివరాలీదిగువ ఉదాహరింప బడుతూన్నవి :

| | 1925 | 1926 | 1927 |
|---|---|---|---|
| పౌనులు. | 2,28,87,970 | 2,72,36,337 | 3,39,77,851 |
| గజాలు. | 6,50,48,487 | 7,43,13,280 | 9,43,80,368 |

ఇంత ఎక్కువ ప్రమాణంగల ముతక బట్టను, ఖాదీ అనే పేరుతో విక్రయించారు. కాంగ్రెసు సంస్థచే సృజింపబడిన ఖాదీ వాతావరణాన్ని తమ స్వప్రయోజనంకోసం ఉపయోగించుకోవడానికీ బుద్ధిపూర్వకంగా కొన్ని సందర్భాలలో సిగ్గులేకుండా చర్ఖా చీటీని తగిలించడానికీకూడా వారు వెనుదీయలేదు. ముతక బట్టను ఈ విధంగా ఉత్పత్తిచేసి, మిల్లులవారు ఖాదీ అనే పేరుతో మోసంచేసి దానిని

చలామణీ చేశారని చెప్పవలసివచ్చినందుకు ప్రతి మనిషికీ విచారం కలుగుతుంది. వారిలా దేశానికి స్పష్టంగా హాని కావించారు.

ఇప్పుడు వారు కళ్లు విప్పుకొని, తాము జాతికి కావించిన మహాపరాధమునకు ఆలస్యంగానైనా పరిహారం చేయ తలపెట్టేయెడల, నేను సూచించిన షరతుల ప్రకారం కానీ, లేక వాటితో తులతూగే యే యితర ప్రయోజనకరములైన షరతుల ప్రకారం కానీ, బహిష్కారోద్యమానికి వారు నాయకత్వం వహించాలి ; లేదా కనీసం బహిష్కారోద్యమంలో పాల్గొనవైనా పాల్గొనాలి.

అయితే, ఈ విచారకరమైన అంకెలు తెలియరావడంలో ఒక సుగుణంకూడా ఉంది. ప్రజలను ఖాదీ యెంతగా ఆకర్షించకలిగిందో తెలుసుకోవడం, ఖాదీయందు పూర్ణ విశ్వాసం కలిగి ఖాదీ ప్రవీణుడనైన నాకే కొత్తగా తోచింది. దీనిబట్టి, మనకు తెలిసినవారికంటెకూడా చాలా ఎక్కువ మంది జాతీయ సందేశానుగుణంగా తమ అభిరుచిని మార్చుకొని, అంతకుపూర్వం తాము ధరిస్తూవచ్చిన సన్నని బట్టలకు మాఱుగా ముతక బట్టను కొని కట్టుకోవడానికి యిష్ట పడుతూన్నట్లు తెలుస్తూన్నది. వారిదివరకు పెట్టే ఖరీదు కంటె తఱచు ఎక్కువ ఖరీదుపెట్టి ఈ బట్ట కొన్న మాట కూడా వాస్తవమే వారు చాలావరకు మిల్లు ఖాదీని నిజమైన ఖాదీ అని తప్పుగా నమ్మి, దానికికూడా కాంగ్రెసు

యొక్క ఆమోదం ఉందనుకొని కొన్నారు. ఈ అంకెల లోనూ, వీటినుండి నేను గ్రహించిన సంగతులలోను ప్రజలను ఎక్కువగా ప్రేమించే మనిషి, ఆలోచించడానికి తగిన విషయం చాలా ఉంది. అంతేకాదు వాని ఆశకుకూడా సమాన కారణం ఉంది. ఇక నా యూరపు ప్రయాణ భయమునుగూర్చి; మిక్కిలి కొద్ది కాలంలో, కార్యసాధక బహిష్కార ప్రణాళిక ఆచరణలోకి వచ్చేయెడల నేను యూరపుకు పోదలచుకో లేదని ఈ విలేఖకునకు నేను హామీ యిస్తున్నాను.

—యంగ్ ఇండియా, 5-4-1928

# 81

# ఖాదీ స్థానం

విదేశీ వస్త్ర బహిష్కారోద్యమమును నడపడంలో దేశమునకు ప్రయోజనకరములైన పరతులమీద మిల్లు యజమానుల కార్యరూపక సహకారమును పొందవలెననే వ్యర్థమైన కోరికతో, వారితో మంచి మాటలాడుతూండడం కూడదని గట్టిగా వాదిస్తూ ఖాదీ ప్రేమీయులు నాకు వ్రాస్తున్నారు. వారలా వారించడం నాకర్థమవుతూన్నది. వారిలో కొందఱు ఖాదీ ఉద్యమంలో బాగా అనుభవజ్ఞులై ఆరితేరిన కార్యకర్తలు. కాని మిల్లు యజమానులెప్పుడో ఒకప్పుడు జాతీయాభిప్రాయమున కనుకూలంగా వస్తారనే ఆశ నేను వదులుకోను. అహింసలో పూర్తిగా నమ్మకం ఉన్న నేను. మిల్లు యజమానులను జాతీయ దృక్పథంలోకి మార్చేటందుకు ఒక్క అవకాశాన్నికూడా పోగొట్టుకోను. అందాకా ఎందుకు, ఇండియా క్షేమమునుగూర్చిన భారతీయ దృక్పథంలోకి ఆంగ్లేయులను మార్చేటందుకు సైతం ఏ ఒక్క తరుణమునూ నేను జారవిడువను. మనము ఇంతా అయితే, అహింసా విధానము ద్వారానే మన స్వాతంత్ర్యమును సాధించదలచుకొన్నయెడల, దానికి అభ్యంతరాలు కలిగించే వారి యిళ్లకే మనము పోయి, వాటిని తొలగించేటందుకు వారితో వాదించాలి. రక్తపాతయుతమైన విప్లవంలో అడ్డంగా నిలబడ్డట్టు తోచినవారు, దేశీయులుగానీ తదితరులుగాని అంతిమ శిక్షకు పాత్రులుగా చేయబడినట్లే, అహింసాయుత విప్లవంలో సైతం, దేశీయులుకానీ విదేశీయులు కానీ,

హేతు వాదాన్ని వినక, మూర్ఖంగా ఎదురు నిలచినట్లయితే సత్యాగ్రహాన్ని ఎదుర్కోవలసివస్తుంది.

అందువల్ల మిల్లు యజమానులు దేశంతో సహకారం చేయగలిగిన షరతులను నేను చెప్పడంలో తప్పు లేదని నా అభిప్రాయం. అలా చెప్పి ఉండకపోయినట్లయితే తప్పయి ఉండేది. వారా షరతులను ఒప్పుకొంటే, ఖాదీకి అనగా ప్రజా సామాన్యానికి ఏమీ నష్టం లేదు. ఇప్పటివలె మిల్లులు ప్రజాసామాన్యాన్ని తమ స్వార్థంకోసం వినియోగించుకోనేటందుకు కాక వారి ఉపకారంకోసమే పనిచేసేయెడల అవి కుటీరాలలోని రాటము చేమగ్గముల ఉత్పత్తికి అదనంగా ఉండేటందుకు ఉత్పత్తి చేస్తవేకాని ప్రస్తుత స్థితిలోవలె వాటిని నిర్మూలించవు. నేను చెప్పిన షరతులను అంగీకరించడానికి మిల్లులవారు సందేహించినట్లయితే, అందుకు కారణం, ఆంగ్లేయులు మన దేశానికి నిజమైన సేవకులు కావలెననే తాత్విక పరిణామం వారిక యిష్టమైనట్లే, మిల్లు యజమానులకుకూడా ఈ షరతుల సహేతుక పరిణామం అయిష్టం కావడమే. కాబట్టి నా 'మంచి మాటలాడడము' నుగూర్చి ఖాదీ ప్రేమీయులు భయపడవలదని నేను కోరుతున్నాను. మన విశ్వాసం దృఢమైనదే అయితే, మనం ఖాదీకి ఉందనుకునే స్వతస్సిద్ధమైన శక్తి ఉన్నట్లయితే, అది ప్రజలకు అవసరమే అయితే, మనం గట్టిగా వారితో ప్రయత్నిస్తే వారు దానిని గ్రహించకపోరు. ఖాదీ ప్రేమీయుల విశ్వాసం చంచలమయినదైతే, లేక వారి విశ్వాసం కేవలం నిరాధారమైనదైతేనూ అనగా ప్రజలు దరిద్రంతో పీడింపబడకపోతేనూ వారికి సంవత్సరంలో విశ్రాంతి కాలం లేకపోతేనూ, ఒకవేళ వారికి విశ్రాంతి ఉన్నప్పటికీ, లక్షలాది జనానికి రాటంమీద నూలు వడకడం,

మిక్కిలి ఉచితము ఆచరణయోగ్యమూ ఐన వృత్తి కాక పోతేనూ మాత్రమే, ఖాదీ అపజయం పొందుతుంది.

నేనింతకుపూర్వం చెప్పిన ప్రతిపాదనలలోని షరతుల ప్రకారం నాకు ఖాదీలో సంపూర్ణ విశ్వాసం ఉన్నందునను ఆ విశ్వాసంవలన నాకు లభించిన బలంవలనను మాత్రమే నేను మిల్లు యజమానులను 'మంచి చేసుకొంటున్నాను.' ఈ రాయబారాలవలన తక్షణం ప్రయోజనం కలుగక పోవచ్చుననే మాట నిజం—బహుశా దాదాపు నిశ్చయం కూడా అనవచ్చు. కాని ఈలోగా విదేశీ వస్త్ర బహిష్కారమును మనం సాధించలేక పోయినట్లయితే, అవి మన ముందు కార్యక్రమానికి మార్గదర్శకములుగా నుండగలవు.

కాబట్టి పునరుక్తి దోషమునకుకూడా జంకక ఏ బహిష్కార ప్రణాళికలోనైనను ఖాదీకి ఎటువంటి స్థానము కలదో విచారించడం ప్రయోజనకరము. ప్రజా సామాన్యములో పరివర్తనం కలిగించి వారికి లాభదాయకంగా ఉంటుంది కనుకనే, విదేశీ వస్త్ర బహిష్కారము, అవసరము సాధ్యమూ అనీ, దానిని ప్రజా సామాన్యముయొక్క సహకారముతో మాత్రమే సాధించగలమనీ నా అభిప్రాయం. కేవలం దేశీయ మిల్లులద్వారానే విదేశీ వస్త్ర బహిష్కారమును సాధింపగలిగేయెడల అది తాత్కాలిక ప్రయోజనం మాత్రమే. ఒక్క మిల్లులద్వారానే బహిష్కారోద్యమమును అమలు జరపడం సన్నిహిత భవిష్యత్తులో అసంభవమని నా ఉద్దేశం. ఖాదీ ఒక్కటే, ఆ బహిష్కారోద్యమమును ఆచరణ యోగ్యమయిన ప్రతిపాదనగా చేసిందని నా అభిప్రాయం. భారత దేశంలోని రాజకీయ చిత్తవృత్తిగలవా రందరూ ఖాదీ అమ్మకమును చేపట్టినయెడల, ఇండియాలో

ఒకటే గజం, స్వదేశీ మిల్లు గుడ్డగానీ, విదేశీ గుడ్డగానీ లభించకపోయినప్పటికీ ఈ దేశానికి కావలసిన యావత్తు ఖాదీని సంవత్సరంలో తయారు చేయవచ్చును. కాబట్టి ఖాదీయే నిజానికి బహిష్కారోద్యమాన్ని అంత ఆచరణ యోగ్యంగా చేయగలిగింది. గ్రామాలు చాలావరకు తమకు కావలసిన ఖాదీని తాముత్పత్తి చేసుకోగలవనీ, తమ నూలు తాము వడుకుకోని వారికి సువిర్మితమ్మైన ఖాదీ కేంద్రాలు ఉత్పత్తిచేసి పెట్టగలవనీ భావిస్తూ ఈ సంగతి ఇంత దృఢంగా చెపుతున్నాను. ఆకస్మికంగా బట్ట కఱువు వచ్చేయెడల, ప్రజోత్సాహాన్ని ప్రోత్సహిస్తే, వారికి కావలసిన ఖాదీని వారుత్పత్తి చేసుకోగలిగిన నైపుణ్యమూ దేశీయపరికరములూ వారికి కలవని కడచిన ఏడు సంవత్సరాల అనుభవంవలన తెలియవస్తూన్నది. కాని రాజకీయ చిత్తవృత్తిగల భారతీయుల వస్త్రాల అభిరుచులలోనూ, మానసిక దృక్పథంలోనూ విప్లవాత్మకమైన పరివర్తనం అవసరమనే మాట నిశ్చయం. అయితే వారిలో ఎక్కువ మంది యిప్పుడు మూకీభావం వహించినప్పటికీ, ఖాదీ నిర్విరోధంగా సాగిపోతుందని తెలుసుకొన్నప్పుడు వారిలో పరివర్తనం కలుగుతుంది. ఖాదీ కార్యకర్తలు, ఖాదీని నిర్విరోధంగా సాగించేటందుకు, పట్టుదలతో, నిజాయితీగా వైజ్ఞానిక నైపుణ్యముతోనూ సూక్ష్మజ్ఞానంతోనూ పనిచేయాలి. మిల్లు యజమానులతో కలసి తక్షణం విదేశీ వస్త్ర బహిష్కారోద్యమమును కొనసాగించేటందుకుకల సావకాశమునుగూర్చి వారితో 'మంచి మాటాడి' చర్చించాను. వారికందులో శ్రద్ధ ఉంటే, తమకు తాముపకారం చేసుకుంటూ దేశానికి కూడా ఉపకారం చేసే మార్గాన్ను తాము పొందవచ్చునని చూపేటందుకే నేనలా చేశాను. ఈలోగా ఖాదీ సడీ

చప్పుడూ లేకుండా కంటి కగపడకుండా. జాతీయాభిరుచిలో పరివర్తనం కలిగిస్తూన్నదనే విషయాన్ని ఎవ్వరూ సందేహించ నక్కరలేదు. నేను ధైర్యంచేసి సూచించిన కలయికవంటి కలయిక కలుగుతుందని కొందఱనుకోకపోయినప్పటికీ, బహిష్కారోద్యమమును ఖాదీ కాలక్రమేణా సాధించగలదు.

—యంగ్ ఇండియా, 12-4-1928

# 82

# పెదదారి

ప్రజల మనస్సులను మభ్యపెట్టేటందుకున్నూ, చిల్లర విషయాలను రెచ్చగొట్టి ముఖ్య విషయంనుండి వారిని మఱిపించేటందుకున్నూ అసలు విషయాన్ని బలపరుస్తూ చూపబడిన సాక్ష్యంలో తప్పులు పట్టడానికిగానీ, తప్పులు పట్టినట్లు నటించడానికిగానీ, ప్రభుత్వంవారివలనను, ప్రభుత్వ పక్షమువారివలనను చేయబడే ప్రయత్నాలు ఆశ్చర్యకరంగా ఉంటవి. భారతదేశముయొక్క పౌరుషమును పరిశ్రమలను నాశనంచేసిన చరిత్రయే భారత ప్రభుత్వ చరిత్ర అని ఒప్పుకోవడం వారికిష్టం ఉండదు. ఈస్టిండియా కంపెనీవారి సేవకులు, పట్టును చుట్టవలసిందని తమను బలవంతపెట్టినందున, నేతవారు తమ బొటనవ్రేళ్లను తాము నరుకుకొన్నట్లుగా పత్రికలలోనూ వేదికలపైననూ పదే పదే చెప్పబడుతూన్న కథ అసత్యమనడం ఇటీవల చేయబడిన అట్టి ప్రయత్నాలలో ఒకటి. నేతమనిషికి బొటనవ్రేలు లేనియెడల, అతడు చేయవలసిన పనిని చేయచాలడు. రమేశచంద్రదత్తు, బొటనవేళ్లను నఱుకుకోవడమునుగూర్చి ఎవరి సాక్ష్యంపైన ఆధారపడి మొట్టమొదట తాను ప్రకటించాడో ఆ విలియం బోల్ట్సుయొక్క పుట్టు పూర్వోత్తరాలు త్రవ్వడం ద్వారా ఆ చరిత్ర అసత్యమని చెప్పడానికి ప్రయత్నం చేయబడింది. ఆ ఖండన వ్రాసిన గ్రంథకర్త విలియం బోల్ట్సు తప్పు సాక్ష్యం చెప్పినట్లు రుజువు చేయలేకపోయినాడు. కాని విలియం బోల్ట్సు శీలంలేనివాడనీ కాబట్టి అతని సాక్ష్యం విశ్వాసపాత్రంకాదనీ వ్రాశాడు. అంతేకాక

అతడు కంపెనీవారిచే ఉద్యోగమునుంచి తొలగింపబడినాడనీ, అతనిని ఉద్యోగమునుండి తొలగిస్తూ, మిక్కిలి అసమర్థుడున్నూ అహితుడున్నూ, అయిన కంపెనీ సేవకుడితడు. దేశీయ వర్తక హక్కులకు సంబంధించిన అనర్థదాయక సిద్ధాంతాల యెడల గట్టి పట్టుదల వహించడంలో ఆయన ప్రముఖుడు. ఈ సందర్భంలో ఆయన అత్యంత పీడాకరుడుగా కనిపిస్తున్నాడు' అని తీర్మానింపబడినట్లాయన చెప్తున్నాడు. అల్ప విషయాలను గూర్చి పెద్దగా వాదించే లాయర్ల జిత్తులెవరికి తెలియవు? వారు సాక్షుల దుష్ప్రవర్తనను రుజువుచేసి వారి సాక్ష్యానికి విలువలేకుండా చేస్తారు. దుష్ప్రవర్తకుడు ఎప్పుడూ నిజం చెప్పనే చెప్పలేడన్నట్లుంటుంది వారి వాదం. విలియం బోల్ట్సు యొక్క ప్రవర్తన యెటు వంటిదైనప్పటికీ, బొటనవ్రేళ్లు నఱుకుకోవడమును గూర్చి ఆయన యిచ్చిన సాక్ష్యం మాత్రం, మఱొక విధంగా సరియైనదికాదని రుజువు చేయబడితే నేతప్ప, కాదనడాని కవకాశంలేదు. ఆ సాక్ష్యం నమ్మతగినదికాదని చూపేటందుకు తగినదేదీ ఇంతవరకు తీసుకొనిరాబడలేదు. పైగా నేతవారు నిరంతర భయంకర బాధలనుండి తప్పించుకో వలెనంటేనూ, తాము భరింపరాని శిక్షననుభవించవలసి వస్తుందనే భయంతో తప్పనిసరిగా చేయవలసివచ్చిన పనిని చేయకుండేటందుకున్నూ, తమను తాము శారీరకంగా పనికి మాలినవారుగా చేసుకొనేకంటే వారికిగత్యంతరమే ముంటుంది? అత్యంత దుష్పరిణామములకు హేతువైన భారత దేశపు పరిశ్రమల వినాశనమునుగూర్చి రమేశచంద్ర దత్తు చెప్పిన కథలో, ఇంతా అయితే విలియం బోల్ట్సు సాక్ష్యం ఒక భాగం మాత్రమే. ఇంకా అనేక రకాల సాక్షుల సాక్ష్యంతో ఆయన చెప్పిన విషయం ఋజువ

బడింది. వారందరి సాక్ష్యాల సమగ్ర ఫలితాన్ని కాదన డానికి వీలులేదు. చాలా ఆలోచనతో ఆ పరిశ్రమ విధ్వంసం చేయబడినదా లేదా అనేదే ముఖ్యమయిన విషయం. అది నిజమయితే ఎవరో ఒకరి సాక్ష్యం నిరాకరింపబడినంత మాత్రాన పోయేదేమీ లేదు. వంద మంది సాక్షులలో ఒకడబద్ధం చెప్పినాడని నేరస్తుడనడం అతనికే ప్రమాదం. అయితే విలియం బోల్ట్సు సాక్ష్యం నమ్మదగినదికాదనేటందుకు ఉచితమైన రుజువింతవరకేమీ లేదు. ఈ మాట యిదివరకే ఈ సందర్భంలో చెప్పినాను. దత్తుచే వ్రాయబడిన భారతదేశపు టార్థిక చరిత్ర మొదటి భాగమునుండి సందర్భోచితంగా కొన్ని భాగాలను పాఠకులకొఱకీదిగువ ఉదాహరిస్తున్నాను. ఆయన యిలా వ్రాస్తున్నాడు :

"కిందటి రెండు అధ్యాయాలలోనూ ఉదాహరింపబడిన విషయాలను బట్టి, భారత దేశపు జనసంఖ్యలో చాలా భాగం, 19 వ శతాబ్దముయొక్క ప్రథమ దశాబ్దమువరకు వివిధ పరిశ్రమలలో పనిచేస్తూ ఉన్నట్లు కనిపిస్తుంది. అప్పటికింకా నేత పని ప్రజల జాతీయ పరిశ్రమగా ఉండేది ; నూలు వడకడంవలన సంపాదించిన సొమ్మువ్వారా లక్షలాది ప్రజలు తమ కుటుంబ ఆదాయాన్ని పోషించుకుంటూ ఉండేవారు. రంగులు వేయడం, తోలు ఊనడం, కంచర పని—ఇవి లక్షలాది ప్రజలకు వృత్తులు కల్పించినవి. కాని భారతదేశ పరిశ్రమలను వెంపొందించడం ఈస్టిండియా కంపెనీవారి విధానంకాదు. 1769 నాటికే కంపెనీ డైరెక్టర్లు బెంగాలులో ముడి పట్టును ఉత్పత్తి చేసేటందుకు ప్రోత్సాహమిస్తూ, పట్టుబట్టల నేత నిరుత్సాహపరచవలసిందని ఉద్దేశించి నట్లు కిందటి అధ్యాయంలోనే చెప్పబడింది. అంతేకాక, పట్టు చుట్టేవారందరూ కంపెనీ ఫ్యాక్టరీలలో తప్ప బయట పనిచేయరాదని, అలా చేసేయెడల 'ప్రభుత్వాధికారం కింద కఠిన శిక్షలు విధింపబడుతవనీ

నిషేధపుటుత్తరములు జారీచేయబడినవి, ఈ ఆదేశం అనుకొన్నంత ఫలితమూ కలిగించింది. పట్టు, పత్తి సరకుల ఉత్పత్తి ఇండియాలో తగ్గిపోయినది. ఇంతకుముందు శతాబ్దాలలో ఐరోపా, ఆశియా ఖండాల అంగళ్ళకీ సరుకులను ఎగుమతి చేసిన ప్రజలే, వాటిని ఎక్కువగా ఇప్పుడు దిగుమతి చేయించుకోవడం ప్రారంభించారు.''

ఈ పద్ధతుల ద్వారా ఇంగ్లాండునుండి పట్టు పత్తి సరకుల దిగుమతి ఎలా పెరిగిపోయిందో ఈ అంకెలను బట్టి తెలుస్తుంది. 1794 లో 156 పౌనుల విలువ గల సరుకు మాత్రమే దిగుమతి కాగా 1813 లో అది 108, 824 పౌనులకు పెరిగింది. 1813 లో కంపెనీవారి అధికార పత్రం పునరుద్ధరింపబడింది. అది పునరుద్ధరింపబడే ముందు జరిగిన విచారణలో ముఖ్యమైన సాక్ష్యం తీసుకోబడింది. "భారతీయ ఉత్పత్తుల సందర్భంలో వారు—కామన్సు సభ వారు, వాటి స్థానే బ్రిటిష్ సరుకులను ప్రవేశ పెట్టడ మెలాగా అనీ, భారతీయ పరిశ్రమలు పాడయినప్పటికీ బ్రిటిష్ పరిశ్రమల అభివృద్ధి ఎలాగా అనీ అన్వేషించడానికి ప్రయత్నించారు" అని గ్రంథకర్త వ్రాస్తున్నాడు.

ఇంగ్లాండు దేశపు వాణిజ్య తంత్రమును గూర్చి హెన్రీ సెంట్ జార్జి టూకర్ ఇలా వ్రాస్తున్నాడు:

"ఇండియాకు సంబంధించినంతవరకు ఈ దేశంలో మనమవలంబించిన వాణిజ్యతంత్రమేమిటి? పట్టు సరుకులు, నూలు పట్టు కలిపి నేసిన బట్టలు చాలా కాలంనుండీ మన అంగళ్ళకు పూర్తిగా రానీయడంలేదు. ఇక ఇటీవల నూటికి 67 వంతున దిగుమతి పన్ను అమలులోకి రావడం చేత కొంతవరకున్నూ, ముఖ్యంగా మన యంత్రాల ఆధిక్యత మూలంగా కలిగిన ఫలితంవలనను ఇండియా దిగుమతులలో ప్రధానంగా ఉండే నూది బట్టలు ఈ దేశమునుండి తొలగింపబడడమేగాక, ఆశియాలో మన

స్వాధీనంలోనున్న దేశాల వినియోగార్థం మనం కొంతవరకు మన ఖాది సరుకులను ఎగుమతీ కూడా చేస్తున్నాము. ఈ విధంగా యిండియా పారిశ్రామిక దేశంగా ఉండే స్థితినుండి వ్యావసాయిక దేశంగా పరిణమించింది.''

హెచ్. హెచ్. విల్సన్ నుండి కూడా అదే విధమైన మరొక సాక్ష్యం :

"ఇండియా యే దేశముపైన ఆధారపడి ఉన్నదో ఆ దేశం వలన దానికి కలిగిన అపకారమునకిది యొక విషాదకర తార్కాణం. (1813 లో) ఇండియానుండి దిగుమతి అయిన పత్తి సరుకు పట్టు సరుకు కూడా ఆనాటివరకూ, ఇంగ్లాండులో ఉత్పత్తి అయిన సరుకులకంటె కూడా నూటికి 50 లేక 60 వంతున బ్రిటిష్ అంగళ్లలో చౌకగా అమ్మబడుతూన్నప్పటికీ వాటిపైన లాభం వస్తూనే ఉండేది. కాబట్టి ఇంగ్లాండు సరుకుల రక్షణకోసం, ఇండియా సరుకులను పూర్తిగా నిషేధించడం కానీ లేదా వాటిపైన నూటికి 70 లేక 80 వరకూ పన్ను విధించడం కానీ అవసరమయింది. అలా కాకపోయినట్లయితేనూ, ఆ నాటి నిషేధపుటుత్తరువులు పన్నులు విధింపబడకపోయినట్లయితేనూ, పెయిజిలీ, మాంచెస్టరు మిల్లులు ఆరంభంలోనే ఆగిపోయి ఉండేవి. ఆవిరి శక్తి కూడా వాటిని తిరిగేటట్లుగా చేయగలిగి ఉండేవి కావు. అవి భారతీయ ఉత్పత్తిదారుని త్యాగం వలన సృజింపబడినవి. ఇండియాకు స్వాతంత్ర్యం ఉన్నట్లయితే అది ప్రతిక్రియ చేసి ఉండేది. బ్రిటిష్ వస్తువులపైన నిషేధపు పన్నులను విధించి ఉండేది. లాభప్రదమైన తన పరిశ్రమను నిర్మూలం కాకుండా రక్షించుకొని ఉండేది. ఈ విధమైన ఆత్మరక్షణ కార్యమునకు పూనుకొనే హక్కు ఆ దేశానికి ఈయబడలేదు ; అది విదేశీయుల

దయా దాక్షిణ్యములకు లోనై ఉండవలసివచ్చింది. ఏ విధమైన పన్నూ చెల్లించకయే బ్రిటిష్ సరుకులు ఇండియా పైన రుద్దబడినవి. విదేశీ ఉత్పత్తిదారుడు సమాన షరతులతో తానెదుర్కోలేని పోటీదారును అణచిపెట్టి తుదకు వానిని హత్య చేయడానికి రాజకీయ అన్యాయమనే ఆయుధాన్ని ప్రయోగించాడు."

థామస్ మన్రో ఇలా వ్రాశాడు: "కంపెనీ నౌకర్లు, ముఖ్యమైన నేత పనివారిని ఒకచోచేర్చి, కంపెనీకి మాత్రమే సరఫరా చేస్తామని వారందరూ ఒడంబడికలు వ్రాసి యిచ్చే టంతవరకూ వారి చుట్టూ కావలా వేశారు."

ఆ గ్రంథకర్త ఇంకా యిలా వ్రాస్తున్నాడు:

"నేత మనిషి ఒక్క పర్యాయం బయానా పుచ్చుకొన్నాడంటే, ఇంక వాడు తప్పించుకొనిపోవడానికి వీలులేదు. సరుకు అందించడంలో ఆలస్యమయితే తొందరచేయడానికొక బంట్రోతు వాడివెంట ఉండేవాడు. న్యాయస్థానాలలో వానిపైన కేసు పెట్టడానికి కూడా వీలుంది. బంట్రోతును పంపించడమంటే రోజుకు ఒక అణా జరిమానా అన్న మాట. వాడి చేతులో ఒక బెత్తం ఉండేది. అప్పు డప్పుడూ అది దుర్వినియోగం చేయబడడం కూడ కద్దు. నేతవాళ్ల పైన జరిమానాలు విధింపబడుతూండేవి. వాటి వసూలుకోసం ఇత్తడి పాత్రలు పట్టుకొని పోబడుతుండేవి. ఈ విధంగా కంపెనీవారి ఫ్యాక్టరీలకు గ్రామాలలోని నేత జనం యావత్తూ లోబడి ఉండవలసి వచ్చింది. నేత జనంపైన వారి అధికారం కేవలం ఆచారంగా మాత్రమే కాక, చట్టాల ద్వారా న్యాయశాస్త్రబద్ధం చేయబడింది, కంపెనీనుండి ముందుగా సొమ్ము తీసుకొన్న నేత మనిషి 'కంపెనీకి ఒప్పుకొన్న సరుకును గానీ, కాయకష్టమును గానీ, ఏ మనిషికీ—యిరోపీయునకుగానీ దేశీయునకు గానీ ఏ సందర్భంలోనూ ఈయకూడదు;' అనీ, ఒప్పందం ప్రకారం బట్ట అందచేయకపోతే 'సరుకులను తొందరగా అందేటట్లు చేయడానికి నేతవానిపైన బంట్రోతులను పెట్టడానికి 'కమర్షల్ రెసిడెంటు' కు అధికారం ఉందనీ;' 'ఇతరులకు తన బట్టను విక్రయించినట్లయితే

'ది వానీ ఆదాలత్' లో నేత మనిషి ప్రాసెక్యూషన్‌కు బాధ్యుడనీ', 'ఒక్క మగ్గంకంటె ఎక్కువ ఉండి ఒక్క పనివానినిగానీ అంతకంటె ఎక్కువమంది పనివాళ్లనుగానీ పెట్టుకొన్న నేతవారు, తమరు వ్రాసి యిచ్చిన ఒడంబడిక ప్రకారం అందించలేకపోయిన ప్రతి గుడ్డముక్కకూ, ఒడంబడిక ఖరీదుపైన నూటికి 35 వంతులు అపరాధం చెల్లించవలసి ఉంటుందనీ', భూస్వాములున్నూ, రైతులున్నూ' కమ్మర్షల్ రెసిడెంట్లూ వారి ఉద్యోగులూ, నేతవారి కడకు పోయేటందుకు నిరోధములు కల్పించరాదని ఆదేశింపబడుతూన్నారనీ; ' 'కంపెనీయొక్క కమ్మర్షల్ రెసిడెంట్లయెడల వారు అమర్యాదగా ప్రవర్తింపరాదని గట్టిగా నిషేధింపబడుతున్నారనీ శాసనం చేయబడింది."

అటువంటి సహింపరాని నిర్బంధాలలో జీవిస్తూన్న నేతపనివాళ్లు తమ బొటనవ్రేళ్లను తాము నఱుకుకొని బయటపడ్డట్లయితే అది ఆశ్చర్యపడవలసిన విషయమా? లక్షలాది ప్రజలకు అదనపు ఆదాయమును చేకూరుస్తూ ఉండినట్టిన్నీ ఈ విధంగా బుద్ధిపూర్వకంగా నాశనం చేయబడినట్టిన్నీ, ఒకానొక పరిశ్రమను పునరుద్ధరించడం దేశభక్తిగల ప్రతి భారతీయుని కర్తవ్యమూను. తన పూర్వీకులు ఈ గొప్ప దేశానికి కావించిన మహోపకారమునకు పశ్చాత్తాప పడే ప్రతి ఆంగ్లేయుడు ఈ పునరుద్ధరణ మొక భాగ్యమనుకోవాలి. కాని పశ్చాత్తాపం పడడానికి బదులుగా 150 సంవత్సరాల కిందట ప్రారంభింపబడిన తంత్రాన్ని సాగించడానికి ఇంకనూ పట్టుదల చూపడం, ఆ తప్పునే ఇంకా సాధ్యమైనన్ని పద్ధతుల ద్వారా సమర్థించేటందుకు ప్రయత్నించడం, మనం బాధపడుతూ చూస్తున్నాము.

—యంగ్ ఇండియా, 19-4-1928

# 83

# మిల్లు బట్ట—ఖాదీ

ఒకానొక మిత్రుడీ ధోరణిలో వ్రాస్తున్నాడు :

"ఖాదీతో సమానంగా దేశీయ మిల్లు బట్టను వాడవలసిందని ఈనాటి కాంగ్రెసు వాదులనేకమంది ప్రచారం చేస్తున్నారు. కాంగ్రెసు ఖాదీ దుకాణాలలో మిల్లు బట్టకుకూడా స్థానం ఉండవలెనని ఒక ఉద్యమం ఉంది. ఈ విషయంపైన మీ స్పష్టమైన అభిప్రాయమేమిటో చెప్తారా ? మీ అభిప్రాయం నాకు తెలుసును. కాని కాంగ్రెసు కార్యకర్తలందరికీ తెలియదు. బహిష్కారోద్యమంలో దేశీయ మిల్లులు వహించవలసిన పాత్రనుగురించి, ముఖ్యంగా మీరిటీవల వ్రాసిన వ్యాసముల దృష్ట్యా వారు మీ సలహానూ కోరుతున్నారు."

ఖాదీని గూర్చిన కాంగ్రెసు తీర్మానాలు స్పష్టంగా ఉన్నవి. కాబట్టి వాటిని గౌరవించ తలచుకొన్నవారికి మన మిల్లులలో తయారైన బట్టను దరి చేరనీయకుండా ఉండడంకంటె మార్గాంతరం లేదు. కాని అరాచకం పెచ్చెరిగిపోతూన్న ఈ రోజులలో కాంగ్రెసువాదుల ఒకానొక ప్రవర్తన కనుకూలంగా గానీ ప్రతికూలంగాగానీ కాంగ్రెసు తీర్మానాల నుదాహరించడం నిష్ప్రయోజనం.

కాబట్టి, విదేశీబట్టకు బదులుగా దేశీయ మిల్లు బట్టను కాంగ్రెసు వాదు లైచ్ఛికంగా ఉపయోగించడమునుగూర్చి గానీ, లేక ఆ మిల్లు బట్టను వారు తిరిగి అమ్మే విషయమును గూర్చిగానీ పునరాలోచిద్దాం. బెంగాలు అనుభవం మన కున్నది. మిల్లు యజమానుల దురాశవలనను, వారిలో నిజాయితీ లోపించడం వలననూ వంగరాష్ట్ర విభజన నాటి స్వదేశీ ఉద్యమం దెబ్బతిన్నది. వారు ఖరీదులను హెచ్చించడమేకాక స్వదేశీ అనే పేరుతో విదేశీ బట్టను

కూడా అమ్మినారు. ఈ పర్యాయం వారంతకంటె ఎక్కువ బాగా ప్రవర్తిస్తారన డానికేమీ కారణం కనిపించదు. నిజంగా కల్తీ ఖద్దరును గూర్చి నేను బయట పెట్టిన విషయాలు, నేటి స్వదేశీ ఉత్సాహాన్ని వినియోజకుల విశాల ప్రయోజనము నకు ప్రతికూలంగా మిల్లులు, తమ స్వార్థంకోసం వినియో గించుకోవడంలో యేమాత్రమూ వెనుదీయవని నిరూపిస్తూ న్నవి.

మిల్లులు మర్యాదగా ప్రవర్తించినప్పటికీకూడా కాంగ్రెసు వాదులు మిల్లు బట్టను వినియోగించవలసిన అవసరంకానీ దానిని ప్రకటించవలసిన అవసరంకానీ లేదు. మిల్లులు మర్యాదగా ప్రవర్తించడమంటే, వారు ఖాదీని ప్రకటించి విక్రయించడం; ఖాదీ తత్త్వాన్ని వారు గ్రహించడం; మిల్లు బట్టపైన ఖాదీకిగల ఆధిక్యతను గుర్తించడం.

మిల్లులకు కోరిక ఉన్నప్పటికీకూడా, మిల్లులు ఒకర్తే మనతరంలో విదేశీబట్టలకు స్థానంలేకుండా చేయజాలవని స్పష్టంగా గ్రహించవలసిఉంది. కాబట్టి, విదేశీవస్త్ర బహిష్కరణకు సంబంధించినంతవరకు, ప్రత్యేకంగా ఖాదీ ప్రచారమునకు శ్రద్ధవహించగలిగిన ఒక సంస్థ దేశంలో ఉండి తీరవలెను. 1920 సం॥ నుండీ కాంగ్రెసే అటువంటి సంస్థగా ఉంటూన్నది. ఖాదీ ఉత్పత్తీ ఖాదీ ప్రచారమూ మిల్లుల దురాశకు అవరోధం కావడమేగాక, విదేశీ పోటీకి ప్రతికూలంగా మిల్లులు చేసే పోరాటంలో పరోక్షంగా మిల్లు లకు మిక్కిలి ప్రయోజనకరమగు ప్రోత్సాహమును కలిగించ గలవన్న విషయం కొంత వింతగా తోచవచ్చును. కాంగ్రెసువాదులు ఖాదీ యెడల వహించే ప్రత్యేక శ్రద్ధవలన

ఖాదీకి పునాది యేర్పడడమేగాక కాంగ్రెసుకు ఇంకనూ చెప్పుకోతగ్గ పలుకుబడి లేనిచోట్ల, మిల్లులుకూడా ప్రయోజనకరంగా తమ కార్యకలాపములను కొనసాగించగలవు. కాబట్టి ఖాదీ ప్రచారముపైన మిల్లులెన్నడూ కోపమును కనుపఱచలేదు. పైగా ఖాదీ ప్రచారం విదేశీ వస్త్ర ప్రతికూల వాతావరణమును సృజించడంచేత, తమ మిల్లులలో తయారైన ఎక్కువ ముతగ బట్టకూడా అమ్ముడు పోయేటందు కవకాశమేర్పడి తమకు లాభం కలిగిందని అనేకమంది మిల్లు యేజెంట్లు నాకు చెప్పినారు. ప్రత్యేకం ఖాదీ ప్రచారమును ఆపి మిల్లు బట్టతో మిత్రత్వం చేసేయెడల, ఖాదీ చచ్చిపోవడమే కాక కాలాంతరంలో, విదేశపోటీకి తాను ఒంటరిగా తట్టుకో లేక మిల్లు బట్టకూడా మరణిస్తుంది. ఖాదీ తత్వం లేని యెడల, దేశీయ విదేశీ మిల్లుల పోటీలో ప్రజాసామాన్యము యొక్క సముచిత భావ ప్రవృత్తి పూర్తిగా లోపించడమొక కల్లోల హేతువవుతుంది.

ఇక అత్యల్ప విషయం కాకపోయినా అంతిమ విషయం మఱొకటున్నది. ప్రజాసామాన్యంలో అత్యద్భుతమైన ప్రబోధం కలిగించడంలోనూ, వారి ఉన్నతికి దోహదం కావడంలోనూ, పెరిగిపోతూన్న ఆకలిబాధను తగినట్లు ఉపశమింపచేయడంలోనూ ఖాదీకిగల శక్తిని బట్టి దాని మూల్యము అనిర్వచనీయము. మిల్లు బట్ట ప్రజా సామాన్యానికి పని కల్పించదు. అందువలన వారి కార్థికంగా సహాయ

కారి కాజాలదు. పనిలేక, కూలిలేక ద్విగుణీకృతంగా పాడయిపోతూన్న ప్రజాసామాన్యానికి ప్రతి గజం ఖాదీ బట్ట కొంత పని కల్పించి కొంత పైకం చేకూరుస్తుంది. కాబట్టి తన దేశాన్ని ప్రేమించే ప్రతి దేశభక్తుడూ ప్రత్యేకం ఖాదీని ధరించడం, ఖాదీ ప్రచారం చేయడం తప్పకుండా నిర్వహించవలసిన ధర్మాలు.

—యంగ్ ఇండియా, **10-5-1928**

# 84

# మిల్లు యజమానుల దురాశనుగూర్చి మరికొంత

మన మిల్లులు ఉత్పత్తిచేసిన ఖాదీనిగూర్చి ఇంతకు పూర్వం నేనిచ్చిన అంకెలు తొమ్మిది మాసములవే. ఇప్పుడు పది మాసములకు సంబంధించిన అంకెలను సంపాదించాను. ఆశ్చర్యకరమువైన ఆ అంకె లీ కింద నుదాహరింపబడుతూన్నవి.

ఖాదీ, డుంగ్రీ లేక ఖద్దరు ఉత్పత్తినిగూర్చిన అంకెలు — ఏప్రిల్ మొదలు జనవరి వరకూగల పది నెలలవి.

| | 1925-26 | 1926-27 | 1927-28 |
|---|---|---|---|
| పౌనులు. | 2,58,22,442 | 3,11,95,169 | 3,70,36,206 |
| గజాలు. | 7,32,44,238 | 8,54,31,611 | 10,30,61,072 |

దీనినిబట్టి నెలకు ఒక కోటి గజాల బట్టను వారుత్పత్తి చేసినట్లు తెలుస్తున్నది. అనగా నెలకు కనీసం 20 లక్షల రూపాయిల విలువగల బట్టను వారుత్పత్తి చేస్తున్నారని అర్థం. అంటే సంవత్సరంలో ఉత్పత్తి కాదగిన నిజమయిన ఖద్దరు విలువ అది. ఆకలితో అల్లాడుతూన్న లక్షలాది ప్రజకు సహాయం చేయడానికుద్దేశింపబడిన ఉద్యమంద్వారా ప్రత్యక్షంగా పేదల నోళ్లుకొట్టి సంపాదిస్తూన్న ద్రవ్యమిది. నీచత్వం దీనిని మించిపోజాలదు. అన్యాయంగా మోసపు మార్గాలద్వారా పోటీచేసి ఖాదీని చంపడానికి ప్రయత్నించడం కంటె ప్రత్యక్షంగా దానికి ద్రోహం చేసి, ఖాదీ ఉద్యమం

తమదిగా భావించుకొన్నట్లయితే మిల్లు యజమానులు దేశాని కుపకారంచేయగలిగిఉండే వారు. నిజమయిన నేయి అని చెపుతూ, తమ మాటలు నమ్మిన ప్రజకు కల్తీ నేతిని అమ్మే వర్తకుల చర్యను పోలిఉన్నది వీరి చర్య. ప్రభుత్వం వారి వలెనే వీరుకూడా ప్రజల అజ్ఞానంపైన ఆధారపడి వ్యవహరించారు. ఇంతకు పూర్వం యిలా వ్యవహరించిన తమబోంట్ల వలెనే తాముకూడా తమతప్పును దిద్దుకోకపోయినట్లయితే, తమ పన్నాగం పాతపడిపోయిందని వారు గ్రహించగలరు. కొంతమందిని ఎల్లప్పుడూ మోసం చేయవచ్చును. కాని అందరినీ అన్నివేళలా మోసంచేయడంమాత్రం సాధ్యం కాదు. పెట్టుబడిదారుల పెంపుకు మోసంచేయవలసిన అవసరం ఉండకూడదు.

—యంగ్ ఇండియా, 10-5-1928

# 85

# నాగరికతయొక్క అపాయకరగమనమా ?

"ఇది వ్రాసేకాలంలో (1917) షాన్ సంస్థానాలలోకి కొంతవరకు విదేశీ వస్త్రాలు దిగుమతిచేయబడుతూన్నప్పటికీ, షాన్ స్త్రీలు తమ బట్టలను, తమ కుటుంబంలోని వారికి కావలసిన బట్టలను తామే నేసుకోవడం ఆచారంగా ఉన్నది......ఈ బట్టలకు కావలసిన పత్తి స్థానికంగా పండుతూన్నది. స్త్రీలే దానిని తయారుచేస్తున్నారు. షాన్ గ్రామాలలో దాదాపు యింటింటా ఒక మగ్గం ఉన్నది. ఒకప్పుడది వెదురుతోనూ, మరొకప్పుడు బరువైన కొయ్యతోనూ చేయబడి, సాధారణంగా జనులు నివసించే గదులకింద బహిరంగ ప్రదేశంలో భూమి పైన ఉంటవి. పత్తి కాయలను ఎండపెట్టడం మూలాన ముడి పత్తి ఉత్పత్తి అవుతుంది. దానిని మామూలు పత్తి రాటుంద్వారా విత్తులుతీసి శుభ్రంచేసి, విల్లువలె కనబడే ఒకానొక పనిముట్టుతో దానిని ఏకి దూదిని పింజెలు పింజెలుగా చేస్తారు. ఈ విధంగా తయారైన దూది పింజెలను ఎనిమది అంగుళాల పొడుగు, ముప్పాతిక అంగుళం మందమూగల ఒక కఱ్ఱ పుల్లకు చుట్టి ఏకులుచేస్తారు. అప్పుడు ఒక విధమైన వడుకు యంత్రం ద్వారా (Spinning Jenny) ఆ దూది నూలుగా తయారుచేయబడుతుంది."—షాన్, కాచిన్ జిల్లాల "బర్మీస్ టెక్స్టైల్సు" నుండి ......లారా ఇస్టార్టు, బ్యాంకు ఫీల్డు మ్యూజియం నుండి సంపాదించిన విషయాలు.

వశీకరణ మంత్రముగ్ధమైన నేటి విద్యావ్యామోహమునకు మనం లోనుగానట్లయితే, తీవ్ర పరివర్తనములను పొందుతూన్న ప్రజల భౌతిక పరిస్థితులను ఎప్పటికీ అభివృద్ధిచేయవలెననే, అవ్యక్తమూ తఱచు వ్యర్థమూ అయిన ఆశతో గౌరవ ప్రదమైన వారి ప్రస్తుత వృత్తికి భంగం

కలిగించడం మహాపరాధంగా మనం భావించేవారం. సభ్యతకు అర్థం అసలు విషయంతో సంబంధం లేని బాహ్యరూపంలో మార్పు మాత్రమే అయితే, అది చాలా సందేహాస్పదమైన విలువగల వస్తువవుతుంది. శ్రీ బాలాజీ రావుచే పంపబడిన పైపేరాలోని అర్థంకూడా అదే. వాణిజ్యము యొక్క సభ్యతా ప్రభావమనే పేరుతో నిరపరాధులైన బర్మా ప్రజలు దరిద్రులుగా చేయబడి పశువలవలె హీనస్థితికి తీసికొనిరాబడ్డారు. శ్రీ మధుసూదనదాసు నిరూపించినట్లుగా తమ చేతిపనులను వదలి, హస్త కళాకౌశలమును విస్మరించి, కేవలం పశువులతో కలసి పనిచేసే ప్రజలు, శారీరకంగానే గాక మానసికంగాకూడా హీనస్థితికి వస్తున్నారు.

—యంగ్ ఇండియా, 10-5-1928

# 86

# నేను రాట్నాన్ని కనుగొన్న విధం

తమిళనాడులో కరైక్కుడి కేంద్రమును పరిశీలించిన పిమ్మట అఖిలభారత ఖద్దరు సంఘ నిర్వాహణమును గూర్చి పరిశీలన చేస్తూన్న ఒకానొక మిత్రుడిలా వ్రాస్తున్నాడు.

“ఈ (ఉట్టుకులి) నూలు వడికేటందుకు నేసేటందుకు కూడా చాలా ముఖ్యమైన ఉత్పత్తికేంద్రము. ఈ పని సగం నేనిక్కడనే నేర్చుకొన్నాను. ఒక వేయిమంది వడికేవారున్నారిక్కడ. నేను గ్రామాల వెంట పర్యటనంచేసి, వారి కుటీరాలలోనే చాలామందిని కలుసుకొనాను. ఒక్కొక్కరోజు గడిచిన కొద్దీ, మీరీ రాట్నాన్ని ఎలా కనుగొనగలిగినారు అని నా కంత కంత కెక్కువ ఆశ్చర్యం కలుగుతూన్నది. ఎప్పుడు ఏ విధంగా మీరీ రాట్నాన్ని తిరిగీ కనుగొనగలిగినారో దయయుంచి సరిగా యంగిండియా పుటలలో వివరించలేరా అని మిమ్ములను అడుగవలెనని నాకు చాలా కుతూహలం కలుగుతూన్నది. అది చాలా చిన్న విషయమూ పెద్దవిషయమూ కూడా. అది వానచినుకులను జ్ఞాపకం చేస్తూన్నది. ఏ చినుకు కాచినుకుచాలా చిన్నది కావచ్చును. కాని అన్నీ కలసి ‘మహా సముద్రంగా’ పరిణమిస్తూన్నవి. మీరు భారతదేశాన్ని నూలు వడకవలసిన దని ఆదేశించినందున మీ పోరు పడలేక ఆదేశం నూలు వడకడం ప్రారంభించిందని అనుకోవడంకంటె ఎక్కువ పొరపాటు మరొకటి లేదు. అసలు నిజమేమిటంటే గ్రామాలలోని లక్షలాది ప్రజలు, వారు వడికిన నూలు విడుదలచేసుకొనేటందుకు మిమ్ములను ఏజెంటుగా ఉండేటట్లు పురికొల్పినారు. ముసలమ్మలు, బాలికలూకూడా గుంపులుగుంపులుగానూలుతీసుకొని రావడం నేను రోజూ చూస్తూనే ఉన్నాను. వారు తమ అమూల్యమైన నూలును హృదయాలకు హత్తుకొని చిరునవ్వుతో వస్తూన్నారు. అత్యంతం ఆత్మవిహీనమైన ఈ స్వార్థవినియోగ విధానమువలన జాతీయ జీవితంలోని ప్రధానభాగాలు దాదాపు మరణావస్థలో నుండగా ఇప్పుడిప్పుడే ఖాదీ వాటికి క్రమక్రమంగా తిరిగీ ప్రాణంపోస్తూన్నది. మీరు నిర్వర్తించిన పనులలో ఖాదీని అత్యుత్కృష్టంగా ప్రపంచం భావించేరోజు ఒకటి వస్తుందని మీరుచెప్పిన మాటలలోని యథార్థం నేడు నేను గ్రహిస్తూన్నట్లుగా యింతకుపూర్వ మెన్నడూ గ్రహించి ఉండలేదు.”

కష్టపడి పనిచేస్తూ పస్తులు పడుకొంటూన్న లక్షలాది ప్రజలు నన్నీపనికి పురికొల్పినారని ఆయన చెప్పేది నిజం.

1908 లో నేను లండను నగరంలో రాటాన్ని కనుగొన్నాను. దక్షిణఆఫ్రికా నుండి అక్కడకు నే నొక రాయబారాన్ని తీసుకొని వెళ్లినాను. అక్కడ నమ్మకంగల భారతీయులతో విద్యార్థులు మొదలైన వారితో నాకు సన్నిహిత సంబంధం కలిగింది. భారతదేశ పరిస్థితులనుగూర్చి మాలో మాకు దీర్ఘంగా చర్చలు జరిగినవి. అప్పుడు నా మనస్సులో రాటం లేనిదే స్వరాజ్యం లేదని మెఱపు మెఱసినట్లుగా ఒక ఊహ తట్టింది. ప్రతివారూ నూలు వడకవలెనని నాకు వెంటనే అర్థమయింది. కాని అప్పుడు నాకు మగ్గానికి రాటానికీ భేదం తెలియదు. 'కాబట్టి హింద్ స్వరాజ్ లో' రాటం అనే అర్థంలో మగ్గం అనే మాట వాడినాను. ఆ పుస్తకము యొక్క అంతిమ అధ్యాయంలో నేను చెప్పిన విషయమిది :

" అడిగినందువలన మన కేమీరాదు ; మనకు కావలసింది మనం తీసుకోవాలి. ఆపనికి కావలసిన బలం మనకు ఉన్నది. ఆ బలం అతనికి ఎప్పుడు వస్తుందంటే,

* * *

2. అతను " లాయరైన యెడల ఆ వృత్తిని మానివేసి చేమగ్గమును (రాటమును) చేపట్టినప్పుడు ;

* * *

3. డాక్టరైనప్పటికీ చేమగ్గమును (రాటమును) చేపట్టినప్పుడు ;

* * *

10. ధనవంతుడయితే తన ధనాన్ని చేమగ్గాలను (రాటాలను) స్థాపించేటందుకు వినియోగించి, తాను చేతితో తయారైన వస్తువులను ధరిస్తూ యితరులను కూడా అలా ధరించేటట్లు ప్రోత్సహించినప్పుడు "

ఆ పుస్తకం వ్రాసిన 1908 లో ఆ మాట లెంత నిజమో ఈ నాటికీ అంతే నిజం. ఈ నాడు డాక్టర్లు లాయర్లు త్యాగ బుద్ధితో వడకడమేగాక వారా ఉద్యమాన్ని క్రమబద్ధంకూడా కావిస్తున్నారు. కాని ఈ నాటికి కూడా లక్షలాది ప్రజలను

నిస్సహాయమైన అలసత్వమునుండి మేల్కొల్పేటందుకు కావలసినవారికంటె యింకా చాలా తక్కువమంది లభించడం దురదృష్టం. అత్యధిక సంఖ్యాకులు ఇప్పటికీ తమ కేమీ పట్టనట్లుగా యింకా దూరంగానే ఉంటున్నారు తమ కట్టెదుట తటస్థిస్తూన్న దుష్పరిణామంకంటె కూడా ఎక్కువ భయంకరమైన దానికోసం నిరీక్షిస్తూన్నారా అన్నట్లు వారు కనబడుతున్నారు. లక్షలాది ప్రజలను కార్యతత్పరులైన చైతన్యవంతులుగా చేసేటందుకు వారిలో విభ్రాంతి జనింపచేయడానికి ఒక్కసారిగా ప్రజల విధ్వంసమును ప్రతీక్షిస్తున్నారా అన్నట్లు వారగపడుతున్నారు. ఇది యిలా ఉండగా క్షుత్పీడితులైన లక్షలాది ప్రజలు స్వరాజ్యము యొక్క దీప్తిని గ్రహించగలిగేటంతవరకు అది సువ్యవస్థాపితం కాజాలదు. మన బ్రతుకు కోసం అక్షరాలా, ప్రజల నెత్తురు పిండే నోరుగల వర్గమునకు చెందిన మనకున్నూ ప్రజలకున్నూ సజీవసంబంధం ఏర్పడేటంతవరకూ వారు దానిని గ్రహించజాలరు.

ఇక రాటమునుగూర్చి విచారిద్దాము. 1908 లోనే నా మానసిక దృక్పథమునకు రాటం ప్రసన్నమైనప్పటికీ, మూడు సంవత్సరాలు ఓపికపట్టి గట్టిగా కృషిచేసిన పిమ్మట 1918 లో అది పనిచేయడం చూడగలిగాను. మొట మొదటి ఖాదీ ప్రమాణం (బొంబాయిలోని నవీన నాగరిక, సోదరీ మణులకు సరిపోయేటట్లుగా చాలా ఎక్కువగా మార్పు చేయబడి) 1919 లో తీసుకోబడింది. 1921 లో కాంగ్రెసు కార్యక్రమము నందు రాటానికి స్థానం లభించింది. అప్పటి నుండీ ఆ ఉద్యమ చరిత్ర బహిరంగంగానే ఉంటూన్నది. రాటం ఎవ్వరి జీవితాలలో ఒక ఆశాకిరణాన్ని ప్రసరింప చేసిందో ఆ రెండువేలమంది వడికేవారి జీవితాలలో ఈ

చరిత్ర యింకను వ్రాయబడుతూన్నది. నగరసభ్యత అనే భ్రాంతిజన్య విధ్వంసకారక మంత్రముగ్ధులం కాకపోయినట్లయితే, భారతదేశంలోని ప్రతి కుటీరమునకూ రాటాన్ని కొంపోవడానికి, కొంచెం చైతన్యంతో శ్రద్ధగా క్రియారూపంలో చేసే కృషి కావలసి ఉంటుందని మన హృదయాలకు తట్టుతుంది. ఒకటి రాటంద్వారా వచ్చే ఆదాయమును 10 లక్షలు పెట్టి హెచ్చించినయెడల వచ్చేఫలితం, రాటం యొక్క శక్తిని గూర్చి అత్యంతమైన అవిశ్వాసం గలవానికి కూడా విశ్వాసం కలిగిస్తుంది. అయితే, ఆయన బహుశా ఆ సత్యాన్ని అంగీకరించేటందు కయిష్టంతో యిలా అనవచ్చును "లెక్కల ప్రకారం మీరు చెప్పేది నిజమైన ప్రతిపాదనయే. కాని ఆచరణలో అది పూర్తిగా అబద్ధంగా పరిణమిస్తుంది. ఇష్టపడుతూన్న గుఱ్ఱాన్నే నీళ్లతొట్టి కడకు మీరు తీసుకొని పోగలరు. అయితే నిజంగా నూలువడికే మనిషికి అంతులేని సహనం ఉండాలి. అతడు లొంగిపోడు. కాబట్టి, ఆస్నేహితుడడుగబోయే ప్రశ్నకు బహుశా ఈ క్రింది విధంగా ప్రత్యుత్తర మీయవలసి ఉంటుంది. 'రాటం ఇంకా కనిపెట్టబడవలసి ఉంది,' అది ఒక రోజున కనిపెట్టబడుతుందనీ నాకు తెలుసు. అందుకోసం జీవితాలను అర్పించేటందుకుకూడా సంసిద్ధంగా ఉన్నవారు కొందరీదేశంలో ఉన్నారు.

—యంగ్ ఇండియా, 20-9-1928

# 87

# పొరబడ్డ మానవ కారుణ్యం

కరాచీలో కెల్లా మిక్కిలి నిజమైన మనిషి అని శ్రీ జమ్ షెడ్ మెహతా పేరుపడడం యథార్థపరిస్థితి కనుగుణంగానే ఉన్నది. దాదాపు ప్రతిమంచి ప్రజోద్యమమూ ఆయనను తన మనిషిగానే భావిస్తూంటుంది ఆయన తన యావత్తు కాలమును కేవలం ప్రజోద్యమాలకే వినియోగిస్తూంటాడు. ఆయన దివ్యజ్ఞాన సమాజముయొక్క పరమోత్తమమైన ప్రతినిధులలో ఒకరు. ఆయన దేశభక్తి యెంత అప్రతిహతమైనదో, ఆయన నిజాయితీ, స్వాతంత్ర్యం కూడా అంత అప్రతిహతములు. కాబట్టి అటువంటి మనిషి ఒక తప్పు నిర్ణయం చేస్తేగాని, లేక ప్రజాభిప్రాయానికి ప్రతికూలంగా నడుచుకొంటేగాని, ఆయన మిత్రులు హృదయంలో బాధపడుతారు. కరాచీ మున్సిపాలిటీకి అధ్యక్షుడైన శ్రీ జమ్ షెడ్ మెహతా ఒక పొరపాటు నిర్ణయం చేసినట్లు నాకు తోస్తున్నది. తాను ఖాదీప్రేమ కలవాడయినప్పటికీ, ఒకానొక గైరు హాజరైన సభ్యుని పక్షాన ఖాదీనిగూర్చిన తీర్మానమును ఆయన ప్రతిపాదింపవలసి ఉన్నట్లుగా భావించాడు. అందుకు సభ్యుల నుండి మిక్కిలి తీవ్రమైన ప్రతిఘటన వచ్చింది. మరొకవిషయ మేమిటంటే, ఐరోపాఖండమునుండి దుంపనెయ్యి అనే పేరుతో ఇండియాలోకి ప్రవేశపెట్టబడిన ఒకానొక పదార్థమును గూర్చి ఆయన చూపించిన వైఖరి ఆయనకూ నాకూ సమాన స్నేహితులైన కొంతమంది ఈ విషయాలనుగూర్చి కరాచీలో నడుస్తూన్న వాదోపవాదములను నా దృష్టికి తెచ్చి వాటిపైన నా అభిప్రాయాలను ప్రకటింపవలసిందిగా కోరినారు.

బహుశా వారు, అధ్యక్షునియెడ నాకుగల గౌరవమును గూర్చి ఆయనకు తెలుసును కాబట్టి, నా అభిప్రాయాలాయనలో పరివర్తనం కలిగించవచ్చునని కాని, లేక ఒకవేళ అలా కలిగించక పోయినప్పటికీ, పత్రికా విలేఖరులను కొంటూన్నట్లు, ప్రజలచే ఎన్నుకోబడ్డ అధ్యక్షుని తప్పు అభిప్రాయాల మూలకంగా కనీసం కరాచీ ప్రజలలో కొంతమంది అయినా పెడత్రోవలు పట్టకుండా అవి నిరోధించవచ్చుననీ వారాశించి ఉండవచ్చునని నేను భావిస్తూన్నాను. నా అభిప్రాయాలు అటువంటి పరివర్తనం కలిగించినా కలిగించక పోయినా ఈ విషయాలపైన శ్రీ జమ్‌షెడ్ మెహతా యొక్క అభిప్రాయాలను సగౌరవంగానూ సహనంతోనూ పరిశీలించవలసి ఉంది.

మున్సిపాలిటీయొక్క అభిప్రాయాన్ని పరిశీలించడానికి తాను ఖాదీ తీర్మానమును ప్రతిపాదించాననీ, సభ్యులు దానికి ప్రతికూలంగా ఉన్నారని గ్రహించినప్పుడు దానిని ఉపసంహరించుకొన్నాననీ ఆయన నాతో అంటున్నాడు: ఆ తీర్మానాన్నీ వాదాన్నీ స్థానిక పత్రికల నుండి ఉదాహరిస్తున్నాను:

"చేతితో వడికి చేతితో నేయబడిన ఖద్దరును నిర్బంధంగా కొని వాడుతూండడంవలన అన్ని సందర్భాలలోనూ, మున్సిపాలిటీయొక్క వివిధశాఖలకు సంబంధించి తఱచు మున్సిపల్ సొమ్మును కేవలం వ్యర్థం చేయడంగా పరిగణమించింది కనుక 1924 జూలై 2 వ తేదీ గల ఈ సభయొక్క 304 వ తీర్మానమును రద్దుచేయవలసిందని ఈ కార్పొరేషన్ తీర్మానిస్తూన్నది."

"ఈ తీర్మానమును ప్రతిపాదిస్తూ, తాను ఖాదీ వాడుకను ప్రచారంలోకి తీసికొని రావడానికి నిజంగా అనుకూలంగా ఉన్నట్లు అధ్యక్షుడు మొట్టమొదట్లోనే సభకు

పోమీ యిచ్చాడు. ఈ కటీరపరిశ్రమను ప్రోత్సహించే టందుకు కడచిన మూడు సంవత్సరాలలో ఆ కార్పొరేషన్ లక్ష రూపాయీలకు తక్కువ కాకుండా వెచ్చించినదని కూడా ఆయన అన్నాడు. కాని కార్పొరేషన్ యిచ్చిన ఖాదీని ధరిస్తూన్న ఆ నిరుపేదలగు నీచ సేవకులు చాలా కష్టాలపాలవుతున్నారని ఆయన నిజమైన అభిప్రాయం. ఖాదీధారులకు సుఖం లేకపోగా, ఖాదీమీద అంత పెద్ద మొత్తాలను వెచ్చించడం మూలకంగా, కార్పొరేషన్ సభ్యులు తమను తాము అన్యాయ్యం చేసుకొంటూ పన్నులిచ్చేవారిని కూడా అన్యాయ్యం చేస్తూన్నారు. ఈ బరువైన బట్టలను కట్టుకొని వీథులవెంట వెళ్లండని ఉద్యోగులను కోరడం నిజంగా క్రూరం. అదీకాక తెల్లనిఖాదీ త్వరగా మాసిపోతుంది. పేదలయిన బంట్రోతులు దానిని తెలుపు చేసుకోవడానికి చాలా ఖర్చు పెట్టవలసి ఉంది. రంగువేయడానికి ప్రయత్నం జరిగింది. కాని ఉపయోగం లేకపోయింది. కార్పొరేషన్ ఒక రెండు సూట్లు మాత్రమే ఈయగలిగింది. వాటిని పరిశుభ్రంగా ఉంచుకోవడానికి వారు చాలా బాధపడవలసి వచ్చింది. తరువాత అధ్యక్షుడు ఖచ్చితంగా యిలా అన్నాడు." "ఇది నిజంగా క్రూరమని నేనుమీకు చెపుతున్నాను. మనం దాదాపు ఒక లక్ష రూపాయీలను వెచ్చించాము. కాని, రూ. 85,000 నిజంగా వ్యర్థమైపోయినవి. మన ఉద్దేశం పరిపూర్తి కాలేదు. ఇంతకన్న ఎక్కువ మంచిదైనట్టి ఎక్కువ తేలికయినట్టి, ఎక్కువ నాణ్యంగలిగినట్టి ఖాదీని ఇంతకు రెండింతలు ఖర్చు పెట్టి యీయగలిగేటంతవరకూ ఖాదీ సూట్లు ఈయడమును గూర్చి మన మాలోచించకూడదు. ఇప్పుడు మనం మన బంట్రోతుల కిస్తూన్న సరుకు కళ్ల నీళ్లు తెగలిగినట్లుగా ఉన్నవి."

ఈ వాదాన్ని మనం పరిశీలింతుముగాక. తన ప్రమాణమును బట్టి మున్సిపల్ నౌకర్లపు నిర్ణయించడంలో, ఆ నౌకర్లకూ ఖాదీ ఉద్యమానికీ కూడా అధ్యక్షుడు తీవ్రమైన అన్యాయం చేసినట్లు నేను భావిస్తున్నాను. ఆయన నిర్ణయం, ఒకానొక సుకుమారమైన స్త్రీ, తుపాను దెబ్బ తిన్న తన అతిథుల ఆకలికూడా తన ఆకలివలెనే ఉంటుందని నిర్ణయించినట్లుంది. లేక ఒక చీమ కొన్ని పిండి కణాలను ఏనుగుకు కొలిచి యిచ్చి తన అతిథికి కావలసింది సరిగా కొలతప్రకారం యిచ్చానని అనుకొంటూన్నట్లుంది. ఈ ప్రతి ఒక్క సందర్భంలోని కొలా తప్పుకొల అని మనకు తెలుసు. వారిరువురూ, ఆ చీమకున్నూ, ఆ సుకుమార స్త్రీకిన్నీ, తమ జాతికి చెందిన అతిథులే యుండి తమ పరిస్థితులలోనే వారు కూడా ఉండి ఉన్న యెడల వారి కొలత సరియైనదై యుండేది.

కరాచీ తీర్మానం విషయంలో, ఆ తీర్మానముయొక్క ప్రతిపాదకునివలె, మున్సిపల్ నౌకర్లు సుకుమారంగా పెఱుగలేదు గనుక, అధ్యక్షు డవలంభించిన ప్రమాణం తప్పు. ఈ సందర్భంలో అధ్యక్షుని ప్రమాణం రెండు విధాల తప్పు. ఒకటి, అధ్యక్షునివలె సున్నితమైన బట్టలు వేసుకొనేవారి కక్కఱలేదు. రెండు, భయంవలనగానీ, అజ్ఞానంవలనగానీ, కీర్తికాముకత్వంవలనగానీ, విద్యావంతులైన భారతీయులచే అనుకరింపబడిన పరిపాలకుల దుస్తుల వంటి దుస్తులు వారు కోరరు. కౌన్సిలర్లు, గౌరవమును గూర్చి తమకుగల అభిప్రాయాలను మార్చుకొని, దేశముయొక్క శీతోష్ణస్థితికీ ఆచారాలకూ తగిన దుస్తులను తమ నౌకర్లకీయవలసి ఉంటుందని నేను సూచించ సాహసిస్తూన్నాను. అప్పుడు వారు అత్యంతం మొరటుగా ఉండే ఖాదీని వాడేటందుకుకూడా భయపడ నక్కఱలేదు.

అందువల్ల వారు, మున్సిపల్ సొమ్మును ఆదా చేసుకొని నౌకర్ల సౌఖ్యాన్ని పెంపొందించి, నిజమైన కళను పునరుద్ధరించి, ఖాదీద్వారా తప్ప సమీపించేటందుకు సాధ్యం కాని అత్యంత నిరుపేదలైన దేశీయుల కుపకారం చేయగలరు. అధ్యక్షుడు తన నౌకర్లయెడ తాను ప్రవర్తించే విధంగా వారు తనయెడ ప్రవర్తించవలసినయెడల, ఒకక్షణం వారి స్థానంలో ఉంటే తన కేవిధంగా తోస్తుందో తెలుసుకొన్నచో తన ప్రమాణం సరియైనదౌతుంది

మున్సిపాలిటీ వారి ఆడంబరానికి తగినట్టుగా మున్సిపల్ నౌకర్లు అసహజమైన యూనిఫారమును ధరించవలెనని అనుకొన్నప్పటికీ, మున్సిపాలిటీ ఖరీదు పెట్టినట్లయితే ఈ రోజులలో సన్నని ఖాదీ సంపాదించడం దుస్తరం కాదు. అందుకు కావలసి ఖాకీ రంగు ఖాదీని సేకరించడం కూడా అసంభవం కాదు.

మున్సిపల్ పాఠశాలలలోని బాలబాలికలకు శిక్షణ యిప్పించి, కౌన్సిలర్లు తాము సన్నని నూలు వడకడంలో శిక్షణ పొంది దానిని స్థానికంగా నేయించడమే, ఒకటి లాభకరమైనట్టిన్నీ అత్యంత దేశభక్తి యుతమైనట్టిన్నీ పద్ధతి. కౌన్సిలర్ల యొక్క దేశభక్తినీ కార్య తత్పరత్వమును తక్కిన పౌరులు తారాకాణంగా తీసుకొంటారు. అప్పుడు కరాచీలో నున్న మూడవ వంతు పౌరులు రోజుకు ఒక అర గంట ప్రజాహిత బుద్ధితో నూలు వడికినట్లయితే మున్సిపల్ నౌకర్ల కవసరమైన బట్టకంటె అనేక రెట్లు ఎక్కువ బట్ట తయారు కాగలదు.

ఈ పద్ధతి అవలంబించేటందు కొక సరియైన అభ్యంతరం రావచ్చును. ప్రజా సంస్థలలో ఖాదీ, యెవరి క్షేమము

నుద్దేశించి సిఫారసు చేయబడినదో ఆ నిరుపేదల సహాయార్థ మీవిధంగా ఉత్పత్తియైన ఖాదీ వినియోగింపబడదు కదా, అని అనవచ్చును. ఈ అభ్యంతరం చాలావరకు సరియైనదే. కాని నేను సూచించిన ప్రకార మేనగరమైనను నూలువడికే పనికి పూనుకొన్నట్లయితే, దరిద్ర భారతదేశాని కది పరోక్షంగా అయినప్పటికీ మహోపకారంగా పరిణమిస్తుంది. అంతేకాక సూత్ర యజ్ఞ (sacrificial spinning) విధానంలోని నైతిక శక్తి, నూలు వడికే వాతావరణాన్ని సృజించ గలిగినంతగా సర్వ వ్యాప్తమై, అంతకు పూర్వం పలకకుండా ఊరుకొన్న ప్రజాసామాన్యాన్ని ఆ పనికి ప్రోత్సహించి, మనుష్య జీవనానికి యెంత మాత్రమూ సరిపోదని అంగీకరింపబడుతూన్న వారి ప్రస్తుత ఆదాయాన్ని ఎక్కువ కావించుకొనేటట్లు చేస్తుంది. సగటు రోజు ఆదాయం ఏడు కానులకంటె తక్కువ అయిన పరిస్థితిలో, రోజుకు మఱొక కానీ అదనంగా వచ్చినప్పటికీ, అదే మహదైశ్వర్యంగా ఉంటుంది :

అయితే ఇది ఒక ఆదర్శప్రాయమైన ఉపదేశ వాక్యం కాని కార్య దక్షులైన వ్యాపారస్థులు ఆలోచించ తగిన విషయం కాదని తలంచవచ్చును. ఏది యెలా ఉన్నా ఆదర్శవాదియైన ఆ అధ్యక్షుడు అంత తొందరగా నా సూచనను నిరాకరించడని నాకు తెలుసును. ఐతే, నేను సూచించిన ప్రకారం యిళ్లలో నూలు వడకడమునుగూర్చి శ్రద్ధగా శాస్త్రీయ పద్ధతిమీద యేర్పాటు చేయజాలనివారు ఖాదీకోసం యెంత వెచ్చించినప్పటికీ, వృథాగా వెచ్చించినట్లు భావించగూడదనీ, ఖాదీ విషయంలో యెంత అసౌకర్యం పొందినప్పటికీ ఏమీ అనుకోకూడదని నేను మనవి చేస్తున్నాను. ఎందువల్లననగా, ఖాదీకోసం వెచ్చించిన ప్రతి కానీ

ప్రత్యక్షంగా పేదవారికి లభిస్తుంది. అంతేకాదు; అందులో నూటికి 85 వంతులు మరీ నిరుపేదలైన పనివాళ్లకున్నూ, సగమాకలితో బాధపడే మాలు వడుకువారికిన్నీ లాభిస్తుంది.

ఐతే, అధ్యక్షుడు ఇలా అంటాడు "మునిసిపల్ నౌకర్లకు స్వదేశీ మిల్లు బట్టలో తయారు చేయబడిన గణవేషము (uniform) ను ఎందుకు ఈయకూడదు? అందువలన ఖాదీకి వెచ్చించేదానిలో నూటికి అరవై వంతులకంటె ఎక్కువ మిగులుతుందికదా!" శ్రీ జేమ్‌షెడ్ మెహతావంటి పేదల పెన్నిధి యీ వాదం చేస్తాడని నేనెంత మాత్రమూ అనుకోనను. నిజానికి ప్రతి మునిసిపాలిటీకి అధికారం ఉన్నట్లయితే, వారు ఖాదీకొంటకు నూటికి అరవై వంతులు విరాళ మిచ్చినప్పటికీ తప్పు కాదు.

ఖాదీకీ మిల్లు బట్టకూ యే విధమయిన పోలికా లేదని యీ పుటలలోనే నేననేక పర్యాయములు నిరూపించి ఉన్నాను. ఇంటిలో తయారైన చపాతి ఎంత ఖరీదైనప్పటికీ దానిని చేసేటందుకు ఎంత శ్రమ పడ్డప్పటికీ యంత్రంలో తేలికగాను, చవకగాను తయారైన బిస్కట్టుతో పోల్చడం యెలా కూడదో, యిదికూడా అలా కూడదు. ఖాదీమీద ప్రజలు చూపవలసిన అభిమానం కాని ఈయవలసిన రక్షణగాని మిల్లు బట్ట కవసరం లేదు. ఎంత ధర పెట్టినప్పటికీ ఖాదీ లభించనప్పుడున్నూ, యంత్రంమీద తయారైన బట్ట అవసరమయినప్పుడున్నూ స్వదేశీ మిల్లు బట్టా విదేశీ మిల్లు బట్టల మధ్య ఎన్నుకోవలసివచ్చినప్పుడున్నూ మిల్లు బట్టయందు పక్షపాతం ఉండనే ఉంటుంది. మిల్లు బట్ట స్థానమును, విదేశీ బట్ట స్థానమునూకూడ ఖాదీ ఆక్రమించవలసిన మాట మాత్రం వాస్తవం. మిల్లు బట్టవలె ఖాదీ విడుదలకు

సునిర్మితమైన అంగడి లేదు. అది యింకా బజారులో దొరికే వస్తువు కాలేదు. ఒక గజం ఖాదీ కొనటమంటే భారతదేశంలో వస్తువులు పడుకుంటూన్న వారిలో నూటికి 85 మందికి ఆహారం అందించడ మన్నమాట. ఒక గజం మిల్లు బట్ట కొనడమంటే నూటికి 75 వంతుల సొమ్ముతో పెట్టుబడిదారుల జేబులను నింపడం. అంతేకాదు; తమను తాము బాగా రక్షించుకోగలిగి యెన్నడూ నిస్సహాయులు కాని కార్మికులకు నూటికి 25 వంతులకంటె కొంచెం తక్కువగా ఈయడమన్నమాట. ఆ కార్మికులు, ఖాదీ ఉద్యమం ఎవరికోసం ఉద్దేశింపబడినదో ఆ నిస్సహాయులైన లక్షలాది ప్రజలవలె ఎన్నడూ వస్తువులు పడుకునేవారుగాని, వస్తువులు పడుకోవలసిన అవసరం ఉన్నవారుగాని కారు. పోటు ఖాదీని ధరించినందున మునిసిపల్ సిబ్బందికి కలుగుతున్నదని భావింపబడే అసౌకర్యం ఉదారహృదయుడైన శ్రీ జెమ్‌షెడ్ మెహతాను కార్యాచరణలోకి దింపినప్పటికీ, ఖాదీయొక్క జాతీయ ప్రాముఖ్యతనుగూర్చి ఆ మునిసిపల్ నౌకర్లకు బోధించినట్లయితే వారు స్వదేశీ మిల్లు బట్ట తమరు ధరించేటందుకెంత సౌకర్యంగా ఉన్నప్పటికీ, దానికంటె ఖాదీనే యెక్కువగా అభిలషిస్తారనడంలో నిజంగా ఆశ్చర్యమేమీ లేదు. ఖాదీ పనిలేనివారికి పని చూపించడానికీ, తద్వారా లక్షలాది ప్రజలను పోషించడానికీ ఉపయోగపడుతూన్నంతవరకు అది యెంత ప్రియమయినప్పటికీ చౌక అనియే నా అభిప్రాయము.

—యంగ్ ఇండియా, 4-10-1928

# 88
# మనం ఇండియాను పోగొట్టుకొన్న విధం

దేశబంధు యిక కొద్ది కాలానికి మరణిస్తాడనగా జల్పాయ్‌గురిలోని వర్తకుల సభలో వారు నాకిచ్చిన సన్మాన పత్రమునకు ప్రత్యుత్తరంగా, భారతదేశాన్ని వర్తకుల మూలాన్నే మనం పోగొట్టుకొన్నామనీ, దానిని తిరిగీ వారిద్వారానే సంపాదించవలసి ఉంటుందనీ చెప్పి ఉన్నాను. ఈ నా ప్రకటనలోని సత్యమునుగూర్చి తార్కాణములు కావలెనంటే ఒకానొక వాణిజ్య సంఘంవారు తదితర వర్తక సంస్థలకు పంపిన ఈ దిగువ సర్క్యులర్ నుండి ఒక ఆశ్చర్యకరమైన ఉదాహరణను చూపిస్తున్నాను:—

"మాంచెస్టర్ బట్టలూ నూలు వ్యాపారం, ఇటీవల చాలావరకు పడిపోయిందనీ, యింకా పడిపోయే సూచన స్పష్టంగా కనిపిస్తూన్నదనీ మీకు తెలిసిన విషయమే. ఈ వ్యాపారంలో వర్తకులు పూర్వం తీసుకుంటూండినంత శ్రద్ధ యీనాడు తీసుకోవడం లేదని కనిపిస్తూన్నది. ఈ అశ్రద్ధకు ఫలితంగా మన దేశీయులు ఇదివరకు పొందుతూండిన లాభానికీ యింకా లాభం పొందడానికీ గల ఆధారాన్ని క్రమక్రమంగా పోగొట్టుకొంటున్నారు. మార్వాగి సంఘమున్నూ, తదితర వాణిజ్య సంఘాలున్నూ వస్త్రముల వ్యాపారంలోనూ, నూలు వ్యాపారంలోనూ చాలా యెక్కువ శ్రద్ధ కలిగి ఉండడంచేత యీ మా కమిటీవారు 7 వ తేదీని సమావేశమై ఈ ప్రధానమైన వ్యాపారాన్ని పునరుజ్జీవింప చేసేటందుకు స్పష్టమైన చర్యలను తీసుకునే ఉద్దేశంతో యిది పడిపోవడానికిగల కారణాలనుగూర్చి పూర్తిగా విచారించవలెనని తీర్మానం చేసి ఉన్నారు.

"ఇది మన అందరికీ సంబంధించిన విషయం కావడంచేత యీ వ్యాపారంలో సంబంధంకల వివిధ ప్రజా సంస్థల ప్రతినిధులందరూ సాధ్యమైనంతవరకు సమైక్యంగా చర్య తీసుకోవడానికి ఒక మహా సభలో

సమావేశం కావడం ఉచితమని యీ మా కమిటీవారు అభిప్రాయపడు తున్నారు.

"ఈ సూచన మీ సంఘంవారికి అంగీకారంగా ఉంటుందని మా కమిటీ ఆశిస్తూన్నది. అలా అంగీకారమయినట్లయితే సాధ్యమైనంత త్వరలో వివిధ ప్రజా సంస్థల ప్రతినిధులతో గూడిన మహాసభను యేర్పాటు చేయడానికి మా కమిటీవారు సంతోషంగా ఆమోదిస్తారు. త్వరలో మీ ప్రత్యుత్తరాన్ని పంపించగలరని ఆశిస్తున్నాము."

ఈ సరుక్యులరు తేదీ 1928, జూలై 19. ఈ ప్రయత్నంయొక్క పర్యవసాన మేమి జరిగిందో నాకు తెలియదు. దాని పర్యవసానంతో మనకు నిమిత్తంకూడా లేదు. దేశం యావత్తూ విదేశీ వస్త్ర బహిష్కరణమును గూర్చి ప్రయత్నిస్తూన ప్పుడు, మాంఛెస్టరు వస్త్రముల వ్యాపారాన్ని నూలు వ్యాపారాన్నీ పోషించేటందుకు ఉపాయాలను ఆలోచించడంతో కాలక్షేపం చేస్తూన్న గౌరవనీయములైన వాణిజ్య సంస్థలు మన మధ్య ఉన్నవనే విషయాన్ని ప్రతి జాతీయ కార్యకర్తా భావిసూచక చిహ్నంగా గమనించవలసి ఉంది.

ఆంగ్లేయులు తమ వాణిజ్యంకోసం ఇండియాను ఉంచు కొన్నారనీ ఇండియాకు దిగుమతి అయ్యే వస్తువులన్నిటిలోకీ ఎక్కువ వస్త్రము లేననీ కావలసినంత సాక్ష్యం ద్వారా ఈ పుట లలో అనేక పర్యాయములు నిరూపించి ఉన్నాము. దానిని రుజువు చేయడానికి ప్రత్యేకం ఒక కమిటీగానీ కమీషన్ గానీ నియమింపబడ నక్కర లేదు. మన దేశాన్ని ఈ విధంగా తమ స్వార్థాలకు వినియోగించుకొనేటందుకు మనం వీలు కలిగిస్తూన్నంతకాలమూ బ్రిటిష్ వారు దీనిని తమకు చేతనైన అన్ని ఉపాయాలనూ అవలంబించి తమ స్వాధీనంలో ఉంచుకొంటారు. కాబట్టి మనమిప్పుడు చేయ

వలసింది ఇండియాలో నివసిస్తూన్న ఆంగ్లేయులనూ, పాలకులనూ మార్చడంగానీ వెళ్ళగొట్టడంగానీ కాదు. తమ స్వప్రయోజనాలకోసం తమ దేశాన్ని అమ్మివేస్తూన్న వర్తక శిఖామణులలోనూ, వారి పైన ఆధారపడి ఉన్నవారి లోనూ పరివర్తనం కలిగించడమే మనం చేయవలసిన కర్తవ్యం.

మన దేశ క్షేమంకోసం ఈ వర్తక శిఖామణులు నష్టపడ నక్కర లేదుకూడా. వారు నేడు ఎంత బట్టా, ఎంత నూలూ దిగుమతి చేసుకొంటూన్నారో అంత బట్టా, అంత నూలూ ముందుకూడా ఇండియాకు కావలసే ఉంటుంది. అయితే అంత పరిమాణంకల బట్టా, నూలూ ఉత్పత్తి అయ్యేటందుకు, ఇండియాలోని ఏడు లక్షల గ్రామాలలోనూ తమ నిస్సంశయమైన సామర్థ్యమును వారుపయోగించక తీరదు. అలా చేసినందువలన వారికే లాభం. కాని, వారు వాణిజ్యమనే జూదాన్నీ, సాహస వ్యాపారాన్నీ, తమ పరిసరములతో యేమాత్రమూ పోలికలేని సౌధములనూ విడిచిపెట్టి, తామెవరి క్షేమంకోసం ఎవరితో వ్యాపారం చేస్తున్నారో వారి స్థితిగతులకు కొంతవరకనుగుణంగా ఉండే ఆచారంతో మాత్రమే సంతృప్తి చెంది ఉండవలసి వస్తుందని నే నంగీకరిస్తాను. అనగా, వారిప్పుడు చేస్తూన్నట్లు గ్రామాల నెత్తురు పీల్చడంలో పాల్గొనడానికి బదులు, తమ ఐశ్వర్యం ఎవరిమీద ఆధారపడి ఉందో వారికి నెమ్మదిగా కొంత ప్రతి ఫలం ముట్టచెపుతూన్నవారవుతారు. ఈ

సందర్భంలో పొట్టకూ తక్కిన అవయవాలకు సంబంధించిన కథ శాశ్వతంగా సార్థకమవుతుంది. శ్రమ జీవులయిన లక్షలాది ప్రజలు పొట్ట. వర్తకులు తదితరులు తక్కిన అవయవాలు. పొట్టను పస్తులు పెడితే తక్కిన అవయవాలు క్షీణించి తీరుతవి. చాలినంత ఎక్కువ కాలం ఆ పొట్టను లజ్జావిహీనంగా పస్తులు పెట్టినట్లు కన్నులున్నవారు కనుగొన గలరు. పగలు తరువాత రాత్రి వచ్చినట్లు, పొట్టను పస్తులు పెట్టిన పిమ్మట తక్షణం అవయవాలు క్షీణించడం జరుగుతుంది. కాలం మించిపోక మునుపే మనం పశ్చాత్తప్తులం కావాలి.

—యంగ్ ఇండియా, 25-10-1928

# 89
# పది యేండ్లలోనా?

ఈ పుటలలో ప్రచురింపబడిన ఆచార్య సి. యన్. వకీలు యొక్క విజ్ఞాన ప్రదములైన వ్యాసాలు, దారిద్ర్యమును గూర్చి ఆయన ఇటీవల వ్రాసిన వ్యాసావళికి అనుబంధములు కాబట్టి అవన్నీ కలిపి చదువవలెను. దారిద్ర్య నిర్మూలన ప్రయత్నాలనుగూర్చి ఆయన వ్రాసిన వ్యాసమును నేను సాహసించి ప్రచురించకుండా ఆపివేస్తూ, అంతకన్న ఎక్కువ స్పష్టంగా వ్రాయవలసిందని ఆయనను ప్రోత్సాహపఱిచాను. అప్పుడు దాని నాయన నాలుగు వ్యాసాలుగా విస్తరింపజేసి వ్రాశాడు. వాటినే నేను పైన ఉదాహరించాను. ఆ ఆచార్య పండితుడు రచించిన కార్యక్రమం పదిసంవత్సరాలలో పూర్తి కాగలదని నేననుకోను. మన దేశమువలె విస్తీర్ణమై దారిద్ర్య పీడితమైన దేశమును పూర్తిగా అభివృద్ధిచేసేటందు కొక దశవర్ష ప్రణాళికను తయారుచేయడం బహుశా సాధ్యంకానిపని. ఐనప్పటికీ, భారతదేశముయొక్క ప్రధాన జాడ్యమునకు ఆచార్య వకీలు సూచించిన చికిత్సలను గూర్చి మనమొక్కసారి పరికింతముగాక. ఐశ్వర్యోత్పత్తిని ఎలా ఎక్కువ చేయవలెననేదీ, దానిని ప్రజలలో న్యాయంగా ఎలా విభజించవలెననేదీయే ప్రధాన సమస్య అని ఆయన చెప్పే మాట సమంజసంగా ఉంది. కాబట్టి ఈ విభజన ముఖ్యంగా పస్తులు ఉంటూన్న లక్షలాది ప్రజలలో జరుగ వలెనన్నట్లు నేను భావిస్తూన్నాను. ఇందుకా విద్వాంసు డైన వ్యాసకర్త:

1. ఆర్థికంగా లాభదాయకములుగాని భూఖండము లను పునర్నిర్మాణం చేస్తాడు.

2. తనఖా బ్యాంకుల ద్వారానూ, సహకార బ్యాంకులద్వారానూ రైతు ఋణాలను తీర్చివేస్తాడు.

3. రెవిన్యూ చట్టాన్ని సంస్కరించి, ఆదాయపుపన్ను పద్ధతి మీద భూమి పన్నుకుకూడా క్రమవిధానాన్ని యేర్పాటు చేస్తాడు. భూమిమీద వచ్చే ఒక కనీసపు ఆదాయానికి పన్ను లేకుండా చేస్తాడు.

4. ఆర్థికంగా లాభదాయకంగాని భూములను పునర్నిర్మాణంచేసినందున స్థానభ్రష్టులైన జనాన్ని, వ్యవసాయానికి అనుకూలమైన బంజరు భూములను అనగా యిప్పుడున్న భూమి మొత్తంలో నూటికి 23 వంతుల భూమిని దున్నేటందుకు తిరిగీ నియోగిస్తారు. పెద్ద పరిశ్రమలను పెంపొందించి జాతి పరంచేసి వాటిలో వారిని నియోగిస్తాడు.

5. ఇప్పటికంటె ఎక్కువగా దేశంయొక్క అవసరాలకు అనుగుణంగా ఉండే పద్ధతిమీద బ్యాంకింగు విధానాన్ని మార్చి చిన్న పెట్టుబడులను, పెద్ద పెట్టుబడులనూ కూడా సేకరిస్తాడు.

6. పెట్టుబడి దారులకూ కార్మికులకూ మధ్య పోరాటం లేకుండా ఉండేటందుకు కార్మికుల స్థితిగతులను బాగుచేస్తాడు.

7. బాల్య వివాహములు మొదలైన సాంఘిక దురాచారాలను రూపుమాపి అతి జనవృద్ధినీ, అయోగ్య సంతానమునూ ఆపివేస్తాడు.

8. ప్రజల అవసరాల కనుగుణంగా ప్రజా సామాన్యంలో విద్యా వ్యాపకమునకు తగినట్లు విద్యా విధానాన్ని అమూలాగ్రంగా సంస్కరిస్తాడు.

9. సైనిక వ్యయమును తగ్గించి ఉద్యోగాలలో సమర్థులైన దేశీయులనే ఉంచి, దేశమునుండి పోయే ధన ప్రవాహాన్ని అరికడతాడు.

ఇది అనాకర్షవంతమైన కార్యక్రమం కాదు. కాని నే నీ వ్యాసాలను తిరిగీ చదువుతూన్నప్పుడు 'పిల్లికి గంట కట్టే దెవరు?' అనే ప్రశ్న మాటిమాటికీ నాకు ప్రత్యక్షమౌతూ వచ్చింది? ప్రభుత్వ సహాయం లేకుండా జరుగగల అంశం ఇందులో యేదీ లేదు. నిశ్చయంగా పాలితులను స్వార్థం కోసం వినియోగించుకోవడం మీద ఆధారపడిన ప్రభుత్వం, పైన సూచించబడిన సంస్కరణలను ప్రవేశ పెట్టదు, పెట్ట జాలదు. ఒకవేళ ప్రవేశ పెట్టతలంచినప్పటికీ తక్షణం నమ్మకం కలిగించడానికి తగినంత కార్యాచరణకు దిగదు. కోట్లకొలదీ రూపాయల విలువగల వ్యావసాయిక ప్రణాళికల నది ప్రారంభించగలదు. కాని లక్షలు మాత్రమే వెచ్చింప వలసిన నూతులు త్రవ్వే పనికది పూనుకోదు. కాబట్టి మొట్టమొదటగా ఆచార్య వకీలు కోరుతూన్నది సంగ్రహ స్వరాజ్య కార్యక్రమం. ఆయన దానిని సంపాదించడానికి ప్రధాన పురుషుడుగా ఉండి, దారిద్ర్య నిర్మూలన శాఖా కమీషనరును నియమించే అధికారం కలిగిఉంటాడు.

అయినప్పటికీ ఇది వీరోచితమైన చికిత్స. ఈ నివేదికలో సంతకాలు చేసిన పండిత మోతీలాలు నెహ్రూ మొదలైన వారు మాత్రమే దీనిని నిర్వర్తించెటందు కర్హులైన మనుష్యులు. దేశం ముందు ఉన్న అత్యవసర సమస్యను

పరిష్కరించేటందుకు పూనుకొన్న ప్రభుత్వము సమ్మోఖము సంపైనను ప్రణాళికను తయారుచేసిపెట్టడమే మన వ్యాస కర్తయొక్క పని.

విద్వాంసుడైన ఈ ఆచార్యుడు ముఖ్యంగా 'యంగిండియా'కు వ్రాసేటప్పుడు, అయినవేళా కానివేళా ఈ పుటలలో ప్రతిపాదింపబడుతూ, సాగినంతవరకు అనల్ప విజయాన్ని సాధించడానికి ప్రయత్నించబడిన ఒకేఒక ప్రముఖ చికిత్సనుగూర్చి పరిశీలన చేసి ఉండవలెనని ఆశించాను. నిజంగా తాను చేసిన సూచనలనే అల్పాదృశ్యవర్తులాంశంలో ఈ చిన్ని రాటాన్ని ఆచార్యుడు మఱుగుపఱిచాడు. రాటమునకు పరిధిలో యేదో ఒక బిందువు కావలెనని నేను కోరడం లేదు. అనేక విషయాలను ఆచార్యుని దృష్టిలో నున్నవాటితోసహా ప్రసారంచేయగలిగిన కేంద్రం కావలెనని నా కోరిక. ఒక గొప్ప గ్రంథాలయంలో కూర్చుని ఓర్పుతో పరిశోధించి భారతదేశంలోని తీవ్రదారిద్ర్యమును గూర్చి నచ్చేటట్లు వ్యాసములు వ్రాసేటందుకు ఆయనకు సాధ్యంకావచ్చును; కాని కొన్ని గ్రామాలకు పోయి విష యాలను గ్రహించవలెననే విశాలబుద్ధితో వివరంగా పరిశీలన చేస్తేనే కాని అసలు రోగం యెక్కడఉన్నదో, రోగికి తాను సూచించిన చికిత్సను భరించగలశక్తి ఉన్నదో లేదో తెలుసుకోవడం దుస్సాధ్యం. గ్రెగ్ వంటి మనిషి గ్రామస్థుల మధ్య నివసిస్తూ, గ్రంథపఠన చేస్తూ తగిన చికిత్సను తెలుసు కుని తన నవీన దృక్పథంతో దాని విలువను రుజువుచేయ డానికి ఒక్కయేడాది పట్టింది. లక్షలాది శ్రమజీవుల్లో భయంకర నిర్బంధనిరుద్యోగ సమస్య ఇదివరకే వ్యాపించి ఉన్నదనీ, వారికి సంవత్సరంలో కనీసం నాలుగు మాసాలు చేసేపని ఉండదనీ ముఖ్యంగా తెలుసుకోవలసిన విషయాలు

ఒకఱి-సారి ఈ విషయం తెలుసుకుంటే తమ తీరిక కాలాన్ని సద్వినియోగం చేసేందుకు యీ లక్షలాది ప్రజలకు పని చూపించే విషంలో ఒకఱి క్షణంకూడా వ్యర్థంచేయకూడదని నిజంగా అర్థం అవుతుంది. మనం తెలుసుకోవలసిన మరొక విషయం యేమిటంటే, ఈ దేశస్థుని సగటాదాయం రోజుకు పడుకానులు ; అనగా ప్రస్తుత మారకపు ధరనుబట్టి రోజుకు రెండు ఇంగ్లీషు పెన్నీలకంటె తక్కువ. దీనిని బట్టి చూస్తే లక్షలాది శ్రమజీవుల సగటాదాయం యింతకంటె చాలా తక్కువయి ఉండాలి. కాబట్టి పెద్ద పెట్టుబడి లేకుండా రోజుకు మరిరెండు కానుల అదనపు అదాయాన్ని చేకూర్చగలిగినయెడల వారిని అష్టైశ్వర్య సంపన్నులనుగా చేసినట్లే. అంతేగాక ఈ లక్షలాది ప్రజల హృదయాలలో అణగిపోతూన్న ఆశాజ్యోతిని పునరుత్తేజకరంగా చేయడం కూడా అవుతుంది. ఈ కార్యక్రమం ప్రభుత్వ సహాయం లేకుండా ఆచరింపబడడంకూడా మరొక సుగుణం. ఐతే దీనికి యింకా యెంతో ప్రోత్సాహం కావలసిఉంది. ఇంకా యిది అనంతంగా విస్తరింపవలసి ఉందికూడా. ఈ ఉద్యమమును గూర్చి స్థానిక పరిశీలనలను చేయవలెనని భారతదేశపు ఆర్థిక శాస్త్రజ్ఞులను నేను కోరుతున్నాను. వారు పరిశీలన చేసేటందుకు దాదాపు రెండువేల గ్రామములనుండి ఎన్నుకో వచ్చును. అప్పుడు వారు యీ ఉద్యమాన్ని నిరసిస్తే నిరసింపవచ్చును. అంతేకాని ఒకవిధమైన దూరాలోచన వల్లనో లేక అనుగ్రహంవల్లనో అయిష్టంగాయిచ్చే అనుచిత స్థానాన్నిమాత్రం దానికీయవద్దు ; దానికర్హమైన కేంద్ర స్థానాన్ని మాత్రమే ఈయండి.

—యంగ్ ఇండియా, 1-11-1928

# 90

# విదేశీ—స్వదేశీ

ప్ర. వస్త్రం వినా తదితర విదేశీ వస్తువులు ఇండియా లోకి దిగుమతి కావడమును గూర్చి మీ అభిప్రాయమేమిటి? తక్షణం నిషేధింపబడవలెనని మీరు కోరే విదేశీవస్తువు లేమైనా కలవా? భావి కాలంలో భారతదేశ విదేశీ వ్యాపార స్వభావమును గూర్చి మీ ఉద్దేశమేమి?

జ. వస్త్రంవినా తదితర విదేశీ వ్యాపారమును గూర్చి దాదాపు నాకేమీ పట్టుదల లేదు. కేవలం విదేశీ గనుక విదేశీ వస్తువులన్నింటినీ బహిష్కరించవలసిందని నేనెన్నడూ వాదించి ఉండలేదు. మన దేశీయ ప్రయోజనములకు అపాయ కరములని రుజువు కాదగిన విదేశీవస్తువుల పూర్తి బహిష్కరణం మాత్రమే నా ఆర్థిక సిద్ధాంతం. అనగా మన దేశమునకు కావలసినది మనం సరఫరా చేసుకోగలిగిన ఏ వస్తువునూ, ఏ పరిస్థితులలోనూ మనం దిగుమతి చేసుకో గూడదని అర్థం. ఇందుకు ఉదాహరణంగా ఆస్ట్రేలియా గోధుమలు ఎక్కువ నాణ్యముగలవి కనుక వాటిని దిగుమతి చేసుకోవలెనని అనడం నేను పాపంగా భావిస్తాను. కాని ఓటు పిండి మనకు అత్యవసరమని ఋజువు చేయబడినట్లయితే ఇండియాలో మనం ఓటు ధాన్యం పండించం కనుక దానిని స్కాట్లండునుండి దిగుమతి చేసుకోడానికి నేనెంతమాత్రమూ సందేహించను. అనగా ద్వేషంవలనగాని, అసూయవలన గాని యే ఒకరి విదేశీవస్తువును బహిష్కరించడము నేను సహించనన్నమాట. ఇక మరొక ప్రతికూల సందర్భం

తీసికొని విచారిద్దాం. భారతదేశం తనకు కావలసిన తోలును ఉత్పత్తి చేకొంటుంది. కాబట్టి విదేశీ తోలుతో చేయబడి యెక్కువ నాణ్యం గలిగి యెక్కువ చవుకగానున్న చెప్పులకంటె మన దేశంలోని తోలుతో అంతకంటె తక్కువ నాణ్యంగానూ, ఎక్కువ ప్రియంగానూ తయారు చేయబడిన చెప్పులనే నేను తొడగడం నాధర్మం. అదేవిధంగా, మన దేశంలో మనకు కావలసిన పంచదారగాని శ్వెట్ గాని తయారయేయెడల విదేశములనుండి వాటిని తెప్పించడం నేను నిరసిస్తాను. కాబట్టి యీ పై విషయాలనుబట్టి ఏయే విదేశీ వస్తువుల దిగుమతిని బహిష్కరించవలెనో వాటి జాబితాను పూర్తిగా ఈయడం నాకు సాధ్యంకాని పని అని స్పష్ట మవుతుంది. అటువంటి సందర్భాలన్నిటిలోనూ మన మేలా నడచుకోవలెనో తెలుసుకోదగిన సాధారణ సిద్ధాంతా లను మాత్రమే నేను ప్రతిపాదించాను. మన దేశంలోని ఉత్పత్తి పరిస్థితులు ఇప్పుడున్నట్లుగానే కొనసాగుతున్నంత వరకూ భవిష్యత్తులో గూడ యీ సూత్రం వర్తిస్తుంది.

—యంగ్ ఇండియా, 15-11-1928

# 91

# అమెరికన్ దేశభక్తి

శ్రీ సి. వి. రంగంచెట్టి యిలా వ్రాస్తున్నారు:

"రివరెండ్——లోని అమెరికన్ కమిషన్ పాఠశాలలకు యాజమాన్యం వహిస్తున్నారు. ఆయన—లోని మిషన్ స్కూలు భారతీయోపాధ్యాయుడై యంత్రనిర్మాణమునుగూర్చి యెఱిగియున్న—గారిని తన మోటారుకు సామానులు తెచ్చేటందుకు—కు పంపారు. శ్రీ—అమెరికాదేశపు వస్తువులకంటె యెక్కువ నాణ్యమూ చౌకా అయిన జర్మన్ వస్తువులను కొన్నాడు. రివరెండు—ఆ సామానును స్పృశించడానికికూడా నిరాకరించి, సాధ్యమైనంతవరకు తన సొమ్ము అమెరికాదేశానికి తప్ప యింకే దేశానికీ పంప దలచుకోలేదని అన్నాడు. అప్పుడు శ్రీ—ఆ వస్తువులను—లోని ఒక బ్రాహ్మణ పెద్దమనిషికి అమ్మివేసి అమెరికన్ సామగ్రిని కొన్నాడు. నేనిదివరకు పదేపదే కోరుతున్నప్పటికీ ఖద్దరు ధరించడానికి చెవినిబెట్టని శ్రీ—యీ సంఘటనకు సిగ్గుపడి యిప్పుడు వచ్చి తన తప్పును ఒప్పుకుని యికముందు ఖద్దరు ధరించేటందుకు ఒప్పుకొన్నాడు. కాబట్టి విద్యావంతులూ, ఐశ్వర్యవంతులూ ఐన మన దేశీయులు ఆ అమెరికా దేశస్థునినుండి గుణపాఠం నేర్చుకొని యితరులకు మార్గదర్శకులు కాగలరని ఆశిస్తున్నాను."

ప్రస్తుత విషయానికి సంబంధం లేకపోవడంచేత మనుష్యుల పేర్లూ, స్థలాల పేర్లూ నేను బుద్ధిపూర్వకంగా విడిచిపెట్టాను. అసలు విషయం స్పష్టంగానే ఉన్నది. ఐతే ఆ రివరెండు తన దేశభక్తియొక్క హద్దులను అతిక్రమించలేదా అనేది మనం పరిశీలించవలసిన విషయం కాదు. ఈ సంఘటనను గూర్చి శ్రీ రంగంచెట్టి మనకు తెలుపగోరిన విషయం మిక్కిలి సక్రమమైనది. మన దేశంలో మన గౌరవాన్ని మనం కాపాడుకోవలెనంటే మనకది యెంత అసౌకర్యంగా ఉన్నప్పటికీ విదేశీ బట్టకు బదులుగా వడుకు నూలుతో తయారుచేయబడిన ఖద్దరును మాత్రమే మనం వాడాలి. మన యింటి ప్రక్కనున్న మన సన్నిహితులు యేమైపోయినప్పటికీ మనం మాత్రం మిక్కిలి చౌక దుకాణ

మనకు పోవలెనని బోధించే సిద్ధాంతం కేవలం నీచం. బంగారంవంటి ధాన్యాన్ని పండించే మన భూములను పాడుబెట్టి నిరుద్యోగ భారతదేశాన్ని నిర్మించేటందుకు తోడ్పడే అమెరికా ఆస్ట్రేలియా దేశాల మంచి గోధుమ విరాళములు మనకు విషతుల్యములు. ఆదేవిధంగా మాంఛెస్టరునుండి వచ్చే వస్త్రదానాన్ని కూడ మనం అంగీకరించడం మనకు చాలా నష్టదాయకం. కాబట్టి భారతదేశంలోని ప్రజల తీరిక కాలాన్ని సద్వినియోగం చేయడానికి ఉపయోగపడ్డంతవరకు ఖద్దరు ఎంత ఖరీదైనప్పటికీ చౌకేనని నేను పునరుద్ఘాటిస్తున్నాను. వారికి ప్రయోజనకరమైన పని చూపించేటందుకు తక్షణం యింతకన్న మరో ఉపాయం లేదు.

—యంగ్ ఇండియా, 17-1-1929

# 92

# విదేశీ వస్త్రము, ఖాదీ

ఖాదీద్వారా విదేశీ వస్త్ర బహిష్కరణమును గూర్చిన కాంగ్రెస్ కార్యక్రమాన్ని ఆచరణలోనికి తెచ్చేటందుకు ఒక ప్రణాళికను తయారుచేయవలసినదిగా నన్ను కోరుతూ కాంగ్రెస్ కార్యవర్గంవారొక తీర్మానంచేశారు నేను కాంగ్రెస్ కార్యదర్శికి పంపిన ప్రణాళిక మరొకచోట ముద్రితమైనది. (అధ్యాయం 93 : పుట——) దానిని పాఠకుడు జాగ్రత్తగా పరిశీలించి యింకనూ అభివృద్ధిచేయడానికి తగిన సూచనల నీయవలసిందని కోరుతున్నాను. కాంగ్రెసువాదులు హృదయపూర్వకంగా తమ ప్రయత్నము నెడల శ్రద్ధవహించినచో విదేశీ వస్త్ర బహిష్కారమును నిర్వహించడం యెక్కువ తేలికని నా అభిప్రాయం. వారాపని చేయగలిగేటందుకు వారికి ఖాదీలో సజీవమైన విశ్వాసం ఉండడంకూడా అత్యవసరం. కాంగ్రెస్‌వాదులే యింకా పరివర్తనం పొందవలసిఉన్న యెడల ఈ ప్రణాళిక ఆచరణలోకి రావడం సాధ్యంకాదు. ఈ కార్యక్రమంలో విశ్వాసం లేనియెడల ఈ తీర్మానము నంగీకరించవద్దని నా చేతనైనంత గట్టిగా కాంగ్రెస్ ప్రతినిధులను మందలించాను. నా మందలింపును కూడా సరకుచేయక వారు భేదాభిప్రాయాన్నిగాని ప్రతిఘటననుగాని ప్రకటించకుండా తీర్మానాన్ని అంగీకరించారు. అందువల్ల వారికి ఖాదీలో నమ్మకం ఉన్నదనే అనుకోవాలి. వారికి నమ్మకం ఉంటే ఆ ప్రణాళిక ననుసరించి పనిచేయడం సాధ్యమవుతుంది. మరి ఏ యితర మార్గములద్వారానూ బహిష్కారోద్యమాన్ని

సాధించడం సాధ్యంకాని పనియని స్పష్టంగా అర్థంచేసుకోవాలి. బహిష్కారోద్యమంలో దేశీయ మిల్లుబట్ట యొక్క స్థానమునుగూర్చి యెవ్వరూ ఆందోళనపడనక్కరలేదు. అది తన్నుతాను రక్షించుకొన్నది ; ఇకముందు కూడా రక్షించుకోగలదు. మనకు అందుబాటులోనున్న ప్రతివారిసీ ఖాదీ ధరించేటట్లు చేయడమే మనపని. మనం రెండు నాలుకలతో మాట్లాడేయెడల బహిష్కారోద్యమాన్ని కొనసాగించడంలో అపజయాన్ని పొందుతాం. అంతేకాక దేశీయ మిల్లు బట్టల ధరలను పెంపుచేయడానికీ, నీతినియమాలు లేని మిల్లు యజమానులకు నల్లనివన్నీ నీళ్ళూ, తెల్లనివన్నీ పాలూ అని నమ్మే ప్రజాసామాన్యాన్ని మోసం చేయవలెనన్న దురాశ కల్పించడానికీమాత్రమే మనం ఉపయోగపడగలం.

ప్రణాళికక్రింద నుదహరింపబడిన నా షరాను యీ ఉద్యమానికి సంబంధించిన వారందరూ చూడవలెనని నేను కోరుతున్నాను. కాంగ్రెస్ సంస్థ సక్రమ పద్ధతిమీద 1921 లోవలె చైతన్యవంతమైన నిర్మాణంగా పరిణమించని యెడల కాంగ్రెస్ కార్యక్రమ నిర్వహణంలో అభివృద్ధి సాధ్యంకాదు.

—యంగ్ ఇండియా, 24-1-1929

## 93

# ఖాదీద్వారా విదేశీ వస్త్ర బహిష్కరణ ప్రణాళిక

1. కాంగ్రెసు కమిటీ ఉన్న ప్రతి గ్రామంలోనూ, పట్టణంలోనూ యింటింటికీ పోయి, గృహస్థులకడనున్న విదేశీ వస్త్రాలను సేకరించి వారికి కావలసిన ఖద్దరు వస్త్రాలను యిచ్చేటందుకుగానీ, లేక ఆ జాబితాలను తీసుకొనేటందుకుగానీ కాంగ్రెసు సంస్థలు స్వచ్ఛంద సేవాదళాలను పిలిపించాలి.

2. అన్ని ఖాదీ వస్త్రాలపైనా అఖిల భారత చరఖా సంఘమువారి ముద్ర ఉండాలి. వాటిపైన స్పష్టంగా ఖరీదులు వేసి ఉండాలి.

3. ఖాదీ ప్రయోజనమును ప్రచారం చేసేటందుకున్నూ, విదేశీ వస్త్రాలను పూర్తిగా బహిష్కరించవలెనని ప్రబోధించేటందుకున్నూ గౌరవ ప్రచారకులను ఆహ్వానించాలి.

ఇది.—స్వచ్ఛంద సేవకులు ప్రచారకులుకూడా మంచి ఖద్దరేదో, కల్తీ ఖద్దరేదో తెలుసుకోగలిగి ఉండాలి.

4. సేకరించబడిన విదేశీ బట్ట సాధ్యమైన చోటులలో నెల్ల బహిరంగంగా తగులబెట్టబడాలి.

5. విదేశీ వస్త్రాల నికముందు కొనకుండా ఆపించేటందుకున్నూ, విదేశీ వస్త్రాలకోసం ఇంతకుపూర్వం పంపిన పట్టీలలో రద్దుచేసుకోతగినవాటిని రద్దుచేయించేటందు

కున్నా విదేశీ వస్త్ర వర్తకుల సహాయాన్ని అభిలషిస్తూ వారిని వ్యక్తిగతంగా దర్శించాలి.

6. కాంగ్రెసు సేవకులు విశ్వాసపాత్రులై ఆరితేరిన వారుగా ఉండి, దౌర్జన్యం చేస్తారనే అపాయంలేని చోటులలో, ఎక్కడపీలైతే అక్కడల్లా విదేశీ బట్టల దుకాణాలను పికెటు చేయాలి.

7. పైన పేర్కొనబడిన నిబంధనల ననుసరించి, అన్ని కేంద్రాలలోనూ నిత్యమూ జరుగుతూన్న పని వివరాలను గురించి ప్రధాన కార్యాలయమునకు నివేదిక పంపబడవలెను. ప్రధాన కార్యాలయమువారు రోజురోజుకూ జరుగుతూన్న అభివృద్ధిని గూర్చి ప్రతివారమూ ఒక సంగ్రహ నివేదికను పత్రికలకు ప్రకటనార్థం పంపవలెను.

8. అన్ని రాజకీయ సంస్థలనుండీ, తదితర సంస్థల నుండీకూడా ఈ ఉద్యమమునకు కావలసిన సహాయ సహకారమును అర్థించవలెను.

9. బహిష్కారోద్యమమును కొనసాగించేటందుకు దేశ భక్తిగల మహిళల సహకారమును పొందవలెను.

10. నిజమైన ఖాదీ లభించే ప్రదేశాల జాబితాను పంపించవలసిందని అఖిల భారత చరఖా సంఘంవారిని కోరి ఖాదీ అమ్మకమునకు సావకాశమున్న చోటులన్నిటిలో ఖాదీ భాండారాలను స్థాపించవలెను.

11. విదేశీ వస్త్ర బహిష్కారోప సంఘమనే పేరుతో ఒక చిన్న ఉపసంఘాన్ని స్థాపించి ముందుగా కొంత సొమ్ము దాని పరంచేసి, ఇంకా ఎక్కువ సొమ్ము వసూలు

చేసుకోవడానికి దాని కధికారమీయవలెను. పరిశీలన చేయ బడిన జమాఖర్చు లెక్కలు ప్రతి మూడు మాసములకు ఒకతూరి ఆ కమిటీవారు ప్రచురించి తీరవలెను.

12. 11 వ పేరాలో సూచించబడిన కమిటీవారు, బహిష్కారోద్యమముయొక్క అవసరమునూ, అవకాశ మునూ నిరూపిస్తూ, వ్యక్తులు దానిని సాధించే విధానమును గూర్చిన పూర్తి వివరములతో ప్రచారకరపత్రములను ప్రకటించి పంచిపెట్టవలెను.

13. ఖాదీ ప్రియంగా వ్యవహారింపబడుతూన్నప్పటికీ లెక్కగొనక తమకు కావలసిన బట్ట యావత్తూ ఖాదీలోనే కొనవలెనని ఆయా ప్రభుత్వాలను కోరుతూ రాష్ట్ర కేంద్ర శాసన సభలలో తీర్మానములు ప్రతిపాదింపబడవలెను. విదేశీ వస్త్రాల దిగుమతులపైన నిషేధపు పన్ను విధించబడ వలెననికూడా తీర్మానములు ప్రతిపాదింపబడవలెను.

వ్యా:—తక్షణం భారతదేశమంతటా కాంగ్రెసు సంఘాలు పునర్ని ర్మింపబడగలవనీ, కాంగ్రెసు సభ్యత్వమునకు తగినంత ప్రోత్సాహం ఉంటుందనీ, ఖాదీద్వారా విదేశీ వస్త్ర బహిష్కారోద్యమమును కొన సాగించడంలో కాంగ్రెసు సంఘాల సంపూర్ణ సహకారం లభిస్తుందనీ ఊహించిన దానిమీద ఈపై ప్రణాళిక ఆధారపడిఉన్నది. ఈ షరతులు నిర్వర్తింపబడినయెడల, ఈ యేడాదిలోనే ఈ బహిష్కారమును సాధించ వచ్చును. కనీసం విదేశీ బట్టల దిగుమతి విషయంలో కళ్లకు కట్టినట్లు కనపడేవరకైనా ఈ ఉద్యమాన్ని సాగించవచ్చును.

—యంగ్ ఇండియా, 24-1-1929

# 94

## విదేశీ వస్త్ర బహిష్కారము.

విదేశీ వస్త్ర బహిష్కారోద్యమ సంఘం పక్షాన నేను కోరిన తక్షణం, ఆ సంఘానికి కార్యదర్శిగా ఉండేటందుకు శ్రీ జయరాందాసు అంగీకరించగలగడమూ అందుకు సముచితంగా తన శాసనసభాసభ్యత్వమునకాయన రాజీనామా ఈయడమూ నాకు చాలా సంతోషంగా ఉన్నది. ప్రతి జాతీయవాదికీ అలాగే ఉంటుందనికూడా నేనాశిస్తున్నాను. తనకు నమ్మకంలేని పనిలో దిగే మనిషి కాదు జయరాం దాసు. కాబట్టి పూర్తిగా ఈ పనికోసం వినియోగించేటందుకీ ఈ ఉద్యమంలోకి ఆయన రావడం చాలా ప్రయోజనకరమని నా అభిప్రాయం. విదేశీ వస్త్ర బహిష్కారోద్యమ సంఘంవారు కోరినప్పుడల్లా ప్రజలీవిధంగానే సహాకరించేయెడల, కొలది మాసములలోనే స్పష్టంగా అభివృద్ధి పొందుతుందీ ఉద్యమం. ప్రజలలో పట్టుదల ఉంటే, జాగ్రత్తగా ఏర్పాట్లుచేయడంలో ఉంది బహిష్కారోద్యమ విజయం.

ఖాదీ ఉత్పత్తీ, అమ్మకంకూడా ఏకకాలంలో జరుగుతూండాలి. విదేశీ వస్త్రములను బహిష్కరించవలెనని ప్రజలు నిజంగా తలచుకొన్న తక్షణం ఖాదీకి ఎక్కువ గిరాకీ వస్తుంది. ఖాదీకి ఎక్కువ గిరాకీ తగులుతుందనే సంగతి తెలుసుకోకుండా ఖాదీ ఉత్పత్తి జరుగుతూన్న యెడల, తీవ్రమైన ఆశాభంగం కలిగే అపాయంకూడా ఉంది. కేవలం ఖాదీ లభించని కారణంగా బహిష్కా

రోద్యమం జయంపొందుతుందనే విశ్వాసం పోతుంది ప్రజలలో. కాబట్టి ప్రజలు తమకు కావలసినదానికంటె ఎక్కువ ఖాదీ కొనకుండా ఉండడం అవసరం. సాధ్య మైనంతవరకు వారు తమ అవసరాలను తగ్గించుకోవడానికి ప్రయత్నించాలి.

దేశీయ మిల్లులను గూర్చి నేను బుద్ధిపూర్వకంగానే ఏమీ చెప్పకుండా ఉంటున్నాను. కొన్ని హద్దులమధ్య పనిచేయవలసిఉన్న మిల్లులపైన మనం ఆధారపడిఉండే యెడల చివరకవి మనను భంగపరుస్తవని నా దృఢ విశ్వాసం. జాతీయ ప్రయోజనాలతో నిమిత్తంలేకుండా లాభాలు సంపాదించుకోవడమే ప్రధాన కర్తవ్యంగా పెట్టు కొన్న మిల్లులు ప్రజలను తమ ప్రయోజనంకోసం వినియో గించుకోవడానికీ విదేశీ వస్త్రాలను స్వదేశీకింద అమ్ముకోవ డానికీకూడా యే మాత్రమూ వెనుదీయవు. ఖాదీ పేరుతో మోసంచేసి మిల్లు బట్టలనవి అమ్ముతూన్న విషయం ఈ పుటలలో యిదివరకే నేను వెల్లడించి ఉన్నాను. ఇండి యాలో ఉన్నంతమాత్రంచో ప్రస్తుత ప్రభుత్వం యే విధంగానైతే స్వదేశీ ప్రభుత్వంకాదో అలాగే మిల్లులన్నీ కూడా ఇండియాలో ఉన్నంతమాత్రంతో స్వదేశీ మిల్లులు కావు. వాటిలో కొన్ని పూర్తిగా విదేశీవి. అవి విదేశీ పెట్టుబడితో కేవలం విదేశీ భాగస్వాములపక్షాన విదేశీయులచే పరిపాలింపబడుతూన్నవి. దేశీయైశ్వర్యాన్ని కొల్లగొట్టడానికి మాత్రమే అవి యిక్కడ ఉన్నవి. అయిష్టం గానైనా చౌకగా లభించిన కూలిజనాన్ని నియమించి, అవి స్వదేశీ సంస్థలని అమాయక ప్రజను నమ్మిస్తూడండమే మిల్లులు చేస్తూన్న పని.

కాని అంతమాత్రంతో బహిష్కారోద్యమంలో మిల్లు లేమీ పని చేయజాలవని అర్థంకాదు. అవి పనిచేయగలవు. కాని ఆపని అనుద్దేశపూర్వకంగానూ కాకతాళన్యాయము గాను ఉంటుంది. భారతదేశంలోని ప్రతి గ్రామానికీ ఒకే సారి కాంగ్రెసు వాదులు వెళ్లజాలరు. మనం పట్టణాలకు వాటి పరిసర గ్రామాలకూ పోగలం. మిల్లులు భారత దేశంలోని ప్రతి గ్రామానికి పోగలవు. దేశంలో సృజింప బడిన వాతావరణం, గ్రామస్థులను మిల్లు యజమానుల యేజంట్ల చేతులలో పడవేస్తుంది. అప్పుడు వారు స్వదేశీ అనే పేరుతో మిల్లులిచ్చినదంతా కొంటారు.

మిల్లు యేజంట్లేమి చేస్తున్నారో కాంగ్రెసు వాదులు పసికడుతూ ఉండాలి. తమకుగల చిక్కులనుబట్టి కొన్ని మిల్లులు ప్రత్యక్షంగా సహాకరించజాలక పోయినప్పటికీ, దేశద్రోహం చేయడానికిష్టపడని దేశాభిమానంగల మిల్లులు కొన్ని ఉన్నవి. నిరుడు మనమిచ్చిన షరతులను కొలది నెలలలో మిల్లులామోదింప నిశ్చయించుకొనే తరుణం వచ్చితీరుతుందని నా దృఢ విశ్వాసం. అయితే ఆ పరిస్థితి, కేవలం ప్రజలు ఏవిధంగానైనా సరే విదేశీ వస్త్రాలను బహిష్కరించి దాని స్థానే నిజమైన ఖాదీని ప్రతిష్ఠించవలెనని పట్టుదల గలిగిఉన్నప్పుడే తటస్థిస్తుంది. ఖాదీకి పరిమితి అంటూలేదు. మనకు మానవులనే కోట్లాది కదుళ్లు ఉన్నవి. మానవులనే లక్షలాది మగ్గా లున్నవి. కాని కావలసింది ఆ పని చేయవలెననే కోరిక.

—యంగ్ ఇండియా, 7-3-1929

# 95

# చర్ఖా ఉపవృత్తి

బొంబాయిరాష్ట్ర సహకార శిక్షణసంస్థకు (Provincial Co-operative Institute) గౌరవ కార్యదర్శి అయిన రావు బహదూర్ యస్.యస్. తల్మకీ, ఉపవృత్తులను గూర్చి చదివిన పత్రం నకలు ఒకటి నా దగ్గర ఉన్నది. గ్రామస్థుల ఉపవృత్తులుగా ప్రవేశపెట్టబడ తగినవిగా అప్పుడప్పుడూ సూచింపబడుతూ వచ్చిన అనేకవృత్తులను గూర్చి ఆ పత్రంలో సమగ్రంగా పరిశీలింపబడి ఉంది. ఆయన కొన్నిటిని ఆచరణ యోగ్యములు కావని నిరాకరించాడు. మఱికొన్నిటిని ఆచరణయోగ్యములుగా అంగీకరించాడు. ఆచరణయోగ్యములై, అభివృద్ధికాదగిన ఉపవృత్తులలో నూలువడుకు పనిని కూడా పేర్కొని, దానికొఱకు కొన్ని షరాలను వినియోగించాడు. సంశయాత్మ లవి జాగరూకతతో పరిశీలించ తగి ఉన్నవి. ఈ దిగువ, వాటిని ఉదాహరిస్తున్నాను :

"కనుక వారి యిళ్లకడకు చౌకగా నూలు సరఫరాచేయబడితేనూ, తయారయిన వస్తువులు సరియైన పద్ధతులమీద అమ్మకం కావడానికి ఏర్పాట్లు జరిగితేనూ తప్ప యే కొద్దిమంది వ్యవసాయదారుల కొఱకయినా నేతపనిని ఉపవృత్తిగా ప్రవేశపెట్టే విషయాన్ని ఆలోచించడానికి కిది తరుణంకాదు.

అయినప్పటికీ, ప్రస్తుతం వృథా అయిపోతూన్న వ్యవసాయకుల శక్తినీ విశేష విరామకాలాన్నీ సద్వినియోగం చేయడానికి తగిన ఒక ఉపవృత్తిని కల్పించేటందుకు, ఇప్పుడున్న ప్రతి పరిశ్రమలలోనూ కల సావకాశాలను మనం అన్వేషించవలసి ఉంది. వస్త్ర పరిశ్రమకు సంబంధించినంతవరకు అటువంటి వృత్తి నూలువడికేపని ఒక్కటే. దేశంలోని ప్రతి వ్యవసాయ కుటుంబానికీ దాని నొక ఉపయోగకరమైన ఉపవృత్తిగా చేయ

వచ్చును. కరువు ప్రాంతాలలో తక్కిన వృత్తులన్నీ భగ్నమై పోయినప్పుడు ఉపయోగకరమైన వృత్తిగా అత్యంతం అర్హతకలిగి ఉంటుంది. ఇంతకంటె ఎక్కువ ఆదాయవచ్చే వృత్తులకోసం మగవారు తాత్కాలికంగా పరాయిచోట్లకు పోగోరినప్పటికీ ఆడవారు పిల్లలూ ఎక్కువ శిల్పనైపుణ్యమూ కష్టమూ లేకుండా రాటం త్రిప్పగలరు. దీనిని ఉపయోగించడంలో కుల దురహంకారాలకు కూడా తావు లేదు. నిజానికి మిల్లునూలు రాకపూర్వం రైతు కుటుంబాలలోని స్త్రీలు దేశానికి కావలసిన నూలు సరఫరా చేశారు. చర్ఖాకోసం ముందుగా పెట్టవలసిన పెట్టుబడి కూడా చాలా తక్కువ. పాకలో ఏదో ఒక చిన్న మూల దానికి సరిపోతుంది.

పూర్వకాలంలో చర్ఖా చేసిన సేవను కాదనడానికి వీలులేదు. కాని ప్రస్తుత పరిస్థితులలో అది వ్యవసాయకులకు ఉపవృత్తిగా ఉండకలదా అనే విషయాన్ని గూర్చి అనేక అభ్యంతరాలు చెప్పబడుతూన్నవి. దానివలన రోజుకు రెండణాల కంటె ఎక్కువ ఆదారాదని మొట్టమొదటి అభ్యంతరం. కాని అసలు లేనిదానికంటె ఏదో కొంత ఆదా రావడం మంచిది కాదా? మామూలు రైతుకు వ్యవసాయంలో కూడా సంవత్సరానికి రూ 50 ల కంటె ఎక్కువ ఆదా రాదు. అనగా అందువలనకూడా రోజుకు రెండణాలను మించి ఎంతో ఎక్కువ ఆదా రావడం లేదు. అయినప్పటికీ ఆ కారణంగా వ్యవసాయాన్ని విడిచిపెట్టవలసిందని సలహా యిచ్చేటందుకెవ్వరూ సాహసించరు. ఉత్పత్తి అయిన వడుకునూలు వెంటనే అమ్ముడుపోదని మరొక అభ్యంతరం చెప్పబడుతూన్నది. కాని ప్రతి గ్రామంలోనూ ఆ గ్రామానికి కావలసిన నూలును మాత్రమే ఉత్పత్తి చేసేయెడల ఈ చిక్కు తొలగిపోగలదు. ఈ రోజులలో వ్యవసాయకుడుకూడా సన్ననూలు బట్టలను కట్టుకోవడానికే అలవాటు పడినందువలన మోటు ఖద్దరు బట్టలు కొననే [illegible]నడని మూడవ అభ్యంతరం. అయితే రైతు తనకు కావలసిన బట్టను తన యింట్లోనే ఉత్పత్తి చేసుకుంటూన్నప్పుడు, అంగడిలో బట్టలను కొనడమనే అవసరం ఉండదు. కాబట్టి ఒక బట్టకు బదులుగా మరొకబట్టను కోరుకొనడమనే ప్రసక్తియే రాదు. వ్యవసాయకుల సందర్భంలో చేతనూలు పరిశ్రమకు గ్రామస్థుల అవసరాలకు తగినంత మాత్రమే ఉత్పత్తి అయ్యేటట్లు పరిమితి యేర్పాటు చేయబడినయెడల, ఉత్పత్తి అయిన సరుకు విడుదలకు అంగడిని వెదకుకొనవలసిన చిక్కు రానేరాదు. ఎంత ముతకగా ఉన్నప్పటికీ తాను కష్టించి ఉత్పత్తి చేసుకొన్న ఖద్దరును తాను ధరించేటందుకు ప్రతి రయితూ గర్వపడతాడు. ఏ మనిషినైనా ఖాదీ ధరించేటట్లు ప్రోత్సహించడం కష్టం కావచ్చును.

కాని ఏ మనిషి ఉత్పత్తిచేసిన వస్తువును ఆ మనిషి ఉపయోగించేటట్లు చేయడానికి అంతగా ప్రోత్సహించవలసిన అవసరంలేదు. అంతేకాదు, అమ్మడం, కొనడం, కోరుకోవడం, అనే ప్రశ్నలు లేనంతవరకూ, కొంత మంది ఖాదీ ప్రోత్సాహకులు వాదిస్తూన్న ప్రభుత్వ ధనసహాయ ప్రసక్తి కూడా ఉండదు. అదీకాక, ప్రభుత్వ ధనసహాయం కోరడం తేలికయి నంతగా రావడంకాదు. గ్రామస్థుల కింకా కొంచెం ఎక్కువ పని కల్పించి సాధ్యమైనంత ఎక్కువ ఆదా చేకూర్చేటందుకు, దూది చేయడం ఏకడం వంటి కార్యకలాపాలు గ్రామాలలో ముఖ్యంగా ఏకుటుంబాని కాకుటుంబం నిర్వర్తించుకోవడం సముచితం. ఆ నూలును నేసేపని కూడా గ్రామాల లోనే జరగాలి. ఆ పని వ్యక్తిగతంగా గాక గ్రామంవారికి రెండు మూడు కుటుంబాలకు అప్పజెప్పబడాలి. అందువల్ల వారికి నిత్యమూ పని కల్పింప బడడమేగాక, ఆ పనిలో వారికి ప్రత్యేక నైపుణ్యం కలగడానికి కూడా వీలేర్పడుతుంది. ఆ పనికితగిన మజూరీ వారికి వస్తురూపంలో, ముఖ్యంగా నూలులోనే ఈయడం ఉచితం. గుడారాలు అనగా జంపఖానాల కుపయో గింపబడే మందపాటి రంగుబట్టలున్నూ, నాసి రకపు జంపఖానాలున్నూ, ముతకవడుకు నూలుతో గ్రామాలలోని నేతపనివాళ్లే తయారు చేయ గలరు. ఇన్ని అవకాశాలను మన ముందు పెట్టుకొని, గ్రామస్థులందరికీ వస్త్రములను సరఫరాచేయగలట్టిన్నీ గ్రామాలలోని మరిరెండు నేత కుటుంబాలకున్నూ జంపకానాలను తయారుచేసే మరొక కుటుంబానికిన్నీ ఆయా గ్రామాలలోనే పూర్తిగా పని కల్పించగలిగినట్టిన్నీ పరిశ్రమను నిర్లక్ష్యంచేయడం కానీ నిరసించడంకానీ చాలా దుస్తరం.

నేతపనితో కూడిన నూలువడికే పనికూడా ఎక్కడైతే జయప్రదంగా ప్రవేశపెట్టబడినదో ఆయా ప్రదేశాలలో విసుగుపుట్టించే యితర పనులను మాన్పించవలసిన అవసరాన్ని గూర్చి ఆలోచించవలసి ఉంది. అందువల్ల నూలువడికే పనికీ అందుకు సంబంధించిన యితర కార్యకలాపాలకూ తగినంత ఎక్కువ వ్యవధీ శక్తీ కలిసి వస్తుంది. ఇందుకు తార్కాణంగా, ఆడవాళ్ల కాలాన్ని ఎక్కువగా అపహరించే పిండి విసిరేపని, గ్రామస్థు లందరికీ సమష్టిగా సంబంధించిన మిల్లులో జత ఎద్దు నిర్వర్తించవచ్చును. పాంచాల రాష్ట్రమునందలి గుర్గాఁవ్ జిల్లా గ్రామాలలో, ఈ పని బ్రెయిన్ గారి కృషి ఫలితంగా జయప్రదంగా నిర్వహింపబడుతూన్నది. నిజానికి గ్రామస్థులకు కావలసిన వస్త్రోత్పత్తి గ్రామంలో జరిగేయెడల గ్రామీణ జీవితంలో చాలా అభివృద్ధి కలుగుతుంది. ప్రస్తుతం ధనాభావంచేత ఆ పని జరగడానికి అవకాశం చాలా తక్కువగా ఉంది. కాలక్రమేణా, చర

ఖాను ఇంకా అభివృద్ధి చేసేటట్లయితే, నూలువడకడానికి కావలసిన కాలాన్ని కూడా తగ్గించుకోవడానికి సావకాశం ఉంది. నూలు వడకు పరిశ్రమ జాతీయం చేయబడిన యెడలను, ప్రస్తుతం ఒక్కదారాన్ని మాత్రమే తీస్తూన్న చర్ఖామీద రెండు మూడు దారాలు ఒక్కసారిగా తీయడానికి వీలు గల్పించబడిన యెడలనూ ఈ పని సాధ్యమయి తీరుతుంది. నేటి చేనేత పారిశ్రామికులకు కావలసిన నూలు సరఫరా చేయబడవలెననే ఆశయం నెరవేరవలెనంటే తొందరగా, ఎక్కువ నాణ్యమైన నూలును ఉత్పత్తి చేసే టందుకుకూడా ఈ చర్య తీసుకోవడ చాలా ముఖ్యం. ఈ కష్టజీవుల విషయంలో మరొక పెద్ద చిక్కు కూడా ఉన్నది. నూలు విషయంలో ఏకాధికారం పొందిన మిల్లులు తమ మిల్లుబట్టలను, చేనేత బట్టలకంటె ఎక్కువ చౌకగా విక్రయించేటందుకు వీలుగా, చేనేతవారికి తమ నూలును ఎక్కువ ప్రియంగా అమ్ముతూంటారు. చర్ఖా ప్రచారం జయప్రదం కావలెనంటే, ఇంతకంటె ఎక్కువ శక్తివంతంగా, పట్టణాలలో కంటె ఎక్కువ బలిష్ఠమైన నిర్మాణం ద్వారా గ్రామాలలో పని జరగాలి. పట్టణప్రజల సహకారం చల్లపడకుండా అప్పుడప్పుడూ వారి ఉత్సాహానికి దోహదం చేస్తూండవలసిన అవసరం ఉంది. కాని గ్రామస్థులవిషయంలో అది వారి స్వరక్షణకు సంబంధించిన విషయం. గ్రామస్థుల అక్షరజ్ఞాన శూన్యత వల్లనూ, అలసత్వంవల్లనూ, గ్రామాలలో పని చేయడం మొదట్లో కష్టంగా ఉన్నప్పటికీ, దాని అవకాశాలు గుర్తింపబడిన యెడల అది ఎక్కువగా అక్కడ నాటుకొని పోయేమాట నిశ్చయం అయితే, ఆ పని పాడుకాకుండా జయంపొంది తీరవలెనంటే, యూనివర్సిటీలలో ఉన్న ఉద్రేకపరులద్వారాగాక, నూలువడికే పనిలో ఆరితేరిన వారిద్వారా ఈ ప్రచారం జరగాలి. ఈ పనిలో నైపుణ్యం సంపాదించడానికి రెండు మాసాలకంటె ఎక్కువకాలం అవసరంలేదు. దీనికి తోడు సుమారు మూడు లేక ఆరునెలలపాటు, పశూత్పత్తి, పశువులను మేపడం, పశుగ్రాసాన్ని పెంపొందించడం పశువులమేత నిలవచేయడం మొదలైన విషయాలలో వారు శిక్షణ పొందేయెడల గ్రామస్థులకు వారు ద్విగుణీకృతంగా సేవచేయ గలిగి ఉంటారు.

చేనేతతోపాటు చేతితో నూలువడికే పనికూడా గ్రామాలలో ప్రవేశ పెట్టబడిన యెడల, అనేక సాంఘిక, ఆర్థిక ప్రయోజనాలు చేకూర గలవు. భారతదేశంలో యేడాదికి మనిషి 1 కి సగటున 15 గజాల బట్ట కావలెనని అంచనా వేయబడినది. గ్రామస్థుల విషయంలో మనిషికి 10 గజాలు కావలెనని తక్కువగా అంచనా వేసేయెడల, 1921 లోని జనాభా

లెక్కల ప్రకారం 28 కోట్ల 80 లక్షల గ్రామస్థులకూ 288 కోట్ల గజాల బట్ట కావలసి వస్తుంది. తమకు కావలసిన బట్టను తామే ఉత్పత్తి చేసుకోవలసిందని క్రమపద్ధతిని విస్తారంగా ప్రచారం చేస్తూ, గ్రామస్థులను ప్రోత్సహించే యెడల, వారు బట్టకోసం చెల్లించే సొమ్ము యావత్తూ గ్రామాలలోనే మిగిలిపోతుంది. ఖాదీబట్ట ఖరీదు కనీసం గజం 1 కి నాలు గణాలు ఉంటుందని లెక్క వేస్తే గ్రామాలకు యేడాదికి 72 కోట్ల రూపాయిల ఆదా అవుతుంది. దీనికి తోడు వారు అంగడిలో బట్ట కొనేటందుకు రొక్కంగా చెల్లించవలసిన పైకం కూడా లెక్క వేసుకొని చూడాలి. ఆ ఖరీదు గజం 1 కి 6 మొదలు 8 అణాలవరకూ ఉంటుంది. ఇక తక్కువగా లెక్క వేసుకొన్నప్పటికీ, ఇంట్లో ఉత్పత్తిఅయిన ఖాదీవలన గజం 1 కి రెండణాలు అదనంగా ఆదా అవుతుంది. ఆ మొత్తం 36 కోట్లు. ఈ విధంగా గ్రామాలలో ప్రతి సంవత్సరం ఎంత తక్కువగా అంచనా వేసుకొన్నప్పటికీ నూరుకోట్ల రూపాయిలు మిగులుతుంది. అందులో కొంతభాగమైనా, విద్య, ఆరోగ్యరక్షణ, వైద్యసహాయం పశుసమృద్ధి, వ్యవసాయాభివృద్ధి మొదలయిన గ్రామాభ్యుదయ కార్యాలాపాలకోసం ప్రత్యేకించడానికి వీలున్నది. అలా జరిగేయెడల గ్రామజీవితం త్వరితగతిని అభ్యున్నతికి రావచ్చును.

ఇంతేకాక, ఈ సంస్కరణ మూలాన, ఎక్కువమంది ప్రజలలో కొనుగోలు శక్తి ఎక్కువ అవుతుందనీ, అందువల్ల దేశంలో స్థాపింపబడనున్న ఖాదీ పరిశ్రమలకు గొప్ప అంగడి కూడా యేర్పడే సావకాశ ముందనీ కూడా గ్రహించవలసి ఉంది. వస్తుఫలను ఉత్పత్తిచేయడం కంటె కూడా అంగడిని సృజించడం ఎక్కువ ముఖ్యము ఎక్కువ కష్టము. తగిన అంగడి లేకపోవడంచేత యంత్రాల ద్వారా ఉత్పత్తిఅయ్యే పరిశ్రమలకు దేశంలో ప్రయోజనకరమైన కృషి జరగడంలేదు. విదేశీఅంగళ్ళు పారిశ్రామికాభివృద్ధిచెందిన విదేశాలపాలబడి పోవడంచేత అక్కడవాటికి అవకాశం ఉంటుందనుకోవడానికి వీలులేదు. వెనుకపడి ఉన్న దేశాలలో కూడా తమ సావకాశాలను గూర్చిన చైతన్యం త్వరితగతిని పెంపొందుతూన్నది. కాబట్టి దేశముయొక్క పారిశ్రామికాభ్యున్నతికి స్వదేశీ అంగడిని సృజించడమే అత్యవసరం. నిరాడంబరమైన రాట్నం ఈ అవకాశానికి ఆశ కల్పిస్తూన్నది. కాబట్టి దానిని అలక్ష్యంగా చూడకూడదు. ”

తాను సూచించిన స్వయంసంపూర్ణ విధానంపైననే, అఖిలభారత చరఖాసంఘం గ్రామాలలో నూలువడకు పనిని

యే ర్పాటుచేయడంలో తనదృష్టిని కేంద్రీకరిస్తూన్న విషయం బహుశా ఈ రావు బహాదూరు గారికి తెలిసే ఉంటుంది. బిజోలియా, బార్డోలీల ఉదాహరణాలను గమనించవలసిందిగా నేనాయనను కోరుతున్నాను. అయితే పట్టణాల విషయంలో కూడా అశ్రద్ధవహించకూడదు. ఈ రోజులలో పట్టణ జీవితప్రభావం పల్లెటూళ్లపైన చాలా ప్రసరిస్తూన్నది. కాబట్టి ఖాదీధారణ శిష్టాచారంగా పట్టణాలలో ప్రారంభింపబడితేనే తప్ప, గ్రామస్థుల స్వప్రయోజనం కోసం వారికి కావలసినంత వరకయినా నూలువడకు కొనేటందుకు ప్రోత్సహించడం చాలాకష్టం. రావుబహదూరు ఊహిస్తూన్నట్లు ఖరీదువిషయం కూడా అంత తేలికగా లేదు. పత్తి వ్యాపారస్థులు, పత్తికొనే విదేశీయులు, పత్తి ఖరీదులను ఉత్పత్తినీ చాలా చీకాకుపటిచారు. అందువల్ల గ్రామస్థులకు పత్తి కొనుక్కోవడానికీ, నేతకూ ఖర్చుపెట్టడంకంటె, బట్ట కొనుక్కోవడమే తఱచు ఎక్కువ చౌకగా కనిపిస్తూన్నది. ఒక్కొకప్పుడు ఒక గజం విదేశీబట్ట ఖరీదు, నేతఖరీదుకు సరిపోతూంటుంది. అంతేకాదు చాలాసార్లు ఆ విదేశీబట్ట అంత పొడుగు గల చేనేత బట్టను తయారుచేయడానికి కావలసిన పత్తికే ఆ విదేశీబట్ట ఖరీదు సరిపోతూంటుంది. ఇది ఆశ్చర్యంగా కనిపిస్తుంది. ఈ చిక్కులను నే నిప్పుడు వివరించదలచుకోలేదు. ప్రత్యక్షంగా నూలువడికే నేను, ఆ పనికి ప్రభుత్వసహాయం లేకపోవడమేగాక పైపెచ్చు పరోక్షంగా నిరంతర ప్రతిఘటన ఉంటూన్నప్పుడు అది ఎంత కష్టమో నిరూపిస్తూన్నాను. కాబట్టి దానికి ప్రారంభదశలో పట్టణాల అభిమానమూ ప్రభుత్వసహాయమూ ఉండడం అవసరం. అంతేకాక ఈ ప్రజాస్వామ్యపు రోజులలో పట్టణాలకూ పల్లెటూళ్లకూ మధ్య భేదభావాన్ని చూపేయెడల, ఖాదీ సిద్ధాం

తాన్ని ఖాదీ తత్వాన్ని గ్రామస్థు లర్థం చేసుకోజాలరు. ఈ పనిని ప్రారంభించగలవారు పట్టణాలనుండియే రావలెను. గనుక, ఈ సంస్కరణము జాతీయం చేయబడవలెనంటే పట్టణస్థులలో ఖాదీ వాతావరణం వ్యాపింపజేయడం అత్యం తావసరం. దానిని రావుబహాదూర్ గారు నచ్చేటట్లుగా ప్రద ర్శించగలిగారు.

—యంగ్ ఇండియా, 7-3-1929

# 96

# ఖాదీ నిర్వహించవలసిన పని

ఒకానొక ఆగ్రా మిత్రు డిలా అడుగుతున్నాడు :

"ఖాదీని చిరస్థాయి చేయవలెనని మీ కోరికయా ? లేక రాజకీయ స్వాతంత్ర్యాన్ని సంపాదించే నిమిత్తం దాని తాత్కాలికోప యోగమును మాత్రమే మీరు సిఫారసు చేస్తున్నారా ? ఈ మొదటి సందర్భంలో ఖాదీ, సౌందర్యాభిరుచికి భంగం కలిగించడం లేదా ? తమ భావానికి సహజంగా తోచే కష్టాన్ని సామాన్య జనం నిగ్రహించుకోగలరని మీరు భావిస్తున్నారా ?

"ఖాదీని నిజంగా శాశ్వతం చేయవలెననియే నేను ప్రయత్నిస్తున్నాను. కర్షక వర్గం నాశనం కాకుండా రక్షింపబడేటందుకది ఒక్కటే ఉపాయం. కర్షక లోకానికదే ఆర్థిక స్వాతంత్ర్యం ప్రసాదించగలదని నేనంటున్నాను. అంతేకాక, కర్షక వర్గం వస్త్రలు పడుకోకుండా రక్షించగలది కూడా అదే. ఈ విలేఖకుడు తన దేశముయొక్క పూర్వ చరిత్రనునుగానీ ఖాదీ యొక్క ప్రస్తుత పరిణామాన్ని గానీ ఎఱుగడనే మాట స్పష్టం. ప్రపంచంలోని తదితర భాగాలకు పత్తి ఉపయోగమును గూర్చియే తెలియని రోజులలో, భారత దేశము సౌందర్యానికి ప్రమాణాన్ని నిర్ణయించి, ఐశ్వర్యవంతములైన పాశ్చాత్య దేశాలకు వివిధ రంగులలో అత్యంత సున్నితములైన వస్త్రాలను సరఫరా చేసింది. ప్రస్తుత ఖాదీ పరిణామం కూడా, రోజు రోజుకూ ఖాదీ క్రమక్రమంగా, సౌందర్య జ్ఞానం కల ప్రజల చేరువకు

నిశ్చయంగా పోతూన్నదనే విషయాన్ని నిరూపిస్తూన్నది. ఇంతా అయితే, నిజమైన కళా కౌశలం, అంతులేని ఉత్పత్తి కోసం విద్యుచ్ఛక్తిచే నడపబడే నిర్జీవ యంత్రం ద్వారా కాక, స్త్రీపురుషుల సున్నిత హస్తముల సజీవ స్పర్శ ద్వారా మాత్రమే ప్రస్ఫుటం కాగలదు. ఖాదీని సౌందర్య వంతంగా చేయడానికి పెద్ద యెత్తున నూతన ప్రయోగాలను సాగిస్తూన్న ఆచార్య కృపలానీ యొక్క శిష్యులకూ, సహచరులకూ ఈ విలేఖకుని పరిచయం చేస్తూన్నాను.”

ఈ విలేఖకుడు ఖాదీ ప్రియమని చెప్పబడుతూన్న విషయాన్ని గూర్చి కూడా పేర్కొన్నాడు. దానిని గూర్చి ఇదివరకే ఈ పత్రికలో వ్రాసి ఉండడంచేత ఇప్పుడేమీ వ్రాయడంలేదు.

—యంగ్ ఇండియా, 14-3-1929

# 97

# దిగుమతులను మించిన ఎగుమతుల భ్రమ

భారత దేశములో పేదరికం పెరిగిపోతూన్నదని నేను చేసిన ప్రకటనను, ఇక్కడ యేటేటా దిగుమతులకంటె ఎక్కువగా ఎగుమతులు జరుగుతూన్నందున వచ్చే లాభముతో సమన్వయం చేయవలసిందని, ఒకనాడొక హంగేరియన్ ఆచార్యుడు నన్నడిగినాడు. ఈ ఆచార్యుడు భారత దేశపు నగరాలను దాటిపోలేదు. ప్రభుత్వంవారు ప్రకటించే లెక్కలమీదనే సహజంగా ఆయన ఆధారపడి ఉంటాడు. ప్రభుత్వపు లెక్కల ద్వారా లభించిన భోగట్టాకు తోడు, తాను చూచిన నగరాలు ఐశ్వర్యవంతములుగా కనబడుతూన్నందువలన కూడా ఆయన అభిప్రాయం మఱింత బలపడి ఉంటుంది.

ఈ ఆచార్యోత్తమునికి న్యాయంగా కలిగిన సంశయమే పురాతన పద్ధతిలో పూర్వ కాలపు అర్థ శాస్త్రాన్ని పఠిస్తూన్న వారిలో చాలా మందికి కలుగుతూండడం అసహజం కాదు. కాబట్టి ఆయనకు నేను చెప్పిన సమాధానాన్ని ఇక్కడ సంగ్రహంగా చెప్పడం అవసరం. నేనిలా వాదించాను ఆయనతో. ఒక దేశంలో కొంతమంది బానిస యజమానులున్నారనుకోండి. వారు తమ బానిసల ద్వారా బలవంతంగా ఆహార ధాన్యాలను ప్రపంచానికి కావలసిన ఇతర విలువగల వస్తువులను ఉత్పత్తి చేయించి, వారికి కడుపు నిండా కూటికి కూడా సరిపోనంత కూలి యిస్తూ, తాము పండించిన ధాన్యాలు వగైరాలను ఎగుమతి చేయడం ద్వారా

ఎక్కువ లాభాలు సంపాదించారనుకోండి; దేశంలోకి దిగుమతి అయిన మొత్తం సరుకులకంటె ఎగుమతి అయిన మొత్తం సరుకులు ఎక్కువగానే ఉంటవనుకోండి. దిగుమతి అయిన సరుకుల విలువకంటె ఎగుమతి అయిన సరుకుల విలువ ఎక్కువగా ఉన్నంతమాత్రంతో ప్రజా సామాన్యం ఐశ్వర్యవంతంగా ఉన్నదనడానికది సూచన కాజాలదు. దేశంలో పేదరికం పెరుగుతూ, వానిసల స్థితి అంతకంతకు హీనమవుతూ కూడా, పై పరిస్థితి తటస్థించవచ్చును. కాబట్టి పైన ఊహింపబడిన వాసిసలు గల దేశమునకు ఇండియాస్థితి ఎక్కువ భిన్నంగా లేదని నేనా ఆచార్యునికి సూచించాను కాబట్టి యేటేటా దిగుమతులకంటె ఎగుమతులు ఎక్కువయినందువలన విదేశ వర్తకం ద్వారా వచ్చే లాభాలను గూర్చిన అంతరార్థాన్ని సరిగా గ్రహించవలెనంటే, భారత దేశంలో కొన్ని గ్రామాలను ఉదాహరణంగా తీసుకొని, వాటి పరిస్థితులను పరిశీలించడమేగాక, గ్రామస్థులను ప్రత్యక్షంగా చూడడం కూడా అవసరమని నేను వాదించాను. భారత దేశం మొత్తం మీద వచ్చే లాభములవలన గ్రామస్థులకేమి ప్రయోజనము? ఆ ఫలితాలు గ్రామస్థులనుభవించకుండా గ్రామాలు నిరంతరం పీల్చి పిప్పి చేయబడుతూన్నట్లవి ప్రత్యక్షంగా కనిపిస్తూన్నవని నా అభిప్రాయం.

భారత దేశపు విదేశీ పాలకులు నామమాత్రంగా ఇండియాలో ప్రత్యక్షంగా నివసిస్తూన్నప్పటికీ, భారత దేశమునకు వెలుపల, వారు అట్టిపైశ్వర్యములతో తులతూగుతూ యేటేటా దేశముయొక్క ఐశ్వర్యాన్ని కొల్లగొడుతూన్న విషయం కీ॥ శే॥ దాదా భాయి నౌరోజీ లెక్కలద్వారా

స్పష్టంగా నిరూపించారు. విదేశీ వ్యాపారం ద్వారా ఇండియాకు లభిస్తూన్నదనే లాభం, ప్రజల సుహృద్భావంపైన గాక, దౌర్జన్య ప్రదర్శనంపైన ఆధారపడిన పరిపాలనను దేశంలో నిలబెట్టేటందు కుద్దేశించెడి నిరంతర పీడన విధానాన్ని ప్రతిబింబింప చేస్తుంది. ఇందుకు కావలసిన అమిత వ్యయంలో చాలా భాగం ఇండియా వెలుపలకే పోతూన్నది.

ప్రభుత్వం ప్రకటించే లెక్కలనుబట్టి పరస్పర విరుద్ధములైన రెండు సిద్ధాంతాలను రుజువుచేయవచ్చునని ఆర్థికవేత్తలు చెప్పిన మాటలలో యథార్థముంది. కాబట్టి కేవలం ముందుగా ఊహింపబడిన విషయాన్ని రుజువుచేయడానికి కాక, నిజం తెలుసుకోవలెననే కోరికతో, ప్రభుత్వంవారి లెక్కలను లోతుగా పరిశీలించి, వాటి ద్వారా నిర్ణయింపబడిన సిద్ధాంతాన్ని స్వతంత్రంగా పరీక్షించడం తెలివిగల ప్రతి మనిషికీ అవసరం. ఒక నదియొక్క సగటు లోతు తెలుసుకోవడం మంచిదే. కాని ఈతచేత కాని వాడు, నదియొక్క సగటు లోతు తన ఎత్తుకంటె తక్కువగా ఉందని తెలుసుకొని నది దాటడానికి ప్రయత్నిస్తే నీళ్లలో మునిగిపోవడానికి సావకాశం ఉంది. అదే విధంగా తన కోసం తయారుచేయబడిన కొన్ని లెక్కల ఎండమావులపైన ఆధారపడిన మనిషికూడా వివేకవంతుడనే ఖ్యాతిని పోగొట్టుకొంటాడు. నదిని దాట యత్నించే మనిషి నదియొక్క గరిష్ఠపులోతూ కనిష్ఠపులోతూ తెలుసుకొని ఉండాలి. అలాగే ప్రభుత్వపు లెక్కలను సరిగా వినియోగించుకొనకోరే మనిషికూడా ఆ అంకెలలోని అంతరార్థాన్ని తెలుసుకొని మరీ వాడుకోవాలి. అయితే మామూలు మనిషికి ఆ చిక్కు అంకెలను పరిశీలించేటందుకు తగిన సామర్థ్యంగానీ అవకాశంగానీ ఉండదు. అటువంటి మనిషి ఇండియా

యొక్క నిజ పరిస్థితిని తెలుసుకొనకోరేయెడల తన గ్రామ జీవితానుభవమును బట్టి మాత్రమే తెలుసుకోగలడు. లెక్కల గారడీవలన ఆ అనుభవం అబద్ధంగా రుజువుకావడానికి వీలు లేదు.

ప్రత్యక్షంగా చూచినవారు, ఇంగ్లీషు పరిపాలకులతో సహా, బ్రిటిష్ పరిపాలనకింద ఇండియా అంతకంతకు ఎక్కువగా పేదరికము పొందుతూన్నదని సాక్ష్యమిచ్చారు. ఇందుకు విరుద్ధంగా నిర్ణయించడంలో వారి స్వప్రయోజనం ఉన్నప్పటికి వారలా చేయవలసివచ్చింది. గ్రామాలకు వెళ్లండి! గ్రామస్థుల ముఖాలలో నిరాశా దరిద్రమూ ప్రతి ఫలిస్తూన్నట్లు మీరు తెలుసుకోగలరు. వారికీ వారి పశువులకూ కూడా తగినంత తిండి లేదు. మనుష్యుల మరణ సంఖ్య చాలా హెచ్చుగా ఉంది. రోగాలు ప్రబలినప్పుడు వారికి నిగ్రహించుకోగలిగిన శక్తి లేదు. క్వైనైనూ, కావలసి నన్ని పరిశుభ్రమైన పాలూ ఉంటే మలేరియాను గురించి భయపడవలసిన అవసరంలేదని అందరికీ తెలిసిన సంగతే. అయినప్పటికీ యేటేటా మలేరియావల్ల వేలకొలదీ మరణిస్తు న్నారు. వారి మొగాన క్వైనైను వేస్తే వేయవచ్చును గాక. వారు తేరుకోవడానికి తగినన్ని పాలు వారికి లభించడం లేదు. వారి అప్పులు పెరిగిపోతూన్నవి. అందుకు కారణం వివాహపు ఖర్చులు మొదలైనవని చెప్పడం అనవసరంగా అపనింద వేయడం. వట్టిపోతూన్నవారి బొక్కసమునకివి క్రొత్త ఖర్చులు కావు. వారికి డబ్బు మూలుగుతూ ఉంటుందనీ, వెండి నాణెములను నగలు చేసుకొంటారనీ చెప్పే మాటలు వట్టి కట్టు కథలు. లక్షలాది ప్రజలకు వెండి నగలు గానీ బంగారు నగలుగానీ ఉండవు. వారు అసహ్యకరమైన కొయ్య గాజులను రాతి గాజులనూ ధరిస్తూ ఉంటారు. అవి

వారికి కదలడానికీ మెదలడానికీ అడ్డంకుగా కూడా ఉంటూ వారి ఆరోగ్యాన్ని కూడా పాడుచేస్తవి. వారి అతిరజ్ఞాన శూన్యత అంతకంత కెక్కువవుతూన్నది. ఇవి యే మాత్రమూ పెరుగుతూన్న ఐశ్వర్యమునకు తార్కాణములు కావు.

ఇక ఎగుమతి దిగుమతుల స్వభావమునుగూర్చి మన దృష్టిని మరల్చెదము గాక. 1927-28 సంవత్సరాలలో ఎగుమతులు 309 కోట్లు. దిగుమతులు 231 కోట్ల పైచిలుకు. ఎగుమతి లన్నీ ముఖ్యంగా, ప్రత్తి, ఆహారధాన్యాలు, నూనె గింజలు, తోళ్లు, చర్మాలు, లోహాలూ, ఖనిజములవంటి ముడి పదార్థాలు. వీటిమీద వినియోగించడానికి తగిన పెట్టుబడీ నైపుణ్యమూ ఉన్నట్లయితే ఇవి ఇండియాలోనే ఉండిఉండేవి. లేక ఇందుకు తగిన పెట్టుబడినీ నైపుణ్యాన్ని మనకు సమకూర్చడం తన కర్తవ్యమని తలంచే ప్రభుత్వం మనకుండి ఉన్నాకూడా ఈ సరుకులు ఇండియాలోనే ఉండిపోయేవి. ఇండియా ఎగుమతులను గూర్చిన కథ మన అసమర్థతకున్నూ, ప్రజల క్షేమాన్నిగూర్చి ప్రభుత్వముయొక్క క్రూరమైన అలక్ష్య మునకున్నూ సంబంధించిన కథ.

ఇక దిగుమతులలో, 65 కోట్ల రూపాయీల విలువగల దూది సరుకులు, నాలుగు కోట్ల రూపాయిల విలువగల కృత్రిమపు పట్టు సరుకులు, 18 కోట్ల రూపాయిల పంచదార, 23 కోట్ల రూపాయిల లోహాలుగానీ వాటితో తయారైన వస్తువులుగానీ, మూడు కోట్ల రూపాయీల సారాలు, రెండు కోట్ల రూపాయీల సిగరెట్లూ కూడా ఉన్నవి. ఈ దిగు మతులు కూడా ఎగుమతులవలెనే మన అసమర్థతను చాటు తూన్నవి. సరియైన అభివృద్ధిపొందే స్థితిలోనున్న దేశము

యొక్క దిగుమతులు, దాని అభ్యున్నతికవసరమైనవిగా నుండవలెను. నేనుదాహరించిన దిగుమతులు మన అభ్యున్నతికవసరమైనవి కావు. సారాలు, సిగరెట్లు మన పతనాన్ని పెంపొందిస్తున్నవి. మన దిగుమతులన్నిటిలోకీ ఎక్కువగా దిగుమతి అయ్యే ఖాదీ సరుకులు, మన లజ్జా దౌర్భాగ్య పరిస్థితులను బహిరంగపరుస్తూన్నవి. ఈ బట్ట యావత్తూ గ్రామాలలోని యిళ్లలో గ్రామస్థుల చేతులతో తయారు చేయబడుతూన్నప్పుడు గ్రామాలేవిధంగా ఉండేవో ఆ దిగుమతులు మనకు జ్ఞాపకం చేస్తూన్నవి గ్రామస్థులకు తీరిక కాలంలో పని చూపించగలిగినది నూలు వడుకు వృత్తికంటె మఱొకటేమున్నది? పనికిమాలిన విదేశీ బట్టలకై హరించుకొనిపోతూన్న లక్షలాది ద్రవ్యాన్ని పూరించగలదేది? ఇటువంటి మనుష్యులు దరిద్రులూ మందమతులూ ఇప్పుడవుతూన్నట్లుగానే అయి తీరాలి.

—యంగ్ ఇండియా, 28-3-1929

## 98

# యువ బర్మాకు సలహా

[అఖిల బర్మా సంఘ సాధారణ సభ పక్షాన రంగూనులో సమర్పింపబడిన సన్మాన పత్రమునకు ప్రత్యుత్తరంగా గాంధీజీ యిచ్చిన ఉపన్యాసం సంపూర్ణంగా ఈ దిగువ ఉదాహరింపబడుతూన్నది.]

నేను మొట్టమొదటిసారి బర్మాకు రాగానే బర్మా దేశీయ మిత్రులైన స్త్రీపురుషులతోనూ, వారి భావములు ఈప్సిత ములతోనూ నాకు సన్నిహిత సంబంధం కలిగినందుకు నేను ప్రత్యేకానందమును అనుభవిస్తూన్నాను. నా ఆత్మౌన్నత్య మునకు మీరిప్పుడు చదివిన పత్రమునకు నేను మీకు కృత జ్ఞుడను. కాని మీరు మీ పత్రములో పేర్కొన్న వివిధ విషయాలనుగూర్చి నా అభిప్రాయమును ప్రకటించవలెనని మీరనుకోరు. నేనిప్పుడు మీకడనుండి విన్న విషయాలపైన నా అభిప్రాయమును చెప్పవలెనని ప్రయత్నించడం కేవలం అహంకారంగా ఉంటుంది. కాని మీ మధ్య నివసిస్తూన్న భారతీయులు మీ రాజకీయాభిలాషలలో కానీ, మీ కష్టముల లోనూ విచారములలోనూ కాని, శ్రద్ధ తీసుకోవడం లేదనే సంగతి నిజమని నేను మీ కడ ఒప్పుకొనితీరాలి. ఆ సంగతి నేను తెలుసుకోవలసివచ్చినందుకు చాలా విచారపడు తున్నాను. మీతో ఉండి మీ మధ్య తిరుగుతూ జీవిస్తూన్న వారు, మీ ఈప్సితాలతో తాదాత్మ్యమునుపొంది మీ సుఖదుఃఖా లలో భాగస్వాములుగా జీవించవలెననే సమాజ సత్యాన్ని వెల్లడించడానికి నేను పరిస్థితులనింకా పరిశీలన చేయ

వలసినంత అవసరంలేదు. మీరు 22 వ తేదీనిగాని 23 వ తేదీనిగాని ఒక మహా సభను సమావేశపఱచి అందులో బ్రిటిష్ వస్తువుల బహిష్కారమునుగూర్చి తీర్మానించబోతున్నట్టు నాకు తెలుపుతున్నారు. మీరటువంటి చర్య తీసుకోవలదని సవినయంగా నేను మిమ్ములను మందలిస్తున్నాను. కార్యదక్షులైన స్త్రీపురుషులుగా మీరు మీ చుట్టూ ఉన్న పరిస్థితులను గమనించినట్లయితే ఆ తీర్మానం, మరే కారణం వలన కాకపోయినా, మీలో యే ఒకరూ కూడా దానిని ఆచరణలో పెట్టలేరనే కారణంవల్లనైనా, అది నిరుపయోగమైనదని మీరర్థం చేసుకోగలరు. ఈ విషయంలో నేను చాలా అనుభవజ్ఞుడనని అనుకొంటున్నాను. కాబట్టి మీ కర్తవ్యమునుగూర్చి నేను మీకిచ్చే సలహా యేమంటే, బ్రిటిష్ వస్తువుల బహిష్కరణమును గాక, యావద్విదేశీ వస్త్ర బహిష్కరణమును ప్రకటించవలెనని—అందులోనే బ్రిటిష్ వస్త్ర బహిష్కరణముకూడా సహజంగా యిమిడి ఉంటుంది.

నాకు కలదని నేననుకొనే ఆచరణ పూర్వకమైన వివేకము పైనను, ఎక్కువ పూజ్య భావంతోనూ, ఎక్కువ ఓర్పుతోనూ ఎక్కువ పరిశ్రమ చేసి పరిశోధించినట్లుగా నేను భావిస్తూన్న అహింసపైనను ఆధారపడి ఈ పరిమితి యేర్పాటు చేయబడినది. అహింసా భావమును జీర్ణించుకొన్న మనిషికి యే ఒకరి వ్యక్తితోనూ యెప్పుడూ వివాదం ఉండదు. ఆయన ప్రాతికూల్యత ఒక విధానమునకు వ్యతిరేకంగా ఉంటుంది. మనిషిలోని ఒక చెడుగుకు వ్యతిరేకంగా ఉంటుంది. అంతేకాని మనిషికి వ్యతిరేకంగా ఉండదు.

కాబట్టి మీ వివాదం బ్రిటిష్ ప్రజలతో కాదు. ప్రపంచంలోని దుర్బల జాతులను పీడించుకొని తినే సామ్రాజ్యతత్వం

తోనే మీ పోరాటం. ఈ పద్ధతులమీద మీరు పనిచేస్తే యెడల—ఈ సూత్రాన్ని పూర్తిగా నేను వివరింప ప్రయత్నించను. దీనిని ప్రాతిపదికగా పర్యవసానాన్ని మాత్రం నేను సూచిస్తాను. పర్యవసానమేమిటంటే ఈ అహింసాపూర్వక హేతువాదం, మీ బహిష్కార కార్యక్రమంపైన తనంతటతానే ఒక పరిమితిని యేర్పాటు చేస్తుంది. దాని పరిమితి విదేశీ వస్త్ర బహిష్కారంవరకే.

ఇక కేవల విదేశీ వస్త్ర బహిష్కారం బర్మా కర్షక వర్గము యొక్క క్షేమాభివృద్ధులనుగూర్చి ఒక్క గజం దూరంకూడా మిమ్ములను తీసుకొనిపోదు. కార్పొరేషను వారిచ్చిన సన్మాన పత్రమునకు ప్రత్యుత్తరంగా ఈ సాయంకాలపు సమావేశంలో, బర్మా మిత్రుల ఔదార్యమునకు వారి నిష్కాపట్యామునకూ వారికి నా అభివందనాలను సమర్పించాను. బర్మా ప్రజల పరిశ్రమనుగూర్చి వారికి నా అభివందనములను సమర్పింపజాలనందుకు విచారపడుతున్నాను. మీరు కొంచెం పొలం దున్ని వడ్లు అధికంగా పండించినంత మాత్రంతో సంతృప్తిపడుతున్నారు. భారత దేశంలోని చాలా ప్రదేశాలలో మేముకూడా అలాగే చేస్తున్నాము. కాని ఆ పని మీకు యేడాది అంతా ఉండదు. సంవత్సరంలో యేదో కొంత కాలం మాత్రమే పనిచేస్తూన్న ప్రపంచంలోని యే కర్షకలోకమూ అప్పులనుండి బయటపడలేదు. ఇక మీరు విదేశీ బట్టలను దిగుమతి చేసుకొనేయెడల, మీ చేతులతో పనిచేసి మీ బట్టలను మీరు తయారుచేసుకొనే మీ కర్తవ్యమును హక్కునూకూడా మీ అంతట మీరు తృణీకరిస్తున్నారు. ఇది కేవలం మీ రెండు చేతులను మీరు నరుకుకోవడం వంటిది.

రాటమును గూర్చి, ఖాదీని గూర్చి మీరు చులకనగా మాట్లాడినట్లు నే ననుమానపడుతున్నాను. విదేశీ వస్త్ర బహిష్కారమునకూ, కేవలం బ్రిటిష్ వస్త్ర బహిష్కారమునకూ గల ప్రధానభేదాన్ని మీరు గ్రహించజాలనియెడల, రాటాన్ని మీరు ప్రవేశపెట్టడంగానీ, లేదా ఒక విధంగా దానిని పునః ప్రవేశపెట్టడంగానీ జరుగదు. ఇది మీరు నమ్మండి.

కాబట్టి మీ జీవితంలోకానీ, వస్తువులు పడుకొనే లక్షలాది భారత ప్రజల జీవితంలోకాని రాటంవలన కలిగే ఉత్కృష్ట పరివర్తనాలను గూర్చి ఇంకా యెక్కువ లోతుగా పరిశీలించవలెనని మీలో బుద్ధిమంతులయినవారిని నేను కోరుతున్నాను.

—యంగ్ ఇండియా, 4-4-1929

# 99

# విదేశీ వస్త్ర బహిష్కారం

కాంగ్రెసు కార్యవర్గముచే నియమింపబడిన విదేశీవస్త్ర బహిష్కార సంఘ కార్యదర్శి శ్రీ జయరామదాసు అహోరాత్రాలు విరామం లేకుండా పని చేస్తున్నాడు. కమిటీ ముఖ్యస్థానం బొంబాయిలోని కాంగ్రెసు భవనం. అక్కడ నుండి కార్యదర్శి ప్రకటనలు కరపత్రాలు ప్రచురిస్తూ, మునిసిపల్ సంఘాలకూ తదితర సంస్థలకూ ఉత్తరాలు వ్రాస్తున్నాడు. భారతదేశం అంతటిలోనూ, ఉత్పత్తి అమ్మకమూ చేసే ఖాదీ డిపోల జాబితా ఒకానొక ముఖ్య కరపత్రంలో ఉదాహరింపబడినది. అటువంటి కేంద్రాలు మొత్తం 328 ఉన్నవని తెలుసుకోవడం పాఠకునకు ఉత్సాహ జనకంగా ఉంటుంది. వాటిలో వంగరాష్ట్రంలో 66, తమిళనాడులో 64 ఉన్నవి. తరువాత ఆంధ్రాలో 39, బీహారులో 33 ఉన్నవి. ఈ జాబితాను ప్రత్యేకంగా చూచినప్పుడు ప్రోత్సాహకరంగానే ఉంటుంది. కాని దేశంలోని విదేశీ బట్టల దుకాణాలతో దానిని పోల్చి చూచినప్పుడు మాత్రం సముద్రంలో నీటి చుక్కగామాత్రమే తోస్తుంది. ఒక్క బొంబాయిలోనే 328 కంటె ఎక్కువ విదేశీ బట్టల దుకాణాలున్నవని చెప్పడానికేమీ సందేహంలేదు. ప్రతి సంవత్సరమూ ఇండియానుండి కోట్లకొలది రూపాయలను దోచివేస్తూన్న ఈ వ్యాపారాన్ని ప్రజలు వశపఱచుకోవలసి ఉంది. ఖాదీ మీద వెచ్చింపబడిన ప్రతి రూపాయీ ప్రాణం పోస్తుంది. విదేశీ బట్టపైన వెచ్చింపబడిన ప్రతి రూపాయి ప్రాణం తీస్తుంది.

కార్యాలయంనుండి ప్రకటింపబడిన కరపత్రాలు బహిష్కారోద్యమాభివృద్ధిని గూర్చిన భోగట్టా యిస్తూన్నవి. మొదటి కరపత్రం బహిష్కారోద్యమముయొక్క అవసరాన్ని గూర్చి వివరిస్తూన్నది. ఆ కరపత్రమునుండి ఉత్సాహజనకములైన కొన్ని పేరాలనీ క్రింద ఉదాహరిస్తున్నాను:—

మనం మనిషి 1 కి 13 గజాలా చొప్పున ఉపయోగిస్తూన్నాము.

“1899 మొదలు 1928 వ సం॥ వరకూగల కడచిన 29 సంవత్సరాలలో ఇండియాలో ఉత్పత్తి అయినట్టిన్నీ, విదేశాలనుండి దిగుమతి అయినట్టిన్నీ బట్టల అంకెలమీద ఆధారపడి ఈ దేశంలో సంవత్సరానికి మనిషి 1 కి 12.86 గజాల బట్ట కావలసి ఉంటుందని అంచనా వేయబడినది. కడచిన పది సంవత్సరాల అంకెలను మాత్రమే మనము తీసుకొన్నయెడల సగటు ఖర్చు 13.08 గజాలు అనగా సుమారు 13 గజాలు మాత్రమే అవుతుంది. 1919–20 సంవత్సరాలలో మనిషి 1 కి 8.8 గజాలు మాత్రమే [illegible] భారతీయులు 9 గజాలకంటె తక్కువ బట్టతోనే సరిపెట్టుకొన్నారు”

బహిష్కార సమస్య :

“మనిషి 1 కి సాధారణంగా 13 గజాల బట్ట కావలసివస్తుందని అనుకొనేయెడల, విదేశీ వస్త్రముల సంపూర్ణ బహిష్కార సమస్యలో యేమి యిమిడిఉన్నదో పరిశీలించవలసిఉన్నది. ఈ 13 గజాలలో యెంత బట్ట ఇండియా బయటనుండి వస్తూన్నది ? కడచిన పది ఏండ్లలో ఇండియా తనకు కావలసిన బట్టలో సగటున నూటికి 33⅓ వంతులు విదేశాలనుండి దిగుమతి చేసుకొంటూన్నది. అనగా మనిషి 1 కి 4⅓ గజాల బట్టను దిగుమతి చేసుకొంటూన్నది తక్కిన 8⅔ గజాల బట్ట ఇండియాలో మిల్లులద్వారా గానీ చేమగ్గాల ద్వారా గానీ ఉత్పత్తి చేయబడుతూన్నది.

“కాబట్టి విదేశీ బట్టలను పూర్తిగా బహిష్కరించడమనే సమస్య యేడాదికి మనిషి 1 కి 4⅓ గజాల బట్టను మాత్రం ఎక్కువగా ఇండియాలో ఉత్పత్తిచేయడమనే సమస్యగా పరిణమిస్తూన్నది”

దానిని ఏలా పరివర్తించడం :

"పై అంచనా ప్రకారం భారతీయులకు కావలసిన అదనపు బట్ట $4\frac{1}{3} \times 31.89$ కోట్లు. అనగా సుమారు 138 కోట్ల గజాలు. మామూలుగా నూలు వడికే మనిషి 10 వ నెంబరుది 8 గంటలలో (గంటకు సగటున 350 గజాల చొప్పున) ఒక గజం బట్టకు కావలసిన నూలు వడకగలడని అనుభవజ్ఞులచే అంచనా వేయబడినది. కాబట్టి ఆయన రోజుకు 8 గంటలు చొప్పున 300 రోజులు పనిచేసేయెడల 300 గజాల బట్ట ఉత్పత్తి చేయగలడు. ఆ ప్రకారం 138 కోట్ల గజాల బట్టను ఉత్పత్తి చేయడానికి మనకు 46 లక్షలమంది నూలు వడికే వారు మాత్రమే కావలసిఉంటారు. ఈనాడు ఇండియాలోనున్న 50 లక్షల చర్ఖాలలోనూ 40 లక్షల చర్ఖాలు మూలపడిఉన్నవి. వడికే వారిని సంపాదించి వాటినన్నిటినీ తిరిగేటట్టుగా చేయాలి. దాదాపు 32 కోట్ల జనసంఖ్యగల జాతికిది అసంభవమైన విషయమా ?

"అనగా భారతదేశంలో ప్రతి 200 మంది మనుష్యులకూ ముగ్గురు మాత్రం ఈ వడుకు పనిచేసేయెడల ఆ పని పూర్తిఅవుతుంది. ఈ ప్రయత్నం చేసేటందుకు తగిన శ్రద్ధే మనలో లోపిస్తూన్నది.

సంవత్సరంలో మూడు నెలలు గ్రామాలలో పనిలేకుండా ఉండే పాటకపుజనం ఇండియా మొత్తంపైన 11 కోట్లు ఉంటారని అంచనా వేయబడినది. ఆ విధంగా పని లేని గ్రామ పాటక జనంలో 184 లక్షలమంది (అనగా పనిలేని పాటకజనంలో ప్రతి ఆరు మందికీ ఒక్కడు వంతున) నూలు వడికే పనిలో నిమగ్నులైనయెడల వారు నిర్బంధంగా పని లేకుండా గడపవలసిన కాలంలో, విదేశీవస్త్ర సంపూర్ణ బహిష్కారానికి కావలసిన యావత్తు నూలు మనకు లభిస్తుంది. కనీసం లెక్క కట్టుకొన్నా వడికే మనిషికి రోజుకు ఒక అణా ఆదా వస్తుంది సగటున ఒక అణా ఏడు పైసలకంటె తక్కువ ఆదాయంవచ్చే లక్షలాది జనానికిది మహాప్రసాదంగా ఉంటుంది."

ఆ కరపత్రం ఈ విధంగా ముగింపబడినది. మీకర్తవ్యాన్ని మీరు నిర్వర్తించండి :

"ఈ విధంగా ఈ సమస్య ఏమీ చిక్కులేని స్పష్టమైన భాషలో నిర్వచింపబడినది. ఈ ఉద్యమానికి మీరు ఈ

కింద వివరింపబడిన సర్వవిధాలా కానీ, ఏదో ఒక విధం కాని తోడ్పడవచ్చును :—

(1) విదేశీ బట్టలస్థానే సరియైన ఖద్దరును ఉపయో గించుట.

(2) ఈ ఉద్యమానికి ధనసహాయం చేయుట.

(3) ప్రతి రోజూ కనీసం ఒక అర గంట సక్రమంగా త్యాగబుద్ధితో నూలువడుకుట.

తత్క్షణం, ఈ రోజునే యిప్పుడే పనిలోకి దిగండి."

—యంగ్ ఇండియా, 18-4-192

# 100

"ఈ సోమరితనం విడిచిపెట్టండి"*

## విదేశీ వస్త్ర దహనము—అహింస

మీరు నాకు సమర్పించిన అనేక సన్మాన పత్రములకు కానుకలకు నా కృతజ్ఞత తెలియచేస్తున్నాను. ఈ సన్మాన పత్రము లన్నింటికీ వివరంగా జవాబు చెప్పేటందుకు నాకు వ్యవధి చాలా తక్కువగా ఉంది. అయినప్పటికీ నేను రెండు సన్మాన పత్రాలను జవాబుకోసం ప్రత్యేకించదలచు కొన్నాను. ఆ రెంటిలో ఒకటి బందరు జిల్లా బోర్డునుండీ మఱొకటి బందరు మునిసిపాలిటీనుండీ ఈయబడినవి. అవి విమర్శాపూర్వకంగా ఉన్నవి. అందువలన వాటికి విలువ యిస్తున్నాను. విమర్శవలననే ప్రయోజనం పొందగలను. పొగడ్తవలన కాదు. ఈ సన్మాన పత్రములలో విదేశీవస్త్ర దహనమునకు ప్రతికూలంగా అభ్యంతరం చెప్పబడినది. ఈ వాదం మౌలికమూ కాదు. కొత్తదీ కాదు. ఈ సన్మాన పత్రములలో పేర్కొనబడిన అభ్యంతరాలనే నా పరమోత్తములైన స్నేహితులలో కొంతమందికూడా పేర్కొన్నారు. ఈ అభ్యంతరాలనుగూర్చి నా చేతనయినంత జాగ్రత్తగా ఆలోచించిన పిమ్మట, ఈ సందర్భంలో చిరకాలానుగతములైన నా అభిప్రాయాలను మార్చుకో లేకుండా ఉన్నాను. తమ విదేశీవస్త్రాలను వదలివేసి వాటిని మంటలలో తగుల వేయడం మన ప్రజల పవిత్ర ధర్మమని నా అభిప్రాయం. విదేశీ వస్త్రదహనం అహింసా సిద్ధాంతాని కనుగుణంగా

---

* 1929 వ సం॥ ఏప్రిల్ 13 వ తేదీని బందరులో ఈయబడిన ఉపన్యాసము యొక్క నివేదికనుండి.

ఉండడమేగాక ఆ సిద్ధాంతాన్ని సరిగా గ్రహించినట్లయితే ఇండియాలో విదేశీ వస్త్రదహనం జరిగించితీరవలెననికూడా నేను చెప్ప సాహసిస్తున్నాను. ఈ వస్త్రదహనమునుగూర్చి మీ రొకటి ముఖ్యమైన విషయం జ్ఞాపకం ఉంచుకోవాలి. తనకడనున్న విదేశీ బట్టలను తగులబెట్టేందుకు ఈయ వలసిందిగా ఆ యజమానియే కోరబడుతూన్నాడు. ప్లేగు పురుగులతో సంక్రమితమైన బట్టయేదైనా నాదగ్గర ఉంటే దానిని తగులబెట్టడం నా కర్తవ్యమని మీరందరూ అంగీకరిస్తారు. నేను దక్షిణ ఆఫ్రికాలో నున్నప్పుడు 14,000 పౌనులు ఖరీదుగల ఒక మార్కెట్టు, ప్లేగు పురుగులతో సంక్రామితమైనటుగా అనుమానింపబడడంచేత, జోహాన్సు బర్గు మున్సిపాలిటీవారు అందులో ఉన్న సరుకులన్నిటితో సహా మంటపాలు చేసిన సంగతి నాకు బాగా జ్ఞాపకం ఉన్నది. జోహాన్సుబర్గు మున్సిపాలిటీవారి ఈ చర్యను నేను అర్థంచేసుకొని శ్లాఘించాను. బహుశా ఆ చర్యయే ప్రమాదకరంగా పరిణమించతగిన ప్లేగు వ్యాధినుండి జోహాన్సుబర్గును రక్షించిందని నేనిప్పటికీ అభిప్రాయపడుతున్నాను. వైష్ణవుడనుగా, నా జీవితానుభవములనుండీ నా మిత్రుల జీవితానుభవములనుండీ మతాచార ప్రకారం మైలపడిపోయినవన్న కారణాన పంచభక్ష్యాన్నములను పాడు గోతిలో పారవేసిన ఉదాహరణాలను పేర్కొనగలను. విదేశీ వస్త్రములనుగూర్చి నా వినయపూర్వకమైన అభిప్రాయమేమంటే, అవి మైలపడిపోవడంకంటెకూడా ఎక్కువ చెడిపోయినవనీ, భారతదేశముయొక్క క్షేమానికి—నైతిక ఆర్థిక రాజకీయ క్షేమానికి భంగకరములైన బీజములు వాటిలో ఉన్నవని. మచిలీపట్టణ వాస్తవ్యులైన మీకు నేను ఈ రేవు పట్టణమునుగూర్చి విదేశీ బట్టలవల్ల ఇండియాలోని ఈ రేవు

పట్టణము తన వాణిజ్యాభ్యున్నతినీ, ఒకప్పుడ ప్రతిమానంగా ఉండిన తన కళా కౌశలమును కూడా పోగొట్టుకొన్న విధానమును గూర్చి జ్ఞాపకం చేయనక్కర లేదు పాఠాన్ని త్యజించి మనం భారతీయ ప్రజలకు ప్రతికూలంగా మహాపరాధం కావించి నామనీ, భారతదేశముయొక్క ఆర్థిక స్వాతంత్ర్యాన్ని విదేశీ గుడ్డ పీలికకు అమ్మివేశామనీ నా అభిప్రాయం. ఈనాడు అలసత్వంతో తిరిగీ ఆ అపరాధాన్నే చేస్తున్నాము. కాబట్టి భారతదేశమును ఆ అలసత్వమునుండి చైతన్యవంతంగా చేయడం అనతిక్రమణీయమైన కర్తవ్యంగా నేను భావిస్తున్నాను. విదేశీ వస్త్రాలను కొనే నిమిత్తం బయటకు పోయే 60 కోట్ల రూపాయలను భారతదేశంలో వస్తువులు పడుకొంటూన్న ప్రజలకు పంచిపెట్టేయెడల వారిలో యెవ్వరూ వస్తువులుండవలసిన అవసరం ఉండదనే అల్ప విషయాన్ని గ్రహించడానికి, అర్థశాస్త్రం తెలుసుకొని ఉండవలసిన అవసరం లేదు. అంతేకాక, భారతదేశానికి కావలసిన బట్ట యావత్తూ మీరు ఉత్పత్తిచేయగలిగి ఉండినయెడల దేశము బయటకుపోతున్న 60 కోట్ల రూపాయలను ఆపడానికవకాశం ఉందనే విషయాన్ని గ్రహించడానికికూడా గణితశాస్త్రంలో మీకు అత్యధికమైన ప్రజ్ఞ ఉండవలసిన అవసరంలేదు. మన మీ పనిని నూరు సంవత్సరాలకిందటనే నిర్వహిస్తూవచ్చాము. భారతదేశంలోని కుటీరములలో, సోమరితనంతో తుప్పుపట్టి పోతూన్న శరీరసౌష్ఠవంగల లక్షలాది స్త్రీ పురుషుల భుజములలోనూ చేతులలోనూ మనకు కావలసిన శక్తి తయారుగా ఉంది. ఇండియాలోని ఏడు లక్షల గ్రామాలలోనున్న ఈ లక్షలాది పనిలేని వారందరూ లక్షలాది కదుళ్లను ఎందుకు తిప్పకూడదో కారణం కనిపించదు. ఇంగ్లాండులో పత్తి పండదు. కాని ఇండియాలో లాంక్‌షైరు వరకూ తీసుకొని

పోయి, బట్ట రూపంలో దానిని తిరిగీ ఇండియాకు పంపగలుగు తూన్నది ఇంగ్లాండు. అటువంటప్పుడు మన దేశంలోనే పండుతూన్న ప్త్తిని, ఒకచోటనుండి మఱొక అవసరమైన చోటికి తీసికొనిపోయి, బట్టగా నేయడం మనకెంత తేలికయి ఉండాలి? ఎంతో ఆలసత్వమూ, ఉదాసీనత, ప్రత్యక్ష ప్రాతి కూల్యత ఉన్నప్పటికీ ఇండియాలోని రెండువేల గ్రామాలలో ఈ పని జరుగుతూన్నది. నిరుపేదలైన మన సోదరీమణులు తమ సున్నిత హస్తములతో వడికిన నూలుకు బదులుగా డబ్బు గానీ, ప త్తిగానీ తెచ్చుకోడానికి, దినదినమూగానీ లేక వారం వారంగానీ అనేక మైళ్లు నడవడానికికూడా లెక్కపెట్టడం లేదు. కాబట్టి ఈ పేద సోదరీమణులనుగూర్చినీ, ఇంగ్లీషు పరిపాలకుల అంచనా ప్రకారం, యేడాది పొడుగునా తినే టందుకు కడుపునిండా కూడులేని ఇండియాలోని పదవ వంతు జనాభా లక్షలాది ప్రజలనుగూర్చినీ కించిత్తు దయ ఉంటే మీరు కనీస ప్రాయశ్చిత్తంగా ప్రతి అంగుళం విదేశీ బట్టను త్యజించి అగ్నిహోత్రునకు అర్పించాలి. ఇదే భారతదేశం తన పుత్రులనుండి కనీసం వాంఛిస్తూన్న పాప ప్రక్షాళన క్రియ.

## నిర్దుష్టమైన సలహా

ఈ సన్మాన పత్రములలో ఒక దానిలో ఖాదీ మధ్య వేరగాళ్లద్వారా విక్రయింపబడకూడదనీ ప్రతి మనిషీ ఎవరికి వారు తయారుచేసుకోవలెనని సలహా ఈయబడింది. ఈ నిర్దుష్టమైన సలహా నాకిష్టమే. అయితే యిది, ఖాదీ ఉత్పత్తికి సంబంధించిన విషయాలు తెలియమిని ప్రస్ఫుటం చేస్తూన్నది. ఈ సన్మాన పత్రాల రచయితలు అనుజ్ఞ యిస్తే, ఖాదీ ఉత్పత్తియొక్క నైపుణ్యమునుగూర్చి వారికి

తెలియదనికూడా యిది రుజువుచేస్తున్నదని నేను చెప్ప వలసి ఉంది. తనకు కావలసిన బియ్యాన్ని తాను పండించుకోవడం ప్రతి మనిషికీ యెలా సహజంగా అసంభవమో అలాగే ఎవరికి కావలసిన ఖాదీని వారుత్పత్తిచేసుకోవడం కూడా ప్రతిమనిషికీ సహజంగా అసంభవం. భారత దేశంలోని నగరవాసులు తమకు కావలసిన ఖాదీని తాముత్పత్తిచేసుకోవలెనని వాంఛిస్తున్నప్పటికీ వారికా పని సాధ్యంకాదు. మనకు స్వాతంత్ర్యం లభించినంతవరకు భారత దేశ చరిత్రలో ఎప్పుడూ ఎవరికి కావలసిన ఖాదీ వారుత్పత్తి చేసుకోవడం సాధ్యమైనట్లు కనిపించదు. 'నీవు నీ సొంత ఖాదీ అయినా ధరించు లేదా విదేశీ భట్టనైనా ధరించు' అనే వాక్యానికి వెనుకనున్న తత్వాన్ని నా జీవితంలో నేనర్థంచేసుకోలేదు. రోజుకు 8 గంటల వంతున రాట్నం దగ్గర పనిచేయగలవారు ఇండియాలో లక్షలాది జనం ఉన్నారు. దానిమూలంగా తయారైన ఖద్దరు యావత్తూ వారే ఉపయోగించుకోగలగడం అసంభవం. ఈ సోదరీ సోదరులు ఉత్పత్తిచేసిన మిగులు ఖాదీని తీసుకోవడం భారత పౌరుల ప్రధాన కర్తవ్యం. మనిషియొక్క సహకార స్వభావమే అతనిని జంతు సంతానమునుండి ప్రత్యేకిస్తున్న దన్న విషయంకూడా మఱువకూడదు. స్వతంత్రంగా ఉండడం ఆయనకుగల విశేషాధికారం కావచ్చును. పరస్పర సహకారంతో వ్యవహరించడం కూడా ఆయన ధర్మం. దురహంకారంకల మనిషి మాత్రమే అందఱిలోకీ తాను స్వతంత్రుడ ననుకొని 'ఎవరి ప్రసక్తీ లేకుండా' ఉంటాడు. భారతదేశంలోని అనేక స్థలాలలో ఖాదీ ఉత్పత్తి విధానానికి సంబంధించిన స్వయం సంపూర్ణోద్యమం నడుస్తూ నేఉన్నదనీ, మున్సిపాలిటీలు, తాలూకా బోర్డులు,

జిల్లా బోర్డులు మాత్రం తమ ప్రాథమిక ధర్మాన్ని నిర్వర్తించే యెడల, గ్రామాల పునర్నిర్మాణం సాధ్యంఅవుతుందనీ, అందు వలన వ్యక్తిపరంగా గ్రామస్థులు కాక, గ్రామాలు సమష్టిగా, బట్టకు సంబంధించినంతవరకు స్వయం సంపూర్ణములు కాగల వనీ ఈ సన్మానపత్రాల రచయితలకు నేను సవినయంగా మనవిచేస్తున్నాను. అంతేకాక అ. భా. చ. సం. వారప్పు డప్పుడూ ప్రచురిస్తూ వచ్చిన సాహిత్యాన్ని ఈ సన్మాన పత్రాల రచయితలు శ్రమతీసుకొని చదివేయెడల, ఈ సందర్భంలో ఏమిజరుగుతూన్నదీ వారికి తెలుస్తుంది. ఈ కారణంకోసే నేననేకసార్లు, ఖాదీ చలామణిలో ఉన్న నాణెంగా పరిణమిస్తే, అది విదేశీ బట్టల పోటీవలన నేగాక భారతీయ మిల్లు బట్టల పోటీవలనకూడా భయపడవలసిన అవసర మేమీ లేదని చెప్పి ఉన్నాను. కొంచెంగా ఆలోచిస్తే ఇది స్వయం ప్రదర్శితం కాదగిన సూత్రమని అర్థమవుతుంది.

—యంగ్ ఇండియా, 25-4-1929

# 101
# విదేశీ వస్త్ర బహిష్కారాభివృద్ధి

విదేశీ వస్త్ర బహిష్కార సంఘం తాను నిర్వర్తించిన పనినిగూర్చి ఒక నివేదికను కడచిన వారంలో అ.భా.కాం. సంఘునకు సమర్పించింది. ఆ నివేదిక 30 వ ఏప్రిల్‌తో అంతమయ్యే రెండు నెలలకు సంబంధించి ఉంది. దాని అభివృద్ధి సంతృప్తికరంగా ఉన్నదని అనుకోవచ్చును. దానితో సహకరించు పూర్తిగా పనిచేసే కాంగ్రెసు నిర్మాణం కూడా ఉండి ఉన్నట్లయితే, అది ఇంకా ఎక్కువ సంతృప్తి కరంగా ఉండేది. శ్రీ జయరామదాసు ప్రార్థనకు ప్రత్యుత్తరంగా, మున్సిపాలిటీలు తక్కిన స్థానిక సంస్థలు మందంగా కదలదొడగినవి. ఇంతవరకు 30 మున్సిపాలిటీలకంటె ఎక్కువ ప్రత్యుత్తరములు పంపలేదు. కాంగ్రెసు స్వాధీన పఱచుకొన్న ప్రతి స్థానిక సంస్థకూడా బహిష్కార తీర్మానాన్ని అమలుపఱచి తీరాలి. సువ్యవస్థాపితములైన ప్రజా సంస్థలనుండి వచ్చిన సహకారం కొంచెమే అయినప్పటికీ, బహిష్కారోద్యమముయొక్క ఫలితము ఇప్పటికప్పుడే తెలిసి వచ్చేటట్లు చేయబడినది. నివేదికలో ఉదాహరింపబడిన అనేక అంశములనుండి, డిల్లీ బట్టల వర్తకుల సంఘాని కధ్యక్షుడయిన మిస్టర్ జె.సి. రాబర్ట్సు ఉపన్యాసములోని ఈ దిగువ భాగాన్ని సంగ్రహిస్తున్నాను :—

"వాణిజ్య సంఘానికి మిక్కిలి ఆందోళన కలిగిస్తూన్న మరొక చిక్కైన విషయం, దేశంలో అస్థిరంగా ఉన్న రాజకీయ పరిస్థితియూన్నూ దాని కారణంగా ఉద్భవించిన విదేశీ వస్త్ర బహిష్కారోద్యమమును గూర్చిన భయమున్నూ, ఇండియాలోని ప్రస్తుత ఆర్థిక మాంద్యము

యొక్క ఫలితములనుండి ఉత్పత్తి కేంద్రాలుకూడా తప్పుకొన లేకుండా నున్నవి. ఇండియానుండి సరుకు కావలెననేవారు లేకపోవడంచేతను, భారతీయ వర్తకులు చట్టా వ్యాపారానికి కంట్రాక్టులు తీసుకోకపోవడం వలనను, గ్రేటు బ్రిటనులోని బట్టల మిల్లులలో మూడవ వంతు మూసి వేయవలసివచ్చిందని ఇంగ్లాండునుండి వచ్చిన నివేదికలద్వారా తెలియ వస్తూన్నది . . . . అంతకంతకు పరిస్థితులు మరీ విషమిస్తూన్నవి. భవిష్యత్తు అంధకారంగానూ అనిశ్చయంగానూ కనిపిస్తూన్నది.''

ప్రచారంవలన ఖాదీ అమ్మకానికి చాలా ప్రయోజనం కలిగింది. ఈ వ్యవధిలోనే నిరుటికంటె ఈ యేడు నూటికి 50 వంతులు ఖాదీ ఎక్కువ అమ్ముడు పోయింది.

కాని కలకత్తా విషయంలో టాటర్‌సాల్ ఇలా అంటు న్నాడు:

"బట్టల కింకా ఎక్కువ గిరాకీఉండే సూచనలు కనిపిస్తూన్నవి. . . . . . . . ఇండియాకు సంబంధించినంతవరకు కలకత్తాకు యింకా ఎక్కువ సరఫరా ముఖ్యంగా ధోవతులు ఎక్కువ కావలసివచ్చేటట్టు మంచి సూచనలు కనిపిస్తూన్నవి. బట్టలు కొనడం స్వేచ్ఛగా జరుగు తూనే ఉన్నది.''

ఇందునుగూర్చి నివేదికలో యిలా ఉన్నది:

"నిరుడు దేశం మొత్తంమీద 6,516 లక్షల రూపాయిల విలువగల విదేశీ బట్ట దిగుమతీ అయితే, ఒక్క కలకత్తాకు 2,821 లక్షల రూపా యిల విలువగల బట్ట దిగుమతీ అయింది. అనగా దాని భాగం నూటికి 43 వంతులకు వచ్చింది. కాబట్టి విదేశీ బట్టల దిగుమతీ కది ముఖ్యమైన రేవు పట్టణం. ఈ విషయం పై వ్యాఖ్యానముయొక్క ప్రాముఖ్యతను హెచ్చిస్తుంది.''

కలకత్తా కాంగ్రెసు వాదులు ఈ గుణ పాఠాన్ని సరిగా గ్రహింతురుగాక.

ముందు అంగడిలో ఖాదీ లభించదని చాలామంది భయపడుతూన్నట్లు కనిపిస్తూన్నది. తరువాత మన

మందరమూ దేశీయ మిల్లుల చేతులలో పడిపోయి మరొక సారి మోసపోతామనీ, భారతీయ మిల్లు బట్ట అనే పేరుతో విదేశీ బట్ట కొనక తప్పనిసరి అమ్మేయబడుతుందనీ, లేదా అత్యధికమైన ధరలు పెట్టి బట్ట కొనవలసివస్తుందనీకూడా అనేకులు భయపడుతూన్నారు. మనకు వీలైన అన్ని విధాలా ఖాదీ ఉత్పత్తికి మనం పూనుకోకపోతే, ఆ భయం నిజమే అవుతుంది.

ఖాదీ ఉత్పత్తికి మార్గాలివి :

1. ఎవరికోసం వారు వడుకోవడం.

2. మజూరీకి వడకడం.

3. త్యాగ బుద్ధితో వడకడం.

ఇందులో మొదటిది అత్యంత ప్రాముఖ్యమైనది. అందరూ చేయతగినది. ఒకసారి సక్రమంగా యేర్పాటు చేయబడినయెడల ఎప్పటికీ అపజయం పొందదు. ఈ విషయంలో ప్రయోజనకరమైన ప్రచారం జరిగేటందుకు తరుణమిప్పుడే వచ్చింది. ఖాదీ ప్రతిష్ఠా సంస్థాపకుడైన శ్రీ సతీష్ చంద్రదాసు గుప్తా ఈ సంగతి గ్రహించి దీనిని భారీ యెత్తున యేర్పాటు చేస్తున్నాడు. ఇది ఖాదీ ఉత్పత్తికి అత్యంతం చౌక అయిన పద్ధతి. ఎందువల్లనంటే అలా ఉత్పత్తి అయినసరుకు విడుదలకోసం అవస్థపడవలసిన అవసరం ఉండదు. రెండవది మజూరీకోసం వడకడం. దానికి చాలా అవకాశం ఉంది. కాని ఇందుకు కావలసిన పత్తిని నిలవచేయడానికీ అమ్మకాలకు తగు యేర్పాట్లు చేయడానికీ, పెట్టుబడి అవసరం. అంతేకాదు దానికి మన వ్యాపార సామర్థ్యముకూడా ఎక్కువ అవసరం అందువల్ల మనకు కార్యదక్షత ఎక్కువైన గొప్ప నిర్మాణశక్తికూడా

కలుగుతుంది. మధ్య తరగతులవారికి గౌరవ ప్రదమైన వృత్తినిసి కల్పిస్తుందది. మూడవ పద్ధతి ఉత్కృష్టమైనది. కాని ప్రత్యేకం యే కొలది మందియో మాత్రమే ఆ పని చేయగలరు. భారతజాతి త్యాగముయొక్క అవసరమును గుర్తించినట్లయితే, అది అంతులేనంత నూలును ఉత్పత్తి చేయగలిగిన సాధనం అవుతుంది. మున్సిపాలిటీలచే నడుప బడుతూన్న పాఠశాలలన్నీ లక్షలాది ప్రజలకు కావలసిన బట్టకు సరిపోయేటంత నూలీయగలవు. రోజుకు ఒక అర గంట రాటం దగ్గర పనిచేస్తే నగరవాసులు కనీసం నూరు గజాల మంచి నూలు ఈయగలరు. కేవలం నూలు వడకడం కంటె ఎక్కువ మంచి పనికి వారి అరగంటను ఉపయో గించుకోగలరని ఎవ్వరూ అనాలోచితంగా ఎదురు చెప్ప కుందురుగాక. నీరులేని ఎడారిలో నిలచిపోయిన వర్తక వ్యాపారస్థుడు మంచి నీరు సేకరించుకోవడంకంటె ఎక్కువ సముచితంగా తన కాలాన్ని వినియోగించుకోజాలడు. ఈ యేడాదిలో విదేశీ వస్త్ర బహిష్కారమును సాధించ వలెనని పట్టుపట్టిన భారతదేశం, దానిని సాధించేపరకూ, అత్యుత్తములైన తన ప్రజల కాలాన్నికూడా నూలు వడకడం కంటె ఎక్కువ ఉచితంగా ఉపయోగించజాలదు. బహి ష్కారముయొక్క అవసరాన్ని మనం గమనించకపోవడము వలననే ఇంత స్పష్టంగా కనుపించే సహజసత్యాన్ని మనం గుర్తించలేకుండా ఉన్నాము. ఐనప్పటికీ ఈ మూడు పద్ధతులూ ప్రయత్నింపబడుతూనే యున్నవి. ఈ పద్ధతుల ప్రకారం మనమందరం మన శక్తి వంచనలేకుండా పనిచేస్తే యెడల ఖాదీకి కరువువచ్చే అపాయం ఉండదు.

—యంగ్ ఇండియా, 30-5-1929

# 102

## ఖాదీ, స్వదేశీ *

ఖాదీని ధరించినంత మాత్రంతో స్వదేశీ సందేశాన్ని పూర్తిగా నిర్వర్తించినట్లే మనం తఱచు భావిస్తూంటాము. తక్కిన భారతీయేతర వస్తువులను ఉపయోగించేటందుకున్నా, ప్యారిసునుండి వచ్చిన సరికొత్త వేషాలను అవలంబించేటందుకున్నా దాని నొక అధికారపత్రంగా మనం భావిస్తూంటాము. ఇది స్వదేశీని హాస్యాస్పదం చేయడం. ఖాదీ సందేశాన్ని తృణీకరించడం భారతదేశంలో నిరంతర ఖాదీ ధారణ ఎంత అవశ్యకర్తవ్యమో విదేశీ వస్తువులకంటె నాసి రకంగా ఉన్నప్పటికీ ఇండియాలో తయారైన వస్తువులు లభించిన చోట్లలో, వాటిని ఉపయోగించడంకూడా మనకు అంత అవశ్యకర్తవ్యమూ అవును. తగిన ప్రోత్సాహం లేక అనేక స్వదేశీ వస్తువులు అంగడినుండి అదృశ్యమయ్యే అపాయ పరిస్థితిలోనున్నవి. అవి ఉండ తగినంత బాగా ఉండకపోవచ్చును. వాటిని మనం ఉపయోగిస్తూ, అభివృద్ధికి అవకాశమున్న సందర్భాలలో అభివృద్ధి కావించవలసిందని ఉత్పత్తిదారులకు చెప్పడం మన విధి. అత్యంతం మంచి వస్తువు, అత్యంతం చౌకగా కొనవలెననే సూత్రం ఎల్లప్పుడూ నిజంకాదు. మన దేశంకంటె ఎక్కువ మంచి శీతోష్ణస్థితిగల దేశంకొఱకు మన దేశాన్ని విడిచిపెట్టక మన శీతోష్ణస్థితిని అభివృద్ధి చేసుకోవడానికేవిధంగా ప్రయత్నిస్తామో అదే విధంగా, ఎక్కువ నాణ్యమూ, ఎక్కువ చౌకగల విదేశీ వస్తువులకోసం స్వదేశీ వస్తువులను

* "ఆంధ్ర దేశంలో" అనే శీర్షికగల వ్యాసమునుండి.

తృణీకరించరాదు. అమాయికంగా కనిపించే తన భార్య యెడల అసంతృప్తి చెంది, అందంగా కనిపించే మఱొక ఆడదానికోసం దేవులాడే మగవాడు తన సహధర్మచారిణికి ద్రోహం చేసినట్లే, స్వదేశంలో తయారైన వస్తువులకంటె, ఎక్కువ నాణ్యంగా ఉన్నప్పటికీ విదేశంలో తయారైన వస్తువులను కోరుకొనే మనిషికూడా తన దేశానికి ద్రోహి అవుతున్నాడు. ప్రతి దేశముయొక్క అభివృద్ధినిగూర్చిన సిద్ధాంతమూ ఆ దేశపు ప్రజలు తాము ఉత్పత్తి చేసుకొన్న వస్తువులను సరుకులను ఎక్కువగా అభిమానించవలెనని ఆదేశిస్తూన్నది.

—యంగ్ ఇండియా, 30-5-1929

# 103

# ఖాదీ, బహిష్కారణము

మన అపనమ్మకం అత్యంతం ఆశ్చర్యకరం. ఏ పని చేయడానికీ మన సామర్థ్యంలో మనకు నమ్మకం లేదు. సంపూర్ణ మద్యనిషేధం అసంభవమనుకొంటాము. హిందూ మహమ్మదీయ ఐక్యత మనకు పగటికల. సనాతనుల ప్రతిఘటన ముందు అస్పృశ్యతా నివారణమునుగూర్చి ఆలోచించడానికికూడా వీలు లేదు. మిల్లులవల్ల విదేశీ వస్త్ర బహిష్కారాన్ని మనం సాధించలేకపోయినాము. ఖాదీ ద్వారా సాధించజాలం. కనుక ఇక మనం చేయదగినది యేమీ లేదు. కాబట్టి స్వరాజ్య సాధన సాధ్యంకాని సిద్ధాంతం. కానిసత్యమే మన సహజ పరిస్థితి. ఎవ్వరికైనా ఈ స్థితిలో ఉండడం కడుంగడు నీచం.

మన స్వరాజ్య యాత్రకీ అవిశ్వాసమే బ్రహ్మాండమైన ఆటంకం. ఖాదీవల్ల బహిష్కారోద్యమం కొనసాగదనే సిద్ధాంతాన్ని ప్రస్తుతం పరిశీలిద్దాం. మన అవసరాలకు ఖాదీ ఉత్పత్తి సరిపోదని అంటారు. అలా అనేవారు కానీ, వ్రాసేవారు కానీ, ఖాదీనిగూర్చిన ఓనమాలుకూడా తెలియని వారు. మనకు ఇచ్ఛవుంటే ఖాదీని అనంతంగా అభివృద్ధి చేయవచ్చును. రొట్టె చేయడం ఎంత తేలికో అది అంత తేలిక. బహిష్కారోద్యమమునుగూర్చి చెప్పడంకోసం ఖాదీ అర్థశాస్త్రమును నేనికక్కడ వివరింప నక్కరలేదు. ఇంగ్లాండు, జపాను దేశాలు తమ బట్టల నిక్కడకు పంపడం మానుకొన్నవనుకోండి, మన మిల్లు లేదో ఒక కారణంచేత

పని చేయలేకపోయిననుకోండి, అప్పుడు మనం ఖాదీయొక్క ఆర్థిక ప్రయోజనాలనుగూర్చి ఆలోచించము. మనకు కావలసిన ఖాదీని మనం మాగ్గాడకుండా మన యిళ్లలో తయారు చేసుకొంటాము. తమ బట్టల వ్యాపారాన్ని పోగొట్టుకొన్న వర్తకులంతా ఖాదీ ఉత్పత్తిలో నిమగ్నులవుతారు. మన చుట్టూ అసమర్థత అనే ఒక విష వాతావరణాన్ని సృజించుకోవడంవలననే సర్వ సామాన్య విషయాలలోకూడా మనం నిస్సహాయులంగా భావించుకొంటున్నాము. మన నిరాశ తప్ప, యే విధమైన వత్తిడీ ప్రోత్సాహమూ లేకుండా విజోలియా చేయగలిగిన పనిని, ఉత్కృష్టమైన దేశాభిమానమనే ప్రేరణతో, మనం నిశ్చయంగా చేసి తీరవలెనని ఏల తలంచకూడదో కారణం కనిపించడం లేదు. ఈ రోజున ఖాదీ పరిశ్రమకు సంబంధించిన ప్రత్యేక శాఖ, రాటాలను, తదితర పరికరాలను తగినన్ని సరఫరా చేయజాలనంత పెద్ద యెత్తున బార్డోలీలో ఆ పని జరుగుతూన్నది.

ప్రతి మనిషీ విమర్శకుడుగా దూరంగా నిలబడి, 'ఇది నా పని' అనేవాడెవ్వడూ లేకపోతే ఈ ఉద్యమం పడిపోయే మాట వాస్తవం. ఈ ఉద్యమ విజయం, లక్షలాది ప్రజల హృదయపూర్వక నిర్మాణాత్మక సహకారం పైన ఆధారపడి ఉంది. ఈ ఉద్యమాన్ని విజయవంతం కావిద్దామనే దృఢ నిశ్చయంతో ప్రాజ్ఞులు రాటమును చేపట్టిన యెడల అడిగినంతమాత్రంతో ఆ సహకారం లభిస్తుంది. తక్కువ పెట్టుబడితోనూ, జాగరూకతతోనూ అభివృద్ధి పొందుతూన్న నిర్మాణముకల ఉద్యమమిది అని వారు తెలుసుకొందురుగాక. భారతజాతి యేమాత్రమూ శక్తి వంచన లేకుండా పని చేయవలెనే కాని జయము నిశ్చయము.

అందరూ జయప్రదంగా నిర్వర్తించ తగిన నిర్మాణ కార్య క్రమము ఇంతకంటె మఱొకటి దేశం ముందు లేదనే సంగతికూడా మనం జ్ఞాపకం ఉంచుకోవాలి. ఖాదీ ఉత్పత్తి ఆనందంగా ఎలా అభివృద్ధి చేయవచ్చునో ఈ పుటలలో నేను పదేపదే సూచించి ఉన్నాను. స్వీయోపయోగం కోసం వడకడం, మజూరీకోసం వడకడం, త్యాగబుద్ధితో వడకడం అనే మూడు పద్ధతులను నేను వివరించి ఉన్నాను. నిజమయిన త్యాగబుద్ధి దేశాన్ని ఒకర్ఱసారి ఆవరించినయెడల, అంగళ్లనీన్ని వడుకు నూలుతో ముంచివేయవచ్చును. వడుకు నూలును అధికంగా ఉత్పత్తి చేయడంలోనే ఖాదీ ఉత్పత్తి యొక్క రహస్యం ఇమిడి ఉందని నేను నిరూపించనే నిరూ పించాను. భారత దేశంలోని పాఠశాలలన్నిటిలో 97 లక్షల మంది విద్యార్థులకు పైగా చదువుకొంటున్నారు. మొత్తం జనసంఖ్యలో వారు నూటికి నలుగురు మాత్రమే. కాని సూత్రయజ్ఞమును తేలికగా యేర్పాటు చేయడానికి ఆ సంఖ్య చాలును. మనం ఖాదీద్వారా బహిష్కారోద్య మాన్ని సాధించవలెననే నిశ్చయమునకు వచ్చినయెడ ఎక్కువ ప్రయత్నం లేకుండా ఈ విధంగానే యేర్పాటు చేయతగిన అనేక యితర సంస్థలుకలవు. వాటిని ఈ లెక్కలోకి తీసుకోలేను.

—యంగ్ ఇండియా, 20-6-1929

# 104

# మిల్లు యజమానులు: బహిష్కారోద్యమము

ఇంతకు పూర్వం ఈ విషయాన్ని గూర్చి ఈ పుటలలో నేను చర్చించి ఉన్నప్పటికీ, విదేశీ వస్త్ర బహిష్కారోద్యమంలో పాల్గొనేటందుకు దేశీయ మిల్లుల నెందుకు ఆహ్వానించలేదని విలేఖకులు తఱచు ప్రశ్నిస్తున్నారు. మిల్లులీ ఉద్యమంలో ఏవిధంగా పాల్గొంటున్నవని ఇతరులడుగుతున్నారు. ఖాదీతో పాటు దేశీయ మిల్లు బట్టను కూడా ప్రత్యక్షంగా ప్రోత్సహిస్తూ కాంగ్రెసు కార్యకర్తలెందుకు ప్రచారం చేయకూడదని మఱికొంతమంది పృచ్ఛిస్తున్నారు.

చివరి ప్రశ్న ముందుగా విచారిద్దాం. కాంగ్రెసు తీర్మానం, ఖాదీద్వారా బహిష్కారోద్యమాన్ని ఉద్దేశించిందని ఈ విలేఖకులు జ్ఞాపకం ఉంచుకోవాలి. ఈ పక్షపాతానికి మంచి కారణాలున్నవి. కడచిన యాభై సంవత్సరాలనుండీ కేవలం మిల్లు బట్టకే అవకాశం ఉండి ఉంది. కాని అది బహిష్కారాన్ని సాధించి ఉండలేదు. ప్రస్తుతం ఉన్న మిల్లులద్వారా తక్షణ బహిష్కారం సాధ్యం కానిపని. అడిగినంత మాత్రంతో క్రొత్త మిల్లులు తయారు కావు. కాబట్టి బహిష్కారోద్యమం జయం పొందవలెనంటే అది ఖాదీ ద్వారానే జరుగగలదు. మిల్లు బట్టతోపాటు ఖాదీనికూడా ప్రోత్సహించడానికి వీలు లేదు. వారి యిష్టానికి విడిచిపెడితే, ఆలోచనలేని జనసామాన్యం, ప్రియంగానూ, మెరటుగానూ కనిపిస్తూ తేలికగా

దొరకని ఖాదీకంటె, చౌకగానూ తేలికగానూ లభించే బట్టనే కోరుకొంటారని విచారపూర్వకంగానైనా ఒప్పుకొని తీరాలి. కాబట్టి కాంగ్రెసు కార్యకర్తల పలుకుబడి సాగినంతవరకు—ఇంకా చాలావరకు సాగడంలేదు—వారు మిల్లు బట్టను మినహాయించి ఖాదీనే ప్రచారం చేయాలి.

ఈ సందర్భంలో నాకు రెండవప్రశ్న జ్ఞాపకంవస్తూన్నది. కేవల ఖాదీ ప్రచారం, దేశీయ మిల్లు బట్టకు ప్రతికూలమని అర్థంకాదు. మిల్లు యజమానుల కిష్టమున్నా, లేకపోయినా మిల్లు బట్ట ఈ ఉద్యమంలో ప్రాముఖ్యమైన పాత్ర వహిస్తూన్నది. ప్రజాసామాన్యం దానిని విదేశీ బట్టతో పోటీగా కొంటున్నారు. భారతదేశంలోని అన్ని భాగాలలోనూ మిల్లులకు ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ కూడా యేజన్సీలున్నవి. సుప్రసిద్ధుడైన ఒకానొక మిల్లు యజమాని ఒకప్పుడు నాతో మిక్కిలి సమంజసంగా యిలా అన్నాడు: "మీ సహాయము మాకక్కరలేదు. బహుశా మీ మాటకూడా ఎప్పుడూ వినిపించడానికి వీలులేని ప్రదేశాలలోకి మేము చొచ్చుకొనిపోతున్నాము. మా బట్టలను గూర్చి మీరు ప్రచారంచేసేయెడల, మేము సరఫరా చేయలేనంత గిరాకీ వాటికి తగులుతుంది. అందువలన నేను మా ఖరీదులను హెచ్చించడానికి కేవలం మీరు మమ్ములను ఆహ్వానించినట్లే" ఇందుకు ప్రత్యుత్తరంగా నేను బహిష్కారోద్యమమును మిల్లు బట్ట ద్వారా కాక ఖాదీద్వారా సాగించదలచుకొన్నానని చెప్పినప్పుడాయన మౌనం వహించాడు. విదేశీ బట్టను రాకుండా చేయడానికి తగినంత ఖాదీని నేనుత్పత్తిచేయగలిగి, దానిని వాడుకలోకి తీసుకొని రాగలిగినయెడల అది మిక్కిలి ఆచరణయోగ్యమయిన ప్రతిపాదన అని ఆయన వెంటనే అంగీకరించాడు కూడా.

ఈయనవలెనే మిల్లు యజమానులలో అత్యధిక సంఖ్యాకులీ విషయం గుర్తిస్తున్నారు. కొత్తి మిల్లు బట్టలను గూర్చి కాంగ్రెసు కార్యకర్తలు చేసే ప్రచారంవలన బహిష్కారో ద్యమం కుంటుపడడమేగాక, అనాలోచితములయిన పద్ధతుల నవలంబించడంద్వారా, ఉద్యమం తప్పక అపజయం పొంది చివరకు మిల్లులకే హాని కలుగుతుంది. ఉద్యమమునకు పదేపదే కలుగుతూన్న అపజయ పరంపరలు నిరాశను పెంచి, బట్టలు కొనడంలో ప్రజలను ఉదాసీనులుగా కూడా చేయగలవని పాఠకులు గుర్తించవలసిఉంది. ఏవిధంగా నైనాసరే ఈ పర్యాయం మనం అపజయం పొందకూడదు. సరిగా ఆలోచించకపోవడంవలనగానీ అలసత్వంవలనగానీ, సవరించుకోవడానికి వీలుగల తప్పును సవరించుకోకుండా విడువరాదు. విదేశీ బట్టల వర్తకునికింత మంచి అవకాశం కలగడానికి కారణం ప్రజల ఉదాసీన భావమే. ప్రజలు స్వయంగా ఆలోచించుకొని వారికి కావలసింది కోరుకోవ డానికి ప్రోత్సహిస్తే వెంటనే బహిష్కారోద్యమం విజయం పొందితీరుతుంది. కాబట్టి కాంగ్రెసు వాదుల సహాయం లేకుండానే దేశీయ మిల్లులీ ఉద్యమంలో తమ పాత్రను నిర్వహిస్తూ, దానివలన ప్రయోజనం పొందుతూనే ఉన్నవి.

ఇక మొదటి ప్రశ్నను గూర్చి: మిల్లు యజమాని హృదయపూర్వకంగా, చురుకుగా, ప్రయోజనకరంగా ఈ ఉద్యమానికి సహాయం చేసేటందుకొక మార్గం కలదన్న మాట నిస్సంశయం. వారి ప్రత్యక్ష సహాయాన్ని కోరే టందుకు కిందటి పర్యాయం నేనూ పండిత మాలవ్యాజీ, మోతీలాల్జీ ప్రయత్నించాము. కాని ఆ ప్రయత్నం విఫల మయింది. ప్రభుత్వంవారు ప్రత్యక్షంగా సంబంధం పెట్టుకొనట్టిగానీ లేక వారు అంతరంగికంగా ఆమోదించడం

లేదని అనుమానింపబడుతూన్నట్టిగానీ యే ఉద్యమంలోనూ కాంగ్రెసు చెప్పిన ప్రకారం మిల్లులు చురుకుగా పాల్గొన డానికి సహజంగా అవకాశంలేని పరిస్థితులుండడమే బహుశా అందుకు కారణం. ప్రభుత్వంవారి సుహృద్భావముపైన తమ ఉనికికే ఆధారపడే బ్యాంకుల పలుకుబడి కిందనే ఈ మిల్లులలో ఎక్కువ భాగము ఉంటూన్నవి. ప్రభుత్వంవారెంత నిగూఢమైన వత్తిడి పెట్టినప్పటికీ, దానిని తృణీకరించగల మిల్లులు ఉన్నట్లయితే, అవన్నీగానీ వాటిలో ఏదకానీ, ఈ ఉద్యమంలో పూర్తిగానో, కొంతవరకో ప్రత్యక్షంగా పాల్గొన గలగడానికి పద్ధతులివి :

1. వారి యేజన్సీలద్వారా వారు ఖాదీ అమ్మవచ్చును.

2. వారి శక్తి సామర్థ్యాలను ఉద్యమానికి ఉపయోగించవచ్చును.

3. అఖిల భారత చరఖా సంఘంతో కలసి సమావేశమై, బహిష్కారోద్యమాని కనుకూలంగా ఉండేటట్లు యేయే రకాలను వారుత్పత్తిచేయవలెనో నిర్ణయించవచ్చును.

4. ఖాదీ అనే పేరుతోగానీ మరొక పేరుతోగానీ 'ఖాదీ' ఉత్పత్తివారు మానవచ్చును.

5. వారికి నష్టంరాకుండానూ, వారధిక లాభాలు పొందకుండానూ, వారి బట్టల ఖరీదులకు ప్రమాణం నిర్ణయించవచ్చును.

6. ఈ ఉద్యమానికి వారు ధనసహాయం చేయవచ్చును.

ముఖ్యమైన ఈ ఆరు పద్ధతులనుండి ఇంకా అనేక పద్ధతులను తేలికగా ఊహించవచ్చును. మిల్లు యజమాను

లున్నా వారి భాగస్వాములున్నా దేశాభిమానపూరితులై తమ లాభాలకు పరిమితిని నిర్ణయించుకోవడానికి సంసిద్ధంగా ఉన్నయెడల మాత్రమే ఈ సహాయం జరుగుతుంది. సరిగా నప్పుచెప్పినయెడల మిల్లు భాగస్వాములలో అధిక సంఖ్యాకులు ఇందుకభ్యంతరం చెప్పరని నాకు గట్టి నమ్మకం. కాబట్టి నిజంగా ఈ నిర్ణయం చేయవలసింది పెట్టుబడిదారు. వారిలో ఒకరు 'మేము ముందుగా రాము — రావలసివచ్చినప్పుడు వస్తాము' అన్నారు. ఆయన చెప్పిందే నిజం కావచ్చును.

ఇక చిట్టచివరి విషయం: ఇండియాలో కట్టబడినంత మాత్రంతో అన్ని మిల్లులను దేశీయ మిల్లులని పిలవకూడ దన్న మాటకూడా పాఠకులు తెలుసుకోవాలి. పేరుకు మాత్రమే దేశీయ మిల్లులైనవి ఉన్నవి కొన్ని. అవి విదేశీ యాజమాన్యంకింద వారిచేతనే పరిపాలింపబడుతూన్నవి. వాటి భాగస్వాములు విదేశీయులు. వాటి పరిపాలనలో గాని, భాగాలలో గానీ భారతీయులకు స్థానం లేదు. వాటి ఆదాలో అధికభాగం ఇండియానుండి బయటికి పోతూన్నది. అందులో కార్మికులకు వచ్చే కూలి డబ్బులు మాత్రమే ఇండియాకు లభిస్తూన్నవి. ప్రస్తుత ప్రభుత్వం దేశీయం కానట్లే ఈ మిల్లులు కూడా దేశీయ మిల్లులు కావు. ఇవి ఎప్పుడూ ఈ ఉద్యమానికి సహాయపడజాలవు.

—యంగ్ ఇండియా, 4-7-1929

# 105

## నగరీయము—గ్రామీణము

మిస్టరు గ్రెగ్గు వ్రాసిన పుస్తకము గూర్చి అదే సందర్భంలో, పూర్తిగా చర్ఖా సిద్ధాంతమును గూర్చి చేయబడిన పెద్ద విమర్శకల 'ప్రబుద్ధ భారతము' లోని ముక్కలను నా కనేకమంది విలేఖకులు పంపించారు. ఆ వ్యాసాలు చాలా పెద్దవి కావడంచేత వాటిని తిరిగి యిక్కడ ప్రచురించడానికి వీలు లేకపోతూన్నది. తెలుసుకో వలెనని కుతూహలం ఉన్నవారు అసలు వ్యాసాలనే చదువుకొన కోరుతున్నాను. అవి ప్రతిపాదిస్తూన్న సిద్ధాంతాలివి :

"1. పాశ్చాత్య దృష్టితో ఇండియా పారిశ్రామిక దేశం కావాలి.

2. భౌతిక జీవన సమస్య చర్ఖావల్ల పరిష్కారం కాదు.

3. చర్ఖా విజయం పొందడానికి నిర్ణయింపబడిన షరతులు ప్రస్తుత మానవ స్వభావ ప్రవృత్తులపైన చాలా పెద్ద పెద్ద ఆశలు పెట్టుకొని యేర్పాటుచేయబడినవి.

4. యంత్రాల ఆవశ్యకత గానీ, అధిక్యత గానీ, విదేశం యొక్క అంతరంగికావసరములను తీర్చడంపైనగాక, విదేశీ అంగళ్లను ముట్టడించి స్వాధీనపఱచుకోవడంపైన ఆధారపడిఉంటుంది.

5. భారతదేశం జీవించి ప్రజానీకంలో తన ఆధ్యాత్మిక దౌత్యమును నిర్వహించవలెనంటే తాను ముందు ఆధునిక పద్ధతులమీద తయారు కావాలి .....ఆధునిక పారిశ్రామిక విధానాలను నిస్సందేహంగానూ శక్తివంతంగానూ మనం అవలంబించాలి....దానితోపాటు ఆధ్యాత్మిక తత్వమునుకూడా మనం శ్రద్ధగా అభ్యసించాలి. జాతీయ హృదయంలో ఉత్కృష్టమైన ఆధ్యాత్మికాదర్శమును దేశాభిమానమును వికసింపచేయాలి. దురదృష్టవశాత్తూ పాశ్చాత్య ప్రపంచం

ప్రాకులాడుతూన్న ఆధునిక విధానమనే చీకటిలోయను ఆ రెండింటి రెక్కలమీదనే మనం దాట వీలఖుతుంది. ఆధ్యాత్మికాదర్శములేని ఆధునిక విధానం త్వరితంగా వినాశాన్ని ఆవహింపచేస్తుంది."

గ్రంథకర్త మాటలనే సాధ్యమైనంతవరకు వాటి ప్రాముఖ్యతను సూచించే అక్షరాలతోసహా ఉదాహరించాను.

ఈ ప్రతిపాదనలను నేనా మోదించజాలనందుకు విచారపడుతున్నాను. తక్కినవాటితో పోల్చినప్పుడు, ఆధునిక నాగరికతయే మంచిదనీ, దానిని జయప్రదంగా ప్రతిరోధించగల ఆశ యేమీలేదనీ ఊహించుకొంటూ ఈ ప్రతిపాదనలు చేయబడ్డవనే మాట స్పష్టం. ఒకవంక తృప్తిలేని భౌతిక వాంఛాపర్వతమునకూ, మఱొక వంక పతత్ఫలితమైన యుద్ధమునకూ మూలమైన ఈ నాగరికతయెడల అవిశ్వాసంగల పాశ్చాత్య ప్రాజ్ఞలోకముయొక్క అభిప్రాయం దినదిన ప్రవర్థమానమవుతూన్నది.

అయితే, మంచికైనా చెడుకైనా భారతదేశం పాశ్చాత్య దృక్పథంతో ఎందుకు పారిశ్రామికం కావాలి? పాశ్చాత్య సభ్యత పట్టణాలకు సంబంధించినది. ఇంగ్లాండు, ఇటలీలవంటి చిన్న దేశాలు, వారి విధానాలను పట్టణాలకనుగుణంగా నిర్మించుకోవడానికి వీలవుతుంది. జనం వత్తిడిలేని అమెరికావంటి దేశంకూడా బహుశా మఱొకవిధంగా ఉండడానికి వీలులేదు. క్రిక్కిరిసిన జనాభాతోనూ పురాతన గ్రామీణ సంప్రదాయములతోనూ ఉండి ఇంతవరకూ తన పనిని తాను నిర్వహించుకోగలిగిన ఒక బ్రహ్మాండమైన దేశం పాశ్చాత్య విధానాన్ని అనుకరించకూడదని అనుకోవాలి. ఒక పరిస్థితిలోనున్న ఒక

దేశానికి క్షేమంగా ఉన్న విషయం వేఱు పరిస్థితిలోనున్న మఱొక దేశానికి క్షేమం ఉండవలసిన అవసరం లేదు. తఱచు ఒక మనిషికి ఆహారంగా ఉండేది మఱొక మనిషికి విషంగా పరిణమిస్తుంది. ఒక దేశముయొక్క సంస్కృతి దాని నైసర్గిక భూగోళంపైన ఎక్కువ భాగం ఆధారపడి ఉంటుంది. ఉత్తర ధ్రువ ప్రాంతాలలో నివసించే మనిషికి ఉన్ని కోటు అవసరం కావచ్చును. కాని భూమధ్యరేఖకు సన్నిహితంగా నివసించే మనిషికది ఊదర పెట్టినట్లుంది.

'భౌతిక జీవన సమస్య చర్ఖావల్ల పరిష్కారం కాదని' గ్రంథకర్త చేసిన రెండవ సిద్ధాంతం సరియైనది కాదు. పైగా చర్ఖాద్వారాకానీ దానితో సమానమైన మఱొక పరిశ్రమద్వారాకానీ మాత్రమే అది పరిష్కారమవుతుంది. భారతదేశం భౌతికంగా జీవించడానికి కుటీరపరిశ్రమల అవసరాన్ని ప్రతిసుప్రసిద్ధ గ్రంథకర్తా—ఆయన భారతీయుడుకానీ, ఐరోపా దేశీయుడుకాని—అంగీకరించి తీరుతాడు. మిస్టర్ గ్రెగ్గు చేసిన నిష్పక్షపాత సిద్ధాంతాన్ని తక్షణం తృణీకరించడంవలన, ఈ వ్యాసముల రచయిత తనకుగానీ, గ్రెగ్సుకుగానీ, తన దేశానికిగానీ తగిన న్యాయం చేయలేదు. మిస్టరు గ్రెగ్గుకు ఇంజనీరింగు అనుభవం చాలా ఉంది. భారతదేశంలో నివసిస్తూన్న 30 కోట్ల జనాభాయొక్క చేతులలోనూ, కాళ్లలోనూ నిలవచేయబడిన సౌరశక్తిని నిరర్థకంచేసి దాని స్థానే వారి భౌతిక జీవనాధారమునకు, ఆవిరిశక్తినిగానీ అటువంటి మఱొక శక్తినిగాని ప్రవేశపెట్ట ప్రయత్నించేయెడల అది వారికి ఆత్మహత్యాపూర్వకమైన మృత్యువు కావడం నిశ్చయమని మిస్టరు గ్రెగ్గు సమగ్రంగా రుజువు చేశాడు. తన

నోటి దగ్గరకు అన్నం తెచ్చుకొనేటందుకు చేతిని ఉపయోగించకుండా, చేయి చేయవలసిన పనిని యంత్రం నిర్వహించేటట్లుగా చేసుకొని, అందువల్ల మస్తిష్కముతో సంబంధించి సూక్ష్మజ్ఞానం గలిగిఉన్న చేతి నరాలు, అత్యుష్ణ పదార్థాలతో పెదవులు కాలకుండా తమంతట తాము ఇస్తూన్న రక్షణను పోగొట్టుకొంటూఉన్న మనిషియొక్క ప్రయత్నముతో తులతూగుతుంది పైన చెప్పబడిన ఈ పనికూడా.

ఇక మూడవ సిద్ధాంతానికి తేలికగానే ప్రత్యుత్తరమీయవచ్చును. 'చర్ఖాకు సంబంధించిన పరతులు ప్రస్తుత మానవ స్వభావ ప్రవృత్తులపైన పెద్దపెద్ద ఆశలు పెట్టుకొని యేర్పాటు చేయబడలేదు సరికదా, అవి భారతదేశంలో ప్రత్యక్షంగా కనిపిస్తూన్న 'ప్రస్తుత మానవ స్వభావ ప్రవృత్తులపైన' నే ఆధారపడిఉన్నవి. అలా కాకుండా ఉండినట్లయితే అనేక జాతీయ కార్య ప్రణాళికలలో తటస్థిస్తూన్న చీకాకూ ఆశాభంగముల మధ్య 2,000 గ్రామములలో చర్ఖా వ్యాపించిఉండేదికాదు. అంతేకాక అది పునరుద్ధరింపబడిన ఎనిమిది సంవత్సరాలలో, అవసరమునుబట్టి నెమ్మదిగానైనా అవిరతాభ్యున్నతిని ప్రత్యక్షంగా ప్రదర్శింపగలిగిఉండేది కాదు.

ఇక నాల్గవ సిద్ధాంతంలో ఆ రచయిత, యంత్రయుగాన్ని పూజించడం సమర్థిస్తున్నాడు. ఆ సమర్థన అది 'దేశముయొక్క అంతరంగికాశపేరాలను' తీరుస్తుందని కాక 'విదేశీ దుకాణాలను ముట్టడించి వశపఱచుకుంటుంద'ని పాశ్చాత్య దేశాల సంపూర్ణ స్వార్థపరులు 'పన్నిన పన్నాగమిది.' మనం విదేశపు దుకాణాలను ముట్టడించి వశపఱచుకోవచ్చును. ఇంకా ఇష్టమైతే పారిశ్రామిక

విదేశాలను కూడా ముట్టడించి వశపరచుకోవచ్చును. ఈ రచయిత మనస్సులో అటువంటి బ్రహ్మాండమైన కార్యక్రమం ఉన్నట్లయితే చక్షా కావలెననేవారు నిర్ణయించుకొన్న కార్యమును సాధించడం కంటె, ఈ రచయిత తలచుకొన్న పనిని సాధించడం కష్టతరమని నా అభిప్రాయం. ఇక తుది సిద్ధాంతం రచయితయొక్క వాదాన్ని పూర్తిగా విచ్ఛిన్నం చేస్తూన్నది. ఆయన భారతదేశాన్ని ఆధునిక సభ్యతకింపకు తీసుకొనివస్తాడు. కాని ఆధ్యాత్మిక తత్వాన్ని [illegible]. ఆధ్యాత్మిక తత్వంలేని 'ఆధునిక సభ్యత' వినాశాన్ని ఆవహింపచేస్తుందని ఆయన అభిప్రాయము. ఏది సాధించడం అసంభవమని అనుభవజ్ఞులైన మహర్షులు మనకు చెప్పి ఉన్నారో ఆ పని చేయవలసిందని ఈయన ఇండియాను కోరుతున్నాడు. 'నీవు దేవుణ్ణీ ధనాన్ని పూజించలేవు.' ఈ రెండింటిని పాశ్చాత్య దేశాలు సమన్వయం చేసుకోలేక పోయినవని ఆయన అంగీకరించినట్లు కనిపిస్తున్నాడు. ఆ అసంభవమైన కార్యాన్ని ఇండియా సాధించగలదని ఎందుకనుకొంటున్నాడు? పూర్వులీ పని చేయగలిగి ఉన్నట్లయితే చాలాకాలం కిందటనే చేసి ఉండేవారని ఎందుకు ఊహించకూడదు? నిజంగా ఈ ప్రయత్నం చేసినతరువాతనే ఉపనిషద్రచయితలు 'ఇదంతా దేవునిది. కాబట్టి నీ పొరుగువాని ఆస్తిని ఆశించకుండా జీవించు' అని అన్నారు. నిజానికి స్వార్థంకోసం వినియోగించుకోవడమంటే పరుల సొత్తును హరించడం. ఇక పరార్థాపహరణము ఆధ్యాత్మిక తత్వముతో ఎప్పుడూ సమన్వయం కాదు. కాబట్టి కేవలం ఆధ్యాత్మిక విజ్ఞానానికి సంబంధించిన పత్రికలో

ఇటువంటి దురదృష్టకర పర్యవసానంగల వ్యాసమును చదువ వలసి వచ్చినందుకు నాకు బాధ కలిగింది.

ఈ రచయితచే ప్రతిపాదింపబడిన ఈ రెండువైపులా పదునుగల వాద సందర్భంలో వివేకానందుని పేరుపయోగించడం నాకు మరింత ఎక్కువ బాధకలిగించింది. తార్కిక చర్చా సందర్భంలో మృతిపొందిన మహాపురుషుల ప్రమాణమును భావగర్భితంగా పేర్కొనడం ఆ పూజ్యులయెడ అపచారం చేయడంగా తలంపవలసి ఉంది. నోరూ వాయీ లేని లక్షలాది ప్రజలకు ధర్మకర్తలమని చెప్పుకొంటూ కొలదిమంది విద్యావంతులమయిన భారతీయులం, వారి భవితవ్యములతో చెలగాటలాడడంలో తీవ్రమయిన బాధ్యత వహిస్తూన్నాము. ఇక తమకు ఆధ్యాత్మిక దృక్పథం ఉన్నదనుకొనేవారిమీద మరింత తీవ్రతరమైన బాధ్యత ఉన్నది.

—యంగ్ ఇండియా, 25-7-1929

# 106

# చరఖా క్షామనివారణోపాయం

ఇటీవల వచ్చిన భయంకరమైన వరదల సందర్భంలో జరిగిన కష్టనివారణ కార్యక్రమాన్ని గూర్చి అభయాశ్రమము (బెంగాలు) లోని ప్రఫుల్లబాబు యిలా వ్రాస్తున్నాడు:

"తిప్పేరాలోని వరదలువచ్చిన ప్రదేశాలలో చర్ఖాను ప్రవేశపెట్టేటందుకు సేత్ రిమఖ్‌లాల్జీ సమర్పించిన విరాళమును గూర్చి మీకు జ్ఞాపకం ఉండి ఉంటుంది. ఆ తరువాత సర్వెంట్సు ఆఫ్ ఇండియా సొసైటీవారి కష్టనివారణ నిధినుండి శ్రీహరి వల్లభ సి పాధ్యా ద్వారా మాకొక వేయి రూపాయలు చేరినవి. ఇంకా కొంత మొత్తం ఇతర చోట్లనుండి కూడా వచ్చింది. అవన్నీ చర్ఖాపనికి ప్రత్యేకించబడివచ్చినవి. ఈ సహాయ కార్యక్రమంలో మొట్టమొదట ప్రజలను మిట్టప్రదేశాలకు వారి సామానులతో సహా తీసుకొనిపోయి, బియ్యం పంచిపెట్టే పనిచేశాము. తరువాత వారికి, గుట్టలలో పనిచేసేటందుకు పర్మిట్లు కొనియిచ్చి, దంచేటందుకు వడ్లిచ్చి, నూలువడకడం ప్రవేశపెట్టి, పని చూపించడానికి ప్రయత్నించాము. వర్షాలవల్ల వడ్లు దంచేపని యేమీ బాగా సాగలేదు. కాని కోమిల్లాకు ఆరుమైళ్ళదూరంలో నున్న మైనామతీ సహాయకేంద్రంలో నూలువడికేపని అత్యంత సంతోషంతో ఆమోదించబడింది. ఆ పని కట్ట తెగి సుమారు ఆరు వారాలైనతరువాత జూలై నెలాంతంలో ఆరంభింపబడింది. కాని ఫలితాలు చాలా సంతృప్తికరంగా ఉన్నవి. జూలై నెలాఖరుకు ఉత్పత్తిఅయిన నూలు 57 పౌనులు మాత్రమే. కాని ఆగస్టు నెలలో అది 375 పౌనులకు పెరిగింది. వడికే 227 మంది రూ 193-11-9 లు సంపాదించారు. సెప్టెంబరులో 1,034 పౌనులకు పెరిగింది. 414 మంది వడికేవారు రూ 588-6-0 లు సంపాదించారు. వడికేవారి సంఖ్య త్వరితగతిని పెరిగిపోతూన్నది. చరఖాపనికోసం ఈ సహాయనిధి నుండి రూ 10,000 లు పెట్టుబడి పెట్టబోతున్నాము. ఒక్క వడకడం వల్లనే త్వరలో ప్రతినెలా వేయిరూపాయిలు వారు సంపాదించగలరని మాకు గట్టినమ్మకం. ఏ యితరవృత్తీ ఇంతకంటె ఎక్కువ గిట్టుబాటైనది లేనప్పుడు ఈ పెట్టుబడితో గ్రామస్థులు నెలకు వేయిరూపాయిలు అదనంగా సంపాదించుకో గలిగినయెడల నిజంగా చాలా గొప్ప విషయమే.

దీనికి తోడు బియ్యం కొన్న ఖరీదుకే అమ్ముతున్నాము. మేము చౌకగా బియ్యం అమ్ముతూండడంవల్ల ప్రజలకు యే కొలది అణాలో సహాయం కావడమే కాకుండా, ఈ దుకాణాలు లేకపోయినప్పుడు స్థానికవర్తకులు ఇష్టంవచ్చినట్లమ్ముకొనే ఎక్కువ ధరను కూడా ఆ పద్ధతి అదుపులోకి తీసికొనివచ్చింది.

"కొంచెం ఎక్కువ మెట్టప్రదేశాలలో ప్రజలు విత్తనాలు చల్లగలిగిన చోట్ల రెండవపైరు చాలా బాగున్నదనీ, వారుపొందిన నష్టాన్ని దాదాపు దీనితో పూడ్చుకోగలరనీ తెలుసుకొని కూడా మీరు సంతోషించగలరు. కాని పల్లపు ప్రదేశాలలో పరిస్థితి చాలా విషాదకరంగా ఉంది. ముందు వచ్చే జూలైవరకు వారికేమి పంట పండుతుందనుకోవడానికి వీలులేదు."

అనేక మార్గాల, నలువైపులనుండీ వివిధపరిస్థితులలో తెలియవస్తూన్న ఈ విషయాలను బట్టి, కఱువు కాలంలో రాటం అమూల్యసహాయం చేయగలదన్న సంగతి కాదని ఎవ్వరూ చెప్పజాలరు.

—యంగ్ ఇండియా, 31-1-1929

# 107

# చర్ఖా అంతరార్థాలు

‘ఇప్పటికి నూరు సంవత్సరాల వెనుక’ అనే శీర్షికతో ‘టెక్స్‌టైలు వరల్డు’ అనే పత్రికనుండి తీసిన ఈ క్రింది ముక్కను ఒక స్నేహితుడు పంపుతున్నాడు:

“యంత్రములద్వారా పరిశ్రమలను నడిపే విధానముకు ప్రతికూలంగా అసమ్మతిని ప్రకటిస్తూ, అత్యధిక సంఖ్యాక ప్రజలకు వారి కుటీరములలోనే గరిష్ఠప్రమాణముగల పనిని కల్పించే ఉద్దేశతో భారతదేశమున గాంధీ ఉద్యమం ప్రారంభింపబడినది. ప్రత్తినుండి గింజలుతీసి, ఏకి, దానిని అతి ముతక నెంబర్లనుండి 20 వ నెంబరు సన్నంవరకు వడికి, 8 గంటల పని రోజులో 16,000 గజాల గరిష్ఠప్రమాణముగల నూలు ఉత్పత్తిచేసే చేతిమరకు సుమారుగా 37,500 డాలర్లు బహుమతీ యిస్తామని ఆ సంఘంవారు ప్రకటించడం వింతగా కనిపిస్తుంది.

“బహుశా అతిసన్నమైన నూలును ఎక్కువ ప్రమాణంలో ఉత్పత్తి చేయడం తప్ప ఈ పోటీకి కావలసిన తక్కినవాటన్నింటినీ దాదాపు నిర్వహించగలిగిన యంత్రం ఒక శతాబ్దం క్రిందటనే ఈ దేశమునందు ఉపయోగంలో ఉండి ఉన్నదనే విషయంకంటె, పారిశ్రామికాభివృద్ధిని నిరోధించవలెననే యావత్ప్రయత్నము యొక్కయు, గాంధీ ఉద్యమము యొక్కయు ప్రమాదమును నిరర్థకతను ఎక్కువ సముచితంగా నిరూపించ గలిగినది బహుశా మరొక్కటి ఏదీలేదు.

“గ్రీన్‌విల్లెలో (ఎస్.సి.) జరిగిన క్రిందటి వస్త్రయంత్ర ప్రదర్శనము సందర్భమున తొలియంత్రాలలో ఒకటి ప్రదర్శింపబడినది. అంతేకాక వాషింగ్టన్ స్మిత్ సోనియన్ ఇన్‌స్టిట్యూషన్‌లోను, డియర్ బార్న్, మిచి; యందలి హెన్రీ ఫోర్డులోనూ, గాంధీ బహుమానములను పొందదగిన పురాతన యంత్రాలు నమూనాలు కలవని మా విశ్వాసం.

“గాంధీ పద్ధతులవలన గరిష్ఠ సంఖ్యాక ప్రజలకు, మానసిక నైతిక, సాంఘిక ధార్మికాభివృద్ధికి గరిష్ఠావకాశము లభించదు. పైగా వాటి వ్యతిరేక పద్ధతులవలన అనగా, అత్యధికమైన జీతంతో, తక్కువ గంటల పని

యేర్పాటుతో కనిష్ఠ సంఖ్యగల పనివాళ్లను నియమించి, ఇతరపారిశ్రామిక కృషికోసం ఎక్కువమంది కార్మికులను విడుదలచేసి, నూతన పరిశ్రమలను ప్రోత్సహించి, కార్మికులు వారిపైన ఆధారపడి యున్న స్త్రీలు, పిల్లలు, ముసలివాళ్ళు సుఖంగా జీవించేటందుకు వీలైన ఇతర కార్యకలాపాలకు ఎక్కువ అవకాశాలను కల్పించి, స్వయంచోదిత యంత్రోత్పత్తికి కావించే నిరంతర ప్రయత్నమువలన ఆ అవకాశం లభిస్తుంది.

"ఈ బహుమానాన్ని ప్రకటించడం, గాంధీ ఉద్యమము యొక్కయు, స్వయంచోదిత పారిశ్రామిక యంత్రాల అత్యధిక నిర్మాణమును నిరోధించే యావత్ప్రయత్నము యొక్కయు, ప్రధాన ఆర్థిక ప్రమాదాన్ని బహిరంగంగా ఒప్పుకోవడమే. భారతదేశము యొక్క పారిశ్రామిక సాంఘిక భవిష్యత్తుకు అది ఒక ఆశాజనకమైన చిహ్నం."

అదివరకే ఉన్న అభిప్రాయాల కనుకూలంగా చేసే వాదన కిది యొక తార్కాణరి. ఈ వ్యాస రచయిత 'గాంధీ ఉద్యమమ' ని అంటున్న దానికర్థం బహుశా నూలువడికే ఉద్యమమని. ఈయన ఆ ఉద్యమంలోని అంతరార్థమును గ్రహించడానికి తగిన శ్రద్ధ తీసుకోలేదనే మాట స్పష్టము. భారతదేశములోని లక్షలాది కుటీరములనుండి, అన్యాయము, అశాస్త్రీయము, క్రూరము అయిన పద్ధతుల ద్వారా తొలగింపబడిన నూలువడుకు వృత్తిని అక్కడ పునరుద్ధరించడమే ఆ ఉద్యమముయొక్క ఆశయం. అందరూ అవలంబింపగల ఈ అదనపు వృత్తిని పోగొట్టుకొన్న భారత కుటీరము లేదో ఒకవిధంగా, మరొకవృత్తిని పొంది ఉండినట్లయితే, ఈ ఉద్యమం ప్రారంభింపబడవలసి ఉండేదే కాదు. అదృష్టవశమున కానీ, దురదృష్టవశమున కానీ, మరొకవృత్తి కల్పింపబడలేదు. కాబట్టి, కుటీరములలో నూలువడకు పని రూపుమాసిపోయిన కారణాన, భారతదేశపు లక్షలాది కుటుంబములకు తటస్థించిన తీవ్రమైన ఆర్థికవిపత్తుకు తక్షణ పరిహారంగా, రాటమే శరణ్యమని, అన్ని ఉపా

యాలను పూర్తిగా తెలుసుకుని చూచిన గ్రామజీవిత పరిశీలకులు, కేవలం అవసరమును బట్టి నిర్ణయించక తప్పనిదికాదు. ఈ లక్షలాది ప్రజల కింతకంటె ఎక్కువ మంచివృత్తి లభించిన తక్షణం, వారు స్వేచ్ఛగా రాటమును వదలివేయవచ్చును. వారికి ఇంతకంటె ఎక్కువ మంచివృత్తి లభించడంచూచి నా కంటె ఎక్కువ సంతోషించేవారుండరు. మానవుడు ఊహించ గలిగినంతవరకు వారికి రాటంకంటె ఉత్తమమైన ఉపవృత్తి లభించే ఆశ కన్పించనట్లే ఈ ఉద్యమ నిర్మాతలు నిస్సందేహముగా భావిస్తున్నారు. పాశ్చాత్యదేశాలలోని బలమైన జాతులవారు ప్రపంచములోని దుర్బలజాతు లనబడే వారిని తమ స్వార్థంకోసం వినియోగించుకొనే ప్రస్తుత విధానం నిలిచిపోగానే—ఎప్పుడో ఒకసారది నిలిచిపోక తప్పదు. యావత్ప్రపంచమూ రాటం వైపుకు మరలి తీరాలని ఈ ఉద్యమనిర్మాతల నిజమైన విశ్వాసం. ఒకవేళ అటువంటి సంఘటన జరిగినా జరగకపోయినా, ఇంతేగాక పరాయి దేశాలను స్వార్థంకోసం వినియోగించుకొనే దేశంగా పరివర్తనం చెం , అందుకు క్రొత్తదేశాలను అన్వేషించనిదైనను, ఈనాడు ఇండియాలోకి విపరీతంగా ప్రవహిస్తున్న సరుకులను తప్పనిసరిగా అది స్వీకరిస్తూన్నట్లే స్వతంత్ర భారతదేశంకూడా తన సరుకులను ఎగుమతిచేసి పాశ్చాత్యదేశాలపైన బలవంతంగా రుద్దడానికి తగిన పరిస్థితులను పెంపొందించుకోని యెడలను, భారతదేశం తన ఆర్థిక దుస్థితిని తొలగించుకోవలెనంటే, జీవితమునకు ప్రధానావసరమైన ధాన్యమును తన పొలాలలో పండించుకొంటూన్నట్లే, అవసరమైన వస్త్రమును కూడా తన కుటీరములలోనే నిర్మించుకొని తీరాలి. కాబట్టి ఒక నిర్ణీత కాలంలో ప్రస్తుతమున్న రాటం ఫీజు తీయగలిగిన దానికంటె ఎక్కువ పరిమాణంగలనూలును

గానీ, ఎక్కువ సన్నని నూలును గానీ కుటీరవాసులు తమ కుటీరములలో తీసుకొనేందుకు వీలుకలిగించే రాటమునో యంత్రమునో కనిపెట్టవలెనని ప్రయత్నించడంలో చరఖోద్యమ నిర్మాతలు పరస్పరవిరుద్ధంగా ప్రవర్తించడం లేదు. గృహోపకరణములను అభివృద్ధి చేసే ఈ అభ్యుదయ విధానం అనాదినుండీ పరంపరాగతంగా వస్తూన్నదని ఈ వ్యాసకర్త గ్రహించవలసి ఉంది. తక్లీ రాటానికి చోటిచ్చింది. ఈనాటి రాటమే క్రమానుగతంగా మార్పులను పొందింది. వివిధ రాష్ట్రాలలో ఈనాడు పనిచేస్తూన్న వివిధరకాల రాటాలే ఇందుకు నిదర్శనం. రాటం మోటయిపోగానే అభివృద్ధి ఆకస్మికంగా ఆగిపోయినది. కాబట్టి ఈస్టిండియా కంపెనీవారి పన్నుగడలవలన అలా ఆకస్మికంగా ఆగిపోయిన విధానమును మాత్రమే అ.భా.చ.సం. కార్యవర్గం అనుసరిస్తూన్నది. అసలు నిజమేమిటంటే నేనుగానీ కార్యవర్గంవారుగానీ యంత్రాలున్నంతమాత్రాన అభ్యంతరము పెట్టము. కాని కుటీర పరిశ్రమలను చంపేటంతవరకూ పారిశ్రామిక యంత్రవిధానాన్ని అభివృద్ధిచేసి పరిమితరంగంలో వాటిని కేంద్రీకరింపచేయుడం తప్పని మా వినయపూర్వకమైన మనవి. భారతదేశము యొక్క సభ్యతకు గ్రామీణ జీవితమునకూ భంగంగా దానిని నగరీయం చెయడానికి వారు ప్రతికూలురు. "ఈ పోటీకి కావలసిన దాదాపు అన్ని అవసరాలను తీర్చగలిగిన యంత్రం, నూరు సంవత్సరాలకు వెనుకనే అమెరికాలో వాడుకలో నున్నట్లు 'టెక్స్టైల్ వరల్డు' లోని విలేఖకుడు ప్రకటిస్తూ ఉన్నాడు. 'ఈ దాదాపు' అనేమాట చీకాకు కలిగిస్తూన్నది. అమెరికాలో ఇప్పుడటువంటి యంత్రం ఉంటేనూ, అమెరికా దేశంలోని వస్తురచనా చతురుడెవ్వడైనా, పోటీకి కావలసిన

అన్ని లక్షణాలకూ తగినట్లు శ్రమపడి దానిని సిద్ధి కలిగినట్లయితేనూ, ఆయన చరఖా సంఘంవారు వాగ్దానం చేసిన బహుమానమును పొందడమే కాక లక్షలాది మూగ ప్రజానీకము యొక్క కృతజ్ఞతాభివందనములను కూడా అందుకో గలడు. ఒకవేళ అటువంటి యంత్రం కనిపెట్టడక పోయినప్పటికీ, బహుమానం పొందబడక పోయినప్పటికీ కూడా వడుకు ఉద్యమం ముందుకు సాగుతూనే ఉంటుందని కార్యకర్తలు గ్రహింతురు గాక. భారతదేశంలోని దాదాపు రెండువేల గ్రామాలలో కల లక్షా యాభై వేలమంది స్త్రీలనూ వారి ద్వారా అనేకమంది నేతవారినీ, చాకళ్లనూ, కుట్టుపనివారినీ, రంగు లద్దేవారినీ పోషించగలుగుతూ ఉన్నందుకు 'సంఘం' కృతార్థమైనట్లు భావిస్తూన్నది. ఏడు లక్షల గ్రామాలలో ప్రతి గ్రామానికీ పోయి, నేడు కట్టిక నిస్పృహ అధిరాజ్యం చేస్తూన్న కుటీరాలలో ఆశాకిరణమును ప్రసరింప చేయవలెనని 'సంఘం' వాంఛిస్తూన్నది.

—యంగ్ ఇండియా, 21-11-1929

# 108
# సైనిక కార్యక్రమము

జార్జి జోసెఫ్ నాకు ప్రియతమమైన సఖులలో ఒకరు. నేను యెరవాడలో విశ్రాంతి తీసుకొంటూ ఉండగా ఈయన యంగిండియా సంపాదకుడుగా ఉన్నారు. అంతకు పూర్వం నా ప్రోత్సాహంతో, ఇప్పుడు ఆగిపోయిన 'ఇండిపెండెంటు' కు ఆయన సంపాదకుడుగా ఉన్నారు. దేశం కోసం లాభప్రదమైన వృత్తిని ఆయన త్యజించారు. అందుకోసమే ఆయన జైలుకు కూడా వెళ్లారు. ఆయన నిజాయితీ పట్టుదల గల కార్యకర్త. కాబట్టి ఆయనను గౌరవపూర్వకంగా వినడం విధి. పైగా అటువంటి మనిషి, మీతో వేరై, పాత పద్ధతిని విడిచిపెట్టి నూతన పద్ధతిని అవలంబించడమును గూర్చి, క్రొత్తగా మతం మార్చుకొన్న వాని ఉత్సాహంతో సిఫారసు చేస్తూన్నప్పుడు ఆయనను మనం మరీ ఎక్కువగా వినవలసి ఉంది. జార్జి జోసెఫ్ ఆ పని చేసాడు. జార్జి జోసెఫ్ యొక్క నూతన విధాన ప్రకటనము గల పత్రికలోని కత్తిరింపునొకదానిని, ఆయన పాత సహచరులలో నొకరు నాకు పంపుతూ దానికి 'జార్జి జోసెఫ్ యొక్క మతాంగీకరణం' అని నామకరణం చేసాడు. జార్జి జోసెఫ్ యొక్క మరొక అజ్ఞాత ప్రశంసాకారుడు, ఖాదీ కార్యక్రమమును గూర్చి జార్జి జోసెఫ్ విమర్శ యావత్తుకూ నకలు వ్రాసి పంపినాడు. ఆయన చాలా సంక్షోభ స్థితిలో ఉన్నట్లు ఖాదీని గూర్చిన విమర్శను నేను గమనించి తీరవలెనని నిర్బంధిస్తున్నాడు.

సంక్షోభానికిగానీ, సంతాపానికిగానీ సంభ్రాంతానికిగానీ యేమీ కారణం లేదు. బ్రహ్మాండమైన జాతీయ పరివర్తనంలో పాత అభిప్రాయాలను నిజంగా త్యజించి కొత్తవాటిని ఉద్ఘాటించే మనుష్యులు లభించకపోవడం ఆశ్చర్యంగా ఉంటుంది. మార్పు అభ్యున్నతియొక్క గుణం. నిజాయితీ గల మనిషి మనస్సుకు యేదైనా తప్పని తోచినయెడల యంత్రంవలె ఆయన ఒకే తీరుగా ఉండలేడు. కాబట్టి జార్జి జోసెఫ్ యేమి చెప్తున్నాడో గ్రహించేటందుకు సహనంతో ప్రయత్నించాలి. అంతేకాక అది సహేతుకంగా ఉంటే మనకు ప్రియమైన ఆదర్శాన్ని త్యజించవలసి వచ్చినప్పటికీ కూడా దానిని ఆమోదించేటందుకు వెనుదీయకూడదు. ఆ భావంతోనే జోసెఫ్ ఉపన్యాసాన్ని పరిశీలింప ప్రయత్నించానని నేననుకుంటున్నాను. ఆయన ఖాదీని నిరసిస్తున్నాడు. 'అస్పృశ్యతా నివారణ ప్రధానంగా రాజనీతి సమస్య కాకపోయినందుకు ఆయన చాలా సంతోషిస్తున్నాడు.' ఆయన కార్యక్రమమంతా ఒక చిన్న వాక్యంలో 'ఇండియాను సైనికంగా తయారు చెయ్యి' అని. ఆయన ఉపన్యాస భాగమిది:

"మనమంతా సైనికులం కావాలను. జనకంపతికి కావలసిన చోటుకూడా లేదు. ఈ రాజధానిలోనున్న పట్టణాలనుంచి ప్రతి సంవత్సరమూ 5,000 మందికి శిక్షణ ఇయ్యవలెననే అభిప్రాయంతో మనం ప్రారంభించవచ్చును. వారు వారానికి రెండు మూడు పర్యాయములు డ్రిల్లుకు వెళ్తారు. యేడాదిలో మూడు వారాలపాటు బయటి క్యాంపుకు వెళ్తారు. అట్టి శిక్షణ కళాశాలా విద్యార్థులకేకాక, సాంఘికంగానూ విద్యావిషయికంగానూ, తగినంత స్థితిగలవారికి కూడా అందుబాటులో ఉండాలి. అందుకు కావలసిన విద్యాప్రమాణం, యస్.యస్.యల్.సి. ప్రతి వీధిలోనూ అటువంటి మనుష్యులు

పోతూండడం చూసే మన జీవితంలో ఒక నూతన తత్వం కలగుతుంది. ఈ రకపు శిక్షణ ప్రజలను తిన్నగా నిలబడేటట్లు, సవ్యంగా ఆలోచించేటట్లు, సూటిగా మాట్లాడేటట్లు చేస్తుంది. అది మన జీవితానికి మిక్కిలి శోభస్కరంగా ఉంటుంది."

నా అనుభవం నాకు వేఱుగా చెపుతూన్నది. ఖాకీ దుస్తులలో ఉన్నవారు తిన్నగా నిలబడడానికి బదులుగా మురుగు కాలవలలో దొర్లుతూండడం నేనెఱుగుదును. వంకరగా ఆలోచిస్తూ సూటిగా మాట్లాడకుండా చెత్త మాట్లాడిన ఒక డయ్యరును నేనెఱుగుదును. సవ్యంగా ఆలోచించడం మాట అలా ఉండగా ఆలోచించడమే చేతకాని ఒక సర్వసైన్యాధ్యక్షపతిని నేనెఱుగుదును. సైనిక శిక్షణను గూర్చి ఎక్కువ ఆసక్తిగలవారు అన్ని విధాలా దాని పొందవచ్చును. కాని దానినొక నూతన నిర్మాణ కార్యక్రమంగా సూచించడం మాత్రం, ఓర్పు లేమినీ దుడుకు ఆలోచననూ తెలియచేస్తుంది. ఈ 'నూతన కార్యక్రమం' భారత భూమిలో వేళ్లు పాదుకొనే అపాయం అంతగా లేదు. పైగా సంగ్రామ దేవతను గూర్చి కసుగ చెందిన పాశ్చాత్య దేశాలలో ఆచరణలోకి వస్తూన్న నూతన వ్యవస్థా సంప్రదాయములకు కూడా యిది ప్రతికూలము! పాశ్చాత్య దేశాలలోని సైనిక తత్వం మనిషిలోని మానవత్వమును చంపి అతనిని పశుతుల్యునిగా నీచస్థితికి తెస్తుంది. ఏది కావలెనో, ఇంతకు పూర్వం కలలో కూడా అనుకోనంత ఎక్కువగా ఇండియా దేనిని నేర్చుకొన్నదో, అదే నిరాయుధ నిరోధక తత్వం. దానిముందు బయొనెట్టు తుప్పు పట్టిపోతుంది. తుపాకి మందు మన్నవుతుంది. దుందుభి ధ్వానములతో సాయుధ ప్రభుత్వం అల్ప సంఖ్యాకులను తన యిష్టప్రకారం లొంగదీసుకొనే దృశ్యాన్ని జోసెఫ్ మనకు

ప్రత్యక్షం చేస్తున్నాడు. అది ప్రజాస్వామిక తత్వమునకూ, అభ్యున్నతికీ కూడా ప్రతికూలం. నూతన కార్యక్రమం మనకీయబోయేది అదే అయితే మనకు సాయుధ నిర్బంధం యిప్పుడున్నదనే ఉంది. నిజానికది అల్ప సంఖ్యాకులను గూర్చికూడా కాదు అత్యధిక సంఖ్యాకులను గూర్చి. అల్ప సంఖ్యాకులను కూడా నిర్బంధించడంపైన ఆధారపడిన ప్రభుత్వం కాదు మనం కోరుతున్నది. వారి భావప్రవర్తనంపైన ఆధారపడిన ప్రభుత్వమును మనం కోరుతొన్నట్లు నా తలంపు. అది తెల్ల సైనిక పరిపాలననుండి నల్ల సైనిక పరిపాలనకు మార్పయినట్లయితే దానమింత హంగామా చేయనక్కరలేదు. ఏది ఎలా ఉన్నా అప్పుడుకూడా ప్రజా సామాన్యం లెక్కలోకి రాదు. ఇంతకంటె హీనంగా కాకపోయినా, ఇప్పటికివలెనే అప్పుడుకూడా వారు దోపిడికి గురి అవుతారు. జార్జి జోసెఫ్ తన దుందుడుకుతనాన్ని దూరం చేసుకొన్నప్పుడు, ఆయన తన పొరపాటును దిద్దుకొని చక్కని ప్రజాస్వామ్యవాదిగా పరివర్తనం పొందగల ఋజువర్తనుడుగా 1919 లో మద్రాసు బీచిమీద మేకలేని సంతోషంతో నేనాయనను మొట్టమొదట కలుసుకొన్నప్పుడే తెలుసుకొన్నాను.

ఇక ఆయన ఖాదీని గూర్చి ఏమి చెపుతున్నాడో చూదాం:

"నేను కాంగ్రెసులో ఉన్నంత కాలమూ నిర్మాణకార్యక్రమమంటే ఖద్దరు, అస్పృశ్యతానివారణము, తరువాత కొన్ని సంవత్సరాలకు మద్యపాననిషేధంగా ఉండేవి. వీటిలో ఏ ఒక్కటీ కూడా ఈ జాతికి కావలసిన ప్రధానవసరము యొక్క పునాదికి పోవడం లేదని నా దృఢ నిశ్చయమైనట్లు మీకు స్పష్టంగా చెప్పవలసి ఉంది. ఖద్దరు సంగతి సరే సరి. ఈ ఉద్యమానికి మూల పురుషుడైన గాంధీజీ జీవించి ఉన్నంత

కాలము కూడా అది జీవించదని నా అభిప్రాయం. ఖద్దరుకు సంబంధించిన ప్రధాన ఆర్థిక లోపమువలననే నేనా నిర్ణయమునకు వచ్చాను. దానిని ఉత్పత్తి చేయడానికికానీ కొనడానికికానీ చాలా ఖరీదవుతుంది. అందువల్ల ఖద్దరు వాడేవారికి అన్యాయం కలుగుతుంది. గజం 1 కి ఒక రూపాయి విలువగల ఖద్దరు, గజం ఆరణాలు ఖరీదుగల మిల్లు బట్ట ముందు ఎందుకూ పనికిరాదు. ఖద్దరు ఉత్పత్తి చేసినవారికికూడా అన్యాయమే జరుగుతుందని ఖద్దరును గూర్చి నా అనుభవం. ఖద్దరుకు ఆధారభూతులైన స్త్రీలు, నూలువడికేవారు రోజుకు పది గంటలు పనిచేసి మూడణాల మజూరీతో సంతృప్తిపడి ఊరుకోవాలి. ముఖ్యోత్పత్తిదారుకు మూడణాల మజూరీపైన ఆధారపడిన పరిశ్రమ, కొనసాగదని నేను సూచిస్తూన్నాను. ఎందుకనగా అది కేవలం శ్రమజీవులను వృథా కష్టపెట్టడమవుతుంది. శ్రమజీవులను వృథా కష్టపెట్టడమంటే, ముఖ్యంగా కూలిమనిషి శరీరధారణకు కావలసినదానికంటె కూడ తక్కువ కూలి ఇయ్యడం. దేశం కటువుతో కష్టపడుతూన్నదనీ, పనిలేని ప్రజలు లక్షల కొలదీ ఉన్నారనీ, వారికి అసలు లేనిదానికంటె ఈ మూడణాలయినా ఉత్తమమేననీ వాదించడంవలన ప్రయోజనం లేదు. ఆ వాదాన్ని నేనంగీకరించజాలను. కూలీలతో పనిచేయించుకొనే మానవమాత్రుడైన యజమానికిగానీ, తన దేశ వ్యవహారములను గూర్చి అభ్యుదయ దృక్పథంగల యే రాజకీయజ్ఞునకుగానీ ఆ వాదం నచ్చదు. కూలి మనిషి కుటుంబానికి సరిపోదు సరిగదా ఆమె పోషణకు కూడా అర్థికావసరాలను బట్టి చాలదని నాకు తెలిసి ఉన్నప్పుడు మూడణాలీయడం ఉచితంగానే ఉంటుందని చెప్పినంతమాత్రంతో నాకు శాంతికలుగదు. ఖద్దరులోని ఆ అవగుణం నా దృష్టి ప్రకారం [illegible] నిర్మూలించడానికి వీలులేనిది. నిర్దయాపూర్వకమైనది. అందువల్లనే గాంధీజీ పదెనిమిది సంవత్సరాల నుండి కృషి చేస్తూన్నప్పటికీ, ఆ పరిశ్రమను సక్రమంగా యేర్పాటు చేయడానికి లక్షలకొలదీ రూపాయిలను నీటిని వాడినట్లు వాడినప్పటికీ, పరిష్కరించవలసిన ఆ సమస్యయొక్క మహత్తర వైశాల్యమును బట్టి పోల్చిచూచినయెడల—అనగా యావద్భారతమునకూ కావలసిన బట్టను ఉత్పత్తిచేసి, యేటేటా దిగుమతి అయ్యే 60 కోట్ల రూపాయిల బట్టను ఆపివేయడమనే సమస్యతో పోల్చి చూచినయెడల నేడు ఉత్పత్తి అవుతూన్న ఖద్దరు పరమాణు ప్రమాణం మాత్రమే.''

సంహరణమును వెంటనే తీసుకొని రావలెననే తొందరలో జార్జి జోసెఫ్‌కు మఱుపు వస్తూన్నది. ఖాదీని

వెంటనే తోసిపారవేయవలెననడానికి బలంగా ఆయన యేమీ కొత్తవాదం చెప్పడం లేదు. ఆయన ఇంతకుపూర్వ- వేటిని మిథ్యావాదాలని కొట్టివేస్తూవచ్చాడో వాటినే పరమ సత్యాలుగా ఉదాహరిస్తున్నాడు. పునరాలోచన చేసిన పిమ్మట వాదాలను మార్చుకోవచ్చును. కాని అబద్ధాలని రుజువయ్యేటంతవరకు అసలు విషయాలను మాత్రం మార్చుకోవడానికి వీలు లేదు. లక్షలాది ప్రజానీక కోసం ఉద్దేశింపబడిన ఖాదీ విదేశీ బట్టకంటె ఎక్కువ ఖరీదు కాదు. ఎందువల్లనంటే లక్షలాది ప్రజలు ఖాదీని ఉపయోగించవలెనంటే, వారే ఉత్పత్తిదారులుగానూ వినియోజకులు (consumers) గానూ కూడా ఉండాలి. లక్షలాది గృహములలోని ప్రజలు తమ అన్నమును తాము వండుకొని భుజిస్తూన్నట్లే, పార్డోలిలోనూ, బిజోలియాలోనూ, ఇంకా అనేక స్థలాలలోకూడా, ఖాదీ ఉత్పత్తి చేయబడి వినియోగింపబడుతూన్నదని ఈ పుటలు నిరూపించి ఉన్నవి. నేడే కొంది ఫ్యాక్టరీలలోనో తయారైన రొట్టెగానీ అన్నంగానీ, లక్షలాది ఇళ్లలో వండబడినదానికంటే, నాణెముల దృష్టితో చూచేయెడల తక్కువ ఖరీదు కాగలదని రుజువు చేయడానికవకాశముంది. అందువలన లక్షలాది ప్రజలు వంటలు చేసుకోవడం మానుకొని వండిపెట్టడానికి వారి బియ్యాన్నీ గోధుమలనూ కేంద్ర యంత్రాలకు పంపవలసిందని యెవ్వరూ ధైర్యంగా సూచించరు.

ఇక నూలు వడికే స్త్రీలు రోజుకు పది గంటలు పని చేస్తారనే మాట కూడా నిజం కాదు, వారే మాత్రం వడికినా వారి తీరిక సమయంలోనే వడకుతారు. వారికి వచ్చేది రోజు కూలి కాదు. కాని ఎక్కువ సందర్భాలలో,

వారు రోజూ చేసుకొనే పనివలన వచ్చే ఆదాయు తోడు, వడుకువల్ల వచ్చేది అదనపు ఆదాగా ఉంటుంది. వడుకుట వలన సంపాదించడం పారుపోయేదానిని భాగ్యంగా మార్చడం. అంతేగాని జార్జి జోసెఫ్ చెపుతూన్నట్లు 'చెమట వోడ్చి చేసిన శ్రమకు' ఖరీదు కాదు. నూలు వడికే మనిషి రోజుకు పది గంటలు పని చేసినప్పటికీ, రోజుకు మూడు అణాలు సంపాదించలేదని నేను జార్జి జోసెఫ్‌కు చెప్పవలసి ఉంది. నూలు వడకడం రోజంతా చేయవలసిన పనిగా ఎప్పుడూ భావింపబడలేదు. అంతేకాక 'ఈ పరిశ్రమయొక్క నిర్మాణంలో లక్షలాది రూపాయిలు నీళ్లు కుమ్మరించినట్లు కుమ్మరింపబడినవనడం' నిజమైన మాట కాదు. దేశపు యెత్తు మీద నిర్మింపబడిన యే సంస్థకూ ఈ సంస్థా నిర్మాణంలో అయిన ఖర్చుకంటె తక్కువ ఖర్చయినట్లు తెలియరాదు. వేలకొలది ఎండిపోయిన పెదవులకు నీరందిస్తూ దిన దిన ప్రవర్ధమానమవుతూన్న ఈ పెద్ద కుటీరపరిశ్రమను స్థాపించేటందుకు కొద్దిగా 25 లక్షల రూపాయిల మూలధనంతో పెట్టుబడి పెట్టిన మాట మాత్రం నిజం. 1,500 గ్రామాలలో హృదయపూర్వకంగా పని చేసే కనీసం 1,500 మంది పనివాళ్లను నియమించుకొన్న సంస్థ, దాదాపు 150,000 మంది స్త్రీలకు నిత్యమూ సహాయం చేస్తూన్న సంస్థ, ఒక మిథుబాయి పెటిట్, నౌరోజీ సోదరీమణులు, ఒక బాంకర్, ఒక జమన్లాలాల్, ఒక రాజగోపాలాచారి, ఒక అబ్బాస్ త్యాబ్జి, ఒక వెంకటప్పయ్య, ఒక పట్టాభి, ఒక గంగాధర రావు, ఒక వల్లభభాయి, ఒక లక్ష్మీదాస్, ఒక రాజేంద్ర ప్రసాద్, ఒక జయరాందాస్, ఒక మహాదేవు, ఒక కృపలానీ, ఒక సతీశ్ చంద్ర దాస్ గుప్తా, ఒక సురేశ్ బెనర్జీ, అంతేనా

ఒక జవహర్‌లాల్, ఇంకా తదితరులనేకమంది, లాయర్లు, డాక్టర్లు, వర్తకులు ఇంకా తదితర వృత్తులవారనేకులు, సుప్రసిద్ధులైనప్పటికీ పేర్కొనడానికి వీలులేనంతమంది అను ఖ్యాతిగల స్వార్థత్యాగ కృషిని కోరగొంటూన్న సంస్థ, ఒకరు మనిషి 'మరణించగానే మృతిపొందుతుందని, జోశ్యం చెప్పడంవలన జోసెఫ్ తన దేశస్థులను చాలా చులకనగా భావిస్తూండి ఉండాలి. నేను చనిపోయిన మరునాడు ఖాదీ "ఒక పెద్ద తప్పిద!" మని ఈ స్త్రీ పురుషులందఱూ అనుకొంటే అది ఒక విషాదకరమైన అద్భుత విషయం.

ఇక దీనంతటిలోకి విచారకరమైన విషయమేమిటంటే జోసెఫ్ మార్గాంతరాన్ని దేనిని సూచించలేదు. ప్రతి భారతీయ విద్యావంతుడూ ఖాకీ ధరించి తిన్నగా తుపాకి కాల్చడం నేర్చుకొన్నప్పటికీ, ప్రత్యేక కార్యక్రమమొకటి అందుకొఱకు యేర్పాటు చేయబడితేనే తప్ప, పెరిగిపోతూన్న పేదరికపు సమస్యకాని, లక్షలాది కర్షకులకు నిర్బంధంగా కొంతవరకు తటస్థిస్తూన్న నిరుద్యోగ సమస్యకానీ పరిష్కరింపబడదు. ఖాదీకంటె ఉత్తమమయినది కనిపెట్టబడేటంత వరకు, మంచికో చెడ్డకో అదే కార్యక్రమం.

—యంగ్ ఇండియా, 19-12-1929

# 109

# పెట్టుబడిదారుల కర్తవ్యం

ఇటీవల మహారాష్ట్ర వర్తకుల మహాసభకు (షోలాపురం) అధ్యక్షత వహిస్తూ శ్రీ ఘనశ్యామదాసు బిర్లా యిచ్చిన ఉపన్యాసం, ఆయన అభిప్రాయ ప్రకటనా స్వాతంత్ర్యమును గమనించతగినట్లున్నది. రక్షణ విషయంలో ఆయన ఇంగ్లాండు దేశపు బట్టకు, తదితర విదేశపు బట్టలకు భేదం పాటించడం లేదు. ఆయన ఇలా అన్నాడు:

"పత్తి పరిశ్రమయొక్క క్షేమంకోసమయి ప్రతికీ కూడా పక్షపాత సిద్ధాంతంమీద ఆధారపడిన యే పన్నున్నూ దేశం సహించదనీ, వస్తువుల ఆంచనా విలువను బట్టి, ఎక్కువ సమంగా ఉండేటట్లు రక్షణ పన్ను విధింపబడడం ముఖ్యావసరమనీ నేను ప్రభుత్వానికి చెప్పదలచుకొన్నాను. బొంబాయి పత్తి పరిశ్రమకు ఎక్కువ చౌక సరుకుల దిగుమతినుండియే గాక, ఎక్కువ నాజూకు సరుకుల దిగుమతినుండి కూడా రక్షణ ఆవసరమని నా అభిప్రాయము."

పెట్టుబడిదారుల కర్తవ్యమును గూర్చి మాట్లాడుతూ ప కాశ్మీక నాయకునకుగానీ అంతకంటె అభివృద్ధి చేయడం కష్టమనిపించే ఆదర్శాన్ని ప్రతిపాదించాడాయన. వర్తకులలో ఐకమత్యం ఉండవలెనని ప్రబోధిస్తూ ఆయన ఇలా అన్నాడు:

"వర్తకులకు నేను సూచించే ఐకమత్యం సేవకోసంకాని స్వార్థం కోసంకాదని స్పష్టంగా చెప్పవలసి ఉంది. ప్రస్తుత పెట్టుబడిదారిటీవల చాలా నిందాపాత్రుడవుతున్నాడు. నిజానికాయన ఒక ప్రత్యేక వర్గమునకు చెందిన మనిషిగా చూడబడుతున్నాడు. కాని పూర్వ కాలంలో పరిస్థితి చాలా వేరుగా ఉండేది. పూర్వకాలంనాటి వైశ్యుని కర్తవ్యములను మనం పరిశీలించినట్లయితే, ఉత్పత్తి పంపకము, ఈ

పనులు రెండూ స్వలాభంకోసంగాక సమష్టి క్షేమంకోసం ఆయనకు ప్రత్యేకించబడినట్లు కనబడుతుంది. ఆయన కూడబెట్టిన ఐశ్వర్యం యావత్తూ జాతికి ధర్మకర్తగా మాత్రమే ఆయన ఉంచుకొన్నాడు. పెట్టుబడిదారులు తమ నిజమైన కర్తవ్యమును నిర్వర్తించవలెనంటే స్వార్థపరులుగాక సంఘసేవకులుగా మాత్రమే ఉండాలి. మనము మన ధర్మాన్ని తెలుసుకొని నిర్వహించే యెడల కమ్యూనిజంగానీ బోల్షివిజంగానీ పెచ్చు పెరుగదు. మన కర్తవ్యాన్ని మనము నిర్వహించక వెనుకకు నెట్టి వేయడం ద్వారా మనమే కమ్యూనిజముగానీ బోల్షివిజముగానీ అభివృద్ధి కావడానికి తగిన సారవంతమైన భూమిని యేర్పాటు చేశామని చెప్పవలసి ఉంది. మన కర్తవ్యాన్ని మనం తెలుసుకొని సక్రమంగా దానిని అనుసరించినట్లయితే, ఎన్నో చెడుగులనుండి సమాజాన్ని రక్షించగలమని నేను నిశ్చయంగా చెప్పగలను. ఉత్పత్తి చేయడం పంపకం చేయడం మన నిజమైన కర్తవ్యములుగా నేను పేర్కొన్నాను.........సమాజము యొక్క క్షేమంకోసం మనం ఉత్పత్తిచేసి పంపిణీ చేతుముగాక. అవసరమయితే ప్రజాక్షేమంకోసం త్యాగంచేసేటందుకు మనం సిద్ధంగా ఉండి జీవించాలి.”

—యంగ్ ఇండియా, 19-12-1929

# 110

# సమగ్ర నూతన నిర్వచనము

నా అభిప్రాయాన్ని వివరంగా చెప్పనీయండి. సామ్రాజ్యవస్తు పక్షపాతంతో పాటు మిల్లు పరిశ్రమకుకూడా రక్షణ కావలెననే ప్రతిపాదన ఉంది. ముఖ్యంగా, రౌండు టేబిల్ మహాసభ సందర్భంలో అధినివేశ ప్రతిపత్తి అనే మాట ముడిపెట్టబడుతూన్నప్పుడు ఈ ప్రతిపాదన ఒక అపాయకరమైన బోనని చెబుతున్నాను. ఇక అధినివేశ ప్రతిపత్తిని గానీ లేక స్వాతంత్ర్యాన్ని గానీ ప్రసాదించేటందుకు ఎల్లప్పుడూ బ్రిటిష్ వస్త్రములయెడల పక్షపాతం చూపించి తీరవలెననే షరతు పెట్టబడినచో, లక్షలాది ప్రజలకుగానీ, దేశీయ మిల్లులకుగానీ, అధినివేశ ప్రతిపత్తి అన్నా, లేక స్వాతంత్ర్యం అన్నా అర్థం కనిపించదు. భారతదేశము తన సరిహద్దులలో తనకు కావలసిన సరుకులను పూర్తిగా ఉత్పత్తి చేసుకోగలిగిన నాడు, బ్రిటిష్ వస్తువులయెడల పక్షపాతం చూపడమనేది ఉండనే ఉండదు; తాను విదేశ వ్యాపారం విషయంలో ఇతరులతో పాల్గొనవచ్చును. తనకు తాను నిర్వహించుకోగలిగినంతవరకు ఆంతరంగిక వ్యాపార విషయంలో ఇతరులతో అది పాల్గొనడానికి ధైర్యంచేయదు. మిత్రదేశమయిన ఇంగ్లాండుకుగానీ, తదితర మిత్ర రాజ్యాలకుగానీ ప్రతికూలంగా సైతం, అభివృద్ధి పొందుతూన్న తన

పరిశ్రమలను కాపాడుకోవడానికి ఇండియాకు నిజంగా హక్కు కలదు. అది ఆమె కర్తవ్యం కూడా. తమకోసం పన్నబడిన ఈ బోనులో మిల్లు యజమానులు పడిపోవడం ప్రమాదం కావడమేగాక దేశ ద్రోహంకూడా అవుతుంది. తత్కారణ విదేశీ వస్త్రములన్నిటికీ ప్రతికూలంగా వారు విశేషపు పన్నును పొందగలిగినప్పటికీ బ్రిటిష్ వస్త్రములకోసం యేర్పడిన సామ్రాజ్యవస్తు పక్షపాత ప్రసక్తిని వారు గట్టిగా ఎదిరించాలి. *

—యంగ్ ఇండియా, 12-3-1930

* 'సమగ్ర నూతన నిర్వచనము' అనే వ్యాసమునుండి.

# 111

# మన మిల్లులు, విదేశ వస్త్ర బహిష్కారము

విదేశ వస్త్ర బహిష్కారోద్దేశమును, అది జయప్రదం కావడానికి కావలసిన షరతులను, మనం ప్రయత్నపూర్వకంగా గ్రహించి మన కర్తవ్యమును నిర్వహించగలిగేయెడల అది రానే వస్తూన్నది. ఈ కింది ప్రతిపాదనలకు కారణాలను ప్రస్తుతం నేను చెప్పనక్కరలేదు. ఈ పత్రికలో అనేక పర్యాయములా వాదములు చేయబడినవే. తిరిగీ ప్రకటించేటందుకా అంకెలను తయారు చేసుకొంటున్నాను కాని కావలెనని కోరేవారికి ప్రస్తుతం నా నిర్ణయాలను మాత్రం ప్రకటిస్తున్నాను. అనుకూలంగానీ ప్రతికూలంగానీ ప్రతి వాదాన్నీ, ప్రతి విషయాన్నీ సమగ్రంగా ఆలోచించిన పిమ్మట నిష్పక్షపాతంగా చేయబడిన నిర్ణయాలవి.

1. పూర్తి బహిష్కారంవలన తటస్థించబోయే లోటును, అది ఫలప్రదం కాగలదని మనం భావిస్తూన్న వ్యవధిలో, దేశీయ మిల్లులు భర్తీ చేయగలగడం అసంభవం.

2. భారత దేశంలో ఉన్న మిల్లులన్నీ స్వదేశీ కావు; దేశముయొక్క ఐశ్వర్యాన్ని కొలగొట్టే విదేశీ ప్రభుత్వం వలెనే, వాటిలో కొన్ని విదేశీ. అవి కేవలం యూరోపియనుల సొంత సొత్తు. వారు భారత కార్మికులను మాత్రం నియోగిస్తూంటారు.

3. స్వదేశీ మిల్లులలో అధిక సంఖ్య, పూర్తిగా కాకపోయినా, ఎక్కువగానైనా జాతీయ క్షేమంకోసం పని చేయవు.

4. ఒక వేళ అవి అలా చేసెయెడల, ప్రభుత్వం వారనేక విధాల వాటిని నలిపివేయగలరు.

5. అధిక సంఖ్యాక మిల్లులు ప్రస్తుత అనుకూల సమయాన్ని స్వార్థంకోసం వినియోగించుకోవలెననే లోభ ప్రవృత్తిని ఆపుకోలేవు.

6. చాలా మిల్లులు నేతలో ముఖ్యంగా అంచులకోసం విదేశీ నూలును వినియోగిస్తవి.

7. బహిష్కరింపబడిన బట్టను భర్తీ చేసేటందుకు మనం వారిమీద ఆధారపడక, వారి సాధన సామగ్రిపైనా వారి నిపుణతపైనా వారిని నిలబెడుతూ మాత్రమే మనం వారిని ఉపయోగించుకోవాలి.

8. చివరి పనిని మనం నిర్వర్తించవలెనంటే బహిష్కరింపబడిన బట్టను, మన మిల్లులలో తయారైన బట్ట ద్వారా కాకుండా భర్తీ చేయాలి. కాబట్టి ఆ పని ఖాదీ ద్వారానే జరుగగలదు.

9. ఖాదీ తత్వాన్ని, దానిని ఉత్పత్తి చేయవలెననే కోరికను మనం సృజించగలిగినట్లయితే, యెంతమాత్రమూ కష్టము లేకుండా ఒక మాసములోగానే, అతుని ఖాదీ ఉత్పత్తి చేయబడేటందుకు వీలుంది

10. నైపుణ్యంగల నేతపనివారు ఇండియా అంతటా ఉన్నారు. కాబట్టి వడకడమును గూర్చినదొకటే సమస్య.

11. శ్రద్ధ ఉండి శ్రమ చేయగలిగే ఇష్టమున్నవారు నూలు వడకుటను దానిముందు కార్యకలాపములనూ ఒక వారంలోగానే నేర్చుకోగలరు.

**12.** ఇండియా తనకు కావలసినదానికంటె ఎక్కువ పత్తినే ఉత్పత్తి చేసుకొంటూన్నది.

13. కాబట్టి విదేశీ వస్త్ర బహిష్కారమునకు పనిచేసే వారందరూ వడుకుట ద్వారా ఖాదీ ఉత్పత్తిమీద తమ దృష్టిని కేంద్రీకరించాలి. ఇందువల్ల స్వదేశీ మిల్లు బట్టను బహిష్కరించవలెనని అర్థంకాదు. మిల్లులు తమ బట్టను విక్రయించుకోవడానికి ఏమీ శ్రమ పడనక్కరలేదనే విషయం తెలివిగా గుర్తింపబడినదని మాత్రమే అర్థం. విదేశీ వస్త్రాలు రాట్నాన్ని తొక్కివేసినట్లే మిల్లులతో కూడా పోటీచేసి వాటి కంఠం నులిమివేయకుండా, బహిష్కారోద్యమం వాటిని తొలగించి మిల్లులకు చాలా సహాయం చేస్తూన్నది. విదేశీ వస్త్ర బహిష్కారమును సాధించడంకంటె ఎక్కువ మిల్లులకు సహాయం చేయడమంటే, ఖాదీకి కీడు చేయడమే.

మిల్లు యజమానులకు ఇష్టమైతే, భారతీయుల సొంతమై, వారి ఆధిపత్యంకిందనూ పరిపాలనకిందనూ ఉంటూ నేతలో ఎంతమాత్రమూ విదేశీ నూలును వాడనట్టిన్నీ, ఖాదీతో సరిపోల్పతగిన బట్టను తయారుచేయనట్టిన్నీ, వారి చీట్లపైన ఖాదీ అనే పేరునుగానీ చర్ఖానుగానీ వాడనట్టి, ఖరీదులను పెంచనట్టిన్నీ మిల్లుల జాబితాను ప్రకటించి ఖాదీ ద్వారా బహిష్కారోద్యమమునకు తోడ్పడవచ్చును.

సొంతంగా వడకడం ద్వారాగానీ, వడికేవారిని సేకరించడంద్వారాగానీ ఖాదీ ఉత్పత్తికి దోహదం చేయవలసిందని బహిష్కర్తలను ప్రోత్సహించకుండా వట్టి బహిష్కార ప్రచారం చేసేవారున్నూ, స్వదేశీనిగూర్చి బాధ్యత లేకుండా మాట్లాడేవారున్నూ, బహిష్కారోద్యమానికి స్పష్టంగా హానిచేయకపోయినా, దాని అభివృద్ధికి మాత్రం ఆటంకం

కలిగిస్తున్నారని నా విశ్వాసం. ప్రస్తుతం కావలసినంత ఖాదీని సరఫరా చేయ లేకపోయినప్పటికీ, బహిష్కారవాదులు తమ పంథాను విడిచి పోకూడదు ఖాదీ ఉత్పత్తికి ఇదే మంచి అనుకూలసమయమని వారు గుర్తించా అవస రాన్ని బట్టి ఆలోచనలు స్ఫురిస్తూంటవి. అవసరానికొక సిద్ధాంతమంటూ లేదు. అదే కొత్త సిద్ధాంతాలను సృజి స్తుంది. నూలు ఎడకపలసిందని కూడా కోరబడినయెడల ప్రజలు విదేశీ బట్టలను విడిచిపెట్టడానికి ష్టపడనిచో అందు కోసం వారాందోళన పడనక్కరలేదు. ఈ నిర్బంధం నిజంగా బహిష్కారోద్యమాన్ని ముందుకు నడిపిస్తుంది. ఇది శిక్షా సిద్ధాంతం కాదు. మనం స్వరాజ్యం కోరడం ఆంగ్లే యులను శిక్షించడానికి కాదు. స్వరాజ్యం లేకుండా మనం జీవించ లేము కనుక కోరుతున్నాము. అలాగే విదేశీ వస్త్ర బహిష్కారమును కూడా ఆంగ్లేయులను శిక్షించేటందుకు కాక, వస్తువు పడుకొంటూన్న లక్షలాది ప్రజలకు రాటం ద్వారా పని కల్పించి ఆహారమిచ్చేటందుకు మనం కోరు తున్నాము.

—యంగ్ ఇండియా, 24-4-1930

# 112

## విదేశీ బట్టల వర్తకులు

విదేశీ వస్త్ర బహిష్కారమునుగూర్చి నా అభిప్రాయము పత్రికా ప్రతినిధులకు తెలియజేసి ఉన్నాను. వర్తకుల పిరికితనం దేశంలో వారికి విశ్వాసం లేకపోవడమునకు చిహ్నం. సన్నిహిత భవిష్యత్తులో స్వరాజ్యం వస్తున్నదనే నమ్మకం వారికి ఉంటే షరతులనుగానీ వ్యవధినిగానీ ఎందుకు కోరాలి? ఏ షరతులూ లేకుండావచ్చి వారు దానిని ఇంకా ఎక్కువ నిశ్చయమయ్యేటట్లు ఎందుకు చేయకూడదు? ఈ అనిశ్చయం యావత్తూ, స్వరాజ్య వాతావరణాన్ని బలిష్ఠం చేయడానికి బదులు దానిని దుర్బలంచేసి ప్రజల మనస్సులకు అనుమానాలు పుట్టిస్తుంది. ఈ ఉద్యమం చాలా వరకు విశ్వాసంపైన ఆధారపడి ఉంది. స్వరాజ్యానికి సహజంగా మనను అనర్హులుగా చేసే ప్రత్యేక స్వభావమేమీ మనకడ లేదు. 31 కోట్ల మందిగల మన జాతిని మన భ్రమయే నిస్సహాయంగానూ, నిర్వీర్యంగానూ చేస్తున్నది. విదేశీ బట్టల వర్తకులు సందిగ్ధమైన ప్రకటనల ద్వారా ఆ భ్రమనింకా బలిష్ఠం చేయకుందురు గాక. ముందు వారా భ్రమనుండి బయటపడి తక్కినవారిని కూడా బయటపడేటట్లు చేయాలి. వారలా చేయజాలని యెడల, షరతులను కోరక తమ విదేశీ వస్త్ర వ్యాపారమును ఆపబోవడ లేదని ధైర్యంగా చెప్పాలి.

నమ్మకం లేని దుర్బలుల కోసం నేనొక స్పష్టమైన సూచన చేస్తున్నాను. ఇంతవరకు సరుకు పంపబడని ఆర్డర్లన్నిటినీ

వారు రద్దుచేసుకోవాలి. స్వరాజ్యం రాక, తమ పాత వ్యాపారం తమకు చూచుకోదలచుకొనేయెడల ఎవ్వరూ వారిని ఆపజాలరు. ప్రస్తుతం ఉన్న సరుకును వారు విదేశాలలో అమ్మగలిగితే తప్ప లేనియెడల గదిలో పెట్టి తాళం వేయాలి. వారిలో పేదలు, అవసరమైన నష్టపరిహారమును పొందేటందుకు స్వరాజ్య ప్రభుత్వంపైన ఆధారపడాలి. అయితే వారి సరుకంతా జాబితా వ్రాసి అధికారంగల వాలంటీర్ల వల్ల ధ్రువ పత్రములను పొందాలి. భాగ్యవంతులైన వర్తకులు ఏ విధమైన నష్టపరిహారమును ఆశించకూడదు. వారికి వచ్చే నష్టం, దేశమునెడల వారు చేసిన పాపమునకు కొంత వరకు ప్రాయశ్చిత్తంగా ఉంటుంది. చెడ్డసూచన ఐనప్పటికీ చివరకొక సూచన చేస్తున్నాను. దేశం స్వరాజ్యం సంపాదించుకోగలుగుతుందనే నమ్మకం వారికి లేకపోతే, వారు సరుకును నిలువచేసుకొని, జవలేక ప్రజా ఉద్యమం మృతి పొందినప్పుడుగానీ, బలప్రయోగంవలన అణచివేయబడినప్పుడుగానీ, దానిని వారమ్ముకోవడం ప్రారంభించవచ్చును. అయితే ప్రస్తుత ఉత్సాహం కేవలం నీటి బుడగవంటిదైనా గానీ, తీవ్రతమ నిర్బంధ విధానం వలన అణచివేయబడేటట్టిది గానీ కాకుండును గాక. కాబట్టి ఉద్యమ ఫలితమే విధంగా పరిణమించినా, విదేశీ బట్టల వ్యాపారస్థులు సూచించిన షరతులు ఉద్యమానికి అపాయకరములనీ, ఆ షరతులు లేకుండానే వారికి కావలసినంత రక్షణ ఉందనీ వారు స్పష్టంగా గ్రహించగలరని ఆశిస్తున్నాను. తమంతట తామే విదేశీ వస్త్రములను అమ్మడం ఆపివేసి, పికెటింగు అవసరమును తప్పించి కాలానుగుణంగా ప్రవర్తిస్తూ తగినంత దేశాభిమానంతో వ్యవహరింతురుగాక.

—యంగ్ ఇండియా, 24-4-1930

# 113

# విదేశీ వస్త్ర వ్యాపారస్థులు

ఈ ఒడంబడిక* తమ యిష్టంవచ్చినట్లుగా వ్యాపారాన్ని సాగించుకోవడానికి అధికారాన్ని యిస్తున్నదని విదేశీ వస్త్ర వ్యాపారస్థు లనుకొంటూన్నట్లు కనిపిస్తూన్నది. పికెటింగులో యే విధమైన నిర్బంధమూ ఉండకూడదనే మాట నిజమే. తమ సరుకులకు బలవంతం వల్ల సీళ్లు వేసినట్లు ఎవరైనా అనుకొంటూంటే, వారేవిధమైన అపాయమునకూ గురి కాకుండా ఆ మూటల సీళ్లు తీసివేసుకొనేటందుకు స్వాతంత్ర్యం ఉంది. అయితే పికెటింగు బొత్తిగా ఆగి పోదనీ, విదేశీ బట్టలకు ప్రతికూలంగానున్న ప్రజాభిప్రాయం సన్నగిలదనీ మాత్రం వారు గుర్తించుకోవాలి. భవిష్యత్తును మేము అర్థం చేసుకోగలిగిన దానినిబట్టి విదేశీ వస్త్రములను శాశ్వతంగా దేశంనుండి పారద్రోలడం జాతికి ముఖ్యావసరం. ఈ వర్తకులకు దేశంలో యేమైనా నమ్మకం ఉంటే స్వరాజ్యం దూరంగా లేదని వారు తెలుసుకోవాలి. అది దూరమైనా దగ్గరైనా, మద్యపానము మొదలయిన మత్తు పదార్థములకువలెనే విదేశీ వస్త్రములకుకూడా ప్రతికూలంగా ఆందోళన జరుగుతూండవలసిందే. స్వరాజ్యం

* గాంధీ-ఇర్విన్ ఒడంబడిక.

వచ్చినప్పుడు ప్రభుత్వంవారు తీసుకోవలసిన మొట్టమొదటి చర్యలలో, మత్తు పదార్థాలను విదేశీ వస్త్రములను నిషేధించడం ఉండి తీరాలి. ఇందులో ఒకటి దేశాన్ని దరిద్రవంతంగా చేస్తుంది. రెండవది దేశముయొక్క ఆత్మనే నశింపచేస్తుంది.

—యంగ్ ఇండియా, 19-3-1931

# 114

# మహాకాయుడు - మరుగుజ్జు

మరొకచోట ప్రచురింపబడిన లాల్‌చంద్ హీరాచందు యొక్క * ఉత్తరము వైపుకు పాఠకుడు తన దృష్టిని మరల్చ కోరుతున్నాను. నా అభిప్రాయాల కనుగుణంగా సరిపోయేటందుకు అందులో కొన్ని సర్దుబాట్లు చేయబడినవి.

ఇండియాలో వ్యాపారం చేస్తూన్న బ్రిటిష్ వ్యాపార సంఘము, వర్తక సంస్థలు, కంపెనీలున్నూ, ఇండియాలో

---

* 'సమాన హక్కులు'

ప్రియమైన మహాత్మాజీ, 19-3-1931

మంగళవారం మధ్యాహ్నం వివిధ పరిశ్రమల ప్రతినిధులు తమను సందర్శించిన సందర్భమును పురస్కరించుకొని, అప్పుడు జరిగిన దానిని గూర్చి పత్రికలలో తప్పు అర్థమిచ్చే వార్తలు ప్రచురింపబడినవని ఇందుతో పంపిన వార్తా పత్రిక ముక్కనుబట్టి గమనించగలరు. విషయముయొక్క ప్రబల ప్రాముఖ్యతనుబట్టి యథార్థమును ప్రజల యెదుట ఉంచుట అత్యవసరమని నా అభిప్రాయము. మీరు చెప్పిన సంగతులు నేనూ నా స్నేహితులూ అర్థం చేసుకొన్న విధాన ఈ క్రింద సంగ్రహముగా పొందుపరుప బడుతూన్నవి :—

"కాంగ్రెసు ప్రతినిధులు రెండవ టేబిలు సమావేశమునకు హాజరుకాగలరో లేదో నేనీ స్థితిలో చెప్పజాలను. కాని రెండవ టేబిలు సమావేశంలో ప్రతిపాదింపబడిన 'సమాన హక్కులు' అని చెప్పబడే ఈ కోరికనుగూర్చి ప్రతికూల ప్రకటన చేయడంలో కాంగ్రెసు మీతో ఉన్నదని మీరు గట్టిగా విశ్వసింపవచ్చును.

"ఇతర దేశాలేమిచేసినప్పటికీ యేమిచేయకపోయినప్పటికీ భారత దేశ ప్రయోజనాలకు బాగా తగిఉన్న పరిశ్రమలను రక్షించుకొని అభివృద్ధి చేసుకోవడానికి వీలైన చర్యలను ఇండియా తీసుకొంటుంది.

జన్మించిన భారత పౌరులకున్నాగల హక్కుల విషయంలో యే విధమైన విచక్షణా ఉండరాదనే సూత్రంపైన జరుగుతూన్న చర్చకు సంబంధించి వ్రాయబడినదీ ఉత్తరం. ఈ సూత్రం పైకి చాలా అమాయికంగానే కనిపిస్తుంది. కాని ఇందులో చాలా అపాయకరస్థితి ఉంది

ఈ నాటి పరిస్థితి ఇది. ఆంగ్లేయుడీ రోజున పై అధికారి గానూ భారతీయుడు తన దేశంలోనే తాను నౌకరు గానూ ఉంటున్నాడు. దేశ పరిపాలనా వ్యవహారాలలో సాధా

---

"ఇండియా ప్రయోజనముల కవసరమైనప్పుడు సజాతీయులకు విజాతీయులకూ మధ్య విచక్షణ చేసేటందుకు భారత పార్లమెంటు యొక్క హక్కుకు భంగం రాకుండా అది యథాతథంగా ఉండాలి.

"రక్షణ అవసరమైన అల్ప సంఖ్యాక సంఘంగా పరిగణింపబడవలెననే ఐరోపీయుల కోరిక సమర్థనీయం కాదు.

"నెహ్రూ నివేదికలోని యితర భాగాలను తోసివేసి యేదో ఒక ముక్క పట్టుకొని దానిని మన మొగంమీద విసరకొట్టడాని కెవ్వరికీ అధికారం లేదు

"ఈ ముఖ్య విషయమునుగూర్చి ప్రచారం చేయవలెనని మీకు నేను సలహా యిస్తూన్నాను.

"నెహ్రూ నివేదికలోని పౌరత్వ నిర్వచనమునుగూర్చిన భాగము నుద్దేశించి సర్ తేజ బహదూరు సప్రూచే చేయబడినట్లు చెప్పబడే ప్రకటన సందర్భంలో కేంద్ర శాసనసభలో పండిత మోతీలాలు చెప్పిన నిర్వచనమును, కలకత్తాలో అఖిలపక్ష సమావేశమువారు 'పౌర' నిర్వచనమును గూర్చి చేసిన నిర్ణయముతో కలిపి చదువుకోవలెను."

నాకు తెలిసినంతవరకు మీరు మాకిచ్చిన సలహాయొక్క సారాంశ మిది. పైన ఉదాహరింపబడినట్లు మేము మిమ్మలను సరిగానే అర్థం చేసుకొన్నామని మీరనుకొంటే ఈ ఉత్తరాన్ని ప్రకటించేటందుకు దయయుంచి మీరనుజ్ఞ యిచ్చేయెడల నేను కృతజ్ఞుడను.

మీ విశ్వాసపాత్రుడు,
లాల్‌చంద్ హీరాచంద్.

రణంగా భారతీయుడు కేవలం గుమాస్తా. వ్యాపారంలో ఆర్జన మహా అయితే నూటికి ఐదు వంతులు పుచ్చుకొనే కమీషన్ ఏజెంటు తక్కిన తొంభై ఐదు ఇంగ్లీషు యజమానిది. ఆంగ్లేయుడు పాలక వర్గమునకు చెందినవాడు కావడంచేత జీవితంలో దాదాపు ప్రతి వ్యవహారంలోనూ ఒక విశిష్ట స్థానాన్ని ఆక్రమిస్తున్నాడు. భారత దేశ వాణిజ్యముయొక్కయు పరిశ్రమలయొక్కయు శిథిలములపైన ఆతడభివృద్ధి పొందినాడనడం అతిశయోక్తి అనిగానీ వివాదగ్రస్త విషయమనికానీ భయపడనక్కర లేదు. లాంకషైరు ఔన్నత్యంకొఱకు భారతదేశపు కుటీర పరిశ్రమ పాడు కావలసివచ్చింది. బ్రిటిష్ నౌకా వ్యాపారాభివృద్ధికోసం భారతీయ నౌకా వ్యాపారం పడిపోవలసివచ్చింది. బ్రిటిష్ వానిని సిమ్లా శిఖరాల పైన నివసింప చేసేటందుకు మనం అణగ త్రొక్కబడ్డామని ఒక్కమాట చెపితే చాలును. మఱి గుజ్జువాళ్లవలె మన పెఱుగుదల ఆగిపోయిందని గోఖేలు చెప్పిన మాట కేవలం ఆలంకారికం కాదు భారతీయ ప్రయోజనాలకు ఆంగ్లేయుల ప్రయోజనాలకూ లేక ఐరోపీయుల ప్రయోజనాలకూ మధ్య ఏ విధమైన భేదమునూ చూపరాదనడం భారతీయ బానిసత్వమును నిరంతరాయంగా కొనసాగించడం అవుతుంది. మహాకాయునికీ మఱిగుజ్జువానికీ మధ్య సమాన హక్కులంటే ఏమిటి? అసమానుల మధ్య సమానత్వమును గూర్చి ఆలోచించే ముందు మఱిగుజ్జువానినికూడా మహాకాయుని ఔన్నత్యమునకు తీసుకొని రావలసి ఉంటుంది. మైదానములలో నివసించే లక్షలాది ప్రజానీకాన్ని సిమ్లా శిఖరాలకు లేవనెత్తలేము గనుక ఉన్నత శిఖరాలపై నున్నవారే మైదానములకు దిగిరావలసి ఉంటుందనే మాట తేలుతూన్నది. ఈ పద్ధతి కఠినంగా

కనిపించవచ్చును. కాని విశిష్టాధికారాలుగల కొద్ది మందితో మైదానములలో నివసించే లక్షలాది జనసామాన్యం సమానం కావలెనంటే, ఈ పద్ధతి తప్పనిసరి.

కాబట్టి సమాన స్థితిని అందుకొనే ముందు మిట్ట పల్లములను చదునుచేసే పని సమగ్రంగా జరగాలనిపిస్తూన్నది. న్యాయానికిది అవసరము. ఈ పద్ధతి జాతి విచక్షణ విధానమనడం తప్పు. అటువంటి ప్రశ్న లేదు. తమ విశిష్టాధికార స్థానమును పరిత్యజించి మన కష్టసుఖాలలో కలిసిమెలసి ఉండేయెడల ఆంగ్ల స్త్రీ పురుషులకు బిడ్డలకు కూడా మన దేశంలో అర్హస్థానం ఉంది. అయితే అప్పుడు, అడిగిన మాత్రంతో వారి ఆధీనంకాగల యావద్భారత సుహృద్భావమునకు ప్రతిగా బ్రిటిష్ సైన్యమును నగరాల ప్రాబల్యమునూ వెలిపెట్టవలసివస్తుంది. మన సుహృద్భావమే అన్నిటిలోకీ వారికి నిజమైన రక్షణ. అది అన్నిటికంటెనూ అత్యంతం ఎక్కువైనదనీ మన పరస్పర గౌరవానికెక్కువ తగి ఉంటుందనీ నేను ధైర్యంగా చెప్పగలను. ఐతే ఈ విధానంలో ప్రతిచోటా జాతి విచక్షణ చేయబడుతూన్నట్లు కనిపిస్తుంది. ప్రస్తుత స్థితి అన్యాయంగానూ అస్వాభావికంగానూ ఉన్నదని గ్రహించినవారి కలా తోచనక్కర లేదు. ఇందులో జాతి విచక్షణ లేదని చూపేటందుకు ఆంగ్లేయ పోషకుల అండను పొందుకొని ఉన్న భారతీయులుకూడా మైదానములలోని తమ సోదరబృందంతో పాటు సమానస్థితికి రావలసి ఉంటుందని చెపితే చాలును. కాబట్టి నిజమైన సూత్రం యిలా ఉండాలి. నేడాచరణలోనున్న అస్వాభావికమైన అసమానత్వమును రూపు మాపవలెనంటే పాలకవర్గమువారున్నూ వారితోపాటు మతి కొంద

ఋన్నా అనుభవిస్తూన్న విశిష్టాధికారాలను అన్ని వర్గాల లోనూ సంఘాలలోనూ సమాన స్థితి యేర్పడేటంతవరకూ తగ్గించవలసి ఉంటుంది.

ఇక భారతీయ వస్త్రాన మన ప్రాణాలను మన గౌర వాన్ని యెంత పవిత్రంగా భావిస్తామో ఆంగ్లేయుల గౌరవ మును ప్రాణాలనుకూడా అంత పవిత్రంగా భావించవలసి ఉంటుంది. ఇందువలన ఆంగ్లేయుల వర్తకంకాని వారి ప్రయోజనములు కానీ పాడుకావు; కానక్కరగ లేదు. భారత నివాసులైన ఆంగ్లేయులు తమ మాతృదేశమునందు చూపుతూన్న భక్తి విశ్వాసములతోనే పెంపుడు దేశమును కూడా నిరంతరం సేవిస్తూ తమ విశిష్ట వృత్తములను నిర్మించుకొనేటందుకు, క్రమ శిక్షాగతములైన తమ అభ్యాస ములు, సుశిక్షిత విజ్ఞానము, మహత్తర కృషి, నిర్మాణ కౌశల్యము, ఈ అన్నిటి పైనా ఆధారపడి ఉండవచ్చును.

మనకు బ్రిటిష్‌వారితో సగౌరవ సంబంధమేర్పడినప్పుడు భారత ప్రయోజనాలకు భంగం లేనంతవరకు మనము బ్రిటిష్ వర్తకమునకు అనుకూలంగా ఉండవచ్చును. భారతదేశం, బయటనూ లోపలనూగల స్వప్రయోజనపరుల బారినుండి బయటపడినయెడల అత్యాశ్చర్యకరమైనంత తొందరగా అది అభివృద్ధిపొంది తీరుతుంది. అది అభివృద్ధి పొందిన కొలదీ దాని అవసరాలుకూడా ఎక్కువ కాగలవు. అవసరాలెక్కువయిన కొద్దీ దిగుమతులుకూడా ఎక్కువ కావలసివస్తుంది. అప్పుడు బ్రిటను భారత దేశానికి భాగ స్వామిగానో మిత్రంగాగానీ ఉన్నయెడల, ఆ దేశం ఇండి యాకు ముఖ్య సరఫరాదారుగా ఉండవచ్చును.

ఈ స్వప్నం నిజం కావలెనని నా వాంఛ. ఈ స్వప్నాన్ని సత్యం చేయగల యేర్పాటులో నేను పాల్గొం టున్నాను. ఈ ఆశయ ప్రాప్తికొఱకు ప్రతి ఆంగ్లేయుని సహకారమూ నే నభిలషిస్తూన్నాను. పూర్ణ స్వరాజ్య మంటే వెలిగాకీవలెనుండే స్వాతంత్ర్యమని నా అభిప్రాయం కాదు. గౌరవ ప్రదమూ యోగ్యమూ అయిన స్వాతంత్ర్య మని నా అభిప్రాయము. నా జాతీయత తీవ్రం కావచ్చును. కాని ప్రత్యేక మైనదికాదు. మఱొక జాతికి గానీ వ్యక్తికిగానీ హానిచేసేదికాదు. న్యాయశాస్త్ర ప్రధాన సూత్రాలు నైతికములైనంతగా న్యాయ శాస్త్రీయ ములుకావు. నీ ఆస్తిని నీ యిరుగుపొరుగువారికి హాని కలిగించని విధాన వాడుకొనుము ' అనే శాశ్వత సత్యంలో నాకు చాలా విశ్వాసం ఉంది.

—యంగ్ ఇండియా, 26-3-1931

# 115

# విదేశీ వస్త్రాలు—తదితర బ్రిటిష్ సరుకులు

భారతదేశం నిరంతర క్షుద్బాధనుండి తప్పించుకోవలెనంటే, విదేశీ బట్టను ఇంగ్లాండుదిగానీ జపానుదిగానీ మరే యితర దేశానిదికానీ - శాశ్వతంగా పారద్రోలవలసిన అవసరమును, ఆంగ్లేయులందరు అందులో ముఖ్యంగా లాంకషైరు మిల్లు యజమానులు గుర్తించవలెనని నిర్వ్యాజంగా కోరుకొనవలసి ఉంది. భారతదేశము అత్యంత సంపూర్ణ స్వాతంత్ర్యము పొందినప్పటికీ కూడా తొలగించవీలు లేని ఆర్థికావసరమిది. ప్రజా రాజ్యంలో చేయబోయే మొట్టమొదటి పనులలో విదేశీ బట్టల సంపూర్ణ నిషేధం ఉండి తీరుతుంది

అంతేకాక విదేశీ బట్టల స్థానాన్ని దేశీయ మిల్లు బట్టలు తీసుకోవు. భారతదేశంలోని 70 ,000 గ్రామాలలో వడికి నేయబడిన ఖద్దరు స్థానాన్ని ఆక్రమిస్తుంది. విదేశీ వస్త్ర బహిష్కారమువలన సహజంగా దేశీయ మిల్లుల లాభం పొందే మాట నిస్సంశయమైనప్పటికీ, కాంగ్రెసు మాత్రం తన శక్తిలో అధికాంశమును, బహిష్కారోద్యమములో ఖద్దరుకోసం అనగా లక్షలాది శ్రమ జీవులకోసం కేంద్రీకరిస్తూన్నది. ఈ బహిష్కారోద్యమము ప్రజా ఉద్యమమనీ మానవ శ్రేయస్సుకోసమ ముద్దేశించబడిన ఉద్యమమనీ విదేశీయులందరు తెలుసుకొందురుగాక. ఈ ఉద్యమము యొక్క తీవ్రతనూ, పవిత్రతనూ గ్రహించి గుర్తించడంవలన విదేశీ పారిశ్రామికులు తుదకు తమయొక్కయు తమ

కార్మికులయొక్కయు శ్రేయోభివృద్ధికి తోడ్పడగలరు. దీనికి రాజకీయ ఫలితాలుకలవు. కాని యిది కేవలం లోకహితేచ్ఛగల ఆర్థికోద్యమం కావడంవలన యావత్ప్రపంచముయొక్క సహకారమునూ పొందితీరాలి.

అయినప్పటికీ విదేశీ వస్త్ర బహిష్కారమునకు ప్రతికూలంగా ఇంగ్లాండులో, అనవసరంగానూ అకారణంగానూ తీవ్రాందోళన ప్రారంభింపబడినది. బ్రిటిష్ వస్తు బహిష్కారమును తొలగించినందున ఇంగ్లాండు పొందిన అద్భుత ప్రయోజనం గమనింపబడలేదు. ఇది న్యాయంకాదు. భారత సమస్య పరిష్కారం ఇదివరకే కష్టంగా ఉంది. పైపెచ్చు మిక్కిలి ప్రాముఖ్యమైన ఈ మహత్తర విషయాన్ని తొక్కిపట్టడంవలన అది మరింత కష్టతరమయింది. బ్రిటిష్ వస్తు బహిష్కారోద్యమం 30 సంవత్సరాలనుండి ఉన్నదని ఇంగ్లాండు ప్రజకు తెలుసునా? కడచిన పోరాటంలో దాని కత్యంత ప్రోత్సాహం వచ్చినదనీ, అది దాదాపు విదేశీ వస్త్ర బహిష్కారోద్యమంతో సమంగా విజయవంతమైనదనీ వారు గుర్తిస్తున్నారా? శాశ్వతంగా కాకపోయినా చాలా కాలంవరకైనా విదేశాలనుండి కొన్ని వస్తువులను తెప్పించుకోవలసిన అవసరం ఇండియాకు ఉంది. ఈనాటి ఒడంబడిక తాత్కాలికం. ఇండియా, ఇంగ్లాండు దేశాల మధ్య శాశ్వతమైన ఒడంబడిక యేర్పడి గౌరవ పూర్వకమైన భాగస్వామ్యము కుదిరినప్పుడు, తాను దిగుమతి చేసుకోవలసిన యితర వస్తువుల విషయంలో ఇండియా ఇంగ్లాండుతో చేసుకొనే వ్యాపారంద్వారా, బట్టలు నూలు వ్యాపారాన్ని తప్పనిసరిగా పోగొట్టుకొన్నందువల్ల వచ్చిన నష్టం ఇంగ్లాండుకు భర్తీ అవడంకంటెకూడా ఇంకా ఎక్కువ లాభం రాదా?

ఇండియా కోరినా కోరకపోయినా, ఇంగ్లీషు వస్తువులను గానీ విదేశీ వస్తువులనుగానీ ఇండియామీద రుద్దడానికి కిక పీలు లేదనే విషయం గ్రహించాలి. స్వార్థంకోసం ఇండియాను వినియోగించుకోగల రోజులు పోయినవి. మనం సాంఘికైక మత్యమును సాధించవచ్చును, సాధించకపోవచ్చును. మనం అపజయం పొందితే మనకు వెంటనే స్వాతంత్ర్యం రాకపోవచ్చు. కాని ఇండియా మాత్ర దేశంగాకల, హిందువులు, ముస్లిములు, సిక్కులు, క్రైస్తవులు, పార్శీలు, యూదులు—ఈ అందరు, విదేశీయుల ప్రయోజనంకోసం భారతదేశముయొక్క ఐశ్వర్యాన్ని కొల్లగొట్టడం నిరోధించే టందుకు ఐక్యంగా పోరాడగలరని ప్రపంచం తెలుసుకొంటుంది. నిర్దయాపూర్వక నిష్పాతిక బుద్ధితో అన్ని సంఘాలను వస్తులు పెడుతూ యేటేటా బయటికిపోతూన్న అంతులేని ధనప్రవాహాన్ని వారరికట్టగలరు.

—యంగ్ ఇండియా, 23-4-1931

# 116
## అంగవస్త్రము

పాశ్చాత్య దురాక్రమణవలన భారతీయ సభ్యతను తుడిచిపెట్టుకొని పోనీయరాదని, ఢిల్లీలో జరిగిన 'ఛేంబర్ ఆఫ్ కామర్స్ ఫెడరేషన్' సమావేశంలో నేనన్నప్పుడు ఒకానొక విమర్శకుడు నామీద విరుచుకొని పడ్డాడు. ఆ విమర్శకుడు భారతీయ సభ్యత అనగా అంగ వస్త్ర సభ్యత అని కంగారుపడి దానిని నిరసించాడు.

చర్చిలు దయవల్ల నా అంగవస్త్రము ప్రపంచమంతా ఉచితంగా ప్రకటన చేయబడింది. కాబట్టి పైన చెప్పబడిన విమర్శకుడు చేసినట్లుగానే, దానినిగూర్చి వెక్కిరించడం ఆచారమయి పోయింది. ఇక దాని అర్థమేమిటో నేను వివరిస్తాను.

1921 లో నేనున్నూ మౌలానా మహమ్మదాలియున్నూ దక్షిణానికి సంచారంపోతూండగా వాల్తేరులో మహమ్మదాలీ అరెస్టు చేయబడ్డాడు. మాతో సంచారం చేస్తూన్న బేగం మహమ్మదాలీనుండీ ఆయన దూరం చేయబడ్డాడు. నాకు చాలా విచారంవేసింది. ఆమె ఆ వియోగాన్ని ధైర్యంగా భరించి మద్రాసులో భర్తకు పూజ చేస్తూవచ్చింది. ఆమెను మద్రాసులో విడిచిపెట్టి నేను మధురవరకూ వెళ్ళినాను. మార్గంలో ఈ జరిగిన సంఘటనతో యేమీ సంబంధంలేని జనసమూహాన్ని మా రైలులో చూచాను. దాదాపు వీరందరూ సన్నని విదేశ వస్త్రాలలో అలంకరింపబడి ఉన్నారు. వారిలో కొందఱితో నేను సంభాషణలోకి దిగి ఖాదీని గూర్చి

వాదించాను. ఖాదీద్వారా తప్ప ఆలీ సోదరులను విడిపించే మార్గం నాకేమీ లభించలేదు. వారు తలలూపి ఇలా అన్నారు. 'నేము ఖాదీ కొనలేని పేదవాళ్లం. ఖాదీ చాలా ప్రియం! ఈ మాటలో ఉన్న యథార్థాన్ని నేను గ్రహించాను. నేను పెద్దధోవతీ, టోపీ వేస్తు ధరించి ఉన్నాను. కాని వీరు కేవలం సగం నిజం మాత్రమే చెప్పినారు. నాలుగంగుళాల వెడల్పు అంతే పొడవుగల గోచీ పాత తప్ప మరేమీ లేని లక్షలాది దిగంబరులు శుష్క శరీరాలు నగ్నసత్యాన్ని బయటపెడతూన్నవి. సభ్యతకు భిన్నంలేకుండా, నేను ధరిస్తూన్న ప్రతి అంగుళం బట్టను త్యజించి, ఇంకనూ ఎక్కువగా కుచేలురైన ప్రజాసామాన్యంతో సమాన ప్రతిపత్తిలో వెలువడడంకంటె, దీనికి నేను సరియైన ప్రత్యుత్తర మేమీయగలను? మధురలో సభయైన మఱునాడుదయమే నేనీ పనిచేసివైచాను.

కాబట్టి ఇక్కడ అంగవస్త్రపు సభ్యత అనే ప్రసక్తియే లేదు. నేను అంగవస్త్రం ధరించడం కేవలం అవసరాన్ని బట్టి. అయితే అంగవస్త్రం నిరాడంబరమునకు చిహ్నం గనుక అంతవరకది భారతీ సభ్యతకు ప్రదర్శింపం కావచ్చును. భారత సభ్యత వివిధ మతములకు సంబంధించిన సంస్కృతుల మిశ్రమముగా నుండి ఆ సంస్కృతుల కలయికకు కారణ భూతములయిన భూగోళముయొక్కయు తదితర పరిసరముల యొక్కయు ప్రభావమునకు లోనైనది. అదేవిధంగా

ఇస్లాము సభ్యత అరేబియా, టర్కీ, ఈజిప్టు, ఇండియా దేశాలలో ఒకే తీరుగా లేదు. ఆయా దేశాల పరిస్థితుల ప్రభావమున కది లోనవుతూన్నది. కాబట్టి భారతీయ సంస్కృతి భారతీయమే. అది హిందూ సంస్కృతీ కాదు ఇస్లాం సంస్కృతీ కాదు. పూర్తిగా ఏ సంస్కృతీకాదు. అవి నాటన్నిటియొక్క ముఖ్యంగా ప్రాచ్య సంస్కృతుల యొక్క మిశ్రమం. నా మనస్సులో ఉన్నవా సంస్కృతిదే. భారతీయుడనుకొనే ప్రతివ్యక్తికీ, ఆ సభ్యతను గుప్త ధనంగా ఉంచుకొని దానికపాయం రాకుండా కాపాడుతూ ధర్మకర్తగా వ్యవహరించవలసిన బాధ్యత ఉంది.

ఐరోపా సభ్యత ఐరోపాఖండవాసులకు తగి ఉన్న మాట నిజమే. కాని మనం దానిననుకరించ ప్రయత్నిస్తే అది భారతదేశముయొక్క నాశనానికి దారితీస్తుంది. అందువలన మంచిని దేనినైనా మనమనుకరించమనిగానీ మనలో ఐక్యం చేసుకోమనిగానీ అర్థం కాదు. అదేవిధంగా యూరోపఖండ వాసులు తమలో చేరిన చెడుగును విడిచిపెట్టరనికూడా అర్థం చేసుకోకూడదు. భౌతిక సుఖాలకోసమెల్లప్పుడూ దేవులాడుతూండడమున్నూ, వాటిని హెచ్చించుకోవడమున్నూ చాలా కీడనీ సౌఖ్యములకు బానిసలవుతూన్న యూరోపియనులూ సౌఖ్యముల బరువుకిందనే నశించి పోకుండా ఉండవలెనంటే, వారి దృక్పథమును మార్చుకోవలసి ఉంటుందనీ నేను ధైర్యంగా చెపుతున్నాను. నా ఊహ

తప్పయితే కావచ్చును. కాని భారతదేశం భోగలాలసత్వం కోసం పరుగుపెట్టడం మాత్రం నిస్సందేహంగా మృత్యువును కోరడమని నాకు తెలుసును. 'నిరాండబర జీవితము, ఉన్నతాలోచన' అనే పాశ్చాత్య తత్వజ్ఞుని నీతిని హృదయ ఫలకాలలో ముద్రించుకొందుముగాక. లక్షలాది ప్రజలకు ఉన్నత జీవితం లభించని మాట నిశ్చయం. ప్రజా సామాన్యముకోసం ఆలోచిస్తూన్నామని చెప్పుకొంటూన్న మనలాంటి కొద్దిమంది, ఉన్నత జీవితంకోసం వ్యర్థంగా దేవులాడుతూ, ఉన్నతమైన ఆలోచనను విడనాడే అపాయ స్థితికి పోతున్నాము.

—యంగ్ ఇండియా, 30-4-1931

# 117

# 'హృదయపరివర్తనం లేదు'

ఈ శీర్షిక పాలకుల హృదయ పరివర్తనమునకు సంబంధించినది కాదు. ఈ దిగువ నుదాహరింపబడిన సింధీ విలేఖకుని యొక్క అభిశంసన ప్రకారం మనలో హృదయ పరివర్తనం లేకపోవడమునుగూర్చినదే యిది.

"శాసనోల్లంఘనోద్యమంలో విదేశీ వస్త్రధారణమును త్యజించిన మన స్త్రీలు, ఇప్పుడు మరొకసారి బహిరంగంగా జపాను, స్విట్జర్లాండు, ఇంగ్లాండు దేశాల చమ్కీ బట్టలు కొంటున్నారు. అవి చౌకగానూ ఆకర్షవంతంగానూ ఉండి బట్టల అంగళ్లనుండీ, విదేశబట్టలను దిగుమతి చేసుకొనే వాణిజ్యశాలల గిడ్డంగులనుండీ, కష్టం లేకుండా వారికి లభిస్తూన్నవి. దీని ఫలితం, వారి కుటుంబాలలోని మగవారీ కష్టకాలంలో వారు క్రొత్తగా కొనే బట్టలకోసం ఇంకా కొంత సొమ్ము ఖర్చుపెట్టవలసివచ్చింది. ఇంతకు పూర్వం కొన్ని నెలల కిందటనే బహిష్కారోద్యమం ఆరంభమయినప్పుడు దేశీయ చీరెలు మొదలగువాటిని కొని కొంత సొమ్ము వారు వెచ్చించారు. ఆ స్వదేశీ బట్టలు రాబోయే బహిష్కారపు వాతావరణం కోసం దాచిఉంచబడినవి. శాసనోల్లంఘనోద్యమంలో విదేశీబట్టల దుకాణాలను పికెటింగు చేస్తూ ఉండిన వలంటీర్లే, తమ జీవనానికి కావలసినది సంపాదించుకొనే వృత్తి లేనందున, ఆ వర్తకులనే తమకు ఉద్యోగమిప్పించవలసిందిగా వేడుకొంటున్నారన్న సంగతి మీకు క్రొత్తగా తోస్తుంది. 23 వ ఏప్రిల్ తేదిగల 'యంగ్ ఇండియా' పత్రికలోని 'విదేశీ బట్టలు బ్రిటిష్ వస్తువులు' అనే మీ వ్యాసము యొక్క అనువాదాన్ని నేను చదివాను. కాని కాంగ్రెసు కార్యకలాపాలు మందగించిన తక్షణం విదేశీబట్టలకు గిరాకీ హెచ్చిపోతూన్నంతవరకూ, ఆ వ్యాసములు ఆంగ్నేయునకు పచ్చవు. భారతీయులలో నిజమైన హృదయ పరివర్తనం లేదనీ, విదేశీ బట్టలపైనగల పాత మోజు వారి మనస్సులలో ఇంకా అలాగే ఉన్నదనీ ఇందువలన స్పష్టంగా తెలుస్తూన్నది. ఇందుకు కారణాలను దూరంపోయి వెదకనక్కరలేదు. అవి ఖద్దరు, స్వదేశీ బట్టలు ప్రియంగా ఉండడమున్నూ గాంధీ-ఇర్విన్ ఒడంబడిక ఫలితంగా

కాంగ్రెసు పని మందగించడమూను, కడచిన శాసనోల్లంఘనోద్యమంలో, దేశంకోసం చేసిన మహత్తర త్యాగమునుగూర్చి మీరు మీ గుజరాతును చాలా ప్రశంసిస్తున్నారు. గుజరాతీలు మొత్తంమీద తక్కిన సంఘాల వారికంటె నిస్సందేహంగా ఎక్కువ పనిచేశారు. వారు వహించిన పాత్ర నిజంగా శ్లాఘించతగినదే. ఈ ఉద్యమంలో మీ గుజరాతు సంపాదించుకొన్న మిలియనుల రూపాయిల సంగతేమిటి? కొంతమంది మిల్లు యజమానులు కాంగ్రెసు పనికోసం కొన్ని లక్షలిచ్చినంతమాత్రంతోగానీ లేక వారి కుటుంబాలలో ఒకరిద్దరిని 'ఏ' క్లాసులో జైలు జీవితము ననుభవించిరమ్మని జైలుకు పంపితేగానీ ఏమయింది? తమ మిల్లులద్వారా సంపాదిస్తూన్న లాభాలవల్లవారు పరిహారం పొందుతూండడం లేదా? ఎవరి ఖర్చుమీద వారా లాభాలు పొందుతున్నారు? తనకు మాలిన ధర్మం లేక పోవచ్చును. కాని అది పొరుగువాళ్లవాళ్లను దోచుకోవడంతో జరుగ కూడదు. నేను కరాచీలో బట్టల కమీషన్ వర్తకుడను. ఇది నా అనుభవాన్నిబట్టి వ్రాస్తున్నాను."

విదేశీ బట్టలనుగూర్చి చేయబడిన ఈ ఆరోపణ చాలావరకు నిజమై ఉంటుందనే నానమ్మకం. ఇంగ్లాండు, జపాను, ఫ్రాన్సు దేశములనుండి కాని మరి ఏ ఇతర దేశములనుండికాని వచ్చిన విదేశపు బట్టను తాను కూడదనేటంతవరకు, కనీసం నగరాలలోనైనా అభిరుచిలో మార్పు కలుగలేదు. విదేశీ బట్టను విసర్జించి పెట్టడం వాంఛనీయమని బుద్ధి అంగీకరిస్తూన్నప్పటికీ, విదేశాలనుండి మాత్రమే వస్తూన్న నాజూకు బట్టలకోసం హృదయం పెనగులాడుతూన్నది. దేశం మీద ప్రేమకంటెనూ లేక అర్ధోపవాసాలు చేస్తూన్న లక్షలాది ప్రజలమీద ప్రేమకంటెకూడా స్వాభిమానం ఎక్కువగా వర్ధిల్లుతూన్నది.

విదేశీబట్టల అంగళ్ల పికెటింగువల్లన పరిమిత ప్రయోజనం మాత్రమేకలదు. ఈ విషయాలలో ప్రజాసామాన్యాన్ని ప్రబోధించడమే నిజమైనపద్ధతి. ప్రబోధంకంటెకూడా కార్యకర్తల ఉదాహరణం ఎక్కువ ఉత్తమం. స్వయంగా

వడకుకోవడంవలన చాలా ఖాదీని సవిధంగా ఉత్పత్తి చేయవచ్చునో బోధించటం అంతకంటెనూ ఎక్కువ మంచిది. ఆచరణలో ఈ మూడు పద్ధతులు ఒకేసారి నడుస్తూ ఉంటవి. కాబట్టి ఖాదీ ద్వారా బహిష్కారోద్యమమునుయొక్క అర్థశాస్త్రమును ప్రజలకు బోధించవలసి ఉంది. ఖాదీ ఏవిధంగా గ్రామాలకు అభ్యుదయం చేకూర్చిందో, ఏవిధంగా చేకూర్చగలదో మంచి ఉదాహరణాలద్వారా ప్రజలు తెలుసుకోవాలి. నిరంతర ఖద్దరు ధారులయి నిజాయితీగల కార్యకర్తలతో ప్రజలు సన్నిహిత సంబంధమేర్పాటు చేసుకోవాలి. అంతేకాక తమ గ్రామాలలో తమకు కావలసిన ఖాదీని తామెలా ఉత్పత్తి చేసుకోవలెనో ప్రజలకు తెలిసేటట్లు చేయాలి. కాబట్టి కాంగ్రెసు కార్యకర్తలు, బహిష్కారోద్యమము, ఖద్దరును గూర్చిన సాహిత్యం గట్టిగా తెలుసుకొని ఉండాలి. వారు ఖద్దరు నిజాయితీగా ధరిస్తూండాలి. పత్తి గింజలు తీయడం, ఏకడం, వడకడం, నేయడం వంటి పత్తికి సంబంధించిన అన్నిపనులనూ వారు తెలుసుకొని నేర్చుకొనేవారికి నేర్పగలిగి ఉండాలి.

కాబట్టి, విదేశీవస్త్ర బహిష్కారము, ఖాదీ ఉత్పత్తి వినియోగములు అత్యంతం విలువగల శాశ్వతమైన ఆర్థిక సంస్థలని గుర్తిస్తూన్నవారు, జాతీయాదర్శమునకు ప్రజలు పొందిన పరివర్తనమును తెలియజేసేవిధంబడికకు సుముఖంగానే ఉంటారు. తీవ్రమయిన ప్రజాభిప్రాయపు వత్తిడి వలనకానీ, మరొందువల్లనైనా కానీ అసాధారణ పరిస్థితులలో చేసిన పనులను ప్రజలు సామాన్య పరిస్థితులలోకూడా చేయడంలోనే మన నిజమయిన బలం ఉన్నది.

మిల్లులను గూర్చి ఒక మాట. మన మిల్లులనుగూర్చి నాకు జాలిలేదు. వాటి సంగతిని బాగానే చూచుకో గలవు. ఇంకా అవి సవరించుకోవలసిన లోపాలు చాలా ఉన్నవి. ఏజెంట్లు యజమానులు భాగస్వాముల ప్రయోజ నాల ముందు, జాతీయ ప్రయోజనాల నవి గమనించడం లేదు. చాలా అల్పంగానైనా ఈ పర్యాయం అవి దేశముయొక్క పిలుపును అందుకొనేటందుకు ప్రయత్నించిన సంగతిలోని సత్యమును పరీక్షించవలసిందని నేను విలేఖరుని కోరు తున్నాను. ఈ పని ఉద్యమానికవి చేసిన ఆర్థిక సహాయం కాకనే జరిగినది. అవి ఖరీదులను, ఉత్పత్తిని నియమించి ఉండకపోయినట్లయితే, ఆ సహాయాన్ని నేను లెక్కలోకి తీసుకొనివుండను. ఆ విషయంలో మిల్లులు హృదయ పూర్వకంగా ప్రయత్నించినవని నేను విశ్వసిస్తూన్నాను.

అయినప్పటికీ ఇంకా అవి చాలా పని చేయవలసిఉన్నది. జాతీయార్థిక విధానంలో ఖాదీయొక్క ప్రధాన స్థానాన్ని అవి యింకా నిష్కపటంగా గుర్తించలేదు. విదేశ వస్త్ర వ్యాపారస్థులను స్వదేశ వ్యాపారమునకు తిప్పేటందుకింకా అవి ఏర్పాటుచేయలేదు. తాము, జాతి అంతటికీ మిల్లు కూలీలతోసహా ట్రస్టీలుగా భావించుకొన్నందువల్ల కలిగే అంతులేని ప్రయోజనాన్ని అవి యింకా అర్థంచేసుకోలేదు. అయితే కాంగ్రెసువాదులు సరిగా పనిచేస్తే ఈ మార్పు వస్తుంది. వారి ఆదర్శం నిర్బంధంగా ఉండకూడదు. పరివర్త నంగా ఉండాలి.

—యంగ్ ఇండియా, 14-5-1931

# 118

## 1828 లో

ఖాదీ ప్రతిష్ఠానమునకు చెందిన శ్రీ సతీస్‌చంద్రదాసు గుప్తా 'రాష్ట్రవాణి' అనే బెంగాలీ పత్రికకు సంపాదకుడుగా పనిచేస్తున్నాడు. పంతొమ్మిదవ శతాబ్ది ఇరవైలలో బెంగాలీలో ప్రచురింపబడుతూ ఉండిన 'సమాచారదర్పణ' పత్రికా సంపాదకునకు వ్రాయబడిన ఒక ఉత్తరాన్ని ఆయన ఇటీవల బయటకు తీశాడు. చర్ఖా ఎలా క్రమక్రమంగా ధ్వంసం చేయబడుతూ వచ్చిందో, ఆ రోజులలో స్త్రీలు దాని నెలా గౌరవిస్తూ ఉండేవారో చూపించే మిక్కిలి ప్రాముఖ్యమైన ఉత్తరం కావడం చేత, దానిని తన పత్రికలో ప్రచురించి దాని అనువాదాన్ని నాకు పంపించాడు. ఖాదీ ఉద్యమంలో ఉత్సాహం ఉన్నవారంతా దానిని శ్రద్ధగా చదువుతారని నా దృఢ విశ్వాసం.

ఆ ఉత్తరమిది :

"నూలువడికే స్త్రీ మనవి.

'సమాచార్' పత్రికా సంపాదకులకు.

నేను నూలు వడికుతూంటాను. చాలా బాధపడి నేనీ ఉత్తరం వ్రాస్తున్నాను. దయయుంచి దీనిని మీ పత్రికలో ప్రకటించండి. ఇది ప్రచురించబడినట్లయితే, నా విచారమును పోగొట్టి నా కోరికను తీర్చే వారికడకిది చేరుకుందని నేను విన్నాను. నిరుపేదరాలైన ఈ బాధితురాలి ఉత్తరాన్ని దయచేసి ఉపేక్ష చేయవలదు.

నేను చాలా దురదృష్టవంతురాలను. నా బాధ లన్నిటిని గూర్చి నేను వ్రాసేకొలదీ అది పెద్దగాథ అవుతుంది. అయినప్పటికీ నేను సంగ్రహంగా వ్రాయాలి.

నా నాలుగున్నర గండాల వయస్సు (22) నాడు నేను వితంతువు నయ్యేసరికి నాకు ముగ్గురు కూతుళ్లున్నారు. నా భర్త చనిపోతూ, వృద్ధులైన నా అత్తమామలను నా ముగ్గురు కూతుళ్లను పోషించేటందుకేమి యిచ్చిపోలేదు. ఆయన కనేక వ్యాపారాలుండినవి. ఆయన శ్రాద్ధం కోసం నా నగల నమ్మివేశాను. చివరకు మేము పస్తులుండవలసిన పరిస్థితి వచ్చేసరికి, మమ్మలను మేము రక్షించుకొనేటందుకు మార్గాన్ని దేవుడు చూపించాడు. నేను తక్లీ పైనా చర్ఖాపైనా వడకడం ప్రారంభించాను.

ఉదయం యిల్లు పరిశుభ్రం చేసుకోవడం మొదలగు గృహకృత్యాలను నిర్వర్తించుకొని, మధ్యాహ్నంవరకూ చర్ఖాకడ కూర్చొని, తరువాత వంట చేసుకొని ముసలివాళ్లను బిడ్డలను భుజింపచేసి, పిదప నేను భుజించి తక్లీ మీద సన్నని నూలు తీస్తూఉండే దానను. ఇలా నేను ఒక తులం నూలు తీస్తూండేదానను. నేత పనివారు మా యిండ్లకువచ్చి చర్ఖా నూలును రూపాయికి మూడు తులాలపంతున గొనుక్కొని పోతూండేవారు. నేతవారినుండి ముందుగా నేనేమీ కోరినప్పటికీ అడగగానే నాకు వారిస్తూ ఉండేవారు. ఇందువల్ల అన్నం బట్టనుగురించి ఆందోళన మాకు లేకుండా పోయింది.

కొలది సంవత్సరాలలో 7 గండాల రూపాయిలు (28) కూడబెట్టుకొన్నాను. దీనితో ఒక కూతురి పెండ్లిచేశాను. ఇదేవిధంగా ముగ్గురి కూతుళ్ల పెళ్లిళ్లూ చేశాను. కులాచారములకు వెలిగా యేమీ జరుగలేదు. ఈ నా కొమార్తెల నెవ్వరూ తక్కువగా చూడలేదు. ఘటకులకూ అందరకులీ. నులకు ఎవరికి ముట్టచెప్పవలసింది వారికి ముట్టచెప్పడమే యిందుకు కారణం. నా మామగారు చచ్చిపోయినప్పుడు ఆయన శ్రాద్ధానికి 11 గండాలు (రూ 44 లు) వెచ్చించాను. ఈ సొమ్ము నాకు నేతవారు బదులిచ్చారు. అది ఒక సంవత్సరన్నరలో తీర్చివేశాను. ఇదంతా చర్ఖా దయవల్ల జరిగింది. ఇప్పుడు మూడేళ్లనుండి, నేనూ మా అత్తగారు, ఈ యిద్దరు ఆడవాళ్లం అన్నంకోసం యిబ్బందిపడుతున్నాము. నేతపని వారు నూలుకొనేటందుకు మా యింటికి రావడం లేదు. అంతేకాదు, నూలును అంగడికి పంపితే పాత ఖరీదులలో నాలుగవ వంతుకూడా అది అమ్మకంకావడంలేదు. అది ఎలా జరిగిందో నాకు తెలియడంలేదు. నేను చాలామందిని అడిగినాను, బిలాతీ నూలు ఎక్కువగా దిగుమతి అవుతూన్నదని వారు చెపుతున్నారు. నేతవారు ఆ నూలును కొని నేస్తున్నారు. నా నూలుతో సమంగా బిలాతీ నూలు ఉండజాలదని నాకు గర్వంఉండేది. కాని బిలాతీనూలు నాకువచ్చిన

పిమ్మట నా నూలుకంటె ఎక్కువ బాగా ఉందని నేనంటున్నాను. అది శేరు 1 కి మూడు లేక నాలుగు రూపాయిల ఖరీదు ఉంటుందని విన్నాను. అప్పుడు విచారంగా నేనిలా అన్నాను: 'ఆహా అక్కడ నాకన్న కూడా ఎక్కువ పేదవారైన సోదరీమణులున్నారు. బిలాత్‌లో పురుషులందరూ భాగ్యవంతులని నేననుకుంటున్నాను. కాని నాకన్న ఎక్కువ నిరుపేదలైన స్త్రీలక్కడ ఉన్నారని నాకిప్పుడు తెలుస్తూన్నది.' ఆ పేదరాండ్రను వడికేటట్లు ప్రేరేపించే పేదరికాన్ని నేను పూర్తిగా అర్థంచేసుకొన్నాను. వారు శ్రమపడిచేసిన ఉత్పత్తిని వారక్కడ అమ్మకోలేనందున ఇక్కడకు పంపినారు. ఇక్కడ అవి మంచి ఖరీదులకు విక్రయింపబడి ఉన్నట్లయితే కొంత బాగుండేది. కాని అది మనకు వినాశం తెచ్చిపెట్టింది. ఈ నూలుతో నేయబడిన బట్టను పురుషులు రెండు నెలలు కూడా వాడుకోలేరు; అది చినిగిపోతుంది. కాబట్టి, ఈ నా ప్రార్థనను వారు విచారించినట్లయితే, ఇక్కడకు నూలును పంపడం న్యాయమా కాదా అనే విషయాన్ని వారే నిర్ణయించగలరని, అక్కడ నూలువడికే వారిని నేను వేడుకుంటున్నాను.

నూలువడకు బాధితురాలి గోడు.

శాంతిపురం, సమాచార దర్పణ్ "

ఈ ఉత్తరం వ్రాసిన స్త్రీ ఆనందప్రదమైన అజ్ఞానం వలన తనకంటె ఎక్కువ నిరుపేదలయిన బిలాతీ సోదరీమణులచే ఆ నూలు వడకబడినదని నమ్ముతూ, వారికోసం విచారపడినప్పటి ఆమె ఔదార్యమును పాఠకులు గమనించకుండా ఉండరు. పాపం! ఆమె నమ్మకానికి ఏమీ ఆధారం లేదు. విదేశీ నూలు చేతితో వడికినదే అయితే ఆమె వృత్తి ఆమె ఉంచుకొనగలిగే ఉండేది. విదేశీ నూలుకు వెనుక భారతీయ వర్తకమును స్వాధీనంచేసుకొని జాతీయ గ్రామ పరిశ్రమను వినాశనం చేయవలెనని సునిశ్చితమైన విధానం లేకపోయినప్పటికీ కూడా ఆమె వృత్తి ఆమె నిల్పుకొనగలిగే ఉండేది.

—యంగ్ ఇండియా, 21-5-1931

# 119

# అది ఆర్థికావసరమా?

'టైమ్సు ఆఫ్ ఇండియా' లోని (26-5-31) వ్యాసంలో యిలా ఉన్నది :

"పికెటింగు యొక్క ఉద్దేశమును విధానమును గూర్చి మిక్కిలి ఇటీవల ఒక ప్రకటనచేస్తూ మహాత్మా గాంధీ, విదేశీబట్టలను బహిష్కరించడం 'భారతదేశానికి ఆర్థికావసరమని' తన విశ్వాసాన్ని, పునరుద్ఘోషించారు. బహుశా తరువాత 'యంగిండియా' సంచికలో ఆ మాటను ఏ భావంతోనో ఉపయోగించారో వివరించవచ్చును. ప్రస్తుత వస్త్రపరిస్థితిలో కలుగుతూన్న పరిణామంవలన ఉదయించిన, కొన్ని ప్రశ్నలకు ప్రత్యుత్తర మీయడంద్వారా ఇందుకు కావలసిన భోగట్టా తెలియచేయవచ్చును :

**1.** 1930–31 లో విదేశీబట్టల దిగుమతీ నూరుకోట్ల గజాలు తగ్గిపోయింది. చేనూలుతోనూ, చేనేతతోనూ తయారైన దేశీయ వస్త్రము యొక్క అధికోత్పత్తిద్వారా ఆ లోటు ఎంతవరకు భర్తీ అయింది?

**2.** మిల్లుబట్టల ఉత్పత్తిని ఎక్కువ చేయడంవలన ఎంతవరకాలోటు భర్తీ అయింది?

**3.** చేతితోనూ మిల్లులలోనూ తయారైనట్టి సరుకులద్వారా దిగుమతు లెంతవరకు తగ్గింపబడుతున్నవో గమనించకుండానే బహిష్కారోద్యమం ఇంకా కొనసాగింపబడుతుందా?

**4.** అయితే ఇతరరాష్ట్రలకంటె బొంబాయిరాష్ట్రమునకు బహిష్కారోద్యమ మెంతవరకు ప్రయోజనకారి?

మహాత్మా గాంధీయొక్క హృదయానికి సన్నిహితంగానున్న ఉద్యమం అపజయం పొందిందని అంగీకరించడాని కాయన కిష్టంలేక పోయినప్పటికీ, గ్రామ పరిశ్రమను పునరుద్ధరించవలెననే ప్రయత్నం స్పష్టంగా భగ్నమైనట్లు కనిపిస్తూనన్నప్పుడు, బహిష్కారోద్యమానికి యేజెంటుగానున్న కాంగ్రెసుకూ నేదానికి యాజమాన్యం వహిస్తూన్నట్లు ఇంకనూ నటించడం

కంటె, ప్రజాజీవితంలో ఋజువర్తనం కోసమయినా, బహిష్కారోద్యమమునకు అధినేతలుగా పనిచేస్తూన్న బట్టల మిల్లుయజమానుల సంఘములకే దాని యాజమాన్యాన్ని యథాక్రమంగా అప్పచెప్పవలసిన తరుణమాసన్నమయింది. ”

స్పష్టమైన పై ప్రశ్నలకు జవాబు ఇవి :

1. గజాలలెక్కలో ఈ ప్రశ్నకు సమాధానం చెప్పడం అసంభవం. ఖాదీ యావత్తూ వ్యాపారసరళిలో ఉత్పత్తి కాకపోవడమే దీనికి కారణం. ఉత్పత్తిదారుల స్వీయోపయోగంకోసం, ఇళ్లలోనే ఖాదీఉత్పత్తి అంతకంత ఎక్కువగా జరుగుతూన్నది. పేద సంస్థయైన అ.భా.చ.సం. నకు ఈ లెక్కలను తయారుచేయడం సాధ్యంకానిపని.

2. లోటును భర్తీచేయడంలో దేశీయమిల్లులు ప్రముఖపాత్రను వహిస్తూన్నవనే మాట నిస్సందేహము.

3. భవిష్యత్తునుబట్టి ఉంటుందది.

4. బొంబాయి ప్రయోజనమే ఇండియా ప్రయోజనం. బహుశా ఈ విలేఖకుడు అహమ్మదాబాదును కూడా బొంబాయిలోనే చేర్చి, భారతదేశమంతటా వ్యాపించి ఉన్న ముఖ్యమైన యితర మిల్లులనుగూర్చి గమనించడంలేదని తోస్తున్నది.

స్పష్టమైన పై ప్రశ్నలకు, ఈ వ్యాసరచయిత సంతృప్తి కోసం కంటె ఎక్కువగా నా సంతృప్తికోసమున్నూ ప్రజల సంతృప్తికోసమున్నూ జవాబులు వ్రాశాను. ఖాదీ అపజయం పొందినట్లిదివరకే ఋజువయిందని ఈ రచయిత నిశ్చయించినట్లుగా ఖాదీ ఉద్యమం భగ్నమైనట్లు నిజంగా నేను తెలుసుకొన్నప్పుడు విదేశీ బహిష్కారోద్యమంలో నా ఉత్సాహం చల్లారి పోతుందని ప్రజలు గ్రహింతురుగాక.

ఆయన అంత గట్టిగా చెప్పడానికి ఆధార మేమిటో నాకు తెలియదు. ఖాదీ ఉత్పత్తి ప్రచారములలో ముఖ్య సంబంధంగల నేను, ఖాదీ అపజయం పొందక పోవడమేగాక భారతదేశమంతటా నిశ్చయంగా క్రమాభివృద్ధి పొందు తూన్నదని కూడా ధైర్యంగా చెప్పగలను. కాబట్టి బహిష్కా రోద్యమము ప్రజాసామాన్యము యొక్క ఆర్థికావసరమని నేను చెప్పిన మాటను మరొకసారి ఉద్ఘాటిస్తున్నాను. అది ఏ అర్థంలో ఎంతవఱకు ఖాదీకి ఆర్థికావసరమో, ఆ అర్థంలో అంతవఱకు మిల్లులకు ఆర్థికావసరం కాదు. ఈ మాట వింతగా తోచవచ్చును. కాని యిది నిజం. బహిష్కా రోద్యమం కారణంగా అనుకోనంత ఎక్కువగా మిల్లులు వర్ధిల్లిన మాట నిస్సంశయం. కాని బహిష్కారోద్యమం లేక పోయినా, ఇంతకు పూర్వంవలెనే, అవి తమ పొట్ట తాము పోసుకొంటూ జీవిస్తూం డేవి. తమ తీరిక సమయాలలో తమ బట్టను తాము ఉత్పత్తి చేసుకోగలుగుదుమనే విషయాన్ని మఱచిపోయి పనికిమాలిన మిల్లుబట్టను కొని తమకు తాము రెండింతలు కీడుచేసుకొంటూన్న ప్రజానీకంపైన మిల్లులు తమ బట్టలను రుద్ది, అన్నంలేని లక్షలాది ప్రజల దోపిడీ విధానంలో బ్రిటను జపానుదేశాలతోపాటు నిరంతర భాగ స్వాములుగా నుండగలవు. కాబట్టి మిల్లులు కోరినప్పటికీ, బహిష్కారోద్యమాన్ని పూర్తిగా వారిచేతులలో పెట్టడానికి వీలులేదు. వారా పని పెట్టుకొన్నప్పటికీ అది అపజయం పొందుతుంది. మిల్లులు ముఖ్యంగా తమయేజెంట్ల యొక్కయు భాగస్వాములయొక్కయు లాభములకోసం మాత్రమే, బహి ష్కారోద్యమంలో ఆసక్తికలిగి వున్నవనే విషయం దాచ డానికి వీలులేదు. పూర్తిగా ప్రజల శ్రేయస్సు కోసమే కాంగ్రెసు బహిష్కారోద్యమాన్ని సాగిస్తూన్నది.

రాజకీయాలలో అహింస నూతనవిధానమయినట్లే, ఆర్థిక వ్యవహారాలలో ఖాదీ నూతనవిధానమనే విషయం ఈ రచయితకేకాక ఇంకా అనేకమందికి తెలియదు. సంప్రదాయసిద్ధములైన రాజకీయవిధానాలను దాదాపు ఇదివరకే అహింస ఎలా చీకాకుపఱచిందో అదేవిధంగా సంప్రదాయ సిద్ధములైన ఆర్థిక సిద్ధాంతాలను కూడా ఖాదీవిధానం చీకాకు పఱచక తప్పదు. ఈ నూతనవిధానమును లెక్కల ద్వారా నిరూపించడానికి కొంతవరకు మాత్రమే సావకాశం కలుగుతుంది. బహిష్కారోద్యమము యొక్క బ్రహ్మాండమైన విజయానికి ఖాదీ తత్వమే కారణం. బహిష్కారోద్యమమసలు క్రొత్త నినాదం కాదు. ఇది వంగరాష్ట్రవిభజనకు పూర్వమునుండీ కాకపోయినా ఆ నాటినుండీ అయినా ఉంది. కాని 1919 లో ఖాదీయొక్క పునర్జన్మతో అదిజయం పొందుతుందనే ఆశ అంకురించింది. ఖాదీతత్వం అత్యున్నతస్థానమును పొందినప్పుడు నిరుడా ఆశ కొంతవఱకు ఫలించింది. ఖాదీ తత్వముయొక్క నిజమైన ప్రాదుర్భావం ఇంకా ముందున్నది. చాలామంది అనుకొనేదానికంటె కూడా వేగంగానే అది జరిగితీరవలసి ఉంది. అది జరిగినప్పుడు పికెటింగుగానీ, లెక్కల ద్వారా నిరూపించవలసిన అవసరంగానీ ఉండదు.

ప్రజాసామాన్యమునకు హానికరంగా కేవలం మిల్లుల లాభం నిమిత్తమే బహిష్కారోద్యమం ఉద్దేశింపబడినదని 'మైమ్సు ఆఫ్ ఇండియా' విలేఖకుడు సూచిస్తున్నాడు. బహిష్కారోద్యమానికి వెనుక ఖాదీ లేకపోయినట్లయితే ఆ సూచనకు ఆధారం ఉండేది. 'ఖాదీద్వారా బహిష్కారం' అని కాంగ్రెసు సిద్ధాంతాన్ని వివరించవలసి వస్తుంది. ఈ సంగతి ఆ పత్రికా విలేఖకుడున్నూ ఆయనవంటి విమర్శ

కులున్నా జ్ఞాపకముంచుకొందురుగాక. ఖాదీకి తోడుగా భారతీయమిల్లులు వస్తూన్నవి. కాని అవి ఖాదీని వ్యతిరే కించినట్లయితే వాటి లెక్క లేకుండానే బహిష్కారోద్యమం నిలుస్తుంది. చాలా మిల్లు లొకప్పుడు వ్యతిరేకించినవి కూడా. ఖాదీని గూర్చిన వాటి అశ్రద్ధ ఇంకా ఎక్కువగానే ప్రస్ఫుట మవుతూన్నది. కాని కొంతవరకవి కాల స్వభావాన్ని అర్థం చేసుకొన్నవని వాటిపక్షాన చెప్పవలసి ఉంది. చాలా సంద ర్భాలలో అయిష్టంగా నైనప్పటికీ ఖాదీతో అవి సరతు లేర్పాటు చేసుకొన్నవి. కొన్ని పూర్తిగా ఖాదీ మతంలో కలసిపోయి, దానికోసం నష్టపడడానికి కూడా లెక్క పెట్టడం లేదు. కాబట్టి బహిష్కారోద్యమంలో భారతీయ మిల్లులు ఏ అర్థంలోనూ అధినేతలని చెప్పడానికి వీలు లేదు. వారికి లాభం కలిగే మాట నిజమే. వారు ప్రస్తుతం ఇంకా ఎక్కువ లాభం పొందగలరు కూడా. కాని వారు పొందే ఎక్కువ లాభం, ఖాదీవిషయంలో వారి ఋజువర్తనమునుబట్టి దామా షాగా ఉంటుంది.

మిల్లుల రక్షణకోసం చేయబడిన ఇటీవలిశాసనం ద్వారా కూడా ఇండియా అనగా భారతప్రజా సామాన్యం ముందు ముందు ఎందుకు ప్రయోజనం పొందవలసి ఉందో ఈ పాటికి మన విలేఖకుడు, పాఠకులూ కూడా గ్రహించి ఉంటారు. మిల్లుబట్టల ఖరీదులు సహజంగా పెరిగితీరుతవి. కాని లాభా లను పొందవలెననే దురాశకు లోనుగాకుండా మిల్లులను

అదుపులో ఉంచేటందుకు ఎడతెగని ప్రచారం చేస్తూ, నూలువడకడం ద్వారా తమ కుటీరములలో ఖాదీని ఉత్పత్తి చేసుకోవడంలోనే తమ ఆర్థిక క్షేమం యిమిడి ఉన్నదని ప్రజాసామాన్యానికి బోధించడం కాంగ్రెసుపని. విదేశీబట్ట లేకుండా పోగానే, దేశీయమిల్లులు ఖాదీ కనుగుణంగా, తమ ఖరీదులను ఉత్పత్తినే తక్షణం సరిచేసుకో గలవు. లేదా విదేశీ మిల్లులవలెనే అవికూడా బహిష్కారోద్యమాన్ని ఎదు ర్కోవలసి వస్తుంది.

—యంగ్ ఇండియా, 4-6-1931

# 120

# స్వదేశీ నియమం

ఈనాటి నియమాలన్నిటిలోకీ స్వదేశీ ఉత్కృష్ట నియమం. ఆధ్యాత్మికనియమాలను ప్రకృతి నియమాలవలెనే ఒకరు నిర్మించవలసిన అవసరం లేదు. అవి స్వయం నిర్ణీతములు. అయితే మానవుడు అజ్ఞానంవలన కానీ తదితర కారణాలవల్ల కానీ వాటిని అలక్ష్యం చేస్తాడు; లేదా, ఉల్లంఘిస్తాడు. అటువంటి సమయంలోనే అతని పంథాను సరిచేయడానికి ప్రతిజ్ఞల అవసరం వస్తుంది. ప్రకృతి సిద్ధంగానే శాకాహారిగా ఉండే మనిషియొక్క శాఖాహారతత్వమును బలపటిచేటందుకు ప్రతిజ్ఞలతో పని ఉండదు. ఎందువల్లనంటే మాంసాహారం చూడగానే అతనికి నోగూరదు. పైపెచ్చు ఏవగింపు కలుగుతుంది. అదేవిధంగా స్వదేశీసూత్రం మానవుని మూల తత్వం లోనే నాటుకొని ఉంది. కాని నేడది ఎక్కడో అట్టడుగున ఇంకిపోయింది. కాబట్టి స్వదేశీకి ప్రతిజ్ఞ అవసరమయింది. ఆధ్యాత్మిక పరమార్థంలో స్వదేశీ అంటే భౌతిక బంధనము నుంచి ఆత్మశాశ్వత విమోచనం పొందడం వంటిది. ఎందువల్లనంటే ఈ భౌతికశరీరం ఆత్మకు ప్రకృతి నివాసము కానీ శాశ్వతనివాసముకానీ కాదు; దాని పురోగమనానికిది అభ్యంతరం, సమస్తజీవైక్యాను సంధాన ప్రాప్తికది ఆటంకము కాబట్టి స్వదేశీ ఉపాసకుడు సమస్త జీవులతోనూ సమైక్యత పొందవలెననే ప్రయత్నంలో భౌతికశరీరబంధము నుండి విముక్తి కావడానికి కృషిచేస్తాడు. స్వదేశీనిగూర్చిన ఈ నిర్వచనము సరియైనదే అయితే దానిని ఉపాసించే వ్యక్తి తన ప్రథమ కర్తవ్యంగా తన కత్యంత సన్నిహితులయిన

పొరుగువారి కుపకారం చేయడంలో నిమగ్నుడు కావలసి ఉంటుంది. అలా చేయడంలో ఇతరుల ప్రయోజనాలను వేలుగా చూడడం లేక త్యజించడం కూడా ఉంది. అయితే ఆ వేలు చేయడం కానీ, త్యజించడం కానీ పైకి కనిపించడం వరకే. మన పొరుగువారికి మనం చేసే నిష్కళంకమైన సేవ సహజంగా దూరాన ఉన్నవారికి అపచారంగా పరిణమించదు. పైపెచ్చు ఉపకారమవుతుంది కూడా, 'వ్యక్తి యెంతో విశ్వమంత' అన్న పరమార్థాన్ని మనం ఆత్మగతం చేసుకోవడం సముచితం. పైగా దూరపు దృశ్యాల మోజులో భూమండలపు కొట్టకొనకుపోయి సేవచేయవలెననుకొనే మనిషి భగ్నాశయుడు కావడమేగాక తన సన్నిహితులయెడ తాను నిర్వర్తించవలసిన కర్తవ్యాన్ని తప్పినవాడు కూడా అవుతాడు. ఇందుకొక తార్కాణం గ్రహించండి. నేను నివసించే చోట నా పొరుగున కొంతమంది బంధువులూ నామీద ఆధారపడినవారూ ఉంటారు. సహజంగా వారందరూ నా మీద హక్కులున్నట్లుగా భావించి నా సహాయ సహకారముల కోసం ప్రతీక్షిస్తూ ఉంటారు. వారందరినీ హఠాత్తుగా విడిచిపెట్టి ఎక్కడో దూరప్రదేశంలో ఉన్న ప్రజల కుపకారం చేయడానికి నేను బయలుదేరాననుకోండి! ఈ నిర్ణయం నా పరిసర ప్రపంచంలోని నా పొరుగువారికీ నా మీద ఆధారపడి ఉన్నవారికీ విభ్రమం కలిగిస్తుంది. ఇక నేను కోరి తెచ్చుకొన్న వీరోచిత పర్యటనము, నేను పోయే కొత్త స్థలంలోని వాతావరణాన్ని కలోలపరచక పోవడంకంటె కల్లోలపరచడమే యెక్కువ సహజం. కాబట్టి స్వదేశీ సిద్ధాంతములను ఉల్లంఘించినందువలన కలిగే మొట్టమొదటి దుష్ఫలితాలివి. మనకు సన్నిహితులైన పొరుగువారిని ఒక మహాపరాధంగా పరిణమించేటంతగా మనం నిర్లక్ష్యం

చేయడమేగాక, మన ముపకారం చేయదలచుకొన్నవారికి అనుకోకుండా అపకారం కూడా చేసినవార మవుతున్నాము.

అటువంటి ఉదాహరణాల నెన్నిటినైనా సులభంగా పేర్కొనవచ్చును. అందువల్లనే గీత ఇలా చెప్పింది: "స్వధర్మాన్ని అనుసరిస్తూ చావడం శ్రేయస్కరం. పర ధర్మం భయకారణ మవుతుంది" భౌతికవ్యవహార భాషలో దీనిని నిర్వచించినట్లయితే ఇది స్వదేశీ సూత్రాన్నే ప్రతిపాదిస్తుంది. స్వధర్మాన్ని గూర్చి గీతచెప్పిన మాటలు స్వదేశీకి కూడా వర్తించగలవు. స్వదేశీ సిద్ధాంతాన్ని తప్పుగా గ్రహించినప్పుడు మాత్రమే ప్రమాదం తటస్థిస్తుంది. మంచి చెడుగులతో నిమిత్తంలేకుండా నా కుటుంబ రక్షణకోసం డబ్బు గుంజుకోవడానికి ప్రారంభించినట్లయితే అది స్వదేశీ సిద్ధాంతాన్ని అవహేళనం చేయడమవుతుంది. న్యాయమార్గముల ద్వారా నా కుటుంబమునెడల నా సక్రమధర్మములను నిర్వర్తించవలెనని మాత్రమే స్వదేశీ సిద్ధాంతం ప్రతిపాదిస్తూన్నది. ఆ ప్రయత్నంలోనే ప్రాపంచికవ్యవహారధర్మం నాకు వెల్లడి అవుతుంది. స్వదేశీనిర్వహణవలన ఎవ్వరికీ అపకారం కలుగదు. అలాకలిగితే అది స్వధర్మంవలన కాదు; నా లోని అహంకారం వలన.

ప్రపంచకల్యాణం కోసం స్వదేశీ వ్రతుడొకప్పుడు తన కుటుంబాన్ని యజ్ఞవేదిముందు త్యాగంచేయవలెనని కోరబడవచ్చును. బుద్ధిపూర్వకంగా చేయబడిన ఆ బలిదానం తనకుటుంబానికి చేసిన పరమోత్కృష్టమైన సేవగా పరిణమించకలదు. "ఎవడు తన ప్రాణరక్షణ చేసుకొంటున్నాడో వాడు దానిని పోగొట్టుకొంటాడు. ఎవడు భగవత్ప్రీత్యర్థం దానిని త్యజిస్తున్నాడో వాడు దానిని గ్రహించగలడు" అనే

వాక్యం వ్యక్తుల విషయంలోనేకాక కుటుంబ విషయాలలో కూడా వర్తిస్తుంది. మరొక తార్కాణం చూడండి ! మా గ్రామంలో మహామారి (plague) వ్యాధి వ్యాపించిందను కోండి. ఆ రోగానికి గురియైనవారి కుపచారం చేసే సందర్భంలో నేనూ నా పిల్లలూ నా కుటుంబంలోని అందఱమూ కూడా తుడిచిపెట్టుకొని పోయినా మనుకోండి ! అప్పుడు నాకు సన్నిహితులు ప్రియతములూ అయినవారిని నాతో కలసి రమ్మని ప్రోత్సహించినందుకు నేను నా కుటుంబాన్ని నాశనం చేసిన వాడను కాను. పైపెచ్చు దానికి అత్యంత మిత్రుడ నవుతాను. స్వదేశీలో స్వార్థపరత్వమునకు స్థానం లేదు. ఒకవేళ స్వార్థపరత్వం ఉంటే అది పరమోత్తమ మయిన స్వార్థం. దానికినీ అత్యుత్కృష్టమైన పరార్థదృష్టికినీ యేమీ భేదం లేదు. నిష్కళంకమైన స్వదేశీవ్రతం విశ్వమానవ సేవకు పరమావధి.

ఈ విధంగా తర్కించుకొని స్వదేశీ సిద్ధాంతాన్ని సంఘానికి వర్తింపచేయడంలో ఖాదీ అవసరమైన ప్రముఖోపలక్ష్యంగా (corollary) నిర్దేశించాను. మనదేశంలో అర్థోపవాసములు చేస్తూన్న కోట్లకొలదీ ప్రజాసమూహాన్ని సజీవంగా చేయగలిగినట్టిన్నీ, సులభంగా ఆచరించడానికి వీలు కలిగినట్టిన్నీ, అందరూ తేలికగా విచక్షణ జ్ఞానంతో అర్థం చేసుకోగలిగినట్టిన్నీ, లక్షలాది భారతప్రజానీకమునకు నేడుపకరించునట్టిన్నీ సేవ యేదా అని నాలో నేను వితర్కించుకొన్నాను. ఈ అన్ని పరిస్థితులనూ సమన్వయం చేసుకోగలిగిన పని, ఖాదీని అనగా దాన్ని సార్వజనీనంగా చేయడ మొక్కటేనని నాకు తోచింది.

ఖాదీద్వారా జరుపబడే స్వదేశీ అవలంబనమువలన విదేశీ మిల్లు యజమానులకుగానీ భారత మిల్లు యజమానులకుగానీ అపకారం కలుగుతుందని ఎవ్వరూ అనుకోకూడదు. ఒక దొంగను దుర్మార్గము నుండి తప్పించినందువలన కానీ, అతడపహరించిన దొంగసొత్తును తిరిగీ యిప్పించివేసినందువలన కానీ అతని కపకారం కలుగదు. పైగా అతనికి లాభం కలుగుతుంది. మొదటి సందర్భంలో తెలిసి జరుగుతుంది. రెండవ సందర్భంలో తెలియకుండా జరుగుతుంది. అదే విధంగా ప్రపంచంలోని త్రాగుబోతులు, నల్లమందు భాయీలు ఆ దుర్వ్యసనములనుండి తప్పించుకొని బయట పడేయెడల, వృత్తిని పోగొట్టుకున్న సారా దుకాణాదార్లకు నల్లమందు వర్తకులకు నష్టం వస్తుందనకూడదు. నిజం అర్థం చేసుకుంటే వాళ్లకు లాభం వస్తుంది. పాపపు డబ్బు రాకుండా పోయినందువలన దానికి సంబంధించిన వ్యక్తికిగానీ సంఘానికిగానీ యెప్పుడూ నష్టంలేదు. అది కేవలం లాభసే.

ఏదో విధంగా కొంత నూలుపడికి దానితో తయారైన బట్టను ధరించినంతమాత్రంతో స్వదేశీధర్మం మొదటినుండి తుదివరకూ నిర్వర్తింపబడినట్లు తలచేయెడల అంతకన్న భ్రమ మఱొకటి ఉండబోదు. సంఘమునెడల స్వదేశీ ధర్మాన్ని నిర్వర్తించేటందుకు మొట్టమొదటగా మన మాచరించి తీరవలసిన పని ఖాదీ. కాని, ఖాదీమాత్రం ధరిస్తూ తక్కిన అన్ని విషయాలలో విదేశీవస్తువుల మోజులో మునిగి తేలుతూన్న వారిని మనం చూస్తూ ఉంటాము. అటువంటివారు స్వదేశీ ధర్మాన్ని ఆచరిస్తూ ఉన్నవారు కాజాలరు. వారికి స్వదేశీ కేవలం వేషం. స్వదేశీ వ్రతుడు తన పరిసరాలను జాగ్రత్తగా పరిశీలించి స్థానికంగా తయారైన వస్తువులు ఇతర చోట్ల చేసిన వస్తువులకంటె హీనంగా ఉన్నప్పటికీ, ధర

ప్రియంగా ఉన్నప్పటికి వాటినే ఉపయోగిస్తూ తన పొరుగు వారికి సహాయం చేయవలెనని ప్రయత్నిస్తూంటాడు. వాటిలోఉన్న లోపాలను సరిదిద్దడానికి ప్రయత్నిస్తాడే కాని ఆ కారణంగా వాటినిమాని వేసి విదేశీవస్తువులపైన పక్షపాతం చూపించడు.

స్వదేశీని వట్టి పూజ్యవస్తువుగా తయారుచేసేయెడల తదితర వస్తువులవలెనే అదికూడ నశించిపోగలదు. దానికటువంటి ఆపత్తు కలుగకుండా జాగ్రత పడాలి. కేవలం విదేశీసరుకులనే కారణంతో వాటిని తిరస్కరించి మనదేశానికి తగని సరుకులను తయారుచేయడంలో మన జాతీయ ద్రవ్యాన్ని, కాలాన్నీ దుర్వినియోగం చేస్తూండడం శిక్షార్హమైన అపరాధ మవుతుంది. అది స్వదేశీ తత్వానికి విరుద్ధం. నిజమైన స్వదేశీ భక్తుడు విదేశీయునియెడల యెప్పుడూ ద్వేషం పెట్టుకోడు. ప్రపంచంలో యెవరిమీదనూ ప్రతికూలభావంతో యేపనీ ఆయన చేయడు. స్వదేశీతత్వము ద్వేషాన్ని అర్పించదు. నిస్స్వార్థసేవయే దానిమతం. నిష్కలంకమైన అహింస అనగా ప్రేమదానికిమూలం.

—యంగ్ ఇండియా, 18-6-1931

# 121

## జపానుదా లేక బ్రిటిష్‌దా?

బొంబాయి మిల్లు యజమానుల సంఘాధ్యక్షుడు శ్రీ హెచ్. పి. మోడీ వ్రాసిన ఈ దిగువ ఉత్తరమువలన ఆర్థిక దృక్పథమునుండి (ప్రజా సామాన్యముయొక్క క్షేమం కొరకు ప్రాముఖ్యమైన దృక్పథమది ఒకటే.) జపాను వస్త్ర బహిష్కారమే అత్యంత ప్రాముఖ్యమయినదనే సంగతి స్పష్టపడుతూన్నది:

"విదేశాలనుండి ఈ దేశానికి దిగుమతి అవుతూన్న బట్టల సరుకులను నాలుగు ముఖ్య వర్గాలుగా విభజింపవచ్చును. కోరా బట్టలు, చలవ చేసిన బట్టలు, రంగు బట్టలు, కృత్రిమపు పట్టు బట్టలు. 1930 చివర నాలుగు మాసములలోనూ 1931 మొదటి నాలుగు మాసములలోనూ, యునైటెడ్ కింగ్‌డం, జపాను దేశాలనుండి దిగుమతీ అవుతూన్న పై తరగతులలో ప్రతి తరగతియొక్క అంకెలను నేను తీసుకొని ఈ క్రింద వివరిస్తూన్నాను:—

| | యునైటెడ్ కింగ్‌డం. | | జపాన్. | |
|---|---|---|---|---|
| | చివరి నాలుగు మాసాలు. 1930 | మొదటి నాలుగు మాసాలు. 1931 | చివరి నాలుగు మాసాలు. 1930 | మొదటి నాలుగు మాసాలు. 1931 |
| | (మిలియనుల గజాలలో) | | | |
| కోరా సరుకు ... | 18 | 18 | 53 | 77 |
| చలువచేసిన సరుకు. | 39 | 66 | 8 | 14 |
| రంగు సరుకు ... | 28 | 32 | 16 | 28 |
| కృత్రిమపు పట్టుసరుకు. | ... | ... | 7 | 24 |
| మొత్తం ... | 85 | 116 | 84 | 143 |

“ ఈ లెక్కలనుబట్టి, చలువచేసిన బట్టల వ్యాపారంలో తప్ప (పూర్వమిది ఏకాంతిక వ్యాపారంగా ఉండేది) గ్రేటు బ్రిటనుయొక్క వ్యాపారం, ఇటీవల కొంత అభివృద్ధి అవుతూన్నప్పటికీ, కొన్ని మాసాల కిందయే స్థితిలో ఉన్నదో దాదాపు అదే స్థితిలోనే ఉన్నది. జపాను సరుకుల సందర్భంలోని పరిస్థితి ఆశ్చర్యకరమైన భేదంగా కనిపిస్తుంది.

“ కోరా సరుకు సందర్భంలో జపాను దిగుమతులు 45% హెచ్చినవి. చలువచేసిన బట్టలు, రంగు బట్టల సందర్భంలో 75%, కృత్రిమ పట్టు సరుకులు 24% హెచ్చినవి. చలువచేసిన బట్టలయొక్కయు కృత్రిమపు పట్టు సరుకులయొక్కయు దిగుమతులు ఈ సంవత్సరపు మొదటి నాలుగు నెలలలో పూర్వపు అన్ని యేళ్లకంటె హెచ్చినవి. కోరా సరుకులు రంగు సరుకులు బహిష్కారోద్యమానికి ముందటి అంకెలను త్వరితంగా అందుకొంటూన్నవి. చివరకు వాటిని మించిపోయే సూచనలుకూడా ఉన్నవి. చివరకు జపాను సరుకులు చాలావరకు లాంకషైరు సరుకుల స్థానాన్ని ఆక్రమించవచ్చునని తోస్తూన్నది. అవి యిప్పటికే దిగుమతులన్నిటిలోకీ గురుతమ పరిమాణంలో ఉన్నవి. ఇండియా ఇప్పటికంటె కూడా ఇంకా ఎక్కువ అధమ స్థితికి రావచ్చును.

“ చాలా సంవత్సరాలనుండి భారతీయ వస్త్రపరిశ్రమతో గ్రేటు బ్రిటను కంటెకూడా జపానే చాలా తీవ్రతరంగా పోటీ చేస్తూన్నదనే సంగతి స్పష్టంగా కనపడుతూన్నది. మామూలు సంవత్సరంగా పరిగణింపబడతగిన 1929-30 సంవత్సరంలో గ్రేటు బ్రిటనునుండి 12,480 లక్షల గజాల నూలు దిగుమతి కాగా, 1924-25 లో 16,220 లక్షల గజాల నూలు దిగుమతీ అయింది; జపాను సరుకు 1924-25 లో 1,550 లక్షల గజాలు దిగుమతి అయింది; 1929-30 లో 5,620 లక్షల గజాలవరకు దిగుమతీ పెరిగింది.

“ ఈ సందర్భంలో జపానునుండి కృత్రిమపు పట్టు సరుకు దిగుమతులు విపరీతంగా పెరిగిపోతూన్న విషయం ప్రత్యేకంగా గమనించవలసి ఉంది. 1930 లోని చివరి నాలుగు మాసములలో 70 లక్షల గజాలు దిగుమతి కాగా ఈ సంవత్సరం మొదటి నాలుగు మాసములలో 240 లక్షల గజాల నూలుకు తక్కువ కాకుండా దిగుమతీ అయింది. ఇందువల్ల మిల్లు పరిశ్రమకంటెకూడా చేనేత పరిశ్రమ ఎక్కువ దెబ్బతింటూన్నదని నేనిక్కడ స్పష్టం చేయవలసి ఉన్నది. ఇంతకు పూర్వం దిగుమతీ అయిన కృత్రిమపు పట్టు దారంలో నూటికి 80 వంతులు చేనేత

పరిశ్రమచే ఉపయోగింపబడుతూండగా నూటికి 20 వంతులు మాత్రమే మిల్లు పరిశ్రమచే ఉపయోగింపబడుతూన్నట్లు అంచనా వేయబడింది.

"అంతేకాక మరొక సంగతికూడా నేను ముఖ్యంగా చెప్పవలసి ఉంది. జపాను సరుకులలో చాలా రకాలు ముతక నెంబర్లవిగానీ, మధ్య రకపు నెంబర్లవిగానీ ఉంటూన్నవి. వాటిలో చాలావరకు భారత దేశపు పత్తినుండి భారతీయ మిల్లులు ఉత్పత్తి చేయగలిగినవే. గ్రేటు బ్రిటను నుండి దిగుమతీ చేయబడుతూ ఉండిన సరుకులలో ఎక్కువ భాగ మిటు వంటివికావు.

"జపానునుండి దిగుమతి అవుతూన్న సరుకులకు బదులుగా తను బట్టలను ఉత్పత్తి చేయవలెనని భారతీయ మిల్లులు గట్టి ప్రయత్నాలు చేస్తున్నవి. కాని, ఖరీదులో వాటితో పోటీ చేయడానికి భారతీయ మిల్లులు ఈ రకాలను స్పష్టంగా నష్టానికి ఉత్పత్తి చేయవలసి ఉంది. అయితే జపాను పోటీవలన, రానున్న విపత్తునూ భారతీయ ప్రయోజనాలకు కలిగే వినాశకర ఫలితములను, చెప్పి ప్రజలలో చైతన్యం కలిగించడంద్వారా తమ ప్రయత్నాలు కొనసాగుననే దృఢవిశ్వాసం కలిగితేనే తప్ప అవి ఆ పనిని నిర్వహించగలవను కొనేటందుకు వీలులేదు.

"జపాను తన సరుకులను అంత తక్కువ ఖరీదుకు అమ్మగలుగుతూన్న వివిధ కారణాలను ఇక్కడ వివరించి ఉత్తరాన్ని నేను విస్తరింపచేయ కోరను. జపాను దిగుమతీ చేస్తూన్న సరుకుల తరగతులున్నూ, అవి అమ్మ బడుతూన్న ఖరీదున్నూ, లాంకషైరు వర్తకానికి భయ కారణములుగా రుజువయినట్లే, భారతీయ పరిశ్రమకుకూడా అంత తీవ్ర భయ కారణ ములుగానూ పరిణమిస్తూన్నవని మాత్రమే నేనిక్కడ చెప్పదలచు కొన్నది."

కాబట్టి బహిష్కారోద్యమ కార్యకర్తలు ఏమాత్రమైనా ప్రమత్తులుగా నున్నయెడల, ఆర్థిక దృష్టితో విచారించినచో బ్రిటిష్ వస్త్ర బహిష్కారమునుగూర్చి యెక్కువ పట్టుదలగా ఉండడంవలన ప్రయోజనం లేదని వారు గ్రహించాలి. జపాన్ బట్టవల్ల బ్రిటిష్ బట్ట ఎలా దెబ్బతిన్నదో సందర్భ వశాత్తూ ఎవరైనా గ్రహించగలరు.

—యంగ్ ఇండియా, 18-6-1931

# 122

# మూఢ విశ్వాసాలు కష్టంగా కానిపోవు

కాలిఫోర్నియానుండి మిస్టర్ హెన్రీ ఈటర్ ఇలా వ్రాస్తున్నాడు :

"నేను బ్రిటిష్ వారియందు సానుభూతి కలవాడనుకాను. నా పూర్వులు బ్రిటిష్‌వారినుండి స్వాతంత్ర్యం పొందడానికి 1776 లో వారితో పోరాడారు. కాని నేను పత్రికలలో చదువుతూన్న దానిని బట్టి నేనర్థం చేసుకోగలిగినంతవరకు, ఇండియానుండి బ్రిటను వెళ్లి పోవడం లాభంకంటె నష్టం ఎక్కువ. ఇండియా తనంతటు తాను పరిపాలించుకో జాలదని నేను ఊహించడం లేదు. కాని ప్రస్తుత స్థితిలో ఆ ప్రయత్నం చాలా కష్టమని నేను భావించకతప్పదు. కాని బ్రిటను ఇండియానుండి వెళ్లిపోయే యెడల, రష్యనులనుగానీ లేక యే యితర జాతిని కానీ బయట ఉంచగలిగేదెవరు? ఇండియాను గూర్చి నాకు తెలిసినంతవరకు, స్వసంరక్షణకు తగినంత సైన్యమూ దేశానికి లేదు.

"బహుశా మీరు ఇంగ్లీషువారికి బదులుగా రష్యన్ యజమానులను కోరుతూండవచ్చును. ఖైబరు కనుమలదగ్గర రష్యా వేచిఉన్నది. రష్యాకు ప్రాచ్యదేశాలను గూర్చి తెలుసును. అక్కడి ప్రజలు ప్రాచ్య, పాశ్చాత్య దేశాల మిశ్రమం. అయితే రష్యాకు పాశ్చాత్య సంస్కృతి ఉన్నది. ఇండియాకు దానితో కలుగగల సంబంధమేదైనా ఉంటే అది దానికి లోబడి ఉండవలసిన సంబంధం. నేను వ్యక్తిపరంగా రష్యాకు ప్రతికూలుడను కాను. పెట్టుబడిదారీ విధానమునకు ప్రతికూలంగా ఆ దేశం సాగిస్తూన్న యుద్ధం పాశ్చాత్య నాగరికతకు ఆశాజ్యోతి. ఇక్కడ అమెరికాలో మా పెట్టుబడిదారులందరిలోకీ పెద్ద అయిన హెన్రీ ఫోర్డు, ఐశ్వర్యమును న్యాయంగా పంచడం తప్పనిసరి అని గుర్తిస్తున్నాడు, రష్యా, ఇండియాకు యజమానిగా వుండడం నాకు ముఖ్యముగా నచ్చడం లేదు. రష్యాను యజమానిగాగల ఇండియా, తన ప్రత్యేక సంస్కృతిని భగ్నం చేసుకొంటుంది. ఇంగ్లాండుతో ఉన్న ఇండియా ఆ ప్రత్యేకతను ఎప్పటికీ ఉంచుకోగలిగింది.

"పాశ్చాత్య ప్రపంచంలో మేము భయపడ్డంతగా రష్యాయొక్క విపత్తును గూర్చి బహుశా మీరు భయపడరేమో. బ్రిటను ఇండియానుండి పోయేసరికి రష్యా, లోపల ప్రవేశిస్తుందని, అమెరికాలోని మాలో అనేక మందికి గట్టి నమ్మకం. ప్రస్తుత భారత దేశం, తనకుల-తత్వ విధానంతో, తన పురాతన పారిశ్రామిక వ్యావసాయిక పద్ధతులతో, పాశ్చాత్య దండయాత్రను తట్టుకోగలుగుతుందని నేను ఊహించలేకుండా ఉన్నాను. రక్షణకు మీకు జాతీయ నిర్మాణంలేదు. ఇండియాలో ఐకమత్యంలేదు. పాశ్చాత్య, సంస్కృతీ, సభ్యతా అభివృద్ధిపొందడానికి ఐకమత్యం అవసరము. పాశ్చాత్య దేశాలలో మేము చూస్తూన్న అభివృద్ధివంటిది ఇండియాలో అభివృద్ధి ఉన్నట్లు కూడా కనబడడంలేదు. కొందరే తిరిగి పాతపడిన నేత పద్ధతులను అవలంబించవలసిందని వాదిస్తున్నారు. పురోగమనమువలని మార్పు తప్పనిసరి అని మహా మేధావంతులైన మీరు గమనించడం లేదా? ముసలితనమునుండి తిరిగి బాల్యమునకు మీరు పోజాలరు. అటువంటప్పుడు నేతకు సంబంధించిన విజ్ఞాన యుతములైన విధానములనుండి అజ్ఞానయుతములైన పద్ధతులకు మీరెట్లు మరలగలరు? దానివలన ఏమైనా ప్రయోజనం కలుగుతుందని ఎట్లాశించగలరు? కష్టమైన పాత పద్ధతి ప్రకారం పనిచేస్తూండగా తేలికయిన కొత్త పద్ధతి ఉన్నదని మీరు గమనిస్తారు. అప్పుడు కష్టమయిన పాత పద్ధతితో మీరు సంతృప్తిపడజాలరు. కొత్త పద్ధతిని అవలంబించి జపాను ఏ విధంగా శక్తివంతమయిందో మీకు తెలుసును. చైనా కూడా చైతన్యవంతమవుతూన్నది. ప్రపంచంలోని నూతన విధానాలను ఇండియా ఒక్కటే గమనిస్తూన్నట్లు లేదు. ఇండియా మహానాయకులయిన మీరు మీ ప్రజలకు అభ్యుదయ మార్గము నేల ప్రబోధించరు? నాకీ రెండు ప్రశ్నలు ఎక్కువగా చీకాకు కలిగిస్తూన్నవి? ఇంగ్లాండునుండి ఇండియా స్వాతంత్ర్యం పొందినప్పుడు రష్యా తనకు భయకారణమవుతుందని ఇండియా ఎందుకు గ్రహించలేదు? అన్నిటికంటెనూ ముందు యంత్ర సహాయంతో కూడిన నూతన శ్రామిక విధానాన్ని అవలంబించడంలోనే భారత స్వాతంత్ర్యం ఉన్నదని, మహాత్మా గాంధీ తన ప్రజలు గుర్తించేటట్లు ఎందుకు చేయలేదు? వీటికి జవాబు మీ ఒక్కరికే తెలిసి ఉండాలి. కాబట్టి మీరు నాకవి చెప్పవలెనని చాలా కోరికగా ఉంది. నా పుట్టుకవలనను సంప్రదాయమువలనను కూడా నేను యునైటెడ్ స్టేట్సు ఆఫ్ అమెరికా పౌరుడను. కాని ప్రపంచ వ్యవహారాలలో నాకు వ్యక్తిగతమైన ఆసక్తి ఉంది. అందువల్ల నేను నమ్రతతో ప్రపంచ పౌరుడనుగా భావించుకొంటున్నాను. నేను హాజరవు

తూన్న క్యాలిఫోర్నియా యూనివర్శిటీలో ఇండియా సమస్య తలెను త్తూంటుంది. బ్రిటిష్‌వారికి ప్రతికూలంగా సాధారణ సానుభూతి మీ మీదనే ఉంది. కాని ఇండియాలోని నాకు తెలిసిన ప్రస్తుత పరిస్థితిని బట్టి రెండు చెడుగులలోకి ఇండియాలోని బ్రిటిష్ యాజమాన్యం తక్కువ చెడుగుగా కనిపిస్తున్నది. రెండవ చెడుగు నేనిదివరకు చెప్ప ప్రయత్నించిన రష్యా ఆధిపత్యం. కాని ఈ విషయాన్ని గురించి మీరేమను కొంటున్నారో తెలుసుకోవలెనని మా కోరిక."

ఈ ఉత్తరం రెండు మూఢ విశ్వాసాలను వెల్లడి చేస్తూన్నది. భారత దేశం అంతరంగిక వివాదములతో తన్ను తాను రక్షించుకోలేదు గనుక స్వపరిపాలనకు అర్హం కాదనేది వాటిలో ఒకటి. బ్రిటను వెళ్లిపోయినట్లయితే రష్యా ఇండియాపైన పడడానికి సంసిద్ధంగా ఉన్నదని ఈ విలేఖకుడు అకారణంగా భావిస్తున్నాడు. ఇది రష్యాకు అవమానం. బ్రిటను చేత పరిపాలింపబడని ప్రజలందరిపైనా అధికారం చలాయించడం ఒకటే పనియా రష్యాకు? ఇండియాపైన రష్యా కటువంటి దుష్టమైన ఉద్దేశం ఉన్నప్పటికీ, బ్రిటిష్‌వారిని అధికారమునుండి తొలగించగలిగిన శక్తియే మఱొక ఆధిపత్యమును ఆపగలిగి తీరుతుందని ఈ విలేఖకుడు గ్రహించజాలడా? పరస్పరాంగీకారంవల్ల భారత ప్రతినిధులకధికారం అప్పచెప్పబడినప్పుడు ఒక షరతు ఉండాలి. దాని ప్రకారం, బుద్ధిపూర్వకంగాగానీ, అబుద్ధిపూర్వకంగాగానీ కడచిన ఇన్ని సంవత్సరాలలో ఇండియాను స్వసంరక్షణ కర్హమయ్యేటట్లు చేయనందుకు ప్రాయశ్చిత్తంగా విదేశీయుల దండయాత్రనుండి దానిని రక్షించేటందుకు బ్రిటను హామీ ఈయాలి.

బ్రిటిష్ ఆక్రమణదారు సందర్భంలో నిరుడు సాత్త్వక నిరోధ మవలంబించి కొంతవఱకు జయం పొందినట్లుగానే ఓడింబడిక ఉన్నప్పటికీకూడా, యే దురాక్రమణదారునైనా

సరే సాత్విక నిరోధముతో ఆపగలిగిన జాతీయ శక్తి వయునసే వ్యక్తిగతంగా నేనెక్కువ ఆధారపడిఉంటాను. దేశము మనసా వాచా కర్మణా అహింసను పూర్తిగా ఆచరింపగలిగినప్పుడే సంపూర్ణ విజయం కలుగుతుంది. దేశ వ్యాప్త సత్యాగ్రహ విజయముయొక్క ప్రత్యక్ష ప్రదర్శనం, యావత్ప్రపంచమూ దానిని అంగీకరించేటందుకు నాందికా గలదు. కనుక ఆయుధ ధారణం నిరుపయోగమని ఒప్పు కోవడం దాని సహజోపలక్ష్యమే అవుతుంది దౌర్జన్యమునకు ప్రత్యక్ష చిహ్నమైన ఆయుధ ధారణకు విరుగుడు, అహింసకు ప్రత్యక్ష చిహ్నమైన సత్యాగ్రహము మాత్రమే. కాని ఈ విలేఖకుడు మన అంతః కలహాలను గూర్చిన భీతివలనకూడా కుంగిపోతున్నాడు. ఒకటి పాశ్చాత్య దేశాలకు పంపబడే వార్తలలో అవి అత్యంతం అతిశయోక్తులతో వర్ణింపబడు తూండడం. రెండు విదేశీయాధికారంకింద అవి నీఘనభవిం చడం. సామ్రాజ్య పరిపాలన అనగా చీలదీసి పాలించడం! కాబట్టి శీతల విదేశీయాధికారం ఉపసంహరింపబడి నిజమైన స్వాతంత్ర్యమనే ఉష్ణ తపంకింద అవి కఱగిపోవలసిందే.

రెండవ మూఢ విశ్వాసం రాటమును గుఱించింది. అది మరీ ఘనీభవించి ఉంది. భారత దేశంలోకూడా కొంత మందికి మూఢ విశ్వాసం ఉంది. యంత్ర విధానం విజ్ఞాన పూర్వకమైనదని చేతి పరిశ్రమ అజ్ఞాన పూర్వకమైనదనీ అన్నప్పుడే ఈ విలేఖకుడు తాను చెప్పేదే నిజమైనట్లు భావిస్తున్నాడు. చేతికి బదులుగా అన్ని సందర్భాలలోను యంత్రాలను ఉపయోగించడం ఉచితమా " అనే విషయం ఇంకా ధ్రువం కావలసిఉంది. అంతేకాదు కష్టమయిన దానికంటె తేలికయినది ఎక్కువ మంచిదనడంకూడా

నిజంకాదు. ప్రతి మార్పు మంచిదనీ, పాతదంతా విడిచి పెట్టతగిన దేననీ కూడా ఇంకా బాగా రుజువు కావాలి.

ఇతర వృత్తులులేని లక్షలాది ప్రజలు చేతులతో తేలికగాం చేయతగిన పనికి యంత్రవిధానం హానికరమని నా అభిప్రాయం. పందొమ్మిది వందల మైళ్ల పొడవు పదిహేను వందల మైళ్ల వెడల్పుగల భూఖండంలో వ్యాపించి ఉన్న ఏడు లక్షల గ్రామాలలోని కోట్లాది ప్రజలు, తమ ఆహారాన్ని తాము తయారుచేసుకొంటూన్నట్లే, తమకు కావలసిన బట్టను తమ గ్రామాలలోనే ఉత్పత్తిచేసుకోవడం ఎప్పటికైనా ఎక్కువ మంచిదీ ఎక్కువ క్షేమము. జీవిత ప్రధానావసర వస్తువుల ఉత్పత్తి గ్రామస్థుల చేతులలో లేనియెడల, అనాదినుండీ గ్రామాలనుభవిస్తూ వచ్చిన స్వాతంత్ర్యాన్ని అవి నిలుపుకోలేవు. పాశ్చాత్య విమర్శకులు, పాశ్చాత్య పరిస్థితులనుబట్టి, తమ విషయంలో నిజమైనది ఇండియా విషయంలో కూడా నిజం కావలెనని తొందరపడి వాదిస్తూంటారు కాని చాలా ముఖ్యమైన విషయాలలో ఇండియా పరిస్థితులు వేరుగా ఉన్నవి. ఆయా పరిస్థితులనుబట్టి వివిధ విధాలుగా ఆర్థిక సిద్ధాంతాలను వర్తింపచేయవలెను.

యంత్ర విధానం తేలిక అనడానికేమీ సందేహంలేదు. అంతమాత్రంతో అది తప్పని సరిగా క్షేమకరం కానక్కర లేదు. ఒక చోటుకు దిగడం తేలిక కావచ్చును. కాని అది అపాయకరం. కనీసం ప్రస్తుత సందర్భంలో అయి నప్పటికీ. చేతితో పనిచేసే విధానం కష్టం కనుకనే అది క్షేమకరం. యంత్ర విధానమును గూర్చిన పిచ్చి ఇలాగే కొనసాగేటట్లయితే, మనం అసమర్థులమూ దుర్బలులమూ అయి దేవుడు మనకు ప్రసాదించిన సచేతనములయిన

యంత్రాల ఉపయోగమును విస్మరించినందుకు, మనను మనం నిందించుకోవలసిన రోజు ఒకటి రాగలదనే మాట ఎక్కువ నిజంగా కనిపిస్తూన్నది. ఉత్తరాది ప్రజలు కసరతువల్లనూ ఆటలవల్లను శక్తివంతులు కాజాలరు. అయినా ఉపయోగ కరములూ ఉత్పత్తిదాయకములు అయిన కష్టపు వృత్తులకు బదులుగా నిరుపయోగములు వ్యయ సమన్వితములు అయిన ఆటలు, కసరతుల కోసం ప్రజలెందుకు వెంపరలాడాలి? ఈనాడవి ఒక మార్పుగా చిత్తాకర్షంగా బాగుండవచ్చును. కాని ఉత్పత్తి చేయుడంలో మన జోక్యం కానీ కృషి కానీ లేని ఆహారాన్ని భుజించేటందుకు కావలసిన ఆకలి కోసం మనం ఈ పనులు చేయక తప్పని సరియైనప్పుడు మాత్రమవి మనకు విసుగు పుట్టించగలవు.

ఇక చివరి సంగతి; పాతది ప్రతిదీ చెడ్డదనే నమ్మకం నాకు లేదు. సత్యం పాతది, కష్టమైనది. అసత్యానికి చాలా ఆకర్షణలు కలవు. కాని నేను సత్యకాలం నాటి పురాతన స్వర్ణయుగానికి సంతోషంగా మరలిపోగలను. నాజూకు కోసం వివిధ పరివర్తనములను పొందడంలో పుష్టి నిచ్చే పదార్థాన్ని చాలావరకు పోగొట్టుకొన్న తెల్లనిజిగురు రొట్టెకంటే మంచి గోధుమ వన్నెగల పూర్వకాలపు గొట్టె ఎప్పటికైనా ఎక్కువ మేలు. పాతవి మంచివి అయిన వస్తువుల జాబితాను అనంతంగా కూర్చవచ్చును. కనీసం ఇండియాకు సంబంధించినంతవరకైనా రాటం అటువంటి వస్తువులలో ఒకటి.

భారత దేశం స్వయం సహాయకము, స్వావలంబితము, అయి దోపిడి విధానానికీ ప్రలోభనమునం లోనుగాని పరిస్థితిలో ఉన్నప్పుడు, ప్రాచ్య పాశ్చాత్య దేశాల దురాశా పూరితములయిన ఆకర్షణలకు గురికావడం మాని, ఆయుధ ధారణముయొక్క అధిక వ్యయభారాన్ని తొలగించుకొని క్షేమంగా ఉండగలదు. తన ఆంతరంగిక ఆర్థిక విధానమే, దురాక్రమణకు ప్రతికూలంగా ఇండియాకు పెట్టని కోట కాగలదు.

—యంగ్ ఇండియా, 2-7-1931

## 123

# జపాను భయ కారణం

ఒకానొక విలేఖకుడిలా వ్రాస్తున్నాడు :

"దూర ప్రాచ్యదేశపు బ్రిటిష్ శాటక్ మిషన్ వారి నివేదిక చైనా లోని లాంకషైరు వస్త్ర వ్యాపార పరిస్థితిని సమీక్షచేస్తూ, లాంకషైరు వ్యాపార మాంద్యమును భారతీయ బహిష్కారోద్యమముతో ముడిపెట్టే ఆందోళనకు తగిన ప్రత్యుత్తరాన్ని సమకూరుస్తూన్నది. చైనాలోని పరిస్థితి ఏ బహిష్కారోద్యమమువలనను చిక్కులో పడలేదు. అయినప్పటికి గ్రేటు బ్రిటనునుండి చైనాకు దిగుమతి అయ్యే దూది బట్ట 1909—13 సంవత్సరాలలో 5,873 లక్షల గజాలుకాగా, 1930 లో 694 లక్షల గజాలకు తగ్గిపోయినది. జపాను వ్యాపారమువలన చైనా అంగడినుండి, లాంకషైరు దాదాపు తరిమివేయబడినట్లే కనిపిస్తూన్నది. లాంకషైరు కష్టాలు నిజానికి జపానుయొక్క బలవత్తరమైన పోటీవలన కలిగినవేనని కమీషనువారియొక్క నిర్ణయముకానీ సిఫారసులుకానీ నిరూపిస్తూన్నవి. కాబట్టి వారందుకు సూచిస్తూన్న పరిహారాలు చాలా ప్రధానములయినవి. కమీషన్ వారి నివేదికనుండి సంగ్రహింపబడిన ఈ దిగువ వాక్యములు చదవడానికి ఉత్సాహకరములుగా నుండగలవు :

'లాంకషైరు తన దేశంలో అంగళ్లకంటె విదేశీ అంగళ్లమీద ఎక్కువగా ఆధారపడి ఉంటూన్నది. గత కాలంలో చీనా దానికి ప్రాముఖ్యమైన అంగళ్లలో ఒకటిగా ఉండేది.

'1912 లో అది 80,000 లక్షల గజాల పొడవుగల బట్టను ఉత్పత్తిచేసింది. 1924 లో 56,000 లక్షల గజాల పొడవుగల బట్ట ఉత్పత్తి అయింది ; 1930 లో 40,000 లక్షల గజాలకు బహుశా చాలా తక్కువే ఉత్పత్తి అయింది.

'1909—13 సంవత్సరాలలో సగటున 5,870 లక్షల గజాల పొడవుగల బట్టను చైనాకు హాంగ్ కాంగ్ కూ ఎగుమతిచేసింది గ్రేటు బ్రిటను. 1929 లో 2,100 లక్షల గజాలు ; 1930 లో 690 లక్షల గజాలు మాత్రమే ఎగుమతిచేసింది. 1930 లో బ్రిటను, చైనా, హాంగ్ కాంగులకు చేసిన ఎగుమతుల విలువ జపాన్ ఎగుమతుల విలువకు నాలుగు రెట్లు ఉంటుంది. కాని 1930 లో జపాను ఎగుమతుల

విలువలో బ్రిటను ఎగుమతుల విలువ ఆరవ వంతుగా మాత్రమే ఉన్నవి. ఈ సంవత్సరం (1930) చైనా హాంగ్ కాంగ్ లకు జపాన్ పంపిన బట్టలు గ్రేటు బ్రిటను పంపినవాటికి 9 లేక 10 రెట్లు మధ్య ఉంటవి.

'చైనా ప్రజలలో అత్యధిక సంఖ్యాకుల కొనుగోలు శక్తి పడి పోయిన కారణంచేత వారికి నాణ్యం అప్రధానమయింది. చైనా అంగడిలో తాను పోగొట్టుకొన్న స్థానాన్ని లాంకషెరు తిరిగి పొందవలె నంటే తన ముఖ్య పోటీదారైన జపాన్ సరుకుల ఖరీదుకంటె ఎక్కువ కాని ఖరీదుకు తన సరుకులను అంగడికి పంపగలిగి ఉండాలి. ఇది జరగకపోతే చైనాతో దాని వ్యాపారం అంతకంతకు క్షీణించిపోక తప్పదు.

'ప్రతి దశలోనూ—నూలు తీసేవారు ముడిపత్తి కొనడం మొదలుకొని తయారైన బట్టను బేళ్లు కట్టేవరకు, బేళ్లు కట్టడంతో సహా—లాంకషెరుకంటె జపానుకు ఖర్చులు ఎక్కువగా కలిసి వస్తూన్నవి. కొన్ని దశలలో ఈ కలిసి రావడం తక్కువ కావచ్చును. కాని మొత్తంమీద ఎక్కువగా కలిసి వస్తూన్నవి.

'లాంకషైరు సరుకుల ఎగుమతిలోనూ, అమ్మకంలోనూ మన పద్ధతులను పూర్తిగా మార్పుచేయనియెడల, చైనాలోని పరిస్థితి అభివృద్ధి కాదని మాకు నమ్మకం తోచింది.

'అమ్మకపు విధానంలో మార్పు జరిగినంత మాత్రంతో సరి పోదు.

'కాబట్టి, ముడిపత్తి కొనడం మొదలు తయారైన బట్టను అమ్మే వంతవఅకూ, ఈ పరిశ్రమలో నిమగ్నులైనవారంతా, పత్తి దిగుమతి చేయడం, వడకడం, ఉత్పత్తిచేయడం, చలవచేయడం, రంగువేయడం, తయారీచేయడం, అమ్మడం మొదలైన పనులు చేసేవారితో సహా (యజమానులు, నౌకర్లూకూడా) పోటీ ఖరీదులకు నూలును బట్టనూ అంగడిలో అమ్మకానికి పెట్టేటందుకు వీలుగా ఖర్చులు తగ్గించే విధానాన్ని గూర్చి ప్రత్యేకంగానూ సమష్టిగానూ ఆలోచించవలసిందని ప్రార్థిస్తున్నాము.

'మన దేశంలో జీవిత ప్రమాణాన్ని తగ్గించడం మా ఆశయం కాదనీ, మా ఆశయం అందుకు కేవలం ప్రతికూలమైనదనీ మేము నొక్కి చెప్పదలచుకొన్నాము. లాంకషైరులో ఇప్పటికీ అనేక వేలమంది

నిరుద్యోగులున్నారు. అంతకంటె ఇంకా ఎక్కువమంది చాలినంత పనిలేనివారున్నారు. మేము తూర్పు దేశాలలో చూచినదానిని బట్టి, ఈ పరిస్థితిని వెనుకంజవేయకుండా ఎదుర్కొంటేనే తప్ప లేని యెడల మతి విషమిస్తుందని మా నమ్మకం. జీతాల జాబితాలలోగానీ, ప్రస్తుత మజూరీలలోకానీ ఉన్న ఎగుడుదిగుడులను అలా ఉంచివేయడంవలన లాంకషైరు కార్మికులకు తక్కువ పని తక్కువ సంపాదన లభిస్తూన్నట్లయితే అవి ఉంచడంవలన ప్రయోజనం లేదు. అదే విధంగా గిట్టుబాటుకాని ఆర్థిక విధానములవలన, ఒకప్పుడు గ్రేటు బ్రిటనుకు గర్వకారణమయిన దూది బట్టల ఎగుమతి వ్యాపారం క్షీణించి పోతూన్న యెడల, ఆ విధానములను ఉంచుకొన్నందువలనకానీ ఉంచుకోవడానికి ప్రయత్నించినందువలనకానీ, ఉత్పత్తిదారులలోనూ, వర్తకుల లోనూ యే వర్గమునకూకూడా ప్రయోజనం లేదు.

'పూర్తిగా మార్పులు జరిగితేనే తప్ప ప్రాచ్యదేశాలలో లాంకషైరు తన వర్తకాన్ని పెంపొందించుకోగలుగుతుందనే ఆశలేదు. నిజానికి పోటీ ఖరీదులకు తన సరుకులను అమ్మగలిగేటంతవరకు దాని వ్యాపారం క్షీణిస్తూనే ఉంటుంది. జయం పొందేటందుకు తేలిక మార్గంలేదు. ప్రస్తుతం యేదో కొంత త్యాగం కూడా చేయవలసి రావచ్చును. ఈ పరిశ్రమకు సంబంధించినవారందరిపైన మహత్తరమైన బాధ్యత పడింది. చరిత్రలోకెల్ల క్లిష్టతమమైన పరిస్థితి లాంకషైరును ఎదుర్కొంటూన్నది.'

ఇండియాలోని లాంకషైరు వస్త్ర వ్యాపార స్థితి చాలావరకు చైనాలోని స్థితివలెనే ఉన్నది. ఇక్కడకూడా, ఇండియాలోకి దిగుమతి అయ్యే విదేశీ బట్టలలో గ్రేటు బ్రిటనుయొక్క భాగం క్షీణించిపోవడానికి కారణం జపానుయొక్క గట్టి పోటీయే. లాంకషైరు ఈ పరిస్థితిని గూర్చిన అసలు విషయాలను పరిశీలించి తన విధానాలను ఆలోచించుకో వలసి ఉండగా, ఇందులో మనం నేర్చుకోవలసిన పాఠం కూడా ఉన్నది. లాంకషైరు స్థానాన్ని జపానును ఆక్రమించనిచ్చే యెడల మన తుది స్థితి మొదటి స్థితికంటె శ్రేయస్కరం కాదు."

ఈ నా విలేఖకుడుదాహరించిన విషయం మన గర్వభంగ కారణమైనప్పటికీ ఇందులో రెండు పాఠాలున్నవి. బ్రిటిష్ వస్త్రములను తోసివేసినది జపానువారి సమర్థత

అయినంతగా మన ఖద్దరు ప్రచారోద్యమం కాదు. ఇక మన మిల్లులు కాలానుగుణంగా నడుచుకోలేకపోతే, ప్రజలలో స్వదేశీ తత్వాన్ని రేకెత్తించడానికి కాంగ్రెసెంత ప్రయత్నం చేసినప్పటికీ, ఈ పందెంలో జపానే గెలుస్తుంది. అసమర్థతను కాపాడడానికి నిషేధపు పన్ను వేయడం తగదు. అయితే జపానులో ప్రజలు ప్రభుత్వము ఒకటేనని నాకు తెలుసును. కాని మనం కూడా ఆ స్థితికి వచ్చినప్పటికీ, బహుశా ఇప్పటికంటె కూడా ఎక్కువ సమర్థత అవసరం.

—యంగ్ ఇండియా, 16-7-1931

# 124

# విదేశీ బట్టల ప్రమాణం

విదేశీ బట్టల వ్యాపారస్థులకున్నూ, కాంగ్రెసు కార్యకర్తలకున్నూ మార్గదర్శకంగా ఉండేటందుకు వర్కింగు కమిటీ ఈ క్రింది ప్రమాణాన్ని అంగీకరించింది :

" విదేశీ బట్టను నూలును బహిష్కరించడమును గూర్చి ఈ క్రింది ప్రమాణమునకు అనుగుణంగా లేని యే ప్రమాణమైనా చెల్లతగనిదిగా భావింపబడవలెనని తీర్మానించడమైనది :—

' కాంగ్రెసు వర్కింగు కమిటీవారు మరొక విధంగా చేయవలసిందని తీర్మానంద్వారా స్పష్టంగా అనుమతి ఇచ్చేయనంతవరకూ, ఈ కింది షరతులను మేము అనుసరించెదమని మా అంతట మేము ప్రమాణం చేస్తున్నాము :—

" 1. దూది, ఉన్ని లేక పట్టునుండి తయారైన విదేశీ నూలునుగానీ లేక ఆ నూలు ద్వారా తయారైన బట్టనుగానీ దేనినీ విక్రయించకుండేటందుకు మేము ఒప్పుకొంటున్నాము.

" 2. కాంగ్రెసు షరతులను ఆమోదించని మిల్లులు తయారు చేసిన బట్టనుగానీ నూలునుగానీ కొనకుండుటకు అమ్మకుండుటకూ అంగీకరిస్తున్నాము.

" 3. మాకడ నిల్వ ఉన్న విదేశీ నూలుగానీ, లేక పట్టు, లేక ఉన్ని, లేక అట్టి నూలుతో, లేక పట్టుతో లేక ఉన్నితో తయారైన బట్టనుగానీ ఈ దేశంలో అమ్మకుండుటకు మేమామోదిస్తున్నాము ". " "

కాంగ్రెసు కార్యకర్తలుగానీ లేక సంస్థలుగానీ యాదృచ్ఛికంగా అంగీకరించిన అన్ని ప్రమాణాలు, ఈ ప్రమాణంతో రద్దయిపోతవనే విషయం ఇందుకు సంబంధించిన

వారందఱూ తెలుసుకొందురుగాక. విదేశీ బట్టలను గూర్చిన ఈ మినహాయింపు తాత్కాలిక విషయం కాదని వర్తకులు నిశ్చయించుకొందురుగాక. వారు స్వదేశీ వ్యాపారాన్నయినా అవలంబించాలి, ఖాదీ అయితే యింకా మంచిది; లేదా జాతీయ క్షేమానికనుగుణంగా ఉండే మఱేయితర వృత్తినైనా అవలంబించాలి.

—యంగ్ ఇండియా, 16-7-1931

# 125

# కొన్ని ప్రశ్నలు

ఖాదీ ప్రియులకీకరింద కొన్ని ప్రశ్నలున్నవి :

" ఖాదీ ప్రచారమును గూర్చి కరాచీ కాంగ్రెసులో ఆమోదింపబడిన తీర్మానము ఆ ఆశయానికెలా సహాయకారికాగలదో మీరు దయచేసి వివరింపగలరా ? దేశీయ మిల్లు యజమానులు చేతితో వడికిన బట్టను తాముపయోగించడంద్వారా, గ్రామాలలో ఉపవృత్తిగానుండే వడుకు పరిశ్రమకు వారి నైతిక సహాయాన్ని ఈయవలసిందని కోరబడ్డారు. వారి ప్రస్తుత మిల్లులను అభివృద్ధిచేసుకొనే వుద్దేశంతో వాటిని సాగించుకొనేటందుకు నిరాటంకమైన హక్కును వారిప్పుడనుభవిస్తూండగా కేవలం వారు వడుకు నూలును ఉపయోగించినంతమాత్రంతో ఖద్దరుకు నైతిక సహాయం చేయడం అవుతుందా ? మిల్లు యజమానులు మిల్లులకూ చరఖాకూ ఉండే విరోధభావాన్ని తెలుసుకొని, ఋజు మార్గంలో తమ కార్యకలాపాలను క్రమక్రమంగా తగ్గించుకోవడానికి ప్రయత్నించనియెడల, నైతిక సహాయం లేదనియే నా వినయపూర్వకమైన అభిప్రాయం. ఖద్దరుకు బదులుగా వినియోగ పడేటందుకు, మిల్లులు ఎక్కువ నాజూకు, ఎక్కువ చౌక అయిన బట్టలను ఉత్పత్తి చేస్తూఉంటే ఖద్దరు ఎలా నిలుస్తుందో ఎవరి ఊహకూ అందడంలేదు. పైగా మిల్లు యజమానుల బట్ట ఖరీదును తగ్గించమని కోరడం ఖద్దరును చంపడానికి ఖచ్చితమైన ఉపాయం."

ఇవన్నీ మంచి ప్రశ్నలు. మిల్లు యజమానులు వ్యక్తిగతంగా ఖద్దరును ఉపయోగించడం వారి అంతరంగిక విశ్వాసానికి చిహ్నంకాని యెడల, అది నిరుపయోగమనే మాట నిస్సందేహం. పైగా అది కాపట్యానికికూడాచిహ్నం కావచ్చును. తోటమాలి చిన్న మొక్కలకు అపాయం లేకుండా ఉండేటట్లు, ఏ వాతావరణంలోనైనా పెరగదగిన పెద్ద మొక్కలను దూరం దూరంగా పెట్టినట్లే, మిల్లు యజమానులకు అంతరంగిక విశ్వాసం ఉన్నట్లయితే,

ఖద్దరు ఎప్పుడూ అపాయం కలుగని పద్ధతిని తమ మిల్లులను నడుపుకొంటారు. పరివర్తన దశలో మిల్లులు ప్రయోజనకరంగా ప్రవర్తించగలవనే నమ్మకంతోనే మిల్లులను గూర్చిన కాంగ్రెసు సిద్ధాంతం ఆధారపడిఉంది. బహిష్కారోద్యమంతో సానుభూతి కలిగి మిల్లులు పనిచేసే యెడల వాటి ద్వారా తక్షణం విదేశీ బట్టలను బహిష్కరించడం ఎక్కువ తేలికవుతుంది. ఇంగ్లీషు, జపాను, ఇటాలియన్, మొదలైన తదితర మిల్లులతో కలిసిన స్వదేశీ మిల్లులతోకంటె, కేవలం స్వదేశీ మిల్లులతో వ్యవహరించడంకానీ పోటీచేయడంకానీ ఖద్దరుకు ఎక్కువ తేలిక. స్వదేశీ మిల్లుల సంఖ్యాభివృద్ధిని గూర్చి ఖద్దరువాదులు భీతిలనక్కర లేదు. ఖద్దరుయొక్క ఆర్థిక ప్రభావం ఇంకా పూర్తిగా విదితంకాలేదనేటందుకు మిల్లుల అభివృద్ధియే నిదర్శనమన్నమాట నిజమే. ఖద్దరు సార్వజనీనమైనప్పుడు చాలా మిల్లులు తమ వృత్తి పోయినట్లు తెలుసుకోగలవు. ఖద్దరు, ప్రజలపైన అటువంటి వశీకరణ శక్తిని సంపాదించుకొంటుందా అని ఊహించడం అనవసరం. అది కార్యకర్తల విశ్వాసపాత్రతపైన ఆధారపడి ఉంటుంది. ఖద్దరును గూర్చి వర్తింపచేయబడిన వాదంలో యేమీ పొరపాటు లేదు. లక్షలాది గ్రామస్థులకు నిజమైన విద్య నేర్పడము, జాతీయాభిరుచిలో మార్పు కలిగించడం, దేశంనుండి దారిద్ర్యమును పారద్రోలడానికి రాటముయొక్క అద్భుత శక్తిని గుర్తింపచేయడము, మాత్రమే కావలసిఉన్నవి. ఉపవాసములకు వాటివలనకలిగే దుష్ఫలితాలకు భీమాగా ఉండతగిన ఒకానొక విధానాన్ని సూచించగలగడం స్వల్ప విషయంకాదు.

ఇక రెండవ ప్రశ్న: మిల్లు లెక్కువ సన్నని బట్టలను ఉత్పత్తిచేయవలసిన అవసరాన్ని గూర్చి ప్రశ్నించేటందుకు

పిలు లేదు. ఖద్దరు యుగంలో ప్రజలు సన్నని ఖద్దరును కలిగిఉండిరి. ఇప్పుడుకూడా అది ఉత్పత్తిచేయబడుతూనే ఉన్నది. కాని అంత ప్రమాణంలో కాదు; కోరిన వారందటికీ లభించేటంత చాకగానూ లేదు. కాబట్టి పరివర్తన దశలో సన్నని బట్టను ఉత్పత్తి చేసేటందుకు మిల్లులు ప్రోత్సహింపబడవచ్చును. మిల్లులు ఎక్కువ సన్నని నంబర్లను మాత్రమే ఉత్పత్తిచేయవలెననే నియామకం ఖద్దరుకే పూర్తిగా లాభదాయకమని గ్రహించడం తేలిక.

ఇక చివరకు ఖరీదులను గూర్చి: ఖద్దరును బ్రతికించడానికి మిల్లు లెక్కువ ఖరీదులు పుచ్చుకోవలెనని ఈ విలేఖకుడు సూచించడం లేదన్నది నిశ్చయం. ఖద్దరు పునరుద్ధరణకు మూలపురుషుడనైన నాకు, ఖద్దరు రక్షణకోసం మిల్లు సరుకుల ధరలు హెచ్చించవలెననే కోరిక ఎప్పుడూ కలుగనే లేదు. వినాశహేతువైన పోటీకి ప్రతిరోధంగా రక్షణ కోరడం వేరు; ఒకే రకపు పరిశ్రమయొక్క రక్షణకైనప్పటికీ కూడా, అనేకమందికోసం యే కొలదిమంది చేతనో ఉత్పత్తి చేయబడుతూన్న సరుకులను ఎక్కువ ఖరీదుకు అమ్మించకోరడం వేరు. ఈ రెంటికీ చాలా భేదం ఉంది ఖద్దరు అర్థశాస్త్రం సాధారణ అర్థశాస్త్రము నుండి పూర్తిగా భేదిస్తుంది. రెండవదానికి మానవ ప్రసక్తి లేనేలేదు. మొదటిదానికి మానవ సంబంధం మాత్రమే ఉంది. రెండవది స్పష్టంగా స్వార్థపరతగలది. మొదటి దానిలో స్వార్థరాహిత్యం ఉండే తీరాలి. కాబట్టి ఖద్దరు భావనలో పోటీ ఖరీదులనే ప్రశ్నే లేకుండాపోయినవి. పూటకూళ్ల ఇళ్లకూ సొంత వంట ఇళ్లకూ పోటీ ఉండదు. తన శ్రమ విలువను గూర్చిగాని వంట యింటి వైశాల్యమును గూర్చిగాని లెక్క కట్టవలెననే ఆలోచన గృహ యజమాను

రాలికి తట్టనేతట్టదు. పిల్లలను కనడమెటువంటి ధర్మమో వంటయింటి పనిచేయడంకూడా అటువంటి ధర్మమేనని మాత్రం ఆమెకు తెలుసును. ఆమె అలా లెక్క కట్టేటట్లయితే, తేల్చుకొన్న విషయాల పర్యవసానంగా, తన వంట యింటినీ, పిల్లలనూ కూడా తప్పకుండా ధ్వంసం చేయవలసివస్తుంది. కొంతమంది రెండూ చేశారు. అదృష్టవశాత్తు ఆ సిద్ధాంతం ఎక్కువగా ఆచరణలోకి రాలేదు. గృహంలోని రాట్నాన్ని నాశనం చేసుకొన్ననాడే భారతీయ మానవ సమాజమునెడల పాపం చేసినట్లు తెలుసుకోవడానికి మన సహజాలసత్వమే అభ్యంతరంగా ఉన్నది. మనం మన పాపమును గూర్చి పశ్చాత్తాపపడి శాంతిప్రదమైన రాట్నంవైపుకు మఱలెదముగాక.

—యంగ్ ఇండియా, 16-7-1931

# మిల్లు యజమానులు చేయగలిగినది

కిందటి వారం జపాను వ్యాపారాన్నిగూర్చి నేను ప్రచురించిన ఉత్తరమును వ్రాసినవారే ఈ దిగువ విషయాన్ని పంపుతున్నారు :

“దూరప్రాచ్య దేశమునకు పంపబడిన బ్రిటిష్ కాటన్ కమిషన్ వారి నివేదికను పరిశీలించగా, తన ప్రదేశాలలోకి దిగుమతి అయ్యే అన్ని విదేశీ బట్టలను రాకుండా చేయడమేగాక, తన ప్రజలు ఉత్పత్తి చేసిన సరుకులకోసం విదేశాలలో అనేక అంగళ్లను స్వాధీనపరచుకోవడంలో జపానుయొక్క అద్భుత శక్తి ప్రస్ఫుటమౌతూన్నంతగా యింకేమీ ప్రస్ఫుటం కావడంలేదు. జాతీయ ప్రభుత్వం వర్తకమునకు పరిశ్రమలకు యిస్తూండే సహాయ ప్రోత్సాహములీ ఫలితమునకు తోడ్పడిన మాట నిజమే. కాని ఎగుమతి వర్తకమును విస్తరింపచేయవలెననే మహత్తర జాతీయ సంకల్పం ముందు కేవల ప్రభుత్వ సహాయం ప్రస్తుతించ తగినంతగాలేదు. ఆ నివేదికలో యిలా ఉంది. ‘జపాను భవితవ్యము నిరంతరాభివృద్ధి పొందే విదేశవ్యాపారాన్ని నిర్మించుకోవలసిన అవసరంతో జోడింపబడి ఉందని ఆదేశం విశ్వసిస్తూన్నది. జపానుయొక్క వాణిజ్య పారిశ్రామిక ప్రపంచంలో వ్యాపించిఉన్న తత్వమిది ఒక్కటే. తన భావి తత్వమునకు అనుగుణమైన పాత్రను తాను నిర్వహించవలెనంటే, తన ప్రజలు ఉత్పత్తిచేసిన సరుకులకు అంగళ్లను సంపాదించడానికి శ్రద్ధ వహించడం జపానుకు అవసరమైనట్లు తోస్తూన్నది. జాతీయవిచ్ఛిత్తి అనే ఆపదకు లోనుగాకుండా తన ప్రజలలో అత్యధిక సంఖ్యాకుల జీవిత ప్రమాణం వెనుకబడి ఉండేటట్లు చేయడం అసంభవమని రాజకీయ ధురంధరుడు మొదలు సామాన్యపౌరునివరకూ గల జపానుజాతి యావత్తు గమనిస్తూన్నదా అన్నట్లున్నది.’

ఇటువంటి భావాలతో ప్రభుత్వమున్నూ పారిశ్రామికులూకూడా, తమ జాతీయోత్పత్తులకు అంగళ్లను అన్వేషించడంలో, ఎంత వ్యయమైనా ఎక్కువ అని అనుకోకపోవడం ఆశ్చర్యంకాదు. నిరుడు ప్రభుత్వం వారొక ప్రస్తుతించదగిన చట్టంచేశారు. దాని ప్రకారం, ప్రత్యేకంగా

పేర్కొనబడిన కొన్ని అభివృద్ధికాని అంగళ్లకు పంపబడే సరకులపైన వచ్చే నష్టంలో నూటికి 70 పాళ్లు, బాధ్యతగల మంత్రి సలహామీద, ఎగుమతి దారులకు ముదరాయిచ్చే ఏర్పాటు చేయబడినది. అయితే ప్రభుత్వం వారు ప్రత్యక్షంగాచేసే ఈ ప్రోత్సాహ సహాయములతో జపాను పారిశ్రామికుల సాహస సంసిద్ధతలు తులతూగినవి. 'అభిప్రాయం తీసుకోవడం' అనే ఆచారం జపాను దేశమంతటా వ్యాప్తిలో ఉన్నదని చెప్పడానికి ఇది తార్కాణంగా పేర్కొనబడుతూన్నది. ఆ సందర్భంలో ఖర్చు అప్రధాన విషయంగా పరిగణింపబడుతూన్నది. అంగడిని స్వాధీనపరచుకొన్నట్లయితే నష్టం భర్తీ అయినట్లే భావింపబడుతూన్నది. ఈ విధంగా కొన్ని సంవత్సరాలు వ్యాపారం చేసినందున 'నిప్పన్ మెంక్వా' అనే ఒకానొక సుప్రసిద్ధ వ్యాపారసంస్థ 3,800,000 పౌనులకు తక్కువకాకుండా నష్టంపొందింది. మరొకటి 'గోషో కబుషికీకైషా' పెట్టిన పెట్టుబడి 2,500,000 పౌనుల నుండి 1,800,000 పౌనులకు తగ్గిపోయింది. నిరుడు ఏప్రిల్‌లో 'టోయో మెంక్వాకైషా' తన లాభాలను రద్దు చేయడంకూడా ఈ పద్ధతి వ్యాపారం మూలముననేనని తెలుస్తూన్నది. 'కాని జపానుయొక్క పత్తి బట్టల పరిశ్రమ విస్తరింపచేయబడినయెడల ఇదంతా ఏమి లెక్క,' అనే అభిప్రాయం కనిపిస్తూన్నది. అని ఆ నివేదికలో ఉన్నది. క్రొత్త అంగళ్లకోసం పట్టుదలతో అన్వేషిస్తూ జపాను తన ఎగుమతి వ్యాపారాన్ని విస్తరింపచేసుకోవడానికి ప్రయత్నిస్తూన్నది.

“ఈపై విషయాలనుబట్టి భారతీయమిల్లు యజమానులు కొన్ని పాఠాలను నేర్చుకోవచ్చును. ఇక్కడ ఇండియాలో మనం క్రొత్త అంగళ్లను స్వాధీనంచేసుకోవాలనని కోరడంలేదు. మన దేశంలోని అంగడిని మనకోసం నిలుపుకోవాలనని మాత్రమే మనం కోరుతున్నాము. క్రొత్త అంగళ్లను అన్వేషించే ప్రయత్నంలో జపాను పారిశ్రామికుడు సంతోషంగా తన పెట్టుబడిని రద్దుచేసుకోగలిగినప్పుడు ఎక్కువ పరిమితమైన కారణాన ఎక్కువ స్తుతిపాత్రమైన భారతదేశపు కృషి ఫలించేటందుకు, భారతీయ

పెట్టుబడిదారును, కనీసం కొంతకాలం లాభాలు కోరకుండేటట్లు ప్రోత్స హించకూడదా? కొలది సంవత్సరాలవరకైనా పెట్టుబడిమీద లాభాలను రద్దుచేయకూడదా? మిల్లు యేజెంట్లు దేశాభిమానంతో కొంతకాలంవరకు తమ కమీషన్ తీసుకోకపోవడంగానీ, లేక దానిని కనీసపు పరిమితికి తగ్గించుకోవడంగాని చేయలేరా? ఈ పనులు వారు చేయగలిగేయెడల మన పెట్టుబడిదారులు మన మిల్లు యజమానులు, జాతీయ కృషియెడల తమ కర్తవ్యమును తాము నిర్వర్తించినట్లుగా చెప్పుకోవచ్చును."

ఈ విలేఖకుడు చెప్పినట్లుగా మనం కొత్త అంగళ్లను స్వాధీనం చేసుకో కోరడంలేదు. మన అంగడినుండి విదేశీ బట్టను బహిష్కరించే కష్టమునకు మనం ధైర్యం చేయాలి. మిల్లు యజమానులాపని చేయగలరా?

—యంగ్ ఇండియా, 23-7-1931

# 127

# లాంకషైరు ప్రతి జపాను

శ్రీ హెచ్. పి. మోడీ యిలా వ్రాస్తున్నాడు:

"మీరు రౌండు టేబిల్ మహాసభకు ఇంగ్లాండుకు పోయినప్పుడు లాంకషైరును దర్శించవచ్చునని ప్రవాదమునుగూర్చి మీరు కావించిన సంగ్రహ ప్రకటనను నేను చాలా ఆసక్తితో చదివాను. మీరా ప్రకారం కావించి బ్రిటిష్ పారిశ్రామికులకు మీయొక్కయు కాంగ్రెసుయొక్కయు స్థితిని అర్థంచేసుకోవడానికి అవకాశం కల్పించగలరని ఆశిస్తున్నాను. భారతదేశంలో తయారైన బట్టతోనే భారతీయుల అవసరములను తీర్చడం జాతీయ ప్రధానాశయమైనప్పటికీ, భారతదేశపు ఉత్పత్తి శక్తి తగినంతగా పెంపొందితేనేగాని విదేశీబట్టలు రాకుండా చేయడానికి సాధ్యంకాదని నా అభిప్రాయం. ప్రస్తుత ఆర్థికమాంద్యం పోగానే, మన ప్రజలు బట్టలను ఎక్కువగా వాడుకొంటారనే మాట నిశ్చయం. మిల్లులు, ఖాదీ నేసేవారు, చేమగ్గాలవారు చేసే ఉత్పత్తి, ప్రజల అవసరాలకు తగినంతగా లేకపోయినయెడల కొద్దిగానో గొప్పగానో విదేశీ బట్టలు వచ్చి తీరాలి. అప్పుడు దేశీయ పరిశ్రమను పెంపొందించే విధానాలను గూర్చి విచారించడమే సమస్య అవుతుంది. అటువంటి అభివృద్ధికి గొప్ప ఆటంకాలలో ఒక ఆటంకం ఆ పరిశ్రమ ఎదుర్కొంటూన్న సువ్యవస్థాపితమైన జపాను పోటీయే. జపాను యేటేటా ప్రత్యేక శ్రేణులను నిర్ణయించుకొని వాటిమీద తన దండయాత్రను సాగిస్తూన్నది. ఆ శ్రేణులలో తన స్థానం స్థిరపడిన పిమ్మట తక్కిన శ్రేణులపైన దండయాత్ర సాగిస్తూ భారతీయపరిశ్రమకు వినాశహేతువవుతూన్నది. ఈ పోటీవలన భారతదేశపు వస్త్రములలో ప్రత్యేక రకాల వాడుకకు దెబ్బతగలడమేకాక భారతీయ మిల్లులలో ఉత్పత్తిఅయిన అన్ని సరకుల ఖరీదుకూ కూడా దెబ్బతగులుతూన్నది. ఈ విషయం నేననేక పర్యాయములు మీకు వివరించిఉన్నాను. వస్త్ర పరిశ్రమ ఇప్పుడనుభవిస్తూన్న ఆర్థికమాంద్యపు దుష్ఫలితములనుండి మిల్లులు తేరుకొని కొత్త సామగ్రికి సొమ్ము వెచ్చించగలిగి, పరిశ్రమను పునర్నిర్మాణం చేసేటందుకు తదితర చర్యలను తీసుకొన్న పిమ్మటనూ, విద్యవల్లనూ తదితరపద్ధతులవల్లను కార్మికులు ఎక్కువ సమర్థతతో పనులను నిర్వహించగలిగిన స్థితికి తేబడిన తరువాతనూ,

కాలక్రమేణా భారతదేశమునకు పోటీచేసే శక్తి పెంపొందవచ్చును. అప్పుడు రక్షణకోసం యేర్పాటుచేయబడిన ప్రత్యేక శాసనాల అవసరం పోతుంది. కాని ఆ స్థితికి వచ్చేటంతవరకు ఇండియా దిగుమతి పన్నుల విధానాన్ని కఠినంగా సాగించవలసిందే. యునైటెడ్ స్టేట్సువంటి సువ్యవస్థాపితములయిన దేశాలే అలాచేసినవి. ఇక పారిశ్రామికాభివృద్ధి విషయంలో బాల్యదశలోనున్న భారతదేశం ఆ ఉదాహరణాన్ని అనుసరించక తప్పదు. అయితే వినియోజకుల క్షేమాన్ని కూడా గమనించవలసివుంది. అవసరం వచ్చినప్పుడు వారి రక్షణకు తగిన చర్యలుతీసుకోబడునడంలో నాకేమీ సందేహంలేదు. వినియోజకుడు, తానుకొనే వస్తువుయొక్క ఆర్థిక మూల్యముకంటె ఎక్కువ చెల్లించవలెనని కోరబడనంతవరకూ ఆయనను స్వార్థంకోసం వినియోగించుకోవడమనే ప్రశ్న లేనేలేదనే సంగతి ఈ సందర్భంలో జ్ఞాపకం ఉంచుకోవాలి. చౌకగా విదేశీ సరుకులువచ్చి పడడంవలన వినియోజకునకు కలిగే ప్రయోజనం తాత్కాలికం. స్వదేశీ వస్తువు ఉత్పత్తిఅయిన ఖర్చుకంటెకూడా తక్కువ ఖరీదులో అమ్మబడే విదేశీ సరకులు కొంతకాలం తనకు లభించేటట్లు చేసుకొన్నంత మాత్రంతో, ఆ పనివల్ల ముందుముందు అతనికిగానీ దేశానికిగాని మేలుచేకూరదు.

ఇక దేశముయొక్క అవసరాలను పూర్తిగా తీర్చడానికి తగినట్లు ఇండియాలోని ఈ పరిశ్రమను రక్షించడమెలా అనే ప్రశ్నవస్తుంది. మీరు కిందటి పర్యాయం బొంబాయిలో ఉన్నప్పుడు నేను మిమ్ములను దర్శించగా, సంతృప్తికరమైన రాజకీయ సమాధానం కుదిరేయెడల, జపానుకు ప్రతికూలంగా ప్రత్యేకపుపన్ను విధించేటందులకు మీరనుకూలంగా ఉంటారని నేనభిప్రాయపడ్డాను. తామిటీవల చేసిన ప్రకటనయొక్క భావాన్ని నేను సరిగా అర్థంచేసుకొనిఉన్నట్లయితే మీ చేతనైనచో లాంకషైరు బట్టగానీ మరొక బట్టగానీ ఒక గజంకూడా ఈ దేశంలో ఉండనీయరని, అయితే కొన్ని పరిస్థితులకోసమాత్రం జపాను పోటీని ఎదుర్కోవడానికి అవసరమైన కొన్ని చర్యలను లాంకషైరు తీసుకోవలసివచ్చిన కారణంగా, జపాను పైన లాంకషైరు కొంత ప్రయోజనమును పొందినప్పటికి మీరు లెక్కపెట్టే వైఖరిలో లేరని నేననుకొంటున్నాను. మీ అభిప్రాయాన్ని నేను సరిగా అర్థంచేసుకొన్నానో లేదో దయయుంచి నాకు తెలుపగలరా ? ”

నా అభిప్రాయం స్పష్టంగానే ఉంది.

1. నా యిష్టప్రకారం జరిగేటట్లయితే భారతదేశం ఖాదీ తప్ప మరే యితర బట్టను ధరించదు. దేశీయ మిల్లులలో తయారైన బట్టయినప్పటికీ ధరించదు.

2. తనకు కావలసిన ఖాదీ యావత్తూ తాను తయారు చేసుకొనేటందుకు భారతదేశ మిష్టపడనియెడల (అశక్తత అనే మాట లేదు) దేశీయ మిల్లు బట్ట దానికి తోడపడానికి నేనంగీకరిస్తాను.

3. విదేశీబట్టల పికెటింగు, విదేశీబట్టలు ఖాదీతోను, దేశీయ మిల్లులతోనూకూడా పోటీచేస్తూన్నవి గనుక జరుగుతూన్నది. ఆయా దేశాలలో ఉత్పత్తిచేయబడిన బట్ట న్యాయంగా ఉత్పత్తిచేయబడి ఇక్కడకు తీసుకొనిరాబడినదా లేదా అనే అర్థంలో, పోటీ న్యాయమా అన్యాయమా అనే విషయం అప్రస్తుతం.

4. పోటీలేకుండా ఉంటేనూ స్పష్టంగా కొంత విదేశీ బట్ట ఇండియాకు వచ్చి తీరవలసి ఉంటేనూ, స్వతంత్ర భారతదేశంతో ఇంగ్లాండు భాగస్వామిగా ఉంటేనూ తక్కిన అన్ని దేశాలకంటె నేను ఇంగ్లాండునే ఎక్కువగా కోరుకొంటాను. కాని ఇండియా స్వతంత్రురాలయితే కొద్దికాలంలోనే తనకు కావలసిన ఖాదీని తాను ఉత్పత్తిచేసుకొంటుందనీ, పరివర్తన కాలంలో దేశీయ మిల్లుబట్టను తోడుచేసుకొంటుందనీ నా విశ్వాసం.

—యంగిండియా, 30-7-1931

# 128

# స్వదేశీ వస్తువులు

స్వదేశీ వస్తువులనుగూర్చి వర్కింగుకమిటీవారు ఒక ఆచరణ యోగ్యమయిన నిర్వచనమిచ్చారు. అది ఈ దిగువ నుదాహరింపబడుతూన్నది :

“ దేశీయ ముడిసరుకుతోగానీ, నూటికి 75 వంతులు భారతీయ పెట్టుబడిగల పారిశ్రామికునిచే దిగుమతి చేయబడిన ముడి సరుకుతోగానీ పూర్తిగా భారతదేశములో తయారుచేయబడి, నూలూ బట్టా కానివి, స్వదేశీ వస్తువులు. అయితే విదేశీయుల యాజమాన్యం కింద తయారు చేయబడిన వస్తువులేవీ స్వదేశీ కావు.

ఉదా.—ఈ నిర్వచనమునకు సంబంధించినంతవరకు ‘ యాజమాన్యం ’ అనే మాట, డైరెక్టర్ల బోర్డులకు మరియు/లేక మానేజింగు ఏజెంట్లకూ వర్తిస్తుంది.

ఈ పై నిర్వచనముతో పూర్తిగా సమన్వయం కాకపోయినప్పటికీ, స్వదేశీగా వర్గీకరణంచేసి కొన్ని వస్తువుల జాబితాను వర్కింగు కమిటీవారప్పుడప్పుడూ ప్రకటిస్తూ ఉండవచ్చును.”

ఈ పై నిర్వచనమునుగూర్చి, ముడి పదార్థాలు దిగుమతీ చేయించుకోవడాని కిది అంగీకరిస్తూన్నదని అభ్యంతరం రావచ్చును. ఈ సావకాశం బుద్ధిపూర్వకంగానే ఉంచబడింది. భారతదేశంలో ముడి పదార్థం దొరకనప్పుడు దానిని దిగుమతి చేసుకోవడంలో తప్పులేదు. స్వదేశీ తత్వం మృగ్యం కావడంచేత, దేశంలో నైపుణ్యాం అసలు లేకుండానైనాపోయింది లేదా అభివృద్ధి కాకుండానైనా పోయింది. ఏ దేశమైనా తన చేతిపనులను పరిశ్రమలను అభివృద్ధిచేసుకోక, పరాయి దేశాలలో తయారైన వస్తువుల నన్నిటినీ దిగుమతీ చేసుకొంటూ సోమరియై పరోపజీవిగా

బ్రతుకుతూన్నయెడల ఆ దేశం భౌతిక విజ్ఞాన సంపదలకు వెలిగా ఉంటుంది. మనకు కావలసినవన్నీ మనమే నిర్మించు కొన్న కాలం ఒకటి ఉంది. ఇప్పుడా పద్ధతి తారుమా రయింది. తయారైన వస్తువులకోసం మనం అత్యంతం అన్యదేశాలపైన ఆధారపడి ఉంటున్నాము. కడచిన సంవత్సరం స్వదేశీ తత్వం విషయంలో ప్రస్తుతింపదగిన చైతన్యం వచ్చింది. అందువల్ల స్వదేశీ వస్తువులనుగూర్చి నిర్వచనం చేయవలసిన అవసరం కలిగింది. అయితే నిర్వచనం ఈయడంలో చాలా జాగ్రతే వహించవలసివచ్చింది. అది స్వదేశీ అసంభవమన్నంత ఎక్కువ సంకుచితంగానూ ఉండకూడదు, స్వదేశీవట్టి నామమాత్రపు తమాషా అన్నంత విశాలంగానూ ఉండకూడదు. మేము 'నూతిలో కప్ప' విధానాన్ని అనుసరించవలెనని కానీ, అంతర్జాతీయంగా కనపడే 'నేలవిడచినసాము' విధానాన్ని అవలంబించవలెనని కానీ అనుకోలేదు. మన వ్యక్తిత్వమును అనగా జాతీయ తను పోగొట్టుకొన్నయెడల మనకు అంతర్జాతీయత రాదు.

ఈ నిర్వచనమునుండి, దూదితోగానీ, ఉన్నితోగానీ, పట్టుతోగానీ చేయబడిన నూలూ, బట్టామినహాయించబడిన విషయంకూడా పాఠకులు గ్రహించి ఉంటారు. అందు కొక కారణం స్వదేశీ బట్ట అనగా ఏమిటో బాగా తెలిసి ఉండడం. రెండవ కారణం, నాకత్యంత ప్రాముఖ్యమైన కారణం; కాంగ్రెసు వాదులకు సంబంధించినంతవరకు స్వదేశీ వస్త్రమంటే కేవలం చేతితో వడికి చేతితో నేయ బడిన బట్ట మాత్రమే. కాంగ్రెసు సందేశం చేరనివారికీ చేరడానికి వీలులేనివారికీ మాత్రమే దేశీయ మిల్లు బట్ట ఉద్దేశింపబడినది.

ప్రస్తుత పరిణామావస్థలో పూర్తిగా స్వదేశీకాని అనేక వస్తువులతో మనం సరిపెట్టుకోవలసి ఉన్నదనే విషయం కూడా గమనించవలెను. అందువల్లనే, ఈ నిర్వచనానికి పూర్తిగా అనుగుణంగా లేకపోయినప్పటికీ, కొన్ని వస్తువులను మినహాయించడం దేశముయొక్క అత్యంత క్షేమానికి భంగకరం గనుక అట్టి వస్తువుల జాబితాను అప్పుడప్పుడూ ప్రచురించే హక్కును వర్కింగు కమిటీవారు ఉంచుకొన్నారు.

—యంగిండియా, 20-8-1931

# 129

# లాంకషైరులో

## అమిశ్రితానందం కాదు

ఈ మిత్రులను కలిసిన ఆనందం అమిశ్రితం కాదు. వారందరినీ ఓర్పుగా విన్న తరువాత, వారిని యేమాత్రమూ అనుసరించ జాలనని గాంధీజీ చెప్పవలసిరావడం ఆయన కానందదాయకంగా లేదు. బహుశా వారు పెద్దపెద్ద ఆశలు పెట్టుకొనివచ్చి ఉంటారు. కాని, తానూ తన దేశీయులూ భరించజాలని పనిని నిర్వర్తించవలసిందిగా తాను కోరబడుతూన్నట్లు, మహా విషాదంతో వారికి గాంధీజీ వివరించవలసివచ్చింది: "నా జాతీయత మీ కష్టమునుగూర్చి విచారపడనంతకానీ, లేక పొంగిపోయేటంతగానీ సంకుచితమైనది కాదు. ఏ ఇతర దేశముయొక్క సౌఖ్యానికి భంగకరంగానూ, నా దేశముయొక్క సౌఖ్యాన్ని నేను కోరను. మీకు గట్టి దెబ్బ తగిలిందని నేను గ్రహిస్తూన్నప్పటికీ, మీ కష్టానికి కారణం ఎక్కువగా ఇండియా కాదేమోనని నా భయం. కొన్ని సంవత్సరాల నుండీ పరిస్థితులు బాగా ఉండడంలేదు. బహిష్కారోద్యమము మూలిగే నక్కమీద తాటి పండు పడ్డట్లయ్యింది." స్ప్రింగ్‌వేల్ గార్డెన్ గ్రామంలో ఆయన ఇలా అన్నాడు: "ఒడంబడిక సంతకమైన మార్చి 5 నుండీ, ఇతర విదేశీ వస్త్ర బహిష్కారమునకు భిన్నమైన బ్రిటిష్ వస్త్ర బహిష్కారం లేదు. యావత్తు విదేశీ బట్టను బహిష్కరించవలెనని మేమంతా ఒక జాతిగా ప్రమాణం తీసుకొన్నాము. కాని ఇండియా, ఇంగ్లాండు దేశాల మధ్య గౌరవప్రదమైన ఒడంబడిక జరిగితే, అనగా శాశ్వత శాంతి చేకూరితే,

మా బట్టకు తోడుగా అదనపు బట్ట కావలసి ఉన్నంతవరకు, పరస్పరం అంగీకరింపబడిన షరతులమీద, ఇతర విదేశీ బట్టలకు బదులుగా లాంక్‌షైరు బట్టనే కోరుకోవడానికి నేను వెనుదీయను. అయితే అది ఎంతవరకు మీ కుపకరించ గలదో నాకు తెలియదు. ప్రపంచంలోని అన్ని అంగళ్ళలోకీ మీకిప్పుడు ప్రవేశం లేదనే సంగతి మీరు గుర్తించాలి. మీరు చేసిన పనే ఇతర దేశాలన్నీ కూడా ఇప్పుడు చేస్తున్నాయి. భారతీయ మిల్లులుకూడా రోజుకు రోజుకూ ఎక్కువ బట్ట ఉత్పత్తిచేస్తున్నాయి. లాంక్‌షైరు క్షేమంకోసం ఇండియా కృషిని పరిమితం చేయవలెనని మీరు నన్ను కోరరుగదా!"

మరొక చోట ఆయన ఇలా అన్నారు: "ఇక్కడి నిరుద్యోగతనుగూర్చి నాకు బాధగా ఉన్నది. కాని ఇక్కడ పస్తులు పడుకోవడంకానీ నగ్న దారిద్ర్యంతో బాధపడడంకానీ లేదు. ఇండియాలో మాకు రెండూ ఉన్నాయి. మీరు భారతదేశపు గ్రామాలకు పోయినట్లయితే, గ్రామస్థుల కళ్లలో వట్టి నిస్పృహ కనిపిస్తుంది. అక్కడ మీకు కడుపు నిండాకూడు లేని అస్థిపంజరాలు జీవచ్ఛవాలు కనిపిస్తవి. భారతదేశం పని రూపంలో అన్నంపెట్టి ప్రాణంపోసి ఆ గ్రామాలను పునరుద్ధరింప గలిగేయెడల ప్రపంచానికి ఉపకార మవుతుంది. ఈనాడు భారతదేశం దుఃఖప్రదం. కడుపు నిండా కూడు లేని ఈ లక్షలాది మూకజనాన్ని త్వరలో కడతేర్చి తక్కినవారిని బ్రతికేటట్లు చూడవలెననే పక్షు మొకటి మా దేశంలో ఉన్నది. నేనొక అనుకంపా పూర్వకమైన పద్ధతిని ఆలోచించాను. పనిముట్లకు పెద్ద పెట్టుబడి అవసరము లేనట్టిన్నీ, వారికలవాటైన వారి కుటీర ములలో చేసుకోగలిగినట్టిన్నీ, వారుత్పత్తిచేసిన సరుకు తేలికగా అమ్మటానికి వీలైనట్టిన్నీ ఒక పనిని వారికి చూపిం

చడమే ఆ పద్ధతి. లాంకషైరు దృష్టినికూడా ఆకర్షించ తగిన పని యిది."

లాంకషైరు వాదము - గాంధీజీ ప్రత్యుత్తరము.

"మొన్న మొన్నటివరకూ కలకలలాడుతూ పని చేస్తూన్న ఈ మిల్లు లెలా నిద్రపోతూన్నవో చూడండి! బ్లాక్ బర్నలో, గ్రేట్ హార్ఉడ్‌లో, ఎక్రింగ్టనలో నూరు మిల్లులకు పైగా మూలపడ్డవి. గ్రేట్ హార్ఉడ్డు ప్రాంతంలో 17,436 మగ్గాలకు తక్కువ కాకుండా మూలపడ్డవి. మేము భారతదేశమునకు కావలసిన బట్టలను నేసేటందుకు కళాశాలలలో ప్రత్యేక శిక్షణ పొందినాము. మేము ప్రత్యేకం భారతదేశముకోసం ధోవతీలను నేస్తున్నాము. ఈనాడు మేము వాటిని తయారుచేసి ఇంగ్లాండు భారతదేశాల మధ్య సుహృద్భావం ఎందుకు కలిగించకూడదు?" అని కొంత మంది యజమానులన్నారు. "1897-99 సంవత్సరాలలో వచ్చిన కఱవు సందర్భంలో మేము భారతదేశానికి సహాయం చేశాము. పేదవాళ్లకోసం సొమ్ము వసూలుచేసి వారికి పంపినాము. మేమెప్పుడూ ఉదార రాజనీతినే కోరుతున్నాము. మాకు ప్రతికూలంగా ఎందుకీ బహిష్కారోద్యమం సాగించాలి?" అని కొంత మంది పనిచేసే వాళ్లన్నారు. కొంత మంది తమ వ్యక్తిగత కష్టాలను గాంధీజీకి చెప్పుకొన్నారు. అన్నిటిలోకి ఎక్కువ జాలికరమైనదిది: "నేను బట్టల మిల్లులో పనిచేసేవాడను. 40 సంవత్సరాలనుండి నేను నేతపని చేస్తున్నాను. ఇప్పుడు నేను పనిలేకుండా ఉన్నాను. పేదరికంగానీ, దుఃఖంగానీ నాకు చీకాకు కలిగించడంలేదు. నన్ను గురించి నా అంచనాపోయింది. నిరుద్యోగ విరాళాన్ని పుచ్చుకోవలసి

వచ్చిన కారణాన నా దృష్టిలో నేనే పడిపోయినాను. ఏమాత్రమైనా ఆత్మ గౌరవంతో నేను తనువు చాలించగలనని తలంచడం లేదు.”

హేస్ ఫారం, యార్క్ షైరులో ఒక విశ్రాంతి గృహం. అక్కడకు కొంత మంది మిల్లు యజమానులు, కార్మికులలో బాగున్న వాళ్లు కొంతమందీ వారాంతం గడపడానికి పోతూంటారు. అక్కడ నిరుద్యోగులైన వారనేక మంది రాయబారాలు తీసుకొనివచ్చారు గాంధీజీకడకు. అందరూ దాదాపు ఇదే కథ చెప్పసాగారు. ఆ విశ్రాంతి మందిరం లోని సోదరులు, దేవుని యిచ్ఛ చెల్లవలెనని ప్రార్థిస్తూ ప్రత్యేక పూజలు చేశారు. గాంధీజీ తన భావాలను దాచు కోవడం అసాధ్యమయింది. “నేను మీతో నిష్కపటంగా మాట్లాడకపోయినట్లయితే, నేను మీయెడల అసత్యవాది నవుతాను. నేను మీకు కపట మిత్రుడనవుతాను” అని గాంధీజీ వారి ముందు తన మనస్సు విప్పి ముప్పావు గంట వలపోశారు. అప్పుడాయన తన జీవితంలో ఆర్థిక నైతిక రాజకీయ విషయాలు విభజించడానికి వీలులేని పద్ధతిని ఎలా ముప్పిరిగొని ఉన్నవో, అన్నిటికన్ననూ మిన్నగా సత్య వతాకాన్ని ఎలా నిలపెట్టినారో, ఫలితములను పాటించ కుండా ఎలా నిగ్రహించారో, దేశమునకు రాట్నాన్ని ప్రసాదించడానికి తనకేమి అవసరం కలిగిందో, వారి నీస్థితికి ప్రపంచపరిస్థితు లెలా తీసుకొనివచ్చినవో ఇవన్నీ వివరించారు. “కడచిన మార్చిలో, మద్యమును విదేశీ వస్త్రాలను బహి ష్కరించడానికి స్వాతంత్ర్యం మీయవలసిందని నేను ఇర్విను ప్రభువును కోరాను. ఆయన, మూడు నెలలపాటి బహి ష్కారమును సద్భావ చిహ్నంగా నిలిపివేసి తిరిగీ తరువాత ప్రారంభించవచ్చునని సూచించారు. నేను మూడు నిమిషాలు

కూడా నిలపడానికి వీలులేదని చెప్పివేశాను. మీకు మూడు లక్షల మంది నిరుద్యోగులే ఉన్నారు. మాకు సంవత్సరంలో ఆరు నెలలు పని లేనివాళ్లు 30 కోట్ల మంది ఉన్నారు. మీకు సగటు నిరుద్యోగ విరాళం 70 షిల్లింగులు. మా సగటు ఆదాయం నెల 1 కి 7 షిల్లింగుల ఆరు పెన్నీలు. తన దృష్టిలో తానే పడిపోతున్నానని ఆ కార్మికుడు చెప్పిన మాటలో యథార్థం ఉన్నది. పని లేకుండా విరాళములమీద బ్రతకడం యే మానవునికైనా నైచ్యంగానే ఉంటుందని నా నమ్మకం. నేను సమ్మె నడిపించే టప్పుడు సమ్మెదారులు ఒక్క రోజుకూడా పని లేకుండా ఉండడం నేను సహించలేదు. వాళ్ల చేత రాళ్లు పగుల గొట్టించడం, ఇసుక మోయించడం, పల్లెకు వీధులలో పని చేయించడం జరిపాను. నా సహచరులనుకూడా వారితో కలసి పని చేయమన్నాను. ముప్పయి కోట్ల మంది నిరుద్యోగులై అనేక లక్షల మంది చేయడానికి పని లేక ఆత్మగౌరవమును, దైవభక్తినీ కోల్పోయి వారు రోజుకు రోజుకూ పతనం కావడం ఎంత అనర్థమో ఆలోచించండి. వారికడకు దైవ సందేశమును తీసికొనిపోయే ధైర్యం నాకు లేదు. కళ్లలోని వెలుగును కోల్పోయి అన్నమునే దైవముగా భావిస్తూ, ఆకలితో అల్లాడుతూన్న లక్షలాది ప్రజలకడకు దైవ సందేశమును కొనిపోవడం, అక్కడి కుక్కకు దైవ సందేశమును వినిపించడంవంటిదే. పవిత్రమైన పనియొక్క సందేశమును తీసుకొనిపోవడం ద్వారా మాత్రమే వారికడకు నేను దైవ సందేశమును కొనిపోగలను. ఉదయముననే చక్కగా భుజించి, అంతకంటె మంచి మధ్యాహ్న భోజనమున కెదురుచూస్తూ కూర్చొన్న మన కిక్కడ దేవునిగూర్చి ప్రసంగిస్తూండడం మహా బాగా

ఉంటుంది. రెండు పూటలా తినడానికి తిండిలేని లక్షలాది ప్రజల ముందు దేవునిగూర్చి నేనెలా మాట్లాడగలను? వారికి దేవుడు, రొట్టె వెన్న రూపంలో మాత్రమే ప్రత్యక్షం కాగలడు. భారతదేశపు రైతులు తమ రొట్టెను భూమి నుండి సంపాదించుకొంటున్నారు. వారికి కావలసిన వెన్న కోసం రాట్నాన్ని సమర్పించాను. నేడు నా అంగవస్త్రముతో బ్రిటిష్ ప్రజలయెదుట నేను కనపడడానికి కారణం, అర్థోపవాసములతో, అర్థ దిగంబరులుగానున్న ఆ మూక ప్రజానీకముయొక్క ఏకైక ప్రతినిధిగావచ్చి ఉండడమే. మేమీ ప్రపంచంలో సుఖంగా ఉండవలెననే ప్రార్థించాము. కాని లక్షలాది ప్రజలు మీ తలుపులు తట్టుతూంటే అలా ఉండడం మీ కసంభవమని నేనంటాను. మీ దురవస్థలో కూడా మీరు మాకంటె ఎక్కువ సౌఖ్యంగానే ఉన్నారు. అందుకు నే నసూయపడడంలేదు. మీరు క్షేమంగా ఉండవలెననే నా కోరిక. కాని భారతదేశపు లక్షలాది పేద జనుల గోరీలపైన అభ్యున్నతి పొందవలెనని ఆలోచించకండి. భారతదేశం ఏకాకిగా నుండవలెనని ఏమాత్రమూ నేను కోరడంలేదు. కాని నాకు కావలసిన అన్న వస్త్రాలకోసం నే నేదేశంపైననూ ఆధారపడియుండ కోరను. ప్రస్తుత క్లిష్ట పరిస్థితినుండి బయటపడడానికి మార్గాలను మే మాలోచిస్తూన్నాము. మీరు మాత్రం పూర్వపు లాంకషైరు వర్తకాన్ని పునరుద్ధరిద్దామనే ఆశ పెట్టుకోకండి. అది అసంభవం. దైవభక్తిపరుడనుగా అందులో నేను మీకు సహాయం చేయజాలను. ఆకస్మికంగా నా ఊపిరి నిలచిపోయిందనుకోండి; కృత్రిమపు పద్ధతిని తిరిగి ఊపిరి తీసుకోవడానికి నాకు తాత్కాలికంగా సహాయం చేయబడినయెడల, ఎప్పటికీ ఆ కృత్రిమ విధానంపైననే ఆధారపడుతూ తిరిగీ

నా ఊపిరితిత్తులను ఉపయోగించేటందుకు నిరాకరించవలెనా? అది తప్పు. అది ఆత్మ హత్య అవుతుంది. నా ఊపిరితిత్తులను బలిష్ఠం చేసుకొనేటందుకు నేను ప్రయత్నించి నా శక్తిసామర్థ్యములపైననే నేను జీవించాలి. భారత దేశం తన ఊపిరి తిత్తులను బలిష్ఠం చేసుకోవలెనని మీరు దేవుణ్ని ప్రార్థించాలి. మీ దురవస్థను ఇండియాకు ఆపాదించకండి. మీకు ప్రతికూలంగా బలిష్ఠంగా వ్యవహరిస్తున్న ప్రపంచ శక్తులనుగూర్చి యోజించండి, సహేతుక దృష్టితో పరిస్థితులను గమనించండి."

డార్వెన్ మేయరు సమ్ముఖాన ఆయన చెప్పిన మాటలివి: "వస్తువులు ఉండే పరిస్థితిలో జీవిస్తూ, ఆత్మ గౌరవమును కోల్పోయినట్టి ప్రపంచంలోని ఐదవ వంతు జనాభాను నేనేమి చేయవలెనో దయచేసి చెప్పండి. నిరుద్యోగపు లాంకషైరుకూడా ఈ విషయం దృష్టిలో పెట్టుకొనవలసి ఉంది. 1899-1900 కరువులో లాంకషైరు మాకు చేసిన సహాయాన్నిగూర్చి మీరు మాకు చెప్పి ఉన్నారు. మేము మీకు ప్రత్యుపకారం ఏమి చేయగలము? మా పెద్దల ఆశీర్వాదములు దక్కా; న్యాయమైన వర్తకాన్ని ఈయవలెనని నేను వచ్చాను. కాని నేనది ఈయకుండా పోయినట్లయితే, అది నా తప్పిద మెంతమాత్రమూ అయి ఉండదు. నాలో యే విధమైన కాఠిన్యమూ లేదు. నీచాతి నీచములైన జంతువులతో సైతం నాకు సాహచర్యం ఉందనుకొంటున్నాను. మంచికో చెడ్డకో ఒక శతాబ్దం పైనుండీ మాతో సంబంధం గలిగి ఉన్న ఇంగ్లీషువారిలో అనేక మందిని నా ప్రియతములైన మిత్రులుగా భావిస్తున్నాను. అట్టి ఆంగ్లేయులతో నాకు సాహచర్య మెందుకుండకూడదు? నేను మీకు

తెలిసినయిన ప్రత్యర్థిని. కాని మీరు నా సమాధాన వాక్య ములను తృణీకరించినయెడల, నేను కాఠిన్యంతో తిరిగిపోను. మీ హృదయాలలో నివాస మేర్పరచుకోవడానికి తగిన పవిత్రత నాకు లేదనుకొని వెళ్లిపోతాను.

## పూర్తిగా ఆర్థికం

ఎడ్జివర్తులోని యజమానులతో జరిగిన సంభాషణ అత్యంత సుహృద్భావంతోనూ పక్షపాతరహితంగానూ జరిగింది. ఇక్కడనే గాంధీజీ విదేశవస్త్ర బహిష్కారముయొక్క ఆర్థిక స్వభావమును బలవత్తరంగా వెల్లడించారు.

ప్ర. గాంధీజీ! ఆర్థికోద్దేశంతో నడపబడే బహిష్కారోద్యమమును రాజకీయోద్దేశముతో నడపబడే బహిష్కారమును విడదీయడానికి వీలున్నదా?

జ. కేవలం బ్రిటనును శిక్షించడమే ఉద్దేశంగా ఉన్నప్పుడు—1930 లోవలె, బ్రిటిష్ వస్తువులకు బదులుగా, జర్మను అమెరికన్ వస్తువులను ప్రజలు కోరుకొన్నప్పుడు—అది స్పష్టంగా రాజకీయోద్దేశం కలదిగా ఉండేది. అప్పుడు బ్రిటిష్ యంత్ర సామగ్రికూడా బహిష్కరింపబడింది. ఇప్పుడు మొట్టమొదటి ఆర్థిక బహిష్కారమే మిగిలిఉంది. మీరు దానిని బహిష్కారమనవచ్చును. కాని అది కేవలం సంస్కార ప్రయత్నం, లేదా ఆత్మశోధక ప్రయత్నం. మన పూర్వపు వృత్తిని తిరిగీ చేపట్టి అలసత్వమును కీడి, ఎట్టి నిరుపేదలైనా విరామములపైగాక చెమటవోడ్చి చేసిన శ్రమ ఫలితంగా జీవించవలెనని చేసే ప్రబోధమది

ప్ర. తక్కిన విదేశీ వస్త్రములన్నిటికంటెను ఎక్కువగా మీ మిల్లులయెడలనే మీరు పక్షపాతం చూపుతూన్నంతవరకు రాజకీయ దృక్పథం అక్కడ ఉండనే ఉంటుంది.

జ. బహిష్కారోద్యమము మిల్లుల పక్షాన ప్రారంభింపబడలేదు. నిజానికి స్థానిక మిల్లు యజమానులతో నాకు కలిగిన తగాదా కారణంగా ప్రారంభమైన మొదటి నిర్మాణ ప్రయత్నమే బహిష్కారోద్యమం. కోటీశ్వరులు మా ఉద్యమంతో సహకరిస్తూన్నప్పటికీ మా విధానం వారిచేత నడపబడడంలేదు. మేము మాత్రం వారిని లోబరచుకోవడానికి ప్రయత్నిస్తున్నాము. మేము గ్రామాలకు పోయినప్పుడు, గ్రామస్థులను భారతీయ మిల్లు బట్టలను ధరించవలసిందని మేము కోరడంలేదు. వారిని ఖాదీ ధరించవలసిందని కానీ, వారికి కావలసిన ఖాదీని వారే ఉత్పత్తి చేసుకోవలసిందని కానీ వారిని కోరుతున్నాము. ప్రతి కాంగ్రెసువాదీ ఖద్దరు కట్టుకొంటాడని భావింపబడుతున్నాడు.

ప్ర. గాంధీజీ! మీరేమి చెప్పినప్పటికి మీరెక్కువ రాజకీయాధికారాన్ని కోరుతున్నారు. మీకది వచ్చి తీరుతుంది. కాని అది రాగానే, ఈ మిల్లు యజమానులు దురాశాపరులై అనుచితంగా దిగుమతి పన్నులు అనే పెద్ద పెద్ద గోడలు కట్టుకొంటారు. అప్పుడు లాంకషయరు వర్తకులకంటె వారే, మీ గ్రామాలకు ఎక్కువ అపాయకరులుగా పరిణమిస్తారు.

జ. నేనప్పటికింకా బ్రతికిఉండి, అటువంటి వైపరీత్యమే తటస్థించినట్లయితే, ఆ పరిణామంలో మిల్లులు ధ్వంసం చేయబడతవని ధైర్యంగా చెప్పగలను. నిజమైన రాజకీయాధికారంతో వయస్సు వచ్చిన వారందరికీ వోటు వస్తుంది. నిరుపేదలయిన గ్రామస్థుల ప్రయోజనాలను భగ్నపరచడం భాగ్యవంతుల కసాధ్యమవుతుంది.

ప్ర. అమెరికనులు మరల పొగాకోసం దేవులాడుతున్నట్లే ప్రజలే మిల్లు బట్టకోసం తిరిగి ఎగబడతారని మీరనుకోరా ?

జ. నేననుకోను. అమెరికాలో, ఇష్టంలేని ప్రజలకు ప్రతికూలంగా బలమయిన జాతిచేత ప్రయోగింపబడిన ప్రబలాయుధం మద్య నిషేధం. ప్రజల కక్కడ త్రాగడం అలవాటు. త్రాగడం శిష్టాచారంగా ఉండేదక్కడ. భారత దేశంలో మిల్లుబట్ట ఎన్నడూ శిష్టాచారంగా లేదు. కాని ఖాదీ శిష్టాచారమయింది. అంతేకాదు, గౌరవనీయమైన సంఘంలోకది ప్రవేశం కలిగిస్తూన్నది. ఏమి జరిగినప్పటికీ నా ప్రజల ఆర్థిక మోక్షంకోసం నేను పోరాడవలసిందే. జీవించినా మరణించినా దానిలో సార్థక్యం ఉందని మీరంగీకరిస్తారు.

ప్ర. అది అసమ పోరాటమవుతుంది. ఆర్థిక పోటీ యొక్క దోపిడీ ముందు ఏదీ ఆగలేదు.

జ. డబ్బు ముందు దేవుడపజయం పొందాడని మీరంటారు. మంచిది, ఆయన ఇండియాలో అపజయం పొందడు.

ఈ ఉత్సాహకరమైన సంభాషణను చాలావరకు సాగించిన, 'కాటన్ స్పిన్నర్స్ అండ్ మ్యాన్యుఫ్యాక్చరర్స్ అసోసియేషన్' అధ్యక్షుడు మిస్టర్ గ్రే, ఒకానొక అత్యంత కేంద్రీకృత ప్రదేశాన్ని గూర్చి ఆలోచిస్తూండడం చేత ఈ దురవస్థ ఎక్కువగా కనిపిస్తూన్నదని అంగీకరించాడు. బ్లాక్‌బర్న్ ప్రాంతంలో భారతదేశం కారణంగా నూటికి 50 వ వంతుల నిరుద్యోగత ఏర్పడితే, తన సొంత చోట బర్న్‌లీలో నూటికి 15 వంతులు మాత్రమే ఏర్పడిందనికూడా ఆయన అంగీకరించాడు. కాంగ్రెసు బ్రిటిష్ వస్తు బహిష్కారాన్ని ప్రకటించక మునుపే చాలా

మిల్లులు మూలపడిపోయినవనీ, ఈ దురవస్థకు కారణం చాలా వరకు ప్రపంచ పరిస్థితులేవనీకూడా ఆయన ఒప్పుకొన్నాడు. అంతేకాక పూర్తిగా బహిష్కారాన్ని ఎత్తివేసినప్పటికీ కూడా ఈ దురవస్థ నవి చాలావరకు తొలగించలేదని సైతం ఆయన ఆమోదించాడు.

## సుహృద్భావం

గాంధీజీని దర్శించిన నిరుద్యోగ కార్మికులు కటువుగా లేరు సరికదా పైపెచ్చు, భారతదేశపు వ్యవసాయ పరిస్థితులనుగూర్చి కుశల ప్రశ్నలు ప్రారంభించారు. సంవత్సరంలో ఆరు నెలలు వ్యవసాయకులకెందుకు పని లేకుండా ఉంటుందనీ, వారి జీవిత ప్రమాణమంత తక్కువగా ఉండడానికి కారణమేమనీ ఈ మొదలయిన ప్రశ్నలను వేశారు. తమ సమస్య ఉపవాసాలు చేయడంకాదనీ, జీవిత ప్రమాణం తగ్గించుకోవలసి రావడమనీ వారు నిష్కపటంగా ఒప్పుకొన్నారు. షిల్లింగు ఖర్చు పెట్టవలసినచోట ఇప్పుడు ఆరు పెన్నీలతో సంతృప్తిపడవలసి వస్తూన్నది. చాలా మంది యేమీకూడ బెట్టుకోలేకుండా ఉన్నారు. ఇంకా అనేకమంది యిదివరకు కూడబెట్టుకొన్నదానిపైన జీవించవలసివచ్చింది. వారి ప్రస్తుత విరాళం (dole) మగవానికి 17 షి. ఆడదానికి 15 (పనిచేసే మనిషి కాని గృహిణికి 9 షి.) ప్రతి బిడ్డకూ 2 షి. ప్రతి వారానికి. దీనిని గూర్చి గాంధీజి యిలా అన్నారు. “ఇది మహా భాగ్యం. సమయోచిత ప్రజ్ఞ గల జాతి మీది. కాబట్టి మీకు ఇతర వృత్తులు, ఇతర పరిశ్రమలు కల్పించుకోవడానికి కష్టముండకూడదు. ఉపవాసాలు చేస్తూన్న కోట్లాది నా ప్రజకు మరొక వృత్తి లేదు. మీలో ప్రజ్ఞావంతులెవరైనా ఏదైనా వృత్తి చూపించగలిగితే రాటానికి బదులుగా దానినే నేనుపయోగిస్తాను.

ఈలోగా నేను మీకింతకంటె ఎక్కువ ఆశ చూపలేను. బ్రిటనుతో సమాన భాగస్వామిగానున్న భారతదేశం, తనకవసరమైనవన్నీ లాంకషయరు మాత్రమే ఉత్పత్తిచేయగలట్టివన్నీ బట్టనే తక్కిన విదేశీ బట్టలన్నిటిలోకీ ఎక్కువగా కోరుకుంటుందని మాత్రం ఆశించగలను."

దీనివలన వారికి కలిగే ఓదార్పు బహు స్వల్పం. కాని వారు వెళ్లిపోయేటప్పుడు వారిలో యేమీ కాఠిన్యం కనపడలేదు నాకు. వారిలో ఒకరిలా అన్నారు. "దీనినుండి యేదో కొంత మంచిరాక తప్పదు. మంచి రాకపోయినా చెడు రావడానికి వీలులేదు. దీని తక్షణ ఫలితం సుహృద్భావమన్న మాట నిశ్చయం. ఇప్పుడు మేము ఒకరినొకరు అర్థం చేసుకొన్నాము. చైతన్యం పొందుతూన్న ప్రాచ్య దేశాలనుండి విడుదలచేయబడిన అద్భుతశక్తి గాంధీ. ఆయనను చూడగలగడం భాగ్యం. మరొకరిలా అన్నారు. "నిరుద్యోగులలో నేనొకడను. నేనిండియాలో ఉన్నట్లయితే సరిగా గాంధీజీ చెబుతూన్న మాటలనే చెబుతాను."

—యంగిండియా, 15-10-1931.

* మ. దే. 'లండను ఉత్తరాలలో' ఒకదానినుండి.

# 130
# పారిశ్రామికతత్వం

"భారతదేశమును పారిశ్రామికంగా చేయడమును గూర్చి మీ అభిప్రాయ మేమి?"

"పారిశ్రామిక తత్వము మానవానీకమునకు హానికరంగా పరిణమించపోతూన్నదని నా అభిప్రాయం. ఒక జాతిని మరొక జాతి స్వార్థంకోసం వినియోగించుకోవడం ఎల్లకాలం సాగడానికి వీలు లేదు; పరులను స్వార్థంకోసం వినియోగించుకోగలిగిన మీ సామర్థ్యంపైనా, మీకనుకూలమైన విదేశీ అంగళ్లపైనా, పోటీ లేకుండడం పైనా పారిశ్రామికతత్వం ఆధారపడి ఉంది. ఇంగ్లాండు సందర్భంలో ఈ పరిస్థితు లంత కంతకు తగ్గిపోవడంచేతనే, అక్కడి నిరుద్యోగుల సంఖ్య రోజురోజుకూ హెచ్చిపోతూన్నది. భారతీయ బహిష్కారం కేవలం ఈగకుట్టిన మాత్రమే. ఇంగ్లాండు స్థితియే అలా వుంటే, ఇండియావంటి విశాలదేశం, పారిశ్రామిక విధానం వలన బాగుపడుతుందనుకోవడానికి వీలు లేదు. ఇండియా పారిశ్రామిక దేశ మయినట్లయితే యితర దేశాలను స్వార్థం కోసం వినియోగించుకొని తీరాలి. అలా వినియోగించుకోవడం ప్రారంభించినప్పుడు అది యితర జాతులకు అనర్థదాయక మవుతుంది. ప్రపంచానికి భయకారణ మవుతుంది. ఇతర దేశాలను స్వార్థంకోసం వినియోగించుకొనేటందుకు, ఇండియాను పారిశ్రామిక దేశంగా చేయవలెనని నే నెందుకనుకోవాలి? మా ముప్పయికోట్లమంది నిరుద్యోగులకు మేము పని చూపించగలిగి ఉండగా ఇంగ్లాండు మూడుకోట్ల

మందికి పని చూపించలేక తనదేశపు మహామేధావులను చీకాకు పరుస్తూన్న సమస్య నెదుర్కోవలసివచ్చింది. ఈ విషాదకరసంఘటనను మీరు గమనించడంలేదా? పారిశ్రామిక విధానముయొక్క భవిష్యత్తు అంధకార బంధురం. ఇంగ్లాండుకు, అమెరికా, జపాన్, ఫ్రాన్సు, జర్మనీ దేశాలల్లో జయప్రదంగా పోటీచేయగలిగినవారున్నారు. ఇండియాలో వేళ్లమీద లెక్కపెట్టగలిగిన మిల్లులలోకూడా, దానికి పోటీదార్లున్నారు. ఇండియాలో చైతన్యం కలిగినట్లే, మానవ సంపద, ఖనిజసంపద, ప్రకృతి సంపదల విస్తృత సౌభాగ్యంతో విలసిల్లుతూన్న దక్షిణ ఆఫ్రికాకూడా చైతన్యవంతమవుతుంది. బ్రహ్మాండమైన ఆఫ్రికాజాతులముందు, బ్రహ్మాండమైన ఆంగ్లజాతివారు మరుగుజ్జువారుగా కనిపిస్తారు. ఇంతా అయితే వారు ఉదారులైన అడవిజాతులవారని మీరనగలరు. వారుదారులనే మాట నిశ్చయమే. అడవిజాతులవారు మాత్రం కాదు. కొలది సంవత్సరాలలోనే పాశ్చాత్య జాతులవారు తమ సరుకులను బలవంతంగా రుద్దడానికి ఆఫ్రికాలో చోటులేదని తెలుసుకోగలరు. పాశ్చాత్యదేశాల విషయంలో పారిశ్రామికవిధానపు భవిష్యత్తు అంధకారమయంగా ఉంటే, ఇండియావిషయంలో ఇంకనూ ఎక్కువ అంధకార బంధురంగా ఉండదా? *

—యంగిండియా, 12-11-1931

---

* మ.దే. 'లండను ఉత్తరములలో' ఒకదాని నుండి.

# 131

# మరొక ఉత్తమ సందేశం లేదు

## విదేశీవస్త్ర బహిష్కరణము

ఒక బహిష్కరణము నిలుపబడిందని మీరు గమనించ గలరు. ఒకానొక ఆంగ్ల మిత్రుని భావ ప్రవృత్తియందలి గౌరవంతో, ఒడంబడికలో 'బహిష్కరణము' అనే మాటకు బదులుగా 'విదేశవస్త్రోపయోగ నిరాకరణము' అని మార్పుచేయబడినది. 'బహిష్కరణ' అనే మాటలో చెడ్డ వాసన ఉన్నదనడానికి సందేహంలేదు. సాధారణంగా అందులో ద్వేషం కనిపిస్తుంది. నాకు సంబంధించినంతవరకు, ఆ మాట ఆ అర్థాన్ని స్ఫురింపచేయవలెనని నా ఉద్దేశం కాదు. బహిష్కరణం బ్రిటిష్ వస్త్రాన్ని గూర్చి కాదు. విదేశీ వస్త్రాలను గూర్చి. ఆ బహిష్కరణము కేవలం హక్కే కాదు కర్తవ్యం కూడాను. భారతదేశపు నదుల నీళ్లకు బదులుగా విదేశాలనుండి నీళ్లు దిగుమతిచేయబడినయెడల వాటిని బహిష్కరించడ మెంత కర్తవ్యమో ఇదికూడా అంత కర్తవ్యము. అయినప్పటికీ ఇది ప్రసంగవశాత్తు చెప్పినమాట.

ఒడంబడిక విదేశీవస్త్ర బహిష్కారమును నిలపడమేగాక విస్పష్టం చేస్తూన్నదనే నేను చెప్పదలచుకొన్నది. దౌర్జన్య పద్ధతులకు బదులుగా ఇది ప్రయోజనకరమైన ఉపకరణమని నా అభిప్రాయం. తిట్టడం, కోపంగలిగించడం, అబద్ధమాడడం, గాయపరచడం, హత్య మొదలైనవని హింసకు చిహ్నాము లైనట్లే, దాక్షిణ్యము, మృదు ప్రవర్తన, సత్యసంధత మొదలైనవి అహింసకు చిహ్నములు. అదేవిధంగా విదేశీవస్త్ర

బహిష్కరణము, నాకు అహింసాచిహ్నము. విప్లవాత్మక మైన నేరం వత్తిడి తీసుకొని వచ్చేటందు కుద్దేశింపబడ్డది. అయితే అది కోపంతోనూ ద్వేషంతోనూ తీసికొని వచ్చే పిచ్చి వత్తిడి. అహింసా కార్యములవలన, హింసాకృత్యములకంటె చాలా ఎక్కువ ప్రయోజనకరమైన వత్తిడి కలుగుతుందని నా వాదం. ఆ వత్తిడి సుహృద్భావము నుండీ, సౌజన్యము నుండీ రావడమే అందుకు కారణం. విదేశీవస్త్రబహిష్కారం అటువంటి వత్తిడిని కలిగిస్తుంది. మనము లాంకషయిరునుండి అధికతమమైన విదేశీబట్టను దిగుమతీ చేసుకొంటున్నాము. ఇంతవరకు తక్కిన దిగుమతు లన్నిటిలోకీ అదే ఎక్కువది. పంచదార, తరువాత వస్తుంది. ఇండియాతో జరిగించే లాంక షయిరు వ్యాపారంమీదనే బ్రిటనుయొక్క ముఖ్య ప్రయోజనం కేంద్రీకృత మవుతూన్నది. తక్కినవా టన్నిటి కంటెనూ ఎక్కువగా ఈ ఒకటే, భారతదేశపు రైతు యొక్క ఆ ఒక ఉపవృత్తినీ పోగొట్టి అతనికి బలవంతంగా సోమరితనాన్ని కల్పించి అతనిని పాడుచేసింది. కాబట్టి అతను జీవించవలెనంటే విదేశవస్త్ర బహిష్కారం అవసరం. కనుక అందంగానూ చౌకగాను కనిపించే విదేశవస్త్రాలను కొనవద్దని అతనిని ప్రోత్సహించడమేగాక అతని తీరిక సమయాన్ని దూది ఏకడానికీ, వడకడానికీ వినియోగిస్తూ, దానిని గ్రామంలోని నేతవారిచేత నేయించుకొని, ఖద్దరు ధారణ ద్వారా, విదేశీబట్టనేగాక, భారతీయ మిల్లుబట్టను సయితం కొనడంవల్ల అయ్యే ఖర్చును ఆదాచేసుకొనేటట్లు బోధించడం మన కార్యక్రమం. చేతితో వడికిన నూలుతో చేతితో నేసిన బట్టద్వారా అనగా ఖద్దరుద్వారా ఇలా జరిగే విదేశీవస్త్ర బహిష్కరణోద్యమంవలన రైతుసొమ్ము ఆదాకావడమేకాక, మనబోటి కార్యకర్తలు పరమోత్తమమైన సాంఘికసేవ చేసే

టందుకుకూడా పిలుకలుగుతూన్నది. అది గ్రామస్థులతో మనకు ప్రత్యక్షసంబంధం కల్పిస్తూన్నది. వారికి నిజమైన రాజకీయవిజ్ఞానం కలిగించి వారిని స్వయం పోషకులుగానూ, స్వావలంబకులుగానూ, చేయడానికి సావకాశం కల్పిస్తూన్నది. ఖద్దరునిర్మాణం సహకారసంఘాల నిర్మాణంకంటెనూ, యే యితర గ్రామసంస్థల నిర్మాణంకంటెనూకూడా అత్యుత్తమమైనది. అందులో అత్యున్నత రాజకీయ పరిణామం యిమిడి ఉన్నది. బ్రిటను వైపునుండి అత్యంతావినీతికరమైన ఆకర్షణ ఒకటి అందువలన తొలగిపోతూన్నది. లాంక్ షయిరు వర్తకం అవినీతికరమైనదని నే నంటున్నాను. ఎందువల్లనంటే భారతదేశపు లక్షలాది కర్షకుల నాశనం పైన అది ఉద్భవించి పోషింపబడుతూన్నది. ఒక అవినీతి మరొక అవినీతికి దారి తీస్తుంది. అలాగే, నిరూపింపబడిన బ్రిటను యొక్క అనేక అవినీతికార్యాలకీ ఒక్క అవినీతివ్యాపారమే కారణంగా రుజువు చేయవచ్చును. కాబట్టి భారతదేశపు స్వయంకృషివలన, బ్రిటను మూర్ధమునుండి ఈ పెద్ద ఆకర్షణ ఒకటి తొలగింపబడినయెడల అది ఇండియాకూ బ్రిటనుకూ క్షేమం కావడమేగాక, ఈనాడు బ్రిటను ప్రపంచంలో అగ్రరాజ్యంగా ఉన్నది కనుక, సమస్త ప్రజానీకానికీకూడా క్షేమం.

అవసరాన్నిబట్టి సరఫరా ఉంటుందనే సిద్ధాంతాన్ని నే నామోదించను. పైపెచ్చు నీతినియమాలులేని వర్తకుల వలన తఱచు కృత్రిమంగా అవసరం సృజింపబడుతూన్నది. వ్యక్తులవలెనే జాతికూడా నైతిక ప్రవర్తనను గూర్చిన నియమాలను పాటించి తీరవలెనని నా అభిప్రాయం. అలా పాటించి తీరవలసినప్పుడు, ఒకజాతి తా నెవరి అవసరాలను తీర్చేటందుకు సరఫరా చేస్తూన్నదో, ఆ ప్రజల

క్షేమాన్ని గూర్చి ఆలోచించి తీరాలి. ఇందుకు తారార్కణంగా త్రాగుడుకు అలవాటు పడ్డవానికి మత్తుకలిగించే సామాను సరఫరా చేయడం, ఏ జాతి విషయంలోనైనా తప్పూ అవినీతీ కూడా అవుతుంది. మత్తుపదార్థాల విషయంలో ఏది నిజమో ధాన్యమూ బట్టా విషయంలో కూడా అదే నిజం. విదేశీబట్ట, ధాన్యమూ ఎగుమతీ చేయబడుతూన్న దేశాలలో, వ్యవసాయమూ, పరిశ్రమ ఆగిపోయి ప్రజలకు తప్పని సరిగా సోమరితనము, దరిద్రము తటస్థించేయెడల ఆ ఎగుమతికూడా తప్పూ అవినీతీ అవుతుంది. మత్తుపదార్థా లేవిధంగా మనిషియొక్క ఆత్మనూ శరీరాన్నీ పాడుచేస్తవో ఇవికూడా అంతే. ఉద్రేకంతో తలక్రిందులు కావడమే కుంగిపోవడం. కాబట్టి ఫలితాలు సమాన వినాశహేతువులుగానే ఉంటవి. తఱచు ఎక్కువగాకూడా ఉండవచ్చును. ఎందువల్లనంటే సోమరితనంవలనను, పేదరికంవలననూ కలిగే మానసిక పీడను అవినీతికరమైనదిగా గానీ, పాపభూయిష్ఠమైనదిగా గాని పరిగణించే అలవాటు మనకింకా లేదు.

## బ్రిటను కర్తవ్యం.

కాబట్టి భారతదేశముయొక్క క్షేమాని కనుగుణంగా తన ఎగుమతులను నియమించడం బ్రిటను కర్తవ్యమనీ, అలాగే తన క్షేమాని కనుగుణంగా భారతదేశంకూడా తన దిగుమతులను నియమించుకోవడం ఆమె కర్తవ్యమనీ నా అభిప్రాయం. నైతిక మూల్యములను అలక్ష్యం చేస్తూనట్టికానీ పరిగణించనట్టికానీ, ఆర్థిక శాస్త్రం అబద్ధం. ఆర్థిక రంగంలోకి అహింసా సిద్ధాంతాన్ని విస్తరింపచేయడం, అంతర్జాతీయ వాణిజ్యనియమంలో నైతిక మూల్యములను ప్రవేశపెట్టడంకూడా ఆలోచించతగిన విషయమని తెలియచెప్పడంకంటె మరొకటి కాదు. భారతదేశపు కృషి

మూలకంగా, అంతర్జాతీయ సంబంధాలు నైతికాధారంపైన నిలపెట్టడం చూడవలెనని నా ఆకాంక్ష. ఆ సంగతి నేను ఒప్పుకొని తీరాలి. పరిమితమైన ప్రజానీకపు అహింసా చరణము వలన నా కాశాభంగం కలగడం లేదు. మానవ ప్రవృత్తి సహజంగా ఎప్పుడూ అధోముఖంగా ఉంటుందనేమాట నేను విశ్వసించను.

నూలువడకడంవల్లనూ, ఖద్దరువల్లనూ సఫలీకృతమైన విదేశవస్త్ర బహిష్కారం, అగ్రగణ్యమైన ప్రధాన రాజకీయ ఫలితమును కలుగచేస్తుందని అనుకోవడమే గాక, భారతదేశపు నిరుపేదలకు, స్త్రీలకుగానీ పురుషులకుగానీ, స్వశక్తిమీద విశ్వాసం కలిగించి, భారతస్వాతంత్ర్య పోరాటంలో వారిని భాగస్వాములుగాకూడా చేయగలదని తలంపవలసిఉన్నది.

## విదేశీ-బ్రిటిష్

చాలామంది దేశభక్తులు సూచించినట్లుగా, బ్రిటిష్‌వస్త్ర బహిష్కారములోనూ అంతకంటె ఇంకనూ ఎకుక్కువగా బ్రిటిష్‌వస్తు బహిష్కారములోనూ గల హింసాస్వభావం మాట అలా ఉండగా, దాని నిరర్థకతనుగూర్చి ఇప్పుడు నిరూపించవలసిన అవసరం లేదు. కేవలం భారతదేశ క్షేమమును గూర్చిన దృష్టితోనే నేను బహిష్కారోద్యమమును ఆలోచిస్తూన్నాను. అన్ని బ్రిటిష్‌వస్తువులూ మనకు హానికరములు గావు. ఇంగ్లీషు పుస్తకములలాంటి కొన్ని వస్తువులు మన వైజ్ఞానిక ఆధ్యాత్మిక ప్రయోజనాల కోసం అవసరమే. బట్టవిషయంలో బ్రిటిష్ చట్టమేకాక, విదేశీబట్ట యావత్తూ, అందాక ఎందుకు, ఇంకా కొంచెం తక్కువగా మిల్లుబట్ట కూడా మన కపకారం చేస్తూన్నది. ఏదోవిధంగా ప్రవేశపెట్టబడిన బ్రిటిష్‌వస్త్ర బహిష్కారం, ఖద్దరు, వడుకునూలు

ద్వారా ప్రవేశపెట్టబడిన బహిష్కారంవంటి ఫలితాలను ఈయజాలదు. ఇది కనీసం, యావత్తు విదేశీవస్త్ర బహిష్కారమునకూ అవసరాన్ని కల్పిస్తున్నది. బహిష్కారం శిక్షగా ఉద్దేశింపబడడం లేదు. అది జాతీయ జీవనానికే అవసరం

అభ్యంతరాలు ఆలోచింపబడినవి.

రాటం ఆకర్షవంతంగా లేదనీ, తగినంత ఉత్సాహకరమైనది కాదనీ, అది ఆడవాళ్ళపని అనీ, మధ్యయుగము నాటికి మరలిపోవడమనీ, యాంత్రిక విజ్ఞానశాస్త్ర గమనాధిక్యతకు ప్రతికూలమైన వ్యర్థ ప్రయత్నమనీ విమర్శను లేమేమో అంటుంటారు. భారతదేశమునకు కావలసినది వాస్తవికమైన పని కాని, ఉత్సాహం కాదని నా వినయపూర్వకాభిప్రాయము. లక్షలాది ప్రజలకు వాస్తవికమైన పని ఉత్సాహం కలిగించడమేకాక పుష్టినిచ్చే పదార్థంగాకూడా ఉంటుంది. నిజానికి మనం రాటం విషయములో తగినంత పరిశ్రమ చేయలేదు. మనలో చాలమంది దానిని గూర్చి శ్రద్ధగా ఆలోచించలేదని కూడా చెప్పవలసివచ్చినందుకు నాకు విచారం కలుగుతూన్నది. పదే పదే తమకు తామంగీకరిస్తూవచ్చిన నూలు వడకుటను గూర్చిన తీర్మాన పరంపరలను, అఖిలభారత కాంగ్రెసుసభ్యులే ఆచరణలో పెట్టడం మానివేశారు. మనలో అధికసంఖ్యాకులకు కేవలం దానిలో నమ్మకం లేదు. ఆ పరిస్థితులలో దానిలో ఉత్సాహం లేకపోవడంచేత నూలువడకడం అపజయం పొందిందనడం న్యాయంకాదు. అది కేవలం ముసలమ్మ చేసేపని అనడం అసలు విషయాలను గమనించక పోవడం. నూలువడుకు మిల్లులు నూలువడుకు రాటముల గుణనం. (multiplication) అవి పురుషులవల్లనే నడప

బడుతూన్నవి. కొన్ని వృత్తులు పురుషుల గౌరవమునకు లోపమనే మూఢవిశ్వాసాన్ని తొలగించుకోవలసినతరుణ మాసన్నమయింది. మామూలు పరిస్థితులలో నూలువడకడం నిస్సందేహంగా అబలలపనియే అవుతుంది. కుటీరపరిశ్రమగా ఉండేటందు కవసరమయిన పరిమితులలో రాటమును అభివృద్ధిచేయడానికి, భావిప్రభుత్వం దానికడ ఎల్లప్పుడూ కొంతమంది పురుషులను నియమించవలసి ఉన్నది. మనలో కొంతమంది పురుషులు దానినిగూర్చి రాత్రింబవళ్లు ఆలోచించకుండా ఉన్నయెడలను, దానికడ పనిచేయకుండా ఉన్నయెడలను రాటపు యంత్రములలో కలిగిన అభివృద్ధి అసంభవమై ఉండేదని మీకు నేను చెప్పవలసి ఉంది.

## యంత్రములు

యంత్రములను గూర్చి నాకు ఆపాదింపబడిన అభిప్రాయాలను కూడా మీ మనస్సులనుండి తొలగించుకోవలెనని నా కోరిక. అహింసను గూర్చిన నా సంపూర్ణ విశ్వాసమును జాతీయామోదముకొఱకు నివేదింపదలచుకోనట్లే యంత్రములను గూర్చిన నా అభిప్రాయములన్నిటినీ కూడా జాతీయామోదము కొఱకు నివేదింప ప్రయత్నించడం లేదు. ఇది మొదటి సంగతి. రాటమే ఒక మనోజ్ఞమయిన చిన్న యంత్రం. నేను దాని అజ్ఞాత రచయితకు గౌరవ పురస్సరంగా నిత్యమూ ప్రణామం చేస్తున్నాను. 1,900 మైళ్లు పొడుగు 1,500 మైళ్ల వెడల్పాగల భూఖండములో వ్యాపించి ఉన్న వేలకొలదీ కుటుంబములను పస్తులు పడుకోకుండా చేసిన ఒకే ఒక కుటీర పరిశ్రమను బుద్ధిపూర్వకంగానూ క్రూరంగానూ నాశనం చేసినందులకు నాకు కోపం ఉంది.

### పడుకు పనివలని సభ్యత్వపు హక్కు

రాటము నెడల నాకు గల మమకారమును గూర్చి మీకిప్పుడాశ్చర్యంగా ఉండదు. సభ్యత్వపు హక్కు కోసం దాని నెందుకు నేను ప్రవేశపెట్ట సాహసించానో, స్వరాజ్య పార్టీ పక్షాన దేశబంధుదాసు, పండిత మోతీలాల్ నెహ్రూ లెందుకు దానినామోదించారో గూడా మీకాశ్చర్యం కలిగించదు. నా ఇష్టము వచ్చినట్లు నేను చేసేటట్లయితే, వడికేటందుకిష్టపడనివారు గానీ, నిత్య ఖద్దరుధారులు కాని వారుకానీ ఒకరైనా కూడా కాంగ్రెసు సభ్యుల జాబితాలో ఉండరు. కాని స్వరాజ్యపక్షం అంగీకరించినదానికి నేను కృతజ్ఞుడను. ఇందులోని మార్పు అవిశ్వాసము నెడలను, దౌర్బల్యము నెడలను చూపబడిన ఔదార్యము. అయితే అది రాటంలోనూ ఖద్దరులోను సంపూర్ణ విశ్వాసమున్న వారికి ప్రోత్సాహంగా పరిణమించాలి.

### మరొక సందేశం లేదు

నే నింతవరకూ రాటమును గూర్చియే దీర్ఘంగా ప్రసంగించాను. అంతకంటె భిన్నమైనదికానీ, ఉత్తమమైనదికానీ నేను దేశానికీయగలిగిన సందేశం లేకపోవడమే అందుకు కారణం. 'శాంతియుతము సక్రమము అయిన పద్ధతుల' వల్ల స్వరాజ్యమును సాధించవలెనంటే ఉపయోగకరమైన యితర విధానమేమీ నాకు తోచడం లేదు. ఇంతకు పూర్వము నేను చెప్పినట్లు, దౌర్జన్యమునకు బదులుగా, దేశం యావత్తూ ఆమోదించగలిగిన మరొక సాధనం యిది ఒకటే. నాకు శాసనోల్లంఘన సిద్ధాంతములో సంపూర్ణ విశ్వాసమున్నది. కాని మనం విదేశీ వస్త్రములను బహిష్కరించగల శక్తి పొందేటంతవరకు, స్వరాజ్యసాధనం

కోసం శాసనోల్లంఘనమును సాగించడం అసంభవం. రాటమును గూర్చిన నా అభిప్రాయములు మీకు అమోదార్హములు కాకపోయినట్లయితే కాంగ్రెసుకు నా నాయకత్వం ఎలా నిరుపయోగమో మీరిప్పుడు తేలికగా తెలుసుకోగలరు. రాటమును గూర్చిన సిద్ధాంతమును ప్రతిపాదించడంలో నేను తప్పుచేసినట్లు మీరు భావించే యెడల, కొందరు మిత్రు లభిప్రాయపడుతూన్నట్లే మీరు కూడా నన్ను జాతీయాభ్యుదయ నిరోధకుడుగా తలంచడంలో నిజంగా న్యాయం ఉన్నది. మీ బుద్ధికీ హృదయానికీ ఇది నచ్చకపోయినట్లయితే, నా నాయకత్వాన్ని మీరు త్రోసివేయకపోవడంలో మీరు మీ కర్తవ్యమును నిర్వర్తించినవారు కారు. మనకు ' కాదు ' అని చెప్పగల ధైర్యంకానీ శక్తిగానీ లేదని ఒకప్పుడు లార్డు విల్లింగ్డన్ మనను గూర్చి బహు సమజసంగా అన్నాడు. అటువంటి మాట మనను గూర్చి యింకెప్పుడు చెప్పబడకుండు గాక. మీకు నమ్మకం లేకపోయినట్లయితే, నా ప్రతిపాదనను గూర్చిన మీ నిరాకరణ స్వరాజ్యసాధమునకొక సోపానం కాగలదు. *

—యంగిండియా, 26-12-1924

---

* బెల్గాం కాంగ్రెసులో ఈయబడిన అధ్యక్షోపన్యాసమునుండి

# 132

# ఖాదీ, హరిజనులు

హరిజనుల విషయంలో ఖాదీ అనగా ఏమిటో తెలిసిన వారు చాలా కొద్దిమంది ఉన్నారు. నిరాడంబరమైన నేత పని దాదాపు ఒకటి హరిజనుల సొత్తు. మిల్లు నూలు, మిల్లు నేత అనేకమంది హరిజనుల వృత్తిని పోగొట్టినప్పటికీ, వేల కొలదీ హరిజనులు ఇప్పటికీ నేతమీదనే ఆధారపడి ఉన్నారు. కాని ఒకానొక మిత్రు డీవిధంగా వాదిస్తున్నాడు: "మృతి పొందుతూన్న పరిశ్రమను ప్రాణంతో నిలిపి ఉంచడంవలన ప్రయోజనమేమిటి? అభివృద్ధి కాదగిన పరిశ్రమను దేనినైనా మీరు వారికెందుకీయరాదు? ఇతరంగా వారి అభివృద్ధిని గూర్చి అన్ని పద్ధతులను అన్వేషిస్తూన్న మీరు, తుప్పుపట్టి పోతూన్న వృత్తులనే అంటి పట్టుకొని ఉండవలెనని వారిని కోరరు గదా?' హరిజనులు గానీ మరెవ్వరు గానీ, మరి యే యితర వృత్తిలోనైనా ఎక్కువ ప్రయోజనకరంగా నియోగింపబడటానికి వీలున్నయెడల వారిని వడకడం నేయడం వృత్తులతో గానీ, మరి యే ఒకటి వృత్తిలో గానీ అంటి పట్టుకొని ఉండవలసిందని నేను నిజంగా కోరను. అయితే ఈ అభ్యంతరం పెట్టినవారివలె, చేతితో వడకడం, చేతితో నేయడమును గూర్చి నాకు నిరుత్సాహం మాత్రం లేదు. కనీసం భారత దేశానికి సంబంధించినంతవరకైనా, చేతితో పత్తిగింజలు తీయడం, చేతితో ఏకడం, చేతితో వడకడం, చేతితో నేయడం—ఈ పనులకు ఉజ్వల భవిష్యత్తు కలదని నా వ్యక్తిగత విశ్వాసం. మూక ప్రజానీకం ఏ మాత్రమైనా సౌఖ్యంగా జీవించవలెనంటే, మిల్లులు ఎక్కువగా భారత

దేశానికి వెలుపలనే తమ వ్యాపారాన్ని సాగించుకోవడానికి ప్రయత్నించాలి. గ్రామస్థులు తమ అల్పాదాయానికి తోడు, చేతితో వడకడం, చేతితో నేయడం వగైరా వృత్తుల ద్వారా అదనంగా సంపాదించుకొనేటందుకు ప్రోత్సహింప బడాలి: లక్షలాది గ్రామస్థులు ఎక్కువ లాభదాయకంగా నియోగింపబడగలగని భావించినప్పటికీకూడా, దేశానికి కావలసిన అవసరములన్నిటినీ తీర్చేటందుకు దేశీయ మిల్లు లకు చాలా కాలం కావాలి—అనేక తరాలు కావాలి—ఇంకా పెద్ద పెట్టుబడి కావాలి. యంత్రసామగ్రికోసం, శాస్త్రీయనైపుణ్యంకోసం, ఇతర దేశాలపైన ఆధారపడి ఉండాలి. సిద్ధాంతంలో, విదేశీ యంత్రసామగ్రిపైనా, విదేశీ నైపుణ్యంపైనా ఆధారపడి ఉండడం తప్పు కాకపోయి నప్పటికీ, ఆచరణలో మాత్రం మిల్లు పరిశ్రమకది భయంకర ప్రతిబంధకం. పరాయి దేశాల సహాయంపైన ఈ పరిశ్రమ ఆధారపడవలసి ఉన్నంతవరకు దీనిని దేశీయ పరిశ్రమ అనడం సమంజసం కాదు.

ఇక, గ్రామ పరిశ్రమగా ఖాదీకి బహు స్వల్పమైన పెట్టుబడి చాలును. దానికి కావలసిన పరికరములన్నీ గ్రామాలలోనే తయారుకాగలవు. ఈ పనికి తగిన దేశీయ నైపుణ్యమునకు కొదువలేదు. ప్రజల చిత్త వృత్తిలో మార్పు కలిగించడమే కావలసినది. కాబట్టి, ఇందుకు ప్రతి కూలములయిన యుక్తివాదములున్నా మిల్లుల ఉత్పత్తిని గూర్చిన ఆకర్షవంతములయిన లెక్కలున్నా ఎన్ని ఉన్నప్పటికీ, భారత దేశంలో ఖాదీకి ఉజ్వల భవిష్యత్తు కలదనే నా దృఢాభిప్రాయం. మనంతేట మనం విశ్వాసంతో చేయని పని, పరిస్థితుల బలవంతము వలన మనం తప్పనిసరిగా చేయవలసి వస్తుంది. భారత దేశం బ్రతికి

తీరాలి. అనగా భారత ప్రజాసామాన్యం బ్రతికి తీరాలి. వారీనాడు సజీవంగా లేరనే విషయంలో భేదాభిప్రాయం లేదు. వారు ఉన్నారు అంతే. ఇన్ని లక్షలమంది జనానికి పూర్తిగా పని లేకుండినట్టిన్నీ అధికంగా గ్రామీణ సభ్యతయే ఉన్నప్పటికీ, మనిషికి రెండెకరాల భూమి కూడా లేనట్టిన్నీ మరొక దేశం ప్రపంచంలో ఎక్కడా లేదు. ఆ దేశానికి కావలసిన యావత్తు బట్టను, విద్యుచ్ఛక్తి ద్వారా గానీ, ఆవిరి శక్తిద్వారాగానీ, లేక రాటానికి వెనుకనున్న మానవ శక్తిద్వారా తప్ప మరియే యితర శక్తిద్వారా గానీ ఉత్పత్తి చేయడం ఆ ప్రజల పనిలేని తనాన్ని మరింత ఎక్కువచేయడం. కాబట్టి పారిశ్రామిక భారత దేశమనగా, మనం మిక్కిలి సిగ్గిలవలసిన పద్ధతిలో సహజంగా సంఘమునకు అట్టడుగు మెట్లులోనున్న హరిజనులతో సహా లక్షలాది ప్రజలను నిర్మూలించడమని అర్థం

ఉన్నత పారిశ్రామిక విధానముల ద్వారా ప్రతి అమెరికా దేశీయుడు 36 మంది బానిసలకు సమమైన దానికి యాజమాన్యం వహిస్తున్నాడని తెలుస్తూన్నది. అమెరికాను ఉదాహరణంగా తీసుకొని, 36 మందికి బదులుగా ప్రతి భారతీయుడు 30 మంది బానిసలనే ఉపయోగించేటట్లు చేసినప్పటికీ, మన 31 కోట్ల మంది ప్రజలలో 30 కోట్ల మంది ఆత్మహత్య చేసుకోవాలి, లేదా హత్య చేయబడాలి. కొంతమంది అత్యుత్సాహవంతులైన దేశభక్తులిందుకు లెక్క పెట్టకపోవడమే గాక కావలెనని కోరుతారుకూడా. నిరాయుధులై నడవడంకూడా చేతకాని 30 కోట్ల మూకకంటె, హాయిగా సంతృప్తిగా ఐశ్వర్యంలో తులతూగుతూ ఆయుధపూర్ణులైనవారు ఒక కోటిమంది ఉన్నా చాలునని వారు వాదిస్తారు. ఆ సిద్ధాంతానికి నేను జవాబు చెప్పలేను.

హరిజన చిత్తవృత్తితో లీనమైన నేను, లక్షలాది గ్రామస్థుల పరిభాషలో మాత్రమే ఆలోచించగలను. వారందరిలోకీ నిరుపేదలైనవారిపైననే నా ఆనందం ఆధారపడి ఉండేటట్లు చేసుకోగలను. వారు జీవించగలిగితేనే నేను జీవించ కోరుతాను. ఏ మాత్రమూ అరమరలేని నా మనస్సు, కష్టం లేకుండా నేను తయారుచేసుకోగలిగి, ఒక చోట నుండి మరొక చోటకు నా అంతట నేను మోసుకొని పోగలిగిన చిన్న రాటముయొక్క చిన్న కదురును మించి పోజాలదు. ఈ సందర్భంలో పత్రికలలో ప్రచారమవుతూన్న ఈ దిగువ అంశమును నాకొక స్నేహితుడు పంపుతున్నాడు.

"కొన్ని పరిశ్రమలలోని నిరుద్యోగతను తొలగించేటందుకు మనుష్యులు చేసే పనికి బదులుగా యంత్రాలను ఉపయోగించడం ఆపుచేస్తూ నాజీలు ఉత్తరువులు చేశారు. ఈ నిషేధమును గూర్చి పరామర్శ చేస్తూ మాంచెస్టరు గార్డియన్ యిలా వ్రాసింది: "నిరుద్యోగ క్లిష్టదశను ఎక్కువ చేయడంలో యంత్రముల ఫలితాలను గూర్చి చాలా చర్చ జరుగుతూ వచ్చింది. కాని యంత్రాల ఉపయోగమును నిలిపి తగిన చర్య తీసుకొనే పని నాజీలకే విడిచివేయబడినది. జర్మనీ దేశమునందలి పారిశ్రామిక విధానంలో శ్రమ తగ్గించుకొనే సముచిత సంస్కరణముల యొక్క అద్భుత విజయమును గూర్చి శ్లాఘించవలసిందిగా ప్రపంచం కోరబడి కొద్ది కాలమే అయినది. ఇప్పుడు యంత్రమును నిషేధించుట మూలమునగానీ, తక్కువ గంటలు పనిచేయిస్తూ యెక్కువమంది పనివాళ్లను నియోగింపవలసిందిగా యంత్రాల యజమానులను నిర్బంధించుట మూలమునగానీ ప్రభుత్వంవారు యంత్రంతో పోరాడతలపెట్టినారు. నూలు వడుకు యంత్రమునకు బదులుగా చేరాటమును, మర మగ్గములకు బదులు చేమగ్గములను ప్రవేశపెట్టవలెనని గాంధీ చేసే ప్రయత్నాలు, జర్మనీలోని చుట్టల పరిశ్రమ గాజు పరిశ్రమలతో సన్నిహితంగా తులతూగుతూన్నవి."

'జర్మనీయొక్క నైతిక సూత్రములు మధ్యకాలీనములై యుండగా దాని ఆర్థిక సూత్రాలుమాత్రం మధ్యకా

లీనములుగా నుండకూడదు' అని వ్రాస్తూ తన విమర్శనను గార్డియన్ ముగించింది. ఈ విమర్శలకు జవాబిస్తూ మరొక విలేఖకు డీవిధంగా వ్రాస్తూన్నాడు.

'వాడుకకు కావలసిన వస్తుసముదాయముకంటె ఎక్కువ తయారు కాకుండా ఉత్పత్తిని తగ్గించేటందుకు వివిధ విధాల ప్రయత్నిస్తూన్న హిట్లరు, గాంధీ, తదితరులు మధ్యకాలీన మార్గాలకు మఱలిపోతూండ వచ్చును. కానీ చేతితో చేయబడిన వస్తువులు మాత్రం అభివృద్ధిని నిరోధకములు అనాగరికములూ కావు, అభివృద్ధిదాయకమైన ప్రతి ప్రాథమిక పాఠశాలలోనూ ఉన్నత పాఠశాలలోనూ అవి నేర్పబడుతూన్నవి. అతి నవీనముగానూ అచారవిరుద్ధముగానూ కనిపించే మార్గాలద్వారా ఐనప్పటికీ సకాలములో నిరుద్యోగత నిర్మూలింపబడకపోయినయెడల మన అందఱినీ వినాశనంచేసే విప్లవాలలోనూ యుద్ధాలలోనూ యంత్ర యుగం అదృశ్యమయిపోతుంది. ప్రజా సామాన్యముయొక్కయు ఉన్నత వర్గాల యొక్కయు అనందాభ్యుదయములను పెంపొందిస్తూన్నంతవరకు యంత్రం ప్రయోజనకరమైన పరికరమే. కాని పరిశ్రమలు బాగా పెంపొందిన పాశ్చాత్య దేశాలలోవలె లక్షలాది ప్రజల నిరుద్యోగమునకు ఉపవాసములకూ దారి తీస్తూన్నప్పుడది పీడాకరమవుతుంది. యంత్రం మనిషికోసం ఉంది. మనిషి యంత్రంకోసంలేడు. దానిని ప్రజల క్షేమం కోసం లోబడి ఉండేటట్లు చేసుకోవాలి. కాని ప్రజలపైన పెత్తనం చేసేటట్లు చేసుకోకూడదు.'

'జర్మనీలోని గ్రామ పరిశ్రమలు దౌర్జన్యయుతంగా పునరుద్ధరింపబడుతూన్న సంగతి ప్రస్తుత విషయం కాదు. పారిశ్రామిక విషయమున ప్రపంచంలో యెక్కువగా పురోగమించినట్టిన్నీ అత్యున్నత పారిశ్రామిక నైపుణ్యమును ప్రదర్శించినట్టిన్నీ ఒకానొక దేశం భయంకరమైన తన నిరుద్యోగ సమస్యను పరిష్కరించుకొనేటందుకు గ్రామ పరిశ్రమలవైపుకు మఱలిపోప్రయత్నిస్తూన్న సంగతియే మన ప్రస్తుత విషయం.

—హరిజన్, 27-10-1933

# 133

## ఖాదీ, హరిజనులు

అస్పృశ్యతా నివారణ కార్యక్రమం యావత్తూ అలా ఉండగా హరిజనుల ఆర్థికాభ్యుదయములో శ్రద్ధకలవారు ఇతర వృత్తులులేని హరిజన స్త్రీ పురుషులకున్నూ పిల్లలకున్నూ ఖాదీ వృత్తిని కల్పిస్తూన్నదని తెలుసుకోవలసిఉంది. అది కొన్ని కుటుంబాలను పూర్తిగా పోషిస్తున్నది. ఇంకా అనేక కుటుంబాల అల్పాదాయమునకు అదనంగా కొంత చేకూర్చి, వారిని పస్తులుపడుకోకుండా కాపాడుతూన్నది. కడుపునిండా కూడులేని లక్షలాది ప్రజలకు వృత్తిని కల్పించే సార్వజనీన సాధనంగా ఉండతగిన దానిసామర్థ్యమును గూర్చి ఇప్పుడంత గట్టిగా ఎవ్వరూ ప్రశ్నించడం లేదు. పేదల పెన్నిధియైన ఇది అవినీతి పద్ధతులద్వారా అణచివేయబడుతూన్నది. కొంతమంది బట్టల వర్తకులు మిల్లు నూలుతో నేసిన ఖాదీ బట్టను, చేతితో వడికి చేతితో నేసిన ఖాదీ బట్టక్రింద చలామణి చేస్తూన్నారని నాకు మధురలో తెలిసింది. ప్రత్యేక ఖాదీరకాల సరియైన నకళ్లు నాకు నమోనాలుగా చూపబడినవి. ఖాదీ ప్రియులున్నూ, హరిజనులను సేవించడంలో ఖాదీయొక్క శక్తియందు నమ్మకమున్న హరిజన సేవకులున్నూ, అఖిల భారత చరఖా సంఘముయొక్క ధ్రువపత్రం లేని ఖాదీని కొనవద్దని ప్రార్థింపబడుతూన్నారు. అంతేకాక, విదేశీ స్వదేశీ మిల్లు బట్టలు సైతం ఎక్కువగా ఖాదీ అనే పేరుతో అంగడిలో అమ్మబడుతూన్నదని కూడా నేను విన్నాను. ఇక నా దుఃఖాన్ని పరిపూర్ణం చేసేటందుకు, ఖాదీని గూర్చి

నా అభిప్రాయం మార్చుకొన్నాననీ దేశీయ మిల్లుబట్టను కూడా ఖాదీతో సమానం చేశాననీ, నన్ను గూర్చి తప్పుగా ప్రచారం చేస్తున్నారు. ఖాదీ విషయంలో నా అభిప్రాయమును గూర్చి ఇది తప్పు ప్రచారం. ఖాదీయందు నాకుగల విశ్వాసం, నైతిక ఆర్థిక జాతీయ (దాని అత్యంత విశాలార్థంలో) దృక్పథములనుండి, పైపైతే మఱింత దృఢ తరమైనది. ఖాదీకీ, మిల్లు బట్టకు—విదేశీయ మిల్లుబట్టకు కూడా యేమి పోలిక లేదు. ఖాదీ సందర్భంలో మిల్లు బట్టద్వారాగానీ, మిల్లు నూలు ద్వారాగానీ పేదలను స్వార్థంకోసం వినియోగించుకోవడం అసంభవం. మిల్లు బట్ట మిల్లు నూలులద్వారా పేదలను స్వార్థంకోసం వినియోగించుకోవడం యేదో ఒక రూపంలో తప్పని సరి. అది తక్కువగా అయితే కావచ్చును. కొంచటితో పోల్చి చూచినప్పుడు ఎక్కువ ధనవంతులుగా ఉండేవారు నిజమైన ఖద్దరును వాడడంవలన, తమ స్వార్థంకోసం నిరంతరం ఉపయోగించుకొంటూవచ్చిన పేదలకు (ఎంత తక్కువగా అయినప్పటికీ) కొంత మందరా యిచ్చినట్లవుతుంది. గ్రామాలలో నివసించే ప్రజాసామాన్యమున కది తగినంత ఎన్నడూ కాదు. అయినప్పటికీ మొత్తంమీద చాలా ఎక్కువయే ముట్టగలదు. ప్రతి మిల్లూ జాతీయం చేయ బడినా మిల్లు బట్టవలన ఈ పనులలో ఏదీకూడా జరుగ జాలదు. మిల్లు పరిశ్రమ కేవలం జాతీయ క్షేమంకోసం సమర్థతతో పరిపాలింపబడుతూన్నప్పటికీ, పంపిణీ దానంత టది జరగడాని కెప్పుడూ వీలులేదు. దానివలన అనేక మంది శ్రామికులు స్థానభ్రష్టులు కావడం తటస్థించి తీరుతుంది. ఖాదీ పనిలో, ప్రతి కుటీరంలోనూ రాటం ఉంటుంది. అందువలన శ్రామికులకు పనిపోవడంకానీ స్థానభ్రష్టులు

కావడంకానీ ఉండదు. పైగా అందువలన జరిగిన ఉత్పత్తి ఎప్పుడూ దానంతటది పంపిణీ అవుతూంటుంది. కాబట్టి నాకు సంబంధించినంతవరకు ఖాదీకి మిల్లు బట్టకూ పోలిక ఉండడానికి వీలు లేదు. అవి రెండూ ఒకదానితో ఒకటి సమంగా నడవడానికి వీలులేదు. ఎందువల్లనంటే అవి రెండూ ఒకే తరహావి కావు. వ్యాపార సరళిలో మాట్లాడుకోవలసి వస్తే, మిల్లు బట్టకున్న తయారీకానీ, దాని రకం కానీ, దాని చౌకదనం కానీ, ఖాదీకి ఎన్నటికీ రాదు. కొలతలోకూడా రెండింటికీ భేదమున్నది. ఖాదీ మానవమూల్యమునకు సంబంధించి ఉంటుంది. మిల్లు బట్ట కేవలం నాణేముల విలువకు సంబంధించి ఉంటుంది. గజం నాలుగణాల ఖరీదుగల ఖాదీ నాకు చౌక. అదే మోస్తరు మందము అదే నెంబరుగల మిల్లు బట్ట గజం రెండణాల ఖరీదైనా నాకు ప్రియమే. కాబట్టి ఈ రెండింటి మధ్యావిచక్షణ ఉండవలెనని, ఆలోచనలో పొరపాటు ఉండకూడదనీ నా ప్రార్థన. దేని ప్రతిపత్తి దానికి ఉండనీయండి. ఖాదీ ఆక్రమిస్తూన్న స్థానాన్ని గూర్చి మిల్లు పాలనాధికారులు అసూయపడనక్కర లేదు. ఖాదీవలె కనిపించే బట్టను తయారుచేసి, దానిని ఖాదీ అని నమ్మించి కొనేవాళ్లను మోసంచేయడం వారికి ఉచితం కాదు.

—హరిజన్, 9-2-1934

# 134

# హరిజనులకొఱకు వడుకు పనీ, నేత పనీ

వడుకు పనీ నేతపనీ వేలకొలదీ హరిజనులను పోషిస్తున్న వృత్తులలోవనీ, వాటిని సరిగా ఏర్పాటుచేసేయెడల ఇంకా ఎక్కువ మందిని పోషించగలవనీ నా సంచారములలో నేను గ్రహించాను. వృత్తినిబట్టి అంటరానివారుగా పరిగణింపబడుతూన్న నేతపనివారు నిజంగా కొన్నిచోట్ల కనపడుతున్నారు. వారు చాలావరకు ఏమీ అందచందాలు లేని కటికి ముతక ఖాదీ నేస్తూఉంటారు. వారిని ఉద్ధరించడానికి ఖాదీ వచ్చేముందు దాదాపీ తరగతివారు అంతరిస్తూండిరి. ఖాదీ రావడంతో వారి ముతక బట్టలకే మంచి గిరాకీ వచ్చింది. అప్పుడు అనేక హరిజన కుటుంబాలవారు వడుకు పనిమీద కూడా బ్రతుకుతూన్నట్లు క్రొత్తగా తెలిసింది. ఇలా పేదవాని జీవనానికి ఖాదీ రెండువిధాల సహాయం చేస్తూన్నది. నిరుపేదలలో అత్యంత నిస్సహాయులైన హరిజనులతో సహా మిక్కిలి పేదలకది సహాయకారిగా ఉన్నది. వారలా నిరుపేదలుగా ఉండడానికి కారణం, ఇతరులకందుబాటులో నున్న అనేక వృత్తులు హరిజనుల కందుబాటులో లేకపోవడమే.

హరిజన దృక్పథమునుండి ఖాదీకిగల గొప్ప విలువ అలా ఉండగా ఇక హరిజన సంచారంలో నాచేతనైనంతవరకు ఖాదీ సమస్యను పూర్తిగా పరిశీలించకుండా విడువలేదు. ఖాదీ అర్థ శాస్త్ర సిద్ధాంతాలను అనుసరించడములో మిక్కిలి శ్రద్ధవహించవలసిన అవసరం పూర్వమెప్పటికంటెనూకూడా ఇప్పుడెక్కువయుందని ఖాదీ కార్యకర్తలు

విస్పష్టం చేయతగిన సమయం వచ్చినట్లు నాకర్థమయింది. వాటిలో కొన్ని సాధారణ అర్థ శాస్త్ర సిద్ధాంతముల నుండి ముఖ్యంగా భేదిస్తూన్నవి. సాధారణ సిద్ధాంత ప్రకారం ఒకచోట తయారుచేయబడిన వస్తువులు ప్రపంచం లోని అన్నిచోట్లకు పంపబడుతూన్నవి. లేదా పంపించే టందుకు ప్రయత్నం చేయబడుతూన్నది. ఉత్పత్తి చేసిన వారెవరూ ఆ వస్తువులను ఉపయోగించనక్కరలేదు. ఖాదీ విషయంలో అలాకాదు. అది ఎక్కడ ఉత్పత్తి అయిందో అక్కడనే ఉపయోగించబడవలసిఉంటుంది. ముఖ్యంగా వడికేవారు నేసేవారిచేతనే ఉపయోగించ బడవలసిఉంటుంది. దానిలోని విశేషమదే. కాబట్టి ఖాదీ ఈ విధంగా వినియోగింపబడుతూన్నప్పుడు దానంత టదే విడుదల అవుతూంటుందనే మాట నిశ్చయం. అయితే ఈ ఆదర్శమెప్పుడూ పూర్తిగా ఆచరణలోకి రాని మాట నిజం. కాని ఇది ఎంతవరకు ఆచరణలోకి వస్తుందో దానిని బట్టియే ఎప్పుడూ ఖాదీయొక్క విలువను లెక్కకట్టవలసి ఉంటుంది. ఈ ప్రత్యేకార్థంలో ఖాదీ కుటీర పరిశ్రమ అవుతుంది. వ్యవసాయం పరిశ్రమగా పరిగణింపబడేయెడల ఒక పరిమితమైన అర్థంలో వ్యవసాయం తప్ప, ఇంకే యితర పరిశ్రమ కుటీర పరిశ్రమ అనిపించు కోదు. కాబట్టి ఖాదీయొక్క మామూలు అర్థశాస్త్రాన్ని అర్థం చేసుకొనేటట్లు వడికేవారికీ నేసేవారికీ శిక్షణ ఈయడం అవసరం. వడికేవారు, నేసేవారు తమ ఉపయోగం

కోసం వడుకుకొని నేసుకొన్నప్పుడు బట్ట కారుచౌక కావడం సహజం.

దీనినిబట్టి ఉత్పత్తి అయిన చోటనుండి ఎక్కువ దూరం అమ్మకంకోసం ఖాదీ పంపించబడకూడదని తెలుస్తూన్నది. ఉత్పత్తి అయిన గ్రామంలోనే మిగులు ఖాదీని అమ్మివేయవలెను. ఇంకా ఎక్కువ మిగిలిఉంటే ఉత్పత్తి అయిన జిల్లాలో అమ్మబడవలెను. అనాదినుండీ కళానైపుణ్యముగల నేతలో ప్రసిద్ధికెక్కిన కుటుంబాలవారు ప్రత్యేక రకాలను తప్పకుండా నేస్తూనే ఉంటారు. గ్రామీణులకు నిరంతరం పనిని ఆదానూ కల్పించేటందుకు మూలమైన గ్రామస్థుల ఖాదీకేమి తటస్థించినా ఈ రకపు ఖాదీ మాత్రం జీవించగలదు.

ఈ పైన చెప్పబడిన విషయమునుబట్టి అఖిల భారత చర్ఖా సంఘంయొక్క పరిపాలనలో తక్షణం తీవ్రమయిన మార్పు కలుగుతుందని అర్థ కాదు. దాని దుకాణాలు మామూలుగానే నడుస్తూంటవి. కాని భావ ప్రపంచంలో మాత్రం తీవ్రమైన మార్పు ఉండని అర్థం. ఖాదీ కార్యకర్తలలో మహా మేధావంతులైనవారు గ్రామస్థుల అభిరుచి కనుగుణంగా గ్రామ ఖాదీకి కావలసిన లక్షణమునుగూర్చి మనుగడనుగూర్చి శ్రద్ధవహించగలరు. పత్తిగింజలు తీసేవారు, ఏకేవారు, వడికేవారు, నేసేవారు ఈ అందరి మధ్యనూ, ఖాదీ కార్యకర్తల మధ్యనూ ఇప్పటికంటె ఎక్కువ నిజమైనట్టిన్నీ, ఉత్తమమయినట్టిన్నీ సన్నిహిత సంబంధం ఉంటుంది. పట్టణాలలో ఖాదీ అమ్మకం ఎక్కువ కావలెననే తీవ్రమయిన ఆతురత ఉండదు. గ్రామాలకు ప్రత్యక్షంగా పోసట్టిన్నీ, పోజాలనట్టిన్నీ, అయి

నప్పటికీ వడుకుపనీ, నేతపనీ చేసే పేదల పక్షాన కొంత ఖాదీ అమ్మేటంతవరకూ సంతృప్తిపడనట్టిన్నీ, ఖాదీ ప్రియులు కావించే ప్రచారమును బట్టియు, పట్టణవాసుల కోరికను బట్టియు ఈ ఖాదీ అమ్మకము లేర్పాటుచేయబడగలవు. గ్రామస్థులు ధరించేదిగా దానికి శాశ్వత స్థానం లభించి నప్పుడే, ఖాదీ శాశ్వతం కాగలదని మాత్రం మనస్సులో పెట్టుకోవాలి.

—హరిజన్, 27-4-1934

# 135

# జాగ్రతగా వడికే మనిషి

హరిజన పాఠశాలలో పనిచేస్తూ విద్యార్థులలోనూ వారి తలిదండ్రులలోనూ, అనేక ఇతర విషయములతోపాటు నూలు వడుకు పనిని ప్రవేశపెట్టేటందుకు ప్రయత్నిస్తూన్న ఒకానొక హరిజనసేవకు డిలా వ్రాస్తున్నాడు:

“జాతీయ వారంలో నేను ఇదివరకుకంటె ఎక్కువ కష్టపడి ఇంకా ఎక్కువ జాగ్రతగా వడికాను. సగటున గంటకు మూడు వందల గజాలు వడికాను. 40 తులాల పత్తినుండి 37 తులాలుగల 16 వ నెంబరు నూలు తీశాను. ఉత్పత్తి అయిన సరుకు 9,700 వలయాలు—వలయం నాలుగడులకు సమానం. పత్తిని శుభ్రంచేయడంలోనూ, ఏకడంలోనూ 2½ తులాలు పోయింది. వడకడంలో ఇంకో అరతులం పోయింది. ఇలా వృథా అయినది నిలవచేశాను. దీనిని దిండ్లలో నింపడం మొదలయిన పనులకుపయోగించవలెనని నా ఆలోచన. వడికేవార నేకమంది తాము వడకడానికి తెచ్చుకొన్న పత్తి శుయిన వడికి నందుకు ఇచ్చే మజూరీకి సరిపోయినంత పత్తి ఒకప్పుడు పారుపోతూండడం నే నెరుగుదును. నేను తీరిక కాలంలో మాత్రమే వడుకుతూంటానని మీరు జ్ఞాపకం ఉంచుకోవాలి. నా ఉపయోగంకొఱకు కావలసినదాని కంటె చాలా ఎక్కువగానే నేను వడకగలుగుతాను. మిగులు ఖాదీని అమ్మి ఆ సొమ్ముతో నాచేత నడుపబడుతూన్న హరిజన పాఠశాల ఖర్చుల కింద వినియోగించవలెనని నేననుకొన్నాను. నా నూలు మంచి పురి గలిగి బాగా ఉంటుందనుకోవడంచేత నేతవారు తక్కిన నూలుకంటె నా నూలునే ఎక్కువ కోరుతూంటారు.”

ఈ వడికేవారిని నేనెఱుగుదును. తన శ్రద్ధవల్లనూ, ఆచరణవల్లనూ ఈయన ఇంతవాడైనాడు. ఈయన మామూలుగా వడికే మనిషికంటె ఎక్కువ సమర్థుడుగా ఉండేవాడుకాడు. కాని ఈనాడు ఈ హరిజన సేవకుడు

ప్రదర్శించగలుగుతూన్న ప్రావీణ్యం, స్వచ్ఛందంగా నూలు వడుకుతూన్న యే యితర మనిషీ చూపించగలగడం లేదు. ఉత్కళ గ్రామాలలో తిరుగుతూ, అక్కడి ప్రజలతో అత్యంత సన్నిహిత సంబంధం కల్పించుకొని ప్రసంగిస్తూ, నూలు వడుకుటలో గల ఖాళీ అవకాశాలను ప్రతిదినమూ నేను ప్రత్యక్షంగా చూస్తున్నాను. ఆ పేదజనంలో పాకిన అలసత్వం అత్యంత విషాదకరం. పందలకొలదీ తఱచు వేల కొలదీకూడా రోజురోజంతా ఏ పనీ లేకుండా నా చుట్టూ మూగుతూండడం నేను చూస్తూనే ఉన్నాను. నా చుట్టూ మూగేవారు ఏ రూపంలోనూ, ఏ పద్ధతిలోనూ కలవారు కారు. వారి ఆహారం ఎందుకూ పనికిరానిది. వారికి నెయ్యికానీ, పాలుగానీ దొరకవు. వారి ఆహారం వట్టి అన్నం, పప్పు, నూనె. ఆ ప్రజలు ఆశ కానీ, గొప్ప ఆకాంక్షగానీ లేనట్లు కనిపించారు నాకు. అయితే వారు తమ జీవితాలలో స్తుతిపాత్రమయిన సంస్కారాన్ని మాత్రం వెల్లడిస్తున్నారు. అది మీరు గమనించక తప్పదు. కాని, తమకు తీరికగా ఉండే ప్రతి గంట కాలాన్నీ లాభదాయకంగా ఉపయోగించుకొనే నేర్పుకోసం వారు శిక్షణ పొందనియెడల వారికా సంస్కారమువలన ప్రస్తుతం ఏమీ ప్రయోజనం లేదు. ప్రజాసామాన్యం తీరిక సమయాలలో ఉపయోగించుకొనేటందుకు, వారి ఆమోదంకోసం, వారికి నేను సమర్పించగలిగినది రాట్నం కాక మఱి ఒకటి యేదీ లేదనే నిర్ణయానికి నేనిక రాక తప్పదు. లక్షలాది ప్రజలకు వృత్తి కల్పించే ఉద్దేశంగల యే పరిశ్రమయైనను నిజంగా గిట్టుబాటు యున్నదే అవుతుంది.

—హరిజన్, 8-6-1934

# 136

# ఖాదీ — ఒక సమగ్రనూతన వివరణము

[ఆంధ్ర దేశంలో ఖాదీ అభివృద్ధికి సంబంధించిన భవిష్యద్విధాన ములను గూర్చి చర్చించేనిమిత్తం కొంతకాలం కిందట డాక్టరు పట్టాభి సీతారామయ్య, శ్రీ సీతారామ శాస్త్రి, శ్రీ నారాయణ రాజులతో కూడిన సుప్రసిద్ధ ఖాదీ కార్యకర్తల రాయబారవర్గమొకటి ఆంధ్రదేశమునుండి వచ్చి గాంధీజీని దర్శించారు. ఖాదీ నిర్మాణముయొక్క ఆర్థిక విజ్ఞాన విషయములనుగూర్చి, ప్రస్తుత దశలో ఖాదీ సంస్థలయందు ప్రజాస్వామ్య సిద్ధాంతమును ప్రవేశపెట్టడమునుగూర్చి, ఖాదీ ఉత్పత్తినుండి వాణిజ్య తత్వాన్ని తొలగించడమునుగూర్చి మొదలయిన అనేక సంగతులను పురస్కరించుకొని విపులంగా జరిగింది వారి సంభాషణ. ఆ చర్చింపబడిన కొన్ని విషయములపై గాంధీజీ ఈ దిగువ అభిప్రాయాలను వెల్లడించారు. ప్యా.]

## ప్రజాస్వామ్యానికి స్థానం లేదు

ఒక విధంగా, ఖద్దరు కేవలం ఆర్థిక సమస్య. ఖద్దరు సంస్థ అన్నిటికంటెను ముందు వ్యాపారసంస్థగా ఉండాలి. కాబట్టి ప్రజాస్వామ్య సిద్ధాంతం దానికి వర్తింపచాలదు. ప్రజాస్వామ్యం అంటే సహజంగా ఇష్టమును, అభిప్రాయ ములను గూర్చిన పోరాటం. ఒకప్పుడీ విభిన్నాభిప్రాయ ముల మధ్య జగిగే పోరాటం నిర్దయాత్మకంగాకూడా పరిణ మిస్తుంది. వ్యాపార సంస్థలలో అటువంటి పోరాటానికి స్థానం ఉండజాలదు. వ్యాపారసంస్థలో వర్గాలు, ముఠాలు వంటివి ఉంటే ఏమవుతుందో ఊహించండి. వాటి బరువు కింద అది తుత్తునియలైపోతుంది. కాని ఖాదీ సంస్థ వ్యాపార సంస్థకంటె కూడా ఎక్కువది. ప్రజానీకానికి సేవచేసే టందుకుద్దేశింపబడిన ధర్మసంస్థ అది. అటువంటి సంస్థ ప్రజల చిత్తం వచ్చినట్లు పరిపాలింపబడడానికి వీలు లేదు. వ్యక్తిగతములైన పెద్దపెద్ద కోరికలకక్కడ ఆస్కారం లేదు.

## పూర్తిగా వ్యతిరేకం

ఖాదీ ఉత్పత్తిని పునర్నిర్మాణం చేసే సందర్భంలో, ఖాదీ విజ్ఞానం కొన్ని విషయాలలో మామూలు వ్యాపారానికి పూర్తిగా వ్యతిరేకంగా ఉంటుందనే సంగతి మీరు మరచిపోకూడదు. ఆడం స్మిత్తు వ్రాసిన 'వెల్తు ఆఫ్ నేషన్స్' అనే గ్రంథంలో ఆర్థిక వ్యవహారములు ప్రత్యక్షంగా నిర్వహింపబడుతూన్న కొన్ని సిద్ధాంతాలను ఉదాహరించిన పిమ్మట ఆ ఆర్థిక సూత్రాల స్వేచ్ఛా గమనమును నిరోధించి 'చీకాకు'కు కారణభూతములైన మరికొన్ని విషయాలను కూడా ఆయన వివరించివున్న సంగతి మీకు తెలుసును. వాటిలో ముఖ్యమైనది 'మానవ తత్వం'. ఇప్పుడీ మానవ తత్వంపైననే ఖాదీ అర్థ శాస్త్రం యావత్తు నిలచివున్నది. ఆడంస్మిత్తు చెప్పిన కేవల ఆర్థిక ప్రేరేపణ, మానవ స్వార్థం. అది 'చికాకు కలిగించే విషయం' అవుతుంది. దానినే జయించవలసి ఉంది. కాబట్టి మిల్లు బట్ట ఉత్పత్తికి వర్తించే విషయం ఖాదీకి వర్తించదు. నాసిరకం తయారు చేయడం, కల్తీ, మనుష్యుల నీచాభిరుచులను రేకెత్తించడం ఇవన్నీ వాణిజ్యంకోసం జరుగుతూన్న ఉత్పత్తిలో చలామణీ అవుతూన్న ముఖ్యాంశాలు. వాటికి ఖాదీలో స్థానం లేదు. అత్యధిక లాభము, అత్యల్ప వేతనము అనే సిద్ధాంతానికి కూడా ఖాదీలో ఏమీ స్థానం లేదు. పైగా కేవల లాభమనేది ఖాదీలో లేనే లేదు. నష్టం ఉండకూడదు. నష్టం ఉన్నది. కార్యకర్తలమైన మనం ఇంకా అసమర్థులంగానూ అనుభవం లేనివాళ్లంగానూ ఉండడమే అందుకు కారణం. ఖాదీలో వచ్చిన ఖరీదులు ముఖ్యోత్పత్తిదారులైన నూలు వడికే వారికి పోతవి. ఇతరులకు వారి కూలి కంటె ఎక్కువ రాదు.

ఇక ప్రమాణ నిర్ణయం విషయం ఆలోచించండి. దానిని మీరు ఖాదీలో అమలుపరచలేరు. మామూలుగా నూలువడికే నిరుపేదరాలు ఎల్లప్పుడూ ఒకేతీరు దారాన్ని వడక లేదని రాజగోపాలాచారి ఒకసారి అన్నాడు. ఆమె యంత్రం కాదు. ఈనాడామెకు జబ్బుగా ఉండవచ్చును. రేపామె బిడ్డకు జబ్బుచేసినందున ఆమె పరధ్యానంగా ఉండవచ్చును. నూలు వడికే ఆ పేదరాలి యెడలగానీ, ఆమె బిడ్డయెడల గానీ మీకు ప్రేమ ఉంటే, ఎప్పుడూ ఒకేరకపు సున్నని మృదువైన దారం తెమ్మని ఆమెను వత్తిడిచేయకండి. ఆ క్షణంలో ఆమె ఉన్న పరిస్థితినిబట్టి ఆమె శక్తివంచనలేకుండా ఇస్తూన్నంతవరకూ, ఆమె ఈయగలిగిన దానితో సంతృప్తి పడండి. ఆమె పవిత్ర హస్తస్పర్శ, ఖాదీకి ప్రాణాన్ని, చరిత్రనూ ప్రసాదిస్తుంది. యంత్రం పైన ఉత్పత్తి అయిన నూలుకాశక్తి యెప్పుడూ కలుగదు. యంత్రంలో ఉత్పత్తి అయిన వస్త్రమునందలి కళానైపుణ్యం కంటికి మాత్రమే యింపుగా ఉంటుంది. ఖాదీలోని శిల్ప కౌశల్యం ముందు హృదయాన్నీ, తరువాత కంటినీ ఆకర్షిస్తుంది. కాబట్టి ఖాదీని చలవచేయడం నేను నిరుత్సాహపరుస్తాను. అందువల్ల ఉత్పత్తి ఖరీదెక్కువవుతుంది; మనుగడ తగ్గిపోతుంది; మోసం గ్రహించడం ఇంకా ఎక్కువ కష్టమవుతుంది; ప్రజా సామాన్యముయొక్క మోహప్రవృత్తిని మనం పెంపొందించ కూడదు. నూతన అభిరుచిని కల్గించేటందుకు ప్రయత్నించాలి. ఖాదీకి స్వచ్ఛమైన తెలుపును తెచ్చేటందుకు

మామూలుగా కొన్ని ఉతుకులు ఉతికితేచాలు. అందువల్ల ఖాదీకి ఒకవిధమైన మృదుత్వంకూడా వస్తుంది. చలువ చేయడంవలన ఆ మృదుత్వం పోతుంది. అవసరమైన అన్ని ఖర్చులు తగ్గించుకోవడానికి ప్రతివారు శక్తివంచన లేకుండా తమ కర్తవ్యమును నిర్వహించేటట్లు చేయాలి.

నూలువడికే మనిషిలో మార్పుకలిగించడం

కాబట్టి ఖాదీని వాణిజ్యవస్తువుగాగాక, అర్థోపవాసములు చేస్తూన్న లక్షలాది ప్రజల పోషణకవసరమైనదానిగా మనం భావిస్తూన్నయెడల, నూలువడికే మనిషియింట్లోకిపోయి, ఆమె వడికిన నూలుతో తయారైన ఖాదీని ఆమె ధరించేటట్లు ప్రోత్సహించాలి. ఇందువల్ల ఖాదీ ఉత్పత్తికయ్యే ఖర్చు తగ్గిపోవడమేగాక పంపిణీకూడా దానంతటది జరిగిపోతుంది. ఇంత వరకూ మనం కేవలం నగరవాసులకోసం ఖాదీని ఉత్పత్తిచేయ ప్రయత్నించాము. అత్యంత స్వల్పంగా ప్రారంభమయిన ఖాదీ ఉత్పత్తి సంవత్సరానికి కొన్ని లక్షలకు పెరిగింది. అందులో అనేక రకాలు తయారుచేశాము. కాని అంత మాత్రంతో యిప్పుడు నాకు సంతృప్తి కలగడంలేదు. ఇంత కంటె మహత్తరమైన ఉదాశయంతో అనగా మన గ్రామాల క్షామమున కప్రవేశ్యములుగా నుండవలెనని ఖాదీ ఉద్యమం భావింపబడినది. గ్రామస్థులు తమ ఖాదీని తాము ధరిస్తూ మిగిలిన దానిని నగరాలకు పంపుతూంటేనే కాని యిది సాధ్యంకాదు. ఉత్పత్తి అయినచోటనే అమ్మకమయ్యే వీలుండడమున్నూ, ఉత్పత్తిచేసిన వారే దానిని ఉపయోగించడమున్నూ, మాత్రమే ఖాదీలోని పవిత్రకరహస్యం.

## పరిపాలనా ఖర్చులు వగైరాలు

మన పరిపాలనా ఖర్చులు మొదలయినవి ప్రస్తుతం నాకు చాలా ఎక్కువగా తోస్తున్నవి. కేంద్ర ఖాదీ ప్రచార సంఘంపైన మన దృష్టిని కేంద్రీకరించినట్లయితే ఆ ఖర్చులు చాలావరకు తగ్గిపోగలవు. ఖాదీ ఖర్చుల తగ్గింపును గూర్చిన నియమావళికీ లాభప్రధానంగా ఉత్పత్తి చేయబడిన కేవల వాణిజ్యవస్తువుల ఖర్చుల తగ్గింపు నియమావళికీ పూర్తిగా కాక పోయినా కొంతరకైనా భేదముంది. ఖాదీలో పరికరాల అభివృద్ధికొక పరిమితి ఉన్నది. కాని మానవుని నిజాయితీని తెలివితేటలను అభివృద్ధిచేసేటందుకు పరిమితి లేదు. ఈ రెండింటినిగూర్చీ మనం నిస్పృహ చెందేయెడల ఖాదీనిగూర్చి మనం నిస్పృహ చెందాలి. కాబట్టి, ఖాదీ సంస్థ మృదువుగా నడవడానికి భంగంలేని పద్ధతిని, మధ్య దేరగాళ్లను తొలగించి ఖర్చులు తగ్గిస్తాము. ఖాదీ స్వయంపోషకంగానూ స్వయం ప్రవర్తకంగానూ ఉండేయెడల దానికి ప్రత్యేక సంస్థయే అనవసరం కాగలదు.

ఖాదీ శాస్త్రం ఇంకా బాల్యదశలోనే ఉన్నది. అది అభివృద్ధి అవుతూన్న శాస్త్రం. అందులో నేను కను గొంటూన్న ప్రతి నూతన విషయంవల్లనూ ఎక్కువ వివరంగా ఆ శాస్త్రం నాకెంత తక్కువ తెలుసునో, అర్థమవు తూన్నది. ఎన్నడూ ఉపయోగింపబడక నిలవఉన్న అంతు లేని మానవశక్తి అనే ఐశ్వర్యం ఇండియాలోవలె బహుశా ఒక్క చైనాలో తప్ప ప్రపంచంలో యే యితర దేశంలోనూ లేదు. నిలవవున్న ఈ ఐశ్వర్యాన్ని మీరు ఉపయోగించి నట్లయితే, ఈ దేశమునుండి తక్షణం దరిద్రమును తరిమి వేయగలరు. దీనిని నిర్వహింపగలిగినది నూలు వడికే పని

ఒకటి—కే. ఇంతవరకు మనం ఖాదీని గూర్చి చేసిన పని అంతా అవసరమే. ఆ పని చేయకుండా ప్రస్తుత స్థితికి మనం చేరుకోగలిగి ఉండే వారమే కాదు. ఇంతా అయితే అసలు సమస్యయొక్క అంచును మాత్రమే మనం స్పర్శించాము. ఇప్పుడు మనం ఇంకొక అడుగు వేయాలి. కాబట్టి ఆంధ్రా ఖాదీకి స్వాతంత్ర్యం కావలసినయెడల, మీకడిగినంత మాత్రంతో ఏమీ కష్టం లేకుండా, మీ కర్తవ్యములను నిర్వహించేటందుకు మీరు దానిని పొందగలరు. నేను సూచించిన పద్ధతులపైన పని చేయడానికి నాకేమీ అభ్యంతరం ఉండదు.

—హరిజన్, 21-9-1934



# 137

# యథార్థావశ్యకత

ఖాదీనిగూర్చి శ్లాఘిస్తూన్న విజ్ఞాపనగల ఒక పత్రికలోని కత్తిరింపును ఒకానొక విశేషకుడు నాకు పంపినాడు ; దాని నుండి అవసరమయిన ఈ క్రింది అంశములు గ్రహిస్తున్నాను:

"విదేశీ బట్టపైన వెచ్చింపబడిన రూపాయి అనగా, ఒకటిన్నర అణాలు భారతీయులకు, పదునాలుగున్నర నేరుగా విదేశీ వాణిజ్యాభివృద్ధికి పోతుందని అర్థం. మిల్లు బట్టపైన వెచ్చింపబడిన రూపాయి అనగా సగం మొత్తం మిల్లు యజమానికి, ఆరణాలు ఉత్పత్తి పరికరాలకు, రెండణాలు విదేశీయుల జేబులలోకి పోతుందని అర్థం.

ఖాదీ మీద వెచ్చించిన రూపాయి అనగా, యావత్తు మొత్తము కార్య నిర్వాహక ఖర్చులు మినహా—ఒక అణా—ఉత్పత్తిదారుకే పోతుందని అర్థం"

ఖాదీ పెట్టుబడిలో ప్రతిరూపాయికి పదిహేనణాలు ఉత్పత్తిదారులకు, ఒక అణా మాత్రమే అమ్మేవానికి పోతుందనే మాట నిజమేనా అని, వార్తా పత్రిక కత్తిరింపును పంపిన వారు గన్నడుగుతున్నారు. ఉత్పత్తి కేంద్రమునుండి వచ్చిన ప్రతి పదిహేనణాల ఖాదీకి ఒకణా ఖర్చుల కింద మిగిలేటట్లుగా మొత్తం అమ్మకములను యేర్పాటుచేయవలెనని, అఖిలభారత చరఖా సంఘ స్టోర్సు మానేజరులకు ఒక ఆదర్శం ప్రతిపాదింపబడినది. కాబట్టి ఆ పదిహేనణాలలో రవాణా ఖర్చులు వగైరాలనేకం యిమిడిఉన్నవి. కాబట్టి పెట్టుబడి పెట్టిన ప్రతి రూపాయలోనూ పదిహేనణాలు ఉత్పత్తిదారుకు పోతుందనే మాట పూర్తిగా పొరపాటు.

నేతవాని చేతుల్లోనుండి విడుదలయిన తరువాత ఖాదీలో అనేక కార్యక్రమములు కలవు.—ఉతక వేయడం, రంగు వేయడం, జాబితా తయారుచేయడం, మధ్యదుకాణాలలో నిలవ చేయడం, మొదలయినవి, 'ఉత్పత్తిదారు' అనేమాట, పత్తి పండించిన మనిషి, ఏరిన మనిషి, పత్తిగింజలు తీసిన మనిషి, ఏకిన మనిషి, ఏకులు చేసిన మనిషి, వడికిన మనిషి, చిలపలు చుట్టిన మనిషి, పడుగుచేసిన మనిషి, సరిచేసిన మనిషి, నేత మనిషి —ఈ అందరికీ వర్తింప చేయబడి, నేసినపిమ్మట కార్యక్రమాలను నిర్వర్తించే పనివాళ్లకు వర్తింపచేయబడనియెడల ఉత్పత్తిదారు బహుశా రూపాయిలో ఎనిమిది అణాల కంటె ఎక్కువ పొందడు. తక్కిన కార్యక్రమాలు ఖాదీ ఉద్దేశాన్ని నేరవేర్చడానికి అవసరం లేనివి గనుకనూ, అవి గ్రామస్థులచేగాని, న్యాయంగా పనివాళ్లని పిలవబడేవారి వలనగాని నిర్వహింపబడనూవచ్చు నిర్వహింపబడక పోనూ వచ్చు గనుకనూ, వాటిని సాధారణంగా మినహాయించడం సముచితం. చలవచేయడం, రంగులు వేయడం మొదలైనవి తరచు సువ్యవస్థాపితములైన పెట్టుబడిదారీ సంస్థలద్వారా జరుగుతూంటవి. కాబట్టి, ఖాదీయొక్క అమ్మకపు ఖరీదు పెరగడానికి తోడ్పడ్డ వారందరు, మజూరీలను ఉత్పత్తిదారుతో కలిసి పంచుకోవడం లేదు. అనగా ఉత్పత్తిదారు నోటిదగ్గర అన్నం తీసివేయడం లేదు సరికదా పై పెచ్చు అతని వస్తువులు విడుదలకావడానికి తోడ్పడుతున్నారు. పెట్టుబడిదారీ సంస్థలకు చెందినకూడా వారలాచేస్తున్నారు. ఈ రెండవవర్గంవారు ప్రస్తుతం తమ లాభంకోసంగాక, ఏ ఉద్దేశంతో నైనప్పటికీ, ఉత్పత్తిదారు క్షేమంకోసం పని చేస్తున్నారు. కాబట్టి, ఇప్పుడు మనచర్యకు మూలమై, అబుద్ధిపూర్వకంగానో అజ్ఞానంవల్లనో అయినప్పటికీ, నిస్సం

దేహంగా అతిశయోక్తితో నిండిన ఆ విజ్ఞాపనముకంటె ఈ నిజం యేమైనప్పటికీ ఖాదీ ప్రకటనకు ఎక్కువగా తోడ్పడుతుందని నా అభిప్రాయం. ఆ విజ్ఞాపనమునకు ముసాయిదా వ్రాసింది నేనే అయితే అది యిలావుండేది.

"మీరొక రూపాయి ఖరీదు ఖాదీ కొనేయెడల, ఉత్పత్తిదారు తన కష్టముయొక్క ఫలితాన్ని పూర్తిగా నిలుపుకొంటాడు. దేశీయ మిల్లులు ఉత్పత్తిచేసిన బట్టనే మీరు కొనేపక్షంలో అతనికి మరొకవృత్తి కూడా చూపించకుండానే లాభప్రదమైన అతని శ్రమ అతనికి యేమీ దక్కకుండా చేస్తున్నారు. ఖాదీ అమ్మేసంస్థ, కేవలం మనుగడకు కావలసిన ఖర్చులు తప్ప యేమీ పొందడంలేదు. కాబట్టి అది కూడా ఉత్పత్తిదారులతో సమాన ప్రతిపత్తిలోనే ఉన్నది."

కనుక భారతీయులైనవారు ఖాదీ తప్ప మరియే యితర బట్ట వాడినప్పటికీ అర్థోపవాసములతో అల్లాడుతూన్న ప్రజానీకమునెడల అపరాధం కావించడమవుతుందని, ఖాదీ అర్థశాస్త్రి సవిమర్శక పరిశీలనంవలన తెలియగలదు. అటువంటి మనిషి, అదివరకే బక్కచిక్కిఉన్న గ్రామస్థుని నోటిముందు మెతుకు తీసివేస్తున్నాడు. తనలో సహజంగా ఉన్న లోపంవలన ఖాదీనష్టపడడంలేదు. దాని స్నేహితులయొక్కయు విరోధులయొక్కయు అజ్ఞానంవలననే అది నష్టపడుతూన్నది.

అయితే కొనేవాని సంగతికూడా పరీక్షించడం అవసరం. ఆ ప్రకటన తప్పు అర్థమును స్ఫురింపచేస్తూన్నదని ఆయన అభిప్రాయం. ఆయన తన అభిరుచిని మార్చుకొన్నట్లయితే ఇప్పుడమ్మే ఖరీదులో సగం ఖరీదుకే ఖాదీ అమ్మవచ్చును. అనగా ఆయన చలవచేయని బట్టనుకొని తనకు కావలసిన అలంకరణం యేమైనా తరువాత చేయించుకోవాలి. ఖరీదు ఆయనకు లెక్క లేకపోయినట్లయితే దానినిగూర్చి అంతగా

ఆయన ఆలోచించనక్కరయే లేదు. కాని ఖరీదును లెక్క చేయవలసిన క్రేత (buyer) చలవచేయబడనట్టిన్నీ, అలంకృతం కానట్టిన్నీ బట్ట, చలవచేయబడి తయారుగా ఉన్న బట్ట కంటె తక్కువ ఖరీదుకు లభిస్తుందనే విషయం తెలుసుకోవలసిఉంది. అంతేకాక చలవచేయబడిన బట్టకంటె కోరా ఖాదీ ఎక్కువ కాలం నిలుస్తుంది. కడచిన పంద్రెండేండ్లలోనూ ఖాదీ ఎక్కువ చౌకయై, ఎక్కువ బాగుంటూన్న సంగతి ప్రజలు తెలుసుకోవాలి. వడికే వ్యక్తుల పరికరములను, నైపుణ్యమును అభివృద్ధి కావించి వారికి ఎక్కువ సొమ్ము ముట్టేటట్లుగా కూడా చేసిందది. పూర్తి పని లేక, అరోధప వాసములతో అల్లాడుతూన్న లక్షలాది ప్రజలకు సహాయం చేసే కార్యములలో అనేకమంది విద్యావంతులైన మగవారు ఆడవారు తమ జీవితములను అంకితం చేసుకోకపోయి ఉన్నట్లయితే ఇది సాధ్యమై ఉండగలిగేదికాదు. కులమును గూర్చిన వక్రాభిప్రాయం, ఈ లక్షలాది ప్రజానీకాన్ని, ఉన్నత వర్గాల వారమని అనుకొనే వారు తమ దృష్టిలో కొఅగాని వారుగానూ, దాదాపు అస్పృశ్యులుగానూ పరిగణించక పోయిఉన్నట్లయితే, వ్యవసాయ వృత్తికి తోడుగా నున్న భారత దేశపు ఈ ఒక్క కీలక పరిశ్రమ ఎన్నటికీ పురూమాసి ఉండేదికాదు.

ఖాదీ సంస్థలలో లోపాలు ఉన్న మాట వాస్తవమే; సంపూర్ణ త్యాగం లేదు; పరిష్కారం కావలసిన ప్రతి సమస్యను గూర్చి తగినంత సవిమర్శకమైన పరిశీలన జరగడం లేదు. కాని ఇది ఆశ్చర్యపడపలసిన విషయం కాదు. జీవితం పొడుగునా వస్త్రాన్న అలవాట్లను ఒక్క క్షణంలో తప్పించుకోలేము. మనం ఆకస్మికంగా హస్త నైపుణ్యమును కూడా అలవరచుకోలేము. ఖాదీ శాస్త్రమునకు, ఉన్నత స్థాయికి

చెందిన శిల్ప జ్ఞానము యాంత్రిక నైపుణ్యమూ కావాలి. మన సహచర ప్రాణులయిన చిన్న చిన్న మొక్కలయొక్క సూక్ష్మ పత్రములలోని ప్రకృతి రహస్యములను గ్రహించే టందుకు తన పరిశోధనాలయంలో సర్ జగదీశ చంద్రబోసు చూపవలసివచ్చినంత ఏకాగ్రత ఖాదీ సందర్భంలో చూపవలసి ఉన్నది.

ఆ విజ్ఞాపనలోనున్న లోపం ఖాదీనిగూర్చి ఎక్కువగా చెప్పడంకాదు; అసమర్థంగానూ అసమగ్రంగానూ చెప్పడం. సత్యాన్ని సమగ్రంగా గ్రహించలేక పోవడం వలన ఉన్నదున్నట్లుగా చెప్పలేకపోవడం తటస్థిస్తుంది. నిర్దుష్టమైన ఆ ఒఱిపిడి రాయిమీద ఒఱసి చూచినప్పుడు పైన ఉదాహరింపబడిన మూడు పేరాలలోనూ ప్రతి ఒక్కటీ కూడా బొత్తిగా పరీక్షకు నిలవలేదు.

—హరిజన్, 5-10-1934

# 138

# హరిజన క్షేమం కోసం

ఒకానొక విలేఖకుడిలా అడుగుతున్నాడు ?

“సూత్రయజ్ఞం చేయమనీ (sacrificial spinning), స్వయంగా వడుకుకోమనీ మీరెందుకింత పట్టుదలగా చెపుతూంటారు? సూత్రయజ్ఞం, వడికినది ఉచితంగా యిచ్చివేయడానికి. స్వయంగా వడుకుకోవడం స్వోపయోగంకోసం, మీరు వడికిన నూలును ఖద్దరులోకి తయారుచేసుకోవడానికి. ఈ రెండు సందర్భాలలోనూకూడా, మిక్కిలి తక్కువ సంపాదిస్తూన్న పనిమనిషి అని మీరు చెప్పే నూలు వడుకు పేదరాలి నోటిముందటిది కొంత తీసివేయడమేగదా! సూత్ర యజ్ఞములో ఖాదీ ఖరీదును తగ్గించేటందుకు సహాయపడడంద్వారా మీరు కొద్దిగా పేదలకుపకారం చేస్తూన్నారు. రెండవ సందర్భంలో వడికే పేదరాలి నోటిముందు అన్నాన్ని కేవలం లాగివేయడమే అవుతుంది.”

నూలు వడకడం సార్వజనీనముగా పరిణమించి ఉన్నట్లయితే ఇందులో కొంతగాని, అంతాగానీ నిజమవుతుంది. కాని ఈనాడు కూలి సంపాదించుకొనే శక్తి నూటికి 5 పాళ్ల వరకూ పడిపోయిన హరిజనులున్నారు. వారు నేత నేసేవారు. వారికి నేసేటందుకు వడుకు నూలు లేదు. వారిప్పు డేదో విధంగా సందిగ్ధ స్థితిలో పొట్టపోసికొని బ్రతికేటందుకు ప్రయత్నిస్తున్నారు. ఏమైనా పెద్ద ఎత్తున దేశంలో సూత్ర యజ్ఞం సాగుతూండిటయితే ఈ నేతపనివారీ విషాద పరిస్థితికి దిగిపోయి ఉండేవారు కారు. ఒరిస్సాలో నేతపనికి చెందిన వారు సుమారు పదివేలమంది దాదాపు (వర్గీకరణం చేయబడనందున) హరిజనులు పని లేక పస్తులు పడుకొంటున్నారని ఈ పత్రికలో ఇదివరకే వ్రాశాను. దీనికర్థం వడుకు నూలుకు కఱవువచ్చిందని అయితే వారు మిల్లు నూలే నేయవచ్చును గదా అని చెప్పవచ్చును. అది నిష్ప్రయోజనం. ఈ పద్ధ

వేలమంది పూర్వం ఆ పని చేస్తూనే ఉన్నారు. కాని *స్పర్థ పోటీవలన మిల్లు నూలుతో నేయబడిన చేనేత బట్టకు గిరాకీ చాలా తగ్గిపోయింది. ఖాదీ నేసేవారికి స్థానికంగా తమ ఖాదీ విడుదలచేసుకోవడానికి సావకాశం ఉంది. కాని మిల్లు నూలుతో తయారైన చేనేత బట్టకు మాత్రం ఆ సావకాశంలేదు. కావలసినంత వడుకు నూలు నిలవ ఉండిపోయిన కాలం ఉంది. అప్పుడు వేలకొలదీ కాకపోయినా వందలకొలదీ అయినా త్యాగంగా నూలు వడికే వారున్నారు. అనాడు నేసేవారి సంఖ్య చాలా తక్కువ. ఇప్పుడు త్యాగంగా వడికే ఆచారం పోయింది. వడుకు నూలును సంతోషంగా నేసే వారిప్పుడు నిజానికి కుప్పలుతెప్పలుగా ఉన్నారు. కాబట్టి బజారులో ఖాదీకి గిరాకీ ఉన్నంతవరకు, ఆ గిరాకీకి తగినట్లు సరఫరా చేయడానికి వడుకు పని సర్వసాధారణమయ్యేటంతవరకూ, చాలా కాలందాకా, జాతీయ ఆర్థిక విధానంలో త్యాగంగా చేసే వడుకు పనికీ స్వయంగా చేసుకొనే వడుకు పనికీ కూడా స్పష్టమైన స్థానమున్నది. ఇది పేదవారికి అందులో ముఖ్యంగా హరిజనులకు నియమితమైనట్టీ, అకృత్రిమమైనట్టీ ఉపకారం అవుతుంది.

పైగా ఆ నూలు వడికే పని వివేకవంతులు విద్యావంతులు అయిన స్త్రీ పురుషులు చేయవలసి ఉండడంచేత కళానైపుణ్యంతో కూడినదై అభివృద్ధికి ఎక్కువగా అవకాశం ఉంటుంది. రాటంలోనూ దానితోడి పనిముట్లు అయిన పత్తి రాటం, కమానులలోనూ జరిగిన అద్భుతమయిన అభివృద్ధులకు, విద్యావంతులైన మధ్య తరగతుల స్త్రీ పురుషులు ఉద్యమంలో చూపిన ఉత్సాహమే కారణం. అ.ఖా.చ.సం. కార్యదర్శి ఒక యం.ఏ., అనీ బొంబాయిలో పేరు పొంది జయప్రదంగా పనిచేస్తూన్న ఒక బ్యాంకరు కుమారుడనీ

దాని అధ్యక్షుడు, భారత దేశంలోని అత్యంత సమర్థులైన వ్యాపారస్థులలో ఒకరనీ, తమిళనాడు ఖాదీ సంస్థకు యాజమాన్యం వహిస్తూన్నవారుకూడా సుప్రసిద్ధుడైన మాజీ లాయరనీ, బెంగాలు ఖాదీ వ్యవస్థాపకులు సమర్థులైన వైద్యులు, రాసాయనిక శాస్త్రజ్ఞులు అనీ, ఉత్తర ప్రదేశ్ లో (యు పి.) జాతీయ కళాశాల మాజీ ప్రధానాచార్యులనీ హరిజన పాఠకులందరికీ తెలియకపోవచ్చును. ఖాదీ ద్వారా దరిద్రనారాయణను సేవించేటందుకు తమ జీవితాలను అంకితం చేసుకొన్న అనేక మంది పేర్లను ఇంకా నేనీయగలను. కాని ఇవి వాటిలో కొన్ని మాత్రమే. ఈ భక్తబృందమే లేకపోయినట్లయితే, ఖాదీలో ఇంత అభివృద్ధి జరగడం అసంభవమై ఉండేది. అంతేకాక రెండు లక్షల యాభైవేలమంది పనివాళ్ళకు, వడుకు నూలు ఉద్యమం నడుస్తూన్న సంవత్సరాలలో నిరోద్యగ విరామములుగాగాక, న్యాయమైన పనికి మజూరీగా పంచిపెట్టబడిన అరకోటి రూపాయలు పంచిపెట్టబడి ఉండేవికావు. ఈ పని యింత త్వరలో రాటం ద్వారాగాక యింకే యితర పద్ధతివలననూ జరగడానికి వీలయి ఉండేదికాదు. దేశంలో అత్యుత్కృష్ట సంస్కారమును పొందిన స్త్రీపురుషులతో అట్టడుగున నున్న ప్రజావీకమునకు సజీవ చైతన్యమును కల్పించింది రాటం ; చీకటి గుడిసెలలో ఆశాకిరణాన్ని ప్రసరింపచేసింది ; కుంగిపోతూన్న బడుగు దేహాలకు ప్రాణం పోసింది ; పాలు లేని వేలకొలది పసిబిడ్డలకు పాలుపోసింది ; కావలెనన్న గ్రామస్థులకు కఱువు భీమా కలిగేటట్లు చేసింది ; అలసత్వమును తగ్గించింది ; భిక్షాటన వృత్తినుండి వేలకొలదీ జనాన్ని రక్షించింది.

అయినప్పటికీ యింకా యీ పని ప్రారంభ దశలోనే ఉన్నది. పనిచేసేవాళ్లు చాలా తక్కువ మంది. ఉన్న వాళ్లకైనా ఇంకా ఎక్కువ భక్తి, ఎక్కువ ఏకాగ్రతా కావలసి ఉన్నది. ఈ జాతీయ ప్రజాహిత కార్యములో ఇంకా అనేక వందల మందిని ఇముడ్చుకోవచ్చును.

కాబట్టి త్యాగంగా నూలు వడకడంగానీ, స్వయంగా నూలు వడుకుకోవడంకానీ, వృత్తిగా నూలు వడుకుకొనే వారికి హానిచేస్తుందనడం తప్పు. భారత దేశపు బహిష్కృతులు—హరిజనుల క్షేమంకోసం, సావకాశమున్నవారు కనీసం ప్రతిరోజూ ఒక అరగంట వడికేటందుకు శ్రద్ధ తీసుకోవడం వారి ముఖ్య కర్తవ్యం.

—హరిజన్, 19-10-1934

# 139
# గ్రామ పరిశ్రమలు

గ్రామ పరిశ్రమలను గూర్చిన కాంగ్రెసు తీర్మానముయొక్క రచయితగా, వాటి అభ్యున్నతికోసం నిర్మింపబడుతూన్న సంఘానికి ఏకైక నాయకుడుగా ఈ పరిశ్రమలను గూర్చీ, వీటితో సన్నిహిత సంబంధంగల నైతికారోగ్య రక్షకాభివృద్ధులను గూర్చీ నా మనస్సులో పొంగి పొరలివస్తూన్న అభిప్రాయాలను సాధ్యమైనంతవరకు నేను ప్రజలకు వెల్లడించడం సమంజసం.

నా హరిజన యాత్రలో నేను మలబారు ప్రవేశించే నాటికే ఈ సంఘస్థాపనమును గూర్చిన అభిప్రాయమొక ప్రత్యేక రూపాన్ని పొందింది. ఒకానొక ఖాదీ ప్రచారకునితో యాదృచ్ఛికంగా సంభాషించినప్పుడు నగరవాసులచే క్రూరత్వంతో అనాలోచితంగా లాక్కొనబడినదానిని తిరిగి గ్రామస్థులకిచ్చి వేసేటందుకు శ్రద్ధగా ప్రయత్నించే ఒక సంస్థ ఉండడం అవసరమని తోచింది నాకు. గ్రామస్థులలో మరీ దెబ్బతిని పోయినవారు హరిజనులు. సాధారణంగా గ్రామస్థుల కేర్పడిన పరిశ్రమలలో వారెన్నుకోగలిగినవి చాలా తక్కువ. కాబట్టి వారి పరిశ్రమలు వారి చేతులలో నుండి జారిపోగానే బరువులు మోసే జంతువులవలె తయారై వారు వాటితో సమానంగా జీవితం గడుపవలసివచ్చింది.

అయితే ఈనాడు గ్రామస్థులు కూడా మొత్తంమీద అంత ఐశ్వర్యవంతులుగా లేరు. రాను రాను కొద్దికొద్దిగా భూమి దున్నుకొని పొట్టపోసుకొనే స్థితిలో మాత్రమే

ఉంటున్నారు వారు. ఇండియాలో మిట్ట పల్లాలతో కూడిన చిన్న చిన్న భూఖండాలలో వ్యవసాయం లాభదాయకంగా ఉండడం లేదనే సంగతి నేడు కొద్దిమందికి మాత్రమే తెలుసును. గ్రామస్థులు నిర్జీవంగా జీవిస్తున్నారు. వారి జీవితం క్షుధాపీడిత క్రమ పరిణామావస్థ. వారు ఋణ భారంతో కుంగిపోతున్నారు. షాహుకార్లంత కన్న చేసేది లేక వానికి అప్పు పెడుతున్నారు. అలా పెట్టకపోతే ఆయనకు అంతా పోతుంది. గ్రామస్థుల పెట్టుబడి విధానాన్ని గూర్చి విచారణ చేయడం దుర్ఘటం. మనమెంత దీర్ఘవిచారణలు చేసినప్పటికీ మనకా విషయంలో తెలిసింది చాలా తక్కువ. గ్రామ పరిశ్రమల నిర్మూలనము ఇండియాలోని ఏడు లక్షల గ్రామాల వినాశనమును పూర్తి చేస్తుంది. నేను సూచించిన ప్రతిపాదనలపైన విమర్శనములను నేను దిన పత్రికలలో చూచాను. మనుష్యుని ప్రతిభా విశేషమువలన లోబఱచు కొన్న ప్రకృతి శక్తులను వినియోగించుకొనే దృక్పథమునుండి చూచి మోక్షమును సాధించవలెనని నాకు సలహా ఈయ బడినది. నీరు, గాలి, పెట్రోలు, విద్యుత్తు—వీటిని ముందంజవేస్తూన్న పాశ్చాత్యులుపయోగించుకొంటూన్నట్లు గానే మనంకూడా ఉపయోగించుకోవలెనని విమర్శకు లంటు న్నారు. ప్రకృతిలో దాగియున్న ఈ శక్తులను స్వాధీనం చేసుకోవడం వలననే ప్రతి అమెరికన్ దేశీయుడు ముప్పయి మూడు మంది బానిసలను పెట్టుకోగలుగుతున్నాడని వారం టున్నారు.

అదే పద్ధతి ఇండియాలోకూడా అవలంబింపబడేయెడల ఈ దేశంలో నివసించే ప్రతివానికీ 33 మంది బానిసలు ఉండడానికి బదులు ప్రతివాడూ 33 రెట్లు బానిసగా తయారవుతాడని నేను ఘంటాపథంగా చెప్పగలను.

చేయవలసిన పనికి తగినంత మంది మనుష్యులు లేనప్పుడు యంత్రాల నుపయోగించడం మంచిదే. ఇండియాలోవలె చేయవలసిన పనికి కావలసిన దానికంటె ఎక్కువ మంది మనుష్యులున్నప్పుడు యంత్రాల నుపయోగించడం కీడు. కొన్ని చదరపు గజాల పొలమును తవ్వడానికి నేను నాగలి నుపయోగించక పోవచ్చును. మన గ్రామాలలో క్రిక్కిరిసి ఉన్న లక్షలాది ప్రజల కేవిధంగా విశ్రాంతి కలిగించవలెనా అని కాదు మన సమస్య. గ్రామస్థులకు పనిలేని సమయ మంతా కలిపి అంచనా వేస్తే సంవత్సరానికి ఆరు నెల లవుతుంది. ఆ కాలాన్ని ఎలా వినియోగించడమనేదే మన సమస్య. సాధారణంగా ప్రతి మిల్లూకూడా గ్రామస్థులకు భయదాయకము అని అంటే మీకు వింతగా తోచవచ్చును. నేనయితే యెప్పుడూ లెక్కలు కట్టలేదు కాని గ్రామాలలో కనీసం పది మంది కూలీలుచేసే పని మిల్లు కూలీ ఒక్కడు చేస్తున్నాడని నేను ధైర్యంగా చెప్పగలను. అనగా తన తోడి గ్రామస్థులు పది మంది పొట్టకొట్టి, ఆయన గ్రామంలో సంపాదించేదానికంటె ఎక్కువ సంపాదించుకొంటూన్నా డన్నమాట. కాబట్టి నూలు మిల్లులు, బట్టల మిల్లులు గ్రామస్థుల జీవనాధారాన్ని చాలావరకు పోగొట్టినవి. కాని ఆ మిల్లులు ఎక్కువ చౌకగా ఎక్కువ మంచి బట్టలను తయారు చేస్తున్నవని చెప్పడం, నిజంగా అలా చేస్తూ న్నప్పటికీ సరియైన ప్రత్యుత్తరం కాజాలదు. ఎందువల్ల నంటే వేలకొలదీ పనివాళ్ళ వృత్తులనవి పోగొట్టినప్పుడు కారు చౌకయిన మిల్లు బట్ట, గ్రామాలలో నేయబడి మిక్కిలి ప్రియ మైన ఖాదీ బట్టకంటెకూడా ఎక్కువ ప్రియమైనదవుతుంది. బొగ్గు గనిలో పని చేసేవాడు దానిని అక్కడే అప్పుడే ఉపయోగించుకొంటాడు. కనుక బొగ్గతనికి ప్రియం

కాదు. అలాగే గ్రామంలో సొంతంగా ఖాదీ తయారు చేసుకొనేవాడికి ఖాదీ ప్రియం కాదు. అయితే మిల్లులలో తయారయ్యే బట్ట గ్రామాలలో రెకరులమీద జీవించేవాళ్ల వృత్తిని పోగొట్టింది. కాని బియ్యపు మరలూ, పిండి మరలు అనేక వేలమంది నిరుపేదలైన ఆడ పనివాళ్ల వృత్తిని పోగొట్టడమేకాక ఆ వ్యాపారంలో ప్రజలందరి ఆరోగ్యాన్ని కూడా పాడుచేస్తూన్నవి. మాంసం తెచ్చుకోగలిగి తినడాని కభ్యంతరం లేనివారికి తెల్లని మర పిండి మర బియ్యం కీడు చేయకపోవచ్చును. మాంసం తినడాని కభ్యంతరం లేనివారికికూడా ఇండియాలో లక్షలాది ప్రజలకు మాంసాహారం లభ్యం కాదు. అటువంటి వాళ్లకు పుష్టికరమైన జీవాణువులుకల ముడి గోధుమ, ముడి బియ్యపు ఆహారము లేకుండాచేయడం పాపం. తెల్లని మర గోధుమ పిండి, మర బియ్యం వాడడంవలన కలిగే కీడునుగూర్చి వైద్యులు తదితరులూ కలిసి ప్రజలకు తెలియచెప్పవలసిన తరుణమిది.

గ్రామస్థులకు పని కల్పించే పద్ధతి యంత్రాలద్వారా కాదనీ ఇంతవరకూ వారలవాటుపడ్డ గ్రామ పరిశ్రమల పునరుద్ధరణం ద్వారానే అది జరుగవలెననీ నిరూపించేటందుకు స్పష్టంగా కనిపించే కొన్ని విషయాలను మీ దృష్టికి తీసుకొనివచ్చాను.

కాబట్టి ఇప్పుడమలులోనున్న పరిశ్రమలను ప్రోత్సహించడమున్నూ, చచ్చిపోయిగానీ, చచ్చిపోతూగానీ ఉన్న గ్రామ పరిశ్రమలను గ్రామీణుల పద్ధతి ప్రకారం, అనగా అనాదినుండీ వారి కుటీరాలలో ఉండి యేవిధంగా పని చేసుకొనే వారో ఆ పద్ధతి ప్రకారం, అవకాశమూ అవ

సరమూ ఉన్నంతవరకు పునరుద్ధరించడమున్నూ అఖిల భారత గ్రామ పరిశ్రమల సంఘంవారి కర్తవ్యంగా ఉండవలెనని నా అభిప్రాయం. చేతితో పత్తి విత్తులు తీయడం, చేతితో ఏకడం, చేతితో వడకడం, చేతితో నేయడం ఈ పనులలో తగిన అభివృద్ధి కలిగించినట్లుగానే తక్కిన ఈ చిన్న పద్ధతులలో కూడా అభివృద్ధి కలిగించవచ్చును.

అయితే పూర్వకాలపు ఈ పద్ధతి కేవలం వ్యక్తి ప్రయత్నానికి సంబంధించి ఉన్నదే కాని సమాజకృషికి సంబంధించ లేదని విమర్శకు లభ్యంతరం చెప్పుతూన్నారు. ఇది స్థూలదృష్టితో చూచినందువలన కలిగే అభిప్రాయమని నాకు తోస్తూన్నది. గ్రామస్థులు తమతమ కుటీరములలోనే ఆయా వస్తువులను తయారు చేసుకొన్నప్పటికీ వాటన్నిటినీ ఒకచోట చేర్చి ఆ లాభాలను పంచుకోవచ్చును. గ్రామస్థులోక విధానం ప్రకారం ఒక తనిఖీ క్రింద పని చేయవచ్చును. ముడి పదార్థాలు ఉమ్మడిగా తెప్పించుకోవచ్చును. సహకార ప్రయత్నానికి తగిన చిత్తవృత్తి కల్పింపబడినట్లయితే సమాజకృషికీ కార్య విభాగమునకు కాలపరిరక్షణకు, కార్య సామర్థ్యమునకూ నిజముగా కావలసినంత సావకాశముంది. ఈ పనులన్నీ ఈ రోజున అఖిల భారత చరఖా సంఘం వారిచే ఐదువేల గ్రామాలలో జరుగుతూన్నవి.

అయితే ఖాదీ, గ్రామ సూర్య కుటుంబంలో సూర్యుని వంటిది. వివిధ గ్రామ పరిశ్రమలూ గ్రహాలవంటివి. ఖాదీ సూర్యునినుండి అవి గ్రహించిన ఉష్ణమునకు జీవనమునకు బదులుగా అవి ఖాదీకి ఆధారములవుతూన్నవి. ఖాదీ లేక ఇతర పరిశ్రమలు అభివృద్ధి కాజాలవు. అయితే నా కడచిన యాత్రలో ఇతర పరిశ్రమలు పునరుద్ధరింపబడనియెడల ఖాదీ

యిక ముందుకు సాగదనే సంగతి గ్రహించాను. గ్రామస్థులు తమ విశ్రాంతి కాలాన్ని ప్రయోజనకరంగా వినియోగింపగలగవలెనంటే గ్రామ జీవితం సర్వతోముఖంగా పరామర్శింపబడవలెను. ఈ రెండు సంఘాలూ చేయవలసిన పని అదే.

రాజకీయాలతో కానీ రాజకీయ పక్షాలతో కానీ సహజంగా వాటి కేమీ పని ఉండదు. ఈ రెండు సంఘాలనూ స్వతంత్రంగానూ రాజకీయాలతో సంబంధం పూర్తిగా లేకుండానూ చేయడంలో కాంగ్రెసు బాగా ప్రవర్తించిందని నా అభిప్రాయం. గ్రామాల నైతిక ఆర్థిక ఆరోగ్యాభివృద్ధులకోసం అన్ని పక్షాలూ అన్ని సంఘాలూ ఐక్యం కావచ్చును.

ఖాదీ ఒక ఆర్థిక ప్రతిపాదన కానే కాదని అభిప్రాయపడేవారుకూడా ఉన్నారని నాకు తెలుసు గ్రామ కార్యకలాపాలకు ఖాదీ కేంద్రమని నేను పేర్కొన్నప్పుడు వారు కంగారుపడరని నే నాశిస్తున్నాను. ఖాదీకినీ తదితర గ్రామ పరిశ్రమలకునూగల పరస్పర సంబంధమును నిరూపించకుండా నా మనస్సులోని విషయాలను పూర్తిగా చిత్రించినవాడను కాజాలను. అది గ్రహించనివారు తదితర పరిశ్రమలపైననే తమ కృషిని కేంద్రీకరించవచ్చును. ఈ వ్యాసంలో నేను నిరూపించ ప్రయత్నించిన పూర్వోత్తర సందర్భాలను విచక్షణతో గ్రహించినయెడల ఈ నూతన సంస్థద్వారానే ఈ పనికూడా వారు చేయగలరు.

—హరిజన్, 16-11-1934

# 140

# గ్రామ కార్యకర్తలకు తక్లీ

గ్రామాలలో వస్త్రమును గూర్చిన స్వయంపోషక సందేశ మును అందించేటందుకు కృషి చేస్తూ భారతదేశపు వివిధ భాగములలోనున్న అనేక మంది కార్యకర్తలు, నూలు వడకు పరికరంగా తక్లీయొక్క ప్రయోజనములపై తమ దృష్టిని కేంద్రీకరించవలెనని ప్రార్థిస్తున్నాను. ఈ విషయ మింతకు పూర్వం ఈ పత్రికలో కొంత కాలం కింపట ఉదాహరింపబడినది. ఇది ఎక్కువ శ్రద్ధగా పరిశీలింపబడ తగిన విషయం. మామూలుగా నూలు వడకడం నేర్చిన మనిషి తక్లీని సరిగా ఉపయోగించినట్లయితే దాని ఉత్పత్తి శక్తి చర్ఖాయొక్క ఉత్పత్తి శక్తికి ప్రతి సందర్భంలోనూ సమంగా ఉంటుందని, వార్ధాలోని సత్యాగ్రహాశ్రమ వాసులున్నూ తదితర సోదర సంస్థలలోనివారున్నూ నిరూ పించి ఉన్నారు. ప్రతి ఫలాపేక్ష లేకుండా, తీరిక సమయంలో మాత్రమే నూలు వడకవలెననే ఉద్దేశం కలిగి, పూర్తిగా దుర్బలుడుగా నుండని మనిషికి చర్ఖాకు బదులుగా తక్లీ సంపూర్ణంగా పనికి వస్తుంది. కాబట్టి కార్యకర్తలు తక్లీని తిప్పే నూతన పద్ధతిని నేర్చుకొని రాటమునకు బదు లుగా తక్లీనే గ్రామాలలో ప్రవేశపెట్టవలెను. వృద్ధులకు దుర్బలులకు చర్ఖా ఇంకా అవసరమే అవుతుంది. యాంత్రిక

సూత్రముల ప్రకారం చర్ఖాకూడా ఉత్తోళనీ (lever) విధానమువల్ల నడపబడుతూన్న తక్లీయే. బరువును చేతితో పైకెత్తడానికి కండరముల బలం చాలని మనిషి ఉత్తోళనీ (lever) తో ఎత్తుతూన్నట్లే, తక్లీకి కావలసిన చలన శక్తిని తన చేతికండరములతో కల్పించ జాలని మనిషికిగానీ, లేక మాటిమాటికీ తన చేతిని ఎత్తేటందుకూ దించేటందుకూ శక్తి లేని మనిషికిగానీ చర్ఖా కావలసి వస్తుంది.

—హరిజన్, 22-3-1935

# 141

## స్వయంపోషక ఖాదీ

స్వయంపోషక ఖాదీనిగూర్చి, ఇతర పరిశ్రమల అభివృద్ధిని గూర్చికల అవకాశాలను విచారించేటందుకు శ్రీ శంకరలాలు బ్యాంకరు గ్రామాలలో సంచారం చేస్తున్నారు. స్వయం పోషక ఖాదీ అనగా అవకాశం ఉన్న చోట్ల ఆయా గ్రామాలలోనే పండిన పత్తినుండి అక్కడనే గింజలు తీసి, ఏకులుచేసి, ముందు గ్రామస్థులకు కావలసిన ఖాదీని వారే వడుకుకొని నేసుకోవడం. ఇదే నిజమైన ఖాదీ సందేశం. గ్రామస్థులతో నిరంతర సన్నిహిత సంబంధం కలిగి ఉండడం వలన మాత్రమే ఈ ఆదర్శాన్ని సాధించగలము. పని యొక్క ఆర్థికమూల్యము మాట అలా ఉండగా కాయ కష్టముయొక్క గౌరవమును విలువనూ వారు తెలుసుకొని ఉండాలి. ఈ ప్రణాళిక కింద తయారయ్యే ఖాదీ గ్రామీణుల అభిరుచికి తగినట్లుగా ఉంటుంది. చలవ చేయించడం, ఉతికించడంకూడా ఉండదు. కారణం, గ్రామస్థులలో ప్రతి ఒక్కరు తమ బట్టలను తామే ఉతుకుకోవచ్చును. ఖాదీ యొక్క మనుగడను లెక్కలోకి తీసుకొన్నట్లయితే ఈ విధంగా ఉత్పత్తి అయిన ఖాదీ తక్కిన యే బట్టకంటె నయిననూ చౌకగా ఉంటుంది. పట్టణంలో తయారయ్యే ఖాదీకి చేయవలసిన మరి కొన్ని పనులకు దానిని నిలవచేసే టందుకు, రవాణా అద్దెలు కమిషనులకు, ఇంకా అదనపు ఖర్చులు కాగలవు. గ్రామ ఖాదీ విషయంలో ఈ ఖర్చు లన్నీ ఉండవు. గ్రామాలలో వినియోగించుకోగా మిగిలిన ఖాదీ సరఫరాలమీద పట్టణాలు, నగరాలు ఆధారపడవలసి

ఉంది. కాబట్టి ఏ ఖాదీ భాండారమూ కూడా నష్టంమీద నడపబడుతూ ఉండకూడదు. అ.భా.చ.సం॥ యొక్క భాండారాలకు ప్రధానంగా నాణ్యం ఆదర్శం కావాలి. అంతేకాక కళ అనే మారు పేరు కింద, కేవలం ఆడంబరంగా ఉండకూడదు. నిజమైన కళ అనగా ఏమిటో ఎవరికి తెలుసు? మహా అయితే అది సంబంధవాచక పదం. అ.భా.చ. సం. భాండారాల కొక విశిష్టత ఉండాలి. అవి గ్రామ కళా కౌశల్యమును పట్టణాలలో ప్రవేశపెట్టాలి. అంతేకాక, విజయం పొందగలమనే విశ్వాసముండాలి వాటికి. ప్రతి ఖాదీ ముక్క గట్టిగా ఉండి, మనగలదిగా ఉండాలి. మనుగడను చూడకుండా సన్నదనంకోసం చూచి సేకరించ కూడదు. మనుగడ లేకుండా చేస్తే తుదకు ఖాదీ బ్రతుకదు. గట్టిదనానికి భంగం రాకుండా సన్నని బట్టను మనం నేయ జాలనియెడల, మన అసమర్థతను మనం ఒప్పుకొని తీరాలి. చలవచేసిన బట్ట ఒకసారి కట్టుకొంటేనే చినిగిపోతుందని నేను గమనించడంచేత, చలవచేయడం అంటే నాకు తలుచు భయం వేస్తూంటుంది. కాని అన్ని సందర్భాలలోనూ ఇదే నిజమవుతుందని సూచించడం కాదు. చలవ చేయ బడిన బట్టలు చాలా కాలం నిలవవనే సంగతి తరచు రుజువు కావడంచేత మన వతను దార్లను పోగొట్టుకొంటున్నామని నేను చెప్పగలగడమే నాకు కావలసింది. కాబట్టి ఇక్కడ నేను చెప్పినదానినిబట్టి, ఖాదీ భాండారములన్నీ అవసర మైనంతవరకు తమ ప్రమాణములను సంస్కరించుకొనుగాక!

ఖాదీనిగూర్చి ఏది నిజమో, కొంచెం మించుగా తోలు ఊనడం మొదలయిన యితర గ్రామ పరిశ్రమల విషయంలో కూడా అదే నిజం. మంచి అనుభవం లేకుండా కార్యకర్తలు, పాత పరికరములతోనూ, పాత పద్ధతులతోను పాత నమోనాలతోనూ అనవసర జోక్యం కల్పించుకోకూడదు. వాటిని అభివృద్ధి చేయతలపెట్టేయెడల, పాత పునాదిని కదల్చకుండా ఉంచడం క్షేమం. అది నిజమైన అర్థశాస్త్రమని వారు తెలుసుకోగలరు.

—హరిజన్, 29-3-1935

# 142
# స్వయంపోషక ఖాదీ

వడుకు పని వ్యవసాయదార్లకు సహాయకారిగా ఉంటుందని మైసూరు ఎప్పుడూ గ్రహించేఉంది. అటువంటి కేంద్రాలనది అనేకం నడుపుతూన్నది. అ.భా.చ.సం. వారిచే చేయబడిన సరికొత్త పరిశోధనలను, అభివృద్ధులను తెలుసుకొని, వాటికనుగుణంగా తమ కేంద్రములను ఉంచవలెనని, వాటి వ్యవహర్తలా సంఘంతో సన్నిహిత సంబంధం కలిగి ఉంటున్నారు. బదన్‌వాల్ వడుకు కేంద్రమునుండి, అ.భా.చ.సం. కార్యదర్శికి పంపబడిన ఈ దిగువ ఉత్తరం పాఠకులకు ఉత్సాహకరంగా ఉంటుంది.

"స్థానికంగా అంగడిని అభివృద్ధిచేసే విధానమును కొనసాగించేటందుకున్నూ, గ్రామాలలో ఖాదీని ప్రజామోదకరంగా చేసేటందుకున్నూ, గవర్నమెంటువారి అంగీకారం పొందబడినదని మనవిచేస్తున్నాను. అ.భా.చ.సం. వారు ప్రవేశపెట్టిన మార్పులకు అనుగుణంగా నడుచుకొనేటందుకవలంబింపబడిన నూతన విధానమునకిది అనుకూలంగా ఉంది. ఈ సర్కిలులోని నిజమైన నేతపనివాళ్ళకు, వడుకుపనివాళ్ళకు, ఖాదీ అసలు ఖరీదుకీయబడుతూన్నది. 1934 నవంబరునుండీ ఈ మార్గంలో పని ప్రారంభమయింది. ఇంతవరకు షుమారొక వేయిమంది వడుకువారికి రూ. 2,000 లపై చిలుకు విలువగల ఖాదీ అమ్మినాము. మేము బట్ట యిచ్చి మళ్లీ నూలుకొనుక్కొనేటప్పుడు, వారం వారం వాయిదాల మీద సొమ్ము వసూలుచేసుకొంటున్నాము. ఏప్రిల్ తరువాతనుండీ మళ్లీ అమ్మకాలు సాగించవలెనని అనుకొంటున్నాము. ఈ తడవ చాలావరకు గ్రామీణుల చీరల రూపంలో మరొక రూ. 2,000 ల ఖాదీ అమ్మవలెనని మా ఆశయం. ఇక్కడ ఈ కార్యక్రమం ఎప్పటివలెనే సఫలంగా నడుస్తున్నదని వేసుకొంటున్నాను."

చాలా చోట్లనుండి ఇటువంటి ప్రోత్సాహకరమైన వార్తలే వస్తూన్నవి. ఖాదీయొక్క నిజమైన సందేశ

మిప్పుడు గ్రహింపబడినది కనుక, ఇక అన్ని చర్యలు ఒక్కేసారి తీసుకోవలెనని నేను కార్యకర్తలకు సూచిస్తున్నాను. పత్తి వ్యవసాయమును గూర్చిన తగినంత జ్ఞానముతో పత్తి పండించడం ప్రారంభం కావలెను. గ్రామాల ఉపయోగం కోసం దాదాపు ఎక్కడనైనా పత్తి పండించడం సాధ్యమవుతుంది. ప్రపంచానికి పత్తి సరఫరా చేయవలెననే మహాదాకాంక్షతో అయినట్లయితే అత్యంతానుకూలమగు భూమిపైన కేంద్రీకరణం అవసరం. కాని గ్రామానికవసరమైనది సరఫరా చేయడమే మన ఆశయమైనట్లయితే దానికి ప్రతికూల విధానం పనికి వస్తుంది. గ్రామంలో రైతుకు కావలసిన ముడి పత్తి, ఒక పొలంలో ఒక మూల పండించుకోవచ్చును; గ్రామం మొత్తంపైన కావలసింది కూడా పరస్పర సహకారంతో పండించుకోవచ్చును. ఇది జరిగినట్లయితే దిగుమతి అయిన బట్ట యేదీకూడా స్థానికంగా తయారైన బట్టతో ఖరీదులోగానీ మనుగడలోగానీ పోటీ చేయ లేదని గ్రహించడం తేలిక. ఈ పద్ధతివలన మానవశక్తి అత్యంతం కలసి వస్తుంది. అటువంటి ఆదర్శ పరిస్థితులలో పత్తిగింజలు తీయడం, ఏకడం, వడకడం, సులభమూ, ఆనందప్రదమూ అవుతుంది. రాటాలను కూడా పూర్తిగా పరిశీలించాలి. కదురుయొక్క పరివర్తనములు ఉండతగిన ప్రమాణంలో ఉండనియెడల చాలా శక్తి వృథా అవుతుంది. కానీ దీనిని గూర్చి ప్రత్యేకం ఇంకొక వ్యాసంలో వ్రాస్తాను.

హరిజన్, 20-4-1935

## 143

# ఆదాయం రెండింతలయ్యే మార్గం

కడచిన పదిహేడేండ్లనుండీ వడుకు ఉద్యమం సాగుతూన్నప్పటికీ, అది యేటేటా కనీసం 1,20,000 మంది స్త్రీలకు స్వల్పంగానైనా స్థిరమైన ఆదాను చేకూరుస్తూన్నప్పటికీ, వడుకు శాస్త్రంలో కార్యకర్తల విషాదపూర్వకమైన అజ్ఞానం వలన, రావలసినదానికంటె తక్కువ ఆదా వస్తూన్నది. చెడు పత్తితో, పొడు ఏకులతో, కదురు తిరగడం సరిలేని తుక్కు రాటంమీద వడికితే నూలు ఉత్పత్తి తక్కువవుతుంది సూక్ష్మాంశములను గూర్చి శ్రద్ధ తీసుకొన్నయెడల ఉత్పత్తి తేలికగా రెట్టింపయి ఆదాకూడా ఆ ప్రకారం వస్తుంది. పత్తి జాగ్రత్తగా ఏరి, చేతితో గింజలు తీసి, చక్కగా ఏకితే, నూలు ఎక్కువగా ఉత్పత్తి కావడమే కాక, నునుపు పురీ కూడా వస్తుంది. వేగం, పురి, నునుపు, నూలు సన్నదనం యివన్నీ కూడా చాలావరకు బహుశా కదురుయొక్క పరివర్తనముల సంఖ్యనుబట్టి ఉంటవి. అనగా చక్రం తిరిగే ప్రతి పరివర్తనమునకు కదురు తిరిగే పరివర్తనముల సంఖ్యను బట్టి ఉంటవి. కదురు బిళ్లమీద నిలువుగా ఒక గీత గీసి, కదురు తిరుగుతూన్న పరివర్తనాలను లెక్కపెట్టడానికి వీలైనంత నెమ్మదిగా చక్రం తిప్పుతూండడం వలన, ఈ లెక్క తేలికగా తేలిపోతుంది. చక్రం ఒక్కసారి తిరిగేసరికి కదురు నూరుసార్లకు తక్కువ తిరగకూడదు. కాని తన సంచారంలో కదుళ్లు ముప్పయి అయిదు పర్యాయములు మాత్రమే తిరగడం చూచినట్లుగా శ్రీ శంకరలాల్ బ్యాంకరు నివేదిస్తూన్నారు. అలా అయితే ఉత్పత్తి అత్యల్పం

కావడమున్నూ, నూలు పురిలేక ఊడిపోతూన్నట్లు ఉండడమూ ఆశ్చర్యంలేదు. కదురుయొక్క పరివర్తనాలను హెచ్చించవలెనంటే, 'మాలు' ను స్వస్థానంలో ఉంచుతూన్న 'సారి' యొక్క వ్యాసాన్ని తగ్గించాలి. స్థానిక కార్యకర్తలు తమ స్వస్థానంలోని ప్రతి రాట్నాన్ని పరీక్ష చేసి, అవసరమైన చోట్ల, కదురులోను తదితర భాగాలలోనూ అవసరమైన మార్పులను చేయాలి. తుదకు, నూలు ఉత్పత్తి చేసేటందుకు తక్లీయే ఉత్తమోత్తమమైన పరికరమని తేలవచ్చును. దానిని గూర్చి అత్యల్పమైన శ్రద్ధ చాలును. తక్లీమీద వడికే నూతన పద్ధతి ప్రకారం, అది సగటున 200 చుట్లు తిరుగుతుంది. అనగా 66 గజాల నూలు ఉత్పత్తి అవుతుంది. గంటకు 440 చుట్లు రకూ తక్లీ తిరుగుతుంది.

—హరిజన్, 4-5-1935

# 144

# యంత్రముల సమర్థన

యంత్రాల పక్షాన పూనుకొన్న ఒకానొక సోషలిస్టు గ్రామ పరిశ్రమల ఉద్యమం యంత్రాలన్నిటినీ తీసివేసే టందుకుద్దేశింపబడలేదా అని గాంధీజీని ప్రశ్నించాడు.

“చరఖా యంత్రం కాదా?” అని అప్పుడు నూలు వడుకుతూన్న గాంధీజీ బదులు ప్రశ్న వేశారు.

“ఈ యంత్రాన్ని గూర్చి నేను మాట్లాడడం లేదు. పెద్ద యంత్రాలను గూర్చి మాట్లాడుతున్నాను.”

“మీరు సింగరు కుట్టు యంత్రాన్ని గూర్చి అడుగుతున్నారా? దానికికూడా గ్రామ పరిశ్రమల ఉద్యమం రక్షణ యిస్తూన్నది. అంతేకాదు, సామాన్య జనము యొక్క కృషికి అవకాశమును పోగొట్టక వ్యక్తికి సహాయకారియై అతని సామర్థ్యమును హెచ్చిస్తూ అతను దానికి దాసుడుకాకుండా స్వేచ్ఛగా వినియోగించుకోవడానికి వీలైన యే యంత్రమునకైనా గ్రామ పరిశ్రమల ఉద్యమం రక్షణ యిస్తుంది.”

“అయితే వైజ్ఞానికంగా కనిపెట్టబడిన మహాద్విషయాల సంగతి యేమిటి? విద్యుచ్ఛక్తితో మీకేమీ నిమిత్తం లేదా?

“అలా ఎవరన్నారు? గ్రామంలోని ప్రతి యింటికీ విద్యుచ్ఛక్తి సరఫరా అయ్యే యెడల దాని సహాయంతో గ్రామస్థులు తమ పరికరములను సాధనాలనూ నడిపించుకొంటే నాకేమీ అభ్యంతరం లేదు. విద్యుచ్ఛక్తిగానీ యంత్రాలుగానీ లేనిచోట్ల ఊరికే ఉన్నవారేమి పని

చేయాలి? వారికి పని చెప్పవలెనంటారా? లేక పనిలేని కారణాన వారి యజమానులు వారిని తగ్గించవలెనంటారా?

"అందరి ప్రయోజనం కోసం కనిపెట్టబడిన ప్రతి వైజ్ఞానిక విషయాన్నీ నేను బహూకరిస్తాను. ఈ కనిపెట్ట బడే వైజ్ఞానిక విషయాలలో భేదాలున్నవి. ప్రజా సమూహములను ఒకటే సారిగా నిర్మూలింపగలిగిన ఊపిరి తిరుగని వాయు ప్రయోగములతో నాకు పని లేదు. ప్రజల కష్టంతో నిర్వర్తించడానికి సాధ్యంకాని పనులను ప్రజోప యోగంకోసం సాధించేటందుకు భారీ యంత్రాలకు తప్పకుండా స్థానముంది. అయితే అవన్నీ ప్రభుత్వ యాజమాన్యం కింద ఉండే కేవలం ప్రజల క్షేమం కోసం వినియోగింపబడాలి. ఆ కారణంగా అనేక మంది యొక్క కృషికి భంగం కలిగించేదిగాగానీ అనేకమందికి నష్టం కలిగించి కొద్ది మందిని భాగ్యవంతులను చేసేదిగాగానీ ఉండే యంత్రాల యెడల నాకేమీ దాక్షిణ్యం లేదు.

'విచక్షణ లేని యంత్రోపయోగమును పోషిస్తుగా మీరు కూడా అంగీకరించరు ముద్రణ యంత్రాలను తీసుకోండి! అవి నడవవలసిందే. శస్త్ర చికిత్సకు కావలసిన పనిముట్లను గురించి ఆలోచించండి! ఏ మనిషియైనా వాటిని చేతితో ఎలా చేయగలుగుతాడు! వాటికి భారీ యంత్రాలు కావలసిందే. కాని సోమరితనానికి చికిత్స చేసేటందు కీయంత్రం తప్ప మరొక యంత్రం లేదని గాంధీజీ రాటం వంక చూపించి అన్నారు. నేను మీతో మాట్లాడుతూనే దీనిమీద పనిచేయగలను. అందువలన దేశ సౌభాగ్యమునకు మరి కొంచెం దోహదం చేస్తున్నాను.

—హరిజన్, 22-6-1935

# 145

## ఖాదీ సందేశం

పట్టణస్థులకు మిల్లు బట్టలతో పోటీ చేయగల అందమైన ఖాదీని సరఫరా చేస్తూ, తదితర పరిశ్రమలవలెనే కొలది మంది కార్మికులకు పని కల్పించడం మాత్రమే కాదు ఖాదీ సందేశం. వ్యవసాయకులకు ఉపవృత్తిగా పరిణమించడం దాని సందేశం. ఈ సందేశం ఇంకనూ నిర్వహింపబడకుండా అలాగే ఉన్నది.

ఆ సందేశాన్ని నిర్వహించేటందుకు, అది స్వయం పోషకమై దాని ఉపయోగం గ్రామాలలో వ్యాపించాలి. గ్రామస్థులు తమ రొట్టెను తమ అన్నాన్నీ తాము పచనం చేసుకొంటున్నట్లుగా, తమ స్వీయోపయోగంకోసం ఖాదీని తాము తయారుచేసుకోవాలి. ఏమైనా మిగులు ఉంటే వారు అమ్ముకోవచ్చును. ఖాదీ సేవయొక్క స్వరూపమున్నూ, చర్ఖా సంఘముయొక్క విధానమున్నూ మారనిదే ఈ సందేశం ప్రజలకు చేరజాలదు.

ఖాదీ పనిచేసే ప్రతి సభ్యుడు, ఖాదీగా తయారయ్యేటందుకు పత్తి పొందవలసిన పరిణామాలన్నింటినీ తెలుసుకొనవలెను.

ఖాదీయొక్క స్వయంసంపూర్ణతనుగూర్చి పట్టుదల వహించినప్పుడు, పట్టణస్థులకు నిజంగా అవసరమయినంత వరకే వాణిజ్యంకోసం చేయబడే ఉత్పత్తి పరిమితమవుతుంది. అప్పుడు చర్ఖా సంఘం చేతులలో కేంద్రీకరింపబడడానికి బదులు సొంత వ్యాపారస్థులలో చేతుల పడుతుందది.

ఖాదీని వ్యాపార సరళిలో నడపడంలో చరఖా సంఘం, ఇంతవరకూ అమలులోనున్న ఖరీదులకు లోబడి ఉండవలసి వచ్చింది. అందువల్ల అన్ని రకాల కూలీలోకి వడుకు కూలి మరీ అధ్వాన్నంగా ఉంటూ వచ్చింది. పైగా రాష్ట్రాలను బట్టి మారుతూ ఉందికూడా అది. కాబట్టి ఖాదీ ఖరీదులు కూడా రాష్ట్రాలను బట్టి మారుతూ ఉండినవి. ఈ హాని కరమైన పోటీని ప్రోత్సహించి పెంపొందించడం కేవలం లాభంకోసమేర్పడిన సంస్థలకు చాలా బాగానే ఉంటుంది. కాని లక్షలాది నిరుపేదలకుపకారంచేయడమే పరమావధిగా పెట్టుకొన్న సంఘాలు మాత్రం, అటువంటి పోటీలో పాల్గొనలేవు. బీహారులో వడుకుపనిచేసే స్త్రీ గుజరాతులోని తన సోదరికంటె ఎందుకు తక్కువ పొందవలెనో కారణం కనిపించడం లేదు. జీవిత ప్రమాణములను బట్టి ఆయా రాష్ట్రాలలో ఖరీదులు మారుతూండే మాట నిజమే. కాని చరఖా సంఘం విషయాలను ఉన్న పాటున గ్రహించి ఊరుకోలేదు. అవి అన్యాయంగా ఉన్నట్లయితే వాటికది మారుస్తుంది. ఒక గంట వడికినందుకిచ్చే మజూరీ, ఒక గంట నేసినందుకిచ్చే మజూరికంటె ఎందుకు తక్కువ ఉండాలో కారణం కనిపించడం లేదు. మామూలు నేతలో కంటె వడకడంలో ఎక్కువ నైపుణ్యం ఉండాలి. మామూలుగా నేయడం వట్టి యంత్రంలాగ చేసేపని. ఏ మాత్రం వడకడాన్నికైనా చేతిలో నేర్పు కావాలి. కాని వడికే మనిషి కనీసం గంటకొక దమ్మిడీ సంపాదిస్తే నేసే మనిషి ఆరు దమ్మిడీలు సంపాదిస్తున్నాడు. ఏకే మనిషి కూడా, దాదాపు నేత మనిషి సంపాదించినంత ఎక్కువ సంపాదిస్తున్నాడు. ఈ పరిస్థితులకు చారిత్రక కారణాలున్నవి. చారిత్రక కారణాలయినంత మాత్రాన అవి

న్యాయంకాదు. చరఖా సంఘం తాను నియమించిన అన్ని రకాల పనివాళ్ల మజూరీ, స్థిరంగా ఉండేటట్లు కాకపోయినా, సమంగా ఉండేటట్లు చేయవలసిన తరుణం వచ్చినది. ఇందువల్ల, చాలా సందర్భాలలో, నేత మనిషి ఒక గంటకు ఒక అణాకంటె ఎక్కువ పుచ్చుకొంటున్న యెడల, అతని మజూరీని తగ్గించుకోమని కోరవలసి వస్తుంది. అందఱు నేత వారూ తమంతట తాము ఈ సమ విధానాని కంగీకరించే తరుణం ఎన్నటికీ రాకపోవచ్చును. ఉత్పత్తి చేస్తూన్న కార్మికులందఱికీ సమానవేతనములీయవలెననే సిద్ధాంతం సరియైనదైతే, ఆ ఆదర్శాన్ని వీలైనంత సన్నిహితంగా చేరుకోవడానికి చర్ఖా సంఘం ప్రయత్నించాలి. ఒకవేళ సారే యిదంతా చేయకపోయినట్లయితే, వడికే వారి మజూరీని హెచ్చించడంతో ఈ పని ప్రారంభం కావాలి. వారొక గంట సరిగా చేసే పనికి ఉచితమైన మజూరీ వారికి ముట్టాలి. వినోబా విద్యార్థులకు చదువు చెపుతూ అదే సమయంలో, రోజుకు దాదాపు తొమ్మిది గంటలపంతున నూలు వడికే ప్రయోగం (experiment) చేస్తూన్నాడు. ఆయన గంటలో వడికిన నూలును ప్రమాణంగా తీసుకొని వడికే మనిషికి ప్రమాణవేతనం ఏర్పాటు చేయాలి. వినోబాయొక్క ఈ పని ఫలితాలు త్వరలోనే ప్రచురింపబడ గలవని ఆశిస్తున్నాను.

నూలు వడికే మనిషితో సజీవ సంబంధం కలిగి ఉండవలెనని ఈ ప్రణాళిక ముందుగా భావిస్తూన్నది. అనుకోకుండా మజూరీలను హెచ్చిస్తూన్న సంస్థ తాను పంచే చిల్లర డబ్బులు ఏ వైపుకు పోతూన్నదో కనిపెట్టి ఉండాలి. త్రాగుడుకో పెళ్లివిందులకో దుబారా ఖర్చులు చేసుకొనే టట్లయితే అడగకుండా మజూరీలు హెచ్చించడం నిరుపయోగ

మవుతుంది. ఖాదీ పనికూడా దాదాపు అంటరాని తనాన్ని గూర్చి చేసే [illegible]. ఉన్నత వర్గాలవారనబడేవారు దిగువ తరగతులవారిని యుగాలనుండీ పూర్తిగా అలక్ష్యం చేశారు. అందువల్ల వారికి బ్రతికే ఉపాయమే తెలియకుండా పోయింది. తాము కేవలం బానిసలమని భావిస్తున్నారు వారు. పై తరగతుల వారమనుకొనేవారు కూడా వారు చేసిన పాపాలకు తగిన శిక్ష అనుభవించక తప్పలేదు. వారికికూడా బ్రతుకు తెరువు తెలియడం లేదు. 'దిగువ తరగతుల'నుండి సహాయం రానియెడల వారీనాడే నాశనమై పోతారు. దిగువ తరగతులవారి యెడ కావించిన అపరాధమునకు ప్రాయశ్చిత్తం కావించుకొనేటందుకు పై తరగతులవారాహ్వానింపబడడం ద్వారా ఈ రెండు అనర్థాలను సరిచేయడమే ఖాదీ సందేశం. గ్రామ పరిశ్రమల కార్యకర్తలచే స్థాపింపబడిన వివిధ పరిశ్రమలలో పనిచేసే గ్రామస్థులకు, చరఖా సంఘంవారిచే నిర్ణీతమయిన మజూరీలు ముట్టేటట్లు, ఆ కార్యకర్తలు చూడవలెను.

—హరిజన్, 6-7-1935

## 146

# ప్రమాణ వేతనావసరం

అ.భా.గ్రా.ప.సం. వారు తమ ఏజెంట్లకూ, తదితరులకూ ఈ క్రింది ప్రశ్నావళిని పంపినారు. జవాబులు రాబోయే ఆగస్టు ఒకటో తేదీ ముందుగా వార్ధాలోని కేంద్ర కార్యాలయమునకు చేరాలి :—

అ.భా.చ.సం. వారి అధ్వర్యమున ఉత్పత్తిచేయబడుతూన్నట్టిగానీ అమ్మబడుతూన్నట్టికానీ అన్నివస్తువులకు గ్రామీణ శిల్పకారుడు అతని పరిశ్రమకు తగిన ప్రతిఫలమును పొందేటట్లు మనము పట్టుపట్టవలెనని సూచింపబడినది. ఇందుకోసం పనికితగిన కూలి ప్రమాణాన్ని నిర్ణయించడం అవసరం. ఒకేరకపు పనికి స్త్రీపురుషులిరువురకు ఆ ప్రమాణం సమానంగానే ఉండాలి. రోజుకు ఎనిమిదిగంటలు పని చేసేటట్లు, కనీసం యింతపనిచేసేటట్లు అని ఒక నిర్ణయం ఉండాలి. ఆ కూలి, ఖర్చులో చేరాలి. దానినిబట్టి ధరనిర్ణయం కావాలి. సాధారణంగా పోటీ వ్యాపారంలో మనము ధరలను నిర్ణయించలేక పోవచ్చును. కాని పోటీకి చోరబడని వస్తువుల విషయంలోనూ ప్రత్యేక గుణములనుబట్టి వినియోగదారులకు యిష్టమై యెన్నుకోబడిన వస్తువుల విషయంలోనూ మనము ధరలు నిర్ణయించవచ్చును. ఈ దిగువ విషయములను గూర్చి మీ అభిప్రాయాన్ని కోరుతూ ఈ ప్రశ్నావళి పంపబడుతూన్నది :—

1. కనీస దినవేతనములు నిర్ణయించడం, ధరలు నిశ్చయించి ఆ కనీసవేతనమును పనివాళ్లకు తప్పకుండా ముట్టేటట్లుచేయడం సాధ్యమని మీరు భావిస్తున్నారా ?

2. మనము గరిష్ఠప్రమాణమును నిర్ణయించి అందు కోసం పనిచేయాలా? లేక కనీసప్రమాణంతో ముందు ప్రారంభించి కాలక్రమేణా దానిని పెంచుకొంటూ పోవాలా?

3. ఏ పునాదిమీద అది నిర్ణయింపబడవలెను? ఇప్పటికి కేవలం ఆహారవిషయమైన ఆలోచనలోకి తీసుకొని, బట్టలు వాండ్ల వ్యక్తిగత కృషిద్వారా సంపాదించుకోవలె ననుకొనే యెడల జీవనవేతనమును మీరు సూచించగలరా? గంటకు ఒక అర్ధణా చాల తక్కువవుతుందా?

అ.భా.చ.సం.; అ.భా.గ్రా.ప.సం.; వంటి సంఘము లున్నా, ఇంకా అటువంటి ప్రజాహిత సంస్థలున్నా అతి చౌకగాకొని అతి ప్రియంగా అమ్మవలెననే వాణిజ్యసూత్రాన్ని అనుసరించక పోవచ్చును. అ.భా.చ.సం. అతి చౌకగా కొనవలెనని ప్రయత్నించినమాట నిశ్చయం. దీనిని గూర్చి మరొకచోట వ్రాస్తాను. ఖాదీ ఉద్యమ పరిమాణంలోని నా అనుభవ ప్రయోజనమును అ.భా.గ్రా.ప.సం. నకు సంక్రమింపచేయ నుద్దేశించి దాని పలుకుబడిక్రింద పనిచేసే శిల్పకారులకు లభిస్తూన్న వేతనములను గూర్చి చర్చ ప్రారంభించాను. దానిఫలితమే ఈ ప్రశ్నావళి.

కావలసిన వస్తువులను సాధ్యమైనంత చౌకలో ఉత్పత్తి చేయించవలెననే వైఖరి యేజెంట్లలో ఉన్నట్లు ఇంతకు పూర్వమే తెలిసివచ్చింది. పనివాళ్ల మజూరీలలో కాకపోతే ఇంకా ఎక్కడ వారు ఖర్చు తగ్గించగలరు? కాబట్టి కనీస వేతనము నిర్ణయింపబడక పోయినట్లయితే, అ.భా.గ్రా.ప.సం. గ్రామీణ శిల్పకారుని క్షేమముకొఱకే పుట్టినప్పటికీ అతను పీడింపబడే అపాయం చాలా ఉంది.

నిరుపేదలై ఓర్పుగల గ్రామీణులను మనం చాలాకాలం స్వార్థంకోసం ఉపయోగించుకొన్నాము. ప్రజాహితమనే పేరుతో అ.భా.గ్రా.ప.సం, ఈ స్వప్రయోజన విధానాన్ని ఇంకా తీవ్రతరం చేయకుండుగాక. గ్రామీణవస్తువులను సాధ్యమైనంత చౌకగా చేయించడం దాని ఆశయం కానే కాదు. పనిలేని గ్రామస్థులకు జీవన భృతిని చేకూర్చగల పనిచూపడమే దాని ఆశయం.

గ్రామాలలో తయ్యారైన వస్తువుల ధరలను హెచ్చించే ప్రతిపనీ అ.భా.గ్రా.ప.సం. యొక్క ప్రధానాశయాన్నే భంగం చేస్తుందనీ, ఖరీదులు చాలా ఎక్కువగా ఉండే యెడల గ్రామీణవస్తువులను కొనేవారే ఉండరనీ వాదన చేయబడుతూన్నది. గ్రామీణుల దుస్థితిని గూర్చి ఆ వస్తువులను కొనేవారికి నచ్చచెప్పాలి. లక్షలాది కష్టజీవులకు మనం న్యాయం కలుగచేయవలెనంటే వారికి తగిన ఊవి ఈయాలి. వారి జీవనానికి సరిపోయే మజూరీ చెల్లించాలి. వారి నిస్సహాయతను ఆధారంగా తీసుకొని వారికొక పూట భుక్తికైనా పూర్తిగా సరిపోని మజూరీ ఈయకూడదు.

యంత్రాలలో తయారయ్యే వస్తువులతో ఈ సంఘం పోటీచేయరాదనే విషయం సుస్పష్టమే. తప్పకుండా ఓడిపోతామని తెలిసి ఉన్న యే ఆటలోనూ, మనం జోక్యం కల్గించుకోకూడదు. ధనసంపాదనకు సంబంధించినంతవరకు పెద్ద పెద్ద స్వదేశీ విదేశీ సంస్థ లేవైనప్పటికీ మానవుడు చేతితో చేసే ప్రయత్నాన్ని మించియే యెప్పుడూ చేయగలవు. అసత్యము మానవేతరము అయిన ఆర్థిక వ్యవహారాల స్థానే సత్యము మానుషము అయిన వాటిని ప్రవేశపెట్టడమే ఈ సంఘంచేయ ప్రయత్నిస్తూన్నపని. ప్రాణం

పోషించేటందుకు సహకారంచేయడం మానవధర్మం. కాని చంపేటందుకు పోటీ చేయడం కాదు. మనము "దేవుని ప్రతిబింబాలుగా సృజింపబడి" ఉన్నట్లయితే కొద్దిమంది క్షేమం కోసంగానీ, అనేకమంది క్షేమంకోసంకానీ కాక అందరి క్షేమమునూ పెంపొందించేటందుకే మనము సృజింపబడ్డాము.

అ.భా.చ.సం. వంటి ప్రజాహితైక సంస్థ ఈ ప్రశ్నలలోని సమస్యలను గూర్చి విచారించకుండ జాలదు. వాటి నిజమైన పరిష్కారము అనాచరణీయముగా కనిపిస్తూన్న యెడల దానిని ఆచరణీయంగా చేయడానికి ప్రయత్నించాలి. సత్యమెప్పుడూ ఆచరణీయమే. ఈ దృక్పథంతో ఆలోచించే యెడల ఈ సంఘముయొక్క కార్యక్రమాన్ని వయోజన విద్య అని పిలవడం సముచితంగా ఉంటుంది. ఈ సంఘం తన రక్షణకింద నున్న శిల్పకారునికి జీవికాభృతిని చేకూర్చే యెడల అతని యింటి జమాఖర్చు లెక్కలను శ్రద్ధగా పరిశీలించి అతనికి చెల్లించబడిన ప్రతిపైసా యెలా వెచ్చింపబడుతూన్నదో తెలుసుకోవాలి.

కనీసభృతినిగానీ లేక జీవికాభృతినిగానీ నిర్ణయించడమే అన్నిటిలోకీ కష్టమైనపని. ఒక మంచిసమర్థుడైన శిల్పకారుడు నిర్ణీతప్రమాణంగల ప్రత్యేక సామగ్రిని ఎనిమిది గంటలు గట్టిగా శ్రమపడి తయారుచేసేటందుకు ఎనిమిది అణాల మజూరీని నేను సూచించాను. ఒక ప్రమాణమునకు లోబడిన జీవితావసరములకు ప్రతిగా ఎనిమిది అణాలు ఒక చిహ్నం మాత్రమే. ఐదుగురు గల కుటుంబంలో ఇద్దరు

పూర్తిగా పనిచేసే మనుష్యులుండి సెలవులుగానీ జబ్బువలన నాగాలుగానీ లేకున్నయెడల నా సూచనప్రకారం వారు నెలకు ముప్పది రూపాయలు సంపాదించుకోగలరు. ఐదు పొట్టలకు ముప్పయి రూపాయిలు అధికాదాయం కాదు. ఈ సూచించబడిన విధానం లింగ వయోభేదములను ముఖ్యంగా గమనించడం లేదు. కాని ప్రశ్నలు పంపబడిన ప్రతి ఒకరు తమ స్వానుభవమును బట్టి నివేదికను పంపవలెను.

—హరిజన్, 13-7-1935

# 147

## అ.భా.చ.సం.

అ.భా.గ్రా.ప.సం. వారిద్వారా పనిచేస్తూన్న కర్మకారుల విషయంలో యేది నిజమో, అ.భా.చ.సం. వారి ద్వారా పనిచేస్తూన్న కర్మకారుల విషయంలో కూడా అది అంత నిజం. అ.భా.గ్రా.ప. సం. కొత్తగా పని ప్రారంభించవలసి ఉంది. కనీస సమాన వేతనములను ప్రవేశపెట్టవలెనంటే, అ.భా.చ.సం. పదిహేను సంవత్సరాలనుండీ సాగుతున్న సంప్రదాయాన్ని తుదముట్టించాలి. అసంఖ్యాకులుగా నున్న వడుకువారికి సహాయంచేసేటందుకు, వారిలో పదవ వంతు సంఖ్యగల నేతవారితో వ్యవహరించవలసి ఉంది. వారుకాక ఇంకా ఏకేవారు, పత్తిగింజలు తీసేవారు మొదలైనవారున్నారు. వీరిలో ప్రతితరగతివారి మజూరీ వేరు వేరుగా ఉంటుంది. నేతవారి సంపాదనకూ వడుకువారి సంపాదనకూ కల వ్యత్యాసం, రెంటినీ సమం చేయడానికి వీలులేనంత ఎక్కువగా కనిపిస్తూన్నది. వడుకుమనిషి గంటకు రెండు దమ్మిడీలు సంపాదించగలిగితే, నేసేమనిషి కనీసం గంటకు ఒక అణా సంపాదిస్తూన్నాడు. తరుచు రెండు అణాలు కూడా సంపాదిస్తూన్నాడు. వడికేవారిని రెండు దమ్మిడీల నుండి పంన్రెండు దమ్మిడీలవరకూ తీసుకొనిరావడం చాలా పెద్ద సమస్య. అందులో వారిసంఖ్య దాదాపు ఒకటిన్నర లక్షలవరకూ ఉన్నప్పుడు మరీకష్టం.

కాని చర్ఖాసంఘం తన ధర్మకర్తృత్వమునకు తగినట్లుగా ప్రవర్తించవలెనంటే న్యాయనిర్వహణమునకు కావలసిన ధైర్యాన్ని సంపాదించుకోవాలి. చిక్కులను మనం

ఎదుర్కోవలెనేగాని భయపడి పారిపోకూడదు. దరిద్ర నారాయణునిపైన ప్రేమతో ఖాదీని కొంటూన్నవారు ఇంతకు పూర్వము తాముపెట్టే ఖరీదులకంటే ఖాదీకి ఎక్కువ ఖరీదులను పెట్టగలరని మనం వారిని విశ్వసించాలి. మన విశ్వాసం ఉంచకూడనిచోట ఉంచబడినప్పుడు, అమ్మకాలు చాలా తగ్గిపోతవి. దానిని కూడా ఎదుర్కోవాలి. ఖాదీని ప్రేమించేవారు ఎంత ఖరీదైనా దానినికొంటారు. అయితే ప్రతి నూరు రూపాయిలకు తొంబై అయిదు రూపాయిలు దరిద్ర నారాయణునకు ముట్టుతుందని మాత్రం వారు తెలుసుకోవాలి.

అయితే ఖాదీయొక్క వాణిజ్యోపయోగం అప్రాముఖ్యం. అత్యంత స్వల్పం; నగరవాసులు ఖద్దరు కొనవలసినవారు ఒకకోటి మందికంటె ఎక్కువ లేరు. పూర్తిగా అదేపని చేస్తే 20 లక్షల మంది కర్మకారులు వారికి సౌఖ్యంగానూ తేలికగానూ దుస్తులు సరఫరా చేయగలరు. పొలంమీద పనిచేసేవారికి ఉపవృత్తి కల్పించటమే ఖాదీయొక్క ప్రధాన ప్రయోజనం. తమనూలును తాము వడుకోని, తమ బట్టను తాము నేసుకొనేటట్లుగానీ లేక నేయించుకొనేటట్లుగానీ వారికి నేర్పవలెను. వారు, తమకుతామే వంటవారుగానూ, భోక్తలుగానూ ఉన్నట్లే, తమకు తామే ఉత్పత్తిదారులు గానూ, విక్రేతలుగానూ లేక వినియోగకులుగానూ ఉంటారు. ఈ పనిని ఇంతవరకు మనం శ్రద్ధగా తాకనైనా లేదు. శ్రీ బ్యాంకరు నెమ్మదిగా క్రమంగా ఈ మార్పును ఏర్పాటుచేస్తున్నాడు. ఆ పని అలా జరుగుతూండగా, మనం వడికేవారికి సరిపోయే మజూరీయిచ్చి వారియెడ మనం న్యాయంగా ప్రవర్తించాలి. అది రోజుకు ఎనిమిదణా లుండవలెనా? అంతకు తక్కువ ఉండవలెనా? ఆ పరిమితి ఎంతయినప్పటికీ, దానినిపొందే అర్హత సంపాదించడానికా

వడుకుమనిషి నుండి ఒక గంటలో మన మెంత నూలును తీసుకోవలసి ఉంటుంది ? పత్తిగింజలు తీసేవారు, ఏకేవారు, నేసేవారువగైరా ఖాదీ ఉత్పత్తిలో ఈ నాడు పనిచేస్తూన్న వా రందరినీ గూర్చి ఈ ప్రశ్న పరిష్కారం కావలసిందే.

ఖాదీ ఉద్యమంలో ఆసక్తిగలవారున్నా, ఖాదీ శాస్త్రం తెలిసి వున్నవా రెవరైనా ఉంటే వారున్నా, మజూరీల ప్రమాణం సందర్భంలో సూచింపబడిన మార్పును గూర్చి తమ అభిప్రాయాలను దయయుంచి పంపగలరా ? ఈ మార్పుకు వా రనుకూలు రైనట్లయితే, వారు నిర్ణయించే కనీసపు మజూరీని కూడా చెప్పకోరుతున్నాను.

—హరిజన్, 13-7-1935

# 148

# ప్రారంభించే విధం

ఖాదీ కర్మకారుల మజూరీ విషయంలో ఒక ప్రమాణ నిర్ణయంకానీ లేక ఒక కనీస వేతన నిర్ణయంగానీ చేయవలసి ఉన్నమాట నిశ్చయం. నాకింతవరకు చాలా అభిప్రాయాలు వచ్చినవి. ఒకరిద్దరు తప్ప తక్కిన వారెవరూ ఎక్కువ ప్రమాణాన్ని నిర్ణయించవలెననే నా సూచనకు ప్రతికూలురుగా లేరు. అయితే ఏ ఒకరిద్దరూకూడా ఎనిమిదణాల సూచనను ఆమోదిస్తూన్న వారింతవరకు లేదు. కొంతమంది కార్యకర్తలు ఎనిమిదణాల సూచన ఖాదీని నాశనం చేస్తుందని భావిస్తున్నారు. ఆ సందర్భంలో, ఖాదీ ధర చాలా హెచ్చిపోతుందని అందువల్ల కొనేవాళ్లు చాలా తక్కువమంది అవుతారని వారభిప్రాయం. అది అలా ఉండగా, చెప్పుకోదగిన ఏ మార్పునైనా కొన్ని షరతులు నిర్వహింపబడవలసి ఉంటవి. కాబట్టి ఈ అవకాశం పోనీయకుండా, వీలైనచోటులన్నిటిలో తక్షణం ఈ క్రింది షరతులను అమలులో పెట్టడం తెలివిగలపని :—

1. పత్తి ఏరడం మొదలుకొని నేసేటంతవరకునూగల అన్ని కార్యక్రమాలలో, కార్యకర్తలు, ఇతరులకు నేర్పడానికి వీలుగా ప్రవీణులు కావాలి.

2. వ్యవస్థాపకులు తమ ఆధీనములోనున్న ప్రదేశంలోని ఏకేవారు, వడికేవారు, నేసేవారు వగైరా అందరి జాబితానూ వ్రాసిపెట్టుకోవలెను.

3. తమ వడికే మనుష్యుల ఉపయోగిస్తూన్న పత్తి యొక్క రకాన్ని తెలుసుకొని, అది ఏ నెంబరు వడకడానికి పనికివస్తుందో ఆ నెంబరుకంటె ఎక్కువ నెంబరు వడికేటందుకు వారిని ప్రయత్నించనీయరాదు.

4. వడికే వారికి తదితర కర్మకారులకు, వారి కుటుంబాలలో ఖాదీని వాడనట్లయితే, వారికేమీ పని ఈయబడదని గట్టిగా చెప్పాలి.

5. అలా చెప్పబడిన కర్మకారులు, తమ శ్రమకు ప్రతిఫలంగా ఎల్లప్పుడూ ఖాదీ పొందడానికి వీలైన సౌకర్యములు కలిగివుండేటట్లు చేయాలి.

6. వచ్చిన ప్రతి చిలపకు పురి ఉన్నదో లేదో, సమంగా ఉన్నదో లేదో పరీక్షించాలి. పురి లేనిదానిని సమంగా లేనిదానిని, కాలని రాట్నను తిరగకొట్టినట్లు తిరగకొట్టవలసిందే.

7. ప్రతి వడుకు మనిషియొక్క నూలు, బట్టకు సరిపోయేటంతవరకు ప్రత్యేకంగా నిల్వచేసి నేయించాలి. దీనిని నియమంగా పాటించాలి. ఈ పద్ధతివలన ఖాదీమన్నుగడలోనూ నేతలోనూ ఆకారంలోనూ, అన్నిటా అభివృద్ధి కనిపిస్తుంది.

8. ఈ విధంగా తయారైన బట్టలన్నిటికీ, పత్తి గింజలు తీసినవారు, ఏకినవారు, వడికినవారు, నేసినవారు, ఈ అందరూ వేరైనప్పుడు వారందరి పేర్లతో చీట్లు అంటించబడవలెను.

9. ఈ కర్మకారులు కుటుంబాల సభ్యులైనప్పుడు వారి యిళ్లలోనే ఈ పనులన్ని చేసుకొనేటట్లుగా ప్రేరేపించి

ప్రోత్సహించాలి. మజూరీలు సమానంచేయబడినప్పుడు గానీ, దాదాపు సమంగా ఉన్నప్పుడు కానీ యిది తేలిక.

10. కార్యకర్తల పలుకుబడికింద పనిచేస్తూన్న కర్మకారుల కుటుంబ జీవితాలను వారి ఆదాయవ్యయాలను, జాగ్రత్తగా పరిశీలించి, సంపాదనను ఉచితంగా ఖర్చు పెడుతూన్న వారికి సహాయంచేయాలి.

11. సంఘంవారిచే ఉపకారంచేయబడుతూన్న శిల్పకారుల సంఖ్యకు ఎప్పుడైనా పరిమితి యేర్పాటు చేయవలసిన అవసరంకలిగేయెడల, ఇతరవృత్తికల వారు ముందుగా మినహాయింపబడాలి. ప్రస్తుతం చాలా రాష్ట్రాలలో కేవలం నిరుపేదలేకాకుండా, అప్పులు తీర్చుకోవడం మంచి అన్నం తినడంకంటె కూడా చిన్నచిన్న వస్తువులు కొనుక్కునేటందుకు కొంచెం డబ్బు కావలసిన పొదుపరితనంగల స్త్రీలు సైతం వడుకుతున్నారని నాకు తెలుస్తున్నది.

12. కమానులను చర్ఖాలను ప్రతిచోటా కార్యకర్తలు జాగ్రత్తగా పరిశీలించాలి. ముఖ్యంగా చర్ఖాల సందర్భంలో కదుళ్లను వాటి పరివర్తనాలను పరిశీలించాలి. ఎందువల్లనంటే సూచింపబడిన ఎక్కువ మజూరీ కేవలం అదనం కాదు. కొంత ఎక్కువ ఉత్పత్తివలన సంపాదించుకొనేదీ మఱికొంత కేవలం అదనంగా ముట్టేదీని ఖాదీ కావలననే వారికెక్కువయితేనే తప్ప, తన పనిలో ఏవిధమైన అభివృద్ధీ చూపలేని వడుకు మనిషి యెవ్వరూ, అదనంగా సంపాదించుకోవడానికి సావకాశం లేదు.

13. ఈ చివరి పేరానుబట్టి సంఘాలు మొట్టమొదట్లో తేలిక షరతులమీద, కొత్త యంత్రాలనుగానీ వాటి భాగాలనుగాని సరఫరా చేయవలెనని తేలుతూన్నది. చాలా

సందర్భాలలో మాలు (చక్రానికి కట్టిన తాడు) లోను కదురు లోను చేసిన మార్పులవలన ఉత్పత్తియొక్క పరిమాణము నాణ్యముకూడా హెచ్చు కాగలవు.

కార్యకర్తలు తామొక దివ్యసందేశాన్ని నిర్వహిస్తున్నామనీ, సగమాకలితో అన్నం తినీ తినక ఉండే కూలీల యొక్కయు కర్మకారులయొక్కయు విశాలకుటుంబములో తాముకూడా అల్పాంశములనునీ గుర్తించినప్పుడే ఈ షరతులన్నీ పరిపూర్తి కాగలవు.

పత్తి పండించే విషయాన్నిగూర్చి నేను తాకనే లేదు. ఇంతవరకూ అంగడికోసం ఉత్పత్తిచేయబడుతూన్న ఖాదీని గూర్చి మాత్రమే నేను చర్చించాను. స్వయంసంపూర్ణ ఖాదీకి కొన్ని ప్రత్యేక నియమాలు వర్తిస్తవి. వడికేవారు తమంతటతాము దాదాపు ప్రతి గ్రామంలోనూగూడా పత్తి పండించుకోనియెడల అది ఎప్పుడూ జయంపొందదు కనీసం స్వయంసంపూర్ణ ఖాదీకి సంబంధించినంతవరకైనా పత్తిపంట వికేంద్రీకరణ విధానంలో జరగాలని దాని అర్థం. ఇందుకుగాను ఈ ఉద్యమానికి సంబంధించిన గ్రామాల జనాభా కావాలి మనకు. ప్రతి వడికే మనిషికి నేసే మనిషికి పత్తి పండించుకోవడానికి తగిన చారెడు నేలకూడా లేకపోవడమే యిందుకు కారణం. స్వయం సపూర్ణఖాదీ చాలా పెద్ద సమస్య. అందుకోసమే అ.భా.చ.సం. యొక్క ఉనికి అవసరం. చెప్పతగినంతగా ఈ రంగంలో అది ఇంకా ఏమీ పని తాకనే లేదు.

—హరిజన్, 27-7-1935

# 149

## స్వయం సంపూర్ణ ఖాదీ

ఖద్దరు నిర్మాణమునందలి ప్రతి దశలోనూ కష్టపడి పని చేయు నట్టినీన్నీ, చేయజాలనట్టినీన్నీ నగరవాసి కొఱకు ఉత్పత్తి చేయబడే ఖాదీ నియమాలకున్నూ, స్వయం సంపూర్ణ ఖాదీ విజయము నను ప్రోత్సహించే నియమాలకున్నూ భేదం ఉన్నది. అమ్మకంకోసం యేర్పడిన ఖాదీ సందర్భంలో విత్తనాలు చల్లడం, పత్తి ఏకడం మొదలుకొని నేసేటంతవరకూకూడా —ముఖ్యంగా మజూరీలు సమంగా చేయబడినప్పుడుగాని లేక దాదాపు సమంగా ఉన్నప్పుడు కానీ— అన్ని పనులనూ తేలికగా పంచి-ఈయవచ్చును. సహకారవిధానం వల్లనూ తనిఖీకింద ప్రత్యేక పరిజ్ఞానంతో జరిగేపనివల్లనూ ఎక్కువ మంచి ఫలితాలు కలుగుతవి. కాని ఒక వస్తువు, స్వోపయోగంకోసం ఉత్పత్తిచేయబడుతూన్నప్పుడు, అన్ని దశల లోనూ ఒకే కుటుంబంలోనివారుగానీ లేక ఒకే జనంకానీ ఎంత ఎక్కువ శ్రద్ధవహిస్తే అంత ఎక్కువకాలమూ అంత ఎక్కువ డబ్బూ కలసివస్తుంది. కొంతకాలము వరకూ అయినప్పటికీ తనదీ అని చెప్పుకోతగిన కొద్ది పొలం కలిగి ఉన్నమనిషి అందులో ప్రతిరోజూ పనిచేస్తేయెడల, కేవలం తాను చేసిన కష్టానికి ప్రతిఫలంగా లేక తన తీరిక సమయంలో చేసినపనికి ప్రతిఫలంగా, ఆయనకు కావలసిన ఖాదీ లభిస్తుంది. దాదాపు ఉచితంగా ప్రతిమనిషీ తన ఖాదీని తానెలా తయారుచేసుకోగలడనో నిరూపించేటందుకు తగిన శిక్షణ లేక ఉపదేశం మాత్రమే ఆయనకు కావలసింది. కార్మికులకు మజూరీ ఈయవలసి ఉంటేనూ, ఆ మజూరీ

యొక్క ప్రమాణము, కాలమునుబట్టి సమంగా ఉండేయెడ
లను పెట్టుబడిలో చాలా ఎక్కువ భాగం వడుకు పనికే కర్చవు
తుంది. ఒక గజం బట్టకు కావలసిన నూలువడికేటందుకు,
వడుకు పనికి ముందుగానీ, తరువాత కానీ చేయవలసిన ప
పనికంటెనూకూడా ఎక్కువకాలం పడుతుంది. ఒక మనిషి
తనకు తానే పత్తి విత్తులు తీసుకొని, ఏకుకొని, వడుకుకొన్న
యెడల, దాదాపు మిల్లు బట్టతో సమానమైన ఖరీదుకే అతని
ఖాదీ గిట్టుబాటవుతుంది. ఈ పనులన్నీ అతను తేలికగా
చేసుకోగలిగినవేకూడా. ఒక వస్తువుయొక్క విలువ దాని
ఉత్పత్తికయ్యే శ్రమయొక్క విలువనుబట్టి ఉంటుంది.
కాబట్టి వాడుకొనే మనిషినుండియే పూర్తిగా ఆ శ్రమ
లభించినప్పుడు, పైగా అతని తీరిక సమయంలోనే ఆ శ్రమ
చేయబడినప్పుడు, ఖరీదు దాదాపు యేమీ ఉండదనే చెప్ప
వచ్చును. స్వయంసంపూర్ణ ఖాదీ పూర్తిగా మధ్య బేర
గాడిని తొలగిస్తుంది. సగమాకలితోనున్న లక్షలాది ప్రజల
ఆదాయాన్ని స్వతంత్రంగా పెంపొందించడానికిదే సులభతమ
మైన మార్గం. అయితే గ్రామస్థుడెన్నడైన స్వయంసంపూర్ణ
ఖాదీకి కృషిచేస్తాడా? ఆ! చేస్తాడు! ప్రత్యేక శాస్త్రీయ
నైపుణ్యంతో కూడిన విశ్వాసం మనకు ఉన్నట్లయితేగానీ
పర్వతాలను కదిలించగలిగిన సజీవ విశ్వాసంతో కర్మ
కారుడు నిర్వహించవలసిన పనిలో అతనికవసరమైన నైపుణ్యా
మును మనం కలిగించగలిగితేగానీ అతను దానికి కృషి
చేస్తాడు. కాని అది కష్టమైన పని. అయితే కష్టమైనా
తేలికయినా ఇంతవరకు పెద్ద ఎత్తునగానీ, సంఘటిత
ప్రమాణంలోగానీ, చక్కగా ఆలోచింపబడిన ప్రణాళిక
ప్రకారంగానీ యెన్నడూ అది ప్రయత్నించబడలేదు.
గ్రామస్థులు తమ బట్టను తాము ఉత్పత్తిచేసుకొని, తమకు

కలిగినది కాస్తా గ్రామాలనుండి అనవసరంగా పోకుండా అరికట్టవలెనని బోధించేటందుకు చక్కగా సంకల్పింపబడిన అఖిలభారతోద్యమము లేనిచో అ.ఖా.చ.సం. యొక్క ఉనికికి అవసరమే లేదు. స్థానికోత్పత్తి స్థానిక వినియోగముల ద్వారా గ్రామాలలో అందరూ ఖద్దరు వాడుకొనేటట్లు చేయడమే ఖాదీ సందేశమని ఇటీవల ఈ పత్రికలో నేను వక్కాణిస్తూవచ్చాను. ప్రతి గ్రామంలోనూ, ఇదివరకెన్నడూ పత్తి పండించడం యెఱుగని గ్రామాలలోకూడా, పత్తిపంటను ప్రోత్సహించటముతో ఈ పని ప్రారంభంకావాలి. ప్రత్తి పంట విషయంలో వికేంద్రీకరణం లేకుండా గ్రామాలలో సార్వజనీనోత్పత్తి సాధ్యంకాకపోవచ్చును. భూసారాన్ని ఉచితరీతిని నైపుణ్యంతో పరివర్తనం పొందేటట్లుచేసి ఎడారులను ఉద్యానవనాలుగా మార్చిన ప్రత్యక్షతారాకాణాలెన్నో మనకు తెలుసును. కాబట్టి స్థానికోపయోగంకోసం ప్రతి గ్రామంలోనూ కావలసిన పత్తి పండించుకోవడం అసంభవంగా ఉండకూడదు. ఇందువల్ల గ్రామస్థులకు ఖాదీ చౌక కావడమే కాక, ఖాదీయొక్క మనుగడ కూడా పెంపొందుతుంది. నూలుయొక్క బలంకానీ ఉత్పత్తి పరిమాణంకానీ, ఉపయోగింపబడిన పత్తి రకాన్నిబట్టీ, ఏరడం, శుభ్రం చేయడం, విత్తులుతీయడం, ఏకడం, వడకడం—ఈ పద్ధతులన్నిటినిబట్టీ ఉంటుందని స్పష్టంగా అనుభవంవలన నిరూపింపబడినది. సుప్రసిద్ధమైన ఢాకా మజ్లినును ఉత్పత్తిచేయడానికి కావలసిన సాధనసామగ్రిని 'శబ్నం' లేక ప్రాతస్తుషారమువలె ప్రత్యక్షమయ్యేవరకూ అన్ని పరిణామదశలలోనూ విపులసున్నితంగా వాడవలెను.

— హరిజన్, 3-8-1935

# తీవ్ర సమస్య

అందరు కర్మకారులకు, ముఖ్యంగా—మన మిష్టాడు పెద్ద ఎత్తున వ్యవహరిస్తున్న వడుకువారికి, ప్రమాణ వేతన నిర్ణయమును గూర్చి గాంధీజీ వ్యాసము వ్రాసిన నాటినుండీ ఖాదీ ఉత్పత్తి, నిర్మాణం సంగతి తీవ్ర సమస్య అయింది. సలహా కోసం వచ్చిన వర్కింగు కమిటీ సభ్యులకు సావకాశ మీయడానికే కొన్ని సమయాలలో గాంధీజీ గునుస్తుండే వారు. కాని నేటి ఈ సమస్యను గూర్చి చర్చించడానికి వచ్చినవారి విషయంలో ఆయన ఎన్నడూ అలా చేయ లేదు. కాంగ్రెసు అధ్యక్షుడు, సర్దార్ జయరాందాస్, జమ్నాలాల్జీ, డాక్టరు పట్టాభి సీతారామయ్య, శ్రీ గంగాధర రావు దేశపాండే, ఆచార్య కృపలానీవంటి వర్కింగు కమిటీ సభ్యులు సమావిష్టులై ఉన్నారు. వీరిలో కొంతమంది గాంధీ సేవా సంఘ సభ్యులు. అందఱికీ ఖాదీ, కాంగ్రెసు కార్యక్రమంలో ప్రధానాంశమే. వీరందరూ ఉండగా చర్చ రేకెత్తి బహు ప్రయోజనకారిగా పరిణమించింది. ఆయన మనస్సు ఎలా పనిచేస్తున్నదో గాంధీజీ వారికి వివరించారు. దాని ఫలితంగా ఈ ప్రశ్నకు ప్రాధాన్యం వచ్చింది. చిన్న చిన్న విషయాలు నిప్పురవ్వల వలె ఆయన మనస్సును హృదయాన్నీ దహింపసాగినవి. న్యాయం జరిగేదాకా ఆయనకు శాంతి లేకుండపోయింది. ఆ చిన్న విషయాలివి (1) సాక్షిలోని వడుకు నేత కేంద్రాన్ని దర్శించిన ఒకానొక సన్నిహిత సహచరుడు, రోజు రోజంతా

రాటాలు తిప్పి వడికేవారికి గంటకు రెండు దమ్మిడీలకంటె ఎక్కువ ముట్టడంలేదని తెలుసుకోవడం, (2) భాండారం నుండి ఒకానొక పేదవాడు ఒక ఖాదీ బట్ట కొనుక్కొంటే అది ఒకటి రెండు ఉతుకులకే చినిగి పీలికలైపోయింది. ఈ రెండు విషయాలను గూర్చి వెంటనే విచారణలు జరిపించి ఆయన నిజమని తెలుసుకొన్నాడు. దరిద్రనారాయణను సేవించడానికి సమానంగా ప్రమాణం తీసుకొన్న ఖాదీ కార్యకర్తలందటిమధ్యా నిరంతరం విసుగుపుట్టించే వివాదాలు కూడా, అన్ని చిక్కులకూ వాణిజ్య ఖాదీయే మూలమని క్రమాభివృద్ధి పొందుతూన్న ఆయన విశ్వాసాన్ని ధృఢ పఱచినవి. సహజంగా ఆయనకు తోచిన ఆ విషయమును ప్రమాణవేతనములను గూర్చిన ఆ ప్రసిద్ధ వ్యాసంలో తక్షణం ప్రకటించారు.

బుద్ధిపూర్వకంగా గానీ లేక తెలిసి ఉండికాని జరిగే అన్యాయంకాదది. పనిలేనివారికి పని చూపించే అభిప్రాయంతోనే ప్రతివిషయమూ జరుగుతూన్నది. ఖరీదులు తగ్గించవలెనని త్రొక్కులాడడం, మిల్లు బట్టతో అసహజమైన పోటీకి దిగడంవలన తటస్థిస్తూన్నది. కాని న్యాయంచేయవలెననే మన తొందరలో తెలియకుండానే వడికేవారికి కొంత అన్యాయం చేశాము. ఇక ఈ చర్చలలో పాల్గొన్న మిత్రులకు; ఈ న్యాయాన్ని కాదని చెప్పవలెననే ప్రయత్నం లేదు సరికదా, కోరిక కూడా లేదు. వారు చెప్పినదంతా ఆచరణలో కష్టాలు కలవని మాత్రమే. ఒకటి ఎక్కువ ఖరీదుల వలన ఖాదీ అమ్మకం తగ్గిపోయిన కారణంగానూ, రెండు, కఠినమైన పరీక్షలు పెట్టిన కారణంగానూ, వేలకొలదీ పనిలేకుండా పోరా? 'ఇప్పటి చాలీ చాలని మజూరీకోసం బీహారులో షుమారు ఐదు వేలమంది స్త్రీలు రోజుకు పది మైళ్లు

నడుస్తున్నారు. మనమింకా ఎక్కువ ఖాదీ అమ్మగలిగిన యెడల ఇంకా ఎక్కువ మంది వస్తారు. ఖాదీని కోరేవారు లేకపోయినట్లయితే ఈ పేదరాంధ్ర గతి యేమిటి? ఇది ముఖ్య ప్రశ్నలలో ఒకటి. 'నిజమే! బెంగాలు గ్రామాల లోనూ దక్షిణ హిందూస్థానంలోనూ కూడా పరిస్థితు లిలాగే ఉన్నవని నాకు తెలుసును. అయితే మీ ప్రతిపాద నను నేను ప్రతికూలంగా పెడతాను. ఇప్పుడు మీరిస్తున్న రెండు దమ్మిడీలకు బదులుగా గంటకు ఒక దమ్మిడీయే ఇచ్చా రనుకోండి. అప్పుడి 5,000 మంది ఆడవాళ్లకు బదులుగా 10,000 మందిని నియమిస్తున్నారుగదా? ఈ దిక్కులేని ఆడవాళ్లు ఆ శాస్త్రకీ లోబడి అంగీకరించారనుకోండి, మీరు ధైర్యంగా ఆ పని చేయగలరా? మీరు చేయలేరని నే నంటున్నాను. అనగా మీరు దాటిపోవడానికి వీలులేని ఒక హద్దు నిర్ణయించవలసి ఉన్నదని అర్థం. కావలసి ఉంటే దానికి మీరు 'గత్యంతరం లేని కనీస వేతనం' అని పేరు పెట్టుకోండి. ఆ కనీస వేతనమును నిర్ణయించవలసి యున్నయెడల ఒకేసారిగా యెందుకు నిర్ణయించివేయ కూడదు? ప్రస్తుతం కొంతమంది ఉత్పత్తిదారులకు నష్టం కలిగితే కలగవచ్చునుగాక. కొనేవారి సంఖ్య పరిమితంగా ఉండి ఉత్పత్తి చేసేవారి సంఖ్య అపరిమిత గా ఉన్నంత వరకు, కొంతమంది ఉత్పత్తిదారులను మీరు వెళ్లగొట్టవలసి వచ్చే మాట నిజమే. ఈ పేదరాంధ్రకు కనీసం బతికే టందుకు తగిన మజూరీ ముట్టేటట్లుగానైనా, బుద్ధిపూర్వకంగా తగినంత ఎక్కువ కనీస వేతన మెందుకు నిర్ణయించరు? లేని యెడల ఆ బుద్ధిపూర్వకమైన ఈ స్వార్థోపయోగమునకు (Exploitation) అంతుండదు. కాగితపు ఉత్పత్తిదారొకరు ఒక చోటనుండి మాకు కాగితం పంపిస్తూంటారు. ఆయన

కూలీలకు రోజుకు ఆరు కానులిస్తున్నాడు. ఆయన ఆ కాగితం ఇంకా ఎక్కువ చౌక చేయడానికి ఆశిస్తూన్నానని అంటున్నాడు. నాకింకా చౌకగా అక్కరలేదని నే నాయనకు చెపుతున్నాను,' అన్నారు గాంధీజీ.

'అయితే, ఇప్పుడు మీరు ఖాదీయొక్క నిర్వచనమే మార్చివేయగలరు. అది ఇక చేతితో వడికి చేతితో నేసిన బట్టగా ఉండదు. ఒక నిర్ణీతమైన మజూరీతో చేతితో వడకబడి, చేతితోనే నేయబడిన బట్ట' అని ఒక మిత్రుడడ్డుతగిలాడు.

'నిస్సందేహంగా, ఇంత ఆలస్యంగా ఈ సంగతి మీరు కనుకొన్నందుకు విచారపడుతున్నాను'.

'అయితే వడకడం ఒక ఉప వృత్తి అని ఇన్ని యేళ్ల నుండీ ప్రపంచానికి చెపుతున్నాము. ఇది ఒకరి తీరిక సమయంలో మాత్రమే చేయబడుతూన్నది'.

'అవును, కాదు. రోజురోజంతా పనిచేసేవారు వేల కొలదీ ఉన్నారని నాకు తెలుసు. వారికిది ఉప వృత్తి కాదు. ప్రధాన వృత్తే అవుతుంది. అది కాకపోయి నప్పటికీ కూడా, ఇతరులకు మీరు ఒక గంట పనికి సాధారణంగా యేమి యిస్తున్నారో అదే వీరి కొకగంట పనికెందుకీయరాదు?'

'గుంటూరు జిల్లాలోని కొన్ని ప్రాంతాలలో, వడకడం వలన కంటె ఎక్కువ కూలి దొరుకుతూన్న కారణంచేత ప్రజలు వడ్లు దంచే పనికి పూనుకొంటున్నారన్న సంగతి మీకు తెలుసునా?'

'నాకు తెలుసును. మీరు నా వాదాన్ని బలం చేస్తున్నారు. వారి కేపనిలో కూలి ఎక్కువ దొరికితే ఆ

పనిచేసే వారు నిశ్చయంగా కోరుకొంటారు. కనుక, ఏదే యితర కూలితోనైనా సరే సరిపోయే కూలి ఇచ్చి నూలు వడికే మనిషిని ఎందుకు ఉన్నతికి తీసుకొని రారు ?'

'కార్యాచరణలో చాలా పెద్ద కష్టాలున్నవి. మీ పరతులకు అంటి పట్టుకొని ఉండేటట్లుగా ఈ వడికే మనుష్యులను మీరు ప్రోత్సహించలేరు. వారికొక క్రమమైన రిజిస్టరుండాలంటారు. వారిని ఒక ప్రత్యేక నంబరు ఒక ప్రత్యేక సమత్వం కలిగిన నూలు వడకాలంటారు ! ఇదంతా ఎలా కుదురుతుంది ?'

'ఈ చిక్కులన్నిటినీ జయించాలి. చాలా కాలం వరకు ఈ దీర్ఘవ్యథతో కూడిన కథలు వస్తూనే ఉంటవని నాకు తెలియదా ? వడికేవారిని తమకు కావలసింది తాము వడుకుకొనేటట్లు చేయు లేకుండా ఉన్నామని కొందరు, మన కోరికలకు వారిని కట్టుబడి ఉండేటట్లు చేయలేకుండా ఉన్నామని కొందరు చెపుతూనే ఉంటారు '

'వారు మన నియమాలకు కట్టుబడి ఉంటారనుకోండి. వారికి మనం ఇంకా మంచి యంత్రాలు, మంచి కదుళ్లు యిస్తాము. వారంతట వారే రెట్టింపు పని చేసి రెట్టింపు మజూరీ పుచ్చుకొంటారు.'

'అది వారంతట వారే చేసుకోగలరు ; అందులోను గొప్పతనం లేదు. ఎక్కువ ఉత్పత్తి చేస్తే ఎక్కువ సంపాదన వస్తుందనే మాట బాగా తెలిసిన సంగతే. కాని మనం వారికి నిరాకరించిన న్యాయం విషయంలో వారికి మనం ఏమి చేయదలచుకొన్నాము ?'

'అలా కాదు' అని గాంధీజీ ముగిస్తూ యిలా అన్నారు. 'ఖాదీ మిల్లు బట్టతో పోటీ చేయవలసి ఉన్నదనే మాటను

మనం మఱచిపోవాలి. మిల్లు బట్ట మిల్లు బట్టే, ఖాదీ ఖాదీయే. మిల్లు బట్ట ఉత్పత్తిదారు ఎప్పుడూ దానిని చౌక చేయడానికి శ్రద్ధ వహిస్తాడు. మనం న్యాయంకోసం సరియైన కూలి ఈయడంకోసం శ్రద్ధ వహించాలి. కాబట్టి, ఈ రెంటికీ మధ్య పోలిక ఉండడానికే వీలు లేదు. ఆచరణలోని కష్టాల విషయంలో మన సిబ్బందిని తగ్గించు కొందాము. మన ప్రకటనలను ఆపివేదాం. పైవేటు ఉత్పత్తిదార్లను మనం ప్రోత్సహించవద్దు. ఖాదీకి కట్టుబడి ఉంటామనేవారికిది పరీక్ష కాబోతూన్నది. తమకు కావలసిన ఖాదీ వారు ఉత్పత్తి చేసుకొనైనా చేసుకోవాలి. లేదా మన సోదరీసోదరుల బ్రతుకు తెఱువుకు కావలసిన కూలి ఈయడానికి తగినట్లు ఖరీదు పెట్టనైనా పెట్టాలి. ఖాదీధారులందరికీ ఇది ఆత్మ పరిశుద్ధతకు సంబంధించిన సమస్య. దరిద్ర నారాయణ సేవయే మన సందేశమని మనం మఱవకుందుముగాక ! కష్టాలుండవచ్చును. క్రమంగా వాటిని మనం పరిష్కరించుకోవాలి.'

వడికేవారి మజూరీలలో భేదాలున్నప్పటికీ, ఎక్కువ మజూరీలతో, అవకాశమున్న అన్ని చోటులలోనూ ఈ నూతన ప్రయత్నం ప్రారంభింపబడవలనని మొత్తం మీద అందఱూ అంగీకరించినట్లు కనిపిస్తుంది.

—హరిజన్, 10-8-1935

# బొంబాయి ఖాదీ భాండారం

అఖిల భారత చరఖా సంఘంవారి దుకాణాలన్నిటిలోకీ బొంబాయిఖాదీ భాండారం మిక్కిలి పెద్దది. అది యే ఒక వ్యక్తియొక్క సొత్తూ కాదు. దరిద్రనారాయణయొక్క ప్రాతినిధ్యం, ప్రాతినిధిక ధర్మకర్తయైన అఖిల భారత చరఖా సంఘము నకది చెందిఉన్నది. కొంతమంది మధ్యతరగతులవారికది గౌరవ ప్రదమైన ఉద్యోగ మిప్పించడాని కాధారంగా ఉన్నప్పటికీ, అంతమాత్రంతో వారి కుద్యోగాలిప్పించే సంస్థగా మాత్రం దానిని భావించరాదు. నూతన విధానం ఆచరణలోకి వస్తూన్న కారణంచేత అందుకనుగుణంగా సిబ్బంది తగ్గింప బడుతూన్నది. శ్రీ జెరాజనీయొక్క అద్భుత కల్పక ప్రతిభా విశేషమువలన కనిపెట్టబడిన నమూనాల ప్రకారం, భారత దేశపు వివిధ భాగములనుండి వచ్చిన ఖాదీ అమ్మకాన్ని అభివృద్ధి చేసేటందుకు ఇంతవరకూ అసాధారణ ప్రయత్నాలు జరుగుతూవచ్చినవి. దరిద్ర నారాయణ దృష్టితో సాధింప బడిన ఫలితాలకు యెంతమాత్రమూ అనుగుణంగా లేని సిబ్బందీ ఖర్చులకివి సావకాశం కల్పించినవి. అంతేకాక, ఖాదీని స్వయంపోషకంగానే చేయడం లేక వారి రాష్ట్రాలలో ప్రజాభీష్టకరంగా చేయడం కార్యకర్తల ప్రధాన కర్తవ్యమై యుండగా, వారి దృష్టి అన్యథాయత్తమైనది. నిజమైన రాష్ట్రోద్యమం లేనిదే ఖాదీయొక్క సార్వజనీన సందేశం పరిపూర్తి కాజాలదు. అసంఖ్యాకములైన ఉత్పత్తి కేంద్రాలలో వీలైనంతవరకు దానిని పంపిణీ చేయ గలిగినప్పుడే అది సాధ్యమవుతుంది. తమంతట తామేప్రతి

ఉత్పత్తి చేసుకోని బొంబాయి వంటి పెద్ద నగరాలకు ఎప్పుడూ కొంత ఖాదీ కావలసివచ్చే మాట నిజమే. అసాధారణ ప్రయత్నమేమీ లేకుండానే అట్టి న్యాయమైన అవసరాన్ని తీర్చవచ్చును. నగరంలోని అంగళ్లలో మనకు కనిపించే మనోజ్ఞములైన రకాలు, నాగరిక జనం యొక్క వివిధ అభిరుచుల కనుగుణంగా చర్ఖా సంఘం చేస్తూన్న కృషి వలన మాత్రమే సాధ్యమవుతూన్నవి. కాని, ఖాదీ తన సందేశాన్ని నిర్వర్తించవలెనంటే, ఉత్పత్తి కేంద్రాల వైపుకు తన దృష్టిని మరల్చవలసిన తరుణం వచ్చింది. అవి చాలా తక్కువ. ప్రతి గృహము, వండిన అన్నమునకు ఉత్పత్తి కేంద్రమయినట్లే, ప్రతి యిల్లూ కాకపోయినా ప్రతి ఊరూ ఒక ఖాదీ ఉత్పత్తి కేంద్రం కావాలి. పుస్తకాల లోని అర్థ శాస్త్రమునకు వంట యింటిలోని అర్థ శాస్త్రము నకూ పూర్తిగా భేదం ఉంది. అలాగే ఖాదీ అర్థ శాస్త్రం కూడా. ఇప్పుడుద్దేశింపబడిన మార్పువలన, అ.భా.చ.సం. చే గానీ దాని పక్షానగానీ నడపబడుతూన్న పెద్ద పెద్ద భాండారములలోని సిబ్బందిని చాలా వరకు తగ్గించవలసి వస్తుంది. అంతేకాక ధ్రువపత్రములు పొందిన వ్యక్తి ఉత్పత్తిదారులు పూర్తిగా పోకపోయినా, వారి సంఖ్య కూడా తగ్గిపోవలసి వస్తుంది. అది అంతా ఎలా జరుగు తుందో ఇప్పుడప్పుడే చెప్పడం కష్టం. ఆ ప్రత్యేక కార్యం కోసం భారత దేశమంతటా సంచారం చేస్తూన్న శంకరలాల్ బ్యాంకరు ఈ పనిని జాగ్రత్తగా నిర్వర్తించే టందు కాలోచిస్తూన్నాడు.

కాని ఈ లోగా ఖాదీ ఖరీదులు పెరగవలెననీ, ఖాదీ కార్యకర్తలలో ఇంకా ఎక్కువగా శాస్త్రీయ నైపుణ్యాం పొందింపబడవలెననీ, ఖాదీ ఉత్పత్తి పంపిణీలతో

సంబంధం కల అన్ని తరగతులవారిలోనూ ఇంకా ఎక్కువగా స్వార్థ త్యాగబుద్ధి రేకెత్తింపబడవలెననీ, దరిద్ర నారాయణ యందభిమానంగల ఖాదీ ప్రియులందరికీ నేను ముందుగా చెపుతున్నాను. ఖరీదులు క్రమక్రమంగా తగ్గిపోతూన్నవని చూపించడంలో ఖాదీ అంగళ్లు పట్టరాని సంతోషాన్ని వెల్లడిస్తూన్నవి. మొట్ట మొదటి మొద్దు ఖాదీ బట్ట, గజం ఒక రూపాయికిపై చిలుకు నేను అమ్మిన కాలం నాకు జ్ఞాపకం ఉంది. ఈ నాడటువంటి మోటు ఖాదీ, గజం రెండణాలకు కూడా అమ్మరు. అసలిది ఖాదీ దుకాణాలలో అమ్మకానికి లేనే లేదు. ప్రతి ఖాదీ శాఖలోనూ సమర్థత క్రమ క్రమంగా ఎక్కువ కావడం చేతనే ఖరీదులలో ఈ తగ్గుదల జరిగింది. కాని వడికే మనిషికి నష్టదాయకంగా ఖాదీ ఎక్కువగా కొనబడు తూన్నది. ఇప్పటి దరిద్రనారాయణయొక్క భౌతిక స్వరూపం వడికే మనిషి అఖిల భారత దేశంలో అత్యల్ప వేతనం పొందుతూన్న శ్రమజీవి. నిరంతర నిరుద్యోగ పీడితులైనవారికి ఎంత తక్కువ వేతనంతోనైనా, గంటకు ఒక దమ్మిడితోనైనప్పటికీ, అ.భా.చ.సం. పెద్ద ఎత్తున పని చూపించగలిగి ఉండడం మంచిదే. కాని అది తన ధర్మ కర్తృత్వమును సక్రమంగా నిర్వహించవలెనంటే, వడికే మనిషికి కనీసం జీవనానికి కావలసినంతవరకైనా భృతి చూపించాలి. ఆమె వడికిన గంటకు వచ్చే మజూరీ, ఆమె రోజుకు ఎనిమిది గంటలు పనిచేసినట్లయితే ఆమె జీవనానికి కావలసిన మొత్తానికి దామాషాగా ఉండాలి. వడికేవారి మజూరీల ప్రమాణం హెచ్చు కావాలన్నది ప్రస్తుతాంశమైనంతగా వారి జీవనానికి ఎంత మొత్తం కావాలి అనేది ప్రస్తుతాంశం కాదు. ఇంతటినుండీ, తాము

సమీక్ష చేస్తూన్న కాలంలో ఖాదీ ఖరీదు లెంతవరకు తగ్గిపోయినవో నిగూపించడం కాదు అ.ఖా.చ.సం. వారి నివేదికలో చూపవలసింది ; వడుకు మజూరీలు ఎంతవరకు హెచ్చింపబడినవో చూపడంలో వారు గర్వపడాలి. ఒక గంట పనికి నేసేవారి మజూరీతో సమంగా వడికేవారి మజూరీ కూడా వుంటేనే తప్ప నాకు సంతృప్తి లేదు. అ.ఖా.చ.సం. సంతృప్తిపడకూడదు. కోనే ప్రజలు కూడా ఆ గొప్ప ధర్మకర్తృత్వ సంస్థకు పేరొక్కనబడని సభ్యులనీ, వడికేవారు వారి రక్షణకింద వున్నారనీ జ్ఞాపకం ఉంచుకోవాలి. ఒకర్క సారి ఆ సంబంధం గుర్తింపబడి నట్లయితే ఖాదీ ఖరీదు రేఖాగణిత నిష్పత్తిలో క్రమంగా పెరిగిపోవడంలో యేమీ కష్టముండదు. ప్రజ లెప్పుడూ ఖాదీకి ఎక్కువ ఖరీదు పెట్టరని అనుకొనే సంశయాత్ము లైన ఖాదీ కార్యకర్తల భయమును పోగొట్టేటందుకు ప్రతి ఖాదీ ప్రియుడు తన కర్తవ్యమును తాను గుర్తించగలడా ?

—హరిజన్, 10-8-1935

# 152

# స్వయం సహాయక ఖాదీ

బీహారులోని మాధేపూరు కేంద్రమునుండి, 10 గ్రామాలలో 19 మంది వ్యక్తులు తమ నూలుతో స్వయోపయోగం కోసం 166½ గజాల ఖాదీ బట్ట నేయించుకొన్నారని, 22 గ్రామాలలోని 82 మంది వ్యక్తులు తమ నూలును 709 గజాల ఖాదీ బట్టకు మార్చుకొన్నారనీ వార్త వచ్చింది. ఇది శుభవార్త.

స్వయంగా నూలు వడకుకొనేనిమిత్తం పత్తి పండించడానికి, పత్తి విత్తనాలను పంచిపెట్టి చల్లించినట్లుగా మలబారులోని పయ్యనూరు, నీలేశ్వరములనుండి మరొక శుభవార్త వచ్చింది. స్వయంగా నూలు వడుకుకొనేటందుకు, పత్తి పండించడం దేశంలో అందరికీ అలవాటైతే, అస్సాములోని గృహములలో పట్టుకు సంబంధించిన అన్ని పనులనూ నేర్చి ఉన్నట్లుగా, ఇళ్లలో పత్తి పండించుకొనేవారుకూడా, దానికి సంబంధించిన అన్ని పనులనూ నేర్చుకొనివున్నట్లయితే, వారు తమ తీరిక సమయాలలో చేసిన పనికే వారికి కావలసిన ఖాదీ లభిస్తుంది. పట్టును సార్వజనీనంగా చేయడానికి వీలు లేదు. పత్తి అలా చేయబడడానికి వీలుంది. ఒకప్పుడది దాదాపు అలాఉండికూడా. ఈ పద్ధతివలన జాతీయాదాయం చాలావరకు పెంపొందుతుంది. అంతేకాక, ఈ దేశంలో పూర్తి పనిలేని లక్షలాది ప్రజలకు పని చూపించేటందుకుకూడా నిర్దుష్టమైన కార్యక్రమమది.

ఈ ప్రతిపాదన చెప్పడానికి తేలికగా ఉన్నప్పటికీ ఆచరించడంలో చాలా కష్టం ఉందనేమాట నిస్సంశయం. కాని యిది ఏవిధంగానూ అసంభవం కాదు. ఇందుకు పెద్ద పెట్టుబడి అవసరంలేదు. దీని పద్ధతులను నేర్చుకోవడంకూడా తేలికే. ఇందుకు కావలసిన పరికరములిదివరకే గ్రామాలలో ఉన్నవి. లేకపోతే త్వరితంగా చేయించుకోవచ్చును. అయితే కొత్తపనులు చేయవలెననీ తెలివి ఉపయోగించవలెననీ కోరిక లేకపోవడమే అన్నిటిలోకీ పెద్ద ఆటంకం. తరతరాలనుండీ తప్పనిసరిగా వస్తూన్న సోమరితనం, దాని ఫలితంగా తటస్థించిన క్షుద్బాధా, నిరాశకు, దౌర్బల్యానికి, జీవించవలెననేకోరికకూడా లేకపోవడానికీ కారణభూతములైనవి. జీవితేచ్ఛ లేకుండేవరకూ కూడా నిరాశపొందడం కంటె ఎక్కువ విపత్తు ఏ ప్రజకైనా ఇంకేముంటుంది ? కాని నిరాశ చెందనివారు, తమ ధర్మ నిర్వహణమునందు తీరని విశ్వాసంతోనూ, పూర్వంకంటె ఎక్కువ శ్రద్ధగానూ పని చేయవలసి ఉన్నది. వారి విశ్వాసం నిశ్చయంగా కొండలను కూడా తరించగలదు. ఎక్కువ శ్రమా నైపుణ్యమూ అవసరం లేకుండానే తగినంత అన్నం, బట్టా ఉత్పత్తిచేసుకోవడానికి వీలున్న ఈ ప్రఖ్యాత దేశంలో నిరాశపొందవలసిన అవసరం యేమీ లేదు.

కాని ఈ ఆశ, నిరంతరాభివృద్ధి పొందుతూన్న ఖాదీ శాస్త్ర విజ్ఞానంతోకూడిన అభ్యుదయ కార్యాచరణముగా మార్పు చెందాలి. అప్పుడప్పుడూ కేంద్రసంస్థ వారిస్తూండే ఉత్తరువుల కనుగుణంగా కార్యకర్తలు నడుచుకొంటూండాలి. అంతేకాక తాము సేవించదలచుకొన్న గ్రామస్థులు చెప్పే అభ్యంతరాలనుకూడా ముందుగా గ్రహించగలిగిఉండాలి.

అందుకోసం వారు గ్రామస్థులతో అత్యంత సన్నిహిత సంబంధం కలిగిఉండాలి. సానుభూతితోను విశ్వాసంతోనూ గ్రామస్థులను సమీపించాలి. గ్రామస్థులకేదో ఉపకారం చేయడానికి వచ్చినట్లుగా వారికి కనపడకూడదు. కాని తమ ధర్మనిర్వహణమును ఇంతవరకూ అశ్రద్ధ చేసిన స్వచ్ఛంద సైనికులవలె కనపడాలి. అత్యంతావశ్యకమైన ఈ ప్రాథమిక నియమాన్ని తగినట్లు నిర్వర్తించినయెడల, పగటిని రేయి అనుసరించినట్లు తక్కినవన్నీ వాటంతటవే అనుసరించగలవు.

—హరిజన్, 24-8-1935

# 153

# వ్యక్తి ఉత్పత్తిదారులు జాగ్రత

ఖాదీ ఉత్పత్తిలో పనిచేస్తూన్న వడికేవారికి తదితరులకు తగిన మజూరీయడాన్నిగూర్చిన నూతన విధానం రూపొందుతూన్న సమయంలోనే, ధ్రువపత్రములు పొందిన వ్యక్తి ఉత్పత్తిదారుల విషయంకూడా తీవ్రంగా ఆలోచించవలసి వస్తూన్నది. చాలా ఎక్కువగా ఖాదీ ఉత్పత్తికావడానికి వారు బాధ్యులు. కూలీల విషయంలోనేకాక వీరి విషయంలోకూడా చర్ఖా సంఘం తన ధర్మాన్ని నిర్వర్తించవలసిఉన్నది. వారితో యేర్పాటుచేసుకొన్న ఒడంబడికలు సక్రమంగా పరిపూర్తిచేయబడాలి. అంతటితో ఆ ధర్మం పూర్తి అవుతుంది. చరఖా సంఘం యావత్తు వడికేవారి స్థితిని క్రమక్రమంగా అభివృద్ధిచేసేందుకు వారికోసమేర్పడిన ధర్మ కర్తృత్వ సంస్థ; లేక ఆ ప్రకారం నడపబడవలసిన సంస్థ. ప్రధానంగా వడికేవారి క్షేమంకోసమే వ్యక్తి ఉత్పత్తిదారులకు ధ్రువపత్రములీయబడినవి. కాబట్టి వడికే వారికి సేవచేయడంద్వారానే వారు లాభాలుపొందాలి. వారున్నూ తదితరులున్నూ వడికేవారికి నష్టదాయకంగా లాభాలు పొందుతూన్నట్లు మాకు తెలియవస్తూన్నది. అలా చేయకూడదు.

చరఖాసంఘముచే నియోగింపబడిన ఏజెంట్లతో సమాన ప్రతిపత్తిలో వారు వుండేయెడల వారికీయబడిన ధ్రువపత్రాలను ఉపసంహరించుకోవలసిన అవసరం లేదు. కాని వారలా చేసేయెడల వారి కార్యవిధానాన్ని పూర్తిగా వారు మార్చుకోవలసి ఉంటుంది. వారు తమ లాభాలను

తగ్గించుకొని సంతృప్తిపడవలసి ఉంటుంది. వారు పైగా నష్టంకూడా భరించవలసి రావచ్చును. వారు సేవిస్తూన్న వడుకువారియొక్కయు తదితర కూలీలయొక్కయు రిజిష్టరును అఖిల భారత చరఖా సంఘమువారి కోరిక ప్రకారం ఉంచవలెను. వారు చెల్లించిన వేతనములకు సాక్ష్యం చూపెట్టవలెను. వాటికి సంబంధించిన అంకెలను సేకరించి చరఖా సంఘమునకు పంపవలెను. ఇదంతా వారికి చాలా కష్టం కావచ్చును. ఖాదీ ఖరీదుల పెరుగుదలవల్ల తప్పనిసరిగా వారు పొందడాని కవకాశమున్న నష్టం, వారు భరించరానంత చాలా ఎక్కువగా ఉండవచ్చును. తామిప్పుడు పొందుతూన్న లాభాలను పొందేటందుకు, నిస్సంశయంగా కష్టపడి పనిచేయవలసిన ఉత్పత్తిదారులకు సంఘంవారి నియమాలు చాలా కఠినంగా ఉండవచ్చును. అలా అనుకొనేవారు, తమ ఖాదీ వ్యాపారాన్ని కట్టిపెట్టడాని కిప్పటినుండీ ప్రయత్నించాలి. ఖాదీ పనిని కొనసాగించవలెనని కోరేవారు సంఘంవారి యేజెంట్లతో సన్నిహిత సంబంధం కల్గించుకోవాలి. సంఘంవారి షరతులను అనుసరించడంలో ఏమాత్రం అశ్రద్ధ వహించినా ధ్రువపత్రం రద్దవుతుందని మాత్రం వారు గ్రహించాలి. లాభం వచ్చినా, నష్టంవచ్చినా, సంఘంతో వారు చేసుకొన్న ఒడంబడిక కొనసాగడానికి, 'తు' 'చ' తప్పకుండా దానికి బద్ధులై ఉండడం ముఖ్యం. కాబట్టి ఎవరి క్షేమంకోసం తాము నష్టాలను లెక్కపెట్టరో ఆ దరిద్ర నారాయణ భక్తులయిన ఖాదీ ప్రియులు మాత్రమే ఈ పని కొనసాగించాలి. తాము స్వయంగానూ తమ యిళ్లలోనూ ఖద్దరు వాడనివారు, తమ ఒడంబడిక కొనసాగుతుందని ఆశ పెట్టుకోకూడదు.

—హరిజన్, 7-9-1935

# 154
# కనీస వేతనము

మా పేరు సూచిస్తూన్నట్లుగానే, అత్యల్ప వేతనం పొందుతూన్న వడికేవారికి ప్రాతినిధ్యం వహించడమే మా ఆశయం, అనగా వారి స్థితిని అభివృద్ధి చేయడం. కాబట్టి వారిస్థితిలో క్రమాభివృద్ధిని మేము చూపించవలసి ఉన్నది. ఆనాటినుండి ఈనాటివరకు యథార్థంగా కనిపిస్తూన్న — ప్రతి ఇంట్లోనూ ఒక రాటం, ప్రతి ఊళ్లోనూ ఒక మగ్గం గానీ మగ్గాలు గానీ — అనే నా తొలినాటి సూత్రాన్ని మీరు జ్ఞాపకం పెట్టుకోవాలి. అదే స్వయంసహాయక ఖాదీయొక్క ఆదర్శం. నేను మిమ్ములను వినిపించగలిగినట్లయితే వడికేవారు తమ ఉపయోగంకోసం తమ ఖాదీని తాము తయారుకావించుకొనేటట్లు మిమ్ము చేయనిచ్చినంతగా, వారు తయారుచేసిన ఖాదీని అమ్మేటందుకు మిమ్ము చేయనీయను. గ్రామాలలో హోటళ్లు లేవు. మన చపాతీలు మనం చేసుకొంటున్నాము. అలాగే గ్రామస్థులందరూ తమ ఖాదీ తాము తయారుచేసుకోవాలి. అంతమాత్రంతో కొందఱు అదనపు ఖాదీ తయారుచేయరని కాదు. అది కావలెననేవారినిబట్టి ఉంటుంది. మన ఖాదీని కోరే నగరవాసులనుండి మనం తప్పకుండా ఆర్డర్లు తీసుకొంటాము. కూలీల రోజువారీ అవసరాలకు అనుగుణంగా గంటకెంత ఈయాలో అంతా యిచ్చి వారిచేత ఆ ఖాదీ ఉత్పత్తిచేయిస్తాం. ప్రస్తుత ఖాదీ

ఖరీదు ఇందువల్ల తాత్కాలికంగా పెరుగవచ్చును. ప్రజల పేదరికాన్ని స్వార్థంకోసం మనమిక వినియోగించుకో జాలము. ఇలా వినియోగించుకోవడం ఉద్దేశ పూర్వకమని నేనెన్నడూ అనలేదు. కడచిన పదిహేనేండ్లలో మనం చేసినదానికంతటికీ నేను సంపూర్ణ బాధ్యతవహిస్తున్నాను. మనం తప్పనిసరిగా చేశామూపని. కాని ఇప్పుడుమాత్రం మనం కొత్తతోవ తొక్కాలి. శతాబ్దాలనుండీ మనం కార్మికలోకాన్ని నిర్లక్ష్యంచేశాం. వారి శ్రమను మనం ఆజ్ఞాపూర్వకంగా పొందేటందుకు హక్కున్నట్లుగా వ్యవహరించాము. కాని ఎన్నడూ వారి కూలి వారు నిర్ణయించి చెప్పేటందుకు హక్కుందని మనమనుకోకూడా లేదు. డబ్బు మనకెటువంటి పెట్టుబడియో శ్రమ వారి కటువంటిపెట్టుబడి. వారి అవసరములను గూర్చిన భావనలలో,—అనగా వారి పని గంటలు, వారి విశ్రాంతి, వారి జీవిత ప్రమాణములనుగూర్చి ఆలోచించవలసిన తరుణం వచ్చింది. కొద్దిమందికి ఎక్కువ మజూరియిచ్చేకంటె, ఎక్కువమందికి తక్కువ మజూరీయే ఈయడం వడికేవారికి ఎక్కువ యిష్టంగా ఉంటుందని వాదించడంలో అర్థం లేదు. ఇతరులను స్వార్థంకోసం వినియోగించుకొనే ప్రతిమనిషి, ప్రతి బానిస యజమానీ ఇలాగే వాదిస్తారు. నిజానికి బానిసబంధనాలను ఆశ్రయించుకొని ఉండే దురదృష్టవంతులు బానిసలలో ఉన్నారు. అయితే వారిలో అధికసంఖ్యాకులకు వృత్తి పోయినట్లుగా అనుకొంటారని మీరెందుకు భయపడుతున్నారు? వారికి

సిఫారసు చేయతగిన ఇతరవృత్తులు లేవా మనకు? వడకడం కంటె వడ్లు దంచడంలో ఎక్కువ కూలి ముట్టుతూన్న కారణాన రెండవ దానికెక్కువ ప్రాముఖ్యమిచ్చి ప్రోత్సహించడానికి ఆంధ్రదేశంలో సీతారామ శాస్త్రి యేమీ జంకడంలేదే! మనను మనం మోసగించుకోకూడదు. వారి అవసరం మన అవకాశంగా చేసుకొన్నాము. వారి దృష్టితో మనమెప్పుడూ ఈ సమస్యను చూడనే లేదు.

—హరిజన్, 14-9-1935

# 155

# మూడు ప్రశ్నలు

శ్రీ గోపబంధు చౌధరి బారీకటక్‌నుండి వ్రాస్తూ ఈ మూడు ప్రశ్నలను పంపిస్తున్నారు :—

“1. స్వయంసహాయక ఖాదీలో మిగులు ఖాదీ ఖరీదెంత ఉండాలి?

2. ఒకానొక గ్రామస్థునికి పత్తి ఉండి తన కుటుంబానికి కావలసినవి యిచ్చేటందుకు వడికేవారు లేనియెడలను, ఆయన తన కుటుంబావసరములకోసం తన తోటి గ్రామస్థులచేతగాని లేక పొరుగు గ్రామస్థులచేతగాని తన పత్తి వడికించుకొనకోరేయెడలను మజూరీ ఎలా ఉండాలి? వాణిజ్య ఖాదీ సందర్భంలో సూచించబడిన జీవన భృతి ఇక్కడకూడా వర్తిస్తుందా? లేక పరస్పర పరిష్కారానికి వదలివేయ బడవలెనా?

3. వడికే ఆమెకు సొంత పత్తి లేదు. ఆమె బ్రతకడానికి రొక్కం కూలికోసం వడకదు. పత్తికోసం వడుకుతుంది. ఆ వడకడం కూడా తనకు కావలసిన బట్టకవసరమైనంత పత్తి సంపాదించుకొనేటంత వరకే వడుకుతుంది. అప్పుడామె మజూరీ ఎంత ఉండాలి?”

అఖిల భారత చర్ఖా సంఘంద్వారా పోతూన్న మిగులు ఖాదీ ఖరీదు ఎంతో అదే రాష్ట్రంలో వచ్చే యితర ఖాదీ ఖరీదైనా అంతే ఉంటుంది. ఇక చాలావరకు ఖాదీ అమ్మకాలు, నగరాలకు కావలసిన సందర్భంలోతప్ప, ఆ ఖాదీ ఉత్పత్తిఅయిన రాష్ట్రాలకే పరిమితం అయిఉంటవి. వివిధ రాష్ట్రాలలోని ఖరీదులు బహుశా ఇప్పటికంటె ఎక్కువగా భేదిస్తూంటవి. అయితే మిగులు ఖాదీకిన్నీ తదితర ఖాదీకిన్నీ యేమీ భేదము ఉండడానికి వీలులేదు. నిజానికి యావత్తు ఖాదీ మిగులు ఖాదీయే అవుతుంది. పూర్తిగా

ఖాదీ ధరించని యెవ్వరినుండీకూడా 'సంఘం' కానీ దాని శాఖలుకానీ ఖాదీ తీసుకోనే తీసుకోవుకదా ? అయితే పరివర్తనకాలంలో ఈ నియమం అంతగా పాటించబడక పోవచ్చును.

మొదటి ప్రత్యుత్తరముయొక్క ఉదాహారణమునుబట్టి, సంఘానికి సంబంధించినంతవరకు వడికేవారందరికీ అది ఒక తీరుగా మజూరీఈయవలసి ఉంటుంది. అయితే సంఘం వడికేవారి మధ్యనున్న వ్యవహారములను గూర్చి నియమాలు చేయదు. వారి పరస్పర వ్యవహారములను వారంతట వారే పరిష్కరించుకోనీయాలి. మరొక పద్ధతి యేదైనా అపజయం పొందితీరుతుంది.

మూడవ సందర్భంలో కూడా మొదటి రెండు సందర్భాలలోని సూత్రమే వర్తిస్తుంది. సంఘానికి సంబంధమున్న సందర్భాలలో కనీస జీవన భృతి ఇప్పించడానికి సంఘం భాధ్యతవహిస్తుందనే విషయం జ్ఞాపకం ఉంచుకోవాలి. సంఘ విధానం ప్రజామోదమును పొంది సర్వసాధారణమయిన యెడల, ఎవ్వరికైనా తక్కువ మజూరీతో పనులు చేయించుకోవడం అసంభవం కాకపోవచ్చునేమోకాని కష్టం అయ్యే మాటమాత్రం ఖాయం. అ.భా.చ.సం. యొక్కయు అ.భా.గ్రా.ప.సం. యొక్కయు పరస్పర సహకారం, ప్రతి యితర శాఖలోని వేతనాలు తక్షణం వాటి ప్రమాణాని కనుగుణంగా హెచ్చింపబడేటంత శక్తివంతం కావచ్చును.

ఈ ఉద్యమ విజయం కొనేవారి హృదయపూర్వక సహకారంపైన ఆధారపడిఉంటుంది. తమ ఉనికి యెవరిమీద ఆధారపడిఉన్నదో ఆ నిరుపేదలగు గ్రామీణులనిక స్వార్థం కోసం వినియోగించుకోచాలమని వారు గుర్తించగలిగిన యెడల, నిరుద్యోగ సమస్య, ఆకలి సమస్యలు రెండూ వాటంతటవే పరిష్కారం కాగలవు.

—హరిజన్, 15-10-1935

# 156

# చిక్కు సమస్య

వడుకువారి మజూరీల హెచ్చింపును గూర్చిన ప్రసంగం బయలు దేరినప్పటినుండీ ఖాదీ ప్రియులేవో అనేక రకాల భయములవలన బాధపడుతున్నారు. ఖాదీ ఖరీదు హెచ్చడం చేత ఖాదీ కావలెనని కోరేవారు తక్కువైపోతారని ఒక భయం ఉంది వారికి. ఖాదీ ఖరీదు కొద్దిగా పెరగవలసి ఉన్న విషయం ప్రజలు అర్థంచేసుకోగలరనియే నేనాశిస్తున్నాను. ఇంతవరకు సంఘం తన ఆశయం ప్రకారం, అసాధారణ ప్రయత్నంద్వారా ఖాదీ ఖరీదును నిరంతరం తగ్గిస్తూవచ్చింది అందువలన ఖాదీ కొనేవారికి లాభం కలిగింది. ఖాదీ ఖరీదు ఈనాడున్నంత తక్కువగా ఎన్నడూ లేదు. అయినప్పటికీ ప్రచారం లేకపోవడంవలన అమ్మకాలు తగ్గిపోయినవి. పరిపాలనా వ్యయం హెచ్చకుండా సక్రమంగా ప్రచారం జరిగేయెడల, ఖాదీ ఖరీదులు హెచ్చినప్పటికీ ఖాదీ అమ్మకాలు పెంపొందగలవనడానికి నాకేమీ సందేహం లేదు. అయితే మనం ఎంత చెడుగు వచ్చినా ఎదుర్కొనేటందుకు సంసిద్ధంగా ఉండడం మంచిది. ఖాదీ కోరేవారు తక్కువైపోతారనే భయంతో వడికేవారికి న్యాయంచేసే విషయంలో సంఘం ఎంతమాత్రమూ వెనుకంజవేయరాదు. ఇంకా అవసరమైతే భుక్తికోసం వడకడం అవసరంలేనివారి పేర్లన్నీ వడికేవారి జాబితాలోనుండి సంఘం తీసివేయాలి. భుక్తికోసం కాక, పొగాకు, గాజులు వగైరా కొనుక్కొనేటందుకు కొన్ని కాసులు సంపాదించుకోవలెనని వడికేవారు, వడుకువారిలో వేలకొలదీ కాకపోయినా

వందలకొలదీ అయినా ఉన్నారు. అంతగా వత్తిడి ఉంటే, అటువంటివారికి భుక్తికోసం కొన్ని కానులు సంపాదించుకోవడం అవసరమైనవారితో పోటీపడవద్దని చెప్పవచ్చును. వడికేవారిలో అధిక సంఖ్యాకులటువంటివారే. కాబట్టి సంఘ కార్యప్రణాళిక ప్రకారం ఎవరు నిరుపేదలో కార్యకర్తలు తెలుసుకోవడం అవసరం. కూలివాళ్లను పెట్టుకొనే చిన్న వ్యవసాయదారులు సాధారణంగా అన్నవస్త్రాలకు లోపంలేనివారు, భుక్తికోసం పొలంకానీ యితర ఆస్తికాని అమ్ముకోవలసిన అవసరం లేనివారు నిరుపేదల నిర్వచనం కిందకు రారు. అఖిల భారత చరఖా సంఘంవారో లేక అఖిల భారత గ్రామ పంచాయతి సంఘంవారో పని ఈయని యెడల పూర్తిగాగానీ లేక కొంతవరకుగానీ వస్తులు వడకోవలసి, పొలాలు, ఆస్తులు లేనివారందరికీ రోజుకు ఎనిమిది గంటల ప్రకారం జీవనభృతికి తక్కువ కాని మజూరీతో వడుకు పనిగానీ, దానికి సంబంధించిన మరొక పనిగానీ చూపేటందుకు సంఘం శక్తివంచన లేకుండా కృషిచేయాలి. మరొకవిధంగా చెప్పవలెనంటే ఏదోవిధంగా జీవనం చేయగలుగుతూన్నవారితో ఈ సంఘం యేవిధమైన జోక్యమూ పెట్టుకోదు. ఇందుకు కారణం ఇష్టం లేకపోవడంకాదు. కేవలం శక్తి లేకపోవడం. ఈ సంస్థలు తమ ధర్మనిర్వహణమునందు సంపూర్ణ విజయాన్ని సాధించినయెడల, వారి ధర్మకార్యాన్ని వారు నిర్వహించినవారు కావడమే కాక నిరుపేదలైన యితర ప్రజానీకానికి పరోక్షంగా సహాయంచేసి నిరాశాపూరితములైన వారి జీవితములను ఆశాజ్యోతితో ప్రజ్వరిల్లేటట్లు చేసినవారు కాగలరు.

—హరిజన్, 5-10-1935

# 157

# ఖాదీలో క్లిష్ట దశ

తమ ఖాదీ విధానంలో గాంధీజీచే సూచింపబడిన నూతన పంథానుగూర్చి ఆలోచించేటందుకు చర్ఖా సంఘం బోర్డువారొక గంభీర సమావేశం జరిపారు. కడచిన పది హేను సంవత్సరాలలో తాను హాజరైన సమావేశములన్నిటి లోకీ ఇది మిక్కిలి గంభీరమైనదని ఒక సభ్యుడన్నాడు. ఖాదీ ఉత్పత్తిలో పనిచేసేవారందరికీ జీవనమునకు తగిన వేతనముండవలెననే విషయాన్ని గ్రహించడంలో యేమీ చిక్కు లేదనీ, దాని వెనుకనున్న సిద్ధాంతాన్ని కాదనడానికి వీలు లేదనీ, సభ్యులలో ప్రతి ఒక్కరూ అంగీకరించారు. కాని దానిని నిర్వహించడంలో చాలా చిక్కు ఉన్నట్లు వారిలో కొంతమందికి తోచింది. ఈ కొత్త మార్పు మహా రాష్ట్రంలో అప్పటికే అవలంబింపబడినది. ఆ రాష్ట్రం లోని అనుభవం చూచుకొని దాని ప్రయోజనమును పొంద వలెనని కొందరు వాంఛించారు. ఖాదీ ఉత్పత్తి అయిన చోటులలోనే దాని అమ్మకం జరుగవలెననడం సాధ్యంకాని పని అనీ ఖాదీ అమ్మకానికి అంగడి లభించడం కూడా కష్ట మవుతుందనీ కొందరికి భయం. ప్రస్తుత పరిస్థితులలోనే అమ్మకాలు పడిపోతూంటే సహజంగా ఇంతకంటె తక్కువ అనుకూల పరిస్థితులలో అవి అసలే ఉండవు. ఈ రోజున ఒకానొక ఖరీదుకు ఆంధ్రావంటి రాష్ట్రంలో సన్నని ఖాదీ లభించడానికి సావకాశమున్నది. కొత్త పరిస్థితులలో అంతకంటె ముదుగు ఖాదీ అదే ఖరీదుకు అక్కడ అమ్మడం అసాధ్యం. నూతన విధానం ప్రకారం ఎక్కువ శాస్త్రీయ

నైపుణ్యము, ఎక్కువ జాగరూకత, సూక్ష్మాంశములలో ఎక్కువ శ్రద్ధ అవసరంకావడంచేత ఉత్పత్తి క్షేత్రం చిన్నదై పరిపాలనావ్యయం తక్కువ పడంకంటె దామాషాగా పెరుగుతుంది. కాబట్టి నూతన విధానాన్ని ఆచరణలోకి తీసుకొని రావడంలోనే తప్పకుండా నష్టం వచ్చే స్థితి ఉంది. వడికే వారి మజూరి హెచ్చించినందువలననే ప్రియమవుతూన్న ఖాదీని, ఈ నష్టం కూడా కొనేవారిమీద వేసి యింకాఎక్కువ ప్రియం చేయడమా? నూతన ప్రయోగాలను చేయవచ్చును; చేయబడగలవు; కాని పనివాళ్లు వారి ఆదాయ వ్యయ పట్టికను సరిపుచ్చుకోగలరని మాత్రం అనుకో కూడదు. అని ఈ విధంగా అనేక సంశయాలు వెల్లడి చేశారు.

తన సిద్ధాంతాన్ని ఇంకనూ వివరిస్తూ గాంధీజీ, ఈ అభ్యంతరాలకూ సందేహాలకూ చిక్కులకూ అన్నిటికీ సమాధానం చెప్పడానికి ప్రయత్నంచేశారు. ఆయన ఇలా చెప్పడం ప్రారంభించారు. "అనర్థదాయకము ఆత్మవినాశకరము అయిన ఆర్థిక విధానంతో పోటీచేసే అభిప్రాయాన్ని శాశ్వతంగా మన మనస్సులలోనుండి తొలగించుకోవాలి. జపాను వర్తకులు అంగళ్లను ఎంత నిగూఢ మార్గాలలో నింపి వేస్తున్నారో మీకు తెలుసునా? ఐదేళ్లకిటీవలెనే వారి బట్ట కొన్నివేల గజాలుండేది. ఈనాడది కోట్లకొలది గజాలున్నది. దానితో మీరెలా పోటీచేయగలరు? ఈ పోటీని తట్టుకోవడానికి మన ఖరీదులను తగ్గించవలెననే ఆశయం మనకిక కూడదు. మనం ఇన్ని యేళ్లనుండీ కొనేవాళ్లను మనస్సులో పెట్టుకొని వడికేవాళ్లకు కొద్దిగా ఉపకారం చేస్తున్నాము. మన సంఘం కొనేవాళ్ల సంఘంకాదనీ వడికేవాళ్ల సంఘమనికూడా మరచిపోయినాము. మనం

వడికేవారి ప్రతినిధులుగా ఉండడం మానివేశాము. ఇక వారికి సహజమైన ప్రతినిధులంగా ఉండాలి. మనం కేవలం కిందకూ మీదకూ ఊగులాడుతూ రాజకీయ పరివర్తనాలమీద ఆధారపడి ఒకవిధమైన జూదంలో ఆసక్తులమైనాము. "మీరు వేస్తూన్న రకరకాల ప్రకటనలవలన ప్రయోజనమేమిటి" "నిరుద్యోగులైన మధ్యతరగతులవారికి పని చూపించేటందుకీ సంస్థను నడువుతూన్నామనే ఆరోపణకు అనుగుణంగా ప్రవర్తించడం మనం త్వరలోనే మానివేయాలి" అని జేరాజ సీతోనే నన్నాను. మన సహచరులలో అతి దరిద్రులైన వారిని వినియోగించుకోనేటందుకు మనమింకా ఎక్కువ నష్టపడకూడదని నేను సూచిస్తున్నాను. "ఒక నూరుమంది స్త్రీలకు సంతృప్తికరమైన మజూరీ యిచ్చేటందుకు, అనేక వేల మందికి పనిలేకుండా చేసి ఆపదకు పాల్పడుతున్నారు" అని నన్ను ప్రశ్నిస్తున్నారు. ఒక విషమజ్వరాన్ని నయం చేయడాని క్లిష్ట దశ తీసుకొనిరావడం అవసరమని నేనంటున్నాను. వయస్సువచ్చిన ప్రతి గ్రామీణుని చేతి లోను ఒక రాటం, ప్రతి గ్రామంలోను ఒక మగ్గం, ఇదే మన ఆదర్శం. అనేక లక్షల రూపాయిల విలువగల ఖాదీ మనం ఉత్పత్తిచేసి ఉండవచ్చును. కాని మనమీ ఆదర్శాని కెక్కడా దగ్గరకుచేరుకో లేదు. మీరు నగరాలను, నగరా లలో ఖాదీ వాడేవారిని మరచిపోవలెనని కోరుతున్నాను. మన మాప్పుది కోట్లమంది గ్రామీణులు తమ ఖాదీ తాముత్పత్తిచేసుకొని వాడుకోనేటట్లు ప్రోత్సహించం? ఇక ఒక కోటి ఆ ప్రాంతంలో ఉన్న నగరవాసులు తమంతటతామే ఖాదీ ధరించడం ప్రారంభిస్తారు. తాత్కా లికంగా ఆ పని మందగించినా, ఆగిపోయినా లెక్క చేయ కండి. కొనేవారు లేకపోతే సరఫరాకోసం ఉత్పత్తి

చేయకండి. మీ భాండాగారాలకు నష్టం వస్తున్న చోటులలో వాటిని మూసివేయండి. మీ ఖాదీ కావలె ననుకొనేవారందరికీ, తయారుచేయించి ఈయడానికి సిద్ధంగా ఉన్నామనీ, కాని క్రొత్త ధరల ప్రకారం మాత్రమే యిస్తామనీ చెప్పండి.

"ఈ నా సూచనను మీమీద బలవంతంగా రుద్దవలెననే కోరిక నాకు లేదు. మీకు నమ్మకం లేకపోతే త్రోసివేయవచ్చును. మీరు భరించగలిగిన దానికంటె ఎక్కువ బాధ్యతను మీ బుజాలమీద వేసుకోకండి. పిండికొద్దీ రొట్టె అన్న పద్ధతిలోనే వ్యవహరించండి. సప్లి కేంద్రంలో ఈ క్రొత్త వేతనముయొక్క షరతులను పరిపూర్తిచేస్తూ వడికే వారిప్పటికీ ఉన్నారు. వారు ప్రతి రోజూ మూడణాల మొదలు నాలుగణాలవరకూ సంపాదించుకోవడం ప్రారంభించారు. వీలైన చోటులలో నెల్ల స్వయంసహాయక ఖాదీ మీద శ్రద్ధవహించండి. దానిద్వారా పరిశుభ్రమైన ఖాదీ వాతావరణం పెంపొందుతుంది. ఇందుకు తార్కాణంగా కతియావాడులో కొంతకాలం అనేక కేంద్రాలను నడుపుతూ ఖాదీ ఉత్పత్తిని ఎక్కువచేయడానికి అక్కడివారు చాలా సాహస ప్రయత్నాలు చేశారు. ఇప్పుడాపని మాని వేశారు. శంకరలాలు బ్యాంకరుకు వచ్చిన ప్రత్యుత్తరాలలో ఒకటి కతియవాడు ఖాదీ శాఖా కార్యదర్శి వ్రాసింది. నూతన విధానమును గూర్చి ఆయన చేసే విమర్శగానీ వెల్లడించే అభిప్రాయంగానీ యేమీ లేదనీ ఆ కేంద్రంలో ఉత్పత్తి అవుతూన్నదంతా స్వయంసంపూర్ణ ఖాదీయేననీ వ్రాశాడాయన."

ఈ చర్చయొక్క ఫలితం ఏకగ్రీవంగా ఆమోదింపబడిన తీర్మానం. (కింద ముద్రింపబడినది.) అది నూతన విధానాన్ని మిక్కిలి వివరంగా నిర్వచిస్తూ, అన్ని చోట్లలా ఉన్న కార్యకర్తలకు విపులమైన సూచనలను ప్రతిపాదిస్తూన్నది.

—మ. దే.

* * *

[గాంధీజీ అధ్యక్షత క్రింద 11, 12, 13 తేదీలలో మగన్‌వాడిలో సమావేశమైన అఖిల భారత చరఖా సంఘం పరిషత్తుచే అంగీకరింపబడిన ప్రాముఖ్యమైన తీర్మానమీ కింద ఉదాహరింపబడుతూన్నది.]

# 1

వడికేటందుకిప్పుడీయబడుతూన్న మజూరీలు సరిపోవని ఈ పరిషత్తు వారభిప్రాయపడుతూన్నారు; కాబట్టి వడికే వారికి సంవత్సరానికి కనీసం 20 గజాల ఒట్టకున్నా, శాస్త్రీ నిర్ణీతమయిన కనీస ప్రమాణముగల ఆహారమునకున్నా సరిపోయేటట్లుగా, రోజుకు 8 గంటల నిపుణమైన పని ఆధారంగా పెట్టుకొని అంచనావేయబడిన కనీస వేతనమునైనను వారు పొందేటందుకు, ఒక ఉచితమైన ప్రమాణమును నిర్ణయించి వారి మజూరీలను హెచ్చించవలెనని తీర్మానిస్తున్నారు. ప్రతి వడుకు కుటుంబంలోని పనిచేసేవారందటి సంపాదన మూలకంగా, వారు సక్రమంగా పోషింపబడేటందుకు వీలైన ప్రమాణమును చేరుకొనేవరకు, జీతముల ప్రమాణాన్ని క్రమంగా హెచ్చించడానికి ఇందుకు సంబంధించిన వారందరూ పరిస్థితులనుకూలంగా ఉన్నంతవరకు ప్రయత్నించాలి.

# 2

ఈ పై తీర్మానంలోని సిద్ధాంతాన్ని అమలుపఱచడంలో అ.భా.చ.సం., కార్యకర్తలకు మార్గదర్శకంగా ఉండేటందుకు

ఆ సంఘమునకు అనుబంధములుగా కానీ లేక మఱొక విధంగా కానీ ఆ సంఘంకింద ఉండి పనిచేస్తూన్న శాఖలు సంస్థలు అన్నీ కూడా, ఈ దిగువ ఉదాహరింపబడిన విషయం, పరిషత్తువారి భవిష్యదనుభవమువలన మార్పు చేయబడేటంతవరకు దానిని వారి నిర్ణీత విధానంగానే భావించవలెను :—

1. భారతదేశంలోని ప్రతి యింటినీ, బట్టయొక్క అవసరములకు సంబంధించినంతవరకు ఖాదీ ద్వారా స్వయం సహాయకంగా చేయడమున్నూ, ఖాదీ కర్మకారులందరి లోకీ అత్యల్పవేతనములను పొందుతూన్న వడుకువారి యొక్కయు, పత్తి పండించడం మొదలుకొని ఖాదీ నేసేటంత వరకూ గల వివిధ కార్యక్రమాలలో పాల్గొంటూన్న తదితరులయొక్కయూ శ్రేయస్సును పెంపొందించడమున్నూ, ఈ సంఘంయొక్క ఆదేశం.

2. అన్ని శాఖలూ అన్ని అనుబంధ సంస్థలూకూడా, అన్ని నష్టాలనూ తప్పించుకొనే విధాన ఈ ప్రణాళికను ఆచరణలో పెట్టాలి. అనగా తమకు అత్యంత సమీపములో నున్న తమ నిర్ణీత ప్రదేశాలలోని అవసరమునుబట్టి తమ ఉత్పత్తిని పరిమితం చేయాలి. ఇతర రాష్ట్రాలు తమ అవసరాలను తీర్చవలసిందని కోరినంతవరకే తప్ప, రాష్ట్రాన్ని దాటి ఎప్పుడూ పోకూడదు.

3. కాబట్టి ఖాదీ ఉత్పత్తిలో పనిచేసేవారందఱు, కర్మకారులుగానీ, అమ్మేవారు కానీ తదితరులు కానీ వారికి కావలసిన బట్టలు ఖాదీలోనే వాడుకోవడం ఇంకే యితర బట్టలూ వాడకపోవడం వారి కర్తవ్యం.

4. అదనపు ఉత్పత్తి జరుగకుండా చూచేటందుకు ఉత్పత్తిదారులు, యేడాది అంతాగానీ యేడాదిలో కొంత భాగంగాని తమ రోజువారీ భుక్తికోసం కేవలం వడకడంపైన ఆధారపడి ఉండేవారివరకు మాత్రమే తమ కార్యకలాపాలను పరిమితం చేయవచ్చును. శాఖలు తదితర సంస్థలు తమచే నియోగింపబడిన వడుకువారియొక్కయు తదితర కర్మకారుల యొక్కయు సక్రమమైన జాబితాను పెట్టుకొని వారితో ప్రత్యక్షంగానే తాము వ్యవహరించాలి. మజూరీలు కూటికీ గుడ్డకు మాత్రమే వినియోగింపబడేటట్లు చూడటానికి, వాటిని పూర్తిగాగానీ వాటిలో కొంత భాగంగానీ వస్తురూపంలో అనగా ఖాదీలోగాని, ఇతర జీవితావసర వస్తువులలోగానీ ఈయవచ్చును.

5. ఒకటికంటె ఎక్కువ ఖాదీ ఉత్పత్తి సంస్థలున్న చోట్ల ఒకటి చేసే పని మఱొకటి చేయకుండానూ, అనవసర పోటీలేకుండానూ, రెట్టింపు ఖర్చులు పెట్టకుండానూ ఉండేటందుకు, ప్రతి ఒక సంస్థ పనిచేయవలసిన ప్రదేశమున్నూ ముందుగానే వివరింపబడవలెను. ధ్రువ పత్రములు పొందిన వ్యక్తి ఉత్పత్తిదారులు సంఘంవారిచే ప్రోత్సహింపబడరు. ఇంతకు పూర్వమే ధ్రువపత్రములను పొందినవారిలో, సంఘం యొక్క శాఖలకు వర్తించే నియమాలను గట్టిగా పాటించి పనిచేసేవారియొక్కయు, సంఘంనుండి పరిహారం పొందవచ్చుననే ఆశలేకుండా అన్ని కష్టనష్టాలకు అంగీకరించినవారి యొక్కయు ధ్రువపత్రములు మాత్రమే పునరుద్ధరింపబడగలవు. అయితే అప్పుడప్పుడూ చేయబడే నియమాలుగానీ ఈయబడే ఉత్తరువులుగానీ ఏమాత్రం ఉల్లంఘింపబడినా, తక్షణం ధ్రువపత్రములు ఉపసంహరింపబడతవనే సంగతివారు గట్టిగా గ్రహించాలి.

6. ఈ స్వయం సహాయక ఖాదీ ప్రణాళికను పెంపొందించడం సంఘంకింద పనిచేసే అన్ని సంస్థలయొక్కయు అనుల్లంఘనీయమైన ప్రథమ కర్తవ్యంగా భావింపబడవలెను. నగరములయొక్కయు నగరాలకు వెలుపలనుండి తమ ఖాదీని తాము పడుకుకోని ఖాదీధారులయొక్కయు అవసరాలను తీర్చేటందుకు ఖాదీ ఉత్పత్తిచేయడం తరువాతి కర్తవ్యం లేక అదనపు కర్తవ్యం. అటువంటి ఖాదీని ఉత్పత్తిచేయడం కానీ అమ్మడం కానీ యే సంస్థకూ నిర్బంధంకానట్లు తలంపబడవలెను.

—హరిజన్, 19-10-1935

---

# 158

# నూతన ఖాదీ ప్రణాళిక

వడికేవారి మజూరీలనుగూర్చినీ, మొత్తంమీద ఖాదీ విధానమునుగూర్చినీ, అఖిల భారత చరఖా సంఘంవారిచే చేయబడిన తీర్మానం ప్రతి ఖాదీ కార్యకర్తా జాగరూకతతో పరిశీలించతగినది. ఈ నూతన విధానం సరిగా ఆచరింపబడినట్లయితే అది మహత్తరమైన మార్పులను తీసుకొని రాగలదు. దానిని సరిగా ఆచరించేటందుకు కేంద్రమునుండి పంపబడిన ఉత్తరువులను అతి సూక్ష్మాంశములతో సహా అనుసరించాలి.

అన్ని ఖాదీ సంస్థలలోనూ స్వయం సహాయక ఖాదీ అగ్రస్థానాన్ని అలంకరించాలి. ఒక విధంగా, స్వయం సహాయక ఖాదీయున్నూ, అమ్మకంకోసం ఉద్దేశింపబడిన ఉత్పత్తినీ, జంటగా జరుగుతూండగలవు. స్వయం సహాయక ఖాదీయొక్క గౌణఫలమే (by-product) అమ్మకం కొఱకు ఉత్పత్తి. ఈ రెండవది మొదటి దాని విజయాన్ని నిశ్చయం చేస్తుంది. పనివాళ్లు ఖాదీ ధరించవలెననే షరతు ఈ ఉత్పత్తి విధానంలో ఉండడంచేత, వారు తమకు కావలసిన ఖాదీని తయారు చేసుకోనైనా చేసుకోవాలి లేక తీసుకోనైనా తీసుకోవాలి. వారు అనుకోకుండాగానీ, కోరకుండాగానీ పొందబోతూన్న జీతాలలోని పెద్ద పెంపుదలనుండి వారీ పని తేలికగా చేయగలరు. కాని ఈ మజూరీలు పుచ్చుకోవడం అదనపు ఉత్పత్తిపైన ఆధారపడి ఉన్నది. అది ఉపయోగకరంగా ఉండవలెనంటే త్వరగా అమ్ముడుపోవాలి. కాబట్టి ఉత్పత్తి కేంద్రాలున్నచోట స్వయం

సహాయక విధానం తేలిక. ఎందువల్లననగా కార్యకర్తలతో సంబంధం లేని యితరుల కంటె వడికేవారిని తదితర కర్మకారులను ఒప్పించడం ఎక్కువ వీలు.

అయితే ఎక్కువ ఖరీదులు పెట్టి ఖాదీ ఎవరు కొంటారని కొందరు ప్రశ్నిస్తారు. నా అభిప్రాయంలో ఈ ప్రశ్న అజ్ఞానాన్ని, అవిశ్వాసాన్ని సమయోచిత ప్రజ్ఞ లేమిని వెల్లడిస్తూన్నది.

ఇంతవరకూ పట్టణాలలో ఖాదీకి ఎక్కువ గిరాకీ కల్పించడానికి మాత్రమే శ్రద్ధతీసుకొన్నాము. మనము నాగరిక చిత్తవృత్తి కలవాళ్లముగా ఉన్నాము. ఉత్పత్తి కేంద్రాలకు చుట్టూ ఆనుకొని ఉన్న ప్రదేశాలను మనం పరిశీలించేటందుకెన్నడూ శ్రద్ధ వహించలేదు. మనం కేవలం ఉత్పత్తిదారులనే అశ్రద్ధ చేశాము. ఇప్పుడు, మనం ఉత్పత్తి కేంద్రాల వారిని పరిశీలించక మునుపేకూడా వారు సహకరిస్తారని విశ్వసించినట్లుగా కనిపిస్తున్నాము. ఆ చుట్టుపట్ల ప్రదేశాలలోని ప్రజలనుగూర్చి కూడా అటువంటి విశ్వాసం మనకెందుకుండకూడదు. వారికి రోజువారీ వాడుకకోసం బట్ట కావాలి గదా ? తమ ఇంటిప్రక్క వారిచే తయారుచేయబడిన ఖాదీ కొంతవారు తీసుకోవలెనని అనుకోవడం తప్పా ? ఆ విషయంలో శ్రద్ధగా ప్రయత్నించిన వారెవ్వరూ అపజయం పొందలేదని నాకు తెలుసును. అపజయం మనవలన కలగాలిగాని కాబోయే క్రేతల (buyers) వలన కలుగదు. వారెప్పుడూ మనతోనే ఉన్నారు. ఈనాడు వారేమి కొంటున్నారు, ఏమి వాడుతున్నారనేది అవసరంలేదు. చుట్టుపట్ల ప్రదేశాలలోని వారి అవసరాలను మనం పరిశీలించినయెడల, వారి అభిరుచులకు తగిన ఖాదీని మనముత్పత్తి

చేసి వారి దృష్టిని ఆకర్షించగలము. ఇంతకుపూర్వం నగర వాసులకోసం ఖాదీ కార్యకర్తలా పని జయప్రదంగా నిర్వహించారు. వారి దృష్టినిప్పుడు గ్రామ సీమలవైపుకు మార్చగలరా? ఖాదీ ప్రియం కావడంవలన కాదు ప్రజలు దానికి విముఖులుగా ఉంటూన్నది; మన అవిశ్వాసంవలన, మనకు సమయోచిత ప్రజ్ఞ లేక పోవడంవలన. మనకు విశ్వాసం ఉన్నట్లయితే, దూరప్రాచ్యమునుండి వచ్చిన వర్తకులకున్న లక్షలాది ప్రజలు మనకూ ఉండగలరు. దూర ప్రాచ్యదేశాలవారు తమ సరుకు విడుదలకు వారి బట్టల చౌకదనంపైన ఆధారపడి ఉన్నారు. మన బట్టలను కొనబోయేవారిని ఆకర్షించేటందుకు, స్థానికాభిమానంమీదను, మన సరుకుల సౌందర్యంపైనను ఆధారపడవచ్చును. ప్రతి ఖాదీ సంస్థ స్వయంపోషకంగా ఉండడం మూలకంగా స్వతంత్రంగా ఉండవలెనని అఖిల భారత చరఖా సంఘం పరిషత్తు సంపూర్ణమైన కారణం లేకుండా పట్టుబట్టలేదు. కేంద్రం వారిచ్చే కొద్దికొద్ది మొత్తాలపయిన అవి యిక ఆధారపడి ఉండక పోవచ్చును. ఇంతకు పూర్వం అశ్రద్ధ చేయబడిన ప్రదేశాలలో పని సాగించేటందుకు కేంద్ర నిధి విడుదల చేయబడవలెను.

—హరిజన్, 26-10-1935

# 159

# మానవత్వంకల వతనుదారులు కావాలి

డెబ్బై అయిదేండ్ల పరిణత వయస్కుడై పీడిత ప్రజానీకము యొక్క శ్రేయస్సుకోసం యువకుని శక్తిని ప్రదర్శిస్తూన్న డాక్టరు పి. సి. రే ఇలా వ్రాస్తున్నారు :—

"నేను ఆత్రేయి, తలోరాలకు మతి ఇటీవల చరఖా ప్రవేశపెట్టబడిన సరియా కండీకి వెళ్ళినాను. ఈ ప్రదేశంలోని ముఖ్య వ్యవసాయోత్పత్తులయిన బియ్యం, జనపనారల ధరలు చాలా తగ్గిపోవడం కారణంగా వ్యాపారం మందగించినందున, రైతుల పరిస్థితి చాలా అధ్వాన్నంగా ఉన్నది. ముఖ్యంగా సరియాకండిలో అలా ఉన్నది. రైలు స్టేషన్ నుండి పడవలో నేనా ఊరికి ఆరు గంటలు ప్రయాణం చేయవలసి వచ్చింది. తిరుగు ప్రయాణంలో వాలు కెదురు రావలసి ఉండడంచేత పదిహేను గంటలు పట్టింది. చర్ఖా ప్రవేశపెట్టబడినందున అనేకమంది ప్రాణాల రక్షణ కది ఆధారమయిందని (ఆయన ఉపయోగించిన అసలు మాట 'జీవనదాన్' అని) నాతో త్రోవలో పడవ కళాసన్నాడు. దాదాపు నాలుగైదు వందల చర్ఖాలు తిరుగుతూన్నవి. ఇంకా ఎక్కువ కావలెనని బ్రతిమాలుకొంటూ ప్రజలు నన్ను ముట్టడించారు.

ఇక్కడ ఉత్పత్తి అయ్యే దారం ఎక్కువ సన్నంగా ఉండడంచేత, ఈ బట్టకు వంగ రాష్ట్రంలో అమ్మకం చాలా తక్కువ. కాబట్టి బొంబాయిలో దీని విడుదలకు అంగడిని చూచుకోవలసి వచ్చింది. కనుక సరుకు విడుదలలో ఎక్కువ కష్టం కలుగుతూన్నది. ఇక దానినిగూర్చి అంతా మీకు తెలియనే తెలుసు. బొంబాయి అమ్మకం మాకు పోయినట్లయితే స్థానికంగా వడికేవారే ఆ బట్టను ధరించేటందుకు వీలుగా తక్కువ నెంబర్ల నూలునే మేము ప్రోత్సహించవలసివస్తుంది. వడికే సంప్రదాయమే రూపు మాసిపోయినప్పటికీ కొలది కాలంలోనే అనగా మహా అయితే ఒకటిన్నర సంవత్సరాలలోనే ప్రజలు చర్ఖాను వెంటనే చేపట్టడమేగాక అంత సన్నని నూలును వడికారని గమనిస్తూన్నప్పుడు ఆశ్చర్యం వేస్తుంది. అయితే ఈ పనికి సహనం కలిగి ఉండడమేకాక, అదృశ్యమైన హస్తకళా నైపుణ్యాన్ని పునరుద్ధరించి సజీవంగా ఉంచే

టందుకు తగినంత ధనంకూడా ముందు పెట్టుబడి కింద వెచ్చించవలసి ఉన్నది. అయినప్పటికీ ఉత్తర బంగాళంలో ఈ పని కొనసాగేటందుకు మేము కొత్తగా చాలా కృషి చేశాము. మా కృషి ఫలింపగలదనే ఆశ ఉన్నది. అధైర్యపడకపోవడమే మా ఆదర్శం.

నే నిప్పుడు ప్రక్కను ఉన్న పాబ్నా జిల్లాలో సంచారంచేస్తూ చుట్టుప్రక్కలనున్న ప్రజల ఆర్థిక స్థితినిగూర్చి కొంత కొంత తెలుసుకొంటు న్నాను."

అనుకొన్నట్లుగా లేక భయపడ్డట్లుగా ధరలు పెరగడానికి పూర్వమే సన్న ఖాదీకి అమ్మకం పడిపోయింది. ఇంకా అది పడిపోయినట్లయితే, దానికి కారణం, ధరలు హెచ్చడం కాదు. నిస్సందేహంగా కొనేవారిలో ప్రేమ, లేక మానవత్వం లేకపోవడం. మానవత్వం తక్కువ ధరలకోసం దేవులాడుతూ బేరమాడే తత్వంలో ఉండదు. మనిషి లోని అనుకంపా భావం, అతను కొనే వస్తువులలోకూడా సేవావకాశాలకోసం అన్వేషిస్తుంది. కాబట్టి ఆ భావంగల మనిషి ముందుగా తాను కొన తలచుకొన్న వస్తువుయొక్క ఖరీదు తెలుసుకొన కోరడు; దానిని ఉత్పత్తిచేసిన వారి స్థితిగతులు తెలుసుకొని, మిక్కిలి నిరుపేదలయి అర్హులైన వారికి మిక్కిలి ఉపకారం జరిగేటట్లుగా వస్తువులను కొంటాడు. తగినంత ఎక్కువ మంది స్త్రీ పురుషులు సోదర మానవుల యెడ ఇటువంటి ప్రేమ భావం కలిగి ఉన్నయెడల, ఖాదీ కావలెనని కోరేవా రెప్పుడూ ఎక్కువగా ఉండనే ఉంటారు. ముఖ్యంగా ఇప్పుడు, మిక్కిలి నిరుపేదరాలైన నూలు వడికే స్త్రీకి, కనీసం ఆమె పోషణకు తగిన మజూరీ అయినా ముట్ట చెప్పేటందుకు ఎక్కువ శ్రద్ధ తీసుకోబడుతూన్నదని తెలిసి నప్పుడు, అందులో ఆ మజూరీ ఆమె పలాంగో అలా క్షేవలం

పొట్టపోసుకోవడానికి మాత్రం తగినట్లుగాగాక, ఆమె పోషణకు తగిన ఆహారం పొందడాని కామెకవకాశం కలిగిస్తూ న్నప్పుడు ఇంకా ఎక్కువగా ఖాదీ కొంటారు.

ఖాదీ కర్మకారుల పోషణకు కావలసిన మజూరీ యిచ్చే ప్రయత్నంతోపాటు ఖాదీకి ఎక్కువ ఉత్తమమయిన, అనగా దాని అమ్మకానికి ఎక్కువ సహజమయిన అంగడికోసం కూడా కృషి జరగాలి. ఇంతవరకూ మనం బొంబాయి, కలకత్తా, మద్రాసులలాంటి పెద్ద నగరాలలో మాత్రమే వతను దారులను సంపాదించే సులభమైన పద్ధతితో సంతుష్టిపడి ఊరుకొన్నాము. ఇది నిజంగా పొరపాటు. డాక్టరు రే ఆరోగ్యం సరిగా ఉన్నట్లయితే ఉత్పత్తి కేంద్రాల చుట్టూ ఉన్న ప్రదేశాలకు, ఆయన ప్రేమ సందేశాన్ని అందించ వలసిందిగా నేను సూచించాను. వంగీయు లందరూ సన్నని బట్టనే వాడతారు. వారు సన్నని ఖాదీ నెందుకు వాడ కూడదు? ఈ నూతన ప్రణాళిక కింద ఖాదీని చాక చేయ డానికి వీలుంది. అయితే వంగ రాష్ట్రం, సాహస వ్యాపారంకోసం కాక గృహోపయోగంకోసం మాత్రమే పత్తి పండించాలి. కాని ఆ రోజు చాలా దూరంలో ఉండ వచ్చును. ప్రస్తుతం మాత్రం, తక్కిన భారతదేశంవలెనే వంగ రాష్ట్రంకూడా, ఖరీదు చూచుకొనే వర్తక సరళిలో గాక దరిద్ర మానవకోటికోసం ఖాదీ కొనాలి. వయో వృద్ధులైన మన తల్లిదండ్రులవలన బిడ్డలవలన మన కెంత ఖర్చవుతూన్నదో మనం లెక్క చూచుకోము. ఎంత ఖర్చయినా వారిని మనం పోషిస్తాము. శతాబ్దాలనుండీ మనం కనపడుస్తూన్న అపరాధ పూర్వకమైన అశ్రద్ధ కారణంగా ఆకలితో అలమటిస్తున్న లక్షలాది సోదరీ సోదరుల

యెడ మన మంతెకం టె తక్కువగా ప్రవర్తించవలెనా? భారతదేశంలో యే భాగాన్నీ మనం అశ్రద్ధ చేయరాదు. ఉత్పత్తి విషయంలోనూ వినియోగం విషయంలోనూ కూడా ఖాదీ శాస్త్రం వికేంద్రీకరణం కావలెనంటూన్నది ఖాదీ ఉత్పత్తి అయిన చోటుకు సాధ్యమైనంత సమీపంలోనే వినియోగంకూడా కావాలి. ఆ పర్యవసానంకోసమే యావత్ప్రయత్నమూ జరగాలి. నగరాలకు కావలసిన దానిని మనం ఉత్పత్తి చేయవచ్చును. కాని మనం స్థానిక అంగడిమీద ఆధారపడి ఉన్నట్లుగా నగరాలమీద ఆధారపడి ఉండకూడదు. ముందుగా స్థానిక అంగడినిగూర్చి విచారించి అక్కడ కావలసిన సరఫరా చేయాలి. ఖాదీ కర్మకారు లందఱున్నూ, పీఠైన చోట్లలో, అఖిల భారత చరఖా సంఘం ఆ.భా.గ్రా.స.సం. కింద పని చేస్తూన్న అందఱు పని వాళ్ళున్నూ ఖాదీ ధరించవలసినట్లు భావింపబడుతూన్నారు గనుక, ఖాదీకి కనీసపు విడుదల ఎప్పుడూ స్థిరపడే ఉంది. అనంతపురంలోని జేఠాలాల్, సతీష్‌బాబు స్వతంత్రంగా లెక్కలు తయారుచేసి, స్వయంసహాయక ఖాదీలో మూడు గజాలు కర్మకారులు కట్టుకోవడానికి, రెండు గజాలు వెలుపల అమ్మడానికి వినియోగింపబడుతూన్నదని నిర్ణయించారు. ఈ లెక్క సరియైనదైతే స్వయం సహాయక ఖాదీ వ్యాపకం కావడానికి స్థానిక అంగళ్లనుండి చాలా సహాయం కావలసి ఉంది. ఖాదీతోపాటు ఇతర పరిశ్రమలుకూడా జరుగు తూంటవి గనుక, స్వయం సహాయక ఖాదీ తక్కిన గ్రామ పరిశ్రమల సహాయంకూడా పొందుతూండవచ్చును. ధరించే వానికి తాను చేసిన శ్రమ తప్ప, దాదాపు ఏమీ ఖర్చు కాకుండా ఉండడమే స్వయం సహాయక ఖాదీకి ప్రమాణం. దేశమంతటా స్థానిక అంగళ్లు సృజింపబడి, వతను సుస్థిరం

చేయబడితేనే తప్ప స్వయం సహాయక ఖాదీ యెన్నటికీ వ్యాప్తం కాదు. ఈ సుస్థిరత్వమును సునిశ్చయం చేసేటందుకు, ఒకే సంస్థకు చెందిన కార్యకర్తలలో అపసవ్యమైన పోటీకి, తావు లేకుండానూ, ఒకే చోట ఒకరు చేస్తూన్న పనినే మరొకరు చేయకుండాను ప్రత్తి ఉత్పత్తి కేంద్రము కింద నుండవలసిన ప్రదేశమును, స్పష్టంగా వివరించడం అవసరం.

—హరిజన్, 2-11-1935

---

# 160

# ఆదర్శము, ఆచరణ

శ్రీ గోపబంధు చౌదరి యిలా వ్రాస్తున్నారు :—

“ మానవత్వంకల వతనుదారులు కావాలి ’ అనే వ్యాసములో మీరు, ‘ స్వయం సహాయక ఖాదీ మూడు గజాలు కర్మకారులు వినియోగిస్తే, రెండు గజాలు బయట అమ్మకమవుతుంది ’ అని ఒక లెక్క ఉదాహరించారు. స్వయం సహాయక ప్రణాళిక క్రింద వడికే మనిషి, పత్తి ఖరీదు కిందను, నేత మజూరీ కిందను మఱికొంత వడకవలసి ఉంటుందనే విషయం పైన ఆధారపడి, ఈ లెక్క వేయబడినట్లు కనిపిస్తూన్నది. అయితే వడికే మనిషి పత్తి కొనుక్కొనేటందుకుగానీ, నేత మనిషికి మజూరీ యిచ్చేటందుకుగానీ, కావలసిన సంపాదనకోసం యితర గ్రామ పరిశ్రమల పైన ఆధారపడి ఉండగలదని మీరు ఒప్పుకొంటూనే ఉన్నారు. కాని మీ వ్యాసం చదివినప్పుడు, స్వయం సహాయక ఖాదీయొక్క విజయం, కేవలం ఖాదీ అమ్మకంమీద ఆధారపడి ఉన్నదని అభిప్రాయం కలుగుతూన్నది. అయితే యిది సరియైన ఆదర్శమా ? చాలా ఎక్కువ సందర్భాలలో వడికేవారు తమ సొంత పత్తితో వడకడంగానీ, తాము వ్యవసాయ కూలీవలననో ఇతర గ్రామ పరిశ్రమలద్వారానో సంపాదించుకొన్న సొమ్ముతో పత్తిని కొని నేతకు మజూరీ యిచ్చుకోవడంగానీ, జరుగుతూంటుంది. అదే స్వయం సహాయక ఖాదీయొక్క ఆదర్శము కాదా !

అలాకాక, గ్రామంలోని ప్రతి గృహము స్వయం సంపూర్ణముగా చేయడమే మన ఆదర్శమైతే, వడికేవారు బయటివారికోసం అదనంగా ఉత్పత్తిచేసే రెండు గజాలు ఎక్కడ అమ్ముతుంది ? నగరాలకు అంత ఎక్కువగా అవసరం ఉండడానికి సావకాశముందా ?

వ్యాపార సరళిలో నడపబడే ఖాదీతో స్వయం సహాయక ఖాదీని ముడిపెట్టడంవలన, రెండవదానిని మనం దుర్బలం కావించడమేగాక, దేని విషయంలో మీరు పూర్తిగా పరివర్తనం కలిగించ తలపెట్టినారో దానినిగూర్చి ఖాదీ కార్యకర్తల దృష్టిలో దాదాపు రెండవ స్థానం

కల్పిస్తున్నాము. పత్తి పండించేటందుకు కావలసినంత బంజరు భూమి ఉండడంచేతను నూలు వడికేటందుకు తీరిక ఉండడంచేతను, స్వయం సహాయక ఖాదీ దాని యోగ్యతలపైన అది స్వతంత్రంగా వర్ధిల్లాలి.”

ప్రతి కుటుంబము సొంత పొలం కలిగి ఉండి, సొంతంగా ధాన్యం పండించుకొని, వండుకొని తినవలసినట్లే, ప్రతి కుటుంబము ఎవరి పత్తివారు పండించుకొని, వడుకుకొని, నేసుకొని, ఆ బట్టను కట్టుకోవడమే ఆదర్శం. అందుకు సందేహం లేదు. కాని ప్రతి కుటుంబము ఆ ఆదర్శాన్ని అందుకోదనీ, అందుకోజాలదనీ మనకు తెలుసును. నిష్కళంకమైన స్వయం సహాయక ఖాదీ సందేశమును కార్యకర్త బోధించడం ప్రారంభించినంత మాత్రంతో ఆయనకు జయం చేకూరదనికూడా మనకు తెలుసును. కుటుంబ యజమాని పత్తి కొని, వడుకుకొని, నేయించుకొని ఆ ఖర్చులను ఆయనకూడ బెట్టుకొన్న సొమ్మునుండి యిచ్చుకోవలెనని గోపబంధు బాబు చేసిన సూచనకూడా ఒక మధ్యస్థపుదశ మాత్రమే. అయితే, కూడ బెట్టుకొన్న సొమ్ము లేనివాళ్లు లక్షలున్నారు. ఈ పను లేవీ చేయకుండానే బట్ట కొనుక్కొనేవాళ్లూ లక్షలున్నారు. తనకు తాను వడుకుకొని, మరొక పరిశ్రమ ద్వారా సంపాదించుకొన్న సొమ్ముతో పత్తి ఖరీదు నేత మజూరీ యిచ్చుకోవడం ఒక మధ్యస్థపు దశ. అదనంగా వడికి అందువల్ల వచ్చిన సొమ్ముతో నేతకు మజూరీ యిచ్చుకోవడం, మరొక మధ్యస్థపు దశ. బహుశా ఇది వడికే వారి దృష్టిలోగాని నేసేవారి దృష్టిలోగాని అత్యంత సుకరమైనది. ఈ స్థితిని అమలులోకి తెచ్చేటందుకు మన ఖాదీ కేంద్రాలు తయారుగా ఉండనే ఉన్నవి. వడికే వారున్నూ తదితర కర్మకారులున్నూ అఖిల భారత చరఖా సంఘంద్వారా నిరంతరం పని సంపాదించుకోవలెనంటే

వారందరూ ఖాదీ ధరించవలెనని ఖాదీ కేంద్రాలలోని కార్య కర్తలు వారిని ప్రోత్సహించవలెను. కేవలం వడకడం, నేయడం, ఏకడం, రంగులు వేయడం పనులమీదనే, తమ పోషణకు ఆధారపడి ఉన్నవారనేకులు వారిలో ఉన్నారు. వీరు అదనపు ఖాదీని ఉత్పత్తిచేసేటందుకు పూనుకొని, దానిని అమ్మ గలిగితేనే గాని ఖాదీ ధరించజాలరు. వడికేవారి మజూరీ హెచ్చింపబడిన పిమ్మటకూడా ఖాదీకి ఇప్పుడున్న గిరాకీయే ఉన్నయెడల ఈ పని కష్టం కాదు.

ఆచరణలో, ఈ అన్ని దశలలోనూ, ఒకసారే పని జరుగుతూంటుంది. సరియైన చోట నొక్కి చెప్పి అసలు ఆదర్శమేదో అసందిగ్ధమైన భాషలో ప్రకటించడమే నూతన ప్రణాళిక చేస్తూన్న పని. ఖాదీ కార్యకర్తలు ఖాదీ అమ్మకం పెంపొందించడానికీ, ఖాదీ ఖరీదులు తగ్గించడానికీ యిక పనిచేయరు. బట్ట విషయంలో, కనీసం వడకడానికి సంబంధించినంతవరకైనా ప్రజలు స్వయం సహాయకులయ్యే టందుకు కార్యకర్త ఇకముందు శ్రద్ధవహించవలసి ఉంది. కర్మకారులతో వారు సన్నిహిత సంబంధం కల్గించుకొని, స్నేహంచేసి, వారి వాంఛలను తెలుసుకొని, అందరికీ సమా నావకాశాలు ఉండేటట్లు వారి తీరిక సమయాన్ని సాధ్య మయినంత సద్వినియోగం చేయించడంద్వారా, వారి ఆర్థిక పరిస్థితిని క్రమంగా అభివృద్ధిపరచేటందుకు సహాయపడవలెను. ఎట్టి మహాత్వాకాంక్ష ఉన్న కార్యకర్తకైనా ఇది కావలసి నంత మంచి కార్యక్రమం ఒక ప్రక్క లక్షలాది ప్రజలకు తెలియచెప్పి వారి తీరిక సమయాలను వారి అభివృద్ధికోసం ఉపయోగించుకొనేటట్లు ప్రోత్సహించడం, రెండవ ప్రక్క తామిదివరకు పెడుతూన్న ఖరీదుకంటె గ్రామాలల్లో

ఉత్పత్తి అయిన వస్తువుల ఖరీదు ఎక్కువగా కనిపిస్తూన్నప్పటికీ, వాటి ఆకారంకూడా సరిగా ఇంతకు పూర్వం తామలవాటుపడ్డ వస్తువుల ఆకారంవలె ఉండకపోయినప్పటికీ, వాటిని కొన్నట్లయితే ముందు ముందు గిట్టుబాటుగా ఉంటుందని, కొనే వర్గానికి చెందిన నగరవాసులకూ మధ్య తరగతుల వారికీ నచ్చ చెప్పడం—ఈ రెండూ మిక్కిలి కష్టమైన పనులు. సామాన్య ప్రజల భౌతిక పరిస్థితి అభివృద్ధియయి వారి కొనుగోలు శక్తి పెంపొందటంవల్ల నగరవాసులకూ మధ్య తరగతులవారికీ ముందు ముందు లాభప్రదంగా ఉంటుంది. కాబట్టి ఈ కొత్త ప్రణాళిక, 'కులం, రంగు మతము'లతో నిమిత్తం లేకుండా జాతిలో ఉత్తమోత్తములయిన వారందటినీ ఆకర్షించేటందు కుద్దేశింపబడినది. ఇక చివరకు వచ్చే ప్రశ్న ఇది. ఇందుకు తగినంత స్వచ్ఛతా, స్వార్థత్యాగం, పరిశ్రమ, తెలివి ఉన్న కార్యకర్తలు కావలసినంత మంది మనకు లభిస్తారా?

—హరిజన్, 30-11-1935

# 161

# అరువు అమ్మకాలవలని కీడు

ఖాదీని గూర్చిన అఖిల భారత చరఖా సంఘముయొక్క విధానము యావత్తూ వివరంగా పరిశీలింపబడుతూన్నప్పుడు, అరువుకు ఖాదీ అమ్మే ఆచారం, మొత్తంమీద లాభంకంటె నష్టాన్ని చేకూర్చిందని, వివిధ ఖాదీ దుకాణాలకు యాజమాన్యం వహిస్తూన్నవారికి జ్ఞాపకంచేయడం ఉచితం. స్నేహితులకు, పరిచయులకు, భాగ్యవంతులకు, అరువు ఇవ్వవలెనే ప్రలోభనం చాలా ఎక్కువగా ఉంటుందనడానికి సందేహం లేదు. ఏ విధంగానూ సంశయింపవలసిన అవసరం లేనప్పుడు అరువీయడం నిరాకరిస్తే వారికి కష్టం కలుగుతుందని అంటారు. అమ్మే మనిషి, అసూయాహేతుకములయిన భేదములు చూపవలెనని అనుకోవడం తప్పని ఈ పెద్ద మనుష్యులు గుర్తించరు. స్నేహితులున్నూ, భాగ్యవంతులున్నూ చేసిన అప్పులు తీర్చడంలేదని ఖాదీ దుకాణాల వ్యవస్థాపకులనుండి అనేక అభియోగములు చేరుతున్నవి. ఆ అప్పులను రాబట్టుకోవడానికి న్యాయశాస్త్రపద్ధతులను అవలంబించడం మెచ్చుకోదగిన విషయం కాకపోవడమేగాక ఖర్చుతోకూడిన పని. పైగా తఱచు దానివలన ప్రయోజనం కంటె వ్యాకులం ఎక్కువ. కాబట్టి కొంతమందికి కష్టం కలిగినప్పటికీ కొంతమంది వతను దార్లను పోగొట్టుకొన్నప్పటికీ 'అరువు అమ్మకాలు లేవు' అనే అత్యుత్తమ నియమము నుండి ఎప్పుడూ వైదొలగకుండా ఉండడం క్షేమం.

ఖాదీ సందేశం కేవలం నగరాలకోసమే ఉద్దేశింపబడలేదనీ దానిని ఆలకించేటందుకు వేచి ఉన్న లక్షలాది గ్రామాలకది వ్యాపించవలసి ఉన్నదనీ ఖాదీ కార్యకర్తలు గ్రహింతురు గాక. వాటిని చేరుకోవడ మెలాగో మనకు తెలియదు. ఇంతవరకూ మనము చుట్టుత్రోవను ప్రయత్నించి చూచాము. నగర దుకాణములలోని పుస్తకములలో అమ్మకముల నిరంతరాభివృద్ధిని చూపే వ్యర్థ ప్రయత్నంవలన నిజమైన తిన్నని త్రోవ మనకు కనిపించదు. నగరాలకు పోయేది అదనపు ఖాదీయేనని వారు తెలుసుకొందురు గాక. ఖాదీలో చాలా భాగము గ్రామస్థులచే తయారుచేయబడి వారిచేతనే వినియోగింపబడుతుంది. గ్రామస్థులను చేరుకోవడానికి నిజమైనమార్గం వారి కుటీరములలోనే వారిపైన శ్రద్ధవహించడం. కాబట్టి నగరంలోని అమ్మకాలు ఖాదీ ప్రచారాభివృద్ధికి చిహ్నంకాదు. ఇకముందు ఖాదీ లెక్కలు, యేటేటా గ్రామాలలో జరుగుతూన్న అభివృద్ధిని చూపవలసి ఉంది. గ్రామాలలో ఖాదీ ప్రచారం కొరకు అధిక సంఖ్యాకులయిన కార్యకర్తలు విడుదల కావలెనంటే, నగరాలలో మన కృషిని తగ్గించాలి. అందుకు అరువు అమ్మకాలను పట్టుదలగా మానివేసి రొక్కం అమ్మకములోని గుణాన్ని గ్రహించి నిజంగా ఖాదీ కావలసిన వారికొరకే శ్రద్ధ వహించడం ఒక పద్ధతి. అరువు అమ్మకం తప్పకుండా ఖరీదులను హెచ్చిస్తుంది. అందుకు కారణం అందులో ఎక్కువ పని ఉంది. అందువల్ల ఎక్కువ ఖర్చులవుతవి, ఈ అన్ని దృక్పథములనుండీ ఆలోచించినప్పటికీ

అరుఫు అమ్మకాలవల్ల కొద్దిమంది వతనుదారుల సంశయాస్పదమైన సౌకర్యంతప్ప మఱొక ప్రయోజనమేమీ లేదు. అయితే ఖాదీ యేకొలదిమంది సౌకర్యంకోసమో ఉండడం లేదు. అది అందఱి క్షేమంకోసమూ ఉద్దేశింపబడినది. కాబట్టి, ఖాదీ అమ్మకాలను రొకట్టుపు బేరములకు మాత్రమే పరిమితం చేయడంలో అఖిలభారత చరఖా సంఘం ఆకలితో అల్లాడుతూన్న లక్షలాది ప్రజల శ్రేయస్సునేగాక, ఖాదీ కొనే నగరవాసుల క్షేమాన్నికూడా అభిలషిస్తూన్నది.

—హరిజన్, 7-12-1935

# 162

# గ్రామీణ ప్రదర్శనములు

మగన్‌వాడీలో చిన్న ప్రదర్శనము నేర్పాటుచేసి అఖిల భారత గ్రామ పరపతి సంఘం ఒక వినూత్న ప్రయోగమును ప్రారంభించింది. లక్నోకు రానివారికి లక్నో ప్రదర్శనం ఎలా ఉండి ఉండవలెనో అనే ఒక అభిప్రాయం కలిగేటందుకు బుద్ధిపూర్వకంగా ఈ ప్రదర్శనంలోకి ఉచితప్రవేశ మేర్పాటు చేయబడింది. లక్నో ప్రదర్శనమునుండి పటాలు రంగు రంగుల చిత్రములు తీసుకొని రాబడినవి. ఆవరణలో ముఖ్య పరిశ్రమలు ఉండనే ఉన్నవి. కాని రావలసినంతమంది జనం రాలేదు. ప్రజలకింకా ప్రబోధం చేయవలసి ఉంది. వార్ధాకువచ్చే పల్లెటూరివారనేకమంది పని వెదుకుకోవడానికి గానీ ప్రతివారం జరిగే సంతలో తాము పండించిన కూరలు, ఉత్పత్తిచేసిన వస్తువులు అమ్ముకొని తమకు వారానికి కావలసిన సామగ్రిని కొనుక్కోవడానికి గానీ వస్తూంటారు ప్రదర్శనానికి వెళ్ళేటందుకు వారికి కోరికగానీ తీరికగానీ లేదు. మన పటాలను అర్థం చేసుకొనేటందుకు వారికి అక్షరాలు రావు. ఈ ప్రదర్శనాలను మనము వారి గుమ్మములకడకు తీసుకొని పోవలెను. మనం నిర్ణయించే కాలం వారికి తగి ఉండవలెను. మన పటాలు వారి కర్థమయ్యేటట్టు చేయవలెను. ఐతే ఈ వార్ధా ప్రదర్శనం గ్రామ ప్రజలకోసం ఎక్కువగా ఉద్దేశింపబడినది. మొత్తంమీద వార్ధా ప్రజలు తమచుట్టూ నడుస్తూన్న ఈ నూతన ప్రయోగాలనుగూర్చి అంత ఉత్సాహం చూపించక అంటే అంటనట్లుగా ప్రవర్తిస్తున్నారు. వారు దాదాపు 'పీటరు బెల్సు' వలెనున్నారు.

ఇండియాలో చాలా గ్రామాలు ఉన్నట్లే చాలా వార్ధాలు కూడా ఉన్నవి. ఈ ప్రదర్శనాన్ని ప్రారంభిస్తూ గాంధీజీ చేసిన ప్రసంగంలోని కొన్ని మాటలు ఈ పట్టణవాసుల నుద్దేశించియే చెప్పబడినవి.

"నేను మగన్‌వాడీకి వస్తూ ప్రతి ఆదివారం ఇక్కడ జరుగుతూన్న సంత చూచాను. అందులో కావలసినన్ని ముడివస్తువులు వాటితో తయారు చేయబడిన సామానులూ కూడా ప్రదర్శింపబడి ఉన్నవి. అయితే ఈ ప్రదర్శనంలో చాలా చిన్న యెత్తున ఈ వస్తువులు ప్రదర్శింపబడినవి. ప్రతివారమూ జరిగే ఈ సంతకూ మా ప్రదర్శనానికీ ఎలాంటి పోలిక ఉందా అని నా కాశ్చర్యం కలిగింది. మా ప్రదర్శనం గ్రామాలకూ పట్టణస్థులకూ కూడా ఉపకారం చేయవలెననే ఉద్దేశంతో యేర్పాటు చేయబడినది. సంత ఒక వ్యాపార సంస్థ. దాని ద్వారా గ్రామస్థుడు స్వార్థంకోసం వినియోగించుకో బడుతున్నాడు. ఆయన తన వస్తువులను సాధ్యమైనంత చౌకగా అమ్మేటట్లు తలచుగా ఆయనకయిన ఖర్చుకంటె కూడా తక్కువ కమ్మేటట్లు యేర్పాటు చేయబడుతూన్నది. ఈ మా ప్రదర్శనంలో అమ్మడం కొనడం అనేది లేనే లేదు. తమ చుట్టుపట్లనున్న గ్రామాలయెడల తమ కర్తవ్యమును నిర్వర్తించేటట్లు వార్ధా ప్రజలకున్నూ, అన్ని విధాలా తమను తాము బాగు చేసుకొనేటందుకు కల అవకాశమును గ్రామస్థులకున్నూ బోధ చేయడానికే ఈ ప్రదర్శనం ప్రయత్నిస్తూన్నది. తమ గ్రామాలను ఎలా పరిశుభ్రం చేసుకోవాలో ఏ ఆహారం భుజించవలెనో తమ పరిశ్రమలను ఎలా అభివృద్ధి చేసుకొని ఇప్పటికంటె ఇంకా కొంచెం ఎక్కువ సంపాదించుకోవలెనో అనే విషయాలను

ఈ ప్రదర్శనం వారికి బోధిస్తూన్నది. పట్టణవాసికి సంబంధించి నంతవరకు ఆయన గ్రామస్థుని ఎన్నివిధాల స్వార్థంకోసం వినియోగించుకొంటూన్నదీ గ్రామస్థుని వస్తువునుకొని అతని కేవిధంగా మహోపకారం చేయగలిగిందీ ఆయన మన స్సుకు వచ్చేటట్లు చేస్తుంది ఈ ప్రదర్శనం. లక్నో ప్రదర్శన మును దర్శించిన వారందరికీ మన గ్రామ శిల్పకారుల అద్భుత సామర్థ్యం కనువిప్పయింది. ఇదికూడా కొంతవర కలా చేయగలదు. ఇక్కడ ప్రదర్శనమునకు ఉచితంగా ప్రవేశముంది. లక్నోలో అలా లేదు. లక్నో ప్రదర్శన మునకు చాలా నష్టము వచ్చినట్లు వార్తలు ప్రచురింపబడినవి. అవి తప్పు వార్తలు. టికెట్లద్వారా వచ్చిన సొమ్ము రూ 23,000 లకు మించిపోయింది. ఇక దుకాణదారుల కడ నుండికూడా కొంత సొమ్ము వచ్చింది. కాబట్టి నామ మాత్రమైన లాభము మిగలడానికే సరిగా సావకాశముంది. లక్నో పరిసరములనున్నవారు ఇక మరికొన్ని యేళ్లవరకూ అటువంటి ప్రదర్శనమును చూడజాలరు. కుంభమేళా దీర్ఘ కాలానికి నియమిత సమయాలలో ప్రతి పర్యాయం జరుగు తూంటుంది. కాంగ్రెసు, ప్రదర్శనము, ఈ రెండూ తిరిగీ ఒకేచోట జరుగకపోవచ్చును. ఒకవేళ అలా జరిగినా ఎప్పటికో చిరకాలానికి జరుగవచ్చు. అవి పెద్దపెద్ద నగరా లలో గాక చిన్నచిన్న పట్టణాలలో జరుపబడవలెనను ప్రస్తుత వైఖరియే అందుకు ముఖ్య కారణం. కాని ఇటువంటి స్థానిక ప్రదర్శనాలు యేటేటా అంతకంత కెక్కువ ప్రబోధ నోద్దేశంతో ఖర్చు లేకుండా జరుపబడే ప్రయత్నాలుగా ఉండాలి. ఉదాహరణమునకు గ్రామంలోని తెలుకుల మనిషి ఈనా డధోగతిలో ఉన్నాడు. అతను చౌకగా ఉండే కృత్రిమ వస్తువులతో నూనె కల్తీ చేస్తున్నాడు.

నూనె కల్తీ లేకుండా పరిశుభ్రంగా ఉంటే ఎలా లాభిస్తుందో ఇక్కడ ఆయన నేర్చుకోగలడు. కాగితపు పనివాడు చక్కని కాగితాన్ని చాలాకాలం మనేటట్లు చేయటం నేర్చు కొంటాడు. కాలం గడచిన కొద్దీ ఆయా పద్ధతులలో అభి వృద్ధి చూపించగలం. మన చుట్టుపట్లగానీ మన పరిసరగ్రామా లలోగానీ ఈ సంవత్సరం చేసిన పనివలన యేమీ యెక్కువ మార్పు తీసుకొని రాలేక పోయినామని నాకు తెలుసు. కాని అది నాకాశాభంగం కలిగించదు. మనం చాలా కష్టపడి పనిచేయాలి. ఇక్కడకు వచ్చిన మీరందఱు గ్రామా లకు ప్రకటన యేజెంట్లుగా వెళ్ళి వారిని ప్రదర్శనమునకు వచ్చే టట్లుగా చేయాలి. పట్టణవాసి గ్రామాలయెడ అంతకంత కెక్కువ ఉపేక్షాభావం వహించడమే నేటి విషాదకర పరిస్థితి. అంతేకాదు. కొద్దికాలంలో గ్రామాలు నిర్మూలం చేయ బడతాయని కూడా ఆయన విశ్వాసం. చేతితో తయారు చేసిన వస్తువులకు బదులుగా యంత్రాలపై తయారైన వస్తు వులనే మన మెక్కువగా ఆదరిస్తూ ఉన్నయెడల ఆ పని జరిగే మాట నిశ్చయం. ఇక్కడకు వచ్చిన మీరందరూ గ్రామీణ చిత్తవృత్తి అనే తత్వ ప్రబోధకులుగా తయారిపోవాలి.

"ఒక్క యంత్రాలయం, కొన్ని వందల మందికి పని కల్పించి వేలమందికి పనిలేకుండా చేస్తుంది. ఒక్క నూనె మరలో నేను టన్నులకొలదీ నూనె ఉత్పత్తి చేయవచ్చును. కాని వేలకొలదీ తెలుకులవారికి పనిలేకుండా చేస్తున్నాను. దీనిని నేను వినాశకరశక్తి అంటాను. లక్షలాది ప్రజలచేత చేయబడే ఉత్పత్తి నిర్మాణశక్తి కావడమేగాక అందఱి క్షేమానికీ అనుగుణంగా ఉంటుంది. విద్యుచ్ఛక్తిచే నడపబడే

యంత్రంద్వారా బ్రహ్మాండమైన ఉత్పత్తి ప్రభుత్వ యాజమాన్యంక్రిందనే జరిగినప్పటికీ ప్రయోజనం లేదు.

"అయితే లక్షలాది ప్రజల శ్రమ తగ్గించి వారి విజ్ఞానాభివృద్ధికి వీలుగానుండేటట్లు యెక్కువ విశ్రాంతిని వారి కెందుకీయకూడదని ప్రశ్న వస్తుంది. విశ్రాంతి కొంతవరకు మాత్రమే అవసరము, క్షేమమూను. చెమటవోడ్చి, తిని జీవించవలెనని దేవుడు మానవుని సృజించాడు. గారడీ వాని టోపీలోనుంచి మనకు కావలసినదంతా, ఆహార పదార్థాలతో సహా ఉత్పత్తి చేసుకోవడానికి సావకాశం ఉన్నదనుకొంటే నాకు భయం వేస్తుంది."

—హరిజన్, 16-5-1936

# 163
# అనవసర భీతి

పండిత జవహర్‌లాలు నెహ్రూగారు బొంబాయిలోని ఖాదీ భాండారమును సందర్శించిన సందర్భంలో ఖాదీని గూర్చి ఆయన చెప్పినది సంగ్రహంగా ప్రచురించబడిన వార్త నేనొక పత్రికలో చూచి నమ్మలేదు. ఖాదీ విషయంలో ఆయన నిశ్చితాభిప్రాయంగా నేననుకొన్నదానికి అది కేవలం విరుద్ధంగా కనిపించింది నాకు. కాబట్టి ఆ వార్తను కత్తిరించి పండితునికి పంపగా ఆయన వెంటనే నాకీ ప్రత్యుత్తరం పంపించారు :—

"బొంబాయిలో అనేక జనుల సమావేశములకు పోయి నేను మాట్లాడినాను. వాటి లెక్క నాకు జ్ఞాపకం లేదు. పత్రికా వార్తలను చూచేటందుకు నాకవకాశం లేకపోయింది. అయితే నేను హిందూస్థానీలో మాట్లాడాను. అది వ్రాసుకోవడమంత తేలికయిన పని కాదు. అంతేకాక సంగ్రహంగా వ్రాయబడిన వార్తలు అపోహలు కలిగించేటందుకు వీలుంది. కానీ నేను ఖాదీని గూర్చి చెప్పినట్లు ప్రచురించబడిన వార్త నాకు చూపించబడినది; అది ఆనాడో ఆ మరునాడో సవరించబడినది కూడా. నేను చెప్పినదేమంటే, అనేక కారణాలవల్ల ఆర్థిక, రాజకీయ, సాంఘిక కారణాలవల్ల మన ప్రస్తుత కార్యక్రమంలో ఖాదీ చాలా ప్రాముఖ్యమైన అంశము. అది ప్రోత్సహించబడవలసిందే. కాని అది మన పేదరికపు సమస్యను ముఖ్యంగా ప్రస్తుత సాంఘిక విధానమలాగే కొనసాగుతూన్నంతవరకు శాశ్వతంగా పరిష్కరిస్తుందనే నమ్మకం నాకు లేదు. ఈ విధానంలో రైతుచేసిన అభివృద్ధియున్నూ, ఆయన అదనపు సంపాదనయున్నూ భూఖామందుకు చెందుతూన్నవి. అయితే ఈ సిద్ధాంతవాదం ఈనాడు వర్తించదని నిరూపించాను. అందువల్ల నేను భారీపరిశ్రమలకు అనుకూలుడనైనప్పటికీ, పారిశ్రామికాభివృద్ధితోపాటు భారతదేశంలో కుటీరపరిశ్రమాభివృద్ధికికూడా తగినంత తావు ఉందని నమ్ముతూన్నట్లు చెప్పినాను. ప్రస్తుతం అనేక దృక్పథములనుండి అవి ఇంకా ప్రాముఖ్యం వహిస్తూన్న మాట నిజం."

ఈ స్థితి 'పూర్తి ఖాదీ వాదులకు' నచ్చకపోవచ్చును. కాని అపోహ కల్గించిన వార్తకూ దీనికీ చాలా వ్యత్యాసం ఉంది. ముఖ్యంగా భారతదేశంలో ఆటువంటి తప్పు వార్తలు పంపబడడం ప్రజాసేవకులకు అనుభవమే. వారు భారతీయ భాషలో మాట్లాడవలసినప్పుడు వార్తా విలేఖకులు ఎల్లప్పుడూ అర్థంచేసుకోలేరు. అంతేకాక తంతీద్వారా వార్త పంపవలసిఉన్నప్పుడు తప్పక ఇంగ్లీషులోకి తర్జుమా చేయవలసిఉంది. దీనినిగూర్చి నేర్చుకోవలసిందేమంటే, ముఖ్యవిషయాలలో నాయకుల ప్రకటనలని చెప్పబడేవాటిని నమ్మేముందు ప్రజలు అధికార రీత్యా వచ్చే వార్తకోసం వేచిఉండవలెనని.

కొంతమంది ఖాదీ కార్యకర్తలలో ఈ వార్త చాలా వ్యాకులం కలిగించినదని నాకు వచ్చిన ఉత్తరములను బట్టి తెలుస్తూన్నది. వారికి నేను ముందుగా ఒక మాట చెప్పవలసి ఉంది. అదృష్టవశాత్తూ పండిత జవహార లాలు చెప్పినదంతా జరగవలసిన పనికి సంబంధించినంతవరకు సంతృప్తికరంగా ఉన్నది. తాను నమ్మని మాట యేదీ ఇతరులను సంతోషపెట్టడానికి చెప్పని ఉదారాశయు డాయన. కాబట్టి, కాంగ్రెసు కర్ణధారి ఖాదీకనుకూలమైన అభిప్రాయములను కలిగిఉన్నాడనే సంగతి తెలియడంవలన ఆయన ఉత్తరంలోని విషయానికి మరింత బలం చేకూరు తూన్నది. అయితే కాంగ్రెసుకు వెలుపలనున్న ప్రముఖ ప్రజాసేవకులనేక మంది ఖాదీని నిరసించేవారు అంటనైనా అంటనివారూ ఉన్నారనే సంగతి ఖాదీ కార్యకర్తలు గ్రహించాలి. కాంగ్రెసు వర్గాలలో సైతం ఖాదీలో నమ్మకంలేనివారు, దానిని వెక్కిరించడంలో ఎప్పుడూ

విసుగుచెందనివారూ, దానిని కాంగ్రెసు కార్యక్రమంలోనుండి తొలగించడానికి వారికి వీలుకలిగేటంతవరకూ కేవలం క్రమశిక్షణకోసం దానిని ధరించేవారుగా ఉన్నారనికూడా వారు తెలుసుకోవాలి. ఇన్ని అవాంతరాలున్నప్పటికీ ఖాదీ అభివృద్ధిఅయింది. అయితే దానికి అటువంటి ప్రాతికూల్యత లేకుండా ఉన్నట్లయితే అది ఇంకా అభివృద్ధి పొందిఉండేదన్నమాట నిశ్చయమే. పండిత జవహరలాలు నెహ్రూకు ఖాదీయందుగల నమ్మకం ఆయన కలిగిఉండడం మిక్కిలి శాంతిదాయకం. అయితే ఆయన ఇంకా ఎక్కువగా పరిశీలించినపిమ్మట, దానికి ఫలితంగా ప్రకటించడం అవసరమని భావిస్తే ఖాదీ కార్యకర్తలేమి చేయవలసి ఉంటుంది? ఖాదీని గూర్చి దాని అవకాశములను గూర్చి పదహారు సంవత్సరాల అనుభవం తరువాత, దాని పనిని గూర్చి సొంతజ్ఞానంమీద ఎవరి నమ్మకం ఆధారపడిఉన్నదో అటువంటి దృఢవిశ్వాసపరులు తగినంతమంది మనకు కలరనే నేననుకుంటున్నాను. ఇంకా ఆ నమ్మకం తెచ్చిపెట్టు కొన్నదే అయితే నేను మరణించగానే ఖాదీకూడా మృతి పొందుతుందనీ, ఆ సమాజసంఘటనానంతరం, పగులగొట్టబడిన రాటాలు నా శరీరాన్ని పూర్తిగా దహనంచేయడానికి సరిపోతవనీ ఒక గొప్ప పత్రికా విలేఖకుడు చెప్పిన జోస్యం తప్పకుండా నిజమయితీరుతుంది. భ్రాంతిపూర్వక భీతివలన కలిగిన ఈ కార్యత్వము ఖాదీ కార్యకర్తల దుర్బల విశ్వాసమునకు చిహ్నమే అయినట్లయితే అది

అశుభ లక్షణం. వారు తమ స్థితిని తాము పరిశీలించుకొని ఖాదీయొక్క గొప్ప ఆర్థిక ప్రాముఖ్యతనుగూర్చి వారికి సంశయాలున్నట్లయితే వారి వైఖరిని మార్చుకోవచ్చును. వారి పరిశీలనకు సహాయకారిగా ఉండేటందుకు అనేక దృక్పథములనుండి భారత దేశమునకు ఖాదీయొక్క ప్రాముఖ్యతను గూర్చి రాబోయే సంచికలోనే సాధ్యమయితే నా అభిప్రాయమును ప్రకటించగలనని సూచిస్తూన్నాను.

—హరిజన్, 6-6-1936

# 164

# ధ్రువపత్రములు లేని ఖాదీ వ్యాపారస్థులకు

అఖిల భారత చరఖా సంఘము పక్షాన నూలువడుకు వారికి హెచ్చు మజూరీలు ఈయబడుతూన్న కారణంగా ఒక తరహాకు చెందిన ఖాదీ ఖరీదు కొద్దిగా హెచ్చడంచేత అనేక మంది ధ్రువపత్రములు లేని ఖాదీ వ్యాపారస్థులు తమది అఖిల భారత చరఖా సంఘము నుండి ధ్రువపత్రములు పొందిన ఖాదీ అయినట్లుగా అమ్ముకొంటూన్నట్లున్నూ, ఇంకా కొంతమంది అఖిల భారత చరఖా సంఘము రిజిష్టర్డు సంస్థ కాదనే కారణం మీద అమానుషమైనట్టిన్నీ, దేశద్రోహకరమైనట్టిన్నీ తమ చర్యను సమర్థించుకోవడానికికూడ వెనుకంజ వేయనట్లున్నూ, దురదృష్టవశాత్తూ, తెలియవస్తూన్నది. తన పూర్వోక్తగపు న్యాయశాస్త్రి జ్ఞానంమీద ఆధారపడిఉండక శ్రీ రాజగోపాలాచారి న్యాయశాస్త్రానుగుణ్యమైన నిజస్థితిని నిశ్చయంగా తెలుసుకొనే ఉద్దేశంతో ఒక ప్రసిద్ధ న్యాయవాదియొక్క అభిప్రాయము కొఱకీ విషయాన్ని పంపించారు. ఇది ఆ న్యాయవాదియొక్క నిశ్చితాభిప్రాయం :—

“న్యాయశాస్త్రమునకు సంబంధించి తిరుపూరు వర్తకునకు తప్పు సలహా ఈయబడినదనే విషయంలో నాకు సందేహం లేదు. ఈ సందర్భంలో న్యాయ శాస్త్రం రిజిష్టర్డు సంస్థలకు, రిజిస్టరుకాని సంస్థలకూకూడా రక్షణ యిస్తూన్నది. తానుకాని మరొకరుగా నటిస్తూ రిజిస్టరు చేయబడిన పేరును ఉపయోగించడం, ప్రజలను ఎంతగా

మోసగించడం అవుతుందో రిజిస్టరు కాని పేరును ఉపయోగించడంకూడా అంతగా మోసగించడమే అవుతుంది. ఒక చట్టంకింద రిజిస్టరుచేయబడినట్లయితే ఆ చట్టం రీత్యా ఫలితాలు రక్షణలు కలుగవచ్చును. కాని ప్రజలను మోసంనుండి రక్షించడంలో మాత్రం రిజిస్టరయిన సంఘాలకు రిజిస్టరు కాని సంఘాలకు భేదం లేదు. ఒక పేరు రిజిస్టరుచేయబడలేదు కనుక ఆ పేరును 'ఆయువ తగిలించుకొని అఖిల భారత చరఖా సంఘముచే ధ్రువపత్రములు పొందబడినట్లుగా సరుకులను పంపించడం చూచీచూడడంతోనే అసంగతమని తోస్తుంది. ఇంజంక్షన్‌కు నష్టపరిహారానికీ చర్య తీసుకోవచ్చును. ఇంజంక్షన్ మీకు వస్తుంది.. నష్టపరిహారం ఆ సరుకు అఖిల భారత చరఖా సంఘము వారిచే తయారు చేయబడినదనికానీ, వారిచే ధ్రువపత్రములు పొందబడినదని కానీ నమ్మి కొనేవారా సరుకులను కొన్నారనే రుజువుమీద ఆధారపడి ఉంటుంది.

ప్రమాణాలతో సక్రమమైన అభిప్రాయం అవసరమయినట్లయితే త్వరలోనే మీకు వ్రాయించి పంపుతాను.

ఉదకమండలం, 23 మే 1936. టి. ఆర్. వి. శాస్త్రి"

ఆ సుప్రసిద్ధ న్యాయవాది, మరెవ్వరూ కారు. మద్రాసు మాజీ అడ్వకేటు జనరల్ శ్రీ టి. ఆర్. వెంకటరామశాస్త్రి గారే. ఈ అభిప్రాయాన్ని అనుసరించి అఖిల భారత చరఖాసంఘంవారి అధికారమును పొందకుండానే పొంది

నట్లుగా అక్రమపు అమ్మకాలను సాగిస్తూన్న వర్తకులు మోసముగా వర్ణింపబడిన ఆ ఆచారమును మానివేస్తారని ఆశిస్తున్నాను. లా కోర్టులకు పోవడం విషయంలో నేను ప్రతికూలుడనైనప్పటికీ, అవసరమైతే నోరులేని, నిరుపేద లైన ఆ నూలు వడికే స్త్రీల శ్రేయస్సుకోసం తమ నిర్భాగ్య సోదరీమణులకు తెలిసి ఉండి కీడుచేసేవారికి ప్రతికూలంగా న్యాయశాస్త్ర ప్రకారం చర్య తీసుకో వలసిందని సలహా యివ్వడంలో వెనుదీయను.

—హరిజన్, 6-6-1936

---

165

# ఖాదీ ఆర్థికంగా సమర్థనీయమా?

ఈ ప్రశ్నకు అర్థం, ఖాదీ జపాను సరుకుతోకానీ లేక భారతీయ మిల్లులలో ఉత్పత్తిచేయబడిన బట్టతోకానీ ఖరీదులో పోటీచేయగలదా అని అయినట్లయితే గట్టిగా 'లేదు' అని చెప్పాలి. అయితే శ్రమ తగ్గించే యంత్ర శక్తికి ప్రతికూలంగా, మనుష్య శక్తిచే ఉత్పత్తి అయిన దాదాపు ప్రతి వస్తువును గూర్చి ఈ 'లేదు' అనే ప్రత్యుత్తరం చెప్పవచ్చును. భారతీయ యంత్రాగారములలో ఉత్పత్తిఅయిన సరుకులనుగూర్చికూడా ఇలాగే చెప్పవచ్చును. యంత్రాగారములలో తయారైన బట్ట, ఇనుము పంచదార ఇవి విదేశీ పోటీని తట్టుకొనేటందుకు యేదో ఒక రూపంలో వాటికి ప్రభుత్వ సహాయం అవసరం. అసలావిధంగా ప్రశ్న వేయడమే తప్పు. బహిరంగమైన అంగడిలో, ఎక్కువ బాగా వ్యవస్థాపితమైన పరిశ్రమ తక్కువగా వ్యవస్థాపితమైన పరిశ్రమను ఎప్పుడూ తోసిపార వేయగలదు. పైగా మొదటిదానికి ప్రభుత్వసహాయం అనంతమైన పెట్టుబడీ ఉండి, తాత్కాలిక నష్టానికికూడా అది ఓర్వగలిగినప్పుడు, మరీ ఎక్కువగా చేయగలదా పని. ఈ దేశంలో అనేక ఉద్యమాలకదే దుర్గతి పట్టింది. అంతులేని విదేశీపోటీకి అర్హమైన ఏ దేశమైనా వస్తు లుండవలసిన పరిస్థితికి దిగిపోయి విదేశీయులకు కోరిక కలిగి నంత మాత్రంతో పరాధీనతకు పాల్పడుతుంది. దీనికే శాంతియుత ప్రవేశమని పేరు. ఇంకొక అడుగు ముందు పోయి ఆలోచిస్తే చేతితో తయారైన వస్తువులకు విద్యుచ్ఛక్తిచే

నడపబడే యంత్రాలద్వారా తయారైన వస్తువులకూ మధ్య కలిగే ఫలితంకూడా యిదేనని తెలుస్తూంది. ఈ పద్ధతి మన కళ్లయెదుట నడుస్తూండడం మనం చూస్తూనే ఉన్నాము. చిన్నచిన్న పిండి మరలు చక్కీని తోసి వేస్తూన్నవి. నూనె మరలు ఊళ్లో గానుగను, బియ్యపు మరలు ఊరి డెంకీని, పంచదార మరలు బెల్లపు పెనాలను, ఇలా ఎన్నో ఎన్నిటినో తోసివేస్తూన్నవి. ఈ విధంగా గ్రామస్థుల కష్టం భగ్నం కావడంవలన వారు దారిద్ర్యమునకు పాల్పడుతూన్నారు. ధనవంతులింకా ధనవంతులవుతున్నారు. ఈ పద్ధతి ఇంకా తగినంత కాలం సాగేయెడల వేరే ప్రయత్నం అవసరం లేకుండానే గ్రామాలు విధ్వంసం కాగలవు. ఈ గ్రామాలను నాశనం చేసేటందుకు ఇంతకంటె ఎక్కువ తెలివిగల పద్ధతిగానీ, లాభప్రదమైన పద్ధతిగానీ చెంగిస్ ఖాన్ వంటివాడుకూడా కనిపెట్టలేకపోయినాడు. అన్నిటిలోకీ విషాదకరపరిస్థితి యేమంటే గ్రామస్థులే తమ విధ్వంసమునకెక్కువ నిశ్చయంగా తమకు తెలియకుండా తోడ్పడుతున్నారు. వ్యవసాయంకూడా లాభదాయకం కాకపోవడంతో వారి విషాదగాథ పరిపూర్ణమయినదని పాఠకులు తెలుసుకొందురుగాక. కొన్ని పైరులవిషయంలో, వేసిన విత్తనాలు ఖరీదుకూడా గ్రామస్థులకు మళ్లడం లేదు. భయంకరమైన ఈ సంగతులన్నీ నేను ఒప్పుకొంటూ, ఖాదీ ఒక్కటే నిజమైన ఆర్థిక ప్రతిపాదన అని చెప్పడంలో నా అర్థమేమి? పూర్తిగా ఆ ప్రతిపాదనను నన్ను చెప్పనీయండి. “పదహారేండ్ల వయస్సుకు పైబడి శరీరసౌష్ఠవంగల ప్రతి మనిషికీ, స్త్రీకిగానీ పురుషునకుగానీ, పొలములో కాని, కుటీరంలో కాని, లేక భారతదేశ గ్రామాలలో ప్రతి ఒక్క గ్రామంలోని ఫ్యాక్టరీలో కాని ఎప్పటికైనా సరియైన

వేతనముతో పనిచూపే ఉత్తమ విధానం కనుగొనబడేటంతవరకున్నూ, లేక మంచి సక్రమ జీవితమునకు కావలసినట్టివన్నీ అర్హతకలిగినట్టివన్నీ సౌఖ్యములను సౌకర్యములను గ్రామస్థులకు కల్పించేటందుకు వీలుగా, గ్రామాలస్థానంలో తగినన్ని నగరాలు నిర్మింపబడేటంతవరకున్నూ, లక్షలాది గ్రామస్థుల పరి భాషలో ఖాదీ ఒక్కటే నిజమైన ఆర్థిక ప్రతిపాదన." నే నింత విపులంగా ఆ ప్రతిపాదనను చెప్పడం, మనం ఊహించగలిగినంత దీర్ఘకాలంవరకూ కూడా ఖాదీ రంగంలో ఉండి తీరవలెనని నిరూపించేటందుకే.

శ్రమ చేసి గ్రామాలకు పోయినవారెవరైనా ప్రత్యక్షంగా చూడగలిగినట్టివన్నీ, సమకాలీన ప్రవీణుల సాక్ష్యంవల్ల పూర్తిగా రుజువయినట్టివన్నీ ప్రస్తుత తీవ్రసమస్య, అంతకంతకు ఎక్కువగా నిరుపేదలవుతూన్న లక్షలాది గ్రామస్థులకు పనిని వేతనములను చూపడమెలాగా అనేదే. ఆర్థికంగా, మానసికంగా, నైతికంగాకూడా ప్రజలంతకంతకెక్కువగా పేదవారవుతున్నారు. వారికి పనిచేయడానికీ, ఆలోచించడానికి, చివరకు బ్రతకడానికీకూడా యేమీ ఇచ్ఛ లేకుండా పోతూన్నది. వారు జీవచ్ఛవములవలె బ్రతుకుతున్నారు. ఖాదీ వారికి పని యిస్తుంది, పరికరముల నిస్తుంది. వారి సరుకు విడుదలయ్యేటందుకు తయారుగా అంగడినిస్తుంది; నిన్నటి వరకూ వట్టినిరాశతో ఉన్నవారికి ఆశ కల్పిస్తుంది.

"ఖాదీ అటువంటి ఆశాజనకమైన ప్రతిపాదనే అయిన యెడల అంత తక్కువ అభివృద్ధి ఎందుకు జరిగింది ?" అని సంశయాత్ము లడుగుతూంటారు. దానికి జవాబిది :

ఖాదీలో జరిగిన అభివృద్ధి దానికది తక్కువకావచ్చును కాని,లక్షలాదిప్రజలకు సంబంధించినంతవరకు, తక్కిన పరిశ్రమ లన్నిటిలోఒకొక్కదానితో ప్రత్యేకం పోల్చిచూచినట్లయితే, ఖాదీలో ఆ అన్నిటిలోకీ ఎక్కువ అభివృద్ధిజరిగింది. కనీసపు పరిపాలనా వ్యయముతో గ్రామాలలో అత్యధిక సంఖ్యాకు లయిన శ్రమజీవులకు, అత్యధికమైన మజూరీల మొత్తం యేటేటా ఖాదీవలన పంచి పెట్టబడుతూన్నది. అంతేకాక దానిలోని ప్రతి కానీ దాదాపు ప్రజలలో తిరుగుతూన్నది. అఖిల భారత చరఖా సంఘంవారిచే ప్రచురింపబడిన అంకె లను పరిశీలించే వారెవరికైనా దీనియథార్థం తెలుస్తుంది.

గ్రామస్థులలో స్థిరపడిపోయిన పూర్వాభిప్రాయాలకు ప్రతి కూలంగా, ప్రభుత్వ రక్షణ లేకపోగా అవినీతికరమైన పోటీకి ప్రతికూలంగా, ప్రస్తుతం వ్యాపంకంలోనున్న అర్థశాస్త్ర నిపుణులని వ్యవహరింపబడేవారి అభిప్రాయానికి ప్రతికూలంగా, అంతకంతకు ఖాదీ ఎక్కువ చౌక కావలెనన్నే ఖాదీధారుల కోరికకుకూడా ప్రతికూలంగా ఖాదీ పనిచేయవలసి వస్తూన్నది. కాబట్టి ఈ దుఃఖభాజనమైన దేశంకోసం నిజమయిన అర్థ శాస్త్రమునుగూర్చి నగరవాసులలోనూ గ్రామస్థులలోనూ కూడా ప్రబోధంచేయడమొక ప్రధాన సమస్య అయింది. ఇది అన్ని మతాలకు అతీతమయినది. గ్రామాలలో కాపురం ఉంటూన్న హిందువులు ముసల్మానులు క్రైస్తవులు అందరూ కూడా దారిద్ర్యము, లేమి అనే ఒక రోగమువలన పీడింపబడుతూన్నారు. ఏమైనా భేదముంటే అది పరి మాణంలో మాత్రమే.

కాబట్టి, గజం గజంగా లెక్కచూచినప్పుడు మిల్లు బట్ట కంటె ఖాదీ ఎక్కువ ప్రియం కావచ్చును. కాని మొత్తం మీద గ్రామస్థులకు సంబంధించినంతవరకు అది ఆర్థికంగా అత్యంత ప్రయోజనకరమైన, ఆచరణయోగ్యమైన అప్రతిమానమైన ప్రతిపాదన, అని నా అభిప్రాయం. ఈ ప్రతిపాదనను ఆ మూలాగ్రంగా ఆలోచించే సందర్భంలో ఖాదీలో ఇతర పరిశ్రమలుగూడా ఇమిడి ఉన్నట్లుగా నిర్వచనం చేసుకోవచ్చును.

—హరిజన్, 20-6-1936

# 166

# ఖాదీ నేతవారికి

ఒక బీహారు విలేఖకుడు వ్రాసిన పెద్ద ఉత్తరమునుండి ఇవి కొన్ని భాగాలు—

"మీమీద నాదొక అభియోగమున్నది. నేను నిత్య ఖద్దరు ధారిని. ఖాదీ మొట్టమొదట కనిపించిన దగ్గరనుండీ నేను ఖాదీ ఉపయోగిస్తున్నాను. ఈ రోజువరకు నేను దానిని ఉపయోగిస్తూనే ఉన్నాను. దానిని నేను జాతీయ పరిధానంగా భావిస్తున్నాను. నా పేదరికమువలన ఎప్పుడైనా నేను ఖాదీని విడిచివేయవలసివస్తే నేను చాలా బాధపడతాను. అనుకోకుండా యేవిధమైన నిష్పత్తి లేకుండా ప్రస్తుతం హెచ్చింపబడిన దాని ఖరీదు నన్నాస్థితికి ఈడుస్తుందేమోనని నాకు భయంగా ఉన్నది. నాస్థితిలోనేఉన్న నా స్నేహితులనేకమందికూడా, బాధపడుతూ సిగ్గుతో, తప్పనిసరిగా మిల్లు బట్టలోకి దిగుతారేమోనని అనుకొంటున్నాను. ఇది ఖాదీ ఉద్యమంయొక్క సంపూర్ణపతనమునకు దారితీస్తుందని నా అభిప్రాయం.

వడికే నిరుపేదలకు ఎక్కువ ముట్టచెప్పవలెనని మీ కోరిక అయినట్లుగా నాకు తెలిసింది. మంచిదే, కాని అది ఎవరిజేబులలోనుండి? ఈ ఉద్యమ సానుభూతిపరులలో భాగ్యవంతులు దాదాపు మృగ్యం. నిరుపేదలైన ఖాదీధారులు వి ఆదర్శంకోసం నిలబడి ధైర్యంగా పోరాడారో ఆ ఆదర్శాన్ని విడిచివేయక తప్పకపోతే అది వారికి నిశ్చయంగా మరణమే. మీరు చాలా సమయంకాని సమయంలో హెచ్చించతలపెట్టారు. మీరు దండయాత్ర సాగించిన సమయంలో యిది నిర్ణయించిఉన్నట్లయితే మీరు దీనిని జయప్రదంచేయగలిగిఉండేవారు. కాని ప్రస్తుత నిర్ణయం పెద్ద తప్పు. దీని వలన మీరే ఉద్యమాన్ని చక్కగా పాతివేస్తున్నారని భయం."

**ఈ దిగువ ఉత్తరం యు.పి. విలేఖకునియొద్దనుండి—**

"నాకు ఖాదీలో గట్టి నమ్మకంఉంది. మన చెడుగులను చాలావరకు పరిష్కరించగల దాని శక్తిలో నాకింకా సంపూర్ణ విశ్వాసంవుంది. దాని వలన ఆశ్చర్యకరమైన మానసిక పరివర్తనం చాలామంది మనస్సులలో కలిగింది. 1920 నుండి నేను ఖాదీని మతధర్మంగా ధరిస్తూ ప్రచారం

చేస్తున్నాను. కాని పండిత జవహరలాలు నెహ్రూ, దాని ప్రాముఖ్యత, అవసరం, ఉపయోగం చాలావరకు తగ్గించివేశారు. అందువల్ల చాలా మంది నిక్కచ్చి అయిన ఖాదీధారులు సందిగ్ధావస్థలోపడ్డారు. ఇక దుర్బలవిశ్వాసంకలవారికి పండిట్జీ సురక్షితమైన శరణ్యమైనారు. ఖాదీ వాడుకనుగూర్చి కాంగ్రెసుకూడా కాఠిన్యమును సడలించింది. మీరో మీ సునిశ్చితమానంలో మనశ్శాంతి పొందుతున్నట్లు కనిపిస్తున్నారు. ఈ ప్రస్తుత పరిస్థితులలో మీరు మాకు మార్గదర్శకులై మా ధర్మమును మాకు తెలిపెదరా ? ఖాదీ సరఫరాచేనేటందు ఆధారభూతమైన అఖిల భారత చర్కాసంఘం యొక్క ప్రస్తుత నిర్మాణమువలన మాకు మరొక చిక్కు కలుగుతూన్నది. ప్రస్తుత పరిస్థితులలో ఖాది అంతకంతకు ప్రియమై సరఫరా నానాటికి తగ్గిపోతూన్నది. స్వతంత్రంగానూ వ్యక్తిగతంగానూ ఖాదీ ఉత్పత్తి చేసుకొనేవారంతా, ఒక గజం ఖాదీకూడా ఉత్పత్తి చేయకుండా దాదాపు నిషేధింపబడ్డారు. మొట్టమొదటిది, నియమాలు, నిబంధనలు న్యాయంగా లేవు, రెండోది, అనుసరించడానికి సాధ్యం కాకుండా ఉన్నవి. మూడవది అవి తప్పుగా అమలు జరుపబడుతూన్నవి. మీచే యే భావంతో నిర్ణయింపబడి ఉండవచ్చునో ఆ భావంతో అమలు జరగడం లేదు. నాకు సంబంధించినంతవరకు మా యింట్లో చరఖాను ప్రవేశపెట్టాను. అది ప్రతిరోజు తిరుగుతూనే ఉన్నది. కేవలం నా కవసరమైన బట్టలకోసం అంగడిలో కొనక తప్పడంలేదు నాకు. అక్కడ సరఫరా తక్కువగా ఉంది. ఎక్కువ ప్రియంగావుంది. తమ ఉత్పత్తిని మానవలసివచ్చిన ఖాదీ ఉత్పత్తిదారులయిన వ్యక్తులమీద మీరు పెట్టిన నిర్బంధాల్ను మీరెలాసమర్థిస్తారు ? ”

మధ్యరాష్ట్రాల జాతీయ పార్టీలనుండికూడా ఇటువంటి అభియోగమే వచ్చింది. పండిత జవహరలాలు నెహ్రూ ఉపన్యాసం తప్పుగా ప్రచురించబడినదని ఆయన స్పష్టపరిచారు. ఖాదీనిగూర్చి విశ్వాసంగల యితరులవలెనే ఆయనకూడా దేశం స్వాతంత్ర్యమును పొందేటంతవరకూ ఖాదీ ముఖ్యావసరమని భావించారు. దాని ఆర్థికమూల్యమునుగూర్చి ఆయన కసలు సంశయమేమయినా ఉంటే, స్వాతంత్ర్యం లభించి పారిశ్రామికవిధానం దేశంలో పెద్ద ఎత్తున సాగుతూన్నప్పుడు మాత్రమే ఆ సంశయానికి

స్థానమున్నవి. ఎప్పుడో భారత దేశం పారిశ్రామిక విధానమును పెంపొందించుకొన్నప్పుడు—పెంపొందించుకోక పోవచ్చును కూడా—దానికింద ఖాదీ మునిగిపోతుందనే భయంతో నిజంగా బుద్ధిమంతుడెవ్వడూ ఇప్పుడు ఖాదీని విడిచిపెట్టడు. వ్యక్తి ఉత్పత్తిదారులపై నిర్బంధములు, కర్మకారుల క్షేమంకోసం ముఖ్యంగా వడికేవారి క్షేమంకోసమున్నా కొనేవారి క్షేమం కోసమున్నా కూడా ఉద్దేశింపబడినవి. అవి తీసివేయబడినట్లయితే బజారంతా కల్తీ ఖాదీతో నిండిపోతుంది. దాని ఫలితంగా వడికేవారి పని పోతుంది. కొనేవాళ్లు మోసపోతారు. ఈ నియమాలను అమలుజరుపడంలో యేదైనా లోపం ఉన్నట్లయితే, కార్యదర్శి దృష్టికది తక్షణం తేవలెను. వెంటనే అది సరిచేయబడుతుంది.

ఖరీదుల హెచ్చింపునుగూర్చిన ప్రశ్నకే సంతృప్తికరమైన జవాబు చెప్పవలసిఉన్నది. ఖాదీకి ఇప్పుడున్న నాణ్యంలో సగం నాణ్యంకూడా లేనప్పుడున్నూ, ఇప్పుడున్న రకాల కంటె చాలా తక్కువ రకాలున్నప్పుడున్నూ, ఈ కొత్త జీతాల ప్రమాణం అమలులోకి రావడమునకు ముందూ, ఖాదీ యింతకంటె చాలా ఎక్కువ ప్రియంగా ఉండేది. అప్పుడున్న ఖరీదులకు ప్రతికూలంగా యెవ్వరూ యేమీ అనలేదు. ఈ అన్ని సంవత్సరాలనుండీ కొనేవారు లాభం పొందుతూన్నప్పటికీ, వడికేవారు మాత్రం యింతవరకూ మజూరీల హెచ్చింపు రూపంలో దాదాపు యేవిధమైన లాభమూ పొందలేదు. వారు నిస్సహాయులైన మూగ ప్రజ. వారు సంఘమునకు ప్రతికూలంగా సమ్మె ప్రకటించలేరు. వారక్కడక్కడా చెదురుగా వ్యాపించి ఉండడంచేత సమాజంగా జీతాల హెచ్చింపుకోసంగానీ మరొకదానికోసం

గానీ అసలు కలియడానికే వీలులేదు. వారా దమ్మిడీలకు కూడా కక్కూర్తిపడవలసి ఉండడంచేత ప్రయోజనకరమైన యెట్టి ప్రతిఘటన చేయడానికీ వారికి శక్తిలేదు. వడికే వారికీయబడుతూన్న నికృష్టపు మజూరీలను సహించలేక మాలో కొంతమంది అంతరాత్మ నేడు తిరుగుబాటు చేస్తూన్నందున ఇంతవఱకూ తక్కువ ఖరీదుల ప్రత్యేక సౌకర్యమునను భవిస్తూవచ్చిన క్రేతల (buyers) సహా యాన్ని మేమభిలషించడానికి మాకు అర్హత ఉన్నది. కొనే పేదవారి కష్టం వేఱే చెప్పనక్కరలేదు. అయితే ఖాదీయొక్క విలువ దాని నైతిక సాంఘిక మూల్యాలలో నున్నది. ఖాదీయొక్క అంతరంగిక భావాన్ని ఖాదీ కొనే వారు అర్థంచేసుకొన్నట్లయితే, దాని ఖరీదుల హెచ్చింపుకు ప్రతికూలంగా—ముఖ్యంగా వడికేవారి మజూరీల హెచ్చింపు కారణంగా ఖాదీ ధర హెచ్చిందని ప్రస్తుత సందర్భంలోవలె పూర్తిగా నిరూపింపబడుతూన్నప్పుడు—యేమీ చెప్పనే చెప్పరు. ఖాదీ కొనడంలో వారు భరించవలసిన హెచ్చు మొత్తాన్ని పూడ్చుకొనేటందుకు, పట్టుదలవుంటే అనేక మార్గాలు వారన్వేషించుకోగలరు. అయితే వారు, భారత దేశంలో ఉన్నంతవరకు ఖాదీ తప్ప మఱొక బట్ట ఎన్నడూ ధరించకుండేటందుకు నిర్ణయించుకొని శాశ్వతంగా ఒక పద్ధతికి నిలబడితేనే ఈ పని చేయగలరు. తప్పించుకొనిపోవడానికి యేమాత్రం సందు ఉంచుకొన్నా, అత్యవసర సందర్భాలలో దానిని ఉపయోగించుకొంటారు. సాధారణంగా అవసరాన్ని బట్టి ఉపాయం తట్టుతూంటుంది. ఖాదీ తప్ప కట్టుకొనే టందుకు వారికి మఱొక బట్టలేదని ఈ విలేఖకులు నిశ్చ యించుకొని ఉన్నట్లయితే, ఇప్పుడు వ్రాసినట్లుగా వారు వ్రాసిఉండేవారే కారు. ఈ విలేఖకులకంటే యేవిధం

గాను హెచ్చు స్థాయిలో లేని అత్యధిక సంఖ్యాకులవలెనే వీరుకూడా, ఖాదీ ధరలో ఈ కొద్ది హెచ్చింపును సరిపెట్టుకొని ఉండేవారే.

ఈ సందర్భంలోనే నిరుపేదలయిన ఖాదీ ప్రియులకోసం ఈ హెచ్చింపు సాధ్యమైనంత తక్కువగా ఉండేటట్టు అన్ని ప్రయత్నాలూ చేయబడుతూన్నవని హామీ ఈయడంద్వారా ఈ విలేఖకులను ఓదార్తును గాక! వడికేవారి మజూరీలను అయాచితంగా హెచ్చు చేయడంలో, ఈ నూతన ప్రయోగం పొందుతూన్న అఖండవిజయమును గూర్చి అఖిల భారత చరాకా సంఘమున్నూ, తమిళనాడు కార్యదర్శిన్నీ, రాజేంద్ర బాబున్నూ పంపిన నివేదికలను వారుకూడా పరిశీలింతురు గాక. ఖాదీ ఖరీదుకొద్దిగా హెచ్చినప్పటికీ, దానికి తగినట్లుగా ఖాదీయొక్క నాణ్యము, మనుగడ, హెచ్చిన సంగతి ఖాదీప్రియులు సహనం వహించి చూస్తే గమనించగలరు.

—హరిజన్, 4-7-1936

# 167

# ధ్రువ పత్రములు లేనివి, కలవి

వడుకు మజూరీలలో నూతన ప్రమాణమును ప్రవేశపెట్టిన మీద తమిళనాడులో వచ్చిన చిక్కే, ఇతర స్థలాలలోకూడా, ముఖ్యంగా ఆంధ్రాలో తటస్థించినట్లు, ఆ ప్రాంతాలనుండి నాకు వచ్చిన అనేక ఉత్తరాలవలన కనబడుతూన్నది. అదనంగా ఒక కానీ సంపాదించుకోవడానికయినా అవకాశం లేని నిరుపేదలయిన స్త్రీల విషయంలో ధ్రువ పత్రములు పొందని ఖాదీ వ్యాపారస్థులు కావిస్తూన్న అపకారమును గూర్చి విలేఖకులు తీవ్రంగా అసంతుష్టిని ప్రకటిస్తూన్నారు. వేలకొలదీ నూలు వడికే నిరుపేదల చేతులలోనుండి కానులు లాక్కొనేటంత స్వార్థపరులుగా ఉండవద్దని చెపుతూన్న నాగోడును ధ్రువ పత్రములు పొందని వర్తకు లాలకిస్తారో లేదో నాకు తెలియదు. ఆలకిస్తారనే ఆశిస్తున్నాను. అయితే ఇందుకు నిజమైన పరిహారం ఖాదీ కొనే ప్రజల చేతులలో ఉన్నది. అఖిల భారత చరాకా సంఘం వారిచే ధ్రువ పత్రములు పొందిన భాండారములనుండి తప్ప మఱొక చోట వారు ఖాదీ కొననట్లయితే, ధ్రువ పత్రములు పొందని భాండారములు మూతపడక తప్పదు. అఖిల భారత చరాకా సంఘం లేనట్లయితే ఖాదీ ఉండజాలదని ప్రజలు గ్రహించాలి. ఖాదీ బాగా చలామణీ లోకివచ్చి సాధారణంగా గ్రామస్థుల అభిమానాన్ని చూరగొన గలిగేటంతవరకు, అది జాగరూకత కలిగిన ఒక సంస్థ ద్వారా పోషింపబడుతూ ఉండాలి. ఆ సంస్థ కాదున్నహ ధర్మాన్ని నిర్వర్తించగల సామర్థ్యం ఉండాలి. అఖిల భారత చరాకా సంఘం అటువంటి సంస్థయే. అది కేవలం, భారతీయ గ్రామాలలో

నూలు వడికే లక్షలాది నిరుపేద స్త్రీల శ్రేయస్సును తప్ప మఱొక ప్రయోజనమును దేనినీ ఆశించని ధర్మ సంస్థ అని ప్రజలకు తెలుసును; తెలియకపోతే తెలుసుకోవాలి. దాని పేరు సూచిస్తూన్నట్లుగా దాని కార్యకలాపములు యావత్తూ, వారి ప్రయోజనములను పెంపొందించుటకే ఉద్దేశింపబడినవి. సంవత్సరంలో దాదాపు ఆరు నెలలు చేసేటందుకు పనిలేని లక్షలాది స్త్రీలకు, వారి శారీరక తత్త్వాలకు తగినట్లు సుస్థిర మైనట్టిదీన్నీ లాభదాయకమైనట్టిదీన్నీ వృత్తి లభించకపోయిన ట్లయితే గ్రామాల ఆర్థిక మోక్షం అసంభవం. నూలు వడకడంవంటి సార్వజనీనవృత్తి మఱొకటి లేదు. ధ్రువపత్రం లేని ఖాదీ భాండారాలు చర్ఖా సంఘపు ధరల కంటె తక్కువ ధరలకు ఖాదీ అమ్ముతూన్నప్పటికీ వాటిని మినహాయించి ధ్రువ పత్రములు పొందిన ఖాదీ భాండారాలనే ప్రజలు అభిమానించవలసిన అవసరమును ప్రస్ఫుటం చేసే టందుకే అనేక పర్యాయములు చెప్పిన ఈ సత్యాన్ని నేను పునరుద్ఘాటింపవలసి వస్తూన్నది. చర్ఖా సంఘపు ధరలవలన మాత్రమే వడికేవారికి ఎక్కువ మజూరీలు ఈయడానికి సావకాశం కలుగుతుందని ప్రజలు తెలుసుకోవలసి ఉంది.

—హరిజన్, 29-8-1936

# 168
# పట్టు, పత్తి

చేతితో తయారుచేయబడిన పట్టుకు, పత్తినుండి చేతితో ఉత్పత్తి చేయబడిన ఖాదీకి ప్రస్తుతం గాఢంగా పోటీ నడుస్తూన్నది. అఖిల భారత చరాకా సంఘమునకు సంబంధించినంతవరకు ఈ విషయం చాలా కాలం క్రిందటనే సరిచేయబడినది. ఖాదీకి ఇంకా ఎక్కువ మంది వతను దార్లను ఆకర్షించేటందుకున్నూ, పట్టు బట్టమీద ఎక్కువ ధర తీసుకోవడంవలన ఖాదీమీద వచ్చే నష్టాన్ని కొంత పూడ్చుకోవడానికి వీలుగా నుండేటందుకున్నూ, దేశీయ పట్టు బట్టలను ఉంచడానికి ధ్రువ పత్రములుగల ఖాదీ భాండాగారాలకు అధికారమీయబడినది. అయితే అత్యుత్సాహంకల కొంత మంది భాండాగారాధిపతులు ఈ హద్దును అతిక్రమించారు; కాని అది ఎన్నడూ అఖిల భారత చరాకా సంఘం అనుమతితో మాత్రం జరుగలేదు. ఇప్పుడు ఆంధ్రుల చీరలను తక్కువ ఖరీదుకు అమ్మడానిక తమకు వీలు కుదిరినందున, ఆంధ్రా ఖాదీని తేలికగా తొలగించవచ్చునని పట్టు బట్టలు నేసేవారు కొత్తగా గ్రహించారు. అంతేకాక పట్టు వర్తకులు తమ సరుకును అమ్మడంలో అఖిల భారత చరాకా సంఘమును నిరాకరిస్తూన్నట్లుకూడా తెలుస్తూన్నది. ఇంతవరకీ వర్తకులకు ప్రతికూలంగా ఏమీ అనడానికి వీలు లేదు. ఎందువల్లనంటే, అఖిల భారత చరాకా సంఘముయొక్క విధానములోని సుగుణం గుర్తింపబడితేనే తప్ప దానిని మన్నించవలసిన బాధ్యత ఎవ్వరికీ లేదు. బహుశా ఇతర చోటులలోవలెనే బొంబాయిలోకూడా పట్టు వర్తకులు తమ వ్యాపారాన్ని అఖిల భారత చరాకా సంఘంవారి అనుమతితో, ఖాదీ

ప్రయోజనంకోసమే సాగిస్తూన్నట్లు అమాయక ప్రజలు నమ్మేటంతగా నటిస్తున్నారని తెలుస్తూన్నది.

కాబట్టి అటువంటి పన్నుగడలవలన మోసపోకూడదని ప్రజలను ముందుగా మందలించడం అవసరం. అ.భా.చ.సం. అహేతుకమైన విధానాన్ని దేనినీ అవలంబించలేదని ప్రజలు తెలుసుకోవాలి. ఖాదీ పునరుద్ధరణోద్యమం ప్రారంభమైనప్పుడు దేశీయ పట్టు వ్యాపారం నశించలేదు. ఖాదీ కోట్లకొలదీ ప్రజకు వృత్తి కల్పించకలదు. పట్టు కొన్ని వేలకు మించి వృత్తి కల్పించలేదు. ఖాదీ భాగ్యవంతులకు పేదవారికీకూడా అవసరం. మత విషయిక కర్మలను నిర్వర్తించవలసిన కొన్ని సమయాలలో తమ మత భావాన్ని పోషించుకొనేటందుకు, పట్టు బట్ట ధరించి తీరవలెనని పట్టు బట్టే యే కొద్ది మందికో తప్ప తక్కినవారెవరికీ పట్టు అవసరంలేదు. కాబట్టి ఖాదీ పట్టుల మధ్య యేది కావలేనో కోరుకోవలసివచ్చినప్పుడు, పేదరికంతో పీడింపబడుతూన్న లక్షలాది ప్రజల శ్రేయస్సును మనస్సులో పెట్టుకొన్నవారు, సహజంగా ఖాదీనే కోరుకొంటారు. పత్తితో చేయబడిన ఖాదీకి ఎల్లప్పుడూ ప్రధాన స్థాన మీయవలెననియే అఖిల భారత చరఖా సంఘంవారి ఆశయం చెపుతూన్నది. ఖాదీ శబ్దకు విశాలార్థంలో, పత్తినుండికానీ, ఉన్నినుండికానీ, పట్టునుండికానీ చేతితో వడికి, చేతితో నేయబడిన బట్ట అని తెలిసి ఉన్నవారి మనస్సులలో పొరపాటు అభిప్రాయం కలగకుండా ఉండేటందుకు, పత్తితో ఉత్పత్తి చేయబడిన ఖాదీ అని నేనంటున్నాను. పత్తితో వడకబడిన సరుకుకు ప్రతిగా ఉండేటందుకు గాక అనుబంధంగా ఉండేటందుకుపయోగపడటానికి మాత్రమే, చేతితో వడకబడిన ఉన్ని,

పట్టు సరుకులకు కలసివచ్చేటట్లుగా ఈ విశాల నిర్వచనం అవసరమయింది, అవుతూన్నది; కనుక శీత కాలంలో అనేక మంది వెచ్చని ఉన్ని బట్టకానీ, లేక పట్టు బట్టకానీ కోరుకొంటారు.

ఈ వ్యాసంలో నేను సమర్థించిన విధానము పట్టు వడికే వారియొక్కయు, నేసేవారియొక్కయు క్షేమాన్ని గమనించడం లేదనే ఉద్దేశం ఎవరూ పెట్టుకో నక్కరలేదు. అది నా అభిప్రాయం కానేకాదు. ఎందువల్లనంటే ఖాదీ మృతి పొందిన తక్షణం దేశీయ పట్టు మృతిపొందుతుందని నాకు తెలుసును. జపాను పట్టున్నూ, పాశ్చాత్య దేశాలనుండి వచ్చే కృత్రిమపు ఇమిటేషను పట్టున్నూ, దేశీయ బట్ట ముక్క ఎక్కడా లేకుండా తుడిచి పెట్టగలవు. కాశ్మీరపు ఉన్ని బట్టలు, బెంగాలు అస్సాం పట్టు బట్టలు నిలచి ఉండ గలగడానికి కారణం ఖాదీ తత్వమే. అఖిల భారత చరాఖా సంఘమువారి దూరదృష్టి విధానమే అన్ని ప్రతిబంధకాలను ఎదుర్కొని పత్తి ఖాదీని రక్షించుకొంటూ తత్క్షణం ఉన్ని పట్టు చేతి దారముల దేశీయ సరుకులనుకూడా రక్షిస్తూన్నది. ఈ మూడింటికీ పరస్పరం పోటీ పెట్టినట్లయితే మీరీ మూటినీ పాతిపెట్టడమే అవుతుంది. ఇక చివరి మాట: పత్తి ఖాదీ బ్రతికి పట్టు మృతిపొందినట్లయితే, పట్టు మృతిపొందినందువలన వృత్తి పోయినవారు తేలికగా పత్తి వడకడం నేయడం పనులు చేపట్టవచ్చును. కాని పత్తిపోయి పట్టు ఉన్నయెడల, పత్తి

ఖాదీ పోయిన కారణాన వృత్తిగానీ వృత్తి కవకాశంగానీ లేకుండా ఉండే కోట్లకొలదీ ప్రజకు పట్టు పని చూపించ లేదు. కాబట్టి కోరుకోవలసిన సమస్య ఉపయుంచినప్పుడు, దరిద్ర నారాయణయందలి ప్రేమకలవా రందఱు ఖాదీని కోరుకోవ డమే వారి సహజ కర్తవ్యంగా నాకు కనిపిస్తూన్నది. ప్రస్తుతం సన్నని ఖాదీని, దాని కనుగుణంగా ఉండే సన్నని పట్టుకంటె ఎక్కువ ధర పెట్టికొనడం ముందు ముందు లాభదాయకంగా ఉంటుంది.

—హరిజన్, 7-11-1936

---

# 169

# విశ్వాసమునుగూర్చి పునరుద్ఘాటన

[25 వ తేదీని ప్రదర్శన ప్రారంభ సమయంలో ఆయన చేసిన ఉపన్యాసం ఎంతో సరళంగా ఉండినప్పటికీ పత్రికా విలేఖకులను చీకాకు పెట్టిందంటే (బహుశా, వారాయనను విన జాలకపోవడమే ముఖ్య కారణమై ఉంటుంది) 27 వ తేదీని ప్రదర్శన స్థలంలో ఆయన యిచ్చిన ఉపన్యాసం వారిని మఱింత చీకాకు పెట్టింది. ఆయన చెప్పింది వినజాలక పోయినందున కాదు; ఈసారి వారాయనను విన్నారు. కాని చాలా కాలంనుండీ అటువంటి ఉపన్యాసం వినలేదు. అది సమగ్రంగానూ సంపూర్ణంగానూ ఉన్నది. ఆయన నిర్మాణ కార్యక్రమమును గూర్చిన అనేక సందేహాలకు, చిక్కులకు, అభ్యంతరాలకు అది ప్రత్యుత్తరంగా ఉంది. అందువల్ల సుస్పష్టంగా కనిపించే దానికంటె అందులో ఇంకా ఏవో అంతరార్థా లున్నట్లుగా కొంత మంది అనుకొన్నారు. కొన్ని చోట్ల అది అత్యంత సంభ్రమకారకంగా ఉన్నట్లు వర్ణింపబడినది: "ఒక క్షమాపణ, ఒక సవాలు, ఒక విప్లవాత్మకమైన ఎన్నికల ఉపన్యాసం, ఈ అన్నీ చుట్టచుట్టి" ఈయబడినట్లుకూడా వర్ణింపబడినది. ఆయన రాజకీయాలలో తిరిగీ ప్రవేశించేటందు కాలోచిస్తూన్నాడనడానికి ఆ ఉపన్యాసం ప్రత్యక్ష తార్కాణమనే అభిప్రాయమున కనుగుణంగా ఒక పత్రికా ప్రకటన మఱి కొంత అపోహ కల్పించింది. ఊహాజన్యములైన ఈ వ్యాఖ్యానాలన్నీ ఈ వింత వింత శీర్షికలతో కనపడడంలో ఆశ్చర్యంలేదు.

గాంధీ తిరిగి రావడానికి సిద్ధంగా ఉన్నాడు; "నేనెప్పటికీ శక్తివంతుడనే, సమయం వచ్చినప్పుడా విషయం నిరూపిస్తాను."

అయితే, పత్రికలను నిందించవలసిన పని లేదు. ఆ ఉపన్యాసం గాంధీజీయొక్క అనేక, అప్రతిమాన ఆధ్యాత్మిక సాధనలలో ఒకటి. అటువంటివి తేలికగా వ్రాసి పంపడానికి వీలయినవిగా ఉండవు. 1920 నాటి కాంగ్రెసు యొక్క చతుర్విధ నిర్మాణ కార్యక్రమం పూర్తిగా నిర్వర్తింపబడినట్లయితే పూర్ణ స్వరాజ్యం లభిస్తుందని ఆయన అన్నందుననూ, ఆ కార్యక్రమాన్ని నిర్వర్తించవలసిందిగా ఆయన ఆ ఉపన్యాసంలో కోరినందుననూ ఆ అర్థంలో ఎవరైనా దానిని రాజకీయోపన్యాస మనవచ్చును. నిశ్చయంగా అది యెంత మాత్రమూ పోరాటాన్ని ప్రేరేపించే వుపన్యాసం కాదు. అనేక ఎన్నికల ఉపన్యాసాలలో కనిపించే అసభ్యత కించిత్తుకూడా అందులో లేని మాట వాస్తవం. నిర్మాణ కార్యక్రమ రంగమునందు పని చేస్తూన్న తన సహచరులైన కార్యకర్తలలో, సంశయంతో వ్యగ్రమనస్కులైన వారికీ, అభ్యంతరాలవల్ల ఒక్కొక్కప్పుడు వ్యాకుల చిత్తులైన వారికీ, చిక్కు పరిస్థితులలో భయభ్రాంతులైన వారికీ, అనేక మందికి ఆయన హృదయము విప్పి చెప్పిన మాటలవి. కష్టాలు వచ్చిన కొద్దీ మఱింత ప్రజ్వలితమైన తన విశ్వాసాన్ని పునరుద్ఘాటించడం తప్ప అందులో క్రొత్తయేమీ లేదు. ఆయన నిర్మాణ కార్యక్రమంకొఱకు జీవితాలను అంకితంచేసిన కార్యకర్తల సమూహమునకు ధైర్యం కలిగించడానికే అది ఉద్దేశింపబడినది. అది ఆధ్యాత్మిక సంభాషణమని మఱొకసారి అంటున్నాను.

ఆ సంభాషణను యథాతథంగా చెప్పగలుగుతాననే విశ్వాసం నాకే లేకపోయింది. ఆయన మాట్లాడుతూండ గానే, ఆయన మాటలే నేను వ్రాసుకొని, దానిని సంగ్రహ పఱిచే పని ఆయనకే వదలివేశాను. దాని ఫలితంగా ఆయన ముందు ఉన్న మూలాన్ని ఆయన చూడకుండానే స్వతంత్రంగా ఒక వ్యాసం వ్రాసివేశారు. అది కొన్ని వాదములను ఎక్కువగా వివరిస్తూన్నది. అచ్చులో అనవ సరంగా కనిపించే వాటిని కొన్నిటిని తగ్గించివేసింది. గాంధీజీ మాటలలో ఆ ఉపన్యాసమిది: మ దే.]

## కొత్త ఏమీ లేదు

నేనీ నాడు కొత్తగా యేమీ చెప్పబోవడంలేదు. రాట మునకు సంబంధించిన కార్యకలాపం పదునెనిమిది యేండ్ల నాటిది. రాటముద్వారా మనం స్వరాజ్యాన్ని సాధించ గలమని 1918 లో నేను చెప్పి ఉన్నాను. 1918 లో మొట్టమొదట నేను ప్రకటన చేసినప్పుడు రాటముయొక్క శక్తినిగూర్చి నా విశ్వాసం ఎంత ఉజ్వలంగా ఉన్నదో ఈనాడుకూడా అంత ఉజ్వలంగానూ ఉన్నది. ఈ అన్ని సంవత్సరాలలోనూ నేను చేసిన ప్రయోగంవల్లనూ, నా అనుభవంవల్లనూ అది యింకా అధిక తరమైనది.

అయితే రాటంలోనూ, అది ఉత్పత్తిచేసిన ఖాదీలోనూ కల అంతరార్థాలను మీ రర్థం చేసుకోవాలి. తన చుట్టూ ఉన్న ప్రతి వస్తువులోనూ విదేశీ పెట్టుకొని ప్రత్యేక సంద ర్భాలలో ఖాదీ ధరించిన మాత్రంతోగానీ, ఖాదీ తప్ప మఱేదీ ధరించనంత మాత్రంతోకానీ సరిపోదు. ఖాదీ అంటే మిక్కిలి నిజమైన స్వదేశీ తత్వం. క్షుత్పీడితులైన ప్రజానీకంతో ఐక్యం కావడం.

స్వరాజ్యమునుగూర్చి నాకుగల భావాన్ని ఎవ్వరూ తప్పుగా అర్థం చేసుకోకూడదు. నేను కోరేది విదేశీయుల అధికారం లేని సంపూర్ణ స్వాతంత్ర్యము, సంపూర్ణ ఆర్థిక స్వాతంత్ర్యము. కాబట్టి ఒక ప్రక్కను రాజకీయ స్వాతంత్ర్యమున్నది; మఱొక ప్రక్కను ఆర్థిక స్వాతంత్ర్యము ఉన్నది. దానికి మఱి రెండు ప్రక్కలుకూడా కలవు. వాటిలో ఒకటి సాంఘికము, నైతికము. దాని కనురూపంగా ఉండే అవధి ధర్మం; అనగా ఆ పదముయొక్క మహోన్నతమైన అర్థంలో అది మతం అవుతుంది. అందులో హిందూ మతం, ఇస్లాం మతం, క్రైస్తవ మతం అన్నీ ఇమిడి ఉన్నవి. కాని అది వాటన్నిటినీ మించినది. దానిని మీరు 'సత్యం' అని గ్రహించవచ్చును. అనగా అవసరంకోసం కావలసిన ఋజువర్తనం కాదు; శాశ్వతమైన, విశ్వవ్యాప్తమైన, నిర్వికారమైన సచేతనమైన సత్యం. మనకు వాడుకలో ఉన్న అహింస అనే పదంవలన, నైతిక సాంఘికాభ్యున్నతి అని గ్రహించవచ్చును. దీనినే మనం స్వరాజ్య సమ చతుర్భుజం (Square) అని పిలువవచ్చును. ఇందులో ఏ ఒక్క కోణం సరిగా ఉండకపోయినా అది వికృతంగా కనిపిస్తుంది. వాస్తవిక భావంలో సత్యాహింసలు లేనిదే, భగవానునిలో, అనగా సాంఘిక నైతికాభ్యున్నతిలో సజీవ విశ్వాసం లేనిదే, కాంగ్రెసు పరిభాషలోని రాజకీయ ఆర్థిక స్వాతంత్ర్యమును మనం పొందజాలము.

## రాజకీయ స్వాతంత్ర్యం

రాజకీయ స్వాతంత్ర్యమంటే, బ్రిటిష్ కామన్సు సభకు కానీ, రష్యాయొక్క సోవియటు ప్రభుత్వమునకు కానీ, ఇటలీలోని ఫాసిస్టు పరిపాలనకు కానీ, జర్మనీయందలి నాజీ అధి

కారమునకుగానీ అనుకరణముగా ఉండవలెనని నా అర్థం కాదు. వారి ప్రతిభా విశేషమునకు తగిన విధానాలు వారికి కలవు. మన ప్రతిభకు తగినది మనకు ఉండాలి. అది ఎలా ఉండగలదనేది నేను చెప్పగలిగినది కాదు. నేను దానిని రామరాజ్యమని వర్ణించాను. అనగా కేవలం నైతికాధికారంమీద ఆధారపడిన ప్రజా ప్రభుత్వం. ముఖ్యంగా నేను బాధ్యుడనైన బొంబాయి నాగపురముల కాంగ్రెసు నియమావళులు ఈ తరహా స్వరాజ్యాన్ని సాధించేటందుకొక ప్రయత్నం.

ఇక ఆర్థిక స్వాతంత్ర్యమును తీసుకోండి. అది ఆధునిక పారిశ్రామిక విధానముయొక్క ఫలితం కానీ, పాశ్చాత్య పద్ధతియొక్క ఫలితంకానీ కాదు. భారతీయ ఆర్థిక స్వాతంత్ర్యమంటే స్త్రీ కానీ పురుషుడు కానీ చైతన్యవంతమైన స్వప్రయత్నంవలన పొందే ఆర్థికాభివృద్ధి అని నా అర్థం. ఆ విధానంకింద స్త్రీ పురుషులందరికీ కావలసిన బట్ట ఉంటుంది—అనగా కేవలం అంగవస్త్రం కాదు. అవసరమైన దుస్తులు అని దేనిని మనము కొంటున్నామో అది. తగినంత ఆహారం, వెన్న పాలతో సహా ఉంటుంది. అవి రెండూ ఈనాడు లక్షలాది ప్రజలకు లేకుండా పోయినవి.

ఇది నన్ను సోషలిజముకు తీసుకొనివస్తూన్నది. నిజమైన సోషలిజమును మనకు మన పూర్వులే అందించారు. వారిలా బోధించారు. "భూమి అంతా గోపాలునిదే. ఇక దానికి హద్దెక్కడ; మనిషే దానికి హద్దేర్పాటుచేశాడు. కాబట్టి అతనే ఆ హద్దును చెడగొట్టగలడు." గోపాల్ అంటే భాషలో అర్థం గోవులను కాచేవాడని; అనగా దేవుడని. ఆధునిక భాషలో దానికర్థం ప్రభుత్వం; అనగా

ప్రజలు. ఈనాడు భూమి ప్రజలకు చెందదనేది చాలా సత్యం. ఆ తప్పు ఉపదేశంలో లేదు. దాని నాచరణలో పెట్టని మనలో ఉన్నది. ఈ విషయంలో రష్యాతో సహా, ఏ దేశమైనా సరే ఎంత బాగా ప్రయత్నించినదో అంత బాగాను మనం కూడా ప్రయత్నించగలమనే విషయంలో నాకేమీ సందేహం లేదు. అదికూడా మనం హింస లేకుండా చేయగలము. సొంత ఆస్తులనుండి తొలగించే హింసాయుత విధానమునకు బలవత్తమమైన ప్రతి విధానము రాటము. దానికి సంబంధించిన అన్ని కార్యకలాపములూను, భూమిన్నీ యావదాస్తిన్నీ యెవరు దానిలో కృషి చేస్తారో వారిది. ఈ అసందిగ్ధమైన సత్యమును తెలుసుకోకుండా దురదృష్టవశాత్తూ శ్రమజీవులు అజ్ఞానంలో ఉంచబడ్డారు.

భారతదేశం పూర్తిగా ఎలా దరిద్ర స్థితికివచ్చిందో ఇక విచారించవలసి ఉన్నది. ఈస్టిండియా కంపెనీ పత్తి పరిశ్రమను పాడుచేసి, మనిషికి కావలసిన గొప్ప అవసరాలలో రెండవది అయిన బట్టకోసం అన్ని విధాలా భారతదేశాన్ని లాంకషైరుమీద ఆధారపడి ఉండేటట్లు చేసిందని చరిత్ర చెపుతూన్నది. ఇంతవరకూ కూడా దిగుమతులన్నిటిలోకీ అదే ఎక్కువ. ఆ విధంగా, కొంతకాలం పని లేకుండా ఉండే లక్షలాది ప్రజానీకాన్ని సృజించి అందుకు బదులు వారికి మఱొక వృత్తి చూపలేదు. పత్తి గింజలు తీయడం, ఏకులు చేయడం, వడకడం, నేయడం పనులు కొంతవరకు ధ్వంసం కావడంతో, భారతీయ గ్రామాలలోని ఇతర పరిశ్రమలుకూడా నశించినవి. నిరంతర నిరుద్యోగం, ప్రజలలో అత్యంత విషాదకరమైన సోమరితనాన్ని ప్రోత్సహించింది. ప్రజల దారిద్ర్యము హెచ్చు పెరిగినందుకు విదేశీ ప్రభుత్వం

వారు బాధ్యులనడానికి సందేహంలేదు కానీ, మన మింకా ఎక్కువ బాధ్యులము. స్వార్థంకోసం విశ్వాసద్రోహం కావించి, భారతదేశపు ఆర్థిక స్వాతంత్ర్యాన్ని వెలపెట్టిన మధ్య తరగతులవారు తమ పొరపాటును గ్రహించి, చర్ఖా సందేశమును గ్రామస్థులకడకు తీసుకొనిపోయి, సోమరితనం మాని చర్ఖా కడ పనిచేసేటట్లు వారిని ప్రోత్సహించినట్లయితే చాలావరకు ప్రజల స్థితిని మనం బాగుచేయగలము. శ్రమకు బదులు సోమరితనము, ఆశకుబదులు నిరాశా వ్యాపించడం భయంకరంగా పరిణమిస్తుంది.

## శాసన సభా కార్యక్రమం

శాసన సభా కార్యక్రమం వ్యాపకంలోకి వస్తూన్నది. అది శాశ్వతంగా ఉంటుందనే భావించాలి. ఉండడం న్యాయంకూడా. కాని అది మనకు స్వాతంత్ర్యాన్ని తెచ్చి పెట్టదు. అది చేసే పని చాలా అవసరమయినప్పటికీ బహు పరిమితం. మన ధ్యేయమునకు ఆటంకం కలిగించే ఆర్డినెన్సు పరిపాలనగానీ మరి యే యితర చర్యగానీ ప్రజా ప్రతినిధుల ఆమోదమును పొందిందని ప్రభుత్వంవారనేటందుకవకాశం లేకుండా చేస్తుంది దాని విజయం. కాబట్టి కాంగ్రెసు క్రమ శిక్షణకు లోనుగాకుండా ప్రజా ప్రతికూల శాసనాలకు అనుకూలంగా వోటుచేయడానికి ధైర్యం చేయజాలని కాంగ్రెసు అభ్యర్థులకే వోటర్లు తమ వోట్లు వేయడం అవసరం. ఆ కార్యక్రమ విజయంవల్ల సుభాసు బోసుమగానీ లేక డిటిన్యూలనుగానీ విడుదల చేయించడం వంటి వ్యక్తిగత సందర్భాలలోకూడా కొంత ఉపకారం కలుగవచ్చును. కాని అది రాజకీయ స్వాతంత్ర్య మూ కాదు. ఆర్థిక స్వాతంత్ర్యమూ కాదు.

ఇక మరొక దృక్పథంనుండికూడా చూడండి. శాసన సభలలో ఒక పరిమిత సంఖ్యగల స్త్రీ పురుషులు మాత్రమే సభ్యులు కావడానికి వీలున్నది; 1,500 అనుకోండి! ఈ వినేవారిలో ఎంతమంది శాసనసభ్యులు కాగలరు? ప్రస్తుతం ఈ 1,500 మందికీ $3\frac{1}{2}$ కోట్ల మంది వోటర్లకంటే వోటు చేసేటందుకు వీలులేదు. తక్కిన $31\frac{1}{2}$ కోట్ల సంగతి ఏమిటి? స్వరాజ్యమునుగూర్చిన మన భావంలో వీరే నిజమైన యజమానులు. $3\frac{1}{2}$ కోట్లు వీరిసేవకులు. ఈ $3\frac{1}{2}$ కోట్లే తిరిగీ 1,500 కు యజమానులవుతున్నారు. కాబట్టి ఈ 1,500 మందీ, తమయందుంచబడిన విశ్వాసమునకు అనుగుణంగా నడుచుకొనే పక్షంలో రెండింతలు సేవకులవుతున్నారు.

అయితే పై $31\frac{1}{2}$ కోట్లమంది కూడా తమయెడల తమ కర్తవ్యాన్ని సరిగా నిర్వహించుకోవాలి. వారందరూ వ్యక్తులుగా ఈ గొప్పజాతిలో పరమాణువులు మాత్రమే. వారు సోమరులై స్వరాజ్యమునుగూర్చి, దానిని సంపాదించే విధానమునుగూర్చీ యేమీ తెలుసుకోకపోతే, వారే 1,500 మంది శాసన సభ్యులకు దాసులై పోగలరు. ఈ $3\frac{1}{2}$ కోట్ల మందీ కూడా $31\frac{1}{2}$ కోట్ల తరగతికి చెందినవారేనని నా వాదం. వారు శ్రమపడి పనిచేసే వివేకవంతులుగా ఉండక పోయినట్లయితే, 1,500 మంది ఆటగాళ్ల చేతులలోనూ వారు చదరంగపు కాయలుకాగలరు; వారు కాంగ్రెసు వాదులవడం కాకపోవడం పెద్ద విషయంకాదు. ప్రతి మూడేండ్లకుగానీ అంతకంటె ఎక్కువ కాలానికిగానీ వోట్లు వేయడానికి మాత్రమే వోటర్లు మేలుకొని తరువాత నిద్రలో పడిపోతే వారి నౌకర్లు యజమానులవుతారు.

ఆ అవాంతరం తప్పి పోవలెనంటే 35 కోట్ల మందీ కష్ట పడి పనిచేసేవారుగానూ వివేకవంతులుగానూ ఉండాలి. అది ఒకటే నాకు తెలిసిన మార్గం. రాటమునూ తదితర గ్రామ పరిశ్రమలనూ చేపట్టినప్పుడు మాత్రమే వారలా ఉండగలరు. ఆ పనులను వారు తెలివి తక్కువగా చేయ జాలరు. ఆ పనులు చేయడమే సరియైన వయోజన విద్య అనీ, అందుకు సహనము, నైతిక శక్తీ, కార్యకర్త కోరుకొన్న గ్రామంలో ఆయన ప్రవేశ పెట్టదలచుకొనే పరిశ్రమను గూర్చిన శాస్త్రీజ్ఞానము, ప్రత్యక్షజ్ఞానమూ ఆయన కలిగి ఉండవలెననీ నా అనుభవంవలన నేను చెపుతున్నాను.

## ఆర్థిక సూర్య కుటుంబం

ఆర్థిక సూర్య కుటుంబంవంటి ప్రణాళికలో రాటం కేంద్రస్థాన మవుతుంది. దానిని సూర్య కుటుంబమని పిలిచే యెడల రాటం సువర్ణబింబమవుతుంది. పరిశ్రమలనే గ్రహాలు అనుల్లంఘనీయమైన ఆరచనా నియమమున కనుగుణంగా దాని చుట్టూరాట తిరుగుతూంటవి. ఈస్టిండియా కంపెనీవారి చర్యవలన సూర్యుడు తన తేజశ్శక్తిని కోల్పోగానే గ్రహాలు కూడా తమ శక్తిని కోల్పోయి దాదాపు అదృశ్యమైనవి. లేదా దాదాపు అదృశ్యమైనట్లుగా ఉన్నవి. సూర్యు డిప్పుడు తన పూర్వ స్థితిలో పునః ప్రతిష్ఠ చేయబడు తున్నాడు. గ్రహాలు, సూర్యుని శక్తికి సరియైన నిష్పత్తిలో తమ భ్రమణమును పునరార్జించుకొంటూన్నవి.

బహుశా ఇక మీరు, చర్ఖాయొక్క భావాన్ని సందే శాన్ని అర్థం చేసుకోగలరు. 1920 లో నిర్ణయింపబడిన కార్యక్రమాన్ని, ఖాదీ, సాంఘికైక మత్యము, మద్యనిషేధము, హిందువులవలని అస్పృశ్యతా నివారణము, అనే చతుర్విధ నిర్మాణ కార్యక్రమంతో సహా కాంగ్రెసు నిజంగాన్నూ జయ

ప్రదంగానూ నిర్వర్తించినట్లయితే స్వరాజ్యం ఒక యేడాదిలో రావడం నిశ్చయమని నేను 1920 లో చెప్పి ఉన్నాను. ఆ ప్రకటన చేసినందుకు నేను విచారంగానీ సిగ్గుగానీ పడడం లేదు. ఈనాడు తిరిగీ అదే ప్రకటన మీముందు చేయవలె నని ఉంది నాకు. ఆ చతుర్విధ కార్యక్రమం సంపూర్ణంగా నిర్వర్తింపబడినప్పుడు అడిగినంత మాత్రంలో మీరు స్వరాజ్యాన్ని పొందగలరు. ఎందువల్లనంటే దానిని పొందడానికి తగిన శక్తి మీ కప్పుడు వస్తుంది. మన నమ్మకంలో కానీ, ఆచరణలో కానీ చర్ఖాకు కల స్థానమేమిటో ఒక్క క్షణం ఆలోచించండి. బొంబాయిలో పరస్పర రహస్య హత్యాకాండ సాంఘికైకమత్యమునకు చిహ్నమా? సంపూర్ణ మద్యనిషేధ మెక్కడ? హిందువులు అస్పృశ్యతను ఆమూలాగ్రంగా నిర్మూలించారా? ఇల్లు అలకగానే పండుగ కాలేదు. తిరువాన్కూరు యొక్క మహత్తర ప్రకటన కార్య సాఫల్యమునకు మొదలు కావచ్చును. కాని అదే కార్యసాఫల్యము మాత్రం కాదు. హరిజనుల అస్పృశ్యతను మాత్రం మనం నిర్మూలించి ముసల్మానులను తదితరులను అలాగే ఉంచినట్లయితే, ఆ కళంకాన్ని మనం తుడిచివేసినట్లు కాదు. 'భూమి అంతా దేవునిది' అనడంలో చాలా గంభీరమైన అర్థం ఉన్నది. భూమివలెనే, భూమికి చెందిన మనమందఱంకూడా దేవునికే చెంది ఉన్నాము. కాబట్టి మనమందరం ఒకటిగా భావించుకోవాలి. అంతేకాని అడ్డు గోడలు కట్టుకోవడం కానీ, ఒకరికి ప్రతికూలంగా ఒకరు నిషేధపు శాసనాలు చేసుకోవడం కానీ కూడదు.

## నిర్మాణ కార్యక్రమమును నిర్వర్తించినట్లయితే

ఇది ఆచరణ పూర్వకమైన అహింసా విధానము. ఈ కార్యక్రమమును మనం నిర్వర్తించగలిగినట్లయితే, శాసనోల్లం

ఘనం చేయవలసిన అవసరం లేదు. దౌర్జన్యం చేయవలసిన అవసరం అసలే లేదు. 35 కోట్లమంది జనం తమ సంఖ్యాబలమునుగూర్చి తెలిసి ఉండి ఒకుమ్మడిగా, భారతదేశం లోని 70,000 మంది తెల్లవాళ్ళపైన దౌర్జన్యం చేయడానికి లజ్జిస్తారు. ఆ తెల్లవారు విధ్వంసక విధానంలోనూ లక్షలాది ప్రజానీకంపైన ఒకటే క్షణంలో విషవాయువును ప్రయోగించడంలోను ఎంతో ప్రవీణులు కావచ్చును గాక; చరఖాను తెలివిగా అర్థం చేసుకొన్నట్లయితే అది ఆర్థిక మోక్షమును పడక గలగడమే గాక, మన హృదయాలలోనూ మనస్సులలోనూ పరివర్తనం తీసుకొనివచ్చి, స్వరాజ్య సంపాదనకు అహింసా విధానమే అత్యంత సురక్షితమూ సుకరమూ అయిన మార్గమని మనకు నిరూపించగలదు. దాని అభివృద్ధి నెమ్మదిగానున్నట్లు కనిపించవచ్చును. కాని ముందు ముందది అత్యంత వేగమైనదిగా రుజువవుతుంది.

జవహరలాలీనాడు జైలులో ఉండకపోవడం ఆయన దానికి భయపడినందువలన కాదని నమ్మండి. ఆయనకు జైలు ద్వారంలోకి పోవడంగానీ, ఉరికంబముల పైన ఎక్కడం కానీ కేవలం చిరునవ్వుతో చేయగలిగిన పని. అట్టి బాధానుభవంలోని ప్రయోజనమునుగూర్చిగానీ శక్తిని గూర్చిగానీ నాకు విశ్వాసం పోయిందని నేననుకోను. కాని నేను చూడగలిగినంతవరకు ఈ నాడందుకు కారణం కనిపించడం లేదు. మనమందఱము కలిసి ఒకే విశ్వాసంతో ఒకే పట్టుదలతో నిర్మాణ కార్యక్రమమును నిర్వర్తించేయెడల బాధానుభవమును పూర్తిగా తప్పించుకోవచ్చునని నా తలంపు. మనమలా చేయగలిగితే, బ్రిటిష్ జాతితోగాని, వారికి ప్రతికూలంగాగాని మనం పోరాడ నక్కరయే లేదు.

అప్పుడు లింలిత్‌గో ప్రభువు మనకడకు దిగివచ్చి మన సత్యాగ్రహంసలను విశ్వసించక పోవడంలో పొరపాటు పడ్డట్లు ఒప్పుకోని, మన నిర్ణయానికి కట్టుబడి ఉండేటట్లు తన దేశీయుల పక్షాన ఆయన హామీ ఈయగలడు. ఆయన అలా చేసినా చేయకపోయినా నేనా ఆదర్శంకోసం చేస్తున్నాను. ఇంకొ కందుకు కాదు. భూమి అంతా దేవునిది.”

—హరిజన్, 2-1-1937

# 170

## ఖాదీ విజ్ఞానం అంటే ఏమిటి?

ఖాదీ ఒక యోగ్యమైన ఆర్థిక సిద్ధాంతమే కాక, ఒక శాస్త్రము, అద్భుత వృత్తము అనికూడా నేననేక పర్యాయములు చెప్పిఉన్నాను. "పత్తియొక్క అద్భుత వృత్తాంతము" అనే ఒక గ్రంథమున్నట్లు, దానిలో పత్తి యొక్క పుట్టుపూర్వోత్తరాలు విచారింపబడడమే కాక, దాని ఆవిష్కరణం సభ్యతా క్రమంలో యెట్టి పరివర్తనం కలిగించిందో నిరూపించేటందుకు కూడా, కృషి చేయబడి నట్లూ నాకు జ్ఞాపకం. దానివెనుక ఒక శాస్త్రీయభావం కానీ, అద్భుతభావం కానీ ఉన్నట్లయితే ప్రతి విషయమునూ కూడా శాస్త్రంగానూ అద్భుత వృత్తంగానూ తయారు చేయవచ్చును. కొంతమంది ఖాదీని వెక్కిరిస్తూ, ఎవరైనా నూలు వడుకుటనుగూర్చి మాట్లాడినయెడల అసహనమును విసుగుదలను వెల్లడిస్తారు. యావద్భారత దేశంలో వ్యాపించిఉన్న అలసత్వమును, నిరుద్యోగమును, అందువలన కలిగిన దరిద్రమునూ తొలగించగలిగిన శక్తిని మీరు దానికాపాదించిన తత్క్షణం అది హేళనకు విసుగుదలకు పాత్రం కాకుండాపోతుంది. నిజంగా అది ఈ మూడు చెడుగులకు చికిత్స కానక్కరలేదు. అత్యంత చిత్తాకర్షకంగా ఉండేటందుకు, ఉన్న శక్తిని యథాతథంగా ఆపాదించడమే చాలు. అన్నంకోసం, పత్తి గింజలుతీసి, ఏకి, వడికి, నేసే అభంశుభం ఎఱుగని నిరుపేదయైన కర్మకారుని వలె, కొందఱు చేస్తూనట్లుగా మీరు దానికా శక్తిని ఆపాదించి శ్రద్ధగా ఆ పని చేయజాలరు. దాని శక్తిలో నమ్మకంకల

మనిషి ఆలోచనాపూర్వకంగా, వివేకంతో, క్రమ పద్ధతిని వైజ్ఞానిక దృష్ట్యా ప్రతి సిద్ధాంతాన్ని పరీక్షిస్తూ, వివరాలను పరిశీలిస్తూ, అపజయాలను లెక్క పెట్టక, అల్ప విజయాలకు ఆనందించక, ఆదర్శాన్ని అందుకొనేటంత వరకూ ఎప్పుడూ సంతృప్తిపడకుండా ఆ కార్యక్రమాన్ని పట్టుదలతో సాగిస్తాడు. కీ॥ శే॥ మగన్‌లాల్ గాంధీకి ఖాదీయొక్క శక్తిలో సజీవ విశ్వాసం ఉన్నది. అది ఆయనకు విభ్రమ కారణమైన అద్భుతవృత్తం. ఆయన ఖాదీ శాస్త్రముయొక్క మూలతత్వములనుగూర్చి వ్రాశాడు. ఆయనకు యే వివరమూ అత్యల్ప విషయమూ కాదు, యే ప్రణాళికా బ్రహ్మాండ విషయమూ కాదు. రిచార్డు గ్రెగ్గుకుకూడా అంత ఉత్సాహమూ ఉన్నది. ఆయన దానికొక సార్వజనీన వ్యాఖ్యానం చెప్పినాడు. ఆయన వ్రాసిన ఖాదీ అర్థశాస్త్రం ఈ ఉద్యమానికి ఒక విలక్షణమైన సహాయం. రాటాన్ని ఆయన అన్నిటినీ మించిన అహింసాచిహ్నంగా గుర్తించారు. అది అదంతా కావచ్చు కాకపోవచ్చు. కాని ఆ విశ్వాసంవలన యేదైనా చిత్తాకర్షక విషయమునుండి పొందదగిన సంతోషానందములను మగన్‌లాలు గాంధీ పొందినాడు. రిచార్డు గ్రెగ్గు పొందుతున్నాడు. ఏ శాస్త్రమైనా శాస్త్రముగా ఉండవలెనంటే శరీరముయొక్కయు, మనస్సుయొక్కయు, ఆత్మయొక్కయు తృష్ణను సంతృప్తిపరచడానికి సంపూర్ణ సావకాశమును కల్పించకలిగి ఉండాలి. ఖాదీ అటువంటి సంతృప్తిని ఎలా కల్గించకలదని సంశయాత్ములు ఆశ్చర్యపడుతూంటారు. అనగా 'ఖాదీ శాస్త్రమని' నేను వాడినప్పుడు నా భావమేమిటోనని వా రాశ్చర్యపడుతూంటారు. నాచేత పరీక్షింపబడుటకు వచ్చిన ఒకానొక

ఖాదీ కార్యకర్తకొరకు నేను తొందరతొందరగా వ్రాసి పెట్టిన ప్రశ్నల కీ దిగువ నకలు వ్రాయడంకంటె ఎక్కువ మంచి జవాబును నేను చెప్పజాలను. ఈ ప్రశ్నలు ఉండ వలసిన వరుసక్రమంలోనూ లేవు; సమగ్రంగానూ లేవు. వాటిని తిరిగీ వరుసను వ్రాయడానికీ కొత్తవి చేర్చడానికీ వీలున్నది. హిందూస్థానీలోనున్న మూలమునకు నాకొరకు ఒక మిత్రుడు వ్రాసియిచ్చిన అనువాదాన్ని ఈ దిగువ యథాతథంగా పొందుపరుస్తున్నాను :—

## భాగం I

1. భారతదేశంలో ఎంత పత్తి ఉత్పత్తి అవుతూన్నది? ఎక్కడ? రకాలను పేర్కొనండి. ఇండియాలో ఎంత ఉంటూన్నది, చేతితో ఎంత వడకబడుతూన్నదీ, ఇంగ్లాండు మొదలైన దేశాలకు ఎంతపోతూన్నది?

2. (ఎ) భారతదేశపు మిల్లులలో ఎంత బట్ట తయారవుతూన్నది? అందులో భారతదేశంలో ఎంత వినియోగ పడుతూన్నది, ఎంత ఎగుమతి అవుతూన్నది?

(బి) పైదానిలో స్వదేశీ మిల్లు నూలునుండి ఎంత ఉత్పత్తి అవుతూన్నది, విదేశీ మిల్లు నూలునుండి యెంత ఉత్పత్తి అవుతూన్నది?

(సి) ఎంత బట్ట దిగుమతి అవుతూన్నది?

(డి) ఇండియాలో ఎంత ఖాదీ ఉత్పత్తి అవుతూన్నది?

3. పైన పేర్కొనబడిన మూడు రకాల బట్టలలోనూ గల యోగ్యతాయోగ్యతలను గూర్చి చర్చించండి.

సూచన :—మీ ప్రత్యుత్తరములు చదరపు గజాలలోనూ, డబ్బులోనూ ఈయండి.

4. కొంతమంది, ఖాదీ ప్రియంగానూ, మొరటుగానూ ఉంటుందనీ చాలాకాలం మనదని చెప్తూతారు. ఈ ఆరోప ణలకు మీ ప్రత్యుత్తరాలిస్తూ, వాటిలో దేనికైనా ఆధారం ఉంటే మీ పరిష్కారం చెప్పండి.

5. అఖిల భారత చరఖా సంఘం ఖాదీ పనిలో ఎంత మంది పడికేవారు నియోగింపబడ్డారు? ఈ అన్ని సంవత్స రాలలోనూ వారెంత సంపాదించుకొన్నారు? మిల్లులలో పడికేవారి సంఖ్య ఎంత? వారి మొత్తం యేడాది సంపాదన యెంత?

6. (ఎ) అఖిల భారత చరఖా సంఘం వారి పని యెలా జరుగుతూన్నది? వారు పరిపాలనమీద యెంత ఖర్చు చేస్తున్నారు?

(బి) స్వదేశీ మిల్లును నడిపేటందుకెంత సిబ్బందీ యేర్పాటు చేయబడుతూన్నది? మిల్లు కూలీలతో పోల్చి చూచినప్పుడు ఏ నిష్పత్తిలో ఆ వ్యక్తులు జీతాలు పుచ్చు కొంటున్నారు.

7. (ఎ) జీవితావసరములలో దుస్తులే స్థానాన్ని ఆక్ర మించగలవని మీ అభిప్రాయం?

(బి) ముఖ్యమైన జీవితావసరములను పేర్కొని, నూటికి యేది యెంత నిష్పత్తిలో ఉంటుందో తెలియచేయ వలెను.

8. భారతదేశంలోని ప్రతి మనిషి మిల్లుబట్టను, విదేశీ కానీ, దేశీయంకానీ మానివేసినయెడల ఎంత సొమ్ము ఇండియాలో మిగులుతుంది, అది ఎవరికి పోతుంది?

9. ఇండియా దిగుమతి చేసుకొన్న బట్టకు బదులుగా అది ఏమి ఎగుమతి చేస్తుంది? ఈ మారకంద్వారా ఇండి యాకు వచ్చే నష్టమెంత?

10. జనసంఖ్యలో నూటికి ఎన్నోవంతు బట్ట కొనగల వారున్నారు?

11. తమ బట్టను తాము తయారుచేసుకొనేటందుకు తీరిక ఉన్నవారు వారిలో నూటికి ఎంతమంది ? ఎలా ?

12. "ఖాదీ దోషరహితమైన ఆర్థిక న్యాయమును స్థాపిస్తుంది" ఈ సిద్ధాంతము నిజముగా సరియైనదేనా ? మీ జవాబుకు కారణాలు చెప్పండి.

13. ఖాదీ సార్వజనీనమైనయెడల, వర్తకం, వృత్తి, రవాణాలపైన కలిగే ఫలితమేమిటి? ఏవిధంగా కలుగుతుంది ?

14. మరొక 50 సంవత్సరాలవరకు ఖాదీ సార్వజనీనం కానియెడల, మన ప్రజలయొక్క ఆర్థిక పరిస్థితిమీద యేమి ఫలితం కలుగుతుంది ?

## భాగం II

1. ఇప్పుడు ప్రచారంలో ఉన్న భారతీయ రాటాలను వర్ణించండి, అందులో ఉత్తమోత్తమైనదేది ? ఏవో నాలుగు రాటాల బొమ్మలు గీచి, వాటికి సంబంధించిన ప్రతిభాగము యొక్క కొలత సరిగా ఈయండి. వాడబడిన కొయ్య రకం, కదురుయొక్క పొడుగు, చుట్టుకొలత, మాల్ యొక్క మందం చెప్పండి.

2. ప్రస్తుతమున్న చక్రాలను, వేగము, ఖరీదు, సామాన్య ప్రయోజనాల విషయంలో ఎరవాడా చరఖాతో పోల్చండి.

3. పత్తియొక్క రకాన్ని, నూలు పురినీ, వడికిన నూలు యొక్క నంబరును మీరెలా తెలుసుకొంటారు ?

4. మీరు వడికే నూలు నెంబరు ఎంత, పురి ఎంత ? తక్లీమీద, రాటంమీద, మీ వేగం ఎంత ? మీరు సామాన్యంగా ఏ రాటాన్ని ఉపయోగిస్తారు ?

5. ఒక పురుషునికిన్నీ స్త్రీకిన్నీ క్రమంగా ఒక్కొక్కరి కెంత బట్ట కావలసిఉంటుంది? దానిని తయారుచేయ డానికి ఎంత నూలు కావాలి, దానిని వడికేటందు కెంత కాలం కావాలి?

6. ఒక కుటుంబమునకు కావలసిన బట్ట ఎంత? దానిని ఉత్పత్తిచేసేటందుకు పత్తి ఎంత కావాలి? అందుకవసర మైన పత్తిని పండించేటందు కెంత పొలం కావాలి?

(ఒక కుటుంబము అంటే, ఒక తండ్రీ, తల్లి, ముగ్గురు పిల్లలు—ఒక ఆడపిల్ల, ఇద్దరు మగపిల్లలు 7, 5, 3 యేళ్ల వయస్సుగలవారు.)

7. ఇప్పుడమలులోనున్న కమానును క్రొత్తవాటితో పోల్చండి. గంటకు మీరెంత ఏకెదరు? పత్తి సరిగా ఏక బడిందో లేదో మీరెలా నిర్ణయించగలరు? ఒక పౌను ఏకులు చేయడానికి మీకెంత కాలం కావాలి? ఒక తులం పత్తికి మీరెన్ని ఏకులు చేస్తారు?

8. ఒక గంటలో ఎంత పత్తిలోని గింజలు తీయగలరు? చేతితో గింజలు తీయడంలోనూ, యంత్రంతో గింజలు తీయడంలోనూ గల యోగ్యతా యోగ్యతలను తెలుపుతూ, ఒకదానితో ఒకటి పోల్చండి. ఇప్పుడమలులోనున్న చేతి పత్తి రాటం బొమ్మ గీసి వర్ణించండి.

9. 36 అంగుళాల వెడల్పుగల ఒక గజం బట్టను నేసే టందుకు కావలసిన 20 నెంబరు నూలు చెప్పండి. దానిని నేయడానికి ఎంతమంది కావాలి?

10. గుంట మగ్గాన్ని మరమగ్గంతో పోల్చండి.

—హరిజన్ 16-1-1937

# 171

# ఖాదీ కార్యకర్తలు తెలుసుకోవలసినది

ఖాదీ శాస్త్రం యేమేమి చెప్పవలసి ఉంటుందో వివరించేటందుకు కిందటి వ్యాసంలో నేను ప్రయత్నించాను. అఖిల భారత చరాఖా సంఘం యొక్క ఉత్పత్తి కేంద్రములలో యే ఒకదానిలోనైనా నియమించబడిన ప్రతి ఖాదీ కార్యకర్తా ఈ శాస్త్రముయొక్క మూలతత్వములను నిర్బంధంగా తెలుసుకొనేటట్లు చేయవలెనని నా అభిప్రాయం. శ్రీ లక్ష్మీదాసు ఖాదీ ప్రియుడు. మన ఖాదీ శాస్త్ర విద్యార్థులందరిలోనూ అత్యంత జాగరూకత కలవాడు. కాని నేనాయనను ఈ శాస్త్రంలో ప్రవీణుడనికూడా అనను. ఆయన 1936 లో నాకు వ్రాసిన ఒకానొక ఉత్తరంలోని అభిప్రాయ ప్రకారం ప్రతి ఖాదీ కార్యకర్తా నెగ్గి తీరవలసిన కనీసపు పరీక్ష యేమిటో నిర్ణయించారు. ఆ పరీక్ష ఈ కింద ఉదాహరింపబడినది :—

1 పత్తి, పత్తిగింజలు, దూది, పేటీలలో నాణ్యమైన సరుకుకు నాసి సరుకుకు భేదం తెలిసిఉండాలి కార్యకర్తకు.

2. గింజలు తీసే పత్తిరాటంయొక్క త్రిప్పుడు సీలను సరియైన చోట బిగించగలిగి ఉండాలి. పై రోలరు వంగి పోయినప్పుడుగానీ లేక అనుమానమైన మందం గలిగి ఉన్నప్పుడుగాని దానిని నిశ్చలంగా ఉండే రోలరుతో చక్కగా సరిపోయేటట్లు సమన్వయం చేయగలిగి ఉండాలి.

3. కమానును బిగించగలిగి ఉండాలి. తూకపు బల్లకు నరమును, మేక చర్మమును తయారుచేసుకోగలిగి ఉండాలి.

4. చేతితో పనిచేసే పత్తి రాట్నంపైన నాలుగు గంటల పైచిలుకు కాలంలో, గంటకు 5 పౌనులు పత్తులు తీయగలిగి ఉండాలి.

5. ఏకులు చేసేటందుకు కావలసిన సమయంకాక, గంటకు పది తులాల దూదిని ఏకగలిగి ఉండాలి.

6. ప్రతి తరహా రాట్నం నిర్మాణం అతనికి తెలిసి ఉండాలి. దానిని ఎలా కూర్చాలో ఎరిగి ఉండాలి. కదురు వంకరపోతే తీయగలిగి ఉండాలి. మాల్, దమ్మాణాలను— కప్పీకి తగిలింపబడిన రెండు తాళ్లను తయారుచేసుకోగలిగి ఉండాలి.

7. నాలుగు గంటల కాలంలో 20 నంబరు నూలు, 300 చుట్లు (400 గజాలు) 80% పైచిలుకు పురితో 95% సమత్వంతో వడకగలిగి ఉండాలి.

8. ఆయనకు ఆంధ్రుల నూలువడికే పద్ధతి తెలిసి ఉండాలి. రెండు గంటల పరీక్షలో 70 మొదలు 80 నంబరువరకూగల నూలు 80% పురితో 95% సమత్వంతో 200 చుట్లు వడకగలిగి ఉండాలి.

9. గుంట మగ్గము, మరమగ్గములను నిర్మించడం తెలుసుకొని ఉండాలి. అచ్చులు, పన్నెలు, సరిచేసే కుంచె—పీట్టినన్నిటిని కూడా తయారుచేసుకో కలిగిఉండాలి.

10. 20 వ నంబరు నూలునుండి మరమగ్గంమీద 50 అంగుళాల వెడల్పుగల బట్ట నేయగలిగి, చీరలకు కనీసం అయిదు తరహాల అంచుల నమూనాలు తయారుచేసే టందుకవసరమైన సర్దుబాట్లు చేసుకోగలిగి ఉండాలి.

11. 20 వ నంబరు నూలుతో గంటకు ఒక చదరపు గజం నేయగలిగినంత వేగం రావాలి.

12. వివిధరకాల పత్తిని పండించడమును గూర్చి అంతా అతనికి తెలిసి ఉండాలి. ముఖ్యంగా స్థానికమైన సరుకుతోనే స్థానికంగా తయారుచేయబడిన పత్తి రాటాలు, కమానులు, రాటాలు, మగ్గాలు, వాటికి సంబంధించిన పరికరాలన్నీ ఆయన తెచ్చుకోగలిగి ఉండాలి. అందుకు ఈ కింది సంగతులు తెలిసి ఉండాలి:—

(ఎ) వర్షము, సంవత్సరంలోని వివిధ ఋతువులలో దాని విస్తీర్ణము, పంపిణీ తెలిసి ఉండాలి. ఎరువులు భూసారముయొక్క స్వభావము తెలిసి ఉండాలి.

(బి) వివిధరకాల కొయ్య, కొలతలనుబట్టి అంచనాలు తెలిసి వుండాలి.

(సి) పైన చెప్పబడిన అవసరాలకోసం పని జరగడానికి వీలైన చిత్రలేఖన జ్ఞానం ఉండాలి.

(డి) వివిధ రకాల యంత్రాలను బాగుచేసుకోనేటందుకు తగినంత వడ్రంగ జ్ఞానం ఉండాలి.

ఈ పరీక్షలో ఉత్తీర్ణులుకావడం అంత తేలిక పనికాదు. కాని ఇందులో కొంత శిక్షణపొంది, తగిన శ్రద్ధా ఉత్సాహమూ కలవారెవరైననూ శ్రీ లక్ష్మీదాసు పరీక్షలో ఉత్తీర్ణులు కాగలరు. అయితే అప్పటికీ ఖాదీ శాస్త్రంలోని వాణిజ్య సంబంధమునైన విషయాలందులో లేవు. అవి నేను వ్రాసిన ప్రశ్నలవల్ల సంపూర్తికాగలవు. శ్రీ లక్ష్మీదాసు తయారుచేసిన పాఠక్రమం ఖాదీ పనికి సంబంధించి ఉద్దేశింపబడినది. ఖాదీ మూలతత్వములలో ప్రవీణుడని పిలవబడే

మనిషి ఈ రెండు రంగాలలోనూ కూడా నిపుణుడుగా ఉండాలి. ఈ వ్యాసాన్ని చదవడం తటస్థించిన ఖాదీ కార్య కర్తలలో ఖాదీ పనితనంలో గానీ లేక ఖాదీ వ్యాపార విషయంలో గానీ లేక రెండింటిలో గాని ఈ పరీక్షకు నిలవ గలిగినవారు తమ పూర్తి పేరులను, చిరునామాలను నాకు పంపినట్లయితే నేను వారికి కృతజ్ఞుడను. అదేవిధంగా ఖాదీ ప్రాథమిక విజ్ఞానమునందు అర్హత సంపాదించవలెనని ఆసక్తికలవారుకూడా నాకు వ్రాయవలెను. ఇందుకు కావలసిన జ్ఞానమును కలిగించేటందుకుపయోగపడతగిన పాఠ పుస్తకాలు దురదృష్టవశాత్తు ఈ రోజున మనకు లేవు. ఈ పనికి కొంతవరకుపయోగించతగి ఉన్న పుస్తకం కీ॥ శే॥ శ్రీ మగన్‌లాలు గాంధీ వ్రాసినదొకటే. ఆ పుస్తకం వ్రాసిన పిమ్మట ఖాదీ విజ్ఞానం ఇంకా అభివృద్ధిఅయిన కారణాన అదికూడా ఈ నాటికి తగినట్లుగా లేదు. కాబట్టి దానిని తక్షణం సంస్కరించి మరల ప్రచురించవలసిన అవసరం ఉంది. దానిని సంస్కరించేటందుకు తగిన శ్రద్ధా, తీరికా కల ఖాదీ ప్రియులు మనకు ఉన్నప్పుడు మాత్రమే ఆ పని జరుగగలదు.

—హరిజన్, 13-2-1937

## 172

# మొదలుపెట్టవలసిన పద్ధతి

ఖాదీ ఉత్పత్తికి సంబంధించిన వివిధ కార్యక్రమాలలో నిపుణులు కావలెనని ఉత్సాహంకల కార్యకర్తలనుగూర్చి కొంతకాలంకిందట నేనీ పత్రికద్వారా చేసిన ఆహ్వానం ఎక్కువమందిని ఆకర్షించింది. ఆ విషయంలో ఇప్పటికే నాకు చాలా ఉత్తరాలు చేరినవి. ఈ స్నేహితులకు మార్గదర్శకంగా ఉండేటందుకు ఆచరణయోగ్యములయిన కొన్ని సూచనలను చేయడమే ఈ దిగువ వాక్యముల ఉద్దేశం :—

ఎవ్వరైనా ఏ విషయంలోనైనా ప్రావీణ్యత సంపాదించవలెనంటే ఆయన కందులో మొట్టమొదట సజీవమైన విశ్వాసం ఉండాలి. అది ముఖ్యమైన షరతు ; తరువాత ఆయనకు నేర్చుకోవలెననే ఆసక్తి దానికొఱకవసరమైన త్యాగం చేసేటందుకు సంసిద్ధతా ఉండాలి. చదువుకొనేటందుకు పుస్తకాలు, ఉపాధ్యాయులు, అందుకు సంబంధించిన యితర పరికరాలు, కొద్దిగానో గొప్పగానో కావలసి ఉండే మాట వాస్తవమే. కాని నేర్చుకొనేటందుకు శ్రద్ధా, జ్ఞానంకోసం ఉత్కంఠా, ఉండడం అన్నిటిలోకీ అత్యంతావశ్యకం. ఇవి ఉంటే తక్కినవి వాటంతటవే లభిస్తవి. కాబట్టి, ఖాదీ శాస్త్రాభ్యాసం చేయదలచుకొన్నవారంతా, తమకు సన్నిహిత సమీపంలో, ఖాదీ ఉత్పత్తికి సంబంధించిన యే కార్యక్రమాలు నడపబడుతూన్నవో కనుగొనేటందుకు తక్షణం ప్రారంభించి, వారి కకడ లభించిన ఉపయోగకరమైన సమాచారమును సేకరింపకోరుతూన్నాను. ఖాదీ

శాస్త్రి విద్యార్థి ఈనాడు ముఖ్యంగా చేయవలసిన పని, తాను చేసిన పరిశోధనను స్వానుభవంతో సమన్వయం చేసుకోవడం. దేశంలోని వివిధ భాగాలలో నేడు ఖాదీ ఉత్పత్తికి సంబంధించి వివిధ కార్యక్రమాలు వాడుకలోనున్నవి. కాని అవి అన్నీ పూర్తిగా తెలిసిన మనిషి ఈనాడు ఒకరుడు కూడా లేడు. ఖాదీ శాస్త్రం అభివృద్ధిపొందవలెనంటే ఈ వివిధ పరిణామ విధానాలను పూర్తిగానూ వివరంగాను తెలిసికొని ఉండడం అవసరం. ఈ పని ఒక వ్యక్తియొక్క శక్తికి మించినదన్నమాట వాస్తవం. కాని పరిశోధన జరుపవలెననే వైజ్ఞానిక చిత్తవృత్తితో నిజముగా ప్రేరేపింపబడిన కొంతమంది వ్యక్తులు, ఈ పనికి సక్రమ పద్ధతిని పూనుకొన్నమొదల వారు తమ సామర్థ్యానుభవముల నొకటిచో చేర్చి క్రొలది కాలము లోనే సజీవమైనట్టి, అభివృద్ధిపొందుతూన్నట్టి ఖాదీ విజ్ఞానమును విస్తరింపచేయగలరు. అయితే తామాపని చేయగలగడానికి ముందు, నేడు దేశంలో ఖాదీ ఉత్పత్తికి సంబంధించి వాడుకలోనున్న అన్ని పరిణామ క్రమాలలోనూ సమష్టిగా వారు ప్రావీణ్యం సంపాదించవలసి ఉంటుంది.

ఇందుకు ముఖ్య తార్కాణంగా నేడు ఆంధ్రదేశంలోని వివిధప్రాంతాలలో వివిధ విధములుగా వడకడంద్వారా అనేక రకాల ఖాదీ ఉత్పత్తి చేయబడుతూన్నది. ఖాదీ విజ్ఞానము సంపాదించవలెనని ఉత్సాహం కలవాడే ఆంధ్రాఖాదీ కార్యకర్తయైనా, ఈ వివిధ విధానాలలో ప్రావీణ్యమును సంపాదించడంద్వారా పని ప్రారంభం చేయవచ్చును. ఇందుకోసం ఆయన తన రాష్ట్రాన్ని విడిచి పోనక్కరలేదు. ఆయన కత్యంత సన్నిహితంగానున్నచోట వాడుకలో నున్న విధానమును ముందుగా ఆయన నేర్చుకోవచ్చును. శాస్త్రి

యంగా ఏకడం నేర్చుకోవడమంటే విద్యార్థి కమానును తయారుచేసుకోవడంకూడా నేర్చిఉండవలెనని అర్థం. కమానుకు ఉన్న నారి (gut string) మొదలయిన యితర భాగాలు దేనితో ఎలా తయారు చేయబడుతూన్నవో కూడా ఆయన తెలుసుకొని ఉండడం అవసరం. అత్యుత్తమ ఫలితములు చేకూరేటందుకు కమాను పొడుగు సరిగా ఎంత ఉండాలో ఆ ప్రమాణమునకు భిన్నంగా ఉండడంచేత కలిగే దుష్ఫలితాలేవో, కమాను తాడుపైన ఎక్కడ సరిగా దెబ్బకొట్టాలో అందుకు కారణమేమోకూడా విద్యార్థి తెలుసుకోవాలి. ఇవేకాక ఇంకా అనేక సంగతులు దూదేకుల వృత్తిచేసే వారిలో నిపుణులను కొన్నవారికికూడా తెలియనివి తెలుసుకోవలెననే శ్రద్ధలేనివి, మన ఖాదీ విద్యార్థి తెలుసుకోవాలి. అదేవిధంగా పత్తి విషయంలోకూడా ఏకే పనిని శాస్త్రీయ దృక్పథంతో నేర్చుకో పూనుకొన్న కార్యకర్త, వివిధరకాల పత్తినిగూర్చి పూర్తిగా తెలుసుకోవడం అవసరం. వివిధ రకాల పత్తి యేసులయొక్క పొడుగు, బలం, సన్నదనం, తెలుసుకొని ఉండాలి. ఏకేటందుకు తన చేతులలోకి వచ్చే సరికి అది యేయే పరిణామాలను పొందవలసి ఉంటుందో కూడా తెలుసుకోవాలి. అంతేకాక అది ఎక్కడ పెరుగుతూన్నదో, ఎకరానికి ఎంత పండుతుందో, ఆ పంటయొక్క మొత్తం ఖరీదెంతో, పత్తి పండూతూన్న విస్తీర్ణమెంతో, అంతకుపూర్వం ఆ భూమిలో ఏమి పండుతూండేదో, లేక అది వట్టి బంజరుగా ఉండేదో, పత్తికి బదులుగా మఱొక పంట వేసినట్లయితే వ్యవసాయకుని పరిస్థితిలో వచ్చే మార్పేమిటో ఈ మొదలైన సంగతులన్నీ ఆయన తెలుసుకోవాలి. అప్పుడతనికి ఆచరణవలన కలిగిన అనుభవం శాస్త్రి జ్ఞానంవలన వికసించి ఆయన నేర్చుకొంటూన్న విషయంలో

ఆయనకొక గట్టి అధికారమూ, దానిలోని గోప్యములను గూర్చిన అంతర్దృష్టీ కలిగిస్తుంది. అందువలన ఆంధ్ర దేశంలోని వివిధ ప్రదేశాలలో ఆచరణలోనున్న ఖాదీ ఏకు పద్ధతుల నన్నిటినీ సమగ్రంగా తెలుసుకోవడం ఆయనకు ఎక్కువ తేలిక అవుతుంది, తక్కువ కాలం పట్టుతుంది. అంతేకాక ఆయన తన ప్రయోగములను అనుభవములను క్రమంగా వ్రాసిపెట్టుకొన్న యెడల అది కాలక్రమేణా ఖాదీ ఏకు శాస్త్రమునకొక ప్రమాణ గ్రంథంగా పరిణమించవచ్చును.

ఖాదీ శాస్త్రమును అభ్యసించేటందుకు ఖాదీ కార్యకర్త ఎవ్వరూ తన కార్యరంగమును విడిచిపెట్టనక్కర లేదని ఇందువలన తెలియగలదు. తెలుసుకోవలెననే భావంతో అతడు ప్రేరేపింపబడి, ప్రత్యేక శ్రద్ధవహించి పనిచేయడానికి తగిన సహనమూ సమర్థతా అతనికి ఉన్నట్లయితే, అతని పరిసరములలోని ప్రత్యేక సౌకర్యములద్వారా ఆయా విధానములను సన్నిహితంగా పరిశీలించేటందు కతడు పూనుకోవడం వలన, ఆ ప్రత్యేక విధానములలో అతడు ప్రవీణుడు కావడమే కాక క్రమంగా తన విజ్ఞానాన్ని శాస్త్రమనే పేరుకు తగి ఉండేటట్లు విస్తరింపచేయగలడు.

—హరిజన్, 10-4-1937

# 173
# స్వదేశీ ప్రదర్శనాలలో ఖాదీ

మిల్లు బట్టనుకూడా ఉంచడానికి ఆమోదిస్తూన్న స్వదేశీ ప్రదర్శనములలో, అఖిల భారత చరాకా సంఘం వారు భారతదేశమునందలి తదితర భాగములన్నిటిలోనూ ఖాదీని ప్రదర్శించడం నియమంగా మానివేశారు. ఆ నియమం ఎందుకు చేయబడినదో ఆ ప్రయోజనం కలిగిందికూడా. కాని ఈ నియమాన్ని తొలగించవలసిందిగా యునైటెడ్ ప్రావిన్సు నుండి వత్తిడివచ్చింది. అయితే ఆ ప్రలోభనము నింతవరకూ నేను నిగ్రహించగలిగాను. యునైటెడ్ ప్రావిన్సు కాంగ్రెసువాదులు తమకు మార్గదర్శకంగా ఉండేటందుకు ప్రత్యేకం నన్ను సలహా అడిగారు. వారంతా దాదాపు ఎవ్వరికీ తీసిపోని అచ్చమైన కాంగ్రెసువాదులు. కాని వారు నిర్మాణకార్యక్రమంలో కష్టతమమైన ఖాదీ పని ద్వారా కాంగ్రెసును సేవించేటందుకు తమ జీవితాలను అంకితంచేసుకొన్నారు. వారి కష్టాన్ని నేను గమనించి జవహర్‌లాలు నెహ్రూ అభిప్రాయంకోసం, ఈ విషయాన్ని ఆయనకు పంపించాను. ఆయనదగ్గరనుండి వచ్చిన జవాబిది:—

"ప్రదర్శనాలలో ఖాదీనిగూర్చి అడుగుతూ మీరువ్రాసిన మార్చి 5 వ తేదీ ఉత్తరం అందింది. నేను యూరపునుండి వచ్చిన పిమ్మట, నిరుటి సంవత్సరం అనేక పర్యాయము లీవిషయాన్నిగూర్చి చర్చించాము. యు. పి. రాష్ట్ర కాంగ్రెసు సంఘం రెండు మూడేండ్ల కిందట ఒకటి రెండు ప్రదర్శనాలను యేర్పాటు చేసింది. అప్పటినుండీ తిరిగిఎప్పుడూ యేర్పాటు చేయలేదు. కాని అప్పుడప్పుడూ మా జిల్లా కమిటీలు కొన్ని ఈ ప్రదర్శనాలను ఏర్పాటుచేస్తూ వస్తూన్నవి. ఆ పద్ధతికూడా ఇప్పుడు చాలా తగ్గిపోయింది. స్వదేశీ సభలచే యేర్పాటుచేయబడిన ప్రదర్శనాలు మాత్రం ఎలాగో సాగుతూన్నవి. జరిగిన నవంబరు నెలలో అలహాబాదు స్వదేశీ సభవారు తమవార్షిక ప్రదర్శనాన్ని యేర్పాటు చేశారు. మామూలు ధోరణిలో వారు మిల్లు బట్టను

ప్రదర్శించారు. వారు నన్ను ఆ ప్రదర్శనాన్ని ప్రారంభించవలెనని కోరినారు. ఈ ఖాదీ మూలముననే చాలా నెలలవరకు నేనామోదించ లేదు. చివరకు అనేక కారణాలవల్ల ముఖ్యంగా స్థానిక కారణాలవల్ల నేనా పని ఒప్పుకొన్నాను. నేను నిరాకరించినట్లయితే అది అపోహకు కారణమవుతుందనీ అందువలన మనకు కొంత నష్టమున్నదనీ నేనను కొన్నాను. అక్కడి నా ప్రారంభోపన్యాసంలో నే నెక్కువగా ఖాదీని గూర్చియే మాట్లాడాను.

మీరు నన్నడిగిన ప్రశ్నకు ప్రత్యుత్తరమీయడం తేలికగాదు. మిల్లు బట్ట ఆమోదింపబడినచోట ఖాదీ ప్రదర్శింపబడరాదని మామూలు ఖాదీ కార్యకర్తయొక్క అభిప్రాయం. తదితర కాంగ్రెసు కార్యకర్తల అభి ప్రాయం సాధారణంగా అందుకు భిన్నంగా ఉన్నది. అటువంటి ప్రదర్శ నాలలోనే సామాన్యంగా ఎక్కువ ఖాదీ అమ్ముతూన్నదనే కారణము మీదనే వారలా అభిప్రాయపడుతున్నారు. నిజానికీ ఖాదీ పనిలో నిపుణుడుగా భావింపబడుతూ, ఖాదీని అభివృద్ధిచేయవలననే ఉత్సాహంగల, ఖాదీ కార్యకర్త అభిప్రాయమే దాదాపు తుదినిర్ణయంగా ఉండవలెను. కాబట్టి నేనాయనను ఒప్పించగలిగితేనేతప్ప, ఆయనకు ప్రతికూలంగా నేనభిప్రాయమీయడానికి జంకుతూన్నాను. అయితే యేది ఖాదీ, యేది ఖాదీకాదు అనే విషయంలో ప్రజలకు పొరపాటు పడకుండా ఉండేటందుకు, దూరదృష్టితో ఆలోచిస్తే, ఇప్పుడు కొంత నష్టపడడంకూడా ఉత్తమమేమోనని ఊహిస్తున్నాను. అటువంటి ప్రదర్శనాలలో, ధ్రువ పత్రములుపొందిన ఖాదీ అమ్మకాలను నిషేధిస్తూన్న ప్రస్తుత విధా నానికి కట్టుబడి ఉండడంమూలముననే ఆ పని జరుగగలదు.

పైగా, ధ్రువపత్రములు లేని ఖాదీ అక్కడ అమ్మబడుతూండడం దానిని చాలామంది అభిమానిస్తూండడం కనిపిస్తూన్నది. ధ్రువపత్రములుకల ఖాదీనే కొనితీరవలెనని పట్టుదల లేనివారు చాలామంది వున్నారు. కాని వారికెదురుగా కనిపిస్తే దానినే కొంటారు వారంతా. ఇది మీకు తెలిసిన విషయమే. ఇప్పుడాలోచించవలసిన విషయం ప్రజలకోరిక తీర్చేటందుకు ప్రత్యేక సదుపాయమేమైనా మనంచేయాలా ? లేక స్వచ్ఛమైన ఖాదీని మాత్రమే ఉపయోగించ కోరేవారి విషయంలోనే శ్రద్ధవహించవలెనా ? ఈ ప్రశ్న వ్యాపారసరళిలోనేగాక మానసిక ప్రవృత్తినిబట్టికూడా ఆలోచించవలసి ఉన్నది. ఒక్క ప్రక్క ఖాదీ బాగాపునాది ఏర్పఱచు కొన్నది. ఎంత కష్టమైనా, ఎంత ఖరీదైనా స్వచ్ఛమైన ఖాదీయే కావలె ననే జనం కొంత ఉన్నది. మరొక ప్రక్క, అప్పుడప్పుడూ ఖాదీని

అభిమానిస్తూ వచ్చే తదితరవర్గాలలో, అది వ్యాపించతగినంత వేగంగా వ్యాపించడం లేదు. ఈ రకంవారిలో ఖాదీ వాడుక అభివృద్ధిచేయడం ఖాదీ కార్యకర్తల ఆశయంగా ఉండాలి. మనస్సుకుగానీ హృదయానికిగానీ నచ్చేటట్లు ప్రబోధంచేయడంవలన చాలావరకున్నూ, కేవలం అలవాటువలన కొంతవరకున్నూ ఖాదీ వాడుకలోకి వస్తుంది. మామూలుగా చెప్పవలసివస్తే, అప్పుడప్పుడూ ఖాదీ కొనేవారెంత ఎక్కువ మంది అయితే అంతమంచిది. అందువలన వారు ఖాదీ కొని కట్టుకోవడానికి అలవాటు పడతారు. చివరకది వారికి ప్రకృతిసిద్ధమైన అభ్యాసంగా పరిణమిస్తుంది. ప్రస్తుతవిధానం కొంతవరకు అప్పుడప్పుడూ ఖాదీ కొనేవారిని దూరంగా ఉంచుతూన్నది. అందువలన పరిమిత క్షేత్రమునుండి మాత్రమే ఎల్లప్పుడూ ఖద్దరు కొనేవారిని మనము ఆకర్షించవలసివస్తుంది.

ఈ ప్రదర్శనములనుగూర్చి మరొక చిక్కు కూడా ఉన్నది. వీటిలోకి వచ్చే సరకులపైన తరచుగా తగిన తనిఖీ ఉండడం లేదు. విదేశీ నూలుతో తయారుచేయబడిన బట్టలు అంగీకరింపబడుతూన్నవి. లేదా కొద్దిగా భారత దేశపు ముడి వస్తువున్నూ, పనితనమున్నూ కల విదేశీ సరుకు విశేషంగా ఉంటూన్నది. ఎక్కువ కఠినమైన పర్యవేక్షణ ఉన్నయెడల దీనిని లేకుండా చేయవచ్చును. కాని మామూలు స్వదేశీ లీగు కమిటీ దీనిని గూర్చి శ్రద్ధవహించవలసినంతగా భయపడడంలేదు.

స్వదేశీ ప్రదర్శనాలు మనం అలక్ష్యంచేయడానికి వీలులేని యితర సమస్యలకు కూడా తఱచు కారణభూతములవుతూన్నవి. ఇందుకు తార్కాణంగా నిరుడు నేను దానిని ప్రారంభించడానికి ఒప్పుకోక పోయినట్లయితే కొంత చిక్కు కొంతమందకి కష్టంకలిగిఉండేది. అది మన పనికి అడ్డంవచ్చేది. అందువలన నేను ఒప్పుకొన్నాను.

కాబట్టి మీరు నా తుది అభిప్రాయం చెప్పవలసిందని నన్ను మీరు కోరినట్లయితే, ఇదమిత్థమని నేను చెప్పజాలకుండా ఉన్నాను. అటువంటప్పుడు ఖాదీకోసం పనిచేస్తూన్న యితరుల అభిప్రాయాన్ని నేను మన్నించి తీరాలి. అయినప్పటికీ, కొన్ని పరిస్థితులలో ఈ ప్రదర్శన శాలలయందు ఖాదీ ప్రదర్శింపబడేటందుకు అమ్మబడేటందుకు ఒప్పుకోవడమే ఉచితంగా ఉండవచ్చునని నాకు తోస్తున్నది. అప్పుడు (1) ఖాదీ కాని దానిని ఖాదీగా పొరపాటుపడకుండా ఉండేటట్లు, సాధ్యమైనంత వరకు ఏమైనా చేయాలి; మిల్లు బట్టకూ ఖాదీకి ఉన్న భేదం, పూర్తిగా ప్రతివారూ గమనించగలిగేటట్లు ఉండాలి; (2) కొంత విదేశీగా ఉండే సరుకులను ప్రదర్శనములనుండి మినహాయించాలి.

ఆయన తుది అభిప్రాయం ఈయజాలనందున, ఖాదీ కోసం పని చేస్తూన్న యితరుల అభిప్రాయాలను ఆయన మన్నిస్తాడు. అయినప్పటికీ "ఈ ప్రదర్శనాలలో ఖాదీ ప్రదర్శింపబడేటందుకు, అమ్మబడేటందుకు ఒప్పుకోవడమే ఉచితంగా ఉండవచ్చునని ఆయనకు తోస్తూన్నది." ఖాదీని డాంబికమైన మిల్లు బట్టతో సమాన స్థితిలో ఉంచి ప్రజా సామాన్యముయొక్క మనస్సును అస్పష్టంగా చేయడం అపాయకరమని నా అనుభవం చెపుతూన్నది. అది సరిగా, మానవులను అన్ని విధాలా మానవులవలె కనిపించే యంత్రముల ప్రక్కను ఉంచడంవంటిది. అటువంటి యంత్రములతో పోల్చి చూచేయెడల మానవులు ఓడిపోవచ్చును. మిల్లు బట్టతో పోల్చి చూచేయెడల ఖాదీకూడా అలాగే అవుతుంది. ఈ రెండింటి అంతరువులకూ భేదమున్నది. ఇవి రెండూ ప్రతికూలోద్దేశములు కలవి. ఖాదీ అందటికీ పని చూపిస్తుంది. మిల్లు బట్ట కొందటికే పని చూపిస్తుంది. అనేక మంది సరియైన పనివాళ్లకు పని లేకుండా చేస్తుంది. ఖాదీ సామాన్య ప్రజలకు సేవచేస్తుంది. మిల్లు బట్ట ఉన్నత తరగతుల కుపకారం చేయుటాని కుద్దేశింపబడినది. ఖాదీ కార్మికవర్గాన్ని రక్షిస్తుంది. మిల్లు బట్ట స్వార్థంకోసం వినియోగించుకొంటుంది. నా అనుభవం యావద్భారత దేశంలోని ఖాదీ కార్యకర్తలవల్ల బలపఱుపబడుతూన్నది. కాబట్టి యునైటెడ్ ప్రావిన్సు కాంగ్రెసు వాదులు శ్రీ జవహరలాలుతో సహా తమ అభిప్రాయం అఖిల భారత చరాకా సంఘం వారి అభిప్రాయంతో భిన్నంగా ఉన్నప్పటికీ, అఖిల భారత చరాకా సంఘం వారి విధానాన్నీ అనుభవాన్నీ మాత్రమే మన్నిస్తారని నేనాశిస్తున్నాను.

—హరిజన్, 10-4-1937

# 174
# వడికేవారి మజూరీలు

అఖిల భారత చరఖా సంఘం పరిషత్తు 23, 24 వ తేదీలలో జరిగిన వార్ధా సమావేశంలో ఈ దిగువ ముఖ్య తీర్మానములను చేసినది :—

"వడికేవారికిన్నీ తక్కువ మజూరీ లీయబడుతూన్న తక్కిన కర్మకారులకున్నూ క్రమంగా మజూరీలను పెంచే నూతన విధానము, వడికేవారి మజూరీల పెరుగుదలగా పరిణమించి, మొత్తంమీద ఖాదీ కార్యకర్తలలో అధిక సంఖ్యాకు లనుకొన్నదానికంటె ఎక్కువగా జయప్రదమయిందని ఈ పరిషత్తు సంతోషంతో గమనిస్తూన్నది."

"నిరుడు ప్రవేశపెట్టిన నూతన విధానమువలన ఖరీదులు పెరిగిన కారణంగా చేకూరిన అదనపు మొత్తమును, వడికేవారియొక్కయు తదితర కర్మకారులయొక్కయు పనితనమును పెంపొందించే నిమిత్తం ఎక్కువ బాగా పనిచేసే రాటములను, ఇతర పనిముట్లను, అందుకు కావలసిన ఇతర సామగ్రిని వారికి సరఫరా చేయుటకున్నూ, వారి పనికి అవసరమైన కార్య విధానములలో, శాస్త్రీయమైన శిక్షణ యిచ్చి బోధకులను తయారుచేసేటందుకున్నూ వినియోగించవలెననికూడా ఈ పరిషత్తు తీర్మానిస్తూన్నది. అహమ్మదాబాదులోని కేంద్ర కార్యాలయం, ఈ విషయంలో తగిన చర్యలను తీసుకోవలెను. సాధ్యమయినంత త్వరలో రాష్ట్రీయ శాఖలు వారి పనినిగూర్చిన సూచనలను పంపవలెనని కోరబడుతూన్నవి."

ఈ విధానము ప్రారంభింపబడినప్పుడు, దీని విజయమును గూర్చి అనేక మంది కార్యకర్తలకు చాల పెద్ద అనుమానా లుండేవి. ఇందుమూలమున పెరిగే ఖాదీ ధరలవలన ఖాదీ అమ్మకం పడిపోతుందని వారనుకొన్నారు. అనుభవంవలన ఆ భయాలు తీరినవి. పైగా వీలైతే తొందరలోనే మఱొక అడుగు ముందుకు వేయవలెనని పరిషత్తు ఉత్సాహంగా ఉన్నది. కాబట్టి మఱొక అడుగు ముందు వేయ

వలెననే కొందరకు అవసరం లేకపోయినప్పటికీ, దానిని గూర్చి కార్యకర్తలు మాత్రం అశ్రద్ధగా ఉండకూడదు. ఎనిమిది గంటల పనికి రోజుకు ఎనిమిది అణాలు మన లక్ష్యమని వారు జ్ఞాపకం ఉంచుకోవాలి. ఇప్పటికి మనం పేరుకు మాత్రం మూడణాలకు చేరుకొన్నాము. ఈ మొత్తం ఎక్కువకిందనూ, సమర్థతకిందనూకూడా సమానంగా పంచి పెట్టబడుతూన్నది. సమర్థతవలన లభించే మజూరీల, వలన ప్రత్యక్షంగా అమ్మకం ఖరీదు పెఱుగదు. పైగా వడికేవారి సామర్థ్యంవలన ఖాదీయొక్క నాణ్యం అభివృద్ధి అవుతుంది. మజూరీలు ప్రత్యక్షంగా హెచ్చడం వలన ఖరీదులుకూడా హెచ్చే మాట నిజమే. కాని నాణ్యం కూడా హెచ్చినందున ఖరీదుల పెంపుదల భారం తగ్గిపోతుంది. ఈ పెంపుదల ఎక్కువ న్యాయదృష్టితో చేయబడినది. ఇందువలన, ఖాదీ కొనే మిక్కిలి నిరుపేదల పైన ఏమీ పడకుండా ఉండేటట్లుకానీ, లేక మిక్కిలి కొద్దిగా పడేటట్లు గానీ యేర్పాటు చేయబడింది. కార్యకర్త లింకా ఎక్కువ చుఱుకుగానూ, ఎక్కువ సమర్థులుగానూ, ఎక్కువ విశ్వాస పాత్రులుగానూ ఉన్నయెడల, అమ్మకపు ఖరీదులు అత్యధికంగా పెఱిగవలసిన అవసరం లేకుండానే ఎనిమిది గంటల పనికి రోజుకు ఎనిమిది అణాలు సంపాదించుకొనే రోజు త్వరగా వచ్చేటట్లు చేసుకోగలరు. శాస్త్రీయ జ్ఞానం ఎక్కువయిన కొద్దీ, పత్తి రాటాలయొక్కయు, కమానుల యొక్కయు, రాటములయొక్కయు పనితనాన్ని పెంపొందింపవచ్చును. వడికేవారి పని బాగా పరిశీలింపబడేయెడల వారందులో ఎక్కువ సమర్థులు, ఎక్కువ నిపుణులు కావ డానికి వీలున్నది. పరిపాలనా వివరములలో ఎక్కువ గ్రహింపు, ఎక్కువ సత్య నిష్ఠా ఉన్నట్లయితే,

కార్యాలయ వ్యయము, పెట్టుబడిమీద వడ్డీ, వ్యాపారమున కయ్యే యితర ఖర్చులు మొదలయినవి తగ్గిపోతవి. సరిగా చెప్పవలసివస్తే, రోజుకు ఎనిమిదణాల లక్ష్యమును అందుకొనే టందుకు అభ్యంతరం కలిగిస్తూన్న మన ప్రస్తుత అసమర్థతకు పునాది మనకు ఖాదీ శాస్త్రం తెలియకపోవడమే. ఈ తీర్మానం ఆ ఉద్యమానికి ప్రోత్సాహకరంగా ఉండేటందు కుద్దేశింపబడినది. నిరంతరం జాగరూకతతో ఉన్నవారికే దేవుడు తోడ్పడతాడు.

—హరిజన్, 17-4-1937

---

# 175

## చేమగ్గపు సమస్య

దేశీ విదేశీ మిల్లుల నూలులు రెండూ ఉపయోగిస్తూ 1934 వరకు చేమగ్గములు ఉత్పత్తిచేసిన మొత్తం బట్టల అంకెలు ఈ దిగువ నుదాహరింపబడినవి :—

| సంవత్సరం. | | సగటున బట్ట ఉత్పత్తి లక్షల గజాలలో. |
|---|---|---|
| 1911-14 | ... | 101 |
| 1921-24 | ... | 117 |
| 1922-53 | ... | 124 |
| 1930 | ... | 134 |
| 1931 | ... | 134 |
| 1932 | ... | 140 |
| 1933 | ... | 172 |
| 1934 | ... | 170 |

ఈ అంకె లెంతవరకు నమ్మదగినవో చెప్పడం కష్టం. కాని ఈ అంకెలలో యేమైనా తప్పు ఉంటే ఆ తప్పు తక్కువ చెప్పడంలో మాత్రమే ఉన్నట్లు నిర్భయంగా ఊహించవచ్చునని నా అభిప్రాయం. చేమగ్గాలు నిజంగా ఉత్పత్తి చేసింది బహుశా ఇంకా ఎక్కువే ఉంటుంది. ఈ చేమగ్గముల నన్నిటినీకూడా వడుకు నూలును నేసేటట్లు మనం మార్పు చేయగలిగి ఉండాలి. కాని ఈనాడు మన కాపని చేయగల శక్తిలేదు. ఈనాటి మన రాటపు నూలు తగినంత పురి కలదిగానూ లేదు. తగినంత ఉత్పత్తీ

కావడం లేదు. పురిలోగానీ, సమత్వంలోగానీ, మిల్లు నూలుతో పోటీకి నిలవగలిగిన వడుకు నూలును మనము ఉత్పత్తి చేయజాలనంతవరకూ, చేనేత మనిషి, దానిని ఉపయోగించడానికి కిష్టపడడు. అందుకు మంచి కారణం కూడా ఉన్నది. పురి లేక, సమంగా ఉండని నూలును ఉపయోగించడంవలన, ఒక పరిమిత కాలంలో ఉత్పత్తి కాదగిన బట్టయొక్క పరిమాణం తగ్గిపోతుంది. ఆ కారణంగా అతని సంపాదనా శక్తికూడా పడిపోతుంది. ఇది మొదటి కారణం. ఇక రెండవ కారణం, చేమగ్గంమీద నేసే మనిషి ఉన్నతశైలిలో నేయడంలో ప్రత్యేకత సంపాదించాడు. మనము ఉత్పత్తిచేసే సన్న నూలు చాలా తక్కువ. అదికూడా ఒక్క ఆంధ్ర దేశంలోనే తయారవుతూన్నది. ఈ చిక్కును విడదీయవలెనంటే ఖాదీ శాస్త్రంలో సంపూర్ణ ప్రావీణ్యం సంపాదించాలి. అయితే ఈ సమస్యను పరిష్కరించవలసిందిగా నేనెవ్వరిని కోరడంలేదు. ప్రస్తుతం ఇది కొన్నాళ్లు ఆగి ఉండవచ్చును. చేమగ్గం సమస్యను పరిష్కరించగలగడానికి ముందు జయప్రదంగా నిర్వహింపబడవలసిన సమస్యలు ఇంకా చాలా ఉన్నవి. ఖాదీ సార్వజనీనంగా చేయబడే స్వప్నం నిజమవడానికి ముందుగా ఈ సమస్య జయప్రదంగా నిర్వహింపబడవలెనని మాత్రం మనస్సులో పెట్టుకొనవలసి ఉన్నది.

—హరిజన్, 17-4-1937

# 176
# భారతీయ పరిశ్రమ

భారతీయ పరిశ్రమ అంటే ఏమిటని తఱచు ప్రశ్నింపబడుతూన్నది. భారతీయ ప్రదర్శనాలకు సంబంధించి సాధారణంగా ఆ ప్రశ్న వస్తూన్నది. మొట్టమొదట్లో భారతదేశంలో నడపబడుతూన్న ఏ పరిశ్రమ అయినా భారతీయ పరిశ్రమగానే వ్యవహరింపబడుతూండేది. ఆ విధంగా భారతదేశంలో స్థిరనివాసం లేని యూరోపియనులతోనూ వారు తెచ్చిన పెట్టుబడితోనూ, ఋణాలతోనూ, విదేశాల నుండి దిగుమతి అయిన యంత్ర సామగ్రితోనూ ఉన్న మిల్లు పరిశ్రమ, ప్రజా సామాన్యమునకు హానికరమైనదని నిరూపింపబడగలిగి ఉన్నప్పటికీ, భారతీయ పరిశ్రమగానే భావింపబడుతూ ఉండేది. అక్కడనుండి మనం చాలదూరం వచ్చాం. ఏదైనా ఒక పరిశ్రమ భారతీయ పరిశ్రమ అయ్యేటందుకు, ప్రత్యక్షంగా అది సామాన్య ప్రజలకు శ్రేయోదాయకంగా ఉండాలి. నైపుణ్యం కావలసిన పనివాళ్ళుకాని, నైపుణ్యం అక్కరలేని పనివాళ్లు కాని, అందులోనివారు భారతీయులుగానే ఉండాలి. దాని పెట్టుబడీ, యంత్ర సామగ్రీ భారతీయంగా ఉండాలి. దానిలో నియోగింపబడిన కార్మికులకు బ్రతుకు తెరువుకు కావలసిన జీతం ఉండాలి. సౌఖ్యకరమైన ఇల్లు ఉండాలి. కార్మికుల పిల్లల శ్రేయస్సుకు యజమానులు హామీ ఈయాలి. ఇది ఆదర్శప్రాయమైన నిర్వచనం. అ. భా. చ. సం., అ. భా. గ్రా. ప. సం. మాత్రమే బహుశా ఆ నిర్వచనాన్ని దాదాపు సంతృప్తిపరచగలవు. ఎందువల్లనంటే

ఇంకా చిక్కులలోనుండి బయటపడేటందుకు ఈ సంఘాలే ఇంకా పెనగులాడుతూన్నవి. అయినప్పటికీ ఈ నిర్వచనానికి సంపూర్ణంగా కట్టుబడి ఉండడమే వాటి అత్యంత సన్నిహితమైన ఆదర్శం.

కాని ఈ నిర్వచనానికీ, 1920 కి పూర్వపు కాంగ్రెసు నిర్వచనానికీ మధ్య అనేక భేదములుగల నిర్వచనాలు ఉన్నవి. ఇండియాలో తయారైన మిల్లు బట్ట తప్ప తక్కిన సరుకులన్నీ అని, కాంగ్రెసుయొక్క సామాన్య నిర్వచనం. గొప్ప మిల్లు పరిశ్రమ సాధారణంగా భారతీయ పరిశ్రమ అని చెప్పుకోవచ్చును. కాని జపాను లాంక్‌షైరులతో పోటీచేయగలిగిన సామర్థ్యం దానికి ఉన్నప్పటికీ ఖాదీమీద అది పొందిన విజయానికి సరియైన నిష్పత్తిలో, సామాన్య ప్రజలను స్వార్థంకోసం వినియోగించుకొని వారి దరిద్రమును పెంపొందించే పరిశ్రమ అది. సంపూర్ణ పారిశ్రామిక విధానముకొఱకు నేడు వ్యాపించి ఉన్న వెఱ్ఱిలో ఈ నా మాటలు త్రోసివేయబడక పోవచ్చును కాని సందేహింపబడుతూన్నవి. పారిశ్రామికాభివృద్ధితోపాటు సామాన్య ప్రజల పేదరికం పెఱుగడం తప్పనిసరి అనీ అందువల్ల దానిని అనుభవించక తీరదనీకూడా ఒక వాదం ఉన్నది. అనుభవించడం మాట అలా ఉండగా అసలా చెడుగు తప్పని సరి అని నేననుకోవడం లేదు. భారత ప్రజల తీరిక సమయాలను కేవలం నూలు వడకడానికీ దానికి సంబంధించిన కార్యక్రమాలను నిర్వర్తించేటందుకు వినియోగించడంద్వారా భారతదేశమునకు కావలసిన యావత్తు బట్టనూ గ్రామాలు తయారుచేసుకొనే సావకాశముందని అ. భా. చ. సం. జయప్రదంగా నిరూ

పించింది. అయితే దేశీయులు మిల్లు బట్టను ఉపయోగించ కుండా మాన్పించడంలో కష్టం ఉన్నది. ఆ పని ఎలా చేయవచ్చునో చర్చించడానికిది చోటుకాదు. లక్షలాది ప్రజలకు సంబంధించి, భారత పరిశ్రమయొక్క నిర్వచనాన్ని ఈయడమున్నూ, ఆ నిర్వచనమునకు నా కారణములను చెప్ప డమున్నూ మాత్రమే ఈ వ్యాసంలోని నా ఉద్దేశం. కాబట్టి ప్రజాసహాయము అన్నివిధాలా అవసరమైన పరిశ్రమల విషయంలో మాత్రమే జాతీయ ప్రదర్శనము లేర్పాటుచేయ బడవలెననీ, ప్రదర్శనముల సహాయం అవసరం లేకుండానే అభివృద్ధిపొందుతూన్న వాటి విషయంలోకానీ, తమ ప్రదర్శనములను తామేర్పాటుచేసుకొనే వాటి విషయంలో కాని ఆ యేర్పాటు అవసరం లేదనీ ప్రతివారూ స్పష్టంగా తెలుసుకోవాలి.

—హరిజన్, 23-10-1937

# 177

# ఖాదీ అంతర్యములు

[16 వ తేదీ ఉదయం ప్రదర్శనశాలలో ఆత్మపరిశోధక భావంతో గాంధీజీ తన మనస్సులో ఉన్నదంతా వలపోశారు. 1936 డిశంబరు 25 వ తేదీని ఫైజపూరులో ఆయన చేసిన ఆధ్యాత్మికోపన్యాసంలో కనపడిన స్వర వైశిష్ట్యంకానీ ఉద్వేగం కానీ ఆయన కంఠంలో ఆనాడు లేకపోయినప్పటికీ అదే గాంభీర్యం అదే ఆధ్యాత్మిక నిష్ఠా, అదే ప్రార్థనా, ప్రతిబింబితమైన ఆ కంఠం ఎంతో దూరంలో కాకుండా సన్నిహిత భవిష్యత్తులో నే స్తంభింపచేయబడబోతూన్నదను భావ్యనర్థసూచనతో మరింత నిర్నిరోధకమయింది. మ. దే.]

"తమ రాజీనామాలను పంపిన యు. పి. బీహారు మంత్రులిక్కడనే ఉన్నారు. దానినిగూర్చి మిక్కిలి విశేషమేమీ లేదు. రాజ్యాంగ చట్టం వట్టి బూటకమని పూర్తిగా తెలిసిఉండి వారు మంత్రిత్వాలు స్వీకరించారు. ఇప్పుడు బీహారు యు. పి. రాష్ట్రాలలో జరిగినదే, రేపు బొంబాయిలోనూ, ఎల్లుండి మద్రాసులోనూ జరుగవచ్చును. కాని ఆ పని ఎందుకు జరిగినదో సరిగా నేనీనాడు మీకు చెప్పబోతున్నాను. నేను మంత్రినైతే ఖైదీలను విడిచిపెట్టే అధికారం నాకు ఉంది. వారు ముగ్గురు కావచ్చును; 30 మంది కావచ్చును. అదేమీ లెక్క కాదు. గవర్నరు జోక్యం కల్గించుకోవడాని కేమి హక్కున్నది? నాకు అధిక సంఖ్యాక వోట్లున్నవి కాబట్టి నేను మంత్రిని; నేనా పదవిలో ఉన్నంత వరకు ఖైదీలను విడిచిపెట్టడంలో నాకున్న అధికారాన్ని వెవ్వరు ప్రశ్నించజాలరు. కాని రెండు రాష్ట్రాల గవర్నర్లు జోక్యం కల్పించుకొన్నారు. ఎందువల్లనో మీకు నేను చెపుతాను. సోషలిస్టు మిత్రులు ఏమి చెప్పినప్పటికీ, మనం ఖాదీయొక్క అంతర్యాలను గ్రహించకపోయి నందువలన గవర్నర్లు జోక్యం కల్గించుకొనేటందుకు ధైర్యం చేశారని నా అభిప్రాయం.

ఖాదీ, అహింసయొక్క ప్రతిబింబంగాను, దాని పునాదిగానూ భావింపబడినది. నిజమైన ఖాదీ ధారి అబద్ధం చెప్పడు. నిజమైన ఖాదీ ధారి హృదయంలో, హింసా, మోసం, అపరిశుద్ధత యివి వుండవు. 'ఇదీ ఖాదీ అయితే మేము ధరించము' అని చెప్పేవారికి 'మీ యిష్టం వచ్చినట్లు మీరు చేయవచ్చును. కాని అప్పుడు మీరు సత్యాహింసల ద్వారా స్వరాజ్యం సంపాదించడమనేది మఱచిపోవాలి. సత్యాహింసలను అనుసరించవలెనని కానీ నా పద్ధతివలననే స్వరాజ్యమును సంపాదించ వలెనని కానీ నేను మిమ్ములను బలవంతపెట్టను.' అని నేను బదులు చెపుతాను. విఠల్ నగర నిర్మాణానికి ఏడున్నర లక్షలు ఖర్చయింది. నాకిష్టమైన సంగతులిక్కడ చాలా ఉన్నవి. కానీ ఖాదీ తత్వం మాత్రం లోపిస్తూన్నది. నేను సర్దారు చాలా సన్నిహితులం. మేము ఒక్కటిగా ఉంటాము. ఒకేతీరుగా పనిచేస్తాము. ఒకేతీరుగా ఆలోచిస్తాము. కాని సర్దారుకూడా ఖాదీ రహస్యాన్ని పూర్తిగా గ్రహించినట్లు లేదు. ఖాదీ తత్వాన్ని ఆచరణలో పెట్టవలెననే హృదయ పూర్వకమైన ప్రయత్నమున్న చోట ఏడున్నర లక్షలు వెచ్చించేటందుకు తావులేదు. బయటనుండి తెచ్చిన రూ 5,000 లతో మహాసభను మనం గ్రామంలో జరుపగలిగి ఉండాలని నేనన్నాను. ఫైజుపూరు కాంగ్రెసుకు ముందు రూ 5,000 లతో దానిని తాను సమర్థించలేక పోయినట్లయితే, నా అంచనాలో ఆయన తగ్గిపోతాడని నేను దేవుకు చెప్పిఉన్నాను. ఆ అభిప్రాయం ఇంకా నా మనస్సును విడిచిపెట్టి పోలేదు. ఇది మనం చేయజాలనియెడల మనం నిజమైన స్వరాజ్య యోధులం కాము; మనం నిజమైన గ్రామస్థులంకాలేదు. గ్రామీణ చిత్తవృత్తి, ఐశ్వర్యప్రదర్శనాలంకారాలు ఈ రెండింటికీ పొత్తు కుదరదు. మోటారుకార్లకు, మోటారు లారీలకూ కూడా అక్కడ స్థానంలేదు. నన్ను వారు ఫైజుపూరుకు తీసుకొనిపోయి హరిపురాకు కారులో తీసుకొనివచ్చారు. నా కాలు బయటపెట్టడానికి వారు ఒప్పుకోలేదు. నన్ను వారు ఎద్దు బండీలోకూడా తీసుకొనిపోలేదు. అది సుభాష్ బాబుకోసం ప్రత్యేకించబడి ఉన్నది. నన్ను వారు ఎద్దు బండీలో తీసుకొనివచ్చినట్లయితే, కొంతకాలము వ్యర్థమై ఉండేది. కాని యేమయితే! మనమంతా రాజులమైనాము. కొంతమంది కాలినడకను పోయేవారు, కారులను అడ్డంకొట్టి తమకు కారులీయనియెడల సత్యాగ్రహం చేస్తామని బెదిరించినట్లు తెలుస్తూన్నది. మనం ఖాదీ చిత్తవృత్తికల వారమే అయినట్లయితే ఏడు లక్షల రూపాయీలు ఇక్కడ ఖర్చుపడి ఉండవలసింది గాదు. పెట్రోలు ఇంజనులు, ఆయిలు ఇంజ

నులూ స్కూళ్ళు, విద్యుద్దీపాలు, ఆధునిక నగరవాసుల సౌకర్యాలన్నీ, పళ్లు తోముకొనే బెండడీ, పళ్ళు తోముకొనే కుంచె, సువాసన తలనూనెలతో సహా ఇక్కడ ఉన్నవి. ఈ వస్తువులవలన గ్రామస్థుడు చెడిపోకుండా ఉండాలి. ఆయనకు పళ్లు తోముకొనే కుంచె, కొత్తగా కోసిన తుమ్మ పుల్ల; ఆయన పొడి ఉప్పు, రాక్షసి బొగ్గు. మీరు ఖాదీ ధరిస్తున్నారు. కాని మీకు చుట్టూ ఖాదీతో సమానంగా ఉండని తదితర వస్తువుల సంగతి యేమిటి? ఖాదీ మంత్రాన్ని మనం అవగాహన చేసుకొని ఆచరించలేదు కనుకనే కొంతమంది సోషలిస్టు మిత్రులు మనతో సహాసము వీడి, గాంధీజీ రోజులు వెళ్లిపోయినవనీ, ఒక నూతన యుగం వచ్చి పడ్డదనీ అంటున్నారు. నేనే దీనిని లెక్కపెట్టను. నిజానికి నిష్కపటంగా మాట్లాడడం నాకు సంతోషం. నేను చెప్పేది తోసివేయ డానికే తగినదని మీకు తోస్తే, తప్పకుండా తోసివేయండి. మీరేవి చేసినా నాకోసం కాక ఇండియాకోసం చేయండి. ఇంతా అయితే నేనొక మట్టిబొమ్మను ఎప్పుడో తప్పక బూడిద కావలసిందే. మీరు కోసం ఖద్దరు ధరిస్తూన్నట్లయితే, నా శవాన్ని తగులబెట్టిన రోజుననే ఖద్దరుకూడా తగులవేస్తారు. మీరు ఖాదీ సందేశాన్ని పూర్తిగా అర్థం చేసుకొని, జీర్ణించుకొని ఉన్నట్లయితే, ఖాదీ నా మరణానంతరం జీవించి ఉంటుంది. బాహ్య పూజలు చేసేటందుకు ఖాదీ నిర్జీవ ప్రతిమ కాదు. సరియైన పూజ విగ్రహారాధన కాదు; విగ్రహంలోని దేవుణ్ని పూజిం. చడం. ఖాదీ తత్వాన్ని విడిచిపెట్టి దానికి బాహ్యపూజలు చేసేటందుల మన మా వట్టి విగ్రహారాధకులకంటె ఉత్తములం కాము.

ఖాదీయొక్క ధార్మిక తత్వాన్ని నా దేశీయులకు ఇరవై సంవత్స రాలు బోధించాను. నేను మృత్యుద్వారంకడ ఉండి కూడా ఆ ధార్మిక తత్వాన్ని ప్రబోధించవలెనని నా కోరిక. అది పుట్టిననాడు కనికించి నట్లుగా ఖాదీ యిక వట్టి గుడ్డ పేలిక కాదు. దానికి యువకునకుండ వలసిన ఆరోగ్యము, సౌందర్యము, శక్తి ఉన్నవి. కాబట్టి ఖాదీ ధార్మిక తత్వాన్ని ద్విగుణీకృత విశ్వాసంతోనూ, శక్తితోనూ నేను బోధించగలను. నే నిందులో తప్పుచేయడంలేదని నాలో ఏదో నాకు చెపుతూన్నది. ఖాదీలో స్వారాజ్యం—స్వాతంత్ర్యం ఉన్నది."

—హరిజన్, 26-2-1938

# 178

# స్వదేశీ పరిశ్రమలు—విచక్షణ

నూతన రాజ్యాంగ చట్టంలోని విచక్షణ నియమాలను గూర్చి ఇటీవల చాలా చర్చ జరుగుతూవచ్చింది. అది సహజంకూడా. కారణమేమిటంటే, ఫెడరేషనును అనంగీకారంగా చేసిన నూతన రాజ్యాంగ చట్టముయొక్క అవలక్షణాలలో అది ఒకటి. ఇప్పుడు ఇర్విన్-గాంధీ సంధి అని ప్రసిద్ధికెక్కిన ఒడంబడికలో 'ఇండియా క్షేమం కోసం' అనే మాటలు చేర్చబడవలెనని గాంధీజీ పట్టుపట్టినప్పుడు ఆయన భావము విస్పష్టంగా ఉన్నట్లే కనిపిస్తుంది. అన్ని విదేశీ బట్టల దుకాణములకడను, భారతీయులకు పికెటింగు చేసే అధికారము నిస్తూ ఒడంబడికలో ఒక నియమాన్ని చేర్చడం మూలకంగా ఆ మాటలకు నిర్వచనం దానంతటదే చేకూర్చబడింది. యావద్విదేశీ వస్త్ర బహిష్కారంలో బ్రిటిష్ వస్త్రంకూడా తప్పనిసరిగా ఇమిడి ఉంది. కనుక అది బ్రిటిష్ వస్త్ర నిర్మాతలకు ప్రతికూల విచక్షణ అవుతుందా? ఇర్విన్ ప్రభువలా అనుకోలేదు వేని పతనంపైన బ్రిటిష్ పరిశ్రమలను పెంపొందించేటందుకుద్దేశింపబడినదో ఆ మృతిపొందినట్టిగానీ, మృతప్రాయములైనట్టిగానీ పరిశ్రమల పునరుజ్జీవనం విషయంలో కూడా అంతే. ఇర్విన్ ప్రభువీ సిద్ధాంతాన్ని 1931 లో అంగీకరిస్తే, నిజానికంతకు పూర్వం 1916 లోనే ఇండియా ప్రభుత్వంలో వాణిజ్య పరిశ్రమల శాఖా సభ్యుడుగానున్న సర్ విలియం క్లార్క్ అంగీకరించి ఉన్నాడని, ఒక

మిత్రుడా విషయాన్ని నా దృష్టికి తీసుకొనివచ్చాడు. ఇండస్ట్రియల్ కమిషన్ నియామకమును గూర్చిన తీర్మానాన్ని బలపరుస్తూ క్లార్క్ ఇలా అన్నాడు:

"పెట్టుబడి, యాజమాన్యము, పరిపాల భారతీయుల చేతులలో ఉండేటట్లు పరిశ్రమలను నిర్మించవలెననే ప్రత్యేకాభిప్రాయం మాకందరికీ ఉంది." ఆయన ఇంకా ఇలా అన్నాడు "దూరమునుండి ఇప్పుడు మీతో పోటీచేస్తూ తన కార్యకలాపాలను ఇండియాకు మార్చి మీతో మీ దేశంలోనే పోటీచేస్తూన్న పారిశ్రామికునిచే సృజింపబడిన పరిస్థితికి నేను ప్రతికూలంగా ఉన్నాను."

ఇక ఎల్లప్పటికీ యావద్విషయమూ నిస్సందేహంగా ఉండేటందుకున్నూ, ఈ సందర్భములో గాంధీజీయొక్క అధికారపూర్వకమైన అభిప్రాయమును, స్వదేశీ పరిశ్రమలను గూర్చి ఆయన నిర్వచనమునూ కనుగొనేటందుకున్నూ, కొంతకాలం క్రిందట సింధియా స్టీము నావిగేషన్ కంపెనీ వారియొక్క ముగ్గురు ప్రతినిధులాయనను సేవాగ్రామంలో సందర్శించారు. అనేక విషయాలతోపాటు ఈ విషయాలు కూడా వారికి చీకాకు కలిగిస్తూన్నట్లు తోచింది.

1. **విచక్షణకు సంబంధించిన సూత్రాలు.** యంగిండియాలో 'మహాకాయుడు-మఱుగుజ్జు' అనే గాంధీజీ వ్యాసమునుండి ఈ దిగువ ప్రకటనలను వారుదాహరించారు:

"భారతీయ ప్రయోజనాలకు, ఆంగ్లేయులయొక్కగాని లేక ఐరోపీయులయొక్కగాని ప్రయోజనాలకూ మధ్య ఏ విధమైన భేదమునూ చూపరాదనడం భారతీయ బానిసత్వమును నిరంతరాయంగా కొనసాగించడం. మహాకాయునికీ మఱి గుజ్జువానికీ సమాన హక్కులంటే ఏమిటి? అసమానుల

మధ్య సమాన హక్కులనుగూర్చి ఆలోచించేముందుమటిగుజ్జు వానిని కూడా మహాకాయుని ఔన్నత్యమునకు తీసుకొని మవలసి ఉంటుంది . . . . ఈ పద్ధతిని జాతి విచక్షణా విధాన రానడం తప్పు. అటువంటి ప్రశ్నే లేదు. తమ విశిష్టాధి కార స్థానమును పరిత్యజించి మన కష్టసుఖాలలో కలసిమెలసి ఉండేయెడల ఆంగ్ల స్త్రీ పురుషులకు బిడ్డలకూ కూడా మన దేశంలో అర్హస్థానం ఉంది." ఇంకా "ఆంగ్లేయుడు పాలక వర్గమునకు చెందినవాడు కావడంచేత జీవితంలో దాదాపు ప్రతి వ్యవహారంలోనూ ఒక విశిష్టస్థానాన్ని ఆక్రమిస్తూ న్నాడు. భారతదేశ వాణిజ్యముయొక్కయు పరిశ్రమల యొక్కయు శిథిలములపైన ఆతడభివృద్ధి పొందినాడనడం అతి శయోక్తి అనిగానీ వివాదగ్రస్త విషయమని కానీ భయ పడ నక్కరలేదు. లాంక్‌షైరు ఔన్నత్యంకొఱకు భారత దేశపు కుటీర పరిశ్రమ పాడు కావలసివచ్చినది. బ్రిటిష్ నౌకా వ్యాపారాభ్యుదయంకోసం భారతీయ నౌకా వ్యాపారం పడి పోవలసివచ్చినది."

స్వతంత్ర భారతదేశంలో నౌకా పరిశ్రమ పునరుద్ధరింప బడి సంపూర్ణోన్నత్యము పొందదా?

2. భారతీయ లేక స్వదేశీ కంపెనీ లేవి? సంపూర్ణంగా బ్రిటిష్ సంస్థలైన వాటికి కూడా "(ఇండియా) లిమిటెడ్" అని చేర్చి తెలియని ప్రజ మోసంచేయడంను. ఈ రోజు లలో పరిపాటి అయింది. లీవరు బ్రదర్సు "(ఇండియా) లిమిటెడ్" వారి కిక్కడ యంత్రాలయాలున్నవి. వారు స్వదేశీ సబ్బులను తయారుచేస్తున్నామని చెపుతూ వంగ దేశంలోని చిన్న సబ్బు ఫ్యాక్టరీలను చాలావాటిని ఇదివరకే ధ్వంసం చేశారు. ఇక ఇంపీరియల్ కెమికల్సు

“(ఇండియా) లిమిటెడ్” ఉంది. అది విలువగల సౌకర్య ములను పొందింది. విదేశీ ‘వస్తువు’ లనుగాక విదేశీ ‘పరి శ్రమల’నే మన దేశానికి ఎక్కువగా అది దిగుమతి చేస్తూ న్నది.

3. ఇక భారతీయ డైరెక్టర్లతో కూడిన కంపెనీ లున్నవి. బ్రిటిష్ మానేజింగు ఏజెంట్లు ఆ డైరెక్టర్లను నడుపుతూం టారు. మెట్టుభాగం భారతీయ పెట్టుబడియై బోర్డులో ఎక్కువమంది భారతీయ డైరెక్టరులుండి భారతీయేతర మానేజింగు డైరెక్టరు కానీ, లేక మానేజింగు యేజెంట్లుగానీ మరొక భారతీయేతర కంపెనీ కానీ ఉన్నప్పుడు, అది స్వదేశీ సంస్థ అవుతుందా?

గాంధీజీ ఈ విషయాలను గూర్చి చాలావరకు పూర్తిగా తన జవాబులో చర్చించారు. అవి ఆయన మాటలలోనే ఈ క్రింద సంగ్రహంగా పొందు పఱుపబడుతూన్నది:—

1. దీనిపైన 1931 లో నేను వ్రాసిన వ్యాసమును గూర్చి మీరు నాకు జ్ఞాపకంచేసినందుకు సంతోషం. నా అభి ప్రాయాలిప్పటికీ అవే. ఇండియా ప్రయోజనముల కవసర మైనట్లయితే విదేశ ప్రయోజనాలకు ప్రతికూలంగా విచక్షణ చేసేటందుకు—విచక్షణ అనే మాటను వాడక తప్పనియెడల- స్వతంత్ర భారత దేశానికి హక్కుంటుందనడంలో నాకేమీ సందేహం లేదు.

2. ఇక స్వదేశీ కంపెనీయొక్క నిర్వచనం విష యంలో యే కంపెనీలయొక్క యాజమాన్యము, పరిపాలన, మానేజింగు డైరెక్టరుద్వారాగానీ మానేజింగు యేజెంట్లద్వా రాగానీ జరిగే కార్య నిర్వహణము, ఇవన్నీ భారతీయుల చేతు

లలో ఉంటవో ఆ కంపెనీలు మాత్రమే స్వదేశీగా భావింప బడవలెనని నా అభిప్రాయం. ఇండియాలో లభించనప్పుడు కానీ, లేక మనకవసరమైనప్పుడు కానీ, విదేశీ పెట్టుబడిని వినియోగించుకోవడానికి విదేశీ నిపుణులను నియోగించుకోవడానికీ నాకేమీ అభ్యంతరం లేదు. అయితే ఆ పెట్టుబడి కానీ ఆ నిపుణులుకానీ పూర్తిగా భారతీయుల యాజమాన్యమూ, పరిపాలన, కార్యనిర్వహణాధికారములక్రింద నుండవలెను. "ఇక విదేశీ పెట్టుబడినీ విదేశీ నైపుణ్యమునూ ఉపయోగించుకోవడం ఒక ఎత్తు! విదేశీ పారిశ్రామిక సంస్థలు వచ్చి మనమీద పడడం పూర్తిగా మఱియొక ఎత్తు. మీరు పేర్కొన్న సంస్థలను ఎంత విశాలార్థంలోనైనను స్వదేశీ అనడానికి వీలు లేదు. ఇటువంటి సాహస కృత్యాలను ఆమోదించడం కంటె కూడా జాతీయ పెట్టుబడీ కార్యదక్షతా పెంపొంది ముమ్ముందు పూర్తిగా భారతీయ యాజమాన్యము, పరిపాలన, కార్యనిర్వహణముల క్రిందనే అటువంటి పరిశ్రమలు నిర్మింపబడేటందుకు వీలుగా, కొన్ని సంవత్సరాలపాటు పారిశ్రామికాభివృద్ధి ఆలస్యమయినా నా కిష్టమే."

3. దీని జవాబు రెండవ విషయంపైన నేనిచ్చిన జవాబులోనే ఉన్నది.

—హరిజన్, 26-3-1938

# 179
# వట్టి పొరపాటు

ఒక యూనియను నిర్మించుకొని కొన్ని వరతులను అందించిన తనతోడి కార్యకర్తలకు తానేమి చెప్పవలసి ఉంటుందని ఒక అ.భా.చ.సం. ఏజెంటు నన్ను అడుగుతున్నాడు. అట్టి యూనియనుల నిర్మాణం వట్టి పొరపాటు అని నా అభిప్రాయం. ఆ కార్యకర్తలు అ.భా.చ.సం. యొక్క అవకాశాన్నీ, సందేశాన్నీ పొరపాటుగా అర్థం చేసుకొన్నారనే మాట నిశ్చయం. అ.భా.చ.సం. కాంగ్రెసుచే నియమింపబడిన ధర్మ సంస్థ. ప్రధాన గ్రామ పరిశ్రమయైన వడుకునూలును, దానికి సంబంధించిన దాని నంతనూ ప్రత్యేకం అభివృద్ధి పఱచెటందుకు దానికి స్వతంత్రాధికారం ఈయబడింది. ఈ ఐచ్ఛిక సంస్థలో పని చేస్తూన్నవారికి ఆర్థిక ప్రయోజనం ఉండదు సరికదా పైగా వారికి సావకాశముంటే వారు ఉచితంగా పని చేయవలెనని కూడా భావింపబడుతూన్నారు. ప్రపంచమంతటిలోకీ మిక్కిలి పేదరిక మనుభవిస్తూన్న ఈ దేశంలో చాలా మంది అలా చేయలేరు గనుక, ఎక్కువమందికి వారి పోషణకు తగినంత ప్రతిఫలం మాత్రమే ఈయబడుతూన్నది. వారిని సౌఖ్యంగా ఉంచెటందుకు తగిన అన్ని ప్రయత్నాలూ చేయబడుతూన్నప్పటికీ, సామాన్యార్థంలో వారు సేవకు

లుగా భావింపబడడం లేదు. ఇందులో ఎవ్వరూ లాభాలు పంచుకోవడం లేదు. ఇందులో ఎవరైనా భాగస్వాములు గానీ యజమానులుగానీ ఉంటే వారు వడికేవారు, నేసే వారు, మొదలైనవారు. ఇక వినియోజకులుకూడా దీని వలన లాభం పొందేవారు కారు. మిల్లు బట్టకంటె ఖాదీ ఎక్కువ చౌక అని కానీ, చూడడాని కెక్కువ అందంగా ఉంటుందని కానీ వారు ఖాదీ ధరించవలెనని ఎవ్వరూ అను కోవడం లేదు. కడుపునిండా అన్నము, చేతినిండా పని లేని అత్యధిక సంఖ్యాకులకు ముఖ్యంగా స్త్రీలకు పని కల్పిస్తుంది కనుక వారు ఖాదీ కట్టవలెనని అనుకొంటున్నారు. ఈ విశాలమైన ధర్మసంస్థను నడపడానికి కావలసిన జీతాలు, ఇతర ఖర్చులూ పోను తక్కినదంతా ఈ నోరులేని కర్మ కారులకే పోతుంది. కాబట్టి ఏ కార్యకర్తలైనా చర్ఖా సంఘమునకు ప్రతికూలంగా యూనియనులను నిర్మించేయెడల వారు కర్మకారులకు ప్రతికూలు రన్నమాట. కార్యకర్తల ప్రయోజనం కోసం వినియోజకులపైన పన్ను వేయడం స్పష్టంగా అసంగతం. ఏజెంట్లుకూడా తమవంటి కార్య కర్త లేనని, కార్యకర్తలు గ్రహించజాలరా? చాలా సంద ర్భాలలో ఏజెంట్లు కేవలం గౌరవోద్యోగులు. అయితే ఎక్క డైనా ఒక ఏజెంటు తన ధర్మ నిర్వహణాధికారాన్ని మించి, తనతోనూ తన కిందనూ పనిచేస్తూన్న కార్యకర్తలతో తాను కూడా ఒక సహకార్యకర్తవలెగాక, యజమానివలెనూ ప్రభువలెనో నటిస్తూన్నట్లయితే అ విషయం వేరు, అట్టు

వంటి సందర్భంలో కార్యకర్తలు కేంద్ర సంఘంద్వారా పరిహారం పొందవచ్చును. అంతేకాని కేవలం శాస్త్రి ప్రకారం యూనియనులద్వారా మాత్రం కాదనేమాట స్పష్టం. ఈ ఒక సందర్భంలో అవి అవసరం. మరొక సందర్భంలో అవి అనవసరమేకాక నేను పైన చెప్పినట్లు అవి వట్టి పొరపాటుకూడా కాగలవు. ఈ పని ఇంకా విశాలంగా జరుపబడేటట్లయితే, ఏ సంఘానికి తాము కొంతవరకు సృష్టికర్తలుగానూ ధర్మకర్తలుగానూ ఉన్నారో దానిని వారే చంపుకొన్నవారు కావచ్చును.

—హరిజన్, 16-7-1938

# 180
# ఖాదీధారుల కర్తవ్యం

నిరంతరం పెరుగుతూన్న ఖాదీ ధరలనుగూర్చి తమ ప్రతికూలాభిప్రాయాన్ని ప్రకటిస్తూ కొంతమందినీ, ప్రియమైన ఖాదీని కొనుక్కొనేటందుకు మార్గం చూపవలసిందని ప్రార్థిస్తూ జాలికరంగా కొంతమందినీ వ్రాసిన ఉత్తరాలు నాకడ చాలా ఉన్నవి.

అ.ఖా.చ.సం. ఖాదీ ఉత్పత్తిదారుల క్షేమంకోసం మాత్రమే ఉన్నది. వారిలో అధిక సంఖ్యాకులు నూలు వడికే స్త్రీలు. ఒక గంట శ్రద్ధగా నూలువడికే ప్రతి స్త్రీ ఒక అణా సంపాదించుకోనిదే ఈ సంఘం సంతృప్తిపడి ఉండ చాలదని నా అభిప్రాయం. గంటకు అర్థణావరకూ చేరుకొనే స్థితిలోకి వచ్చాము. వినియోజకులున్నూ, కాంగ్రెసు ప్రభుత్వాలున్నూ తమ కర్తవ్యాన్ని తాము నిర్వహించేటట్లయితే, చాలామంది అనుకొనే కాలంకంటె ఎక్కువ ముందుగానే గంటకు ఒక అణా ఈయగలమని చరఖా సంఘం భావిస్తూన్నది.

ఇందువల్ల ఖాదీ ధర కొంత పెరిగేమాట వాస్తవమే కాని మజూరీల హెచ్చింపుయొక్క నిష్పత్తిలో ఉండదా పెరుగుదల. కర్మకారుల నైపుణ్యం పెంపొందించేటందుకు నిరంతర ప్రయత్నం జరుగుతూన్నదనీ అందువల్ల మజూరీల పెరుగుదల అంతా ఖాదీ మీద పడదనీ నగరవాసులర్థం చేసుకోవాలి. పరిపాలనా వ్యయము మొదలైన ఖర్చులుకూడా అంతకంతకు తగ్గింపబడుతూన్నవి: అనుభవం వలన పరి

పాలనా నైపుణ్యం అభివృద్ధి అవుతుంది. అయితే వడికే వారి మజూరీకి పదహారు రెట్లు పెరిగిన పెరుగుదల మొత్తం యావత్తు కేవలం నైపుణ్యం పెంపయినంత మాత్రంలో పరిపూర్తి కాదు. కాబట్టి మజూరీల హెచ్చింపుతోపాటు ఖాదీ ఖరీదు పెఱుగుదలకూడా తప్పనిసరి అవుతూన్నది. ఈ పెరుగుదల వివిధ రకాల ఖాదీపైన అసమానంగా విభజింపబడుతూన్నది. అందువలన ధనవంతులు కొనుక్కొనే ఖాదీపైన అన్నింటిలోకీ ఎక్కువ ధర పడుతూన్నది. పేదలుగా ఉండి ఖాదీ కొనుక్కొనే వారిపైన ఎక్కువ భారంపడకుండా ఉండేటందుకు, చేయగలిగినదంతా చరఖా సంఘం చేస్తూన్నది, చేయగలదు.

కాని, పోటీపైన ఆధారపడి ఉండి, దేశభక్తితోగాని, సరళభావంతోగానీ మానవత్వంతోగానీ యేవిధమైన సంబంధమూ లేని సామాన్య అర్థశాస్త్రానికీ ఖాదీ అర్థశాస్త్రానికీ భేదం ఉందని ఖాదీధారులు గ్రహించాలి. ఖాదీ అర్థశాస్త్రం, దేశభక్తిపైన, సరళభావంపైనా, మానవత్వంపైనా ఆధారపడి ఉన్నది.

సంఘముయొక్క ఈ నూతన విధానం నిర్ణయింపబడక ముందు, బహుశా ప్రపంచంలోకల్లా నిస్సహాయ కర్మకారులయిన వడికేవారి మజూరీల విషయం ఏమీ గమనించకుండా ఖాదీ చౌక చేయడమే దాని ఆదర్శంగా ఉండేది. ఈ విధంగా దాదాపు ఒక దశాబ్దం సాగింది. ఇది తప్పు విధానం. ఈ తప్పు అబుద్ధిపూర్వకం ; పొరపాటు ఊహపైన ఆధారపడినది. ఈ తప్పుకు చాలా ఎక్కువగా బాధ్యత వహించవలసింది నేనే. ఇందువలన లాభం పొందిన వారు ఖాదీదారు లొక్కరే ఆ తప్పు సవరింపబడి, వడికే

వారికి న్యాయంగా ముట్టవలసిన మజూరీ ముట్టుతూన్నప్పుడు వారు నిందారోపణ చేయడం న్యాయమా ?

ఖాదీధారులనుండి సంఘం హృదయపూర్వక సహకారాన్ని అభిలషించింది. మొత్తంమీద ఖాదీ ధర పెరుగుదలకు వారు కోపగించుకోలేదని చెప్ప గలుగుతూన్నందుకు నేను సంతోషిస్తున్నాను. ఖాదీధారులకంటె మిక్కిలి నిరుపేదలైన అమాయక సోదరీమణులకు ఈ స్వల్ప న్యాయమును కలిగించడంలో తాముకూడా భాగస్వాములు కావడం ఒక అదృష్టంగా చాలామంది భావించుకొంటున్నారు.

కుటుంబం గడవడమే కష్టంగానున్న అనేకమంది మధ్య తరగతులవారిని నే నెరుగుదును. వారి విషయంలో ప్రతి అదనపు అణా కష్టమే. పైగా వారు వడకరు. వారియెడ నా సానుభూతి ఉంది. కాని వారికి రెండువిధాలా కావాలంటే వీలులేదు. వారు వడకకపోతే, వారి అవసరాలను తగ్గించుకోవాలి. లేదా ఖర్చులు తగ్గించుకోవాలి. మన శీతోష్ణస్థితిలో మనముపయోగించే బట్టలు అక్కర లేదు. ఇష్టమంటే వీలు లేకపోదు.

ఖాదీ ముఖ్యంగా మధ్య తరగతులకు చెందిన పేదవారిచే పోషింపబడుతూన్నదనీ, కాబట్టి వారు కొనగలిగిన స్థితికి ధరలు తగ్గింపబడక పోయినట్లయితే, నేను బ్రతికినంతకాలం కూడా అది బ్రతకదనీ ఒకానొక విలేఖకుడు వాదిస్తూ న్నాడు. ఖాదీ బ్రతకగలగడం ఆ ఒక్క పరతుమీదనే అయినట్లయితే అది నాకన్న ముందు చనిపోవలసిందే. అదృష్ట వశాత్తు ఈ వాదానికి వెనుక ఒక భ్రమ ఉన్నది. చౌకదనం చాలావరకు నగరవాసులకు వర్తిస్తుంది. వారంతా భాగ్యవంతులూ పేదలూకూడా ఖాదీని చేపట్టినట్లయితే

ఉత్పత్తికానున్న ఖాదీలో నూటికి 10 వంతులుపైన కూడా ఉపయోగించుకోజాలరు. తక్కినదంతా ఉత్పత్తిదారు లయిన గ్రామస్థులే ఉపయోగించుకోవాలి. ఇక దాని ఖరీదువలన వారికి పోయేదేమీ లేదు. అనుకొన్నంత విస్తారంగా గ్రామాలలో ఖాదీ చౌరబడనిమాట వాస్తవమే. కాబట్టి పరివర్తనకాలంలో, నగరవాసులయిన పేదల యొక్కయు భాగ్యవంతులయొక్కయు దేశభక్తిపైన అది ఆధారపడవలసి ఉంది. ఖాదీ సందేశంలో విశ్వాసమున్న వారెవ్వరూ, ఖాదీ ఎంత ప్రియమైనా లెక్కపెట్టరు. క్షామమునకు నిరుద్యోగమునకు ప్రతికూలంగా రక్షణ ఈయగలిగిన నిజమైన భీమా అది ఒక్కటే. ఆకస్మికంగా ఒక రాత్రివేళ ఇండియా పారిశ్రామిక దేశంగా పరివర్తనం చెందినప్పటికీ, నిరుద్యోగత చాలావరకు నిలచియే ఉంటుంది. ఈ దేశంలో జాతి అంతటికీ పని చూపించడమే ఒక సమస్య. వారికి నాలుగవవంతు కాలం, చేసేటందుకేమీ పనిలేదు, రోగము, దరిద్రము, రక్తపాతములు రాకుండా తప్పించుకోవలెనంటే, ఖాదీయున్నూ తదితర గ్రామ పరిశ్రమలున్నూ తప్ప మఱొక పరిహారంలేదు. ఈ ఖాదీ సందేశంలోనూ వడికేవారి బ్రతుకుకు కావలసిన మజూరీ ఈయడంలోను నమ్మకమున్న వారు, ఖాదీ ఖరీదులో చేయబోయే హెచ్చింపునుగూర్చి గునియరు. అత్యంత జాగరూకతతో వ్యవహరిస్తున్న చరఖా సంఘమును వారు విశ్వసించవచ్చును. వడికేవారు పుచ్చుకొంటూన్న మజూరీల హెచ్చింపును ప్రజలు ఇష్టపడుతున్నారని అనుకోవడానికి కడచిన రెండు సంవత్సరాల అనుభవమే సాక్ష్యం.

—హరిజన్, 23-7-1938

## 181

# చేనేతవారి రక్షణ

చేనేత పరిశ్రమ మిల్లు పోటీని తృణీకరించిందన్న ప్రకటన కొంతవరకు మాత్రమే నిజం. ఇరవై ఐదు సంవత్సరాల కిందటనున్న చేనేత వారిలో సగం మందికూడా ఈనాడు లేరు. రాటం జాతి అంతకూ కావలసిన నూలు వడుకుతూ ఉంటే జాతికి కావలసిన యావత్తు బట్టా నేమగ్గం నేసిన కాలం ఒకటి ఉండేది. మిల్లులు స్థాపించబడినప్పుడు రాటము పని రోజంతా చేసేది కాకపోవడంచేతనూ, అందువల్ల వచ్చేది చాలా తక్కువ కావడంచేతనూ మాత్రమే అది పూర్తిగా మృతి పొందింది. కాని మగ్గం మాత్రం గట్టిగా నిలబడ్డది. అందుకు కారణాలలో ఒకటి, మగ్గముమీది పని, రోజంతా చేసేది కావడం, నేత మనిషి బ్రతకడానికి తగిన సంపాదన చేకూర్చకలది కావడమూను. నూలు వడుకు యంత్రం వచ్చినప్పుడు, నేత మనిషికి కావలసిన నూలు చిలపలకోసం, ఆయన మిల్లులమీద ఆధారపడ్డాడు. పైగా ఆయన ఆ మార్పుకు ఆనందించాడుకూడా. ఎక్కువ సమంగా ఉండి ఎక్కువ పురిగల నూలు లభించడమే అందుకు కారణం. ఏ కారణంవల్లనైనా మిల్లులు తనకు నూలు సరఫరా చేయజాలనియెడల తాను పూర్తిగా అసహాయ స్థితిలో ఉండిపోవలసి వస్తుందని ఆయనకు ఏ మాత్రమూ తెలియలేదు. గ్రామాలలో నూలు వడికే మనిషివలెగాక, మిల్లు యజమాని తన నూలుకు తానే ఖరీదు నిర్ణయించాడు. కొత్త రకం లేని మామూలు ఖాదీని నేసిన నేత మనిషి క్రమక్రమంగా మిల్లు పోటీకి నిలవలేక నిర్మూలమైనాడు.

కడచిన కొలది సంవత్సరాలనుండీ రకరకాల బట్టలు నేసే నేత మనిషికికూడా నేత మిల్లులవలన వత్తిడి కలిగింది. ప్రజల అభిరుచి నెమ్మదిగానూ స్థిరంగానూ మారుతూవచ్చింది. గ్రామాలలోని నేతవారు నేసే రకాలవంటి రకాలనే సరిగా మిల్లులు నేయజాలనప్పుడు, అవి కొత్త రకాలను నేసి నైపుణ్యంగల తమ ప్రకటనద్వారా వతనుదార్లను ఆకర్షింప గలుగుతూన్నవి. కాబట్టి వతనుదారులు లేనందున ఒరిస్సాలో అనేక మంది చేనేతవారు పనిలేక పడి ఉండ వలసి వస్తూన్నది. అహమ్మదునగరంవంటి బలమైన నేత కేంద్రమునుండికూడా అదే గోల వినిపిస్తూన్నది. ఈ నేత కుటుంబాలన్నీ వారి యిళ్లలో ఏకడం వడకడం పనులను సాగించేయెడల, వారు మిల్లు నూలు ప్రసక్తి యేమాత్రమూ లేకుండా అఖిల భారత చరఖాసంఘం యొక్క నిరంతర సహాయాన్ని పొందుతూండగలరని వారందరికీ నా సలహా. అయితే నేసేవారు, తమ కాలం కొంత వడికేటందుకు వినియోగించవలసి ఉండడంచేత, పూర్వం సంపాదించినంత సంపాదించ లేకపోవచ్చును. అయితే అఖిల భారత చరఖా సంఘం వారి నేటి సంస్కరణ విధానము కింద, వడికే మనిషికి గంటకు ఒక అణా ఈయవలెనని ఉద్దేశం. కాని గంటకు ఒకటిన్నర కానీ మాత్రమే ఇస్తున్నారు వారు. కాబట్టి నేత మనిషి తన ఆదాయం తగ్గినందుకంతగా చింతించడు. ఎట్టి సందర్భంలోనూ పస్తుపడుకోవడంకంటె తక్కువ మజూరీ వచ్చినా మంచిదే కదా!

నేసే మనిషి తన కుటుంబంలో ఏకడం వడకడం సాగించే టందుకు తనికి కొద్ది పెట్టుబడి మాత్రమే కావలసి ఉంటుంది. ఆయన కిదివరకే రాటం ఉన్నది. దానిని కొంత బాగు

చేయవలసివచ్చే మాట నిజమే. ఇక ఆయన కొన్ని అణాలతో కమాను మాత్రం సంపాదించాలి.

ఒరిస్సా ప్రభుత్వంవారు తమ జైళ్లనుండి మిల్లు నూలును తొలగించి తమకు కావలసిన బట్ట ఖాదీలో మాత్రమే కొంటున్నారని తెలుస్తూన్నది. కాంగ్రెసు నిర్మాణ కార్య క్రమమునకు కట్టుబడి ఉన్నందుకు వారి నభినందించవలసి ఉన్నది. ఇకకూడ సూచించబడిన చికిత్సను ఖాదీ సంస్థ లోని కార్యకర్తలు జ్ఞాపక ముంచుకొని నేసేవారిచే వడికే టందుకు ప్రబోధించినయెడల, కావలసిన నూలు ఉత్పత్తి కావడం అత్యంత సుకరమని వారు తెలుసుకోగలరు. కొత్తగా గ్రామస్థులకు వడకడంలో శిక్షణ యిచ్చి, వారందులో నైపుణ్యం సంపాదించేటంతవరకూ వేచి ఉండడం కంటె, ఈ పద్ధతివలన బహుశా ఖాదీ ఎక్కువ చౌకగా ఉత్పత్తి కాగలదనికూడా వారు గ్రహించవచ్చును. అన్ని గ్రామాలలో నూలు వడికే పనిని వారు ప్రవేశపెట్టవలసిందే. అఖిల భారత చరఖాసంఘం యొక్క లక్ష్యంకూడా అదే. కాని ఈ ఉన్నతాశయం నెఱవేరేవరకూ చేనేతవారిని అశ్రద్ధ చేయకూడదు.

—హరిజన్, 20-8-1938

# 182

# ధ్రువ పత్రములు పొందని ఖాదీ

బాధ్యతగల కాంగ్రెసు వాదులు సైతం ధ్రువ పత్రములు లేని భాండారములలోని ఖాదీని వాడుతూన్నట్లు నాకు వార్తలు వస్తూన్నవి. అఖిల భారత చరఖా సంఘం వారు వడుకు మజూరీలలో అసాధారణమైన హెచ్చింపు చేసిన దగ్గరనుండీ దురదృష్టవశాత్తూ ధ్రువ పత్రములు పొందని ఖాదీ భాండారముల సంఖ్యకూడా హెచ్చింది. వాటిలో అమ్మబడిన ఖాదీ స్వచ్ఛమైనదని చెప్పేటందు కేమీ హామీ లేదు.

పనివాళ్లు అడగకుండా ఎక్కువ జీతాలు పొందడ మనేది సాధారణంగా జరగదు. అది జరిగినప్పుడు, పనివాళ్ల పేదరికమునుగానీ అజ్ఞానమునుగానీ స్వార్థంకోసం వినియోగించుకొంటూ, వాళ్లకు పూర్వపు తక్కువ జీతాలనే యిచ్చి, హెచ్చు జీతాలనుబట్టి పెంచబడిన ఖరీదులకంటె తక్కువ ఖరీదులకు తమ సరుకులను అమ్మతూండే అవినీతిపరులు అనేక మంది కనిపిస్తూంటారు. అంతేకాక పడుగుకు మిల్లునూలుపయోగించబడిన బట్ట, ఖాదీ పేరుతో అమ్మబడు తూన్నది. అఖిల భారత చరఖాసంఘం వారు నిర్ణయించిన మజూరీల ప్రకారం చేతితో వడికిన నూలుతో చేతితో నేసిన బట్టయే స్వచ్ఛమైన ఖాదీ. అటువంటి ఖాదీ, ధ్రువ పత్రములు పొందిన భాండారములలో మాత్రమే లభిస్తుంది.

దురదృష్టవశాత్తూ కాంగ్రెసు వాదులు, అజ్ఞానంవలన కానీ లేక ఖాదీలో విశ్వాసం లేకపోయినందునకానీ, ధ్రువ పత్రములు లేని ఖాదీ భాండారములలో ఖాదీగా నమ్మించే

చాక బట్టను కొని, ఖాదీనిగూర్చిన కాంగ్రెసు విధానమును భగ్నం చేయడమేగాక, తాము కొన్న సరుకు మొత్తంలో మజూరీ హెచ్చింపుకు సంబంధించినంతవరకు, వడికేవారిని మోసగిస్తున్నారు. ఖాదీ ఖరీదులో కలిగిన ప్రతి పెరుగుదలకూ కారణం, కనీసం ఆ మొత్తమైనా వడికే మనిషికి అదనంగా ఈయబడుతూన్నదని ప్రజలు గ్రహించాలి. ఈ 'కనీసం' అనే మాట నేను బుద్ధిపూర్వకంగా వాడుతూన్నాను. కారణమేమంటే, మజూరీలలో హెచ్చింపబడిన మొత్తం అంతా కొనేవారిమీద పడడం లేదు.

అఖిల భారత చరఖాసంఘమునకు ప్రాయకుండాగానీ, లేక వారిచేత కోరబడకగానీ ఖాదీ భాండారములను నెలకొల్పుతూన్న కాంగ్రెసు నాయకులందరూ, నిశ్చయంగా తమ సంస్థకు తామే హాని కావించుకొంటూ, మోసాన్ని ప్రోత్సహించి, కాంగ్రెసు నీతిని త్రోణీకరిస్తున్నారు. నిజానికి, మానవానీకంలో అత్యంత నిస్సహాయులయిన వారి స్థితిని బాగు చేసేటందుకు, అఖిల భారత చరఖాసంఘం వారి ప్రతి ప్రయత్నములోనూ అన్ని విధాలా సహాయపడడం ప్రతి కాంగ్రెసు వాదికీ గర్వ కారణమైన కర్తవ్యంగా ఉండాలి.

—హరిజన్, 15-10-1938

## 183
# ఖాదీని ప్రజాదరణీయంచేసే పద్ధతి

గౌరవనీయుడైన ఒకానొక మిత్రుడు హిందుస్థానీలో ఒక ఉత్తరం వ్రాశాడు. దాని స్వేచ్ఛానువాదమిది :

"మిల్లు బట్టలతో పోల్చి చూచినప్పుడు, ఖరీదులకు సంబంధించి నంతవరకు, ఖాదీ ఆర్థిక ప్రతిపాదన కాజాలదు. మిల్లు బట్టతో పోటీ చేయవలెనంటే, గింజలు తీసేటందుకు, ఏకేటందుకు వడికేటందుకు అయ్యే అన్ని ఖర్చులను తీసివేయవలెను. కాబట్టి స్వంతంగా వడుకుకొనేవారికి కూడా అది గిట్టుబాటు కాదు. మీరు క్రొత్తగా ఖాదీ అర్థ శాస్త్రమును తయారుచేసిన మాట నిజమే. కాని జనసామాన్యం దానిని అర్థం చేసుకొనేటంతవరకూ ఖాదీ సార్వ జనీనంకాదు. కాంగ్రెసు మంత్రులు కూడా మీ క్రొత్త అర్థ శాస్త్రాన్ని అర్థం చేసుకోవడంగానీ శ్లాఘించడం గానీ లేదు. ఈ పరిస్థితులలో మీరు ఖాదీ కార్యకర్తలకు, సామాన్య కాంగ్రెసు వాదులకు, మంత్రులకుకూడా సరియైన మార్గం చూపెట్ట వలదా? మీతోపాటు పనిచేసే మేము మీకు అడ్డు తగలకుండా ఉంటే రోజుకు ఎనిమిది గంటలు శ్రద్ధగా నైపుణ్యంతో చేసే పనికి, ఎనిమిది అణాలు వడుకు మజూరీకింద సరాసరి ఇచ్చివేసేటంత గట్టి విశ్వాసం మీ కున్నట్లుగా కనిపిస్తూన్నది. మీ విశ్వాసం మాకు లేదని మేము నిష్కపటంగా చెప్పాలి."

ఖాదీ మిల్లు బట్టతో పోటీ చేయలేదనడం నిస్సందేహం; అది ఎన్నడూ అలా ఉద్దేశింపబడలేదుకూడా. ప్రజలు ఖాదీ సిద్ధాంతాన్ని గ్రహించలేకపోయినా, మెచ్చుకొనలేక పోయినా అది యెన్నడూ సార్వజనీనంకాదు. అది అప్పుడు డబ్బుగలవారియొక్కయు విపరీతపు మనుష్యులయొక్కయు

భ్రమగా మాత్రము మిగిలిపోతుంది. కేవలం అది అలాగే అయినట్లయితే, అఖిల భారత చరఖాసంఘం వంటి బ్రహ్మాండమైన సంస్థచేసిన శ్రమ అంతా, చెడ్డది కాకపోయినా వృథా అని అయినా అర్థం.

కాని ఖాదీ ఒక ఘన కార్యాన్ని సాధించవలసి ఉంది. సంవత్సరంలో నాలుగు మాసాలు పని లేకుండా ఉన్న లక్షలాది ప్రజలకు, ఖాదీ గౌరవప్రదమైన వృత్తి కల్పిస్తుంది. ఆ పనివల్ల వచ్చే ఆదా మాట అలా ఉండగా, ఆ పనే ఒక ఉపాయనం. ఎందువల్లనంటే లక్షలాది ప్రజ తప్పనిసరిగా పని లేకుండా జీవించవలసివచ్చినయెడల, వారు ఆధ్యాత్మికంగానూ, మానసికంగానూ, శారీరకంగానూ కూడా మరణించవలసిందే. లక్షలాది పేదవాండ్ర స్థితిని రాటం తక్షణం పెంపొందిస్తుంది. కాబట్టి మిల్లు బట్ట ప్రజలకు ఉచితంగా ఈయబడినప్పటికీ దానిని వారు నిరాకరించాలి. వారి శ్రమ ఫలితమైన ఖాదీయెడల పక్షపాతం కలిగి ఉండడంలోనే వారి నిజమైన శ్రేయస్సు ఉంది.

ప్రాణం, సౌఖ్యంకంటె ఎక్కువ. మనకు వచ్చే కొద్ది ఆదాయానికి భారంగా ఉండి ఏమీ పని చేయజాలని వృద్ధులైన తలిదండ్రులను చంపడం చాకయే. మన భౌతిక సౌఖ్యానికి అవసరం లేనట్టిన్నీ, ప్రతి ఫలం లేకుండా పోషించవలసి ఉన్నట్టిన్నీ మన బిడ్డలను చంపడం కూడా చాకయే. కాని మనం మన పిల్లలనుకానీ తల్లిదండ్రులను కానీ చంపము. ఎంత ఖర్చయినప్పటికీ వారిని పోషించడం ఒక ప్రత్యేక హక్కుగా భావిస్తాము. అలాగే తక్కిన బట్టలన్నిటినీ బహిష్కరించి మనం ఖాదీని పోషించాలి. అలవాటునుబట్టి మనం ఖాదీనిగూర్చి కూడా ఖరీదులకు

సంబంధించి ఆలోచిస్తున్నాము. ఖాదీ అర్థశాస్త్రమునుగూర్చి మన అభిప్రాయాలను మార్చుకోవాలి. జాతీయ క్షేమమును దృష్టిలో పెట్టుకొని దానిని పరిశీలన చేసినప్పుడు, ఖాదీ ఎన్నటికీ ప్రియం కాదని అర్థమవుతుంది. పరివర్తన దశలో కుటుంబ ఆర్థిక వ్యవహారాలు తారుమారయి బాధపడతాము. ప్రస్తుతం మనమొక గొప్ప ప్రతిబంధనంవలన చిక్కుపడుతూన్నాము. లాంకషైరు క్షేమంకోసం, ఇంకా కావలెనంటే భారతీయ మిల్లుల క్షేమంకోసం, పత్తి ఉత్పత్తి కేంద్రీకరింపబడ్డది. పత్తి ఖరీదులు విదేశాలలోని ఖరీదులనుబట్టి నిర్ణయింపబడుతూన్నవి. ఖాదీ అర్థశాస్త్రానుగుణంగా పత్తి ఉత్పత్తి విభజింపబడినయెడల, పత్తి ధరలు తీవ్ర పరివర్తనములకు గురికావు ; పైగా, ఏ సందర్భంలోనైనాసరే, పర్యవసానానికి ఇప్పటికంటె తక్కువగా ఉంటవి. ప్రజలు స్వప్రయత్నంవలనగానీ, లేక ప్రభుత్వ రక్షణమూలకంగాగానీ, ఖాదీని మాత్రమే వాడడం అభ్యాసం చేసుకొంటే, లక్షలాది శాకాహారులు మాంసాహారముల ఖరీదులను, మాంసేతరాహారముల ఖరీదులతో పోల్చనట్లే ఖాదీని డబ్బుకు ముడిపెట్టి ఆలోచించరు. శాకాహారులకు మాంసాహారం ఉచితంగా ఈయబడినప్పటికీ, ఉపవాసమైనా ఉంటారుకాని వారు దానిని ఒల్లరు.

కాని కొలదిమంది కాంగ్రెసు వాదులు మాత్రమే ఖాదీలో ఈ సజీవ విశ్వాసం కలిగి ఉన్నారని నాకు తెలుసు. మంత్రులు కాంగ్రెసు వాదులే. పరిసరములనుబట్టి వారి కుత్సాహం రేకెత్తుతుంది. ఖాదీలో వారికి సజీవ విశ్వాసమున్నట్లయితే దానిని ప్రజామోదకరంగా చేయడానికి ఎక్కువ తోడ్పడగలరు.

1920 వ నాటి మొట్టమొదటి స్వరాజ్య కార్యక్రమంలో ఖాదీ ఒక ఎడతెగని భాగం. 1921-22 లలో ప్రతి గ్రామం లోను వినబడే రాటపు ఝుంకారంపైన లక్షలాది ప్రజల స్వరాజ్యం ఆధారపడి ఉన్నదని వందలకొలదీ వేదికల నుండి వేలకొలదీ కాంగ్రెసు వాదులు పదే పదే ఉద్ఘాటించారు. కీ॥ శే॥ ఆలీ సోదరులుపన్యసించిన అనేక సమావేశాలలో, ప్రతి యింట్లోనూ రాటము ప్రతి గ్రామంలోనూ మగ్గమూ లేని యెడల స్వాతంత్ర్యం లేదని చెపుతూవచ్చారు. రాటం మన యుద్ధపరికరమనీ వడికిన నూలుకండెలు మన మందు గుండు సామానులనీ మౌలానా మహమ్మదాలి తన కవితా భాషలో వర్ణిస్తూండేవాడు. తన ఈ విశ్వాసాన్ని శ్రోతలకు నచ్చే భాషలో ఆయన చెప్పేవారు. కాని తొలినాటి ఆ విశ్వాసం నిలవలేదు. మొత్తంమీద కాంగ్రెసు వాదులు ఖాదీని స్వరాజ్యంతో ముడిపెట్టడం మానివేశారు. శ్రీ జవహర్‌లాలు నెహ్రూ ఖాదీని స్వాతంత్ర్యదీక్షా వస్త్ర మన్నాడు. ఎంతమందికది ఆ అర్థాన్ని స్ఫురింప చేస్తూన్నది ? కాంగ్రెసువాదులకా విశ్వాసమే ఉంటే ఖాదీ యే చలామణీలోనున్న నాణెంగా పరిణమించేది. స్వాతంత్ర్యంకొఱకెంత త్యాగంచేసినా ఎక్కువకాదు. అది జీవితమునకు ఊపిరి వంటిది. జీవించేటందుకు మనిషి ఏమి త్యాగం చేయడు ? కాంగ్రెసు జెండా శాసనోల్లంఘనానికి చిహ్నంగా ఉద్దేశింపబడలేదు. శాసనోల్లంఘనమొక దశ మాత్రమే. సాతంత్ర్యముయొక్క ప్రధానాంశములకు చిహ్నం కాంగ్రెసు జెండా. దానికి పునాది ఖాదీ. దానిని నింపి నిలబెట్టేది రాటం. సాతంత్ర్యంపొందడానికె సాంఘిక ఐకమత్యం ఎంత అవసరమో దాని రంగులు నిరూ పిస్తూన్నవి. ఈ షరతులు పరిపూర్తి అయినయెడల

శాసనోల్లంఘనంకానీ దానికి సంబంధించిన చాధానుభవం కానీ అసలవసరమే లేకపోవచ్చును. ఖాదీ ధారణమంటే స్వాతంత్ర్యధారణమనియే నా అభిప్రాయం.

ఖాదీనిగూర్చిన ఈ వ్యాఖ్యానమును హృదయపూర్వకంగా ఆమోదించినయెడల కాంగ్రెసు మంత్రులు, కాంగ్రెసు మంత్రు లే అన్న మాటేమిటి, అందఱు మంత్రులూ, ఖాదీ కార్యకర్తలు, కాంగ్రెసు వాదులు ఏమిచేయగలరో ఏమి చేస్తారో నేను చెప్పగలను.

ఖాదీకీ గ్రామ పరిశ్రమలకూ ప్రత్యేకం ఒక మంత్రి ఉండవచ్చును. ఇక ఈపనికోసం ఒక ప్రత్యేకశాఖ ఉండ వచ్చును. తక్కిన శాఖలు వీరితో సహకరించగలవు. వ్యవసాయశాఖ పత్తి ఉత్పత్తి వికేంద్రీకరణ ప్రణాళికను తయారుచేసి, గ్రామోపయోగంకోసం పత్తి ఉత్పత్తి కవసర మయిన భూమిని పరిశీలించి, తమ రాష్ట్రానికి కావలసిన పత్తి ఎంతో తెలుసుకొంటుంది. స్టోర్సుశాఖ రాష్ట్రంలో లభించిన పత్తిని కొని, కావలసిన బట్టకొఱకు ఆర్డర్లు యిస్తుంది. శాస్త్ర నైపుణ్య శాఖవారు మంచిరకపు రాటాలను, చేతితో ఉత్పత్తి కావించేటందుకు కావలసిన యితర పనిముట్లను కని పెట్టి తయారుచేయిస్తారు. ఈ శాఖలన్నీ, అఖిల భారత చరఖాసంఘం తోనూ, అఖిల భారత గ్రామ పంచాయతీ సంఘం తోనూ నిరంతర సంబంధంపెట్టుకొని ఆ సంస్థలను తమ పక్షాన నిపుణులుగా ఉపయోగించుకోగలవు.

మిల్లు పోటీనుండి, ఖాదీని రక్షించేటందుకు రెవిన్యూ మంత్రి ఉపాయాలాలోచించగలడు.

ఖాదీ కార్యకర్తలు నిరంతరాయమైన శ్రద్ధతో, ఖాదీ శాస్త్రనియమాలను అన్వేషించి దానిని ఎక్కువకాలం

మనేటట్లు, ఎక్కువ ఆకర్షవంతంగా ఉండేటట్లు చేయడానికి ప్రయత్నిస్తూ, ఖాదీ సార్వజనీనమయ్యే ఉపాయాలను కని పెట్టడానికి తామే బాధ్యులమని అనుకోవచ్చును. నిరంతరం జాగరూకతతో మెలగుతూ తమ శక్తి సామర్థ్యములను తమ కార్యనిర్వహణమునందుపయోగించే వారికి మాత్రమే దైవం సహాయంచేస్తాడు. మొత్తంమీద కాంగ్రెసువాదులు ప్రత్యేక సందర్భాలలోకాక నిరంతరం ఖద్దరు ధరించి తాము వడుకుతూ, ఖాదీ కార్యకర్తలు కోరినప్పుడు వారికి సహాయ పడి, ఖాదీ సందేశాన్ని వారి ఇరుగు పొరుగువారిలో వ్యాపింపచేయవలెను.

—హరిజన్, 10-12-1938

# 184

# కాంగ్రెసువాదులపైన ఆరోపణ

అఖిల భారత చరఖాసంఘం వారిచే ధ్రువ పత్రములు తీసి వేయబడిన ఖాదీకి కాంగ్రెసు కమిటీలు ధ్రువ పత్రములిచ్చినట్లు రంగూన్ ఖాదీ భాండారమునుండి ఒక ఉత్తరము, కర్ణాటకమునుండి మఱొక ఉత్తరమూ నాకు చేరినవి. ఈ ఆరోపణ నిజమనడానికేమీ సందేహం లేదు. రెండు కాంగ్రెసు సంస్థలిచ్చిన ధ్రువ పత్రముల నకళ్లు నాకడనున్నవి. ఈ ధ్రువ పత్రములు అక్రమములని కాంగ్రెసు కమిటీలు గ్రహించాలి. ధ్రువపత్రము లీయగలిగిన అధికారం ఒక్క అఖిల భారత చరఖాసంఘమునకే ఉన్నది. అఖిల భారత చరఖాసంఘం నిర్ణాణమును గూర్చి చేయబడిన కాంగ్రెసు తీర్మానం మార్పు చేయబడితేనే తప్ప ఏ కాంగ్రెసు కమిటీకి ధ్రువ పత్రములిచ్చే అధికారం ఈయబడదు లేక ఈయబడజాలదు.

ధ్రువపత్రములు పొందిన ఖాదీ అనేది లేనేలేదు. ప్రతి ఖాదీ ముక్కకు కానీ, ఖాదీతో తయారైన ప్రతి వస్తువునకు కానీ ధ్రువ పత్రమీయడం అసంభవం; అఖిల భారత చరఖా సంఘం వారిచే ఆమోదింపబడిన ఖాదీని అమ్మేటందుకు దుకాణాలకు వ్యక్తులకు మాత్రమే అధికార మీయబడుతుంది. ఖాదీ ఉత్పత్తిదారులకు తగినంత మజూరీ నిశ్చయంగా ముట్టేటట్లు ఖాదీయొక్క మొట్టమొదటి నిర్వచనం విస్తరింప చేయబడినది. ఇంక యే యితర ఖాదీనైనను అమ్మేవారు, అఖిల భారత చరఖాసంఘం తనంతట తాను, ఖాదీ పనివాళ్ల కోసం నిర్ణయించిన మజూరీలను వారికి ముట్టకుండా

చేస్తూన్నారన్నమాట. ఎవ్వరూ రోజుకు రెండు కానులైనా ఈయ నిశ్చయించని లక్షలాది సోదరీమణుల కృశీభూత శరీరములలో జీవమును వెలుగును ప్రసాదించేటందుకు ఏ సంస్థ ఆశ కల్పించిందో, ఆ అఖిల భారత చరఖాసంఘం జాతీయ నిర్మాణోద్యమంలో సాగిస్తూన్న మహత్తర ప్రయోగముతో జోక్యం కల్పించుకొంటూన్నట్లు ఏ కాంగ్రెసు వాదినిగూర్చిగాని ఏ కాంగ్రెసు కమిటీని గూర్చిగాని వినబడకుండు గాక. కాబట్టి కాంగ్రెసు కమిటీలుగాని కాంగ్రెసు వాదులుకాని, అఖిల భారత చరఖాసంఘం కార్యక్రమంతో జోక్యం కల్గించుకోక పోవడమేగాక, అఖిల భారత చరఖాసంఘం యొక్క వివిధ సంస్థలతో, ముఖ్యంగా ఖాదీ అమ్మకం విషయంలో వారు హృదయపూర్వకంగా సహకరిస్తారని ఆశిస్తున్నాను. క్రమ క్రమంగా ఖాదీ విక్రయం పెరిగినట్లయితే ప్రతికటువు ప్రాంతంలోకూడా ప్రతి ఫలదాయకమయిన పని చూపించడం సాధ్యమవుతుంది.

—హరిజన్, 24-12-1938

# 185
# నిజమైన స్వదేశీ

స్వదేశీ అనే పదానికి ముందు 'నిజమైన' అనే విశేషణము ను నేనుపయోగించినయెడల, 'అబద్ధపు స్వదేశీ కూడా ఉన్నదా?' అని విమర్శకుడు ప్రశ్నించవచ్చును. దురదృష్ట వశాత్తూ నేను 'అవును' అనవలసి వస్తూన్నది. ఖాదీ ఉద్యమ రోజులనాటినుండియే నేను స్వదేశీని గూర్చి ప్రమాణ పురుషుడనుగా భావింపబడుతున్నాను. విలేఖకులనేక ప్రశ్నలను నాకు పంపుతూంటారు. కనుక రెండు రకాల స్వదేశీని గూర్చి ప్రత్యేకించి చెప్పవలసిన పని నాకు కలుగుతూన్నది. స్వదేశీ పెట్టుబడితో విదేశీయ పెట్టుబడి కలసి ఉంటేనూ, స్వదేశీయ ప్రావీణ్యమునకు తోడు విదేశీయప్రావీణ్యాం కలసి ఉంటేనూ ఆ పరిశ్రమ స్వదేశీ అవుతుందా? ఇంకా ఇట్టి ఇతర ప్రశ్నలుకూడా ఉన్నవి. కాబట్టి ఒకనాడొక మంత్రికి చెప్పిన నా నిర్వచనాన్ని ఇకకడ పునరుద్ఘాటించడం ఉచితం. "పెట్టుబడీ ప్రావీణ్యమూ కూడా విదేశీ అయినప్పటికీ, అది సరియైన భారతీయ యాజమాన్యము కింద ఉండి సామాన్య ప్రజల ప్రయోజనమున కుపకారంగా నున్నయెడల, యే వస్తువైనను స్వదేశీయే కాబట్టి ఈ యావత్తు పెట్టుబడీ విదేశీయేయై భారతీయ సంఘముచే నియోగింపబడిన పాశ్చాత్య ప్రవీణులు ఉన్నప్పటికీకూడా, అఖిల భారత చరఖాసంఘం వారి నిర్వచనం ప్రకారం ఖాదీ నిజమైన స్వదేశీ అవుతుంది. ఇందుకు ప్రతికూల తారాకాణంగా బాటా కంపెనీ పెట్టుబడి యావత్తూ భారతీయమైనప్పటికీ దానిలోని కూలీలందరూ భారతీయులైనప్పటికీ, ఆ రబ్బరు చెప్పులు కానీ తదితర

పాదరక్షలు కానీ విదేశీ అవుతవి. అది విదేశీయుల అధికారం కింద ఉండడంచేతనూ, అక్కడి వస్తువు ఎంత చౌకగా ఉన్నప్పటికీ, గ్రామీణ చర్మకార వృత్తిని చాలా వరకున్నూ గ్రామ మోచీని పూర్తిగానూ నిర్మూలంచేయడం వలననూ ఆ కంపెనీలో తయారైన సామగ్రి రెండింతలు విదేశీ అవుతుంది. బీహారు మోచీ యిప్పటికి ఈ అసమానమైన పోటీతో బాధపడుతూన్నాడు. బాటా చెప్పు యీరపు ఖండమునకు క్షేమం కావచ్చును. కాని మన గ్రామీణ చర్మకారునకూ చెప్పులు కుట్టే వానికీ మృత్యువని చెప్పాలి. మీకు రెండు ముఖ్యోదాహరణముల నిచ్చాను. రెండూ కొంతవరకు ఊహాజన్యములే. ఎందువల్లననగా, అఖిల భారత చరఖా సంఘం లోని పెట్టుబడీ ప్రావీణ్యమూ కూడా దేశీయములే. కాని దేశీయ నైపుణ్యముతో చేయబడిన అభివృద్ధి లెంతమాత్రమూ తృణీకరింపబడతగినవి కావని నా అంతరంగంలో నమ్మకం ఉన్నప్పటికీ, ప్రస్తుతం పనిచేస్తూన్న చర్ఖాలను మించిపోగల గ్రామీణ చర్ఖాను నాకు ప్రసాదించే టందుకు పాశ్చాత్య ఇంజనీరింగు ప్రావీణ్యమును నేను ప్రేమిస్తాను. అయితే ఈ ప్రస్తావన ప్రస్తుత విషయానికి సంబంధించింది కాదు. ప్రజానాయకులుగాను ప్రజాసేవకులుగానూ వ్యవహరించే మంత్రులుగానీ తదితరులుగానీ నిజమైన స్వదేశీకి అబద్ధపు స్వదేశీకి భేదమును నిర్ణయించే లక్షణాన్ని పెంపొందించుకోగలరని ఆశిస్తూన్నాను.

—సేవాగ్రాం, 20-2-1939
—హరిజన్, 25-2-1939

# 186

## ఖాదీ ఖాదీని చంపుతుందా!

అ.భా.చ.సం. వారు వడుకు మజూరీల హెచ్చింపును గూర్చి నిర్ణయించినప్పుడు, ఆ ప్రతిపాదనను ఉత్సాహకరంగా మొట్టమొదట బలపఱచినది మహారాష్ట్రశాఖ. అది శ్రీ వినోబాయొక్క ప్రత్యక్ష నాయకత్వం కింద నడుస్తున్నది. ఇతర రాష్ట్రాలు సమీపించని యథార్థ దృక్పథంతో ఆ సంస్థ ఆ హెచ్చింపు కార్యక్రమాన్ని నిర్వర్తించింది. మహారాష్ట్ర శాఖవారు హెచ్చించినంతగా తమ మజూరీలను హెచ్చించకపోవడంవలన ఇతర రాష్ట్రాలు, మహారాష్ట్ర ఖాదీకంటె తమ ఖాదీని తక్కువ ఖరీదుకు అమ్మగలుగుతూన్నవి. అంతేగాక, మహారాష్ట్ర శాఖ వారు పనిచేసే ప్రదేశాలకు సైతం తమ ఖాదీ పంపేటందుకవి సందేహించడం లేదు. నీతినియమాలులేని వర్తకులు ఈ పరిస్థితిని ఉపయోగించుకోవడంలో జాగుచేయ లేదు. ఇది కారణంగా ధ్రువ పత్రములు పొందని అంగళ్లు నాగపూరు, వార్ధా మొదలైనచోట్ల మొలకెత్తినవి. అమాయిక ప్రజలు ఈ కొత్త యేర్పాట్లు తెలియక, చౌక ఖాదీ కొనవలెననే ఆసక్తితో ధ్రువపత్రములు లేని భాండారాలను ఎక్కువ అభిమానిస్తూన్నారు. అందువల్ల మహారాష్ట్రశాఖా భాండారమున కెక్కువ దెబ్బ తగులుతూన్నది. దీని ఫలితంగా మహారాష్ట్రశాఖ తనపనినైనా ముగించాలి లేదా, మజూరీనైనా తగ్గించాలి. ఇది ఖాదీయే ఖాదీని చంపడం అవుతుంది. ఖాదీ అర్థశాస్త్రం, పోటీ విధానం పైన ఆధారపడివుండే సామాన్య అర్థశాస్త్రమునకు భిన్నంగా ఉంటుంది. సామాన్య అర్థశాస్త్రం

అందరికి మహోత్తమ శ్రేయస్సుకూ అనుగుణమైన సిద్ధాంతంతో, ముఖ్యంగా అట్టడుగున ఉన్న ప్రజల శ్రేయస్సుకు అనుగుణమైన సిద్ధాంతంతో, ఆచరింపబడడం లేదు. కాబట్టి ఖాదీ తన ధర్మసందేశమును నిర్వహించవలెనంటే ఈ కింది పనులు నిర్వర్తింపబడవలెనని ఇదివరకే ఈ పత్రికలో నిరూపించి ఉన్నాను :—

1. కనీసం గంటకు ఒకణావరకు పెటిగేవరకు వడుకు మజూరీలు క్రమక్రమంగా పెరుగుతూనే ఉండవలెను.

2. ప్రతి గ్రామము ఖాదీ ఉత్పత్తిచేసి తాను ఉత్పత్తి చేసిన ఖాదీ తాను వాడుకొంటూండడమే ఆదర్శం. దీనిని బట్టి ప్రతి రాష్ట్రమూ తనకు సరిపోయేటంత ఖాదీ మాత్రమే ఉత్పత్తిచేయడం ప్రస్తుత కనీస ధర్మమని స్పష్టమవుతూన్నది. అయితే తాను తప్ప ఇంకే రాష్ట్రమూ ఉత్పత్తిచేయలేని ఖాదీ మాత్రం, ఆ రాష్ట్రము సరిహద్దులనుదాటి అమ్మేటందుకు అనుమతి ఈయబడవలెను. ఇందుకు తారాణంగా ఆంధ్ర 80 నెంబరు ఖాదీ తన సరిహద్దులను దాటి ఎగుమతిచేయవచ్చును. అంతేకాని ముతగ ఖాదీ ఎంత చౌక అయినప్పటికీ ఎగుమతి చేయరాదు.

3. కేవలం లాభాలకోసం లాభాలు సంపాదించకూడదు. ప్రపంచంలోకెల్ల మహోత్తమమైన ఈ సహకార సంస్థలో కూలీలే భాగస్వాములు, ఖామందులూను. కాబట్టి ఏ ఒకటి సంవత్సరంలోనైనా లాభాలు రావడం తటస్థించినట్లయితే పని కావలసినవారున్నంతవరకు, వడికే వారి సంఖ్య పెంచడమునకున్నూ, లేకపోయినట్లయితే పనిచేస్తూన్నవారి వడుకు మజూరీ పెంపొందించేటందుకున్నూ అవి సక్రమంగా వినియోగపడాలి.

4. అనుకొన్న స్థాయికి వడుకు మజూరీలను హెచ్చించే టందుకు ప్రయత్నించే యే రాష్ట్రమైనను తదితర శాఖల వల్లనూ, ఖాదీ ప్రియులవల్లనూ ప్రోత్సహింపబడవలెను.

5. ఇతర రాష్ట్రాలలో ఉత్పత్తి అయిన ఖాదీకంటె ప్రియంగా ఉన్నప్పటికీ తమ రాష్ట్రంలో ఉత్పత్తి అయిన ఖాదీని మాత్రమే ప్రజలంతా వాడాలి. ప్రతి రాష్ట్రమునకు తాను చేయగలిగినంత మంచి చేస్తుందని వారు అ.భా.చ.సం. పైన నమ్మకం కలిగి ఉండాలి.

6. భారత దేశమంతటా సమానమైన వేతనములు, ఖరీదులు ఉండేటట్లు చేయవలెననియే అ.భా.చ.సం. వారి ఉద్దేశం. కాని ఆ ఆదర్శమును అందుకొనేటంతవరకు తమ రాష్ట్రంలోని కూలీల విషయంలో తాము నిర్వర్తించవలసిన ధర్మం కలదని తెలుసుకొనే కనికరభావమైనా రాష్ట్ర ప్రజలకు ఉండాలి. విదేశాలతో పోటీపడడం ఎంత చెడుగో, రాష్ట్రాలలో రాష్ట్రాలు పోటీపడడంకూడా దాదాపు అంత చెడుగు.

ధ్రువ పత్రములు లేని భాండారములన్నీ మూసివేయ బడవలెనని తక్షణం కోరవలసి ఉన్నది. అటువంటి భాండార ములనుండి కొనకూడదని కాంగ్రెసువాదులు తదితరులు ప్రజలకు తెలియచేయాలి. అఖిల భారత చరఖా సంఘం వారి అనుమతితో తప్ప రాష్ట్రీయ శాఖలు తమ సరుకులను బయట అమ్మడానికి ఖచ్చితంగా నిరాకరించాలి.

—సేవాగ్రాం, 19-6-1939

—హరిజన్, 24-6-1939

# 187

# ఖాదీ కరువు భీమా

## శిక్షణోపకరణము

12 వ తేదీని ఆ పిమ్మటనూ వార్ధాలో, అ.భా.చ.సం. సమావేశములో ఖాదీ కార్యకర్తల మధ్య సంపూర్ణ చర్చ జరిగింది. ఖాదీకి కనీసం మూడు ప్రత్యేక ధర్మాలు కలవని చెప్పబడినది. ఏ యితర వృత్తీ సరితూగజాలని ఎత్తున, కడుపు నిండా కూడూ చేతినిండా పనీ లేని లక్షలాది ప్రజలకు ఉపవృత్తిని కల్పిస్తుందది. కఱువు ప్రదేశాలలో సాధ్యమైనంత తక్కువ నష్టంతో పని కల్పిస్తుందది. ప్రాథమిక దశలో, భారత దేశంలోని బాలబాలికల కది ఉత్తమోత్తమ మయిన శిక్షణోపకరణం.

ఖాదీ, కఱువు భీమాగాగానీ ప్రాథమిక దశలో శిక్షణోప కరణంగాగాని జయం పొందేటందుకు ఒక ప్రత్యేక నియమమున్నది. కరువు ప్రదేశాలలోనూ పాఠశాలల లోనూ ఉత్పత్తి అయిన ఖాదీతో ఏమిచేయాలి? ఖాదీ అమ్ముడు పోకపోయినట్లయితే, కరువు కాలంలో ఇండియా లోని వివిధ భాగాలలో పగులగొట్టబడిన రాళ్లెంత నిరుప యోగమో, అదీ అంత నిరుపయోగమే. పై రెండు సందర్భాలలో ఉత్పత్తి అయిన ఖాదీ యావత్తూ ప్రభుత్వం తీసుకోవలెనని నేననేక పర్యాయము లీ పత్రికలో వ్రాసి ఉన్నాను. ప్రభుత్వ మీనాడు రైల్వే లాభాలకు ఇంకా అనేక యితర విషయాలకు హామీ యిచ్చినట్లే, ఈ సంద ర్భంలో వచ్చే నష్టాలకు కూడా హామీ యిచ్చినట్లయితే ఈ

పని అ.భా.చ.సం. నిర్వర్తిస్తుంది. ఖరీదును బట్టి చూస్తే మిల్లు బట్టకంటే ఖాదీ ప్రియము మాట నిజమే. కాబట్టి అది దేశభక్తులలోనూ లోకహితైషులలోనూ మాత్రమే అమ్ముడు పోతుంది. కాని వినియోగించేటందుకు దగ్గర డబ్బు లేనివారు, దేశభక్తిచే గానీ లోకోపకారబుద్ధిచే గానీ తేలికగా ప్రేరేపింపబడరు. వారత్యంతం చౌకగా ఉండే దుకాణానికి పోతారు. కాబట్టి, ప్రజా క్షేమంకోసం అమ్ముడు పోవలసిన వస్తువులతో పోటీ చేసే వస్తువులను రాకుండా చేయడం కానీ లేక వాటిపైన తగినంత ఎక్కువగా పన్ను విధించడంకానీ ప్రభుత్వంవారి పని. ఖాదీ అటువంటి వస్తువులలోకి వస్తుందని రుజువయినట్లు భావించవచ్చునని నే ననుకొంటున్నాను. ఖాదీనీ ఇంకా అటువంటి వస్తువులనూ రక్షించేటంతవరకు, నిజంగా ఎనిమిది రాష్ట్రాలలోని ప్రభుత్వం కాంగ్రెసు చేతులలోనే ఉన్నది. ఖాదీ రక్షణవంటి భేదాభిప్రాయాలు లేని విషయాలలో కాంగ్రెసు రాష్ట్రాలను ఇతర రాష్ట్రాలుకూడా ఎందు కనుసరించకూడదో కారణం కనిపించడంలేదు. మనలో చాలా మంది రావలెనని కోరుకొంటున్నంత త్వరలో హిందూ ముస్లిం ఐక్యత రాకపోవచ్చును. మనమంతా ఒకే గాలి పీల్చి, ఒకే నదులలోని నీరునో, నూతులలోని నీరునో ఒకే జలాశయమునందలి నీరునో త్రాగుతూన్నట్లుగానే, ఇతర జీవితావసరములనుగూర్చిన సామాన్య విధానంలోకూడా నిజంగా మనమంతా ఏకీభవించవచ్చునుగదా! మన ఇతర

భేదాభిప్రాయాలను దురదృష్టవశాత్తూ అలాగే ఉంచుకొని, ఒకరితో ఒకరు పోరాడుకొనేటందుకు వాటిని ఉపయోగించుకొంటూ ఉన్నప్పటికీ, సామాన్య విషయాలతో వాటిని ముడిపెట్ట నక్కరలేదు. ఇతర రాష్ట్రాలు కలసివచ్చినా రాకపోయినా కాంగ్రెసు రాష్ట్రాలు మాత్రం, అ.భా.చ.సం. తోనూ అ.భా.గ్రా.ప.సం. తోనూ సంప్రదించి నేను చూపిన చిక్కును త్వరగా పరిష్కరించేటందుకు వీలైన చర్య తీసుకోవడం అవసరం.

—సేవాగ్రాం, 14-8-1939
—హరిజన్, 19-8-1939

---

# 188

# వడికేవారి మజూరీలు

వార్ధాలో 15 వ తేదీని సమావేశమయిన అ.భా.చ.సం. వారిచే ఆమోదింపబడిన తీర్మానముయొక్క అనువాదమిది :

“వడికేవారి మజూరీలను క్రమంగా హెచ్చించవలసిన ధర్మాన్ని నాలుగు సంవత్సరాలనుండీ అ.భా.చ.సం. గుర్తించింది. ఈ ధర్మ నిర్వహణంలో సంఘముయొక్క మహారాష్ట్ర శాఖ తక్కిన శాఖలన్నిటిలోకీ ఎక్కువ ప్రమాణంలో మజూరి యిచ్చింది. కాని ఆ శాఖ కావించిన ప్రయోగ ఫలితంగా ఖాదీ ఆ భారాన్ని భరించలేకపోయిందని రుజువయింది. అమ్మకాలుకూడా చాలావరకు పడిపోయినవి. మజూరీల హెచ్చింపువలన పని లేనివారికి పని కల్పించే శక్తి ఖాదీకి తగ్గిపోకూడదు. ప్రస్తుత పరిస్థితులనుబట్టి, ఎనిమిది గంటల వడుకు పనికి వడికేవారికి మూడణాలకంటె ఎక్కువ ఈయవలెననే పట్టుదలను ఆపివేయడం అవసరమని తోస్తూన్నది. నిరుద్యోగం ఎక్కువగా ఉన్నది. ఎనిమిది గంటలు వడికినందుకు ఒక అణాకంటె తక్కువ తీసికొని పని చేయడానికి వడికేవారు తగినంతమంది ఆసక్తిగా ఉన్నారు. సంఘంవారు నిర్ణయించిన సిద్ధాంతాన్ని భగ్నం చేయడానికి వీలుగా, అంత తక్కువ మజూరీలకు వారికి పని యిచ్చేటందుకు యితరులు సంసిద్ధంగా ఉన్నారు. ఈ చెడుగును నిర్మూలించడానికి, ఈ సంఘం, వారికికూడా పని చూపించడం తప్ప గత్యంతరం లేదు. కాబట్టి సంఘం ముందు రెండు ధర్మాలు కలవు. ఒకటి, ఎనిమిది గంటల రోజుకు ఎనిమిది అణాలవరకు వడికేవారి మజూరీలను హెచ్చించడం రెండు, పనిలేని సోదరీమణులకు పని చూపించడం. ఈ రెండు ధర్మాలను ఒకేసారి నిర్వహించే తరుణం రావడానికి మధ్య కొంత కాలం పట్టుతుంది.

అదేకాక దేశంలోని కొన్ని ప్రదేశాలలో కరువువచ్చే విషమ స్థితి యేర్పడింది. అటువంటి సమయాలలో రాటం ఒక్కటే అత్యంత సహకారి అయినట్లు రుజువయింది. అయితే మజూరీల ప్రమాణం మూడణాలకంటెకూడా తగ్గించడం అవసరమా అనే ప్రశ్న వస్తూన్నది. వార్ధా విద్యావిధానము ననుసరించి నడపబడే పాఠశాలలలో ఉత్పత్తి అవుతూన్న ఖాదీవలన మూడవ సమస్య ఉదయిస్తూన్నది.

ఈ విషయాలన్నిటినీ ఆలోచించినమీదట సంఘం ఈ దిగువ నిర్ణయానికి వచ్చింది :

“ప్రస్తుతం ఎనిమిది గంటల పనికి నిర్ణయింపబడిన మూడణాల నిర్ణీత ప్రమాణం గల మజూరీని సాధారణంగా కదిలించకూడదు. అయితే ఈ ప్రమణాన్ని మించి హెచ్చించడానికి ఏ శాఖకైనా స్వాతంత్ర్యం ఉంది. కాని హెచ్చు ప్రమాణంపైన, అమ్మకాలు పడిపోకుండా ఉండే బాధ్యత ఆ సంఘం తీసుకోవాలి. కఱువు ప్రదేశాలలో కర్మకారుల మజూరీలు తగ్గించవలసిన అవసరం ఉన్నట్లుగా [illegible]యితే, కార్యదర్శినుండి ముందుగా అనుమతి పొంది తగ్గించవచ్చును. క్షామ ప్రదేశాలలోనూ, వార్ధా విద్యా విధానముక్రింద నడపబడుతూన్న పాఠశాలలలోనూ తయారైన ఖాదీ అమ్మకాలను ఆయా ప్రభుత్వాలనుండి సంఘం తీసుకోవాలి. అయితే అటువంటి ఖాదీని విడుదల చేయడంలో వచ్చిన నష్టం ఈ ప్రభుత్వాలే భరించాలి.”

ఇది ముఖ్యమైన తీర్మానం. వడికే మనిషికి ఎనిమిది గంటల రోజుకు ఎనిమిది అణాలవరకూ మజూరీలు హెచ్చించవలసిందని నేను తొందరపెడుతూండగా, ఇది ఆ వేగాన్ని కుంచింపచేస్తూన్నది. ఒక్క గంతులో ఆ ఆశయం నెరవేరదని నాకు తెలుసును. అయినప్పటికీ ప్రతి కొలది మాసములకు కొంత కొంత హెచ్చుతూంటుందని నే నాశిస్తూ వచ్చాను. కాని వివిధ శాఖలనుండి వచ్చిన నివేదికల వలననూ, పెంపుదల విషయంలో ముందుకు పోవడానికి ఎక్కువ ఉత్సాహంతో శ్రీ వినోభా దర్శకత్వం క్రింద శ్రీ జాజాజీచే నా కళ్ల ముందు ప్రత్యక్షంగా నడపబడిన ప్రయోగం కొంత అపజయం పొందడంవలననూ ఎనిమిది గంటలు పనిచేసిన లక్షలాది స్త్రీలకు రోజుకు ఎనిమిద అణాలు ఈయలేని దుర్భర దారిద్ర్యంలో ఈ దేశం ఉన్నదన్న భయంకర కఠోర సత్యాన్ని గమనించేటట్లు నాకు కనువిప్పయింది. సాధారణంగా గ్రామాలలోని కూలీలు గానీ కర్మకారులుకానీ ఎనిమిది గంటల పనికి ఎనిమిది అణాలు

పల్లె ప్రదేశాలలో ఎకరూడా సంపాదించడం లేదు. ఇతర వర్గాలవారుకూడా అంత సంపాదించకపోయినట్లయితే వడికే వారు ఎనిమిది అణాలు సంపాదించజాలరు. పరిస్థితులు పూర్తిగా మారిపోతేనే తప్ప, అందటికీ ఎనిమిది అణాలు కూలి ఈయడానికై, కొనే వర్గాలవారికడ కేవలం డబ్బుండదు. లాభదాయకం కాక కుంగదీస్తూన్న సైనిక వ్యయం దేశాన్ని పీల్చి పిప్పిచేస్తూన్నది. దీనికి తోడు అంతులేని ఎక్కువ జీతాలు, వాటితో తులతూగే పెద్దపెద్ద పింఛనులు, ఈయబడి విదేశాలలో వెచ్చింపబడుతూన్నవి. పీడాకరమైన ఈ దరిద్రమునకు ఇంకా ఇతర ఆంతరంగిక కారణాలు కూడా ఉన్నవి. కాని నే నీవ్యాసముయొక్క ఉద్దేశమును దాటి పోకూడదు.

కారణా లేమయినప్పటికీ, మూడణాలకు మించి మజూరీలను హెచ్చించినందున పెటుగవలసిన ఖరీదుతో, ఖాదీ కొనేటందుకు మధ్య తరగతి ఖాదీ క్రేత కెంత బ్రహ్మాండమైన కోరిక ఉన్నప్పటికీ కేవలం అతనికి డబ్బు లేదనే విషాదకర విషయాన్ని ఖాదీ కార్యకర్తలు నాకు నచ్చ చెప్పినారు. ప్రస్తుతం, ఏమయినప్పటికీ అది దాటిపోకూడదని వారు నివేదిస్తూన్నారు. ఈ తీర్మాన మావిషాదకర సత్యాన్ని గమనించడమే.

కాని రాష్ట్రీయ ప్రభుత్వాలు రక్షణకు రాకపోయినట్లయితే ఈ మూడణాల ప్రమాణమూకూడా నిలవజాలదు. వారీ పని శాసనమూలకంగానూ పరిపాలనా విధానం వల్లనూకూడా నిర్వహించవచ్చును. అ.భా.చ.సం; ను, అ.భా.గ్రా.ప.సం., ను, హిందూస్థానీ తాలిమీ సంఘమునూ తమ సొంత స్వచ్ఛంద, గౌరవ ప్రవీణ సంస్థలుగా ఉపయో

గించుకోగలిగినయెడలనే ఈ పని వారు చేయగలరు. తీరిక సమయాలలో పని కల్పించి ఐకరు చికిరాన గ్రామస్థుల చేతులలో అనేక లక్షల రూపాయిలను పెట్టగల అవకాశాన్ని నేను వారికి చూపిస్తున్నాను. కాని గ్రామాలలోని ఉత్పత్తి దారులు చలామణీలోనున్న నాణెములుగా పరివర్తనం చెందనియెడల యే విధమైన అభివృద్ధి జరగడానికి వీలు లేదు.

—సేవాగ్రాం, 20-8-1939

—హరిజన్, 26-8-1939

# 189

# కొనేవారు కావాలి

మీరట్ గాంధీ ఆశ్రమమునుండి వచ్చిన ఒక ఉత్తరం లోని విషయమిది:

"ఈనాడు మూడు లక్షలమందికి పైగా అ.భా.చ.సం. పనియిస్తూన్నది. దాని కార్యకలాపం 13,000 గ్రామాలలో వ్యాపించి ఉన్నది. ఈ మహత్తర జాతీయ నిర్మాణ కార్యక్రమంలో 2,571 మంది కార్యకర్తలు పనిచేస్తూన్నారు. ఇందులో యు.పి. భాగం తక్కువ కాదు. మా జాబితాలో వడికేవారు 40,000 మంది కంటె ఎక్కువ ఉన్నారు. నేతవారు, చాకలులు, ఏకేవారు మొదలైన ఇతర కర్మకారుల సంఖ్య 4,780. మా కార్యకలాపాలు 3,043 గ్రామాలలో జరుగుతూన్నవి. రాష్ట్రంలోని వివిధ ప్రదేశాలకు 600 మంది కార్యకర్తలు ఖాదీ సందేశాన్ని తీసుకొని పోతూన్నారు. జాతీయ నిర్మాణ శక్తులన్నిటినీ అది కార్యరంగంలోకి దింపుతూన్నది. ఏకీకరణం, ప్రణాళిక, సమన్వయము, నిర్మాణమూ, ఈ అన్నింటినీ మేము నేర్చుకొంటూన్నాము. మనకు కావలసిన బట్ట యావత్తూ రాటం సరఫరా చేయజాలదని పండిత జవహరలాలు నెహ్రూ వర్కింగు కమిటీకి నివేదించినట్లు తెలుస్తూన్నది. ఈ ప్రకటన రాటముయొక్క శక్తిని తక్కువగా అంచనా వేస్తున్నట్లు నే ననుకొంటున్నాను. నా అనుభవాన్నిబట్టి ఈ సమస్యయొక్క అంచునుకూడా మనం తాకజాలక పోయినామని నేను చెప్పగలను. మనం ఉత్పత్తిచేస్తూన్న ఖాదీకి అంగడి తయారుగా ఉన్నయెడల, కొద్ది కాలంలోనే ఇంతకు వేయిరెట్లు ఉత్పత్తి చేయవచ్చును."

అమ్మకాలనుగూర్చి చేసిన ప్రార్థనాభాగం నే నుదాహరించడం మానివేశాను. వారుచేసే ప్రయత్నం అర్హమైన విజయాన్ని పొందగలదని నే నాశిస్తూన్నాను. ఉత్పత్తితో పాటు అమ్మకం జరగక పోవడానికిగల కారణమును గూర్చి నే నిక్కడ ఆలోచించ తలచుకొన్నాను. ప్రచారం కావలసిన మాట నిజమే. కాని ప్రచారంకంటె ఎక్కువగా

శాస్త్రీయ పరిశోధన కావలసి ఉంది. సగటున మనవాళ్లకు యేడాదికి మనిషి 1 కి 15 గజాలు బట్ట కావలసి వస్తుందనే మాట నిశ్చయం. ఈ బట్టకు దేశం దాదాపు 100 కోట్ల రూపాయిలు వెచ్చించవలసిన మాటకూడా నిశ్చయమే; భారతదేశపు జనసంఖ్య 35 కోట్లని లెక్కవేస్తే మనిషి 1 కి మూడు రూపాయలకు తక్కువగా ఖర్చవుతుంది. ప్రభుత్వం ఖాదీకి రక్షణ యిచ్చినట్లయితే అమ్మకం జరుగగలదని చెప్పడం తేలికే. ఖాదీకి రక్షణ పొందేటందుకు అర్హత ఉన్నదనే సంగతి దానంతటదే రుజువయిన సిద్ధాంతమని నా అభిప్రాయము. రక్షణ లేకుండా—సైతం అమ్మకం జరిగేటందుకు మనం చేయగలిగినదంతా చేసినట్లు యోగ్యులైన ఖాదీ కార్యకర్తలు తెలుసుకొన్నారా? అమ్మకముల విషయంలో రెండు ఆటంకాలున్నవి. మిల్లు బట్ట ఖాదీకన్న చౌక అని వాడుక. అంతేకాక, అందులో అనేక రంగులు, అనేక రకాలు, చక్కని తయారీ ఉన్నవనీ అవన్నీ ఖాదీలో లేవనీకూడా అంటారు. ఈ రెండో లోపం చాలావరకు సరిచేయబడినది. కాని బహుశా ఇంకా ఎక్కువ పని జరుగవలసి ఉన్నది. తాను అతిక్రమింపజాలని మేర ఒకటి ఖాదీకి ఉండాలి. అది ఉంటే, ఉందని మనం నిష్కపటంగా ఒప్పుకోవాలి. ఖరీదులను గూర్చి తగిన పరిశోధన జరుగలేదని నా భయం. ఆచార్య కుమారప్ప రాటమునకొక ఆశ్చర్యకరమైన శక్తిని ఆపాదించారు. దానిని సమర్థిస్తూ కొన్ని అంకెలనుకూడా ఆయన ఉదాహరించారు. * కాని సామాన్యమైన మనిషి

---

* "రెండు పద్ధతులకు అనుకూలంగా ఉండే వస్త్రపరిశ్రమవంటి దానిని తీసుకొని మన మీ అంకెలను సంతృప్తికరంగా పోల్చగలిగి ఉండాలి. పత్తి వడికి బట్టలునేసే సామాన్యమైన మిల్లుకు 13 లక్షల

యిలా ప్రశ్నిస్తాడు: అయితే మిల్లుబట్టకంటె ఖాదీ ఎందుకు ప్రియంగా ఉన్నది? ఈ ప్రశ్నకు సంతృప్తికరమైన జవాబీయాలి. స్పష్టంగా కనిపించే ప్రత్యుత్తరాలు సంతృప్తికరంగా ఉంటవని నే ననుకోను. ఆ ప్రత్యుత్తరాలన్నీ ఆ మూలాగ్రంగా పరిశీలించాలి. కష్టాలనుండి గట్టెక్కేటందుకు మార్గాన్ని అన్వేషించాలి. ఖాదీ తన స్వతస్సిద్ధమైన ఆధిక్యతను పొందేటంతవఱకు ప్రయత్నించాలి. మనకు కావలసి దానికంటె ఎక్కువగా పండించిన పత్తిని, మనకు బట్టగా తయారయ్యేటందుకు విదేశాలకు పంపవలసి రావడం లజ్జాకరం. మన గ్రామాలలో పనిలేని కార్మికులు అంతులేని జనం ఉండగా, ఉత్పత్తికి తగిన గ్రామీణ పరికరములు మనకు తేలికగా సరఫరా కావడానికి వీలుండగా, మన పత్తిని

---

రూపాయిల పెట్టుబడీ 1,400 మంది మనుష్యులూ కావాలి. ఈ లెక్క ప్రకారం నియోజితుడైన ప్రతి మనిషికీ రూ 900 లవుతుంది. పెట్టుబడి పెట్టుబడిన ప్రతి రూపాయికి 2.5 పౌనుల నూలు 1.5 పౌనుల బట్ట ఉత్పత్తి అవుతున్నట్లు లెక్క తేలుతూన్నది. (ఈ అంకెలు 1932-33 వి) ఒక మగ్గం, పది రాటాలు కార్య నిర్వహణమునకు రూ 60 లు పెట్టుబడీకల కుటీర కేంద్రములో నియోజితుడైన ప్రతి మనిషికీ రూ 9 ల పెట్టుబడికింద అవుతూన్నట్లునూ, ప్రతి రూపాయికీ అయ్యే ఉత్పత్తి, మిల్లులో అయినదానికి పదిరెట్లు ఎక్కువ అవుతూన్నట్లునూ లెక్క తేలుతూన్నది. ఇదంతా కలిపి సమగ్రంగా లెక్క వేసుకొని మనకు కావలసినబట్ట యావత్తూ మిల్లుల ఉత్పత్తివలననే సరఫరా చేసుకొనేటట్లయితే, '300 కోట్ల రూపాయలు పెట్టుబడీ 33 కోట్ల జనమూ కావలసి ఉంటారు. మనం కుటీర కేంద్రములనుండియే సరఫరా చేసుకొనేటట్లయితే షుమారు రూ. 72 కోట్ల పెట్టుబడిన్నీ 8 కోట్లమంది మనుష్యులున్నూ కావలసివస్తారు. ఈ రెండు పద్ధతుల లోనూ కూడా ప్రయోజనాలు కలవన్నమాట వాస్తవమే. కాదని యెవ్వరూ అనజాలరు. కాని మన దేశ పరిస్థితుల కనుగుణమైన పద్ధతిని మాత్రమే మనం నిర్ణయించుకోవాలి. మనం పేదవాళ్లమే అయితే

మన ఉపయోగంకోసం మనకు బట్టగా తయారుచేసేటందుకు మనం మన నగరాలలోని మిల్లులకు పంపించడంకూడా లజ్జాకరమే. యీ లజ్జాకరమైన చరిత్రను మన మెఱుగుదుము. అయితే, దేశభక్తియుతమైన ప్రబోధంద్వారాతప్ప ఈ రెండు లజ్జాకర విషయములనుగూర్చి తగు చర్య తీసుకొనేటందుకు మనమింకా ఒక సునిశ్చితమైన మార్గమును కనిపెట్టలేదు. ప్రజలు మన ప్రబోధమున కనుగుణంగానే వర్తించారు. కాని ఇటీవలి తీర్మానం వారిప్పుడు చూపిన అభిమానమును మించి ఎక్కువ అభిమానం చూపజాలరని నిరూపిస్తూన్నట్లున్నది. అందుచేత ఖాదీ ధరించేటంతవరకూ మనం సంతృప్తిపడక పోవచ్చును. మన పరిశోధనలో, ఖాదీ యెప్పటికీ ఒక ఆర్థిక సిద్ధాంతం కాజాలదనే విషయం మనము గ్రహిస్తే గ్రహించ

---

మనకు మన కార్మికులే మహా సముద్రమంత ఐశ్వర్యం. కాబట్టి మన దేశమున కనుకూలమైన ప్రణాళిక తెలివిగా కుటీర విధానమునకు సంబంధించి యేర్పాటు చేయబడాలి. కావలసినంత మంచి రేగడ మట్టి, కొయ్య ఉన్న ప్రదేశంలో, భవనములు కట్టేటందుకు పథకం వేస్తూన్న ఇంజనీయరు, ఇటుకతోను కలపతోను కట్టడానికి యేర్పాటు చేస్తాడు; సిమెంటు ఇనుమూ ఎక్కువగా ఉన్న దేశంలో అయితే సిమెంటు రాయితో గట్టిగా కట్టేటందుకు సిఫారసు చేస్తాడు. ఆ సిఫారసులు మరొక విధంగా ఉంటే అది తెలివి తక్కువవుతుంది. అభివృద్ధి అయ్యేటందుకు ఒకే ఒక స్పష్టమైన మార్గమేమీ లేదు. ప్రతి ప్రణాళిక భౌతికంగానేకాక సాంఘికంగానూ, వైజ్ఞానికంగానూకూడా ఉత్తమ ఫలితాలు కలిగేటందుకు వీలుగా, ఉత్పత్తికి అందుబాటులోనున్న అన్ని విషయాలను సమన్వయం చేసుకోవాలి. మన దేశంలో కార్మికులనే ఐశ్వర్యాన్ని వినియోగించుకోని యే పథకమైనా అసందర్భంగానే ఉంటుంది. కేంద్రీకరణ ఉత్పత్తి విధానమునకు ఉత్పత్తిచేయగల శక్తి ఎంత ఉన్నప్పటికీ, మన మెంతమందికి పని చూపవలసి ఉన్నదో, అంతమందికీ పని ఈయగల శక్తి మాత్రం దానికిలేదు. కాబట్టి ఈ దేశంలో అది పనికిరాదు.''

వచ్చును. అలా గ్రహించి తీరగలమని కొందఱంటున్నారు. అప్పుడు మనకదెంత గర్వభంగమైనప్పటికీ మన మాసంగతి ఒప్పుకోవడానికి వెనుకంజవేయము సరికదా, మనమింతవఱకూ యెంతో విశ్వాసంతో ప్రచారంచేసిన సిద్ధాంతాలన్నిటినీ కూడా నిర్మూలిస్తాము కాని, నాచేత ప్రతిపాదింపబడిన ప్రశ్నలకు అసందిగ్ధమైన జవాబులు పొందడానికి మానవుడు చేయగలిగిన ప్రతి పరిశోధనను మనం చేసేటంత వరకు ఆ ఒప్పుదల జరగడానికి వీలులేదు.

—సేవాగ్రాం, 21-8-1939

—హరిజన్, 26-8-1938

# 190

# రెండింటిమీదా చెరొక చేయి!

శ్రీ అప్పా పట్వర్ధన్ ఇలా వ్రాస్తున్నాడు:

"నేత పనివారికి సహాయం చేసేటందుకు బొంబాయి ప్రభుత్వం చాలా సొమ్ము వెచ్చిస్తూన్నది. ప్రభుత్వంవారు ఒక మార్కెటింగు ఉద్యోగినీ, అమ్మేటందుకు మరొక ఉద్యోగినీ నియమించారు. వారు అప్పులిస్తున్నారు. అయినప్పటికీ నేతపనివారు మిల్లులతో పోటీ చేయలేకుండా ఉన్నారు. ఈ అయిన ఖర్చులు వల్ల ప్రదంగావని నా అభిప్రాయం. పైగా నేసేవారు విదేశీ నూలును కూడా వాడుతూన్నారు. ఈ నిష్ప్రయోజక సహాయానికి తోడు, ఖాదీకికూడా ప్రభుత్వంవారు కొంత సహాయం చేస్తున్నారు. ఇలా రెండింటిమీదా చెరొకచేయి వేయడం ఎంతవరకు సమర్థనీయము?"

విదేశీ మిల్లు నూలును కాని, లేక భారతీయ మిల్లునూలునే కాని ఉపయోగించే నేత పనివారికి సహాయం చేయడం, డబ్బు దండుగ శ్రమ దండుగ అని నే నెప్పుడూ అభిప్రాయ పడుతూనే ఉన్నాను. నా అభిప్రాయాన్ని అనుభవం మార్చలేదు. కొన్ని రాష్ట్రాలలో కాంగ్రెసు పరిపాలన చేస్తూన్నమాత్రాన అది మారదు. మిల్లునూలు నేసేమనిషి యెంతో కొంతకాలమునకు కనబడకుండా పోవలసిందే. అదే నాపై అభిప్రాయానికి కారణం. సహజంగా కనిపిస్తూన్న విషయాలనుబట్టి మరొకతీరుగా ఉండడానికి వీలులేదు. నూలు వడకడం సార్వజనీనం అయ్యేటట్లు పునరుద్ధరింపబడడంలో మాత్రమే నేత పనివారి శ్రేయస్సు ఉన్నది. చేతితో నూలు వడకడం, చేతితో నేయడం ఈ రెండూ ఒక దానిపైన ఒకటి ఆధారపడి ఉన్నవి. మిల్లులో వడకడం, చేతితో నేయడం మాత్రమెన్నడూ అలా లేవు. కనుకనే, నేసేవారు వడ

కనివార్రైతేనూ నేసేవారి అవసరములను వడికేవారు తత్క్షణం తీర్చ లేకపోయినట్లయితేనూ, తమ కుటుంబాలలోనే ఏకడం వడకడం వగైరా పనులను చేసుకొనేటట్లు నేత పనివారిని ప్రోత్సహించవలెనని నేను సూచించి ఉన్నాను. ఇప్పుడనేక రాష్ట్రాలలో కాంగ్రెసు పరిపాలన చేస్తూన్నది. నేత పని వానిని రక్షించడం ఇప్పుడెకువ సుకరమయింది. కాబట్టి ప్రభుత్వంవారు వడుకు పనిని పెద్ద యెత్తున ప్రోత్సహించవచ్చును. ప్రభుత్వం విదేశీ రైల్వే కంపెనిల నష్టానికి హామీ యిస్తూన్నట్లుగానే, ఖాదీ అమ్మకాలలోవచ్చే నష్టానికి హామీ యీయవచ్చును. పని కావలసినవారికి తన ఇష్టంవచ్చిన పనిని హామీ ఈయడం ప్రభుత్వముయొక్క ప్రధానకర్తవ్యం. నేతపనివారుకూడా ఇందులో చేరుతారు. నేసే ప్రతి మనిషికీ నేతపని హామీ ఈయడం పరివర్తనకాలంలో ప్రభుత్వానికీ సాధ్యం కాని యెడల, వ్యక్తికీ ప్రభుత్వానికీకూడా లాభప్రదంగా ఉండే మఱియొక వృత్తిని ప్రభుత్వమతనికి చూపవలసి ఉంది. నూలు వడకడానికిగల అవకాశములను గూర్చి యే ప్రభుత్వమూ ఇంతవరకు అన్వేషించి ఉండలేదనే సంగతి జ్ఞాపకం ఉంచుకోవాలి. అటువంటి పరిశోధనవలన ఆశ్చర్యకరమైనట్టివిన్నీ, ప్రోత్సాహకరమైనట్టివిన్నీ ఫలితములు బయటపడగలవని నా అభిప్రాయం. మిల్లులనుగూర్చి ఆలోచనలోనే పెట్టకూడదని నిశ్చయంగా నా వాదం. దేశీయ పరిశ్రమకుగాని విదేశీ పరిశ్రమకుగాని నిరుద్యోగ సమస్యను ఎక్కువచేసి సమాజక్షేమానికి హాని కలిగించే అవకాశమీయ కూడదు.

—సిమ్లాకు పోయే రైలులో, 3-9-1939

—హరిజన్, 9-9-1939

# 191

# స్త్రీలవల్ల స్వరాజ్యం

శాసనోల్లంఘనమునకు నూలు వడకడం ఒక అనుల్లంఘనీయమైన షరతుగా వర్కింగుకమిటీవారిప్పుడా మోదించారు. కనుక దేశానికి సేవచేయడానికి భారత దేశ స్త్రీలకెప్పుడూ రాని అవకాశమిప్పుడు వచ్చింది. ఉప్పు సత్యాగ్రహం లక్షలాది స్త్రీలను అంతఃపురాలనుండి తీసుకొనివచ్చి, పురుషులతోపాటు సమాన ప్రతిపత్తితో వారుకూడా దేశసేవ చేయగలరని నిరూపించింది. ఇంతకుపూర్వమెన్నడూ అనుభవించని గౌరవాన్ని గ్రామీణ స్త్రీలకా ఉద్యమం ప్రసాదించింది. సామ్రాజ్య బంధనములనుండి మోక్షం పొందేటందు కుద్దేశింపబడిన భారత దేశపు శాంతి ఉద్యమంలో నూలు వడకడం దాని ప్రధాన స్థానంలో పునః ప్రతిష్ఠింపబడినందున భారత స్త్రీలకొక ప్రత్యేక గౌరవం లభించింది. నూలు వడకడంలో పురుషులను మించిన నైపుణ్యం స్త్రీలకు సహజంగా ఉంటుంది

ఆదికాలంనుండీ స్త్రీలు పురుషులు చేయవలసిన పనులు వేరువేరుగానే ఉంటూవచ్చినవి. పడుం నేశాడు; ఈవ్ వడికింది. ఈ భేదం ఈ నాటికీ అలాగే వస్తూన్నది. వడికే పురుషులు అరుదుగా ఉంటారు. 1920-21 లో పంజాబులోని పురుషులను నేను వడకవలసిందని కోరాను. వడకడం పురుషులకు గౌరవహీనమనీ, అది కేవలం స్త్రీలు చేసే పని అనీ వారన్నారు. ఈనాడది గౌరవహీనమనే కారణంమీద పురుషులభ్యంతరం చెప్పడం లేదు. త్యాగ

బుద్ధితో వడికేవారు వేలకొలదీ ఉన్నారు. దేశభక్తి కారణంగా పురుషులు వడుకుపని చేపట్టిన తరువాతనే అది ఒక శాస్త్రంగా పరిణతిపొందింది తదితర రంగాలలోవలెనే దానిలోకూడా పెద్దపెద్ద నూతన విషయాలు కనిపెట్టబడినవి. అయినప్పటికీ అనుభవంవలన నూలు వడకడం స్త్రీల ప్రత్యేకతగా కనిపిస్తూన్నది. ఈ అనుభవానికి వెనుక మంచి కారణమున్నదని నా నమ్మకం. నూలు వడకడం తక్కిన పనులకంటె ఎక్కువ నెమ్మదిగానూ మౌనంగానూ చేయవలసిన పని. స్త్రీ త్యాగస్వరూపిణి. కనుక మూర్తీభవించిన అహింస. కాబట్టి ఆమె పనులు యుద్ధంకంటె శాంతికే ఎక్కువ అనుగుణంగా ఉంటవి. దౌర్జన్యయుతమైన యుద్ధంలోకి ఆమె యిప్పుడు బలవంతంగా ఈడ్వబడుతూండడం ఆధునిక సభ్యతకు కీర్తిప్రదంకాదు. స్త్రీకి హింస అంటే ఏవగింపనీ అందువలన తన ప్రధాన లక్షణాతిక్రమణకు ప్రతికూలంగా కొద్దికాలంలోనే ఆమె తిరుగుబాటు చేస్తుందనీ నా దృఢవిశ్వాసం. పురుషుడు కూడా తన తప్పును గూర్చి తరువాత పశ్చాత్తాప పడతాడని నా అభిప్రాయం. స్త్రీపురుషులు సమాన ప్రతిపత్తి గలవారన్నంతమాత్రాన వారి వృత్తులు సమానంగా ఉండవలెనని అర్థంకాదు. స్త్రీ వేటాడకూడదనిగానీ, బల్లెం పట్టుకూడదనికానీ శాసనం లేకపోవచ్చును. కాని పురుషునికి ఏర్పడ్డ పనిచేయడమంటే ఆమె సహజంగా కంపిస్తుంది. ప్రకృతి స్త్రీపురుషులను పరస్పర పూర్ణత్వంకొఱకు సృజించింది. వారి రూపములవలెనే వారి పనులుకూడా ప్రత్యేకించబడినవి.

స్త్రీపురుషుల ప్రత్యేక ధర్మాలను గూర్చిన రుజువు నా పనికి అవసరం. నిజమేమిటంటే కనీసం ఇండియాలో లక్షలాది స్త్రీలు నూలువడకడం తమ సహజవృత్తిగా భావిస్తారు. వర్కింగు కమిటీవారి తీర్మానం పురుషులనుండి బాధ్యతను తక్షణం తొలగించి స్త్రీలమీద వేసినందున స్త్రీల శక్తిని చూపించేటందుకు తగిన అవకాశం కల్పించింది. నా భావి సైన్యంలో పురుషులకంటె స్త్రీలకే విస్తారమైన ఆధిక్యత ఉండడం నాకిష్టం. పోరాటమే వచ్చినట్లయితే, పురుషులు అధికంగా ఉన్నప్పటికంటె స్త్రీలు అధికంగా ఉన్నప్పుడే, నేనింకా ఎక్కువ విశ్వాసంతో దానిని సమీపించగలను. పురుషుల దౌర్జన్యం అంటే నాకు భయం. అటువంటి అఘాయిత్యం జరుగకుండా స్త్రీలే నాకు హామీగా ఉంటారు.

—సేవాగ్రాం, 27-11-1939

—హరిజన్, 2-12-1939

---

# 192

## దాని భావం

భారతదేశం స్వాతంత్ర్యం పొందగలగడం కానీ అది సుస్థిరం కాగలగడం కానీ అహింసామూలకంగా మాత్రమే జరుగగలదని విశ్వాసంకలవారు, సామాన్య ప్రజలు దేశ క్షేమం కోసం చైతన్యవంతులై ఉపయోగకరంగా పని చేస్తూన్నప్పుడే పెద్దయెత్తున అహింస ఆచరింపబడగలదని కూడా విశ్వాసం కలిగిఉండే మాట నిశ్చయం. పేర్కొన దగిన పెట్టుబడితో అవసరం లేక అందరూ తేలికగా చేయ గలిగినట్టిన్నీ మానసిక సంక్షోభాన్ని ఉపశమింపచేయ గలిగినట్లు తలంపబడేదిన్నీ అయిన ఆ ఒక్క పనీ యేమిటి? నిస్సందేహంగా నూలువడకడం, దానికి ముందు కావలసిన పనులు పైగా అది స్వతస్సిద్ధమైన దేశీయ పరిశ్రమ. లక్ష లాది ప్రజలు దానిని తేలికగా నేర్చుకోగలరు. పైగా దాని ఉత్పత్తి ఎప్పుడూ చలామణిలో ఉన్న ద్రవ్యంలాంటిది. మిల్లులు లేకుండా ఉన్నట్లయితే నేతికి ఎంత విలువ ఉండేదో నూలుకు అంత విలువ ఉండేది. నూలు కరువు ప్రధాన ద్రవ్యముల కొలువుగా ఎంచబడుతుంది. ప్రజకు పట్టుదల ఉంటే ఎక్కువ కష్టం లేకుండా తమ నూలును తాము ఉత్పత్తిచేసుకోగలరు. యుద్ధము ఒక సంప్రదా యంగా భావింపబడుతూన్న యూరపు రాజ్యాలలో వయస్సువచ్చిన పురుషులు కొన్ని సంవత్సరములవరకూ యుద్ధకార్యములను నిర్వహించేటందుకు నిర్బంధంగా చేర్చుకోబడుతూన్నారు. యుద్ధ ప్రయత్నంలేకుండా తనను తాను రక్షించుకొంటూ, తన జీవితాన్ని క్రమబద్ధం

చేసుకోతలపెట్టిన దేశంలో ఫలప్రదమైన జాతీయ సేవకు కూడా అలాగే ప్రజలు నిర్బంధంగా చేర్చుకోబడాలి. కేంద్రీకరింపబడిన పరిశ్రమద్వారా దేశమునకు కావలసిన ప్రధాన వస్తువులు ఉత్పత్తిచేయబడేయెడల, పెట్టుబడిదారు తన ధనాగారములను కాపాడుకొంటూన్నట్లుగా, దేశం వాటిని కాపాడుకోవడం అవసరం. అహింసమీద ఆధారపడిఉన్న సంస్కృతిగల దేశం, ప్రతి గృహాన్నీ స్వయం సమృద్ధిగా చేసుకోవడం ఆవశ్యకం. భారతీయ సమాజం, తెలియకుండానే ఒకప్పుడు అహింస పునాదిగా నిర్మింపబడినది. గృహజీవితం అనగా గ్రామం అప్పుడప్పుడూ అడవిగుంపులు వచ్చిపోతూ ఉండినా బెదరిపోకుండా అలాగే ఉన్నది. భారతీయ గ్రామాలు, ప్రజాస్వామ్య రాజ్యాల గుంపులని మేన్ నిరూపించాడు. వాటిలో ఆర్యా! భవతి! అని పిలవబడేవారు లేరు! లేక అందరూ అలా అనిపించుకో తగినవారే. కాంగ్రెసువాదులచే ఈ వాదము అంగీకరింపబడిననేతప్ప, ప్రలోభనములకు తావులేకుండా ఉన్నట్టిన్నీ, ఎన్ని తీవ్ర ప్రతికూల భావములు ఉన్నప్పటికీ నిజానికి నిలబడగలిగినట్టిన్నీ అహింసను స్థాపించడం అసంభవమని నా అభిప్రాయం. అట్టి అహింస లేనిదే వెనుకంజకానీ, అపజయంకానీ ఉండని పోరాటాన్ని సాగించడం, దేశానికి సాధ్యంకాదు. అంతేకాదు, కాంగ్రెసు ఎన్నటికీ, బ్రిటిష్ వారికిగానీ ప్రపంచానికిగానీ తన అహింసా ఉద్దేశాన్ని రుజువుచేయజాలదు. కాంగ్రెసు అహింస, ఒకరి పరి

పాలకుల నుద్దేశించియేకాక, ఈ మహా సంస్థను గూర్చి భయపడేవారిని, అవిశ్వాసంతో ఉండేవారిని, నిరసించే వారి నుద్దేశించికూడా అవలంబింపబడుతుంది. విశాల మైన ఇటువంటి అహింసలోపించడమే సాంఘిక ఐకమత్యం విషయంలో మనం అపజయం పొందుతూన్న కారణమని నా అభిప్రాయం. తమలో తాము వ్యవహరించుకోవడంలో కూడా కాంగ్రెసు వాదులు సజీవమయిన అహింసను ప్రదర్శింపలేదన్న మాట వాస్తవం. మన ఖాదీ కార్య క్రమంలో కలుగుతూన్న లోపమునుబట్టియే అహింసలోని లోపమును లెక్కకట్టవచ్చునన్నే నా అచంచల విశ్వాసమును అరికట్టలేకుండా ఉన్నాను. ఈ రెండింటిలో దేనిలోను కూడా మనకు సంపూర్ణ విశ్వాసం లేదు. రెండింటి లోనూ హృదయపూర్వక విశ్వాసం ఉండవలెనని నేను కోరుతున్నాను. అప్పుడు కాంగ్రెసు అప్రతిహతమైన సంస్థయై, భారత స్వాతంత్ర్య సంపాదనకోసం శాసనో ల్లంఘనమనే అగ్నిజ్వాలలో ఉరకవలసిన అవసరంలేకుండా పోవడంకూడా చాలావరకు సంభవం.

ఈ పునాదితో, ఖాదీని గూర్చిన అన్ని సందర్భాలనూ జాగరూకతతో పరిశీలించిన కొలదిమంది ఖాదీ ప్రవీణులలో ఒకరగు శ్రీ కృష్ణదాసు గాంధీ నా కొఱకు తయారుచేసి పెట్టిన (812, 813 పుటలలో ముద్రితమైన) పట్టీని కాంగ్రెసు వాదులు శ్రద్ధగా పరికింతురుగాక. ఖాదీ ప్రియులా అంకెలు ఉత్సాహకరంగా పరిశీలనచేయతగినవి. అవి కృష్ణదాసు

అనుభవంమీద ఆధారపడి తాత్కాలికంగా తయారుచేయ బడినవి. నాసిరకపు పత్తివిషయంలో అవి మారుతూ ఉంటవి. కాని అవి ఆచరణయోగ్యమయిన మంచి సూచికగా పనికివస్తవి. పట్టీ అంతా పరిశీలించడానికి తగిన శ్రద్ధ తీసుకోజాలనివారు 14 నంబరును మాత్రం చూస్తే చాలును. సొంతంగా నూలు వడుకుకొనే మనిషి యొక్క ఖాదీ, అతనికి చదరపు గజం 1 కి మూడణాలకంటె తక్కువ ఖరీదుకు గిట్టుబాటవుతూన్నట్లు అర్థమవుతుంది. ప్రతి కాంగ్రెసువాదీ కనీసం రోజుకు అరగంట అయినా వడకవలెనని నేనుద్దేశించాను. కొత్తగా వడకడం నేర్చుకొన్న మనిషికూడా 30 నిమిషాలలో నూరు గజాల నూలు తేలికగా వడకగలడు. చాలామంది ఆ దేకాలంలో తేలికగా 200 గజాలు వడకగలరు. సొంతంగా వడికే మనిషికి సంవత్సరానికి 20 గజాల బట్ట కావలసిఉన్నట్లయితే ఆయన రోజుకు ఒక గంటకంటె ఎక్కువకాలం ఏ సందర్భం లోనూ వడకనక్కరలేదు. మనిషికి 20 గజాలచొప్పున ఇండియాలో నున్నవారందరికీ బట్ట సరఫరా చేసేటందుకు కావలసిన నూలుకు, మన దేశంలోని జనసంఖ్యలో ఐదవ వంతు ప్రజ రోజుకు ఐదు గంటల వంతున వడకవలసి ఉంటుంది. మనిషి 1 కి కావలసిన నూలు ప్రస్తుతం సగటున 15 గజాలని తెలుస్తూన్నది. ఇంకా ఎక్కువ సామర్థ్యంతో వడికితే, వడికే గంటలు ఇంకా చాలావరకు తగ్గించడానికి వీలుంది. ఇటువంటి వికేంద్రీకరణ ఉత్పత్తికి

సాధ్యమయినంత తక్కువ శ్రమ, తక్కువ ఖర్చు కావలసి వస్తుంది. ఆధునిక కాలంలో ఎప్పుడూ ఎక్కడా కనపడని పెద్ద యెత్తున జరిగే ఐచ్ఛిక సహకారమని అర్థం దీనికి. అవసరమైన శ్రద్ధవహిస్తే ఈ ప్రణాళిక పూర్తిగా సాధ్యమవుతుంది. ప్రతి కాంగ్రెసువాదీ తెలివిగా తన సాధ్యమైనంత నూలు వడికేటందుకు గట్టి కృషిచేసి, తన ఇరుగుపొరుగు వారిలో ఖాదీ అమ్మకాలను యేర్పాటుచేయవలెనని నా తలంపు; ఆయన ఈ పని, భారతదేశ స్వాతంత్ర్య సన్నాహంలో తానుకూడా తగినట్లు పాల్గొంటున్నాననే నమ్మకంతో చేయాలి.

సేవాగ్రాం, 4-12-1939
హరిజన్, 9-12-1939

# ఖాదీ అంకెలు

చదరపు గజం 1 కి.

| నంబరు. | అంగుళానికి పోగులు. | నూరు గజాల నూలుకు బట్ట (చదరపు గజాలలో.) | రోజుకు నూరు గజాల నూలు వంతున 360 రోజులకు (బట్ట చ॥ గజాలలో.) | నూలు గజాలు. | చిలపలు. | తులాలలో బరువు. | పత్తి. | | ఏకులు. | | వడుకుట. | | నేత. | | ఖరీదు. చలవచేయని బట్ట | | ఖరీదు. స్వాంతంగా వడికిన బట్ట. | | ఖరీదు. స్వాంతంగా ఏకి స్వాంతంగా వడికిన బట్ట. | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | | | అ. | పై. | అ. | పై. | అ. | పై. | అ. | పై. | అ. | పై. | అ. | పై. | అ. | పై. |
| 10 | 38 | $\frac{1}{30}$ | 12 | 3,040 | $3\frac{9}{16}$ | $14\frac{1}{2}$ | 1 | $10\frac{1}{2}$ | 0 | $8\frac{1}{2}$ | 2 | 6 | 1 | 5 | 6 | 6 | 4 | 0 | 3 | $3\frac{1}{2}$ |
| 12 | 40 | $\frac{1}{32}$ | $11\frac{1}{4}$ | 3,200 | $3\frac{3}{4}$ | $12\frac{1}{2}$ | 1 | $6\frac{3}{4}$ | 0 | $7\frac{1}{2}$ | 2 | 10 | 1 | 6 | 6 | $6\frac{1}{4}$ | 3 | $8\frac{1}{4}$ | 3 | $0\frac{3}{4}$ |
| 14 | 42 | $\frac{1}{34}$ | $10\frac{1}{2}$ | 3,360 | $3\frac{15}{16}$ | $11\frac{1}{4}$ | 1 | 5 | 0 | $6\frac{3}{4}$ | 3 | 1 | 1 | $6\frac{1}{2}$ | 6 | $7\frac{1}{4}$ | 3 | $6\frac{1}{4}$ | 2 | $11\frac{1}{2}$ |
| 16 | 45 | 1 | 10 | 3,600 | $4\frac{1}{4}$ | $10\frac{5}{8}$ | 1 | 4 | 0 | 6 | 3 | $5\frac{1}{2}$ | 1 | 8 | 6 | $11\frac{1}{2}$ | 3 | 6 | 3 | 0 |
| 20 | 50 | $\frac{1}{40}$ | 9 | 4,000 | $4\frac{11}{16}$ | $9\frac{3}{8}$ | *1 | 5 | 0 | $8\frac{1}{2}$ | 3 | 9 | 1 | 10 | 7 | 9 | 3 | $11\frac{1}{2}$ | 3 | 3 |

* ఎక్కువ నాణ్యముగల పత్తిని బట్టి అంచనా వేయబడినది.

పరా.—(1) 8 మొదలు 20 వ నంబరువరకూ బట్టకు సాధారణంగా కావలసినవన్నీ సరిగా ఉన్నప్పుడు ఈ రెండు అంకెలకూ దూరంగా ఉండే 12 నెంబరు తీసుకొని దానిని బట్టి ఈ కింది అంచనాలు వేయబడినవి.

(2) త్యాగంగా వడికి నూలుతో నేయబడిన—ప్రతి చదరపు గజం బట్ట అ. 3 8½ పై.

(3) రోజుకు నూరు గజాల వంతున వడకబడుతూన్న ఈ నూలుతో సంవత్సరానికి $11\frac{1}{4}$ చదరపు గజాల బట్ట ఉత్పత్తి అవుతుంది. అనగా సంవత్సరానికి అతనికి కావలసినది 15 చ. గ. లని లెక్క వేస్తే అదులో $\frac{3}{4}$ అని అర్థం.

(4) పిల్లలు, అశక్తులు, ఇంకా ఇతరవిధంగా పనికిరానివారు వీరందరినీ తీసివేస్తే మొత్తం జనసంఖ్యలో వడకడానికి తగిన శరీరబలం గలవారు నూటికి 40 మంది ఉంటారని నిర్భయంగా అనుకోవచ్చును. (ఇదికూడా ఇంకా మితంగా వేసిన అంచనాయే. సరియైన అంకె నూటికి 40 కంటె 60 కి దగ్గరగా ఉంటుంది.) కాబట్టి $\frac{2}{5}\times\frac{3}{4}=\frac{3}{10}$ లేక కావలసిన మొత్తం బట్టలో మూడవ వంతుకు దగ్గరగా, స్వయంగా వడకడంవలన ఉత్పత్తి అవుతుంది. తక్కిన $\frac{2}{3}$ వంతు, మజూరీతో వడకబడిన నూలుతో పూర్తి చేసుకోవాలి. కాబట్టి ఒక చదరపు గజం ఖాదీ ఖరీదు దాదాపు 5 అ. 8 పై. అవుతుంది.

కృష్ణదాసు గాంధీ

## 193

## 'స్వరాజ్యంకోసం వడకండి'

కొంతమంది బాల బాలిక భీమధ్య నాకడకువచ్చి నా సంతకం (Autograph) ఈయమని కోరారు. దానితో పాటు ఏదో ఒక సందేశంకూడా ఈయమన్నారు. వారందరికీ ఈ సందేశ మిచ్చాను: 'స్వరాజ్యం కోసం వడకండి' అని. ప్రస్తుతం నా మెదడులో వడకడము, స్వరాజ్యమూ తప్ప ఇంకేదీ లేకపోవడమే అందుకు కారణం. ఏదో ఒక కాపీ పుస్తకం సిద్ధాంతానికి బదులుగా, కొంత సృజించమనీ అందులోనూ సారంలేని వడుకు పని చేయ వలసిందనీ, ఈ యబడిన సందేశంవలన నన్ను చూడవచ్చిన యువతీ యువకులు విచారపడతారని నే ననుకొన్నాను. కాని నేను వారిని కనుగొనగా వారు వడుకుతామని అన్నారు. ప్రజలు చక్రాలు వగైరాలకొఱకు అడుగుతున్నారని శ్రీ సీతారామశాస్త్రి నాతో అన్నారు మఱొక స్నేహితుడు—ఒక జైలు వత్తీ, వడుకు పనికీ, ఖాదీని సార్వ జనీనంగా చేసేటందుకు ఒక సంవత్సరం స్పష్టంగా ప్రత్యేకించవలెనని నాకు సలహా యిస్తూన్నారు. అయితే అందుకు గట్టిగా ప్రతికూలంగా ఒక బొంబాయి న్యాయవాది ఈ దిగువ ఉత్తరం వ్రాస్తున్నారు:

"'మీరు నన్ను చూచి నవ్వకుండా ఉంటే, ఇది సార్వ జనీనమైన వడుకు కార్యక్రమమని నేను నిస్సందేహంగా చెప్పగలను.' ఈ మాటలలో మీరు యు.పి. కాంగ్రెసు వాదుల కుపన్యాస మిచ్చారు. వారిలో కొందరు 'చరఖానుగూర్చి, అహింసనుగూర్చి నవ్విన వారున్నారు' అని

మీరే అన్నారు. కాని ' మీకే మిక్కిలి ఆశ్చర్యం కలిగించేటట్లు ఈ రెండింటినీ వారు సరిపెట్టుకొన్నారు ' ఇది మీకు విభ్రమం కలుగ చేస్తూన్నది.

పైన ఉదాహరింపబడిన యు.పి. కాంగ్రెసువాదుల పక్షాన మాట్లాడు తూన్నట్లు నన్ను భావించనక్కరలేదు. కాని చాలామంది కాంగ్రెసు వాదులు ' లక్షలాది ప్రజలు, అహింసాతత్వంతో వడికినట్లయితే, బహుశా శాసనోల్లంఘనముయొక్క అవసరమే ఉండదు ' అని మీరు చేస్తూన్న ప్రకటనలవంటి ప్రకటనలనూ, అందులో అహింస త్రికరణశుద్ధిగా ఆచరింప బడవలెనని మీరు నొక్కి వక్కాణిస్తూన్న విషయమునూ, ముఖ్యంగా అది అసాధ్యమని వారికి తెలిసి ఉండి, దానికి మూలపురుషులైన మీరుకూడా ఇంకా ఆ స్థితిని పొందలేదని మీరే ఒప్పుకొంటూన్నప్పుడు, ఎందుకు తీవ్రంగా ఎదిరించడంలేదో నేను మీకు చెప్పవలసి ఉంది. దానికి ఈ ఒక్కటే చిన్న కారణం. మీరు కాంగ్రెసుయొక్క శక్తికి చిహ్నముగా పరిణమించారు సామాన్య జనులందరికీ ' గాంధీ— కాంగ్రెసు ' అనే మాటలు రెండూ ఒక్కటే. కాబట్టి స్వాతంత్ర్య పోరాటముయొక్క ఈ ఘట్టంలో కాంగ్రెసు వాదులెవ్వరూ అంత శక్తివంతమయిన ఆయుధాన్ని కోల్పోవడానికి సంసిద్ధం గాలేరు. కాంగ్రెసులోనుండి గాంధీని తీసివేస్తే, దానికీ పూర్వమున్న శక్తిలో సగం శక్తికూడా ఉండదు ఈ సంగతి అందరూ గుర్తించారు. అందు వలన వారు బుద్ధిపూర్వకంగా మీరు కాంగ్రెసునుండి తొలిపోవలెనని కోరరు. కాని మీరు అంటూన్నట్లు ' విశ్వాసంలేని విధేయత 'కైనా వారు ఒప్పుకొంటారు. ఇది ప్రాథమిక కారణమన్న మాట నిజం. ఇక కాంగ్రెసు యంత్రంలో చక్రాలలో చక్రాలున్నవి. ' దక్షిణ పక్షీయులు ' ' వామ పక్షీయులు ' ఉన్నారు. ఇంకా అనేక రకాల అభిప్రాయాలు కలవారున్నారు. ' దక్షిణ పక్షీయుల 'కు ' వామ పక్షీయుల 'ను చూచినా వారి సోషలిస్టు సిద్ధాంతాలను చూచినా తగని భయం. వారికి మీ పేరులో ఉన్న శక్తి తెలుసును. ప్రజా సామాన్య మునకు సన్నిహితమైన వామ పక్షీయుల ఆర్థిక విధానమునకు ప్రతిగా మీ పేరును పూర్తిగా ఉపయోగించుకొంటూన్నారు. మిల్లు యజమానులు ఖాదీని బలపరచడం చూచినప్పుడు, వట్టి మామూలు మనుష్యులు తమ స్వప్రయోజనాలకు ప్రతికూలంగా తామే వ్యవహరిస్తూన్నట్లు కనపడే వింత దృశ్యాన్ని మేము ప్రత్యక్షంగా చూస్తూన్నాము. ఎందువల్ల ? మీ ప్రేమ పాత్రుడైన ఒకానొక సుప్రసిద్ధ ఆర్థికవేత్త మీరు పెట్టుబడిదారుల

తుది ఆశ అనీ నాతో అన్నాడు. ప్రజా సామాన్యమునకు ఖాదీ యెన్నడూ తగినంత చౌక కాదనీ అందువలన తమ ప్రయోజనాలకేమీ హాని కలుగదనీ వారికి బాగా తెలుసును. పైగా మీ ఖాదీకేమీ 'అహింసా' సిద్ధాంతాలకు మాటలతో ఉపకారం చేస్తూన్నట్లు కనిపించి తమ కార్మికులతో వ్యవహరించేటప్పుడు మీ 'ధర్మకర్తృత్వ' సిద్ధాంతాన్ని ఉపయోగించి, అహమ్మదాబాదు పద్ధతుల్మీద నడిచే కార్మిక సంఘాలను తప్ప తక్కిన మామూలు కార్మిక సంఘాలు (Trade Unions) నడవడం అసంభవం కావించగలరు. పెట్టుబడిదారులు, భూస్వాములు సంస్థానాధిపతులు (అందరూ కాదు) తమకు అనుకూలించినంతవఱకు, 'అహింస' 'సత్యం' అనే మాటలను స్వేచ్ఛగా ప్రయోగిస్తూంటారు. ఇక 'వామ పక్షీయులు,' దక్షిణ పక్షీయులకు వారెంతమాత్రమూ తీసిపోరు. వారికి కూడా, ప్రజలను సమీపించడానికి మీ పేరు కావాలి. అందువల్ల వారు కాంగ్రెసు చుట్టూ మూగుతున్నారు. అహింసను రాజనీతిగా వారు ఒప్పుకోరు. కాని కేవలం మిమ్మలను మంచి మాట చేసుకోవడానికి, దానికి ఒప్పుకొన్నామనికూడా వారనవచ్చును. మీ సిద్ధాంతాన్ని నిజంగా అంటి పట్టుకొని ఉన్న కాంగ్రెసు వాదులు చాలామంది ఉండవచ్చుననే విషయం నేను కాదనను. కాని అత్యధిక సంఖ్యాకులు స్వార్థపరులు.

కాంగ్రెసు వాదులను మీ రెఱిగి ఉన్నదానికంటె నే నెక్కువగా ఎఱిగి ఉన్నానని చెప్పే ధైర్యం నాకు లేదు. 'సేవాగ్రామంలో బిగిసిపోయి నందున ప్రజలతో ప్రత్యక్ష సంబంధం' మీకు కలగడంలేదని మీరు చెప్పిన మాటే నిజంకాకపోతే, మీరు చెప్పిన 'ఆశ్చర్యం' 'విభ్రమము' కంటె నాకెక్కువ విభ్రమం కలుగుతూన్నది. ప్రియమైన గాంధీజీ! మామూలు మనుష్యులనుగానీ, మామూలు మనుష్యులకంటెకూడా ఎక్కువ వారినిగానీ (కాంగ్రెసు వాదులుకూడా మనుష్యులే). ప్రేరేపించే ప్రాథమికోద్దేశాలను మీరు గమనించినంతమాత్రాన మీ 'ఆశ్చర్యమూ' 'విభ్రమమూ' సూర్యుని తీక్ష్ణ కిరణాలముందు ప్రాతస్తుషారమువలె అదృశ్యం కాగలవు."

ఈ విలేఖకుని వాద పటిమను నేను కాదనలేను. వంచకత్వం స్పష్టంగా కనిపిస్తూంటేతప్ప, లేనియెడల నాతో కలసి పనిచేసే వారిమాట చెప్పినది చెప్పినట్లుగా నా జీవితమంతా నమ్ముతూవచ్చాను. అందువలన నా కెప్పుడూ

నష్టం కలుగలేదు. పైగా మొట్టమొదట యథోచితంగా ఉన్నవారు చివరకు ఉత్సాహవంతులుగాకూడా అయినారు. మీ రెక్కువమంది స్త్రీ పురుషులతో వ్యవహరించవలసి వచ్చినప్పుడు అపనమ్మకంతో ప్రారంభించడం చెడుపద్ధతి

చర్ఖాకు సైతం నాకు డబ్బిస్తూన్న మిల్లు యజమానులు దాని పోటీకి తాము భయపడడం లేదని స్పష్టంగా నాతోనే అంటున్నారు. వారి అభిప్రాయ మేమిటో పైకే కనిపిస్తూన్నది. ఏమీ దాపరికం లేదు. చర్ఖా అర్థ శాస్త్రం చెడుదైతే, అది సహజంగా చచ్చిపోతుంది. కాని జాతికి పట్టుదల ఉంటే చిట్టచివరి మిల్లు మూతపడేనాటికికూడా చర్ఖా బ్రతికే ఉంటుంది. మిల్లుల పోటీలో ఖాదీ ప్రియమే. భారత దేశంలో లక్షలాది నిరుద్యోగులకు కొంత, లాభప్రదమైన పని చూపించడంవలన అది మిల్లు బట్టకంటె చౌక.

బొంబాయి న్యాయవాది చెప్పుతూన్నమాట నిజమే అయితే ప్రజలెందుకు నన్నుపట్టుకొని వదలరు? నేను, కాంగ్రెసు శక్తికి ప్రతినిధిగా ఎందుకు ఉంటాను? నేను నిష్కళంకమైన అహింసకు ప్రతినిధిననే స్పష్టమైన విషయము వలన ఈ ప్రశ్నకు ప్రత్యుత్తర మీయబడడం లేదా? మోస మెఱుగని సామాన్య ప్రజ నన్ను వారి స్నేహితుడుగా, మార్గ దర్శకుడు గా, సేవకుడు గా తెలియకుండానే స్వతస్సిద్ధంగా అంగీకరించారు. వారితోపాటు నేననిగానీ నాతోపాటు వారనిగానీ పరస్పరం అనుకోవడంలో ఎప్పుడూ కించిత్తుకూడా నష్టం కలుగలేదు. వారిని నావైపు కాకర్షించేటందుకు ఇక్కడగానీ దక్షిణ ఆఫ్రికాలోగానీ నేనెన్నడూ

ప్రయత్నం చేయలేదు. ఈ బంధమునకు కారణం నేను చెప్పజాలను. ఈ అద్భుత దృశ్యాన్ని నేను ప్రేమ శక్తికి ఆపాదిస్తూన్నాను.

చాలామంది పెట్టుబడిదారులు నాతో స్నేహంగా ఉంటారనీ, నన్ను చూచి భయపడరనీ ఒప్పుకోవడం నాకు లజ్జాకరంగా ఉండదు. పురోగామియైన సోషలిస్టు కానీ లేక కమ్యూనిస్టు కానీ కోరేటంతవరకు కాకపోయినా, దాదాపుగా నైనా పెట్టుబడి దారీ విధానాన్ని నేను నశింపచేయ కోరుతున్నానని వారికి తెలుసును. కాని మా విధానాలు, మా భాషలూ భేదంగా ఉంటవి. నా 'ధర్మ కర్తృత్వ' సిద్ధాంతం తాత్కాలికపు యేర్పాటు కాదు. మర్మం అసలే కాదు. తక్కిన అన్ని సిద్ధాంతాలకంటెనూ ఆ సిద్ధాంతమే చిరకాలం నిలచి ఉంటుందని నా విశ్వాసం. దానికి వెనుక వేదాంతమూ, మతమూ అండగా ఉన్నవి. ఐశ్వర్యవంతులీ సిద్ధాంతానికి అనుగుణంగా వర్తించలేదన్న మాత్రాన అది తప్పని నిర్ణయం కాదు; భాగ్యవంతుల దౌర్బల్యాన్ని రుజువు చేస్తుందది. మఱొక సిద్ధాంతమేదీ అహింసకు అనుగుణంగా ఉండదు. అహింసా విధానంలో, తప్పు చేసినవాడు తన తప్పును దిద్దుకోకపోయినట్లయితే తన చావును తానే తెచ్చుకొంటాడు. ఎందువల్లనంటే, అహింసాపూర్వక సహాయ నిరాకరణంవలన ఆయన తప్పు ఆయన తెలుసుకొనేటట్లయినా చేయబడతాడు—లేదా ఆయన పూర్తిగా వెలియైనా వేయబడతాడు. కాబట్టి బుద్ధిమంతులైన సోషలిస్టులు కాని యితర వామ పక్షీయులు కాని, చర్య తీసుకోవలసిన సమయం వచ్చేసరికి వాకాటంకం కలిగిస్తారనడానికి వీలులేదు. నా పద్ధతి విజయం పొందితే పేదలున్నూ అట్టడుగున ఉన్న ప్రజానీక

మున్నూ సుఖంగా ఉంటారని వారికి తెలుసు. వారి విధానంతో కార్య రంగంలోకి దిగడానికి వారు సంసిద్ధంగా లేరు. వారు నా దేశభక్తినీ, ఋజువర్తనమునూ నమ్ముతూన్నంతవరకు వారు నాతో జోక్యం కల్పించుకోనంత దేశాభిమానం వారికున్నది.

అయినప్పటికీ కపటవర్తనమునుండి నన్ను నేను కాపాడుకోవాలి. చర్ఖాయే నాకు ఒరిపిడి రాయి. అస్పృశ్యతా నివారణ విషయంలో కాని, సాంఘిక ఐకమత్యం విషయంలో కాని, ఒకానొక కాంగ్రెసు వాది యెంతపని చేశాడని తెలుసుకోవడానికి తగిన పరీక్ష నాకడలేదు. కాని ఆయన యెంత వడికినదీ ఖాదీ ఒకానొక ప్రదేశంలో యెంతవరకు ప్రచారంలో నున్నదీ తేలికగా తెలుసుకోగలను. కాబట్టి ఒకట్రు ఖాదీ పనికోసం కొంతకాలం ప్రత్యేకించవలసిందని కోరిన సలహాను నేను పూర్తిగా మన్నించలేకపోయినాను. ఫలితమునుబట్టియే మొత్తం కృషినిగూర్చి నిర్ణయించ సూచిస్తూన్నాను. స్వయంగా వడుకుకొన్న ఖాదీని మిక్కిలి నిరుపేదలయిన గ్రామస్థులు సైతం ధరించగలరని లెక్కల అంచనాలను ఉదహరించి పూర్తిగా రుజువుచేశాను. కనీసపు పెట్టుబడితోనూ, ఏర్పాటు చేసేటందుకు తక్కువ శ్రమతోను, నూలు వడకడమున్నూ, దానికి లోబడి ఉన్న ఇతర కార్యక్రమాలున్నూ, అత్యధిక సంఖ్యాకులయిన గ్రామస్థుల చేతులలో పెట్టగలిగినంత ఎక్కువ డబ్బును ఇంకే యితర గ్రామ పరిశ్రమా పెట్టజాలదు.

ఇతర చిక్కులన్నీ తీరిపోయినప్పటికీ, భారతదేశమంతటా జయప్రదంగా ఖాదీపని జరుగుతూన్నట్లు నాకు స్పష్టంగా రుజువయితే నేతప్ప, ప్రత్యక్ష చర్య ప్రారంభించేటందుకు నాలో నాకుగానీ లేక వారిలో గానీ నాకు విశ్వాసం ఉండదని కాంగ్రెసు వాదులు తెలుసుకోవాలి. కాంగ్రెసు వాదులలో అత్యధిక సంఖ్యాకులు శ్రద్ధగా, వివేకంతో ఎడతెగని కృషి చేస్తేనేగాని యిది సాధ్యం కాదు. కాబట్టే "స్వరాజ్యం కోసం వడకండి" అని నేనంటున్నాను.

—సేవాగ్రాం, 11-12-1939

—హరిజన్, 16-12-1939

## 194

# రాటాలు — మిల్లులు

చర్ఖా, ఖాదీలను గూర్చిన ప్రతి విషయంతోనూ నేనీ పత్రికను నింపుతూండడంవలన కాంగ్రెసు వాదులు విసుగుచెందకూడదు. సంఘాలలో హృదయ శాంతి, ప్రతి యింటా రాటం యొక్క పునరుద్ధరణము, ఇవే నా రాజకీయాలు. రక్తపాత యుతమైన తిరుగుబాటుకు బదులుగా, ఈ ఉపాయాలద్వారా, రాజకీయ ఆర్థిక బంధములనుండి దేశమునకు మోక్షం సంపాదించగలమని అనుకోవడమే ఇందుకు కారణం.

దేశీయ మిల్లు బట్టనుగానీ విదేశీ మిల్లు బట్టనుగాని ఏ విధంగా తొలగించవలెనా అనేదే కాంగ్రెసు వాదుల యెదుటనున్న సమస్య. దేశీయ మిల్లు బట్ట ఖాదీ అంత మంచిదనీ, పైగా చౌక కావడంచేత అంతకంటె ఉత్తమమైనదనీ కూడా కాంగ్రెసు వర్గాలలో తఱచు విశ్వసింపబడుతూన్నది. కోట్లకొలదీకల శిల్పకారులకు సంబంధించినంత వరకు చౌక అనే సిద్ధాంతం తుత్తునియలు చేయబడింది. ఈ లక్షలాది ప్రజలకు మిల్లు నూలు, వడుకు నూలుకంటె ప్రియం. మొదటిదానికి, వారి మజూరీలను పోగొట్టుకోవడమని అర్థం. విదేశీ గోధుమలు చౌక అనే కారణంతో, గోధుమ పండించేవానిని తీసివేసినట్లయితే ఏమి జరుగుతుందో ఊహించండి.

గ్రామాలలో వడికేవారు నేసేవారు, త్వరగా పునరుద్ధరింపబడవలెనంటే, ప్రతి కాంగ్రెసు వాదీ వడకడంలోనూ నేయడంలోనూ ప్రవీణుడు కావాలి. నిరుపేదలయిన

గ్రామస్థులకు బోధిస్తూ మార్గదర్శకుడుగా ఉండగలగాలి. అతను ఖాదీ శాస్త్రజ్ఞుడుగా ఉండాలి. అతడు దేశ క్షేమంకోసం వడకాలి. త్యాగంగా వడికే నూలు తగినంత ఉన్నప్పుడుగానీ లేక వడికే మనిషికి 8 గంటలు కష్టపడి చేసిన పనికి గంటకు అణాకు బదులుగా, పాత కూలి ఒక దమ్మిడీ యిచ్చినప్పుడుగానీ ఖాదీ చౌక అవుతుందని నేను నిరూపించాను.

చరఖావల్లనూ, చేమగ్గంవల్లనూ దేశీయ మిల్లులు తొలగింపబడవలెననీ, తొలగింపబడగలవనీ కాంగ్రెసు వాది నమ్మితేనే తప్ప తగినంత శ్రమ, తెలివి వినియోగించడు.

కాంగ్రెసు వాదుల కీవిశ్వాసం ఉన్నట్లయితే అన్ని కాంగ్రెసు సంస్థలు సమర్థములైన వడుకు, నేత పాఠశాలలుగా తయారు కాగలవు. 1921 లో కాంగ్రెసు కార్యాలయాలు, అశ్రద్ధగా వడికిన నూలును సేకరించి ఎలాగో అది నేయించవలెనని అనుకోవడం నాకు జ్ఞాపకమున్నది. తీరా అది అంతా వట్టి వృథా అయి పోయింది. దానిని యేమి చేయాలో ఎవరికీ తెలియలేదు. బాగా వడికేటట్లు చేయడంకూడా ఎలాగో తెలియలేదు. ఇప్పటి పరిస్థితులు వేరుగా ఉన్నవి. అ.భా.చ.సం. ఈ విషయంలో ఎక్కువ జ్ఞానము, ఎక్కువ అనుభవమూ సంపాదించింది. కొంత సాహిత్యంకూడా ప్రచురించబడినది. గ్రామాలను సువ్యవస్థాపితములుగా చేసేటందుకు ప్రతి కాంగ్రెసు కార్యాలయము ఆదర్శప్రాయమైన వస్తు పరిశోధక గృహంగానూ, వడుకు, నేత నేర్పే శిక్షణాలయంగానూ ఉండవలెను. ఇక నేను సూచించినట్లుగా ఖాదీ కేంద్రంగా ఉండి, తక్కిన గ్రామ పరిశ్రమలు దానిచుట్టూ ఉండి తిరిగేటట్లు యేర్పాటు

చేయబడవలెను. ఈ తీరు పనికి ఎంత అమోఘమైన అవకాశమున్నదో కాంగ్రెసువాదులు ముందు కనుగొనగలరు. వేగంగానూ జయప్రదంగాను గ్రామ నిర్మాణ కార్య క్రమాన్ని సాగించ లేకపోవడం, కేవలం మానసిక అలసత్వమే కారణం. భారత దేశం అహింసా పద్ధతులమీద పరిణామం చెందవలెనంటే, అనేక విషయాలనది వికేంద్రీ కరణం చేయాలని నా సూచన. తగినంత బలం లేనిదే కేంద్రీకరణ విధానమును పోషించడంగానీ రక్షించడంకానీ జరుగనేరదు. ఎత్తుకొని పోయేటందుకేమీ ఉండని చిన్న కొంపలకు పోలీసు కావలా అక్కరలేదు. ధనవంతుల ప్రాసాదములకు మాత్రమే దోపిడీ జరుగకుండా గట్టి కావలా ఉండాలి. పెద్ద ఫ్యాక్టరీల విషయంలో కూడా అంతే. సైనిక నావిక విమాన దళములు కలిగి పెద్ద సైన్యాలతో ఉన్న పట్టణాల భారత దేశంకంటె, గ్రామ నిర్మాణంగల భారత దేశం, విదేశీ దండయాత్రలకు లోనయ్యే అపాయం తక్కువగా ఉంటుంది.

కాంగ్రెసు వాదులు చర్ఖాలోని భావమును, అంతరార్థములను గ్రహించినప్పుడు, వారొక్క క్షణంకూడా అలస్యం చేయకుండా, తామా పనికి తగిన అర్హతను పొందడానికి కృషిచేస్తారు. వారీపనికి కొత్త అనుకొందాము. అప్పుడు వారు ముఖ్యంగా తమ గ్రామాలలోను, తాలూకా జిల్లాల లోను ఉత్పత్తి అయిన పత్తిని సేకరించగలరు. వారు చేతి తోనే గింజలు తీయాలి. లేదా చవకో అయితే ఒక బల్ల మీద, కర్ర సహాయంతో గింజలు తీయాలి. వారా గింజలు దాచి ఉంచి తగినన్ని అయితే అమ్ముతారు. లేదా వారికి పశువులు ఉంటే పశువులకు పెడతారు. వారు, చిన్న

కమాను బద్దతో ఏకుతారు. అందువలన వారికేమీ ఖర్చు కాదు. ఒకటి వారు తయారు చేసుకోగలరు కూడా. ఇలా ఏకబడిన పత్తి, ఏకులుగా చేయబడాలి. వీటిని తక్లీ మీద వడక వచ్చును. ఈ పద్ధతులలో వారు కొంత ప్రవీణత సంపాదించిన పిమ్మట ఇంతకంటె తొందరగా చేయడానికి వీలైన పద్ధతులకు వారు పూనుకోవచ్చును. అప్పుడు ఖాదీ ఉపయోగమును గూర్చి వారున్నూ వారి కుటుంబాలున్నూ సరియైన త్రోవలో పడగలరు. ప్రతి రోజూ వారు తమ పని అభివృద్ధిని గూర్చిన లెక్కలు ఉంచుకొని, నూలుకు సంబంధించిన గణిత శాస్త్రమును వారు నేర్చుకోవచ్చును.

స్థానిక అ.భా.చ.సం. సహాయంతో కాంగ్రెసు కమిటీలు తమ కార్యాలయములను పునర్నిర్మాణం చేసుకొని వాటిని, వడుకు నేత కార్ఖానాలుగా మార్చివేయాలి. తమ నూలును, నేసేటందుకు దూరంగా ఉన్న కార్ఖానాలకు పంపే వినాశకరమైన ప్రమాదమునకు లోను కావలదని నేను కాంగ్రెసు వాదులను హెచ్చరించవలసి ఉంది పత్తి పండించడం మొదలుకొని, ఖాదీ ఉత్పత్తిచేసి, దానిని విక్రయించేటంతవఱకూ గల అన్ని కార్యక్రమాలూ, సాధ్యమైనంతవఱకు, ఒకే గ్రామంలో కానీ, లేక ఒకే కేంద్రంలో కానీ జరుపబడవలెనని ఖాదీ అర్థ శాస్త్రం బోధిస్తూన్నది. కాబట్టి పంజాబులో నూలు వడికి బొంబాయిలో నేసి అలా తయారైన ఖాదీని మలబారులో అమ్మడం తప్పు. ఖాదీ పనిని ప్రారంభించేటప్పుడు కాంగ్రెసు వాదులున్నూ కమిటీలున్నూ ఈ చిన్న నియమాన్ని పాటించినట్లయితే, ఆ పనిలోని కష్టంవలన వారంతగా భయపడరు. తమ జిల్లాలో గ్రాము

జయం పొందినట్లయితే తక్కిన 249 జిల్లాలలో ఎందుకు జయప్రదంగా నిర్మాణం చేయకూడదో కారణం కన్పించదు.

గ్రామాలు కేంద్రములుగా భావింపబడినప్పటికీ ఈ హేతువాదం పనికి వస్తుంది. ఇంతవరకు మనం ఒక్క గ్రామం కూడా ఆ విధంగా నిర్మాణం చేయలేదని ఒప్పుకొని తీరాలి. నేను నివసిస్తున్నానని అనుకొనే సేవాగ్రాం కూడా అలా చేయబడని మాట నిశ్చయం. అయినప్పటికీ, తన గ్రామాన్ని సువ్యవస్థాపితంగా చేయడమే తన పనిగా పెట్టుకొన్న కార్యకర్త యెవ్వరూ నా అపజయం వలన అధైర్యపడకూడదు.

—సేవాగ్రాం, 25-12-1939

—హరిజన్, 30-12-1939

# 195
# చరఖా నిలుస్తుంది

బరోడాలోని హైస్కూలు విద్యార్థులు కళాశాలా విద్యార్థులు ఖాదీ సక్రమంగా ఉపయోగిస్తూ ఉంటారనీ ఒకరుకూడా వడకరనీ బరోడానుండి ఒకానొక కళాశాలా సభ్యుడు తెలియజేస్తున్నాడు. మరొక శ్రద్ధాళువైన బీరారు కార్యకర్త ఇలా వాదిస్తున్నాడు: "ఖాదీని గూర్చి మీరు పెట్టిన నియమం నిజంగా ఉద్దేశింపబడినట్లయితే స్వరాజ్యం అసాధ్యమని మీరనుకోవడం లేదా? భ్రాతృత్వ భావమును గూర్చిన మీ రెండవ నియమం కూడా, నిర్వర్తించడానికి అంత అసాధ్యంగానూ కనిపిస్తూన్నది." ఈ మిత్రుడు మాత్రం ఖాదీ భక్తుడు. నిత్యమూ వడుకుతాడు. ప్రతి మనిషి తోను భ్రాతృ భావంతో మెలగుతూంటాడు. కాని పైన పేర్కొనబడిన నిజమైన అనుమానం ఆయనకు ఉంది. చర్ఖా మాట అలా ఉండగా అహింసను గూర్చికూడా ఈ మిత్రుడు ఇంత గట్టిగానూ ఇదే విషయాన్ని చెప్ప గలిగి ఉండేవాడే. బహుశా చరఖా సుహృద్భావములు రెండూ, అహింసయొక్క బాహ్యాంతర చిహ్నము లనే విషయంలో ఆయనకు సందేహం ఉండి ఉండదు. బీరారు స్నేహితు నకూ, కళాశాల సభ్యునకూ నా ప్రత్యుత్తరం ఒకటే. వారు చెపుతూన్నది నాకు తెలియకుండా లేదు. ఉన్న గడువులో ఈ నియమాలను నిర్వర్తించడంలోగల కష్టం నాకు తెలుసును. నే నంతకంటె చేయగలిగినది లేదు. నేను వట్టి పట్టుదల మనిషినికాదు. మరెందుకు కాక పోయినా నా ప్రతిజ్ఞకోసమైనా, ఏమాత్రం వీలున్నప్పటికీ

యింతకంటె ఎక్కువ ఆచరణ యోగ్యములైన యితర నియమాలను నేను సూచించి ఉండవలసింది. జలోత్పత్తికి రెండుపాళ్ళు ఉజ్జనక వాయువు (Hydrogen) ఒక పాలు ప్రాణవాయువు (Oxygen) ఉండడం ఎంత అవసరమో, అహింసకు చిహ్నములుగా చరఖా, సుహృద్భావ నియమాలు ఉండడం ఎంత అవసరం. ఏమైనా విశ్వాసంతో సమష్టి శాసనోల్లంఘనమును నేను ప్రకటించవలెనంటే ఈ రెండు నియమాలను పరిపూర్తి చేయవలెనని పట్టుపట్టవలసి ఉంది.

నాకు దేవునిలో నమ్మకం ఉన్నది. అందువలన ప్రజలలో నమ్మకం ఉన్నది. నేను మరొక పోరాటం సాగించవలెనని ఆయన కోరిక అయినట్లయితే, ప్రజల హృదయాలను ఆయనే మారుస్తాడు. నేను పెట్టిన షరతులు కేవలం అసంభవం కాదు. ప్రజలకు ఇష్టం ఉంటేవారు వడుకు పనీ, ఖాదీ పనీ చేయవచ్చును. ఇంకా యిష్టం ఉంటే వారు మానవ సమాజ మంతటికి క్షేమకరులుగా ఉండవచ్చును. అద్భుతాల యుగం దాటి పోలేదు. అయితే ఆ షరతులు పూర్తికాక పోయినప్పుడు, నేను భారతదేశములోను, ప్రపంచంలోను నగుబాట్లపాలు కావడానికీ, నా నాయకత్వ పీఠమునుండి దిగి పోవడానికీ సంతోషంగా ఒప్పుకొంటాను. నాకు నేను నిజాయితీగా ఉన్నాననే ఉత్కృష్టమైన సంతృప్తి కలిగి ఉంటాను. ఆ అపజయంగా కనిపించేదానిలో, దేశాన్ని అనర్థ దాయక చరితమునుండి రక్షించేటందుకు, ఆ నియమాలు దేవునిచే సృజింపబడిన అద్భుత విషయంగా, దైవ లక్షణమును నేను అర్థం చేసుకోగలను.

—సేవాగ్రాం, 1-1-1940

—హరిజన్, 6-1-1940

# 196

## చరఖా

"ప్రాచి, తీవ్రావమాననిగ్రహాపరత్వ
మున శతఘ్నుల కవనత ముఖిగనుండి,
స్తనిత గర్జచ్ఛమూపంక్తి సాగనిచ్చి
మరల తనుదాన ధ్యాననిమగ్నయయ్యె"

వడుకుటనుగూర్చి నిష్కపటంగా మాట్లాడిన సోషలిస్టులను రాయిస్టులను తదితరులను నేనభినందిస్తున్నాను. దేశాన్ని ఎదుర్కొంటున్న పరిస్థితి మిక్కిలి క్లిష్టమైనది. హృదయపూర్వకంగా శాసనోల్లంఘనం ప్రకటింపబడిన యెడల సరియైన ఒడంబడిక జరిగేటంతవరకు దానిని నిలపడానికి వీలు లేదు. కాబట్టి పోరాటం అహింసాయుతముగా ఉండవలెనంటే, ఆ అహింస నిష్కళంకమైనదిగా ఉండవలెను. ఆవశ్యకములనుగూర్చిన నా ప్రకటనలో నేను దుర్బలుడనుగా ఉండకూడదు. నేను సందేహించినట్లయితే జాతీయోద్యమానికి ద్రోహం చేయడమవుతుంది. జయమునకు ఆవశ్యకములయినట్లుగా నేను భావిస్తున్న అర్హతలను పొందని సైన్యాన్ని నడిపే ధైర్యం నాకు లేదు. ఉత్సాహం లేని భక్తివలన ప్రయోజనం లేదు. విచ్ఛిన్నమైన భక్తి వినాశనమునకు దారితీస్తుంది. నేను కాంగ్రెసు నెత్తిమీద బలవంతంగా కూర్చో లేదని విమర్శకులు గ్రహించాలి. నాకు కొంతమంది నిర్దయులయిన మిత్రులు నియంత అని మారుపేరు పెట్టినప్పటికీ నేనుమాత్రం నియంతను కాను. నా అభిప్రాయాన్ని ఎవరిమీదనైనా బలవంతంగా రుద్దడానికి నాకు అధికారం లేదు. కాబట్టి నిజంగా నేను ప్రజల

సేవకుడనని పిలుచుకొంటున్నాను. నేను సర్వసైన్యాధిపతిగా నియమానుసారం నియోగింపబడలేదనికూడా ప్రజలు తెలుసుకోవాలి. వర్కింగుకమిటీ నియమానుగుణంగా ఆ పదవిని నాకీయుదనికాదు. ఆ అవసరం లేదని నేను సూచించగా సభ్యులందుకు అంగీకరించారు. సైన్యాధిపతికి సైనికులకూ మధ్య ఎన్నడైనా నిష్కళంకమైన ప్రేమానుబంధం ఉండేటందుకు వీలుకలిగిఉంటే అది యిట్టిదే. కాంగ్రెసు నన్ను గమనించకుండా తన యిష్టంవచ్చిన తీర్మానాన్ని తాను ఆమోదించేటందుకు అభ్యంతరం ఏమీలేదు. నాకు సంబంధించినంతవరకు, ఏ వ్యక్తిగానీ, ఏ రాష్ట్రంగాని, ఏ జిల్లాగాని శాసనోల్లంఘనమును సొంత బాధ్యతమీద ప్రకటించడం ఆపగలిగినవారెవ్వరూ లేరు. వారు కాంగ్రెసు క్రమశిక్షణకు భంగంకావించిన నేరంచేసినవారవుతారు. అయితే అటువంటి అవిధేయతను గూర్చి నేనేమీ చేయజాలను.

కాబట్టి నూలు వడకడాని కనుకూలంగా నేను ఎక్కువ వాదించడం అనవసరం. ప్రతి సత్యాగ్రహి ఆ పని నిర్వర్తించవలసిన ఆవశ్యకత ఉన్నది అని చెప్పడం చాలును.

అయితే ప్రతికూలురను మార్చేటంతవరకూగానీ లేక నా అపజయాన్ని నేను అంగీకరించేటంతవరకూగానీ, నేను వాదిస్తూండవలసిందే. ఎందువల్లననగా, రాజకీయ ఆర్థిక సాంఘిక విషయాలలోగాని, లేక మతవిషయాలలోగాని, పరస్పర సంబంధములను క్రమబద్ధం చేసుకొనేటందుకు, ప్రతి భారతీయుణ్ణి, హిందువును కానీ, మహమ్మదీయుణ్ణి కానీ, మరెవ్వరినైనాకానీ, ఆంగ్లేయుణ్ని అయినాసరే, తుదకు ప్రపంచాన్నికూడా అహింసావిధానమునకు మార్చ

డమే నేను నిర్వర్తింప పూనుకొన్న దౌత్యం. నాకు చాలా పెద్ద ఆశ ఉన్నదని ఎవరైనా ఆరోపించినట్లయితే ఆ ఆరోపణ నేను ఒప్పుకొనితీరాలి. ఈ నా స్వప్నం యెన్నటికీ నిజం కాజాలదని నాతో యెవరైనా అంటే 'కావచ్చును' అని నా దారిని నేను పోతాను. నేను ఆరితేరిన అహింసా సైనికుడను. నా విశ్వాసమును నేను నిలుపుకోనేటందుకు నాకు తగినంత సాక్ష్యం ఉన్నది. కాబట్టి నాకు ఒకర సఖుడు ఉన్నా, ఎక్కువమంది ఉన్నా, అసలు లేకపోయినా నా ప్రయోగమును నేను సాగించవలసిందే.

ఒకర ఆంగ్లేయునిమీదనైనా నాకు ద్వేషంలేదని నాతో కలసి పనిచేసేవారు గ్రహించవలసిన మొదటి విషయం. వానిని ఇండియానుండి తోలివేయవలెననే అసక్తి నాకు లేదు. ఆయన భారతదేశమునకు పరిపాలకుడుగాను, లేక పరిపాలకుడననే నమ్మకంలోనూ, లేక పాలకజాతి సభ్యుడుగానూ ఉండడానికి బదులు భారతదేశపు సేవకుడుగా ఆయనను మార్పుచేయవలెనని మాత్రమే నాకు ఆసక్తిగా ఉన్నది. ఆయన మతమేమయినప్పటికీ, భారతీయునిగూర్చి నేనెలా అనుకొంటానో ఆయనను గూర్చికూడా సరిగా అలాగే భావిస్తాను. నాతోపాటి ఈ ప్రాథమిక గుణమునైనా పాటించనివారు నాతోడి సత్యాగ్రహులుగా ఉండజాలరు.

ఆంగ్లేయులయెడ నాకుగల ప్రేమ లాంఛన ప్రాయమైనది కాదు. వారి సామ్రాజ్య తత్వాన్ని నాకన్న ఎక్కువ భయంకరమైన రంగులలో చిత్రించినవారు బహుశా మరొకరు లేరు. అయితే నేను నా కుటుంబ వ్యవహారాలలోనూ రాజకీయ వ్యవహారాలలోనూ కూడా అలాగే

ప్రవర్తించాను. నేను భావించే ప్రేమ గులాబి పూవంత మృదులము, చెకుముకిరాయిఅంత కఠినము. నా భార్య ఆ కటికి రకపు ప్రేమను అనుభవించింది. నా పెద్ద కుమారుడు ఇప్పటికీ అది అనుభవిస్తున్నాడు. సుభాష్ బాబును శాశ్వతంగా నా కుమారునివలె పరిగ్రహించానని నేనను కొన్నాను. కాని ఆయనపైన చెప్పబడిన క్రమశిక్షణ తీర్పుకు నేను పూర్తిగా ఏకీభవించవలసివచ్చిన బాధ అనుభవించాను. డాక్టరు ఖరే, వీరనారిమనులు, నా మాట వారికి శాసనమని చెప్పిన రోజులున్నవి. దురదృష్టవశాత్తు ఇక నాకా అధికారం ఉందని చెప్పుకోవడానికి వీలులేదు. వారిపైన తీసుకోబడిన క్రమశిక్షణ చర్యలకు నేనుకూడా బాధ్యుడనే. నాకత్యంత సన్నిహితులుగానూ, అత్యంత ప్రేమాస్పదులుగానూ భావింపబడేవారియెడల నేనెలా ప్రవర్తించానో, వారియెడకూడా అలాగే ప్రవర్తించినానని నా అభిప్రాయం. నా వ్యవహారాలన్నిటిలోనూ ప్రేమయే నా చర్యలను నియమించింది. ఆంగ్లేయుల విషయంలోకూడా నేనలాగే ప్రవర్తించాను. అయితే వారితో నేను పోరాడినప్పుడు వారు నన్నునేకవిధాల నిందించారు. వారి స్తోత్రం నామీద యెంత పనిచేసిందో వారి విమర్శకూడా అంతే పనిచేసింది. ఇదంతా మీకు నేను చెప్పడం మీ దగ్గరనుంచి నేనొక యోగ్యతాపత్రము కావలెనని కోరిగానీ, ఉద్దేశించికానీ కాదు. బ్రిటిష్‌వారి పరిపాలనను గూర్చి వారి విధానములనుగూర్చి నేను కఠినమైన విషయాలు చెప్పిన కారణంగా, వారియెడ నాకు ద్వేషమున్నట్లుగా ఆపాదించ కూడదని మీకు నిరూపించకోరుతూన్నాను. కాబట్టి వారిపైన సంపూర్ణ ద్వేషంకలవారు, నన్ను చివరకు పనికిరాని వానిగా భావిస్తారు.

నేనికకొత్త అభిప్రాయాలను ప్రతిపాదించడం లేదు. సత్యాగ్రహ శిల్పనిర్మాణం పరిణామదశలో ఉండగా 1908 లో నాచే వ్రాయబడిన 'హింద్ స్వరాజ్' లో కనిపిస్తూన్నవే యివి. చరఖా ఈ ప్రేమ కార్యక్రమంలో ఒక భాగంగా పరిణమించింది. అహింస పునాదిగాగల జీవితాన్ని నేను చిత్రించుకొంటూ ఉండగా, ఉన్నత భావాను గుణంగా దానికి అత్యంత నిరాడంబరమైన రూపం ఈయవలెనని తోచింది నాకు. కూడూగుడ్డా ఎప్పుడూ జీవితానికి ప్రాథమికావసరములే. ఇవి రెండూ నిశ్చయంగా లభిస్తవనే హామీ లేకపోయినట్లయితే జీవితమే అసంభవమవుతుంది. కాబట్టి అహింసాపూర్వకమైన రక్షణకు, బయట నుండి దండయాత్ర వచ్చినప్పుడుకాని ఆంతరంగిక కల్లోలం కలిగినప్పుడుకాని, సాధ్యమైనంతవఱకు సమాజంలోని సభ్యులు తమ క్షేమాన్ని తాము చూచుకోగలిగినట్లుగా సంఘనిర్మాణం జరగాలి. అటువంటి పరిస్థితులలో, గృహంలోని వంటయిల్లు అత్యంత సౌకర్యంగా ఉన్నట్లే, బట్టను ఉత్పత్తిచేసేటందుకు, ఉంచుకోతగిన అత్యల్పవస్తువులు తక్క, మహాఅయితే ఒక రాట్నం, ఒక మగ్గం ; అహింస మూలంగా గల సమాజం గ్రామాలలో స్థిర నివాసమేర్పరచుకొన్న కొన్ని గుంపులతో నిర్మింపబడిఉంటుంది. వాటిలో ప్రశాంతంగాను, గౌరవంగానూ జీవించేటందుకు నియమం ఐచ్ఛిక సహకారం. హింసను హింసతో ఎదుర్కొనేటందుకుద్దేశించి అందుకు తగిన సన్నాహాలను చేసే సమాజం, సందిగ్ధ జీవితమునైనా గడపాలి లేదా రక్షణ కార్యకలాపాలకోసం పెద్ద నగరాలనుగానీ శస్త్రాస్త్ర కోష్ఠములనుగానీ నిర్మించాలి. ఐరోపాఖండపు స్థితినిబట్టి, దాని నగరాలు, దాని భయంకరమైన యంత్రాలయాలు, దాని

బ్రహ్మాండమైన ఆయుధాగారాలు, ఇవన్నీ ఒకటి లేకపోతే మరొకటి ఉండలేనంత పరస్పర సన్నిహిత సంబంధం కలిగి ఉన్నవని అనుకోవడం అన్యాయం కాదు. అహింసను ఆధారంగా పెట్టుకొన్న సభ్యతకు అత్యంత సన్నిహితంగా ఉన్నది ఇంతకుపూర్వపు భారతీయగ్రామ ప్రజాస్వామ్యమే. అది చాలా మొరటుగా ఉండినదని నేనంగీకరిస్తాను. నేను ఊహించినట్టికానీ, నిర్వచించినట్టికానీ అహింస అందులో లేదని కూడా నాకు తెలుసును. కాని ఆ బీజం మాత్రం ఉంది. నేను చెప్పినదంతా కేవలం పొరపాటుకావచ్చును. దేశమునకు విశ్వాసపాత్రుడనయిన సేవకుడనుగా నేను నా తప్పిదమును దాచకూడదు. మనం బ్రహ్మాండమయిన మార్పు జరుగబోయే కాలంలో ఉన్నామన్నమాట నిశ్చయం. ఆ మార్పు ఇప్పటికంటె మంచిగానే ఉంటుందని ఆశిస్తూ న్నాను. కాని ఇంతకంటె చెడుగాకూడా ఉండవచ్చును. నా మనస్సులో అట్టడుగున ఉన్న అభిప్రాయాలను నా తోడి కార్యకర్తలతో, వారి సహకారం పోవడానికికూడా ఒప్పుకొని చెప్పగల ధైర్యం నాకు ఉండాలి.

ఇక అసలు వాదమునకు వద్దాము. ఆ బీజమునుండియే నేను అహింసాశిల్పమును నిర్మించాను. నేను కావించిన విశాలమైన నిర్వచనానికి చర్ఖా తగిఉన్నట్లయితే, సత్యా గ్రహాయుధాగారంలో అది అత్యంత శక్తివంతమైన అస్త్రం అవుతుంది. చరఖానుండి తీయబడిన ఆ సన్నని దారం లక్షలాది ప్రజలను తెగని మోకులో బంధించివేస్తుంది. ఒక గజం దారమయితే నిరుపయోగంకావచ్చును. తెలిసిన వారిచే, బుద్ధిపూర్వకంగా వడకబడిన అంతులేని లక్షలాది దారాలు, ఎటువంటి కష్టాన్నైనా ఓర్చుకోతగిన గట్టిమోకుగా

తయారు కాగలవు. అయితే 1908—1914 సంవత్సరాల మధ్య ఈ అభిప్రాయం అంతర్గతంగా ఉంది. యావత్తు కార్యక్రమమూ ఇండియాకోసమే భావింపబడినది అయినప్పటికీ దక్షిణ ఆఫ్రికాలోనే దాని తత్వం ఆచరణలో పెట్టబడింది. అక్కడి సత్యాగ్రహుల జీవితం అత్యంత నిరాడంబరమైన పరిస్థితులకు తేబడింది. బారిస్టర్లుగానీ, తదితరులుగానీ శ్రమచేయడం గౌరవమని తెలుసుకొన్నారు. వారు ఐచ్ఛికంగా పేదరికాన్ని చేపట్టి, అదే వారి అదృష్టమనుకొని, పేదలతో ఐక్యమయినారు. నేను ఇండియాకు చేరినతరువాత ఒంటరిగా చర్ఖాను పునరుద్ధరించే పనికి పూనుకొన్నాను. 1921 లో కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమమునందుఖాదీ ఒక ముఖ్యవిషయముయింది. అహింసతో అత్యంత శక్తివంతమైన సంబంధంగల చర్ఖా కాంగ్రెసు జెండాలో కేంద్రస్థానమలంకరించింది. కాబట్టి నే నీనాడేమీ కొత్త సంగతి చెప్పడం లేదు. అయితే మామూలుగానే ప్రజలు నేను చెప్పినది వినిపోయినారు. బలవంతపెట్టేవరకూ యే పనీ చేయ లేదు.

చర్ఖాకు దాని అంతరార్థములకు ప్రతికూలంగా వ్రాస్తూన్న సఖులయెడల (Comrades) నాకు చాలా గౌరవం ఉన్నది. వారి అభిప్రాయాల కనుగుణంగా దేశాన్ని నడిపించడంవలన వారొక విధంగా సేవచేస్తున్నారు. నేను కోరినట్లల్లా వారు యంత్రాలలాగా తలలూచడం నాకిష్టంలేదు. అది జాతీయప్రయోజనమున కుపకారి అయితే నేను గ్రహించవలసిందే. కాని అది కాజాలదని నాకు తెలుసును.

'టైమ్సు ఆఫ్ ఇండియా' పత్రికకు సర్ చమన్‌లాలు సెతల్వాడ్ వ్రాసిన ఉత్తరమును గూర్చి నేనిక్కడ విచారించ వలసి ఉన్నది. నేను 1915వ సం॥లో దాదాపు ఇండియాకు తిరిగి వచ్చినప్పటినుండీ మాకు రాజకీయభేదము లున్నట్లు నాకు తెలుసు. ఆయన ప్రముఖ న్యాయవాది. అంత మాత్రంతో ఆధునిక యుద్ధక్రమంలో ఆయనకు పదాతి సైన్యముయొక్క ఉపయోగమునుగూర్చి అధికారపూర్వక మైన అభిప్రాయమీయడానికెలా అధికారం లేదో, అలాగే చర్ఖా అర్థశాస్త్రమునుగూర్చి కూడా అభిప్రాయమీయడాని కధికారం లేదు. చర్ఖానుగూర్చి పెరిగిన సాహిత్యం చదవ వలసిందని ఆయనను నే నాహ్వానిస్తున్నాను. దాని సామర్థ్య మును గూర్చి అప్పుడాయన తన అభిప్రాయం మార్చుకోగల డని వాగ్దానం చేస్తున్నాను. అనేకమంది మిల్లు యజమాను లను నాకు స్నేహితులుగా భావిస్తున్నానని కూడా ఆయన జ్ఞాపకముంచుకోవాలి. మిల్లులను గూర్చిన నా అభి ప్రాయాలు వారికి తెలుసు. విదేశీ మిల్లులకు సంబంధించి నంతవరకు మన మిల్లుల అభ్యుదయమునకు పాటుపడడంలో నాకు కూడా జోక్యం ఉందనికూడా వారికి తెలుసును. అఖిలభారత దేశంలోకెల్ల పెద్దదైనట్టిన్నీ, అత్యంత శక్తివంత మైనట్టిన్నీ కార్మిక సంఘముయొక్క విధానాన్ని నేను నడిపిస్తున్నాననికూడా సర్ చమన్‌లాల్ తెలుసుకోవాలి. మిల్లులనుగూర్చిన నా ప్రాతికూల్యత లొంగిపోనిది, రాజీ లేనిది. కాని అది పూర్తిగా అహింసాత్మకం. నాకాయోగ్యతా పత్రమును ఇచ్చేవారిలో మొట్టమొదటివారు మిల్లు యజ మానులేనని నేను ధైర్యంగా చెప్పగలను. మిల్లులతో నాసం బంధం సంతోషకరమైనది. అంతేకాదు అహింసాపూర్వక విరోధమునకు సంపూర్ణ తార్కాణం. వారు నన్ను మెగడం

నా కార్యకలాపం వలన వారికేమీ నష్టంలేదనే సంగతి వారికి తెలిసిఉండడమేనని మీరు నాకు జ్ఞాపకం చేయనక్కరలేదు. వారికి ఎక్కువ బాగా తెలుసుననే నమ్మకంతో నన్ను నేను నను యించుకొంటున్నాను. మిల్లులనుగూర్చిన నా స్థిరాభిప్రాయములతోపాటు, వారియెడల నాకు హింసాపూర్వకమయిన ఉద్దేశాలున్నయెడల, నా కార్యవిధానం వారికి చాలాచిక్కులు తెచ్చిపెట్టి ఉండేదనీ, వారప్పుడు నన్ను శత్రువుగాభావించి నాకుప్రతికూలంగా చట్టముయొక్క సహాయాన్ని అభిలషించ వలసివచ్చేదనీ వారికి తెలుసును.

అయితే మాజీమంత్రులను గూర్చి సర్ చమన్‌లాలు చేసిన సవాలు నా కిష్టమే. అందుకు వారే జవాబీయాలి.

—సేవాగ్రాం, 9-1-1940

—హరిజన్, 13-1-1940

# 197

## ఖాదీ మాత్రమే ఎందుకు?

అఖిలభారత గ్రామ పంచాయతీ సంఘమునకు నిర్మాతనై దాని సలహాదారుగా ఉన్నప్పటికీ దానిని సవతి బిడ్డగా చూస్తున్నట్లున్నానని ఆచార్య కుమారప్పకు నామీద కొంచెం కోపం ఉంది. పైపై కారణాలనుబట్టి అలా తోస్తూన్నదని నేనాయనకు బదులు చెప్పిఉన్నాను. అది ఆయన అంగీకరించి అంతటితో ఊరుకోవడంలేదు. మాటిమాటికీ ఆయన అదే నింద మోపుతూ తదితర గ్రామ పరిశ్రమలుకూడా ఖాదీతో సరిసమానమైనవేనని నేను ప్రపంచానికి చాటేటంతవరకు ఆయన సంతృప్తిపడడం లేదు. ఈ విషయంలో యేవిధమైన వివరణ అవసరంలేదనీ ప్రత్యక్షంగా దానంతటదే తెలియ తగినదనీ నా అభిప్రాయం. కాని ఆచరణకు సంబంధించి నంతవరకు కుమారప్ప చెప్పే మాటలో యథార్థముంది. ప్రజలు సిద్ధాంతం ప్రకారం శాసించబడడం లేదు. ఖాదీ మాత్ర ముపయోగించి యితర గ్రామ పరిశ్రమలను వేటినీ ఉపయోగించనివారిని తా మెఱుఁగుదుమని యిటీవల అనేక మంది నాతో తమ అసంతృప్తిని వెల్లడిస్తూన్నారు. కాంగ్రెసు నియమావళిలో ఖాదీ ధరించవలెనని ఉన్నది. కాబట్టి చాలామంది కాంగ్రెసువాదులు ఖాదీ ధరిస్తున్నారని వారు సూచిస్తున్నారు. ఖాదీలో వారికి నమ్మకం లేకపోవడం వలన తక్కినవాడుక వస్తువులకు సంబంధించినంతవరకు తమ సౌకర్యమును తప్ప మఱేమీ వారాలోచించడం లేదు. దీనిని నేను ఆత్మను చంపి అక్షరాలను అనుసరించడమంటాను. ఆత్మ, హత్యచేయబడినప్పుడు ప్రాణంపోయిన శరీరమెంత ఉపయోగమో అక్షరంకూడా అంతే ఉపయోగం. ఖాదీ

కేంద్రంలోనున్న సూర్యునివంటిదనీ తక్కిన గ్రామ పరిశ్రమలు దానిచుట్టూ తిరిగే గ్రహాలవంటివనీ నేననేకసార్లు చెప్పిఉన్నాను. ఇతర పరిశ్రమలు లేకుండా ఖాదీకూడా నిలువలేదు. అవన్నీ కేవలం ఒకదానిపైన ఒకటి పరస్పరం ఆధారపడిఉన్నవి. ఇండియా యెంత పురాతనమో అంత పురాతనములైన గ్రామాలు కల భారతదేశమా, విదేశీయ ప్రాబల్యంవలన సృజింపబడిన నగరాలుకల భారతదేశమా, ఈ రెంటిలో ఏదికావలెనో మనం నిర్ణయించుకోవాలి. నేడు నగరాలు ప్రాబల్యంవహించి గ్రామాలను దోచివేస్తూన్న కారణాన అవి శిథిలములై కూలిపోతూన్నవి. నగర ప్రాబల్యం పోయినప్పుడవి గ్రామాల కుపకారములుగా నుండవలెనని నా ఖాదీ చిత్తవృత్తి నన్ను ప్రబోధిస్తూన్నది. గ్రామాలను స్వప్రయోజనంకోసం వినియోగించుకోవడమే సువ్యవస్థాపితమైన హింస. అహింసామూలక స్వరాజ్యమును నిర్మింపదలచుకొనేయెడల గ్రామాల కర్హస్థానం కలుగచేయాలి. దేశీయ, విదేశీయ నగరాలలోని యంత్రాలయములయందు తయారైన, వస్తువులకు బదులుగా గ్రామాలలో ఉత్పత్తి అయిన వస్తువులనే ఉపయోగించడం ద్వారా గ్రామ పరిశ్రమలను పునరుద్ధరిస్తేనే కాని మనకాపని సాధ్యంకాదు. నేను ఖాదీని అహింసతో ఎందుకు సమైక్యం చేస్తున్నానో బహుశా యిప్పటికి స్పష్టమై ఉంటుంది. ఖాదీ గ్రామ పరిశ్రమలలో ప్రధానమైనది. ఖాదీని నిర్మూలిస్తే గ్రామాలను వాటితో పాటు అహింసనూ కూడా నిర్మూలించాలి. నేను దీనిని లెక్కలతో రుజువుచేయలేను. అది మనకు ప్రత్యక్షంగా కనిపిస్తూన్నది.

—సేవాగ్రాం, 14-1-1940

—హరిజన్, 20-1-1940

# 198
## కాంగ్రెసు, ఖాదీ

కాంగ్రెసు నియమావళిలోని ఖాదీ సూత్రాన్ని అనుసరించడంలోకంటె ఉల్లంఘించడంలో ఎక్కువ గౌరవిస్తూన్నట్లు ఆరోపిస్తూ నాకు ఉత్తరాలు వస్తూన్నవి. మున్సిపాలిటీలకు స్థానిక సంస్థలకు కాంగ్రెసు అభ్యర్థులను ఏర్పాటు చేయడంలో. కాంగ్రెసు ఉద్యోగులు ఖాదీ సూత్రాన్ని అమలు పరచడంలేదని ఈ విలేఖకుని ముఖ్య ఆరోపణ. ఖాదీ ధారులలో అర్హులైన అభ్యర్థులు తగినంత మంది లేకపోవడంవలన ఖాదీ ధరించి తీరవలెననే నిర్బంధం తొలగింపబడినదని మరొక విలేఖకుడు వ్రాస్తూన్నాడు. సరియైన మనుష్యులు లేరనే విషయం రుజువు చేయబడినయెడల అది ఆ సూత్రాని మార్చడానికి తగిన కారణమవుతుంది. అంతేకాని బుద్ధిపూర్వకంగా కాంగ్రెసు నియమావళిని ఉల్లంఘించడానికి మాత్రంకాదు. ఇంకొక విలేఖకుడు, ఖాదీకీ స్వరాజ్యానికీ సంబంధంలేదనే కారణంతో, ఆ సూత్రాన్ని సడలించినవారిని సమర్థిస్తూన్నాడు. ఇదికూడా నియమావళిలో మార్పుచేయడానికి కారణమవుతుంది కాని దానిని అలక్ష్యం చేయడానికి మాత్రం కారణంకాదు. ప్రతి కాంగ్రెసువాదీ శక్తివంతుడైన సాత్విక నిరోధకుడు. ప్రభుత్వ శాసనాలకు ఐచ్ఛికంగా విధేయతచూపే ధర్మాన్ని నిర్వర్తించే వారికి మాత్రమే శాసనోల్లంఘనమునకు హక్కేర్పడుతుంది. కాబట్టి అటువంటివారు తాము చేసుకొన్న నియమావళికి తామింకా ఎక్కువ కట్టుబడిఉండాలి. కనుక నియమావళిని బుద్ధిపూర్వకంగా ఉల్లంఘించే కాంగ్రెసువాదులు చాలా ఎక్కువ సాహసంచేస్తూన్నారు.

ఖాదీకి స్వరాజ్యానికీ సంబంధం లేదా? కాంగ్రెసు నియమావళిలో ఖాదీ సూత్రానికి బాధ్యులైన కాంగ్రెసు వాదులు, కొంతమంది విమర్శకులకింత స్పష్టంగా కనిపిస్తూన్న ఈ భ్రమను గ్రహించలేనంత మందబుద్ధులా? ఖాదీ లేనిదే, లక్షలాది ప్రజలకు, క్షుత్పీడితులకు, దిగంబరులకు, చదువు సంధ్యలు లేని లక్షలాది స్త్రీలకు స్వరాజ్యం లేదని చెప్పడానికి నేను జంకలేను. తిరిగీ ఆ మాటలను నేను ధైర్యంగా చెపుతున్నాను. ఖద్దరు, విదేశీ నాజూకు బట్టలవలె మృదువుగానూ అందంగానూ చౌకగానూ ఉండకపోయినప్పటికీ, నిత్య ఖద్దరు ధారణ, ఖద్దరుదారి తన దేశంలోని నిరుపేదలతో ఐక్యమై ఉన్నాడనేటందుకు, ఆయనకు తగినంత దేశభక్తీ, స్వార్థత్యాగమూ ఉన్నవనేటందుకూ చిహ్నంగా ఉంటుంది.

—సేవాగ్రాం, 22-1-1940.

—హరిజన్, 27-1-1940.

## 199

# ముస్లిం నేతవారు, మిల్లు నూలు

ప్ర.—ధ్రువ పత్రము పొందిన ఖాదీనిగూర్చియే నొక్కి చెప్పడంవలన, ఒక ప్రక్క మీరు, మిల్లు నూలును ఎక్కువగా ఉపయోగిస్తూన్న ముస్లిం నేతవారినీ, రెండవప్రక్క, అప్రతిష్ఠాకరంగా ప్రియమైన ధ్రువపత్రపు ఖాదీని కొనవలసిందని ప్రోత్సహించడంద్వారా వినియోగకులనూ గట్టిగా దెబ్బకొట్టినారు. నేతవారి అభ్యుదయం కోసం పనిచేస్తూన్న ముస్లిమును నేను. చేతితో నేయబడిన మిల్లు నూలు ఖాదీ వాడుకను అంగీకరిస్తూ ఈ ఉభయులకష్టాలను తొలగించవలసిందని మిమ్ములను నేను ప్రార్థిస్తున్నాను.

ఉ.—ఖాదీలో మతతత్వంలేదు. అఖిలభారత చరఖా సంఘం జాబితాలో వేలకొలదీ వడికే ముస్లిములు, వందలకొలదీ ముస్లిం నేతవారూ ఉన్నారు. మిల్లు నూలు నేసేవారి మనస్సులలో ఖాదీ యేమీ మార్పు కలిగించలేకపోయింది. మిల్లు పోటీ వలన పనిలేకుండా పోయిన హిందూ ముస్లిం నేతవారికి పని కల్పించడమే అది చేసినపని. చేతితో వడికిన నూలును నేయని నేతవారు తమ గొంతుకలను తామే కోసుకొంటూన్నారు. ఎందువల్లననగా, మిల్లుల వ్యాపకంయొక్క సహజఫలితము, వడికేవారు నాశనమైనట్లే నేసేవారుకూడా నాశనంకావడం. తమ వృత్తిని తాము కాపాడుకోగలిగిన

చేనేతవారు నమోనా నేతకు అలవాటయినవారు. ఖాదీ సార్వజనీనమైనయెడల, ఈనాడు మిల్లు నూలును నేస్తూన్న ముస్లిం నేతవారుగానీ ఇతర నేతవారుగానీ సహజంగా వడుకునూలును నేయడం ప్రారంభిస్తారు. కాబట్టి ఏ ఒక్క నేతపనివానికికూడా ఖాదీ దెబ్బకొట్టడమనే మాట ఎప్పుడూ లేదు, నిజానికి అది ఒక్కటే అతనికి రక్షణ.

—సేవాగ్రాం, 5-3-1940

—హరిజన్, 9-3-1940

---

# 200

# ఖాదీ, రాజకీయాలు

ప్ర.—రాజకీయ కార్యక్రమంతో ముఖ్యంగా శాసనోల్లంఘన భాగంతో ముడిపెట్టడం వలన ఖాదీ ఉద్యమానికి మీరు హాని కలిగించడం లేదా ?

ఉ.—ఎంతమాత్రమూ కాదు. కేవలం కాంగ్రెసు వాదులకు, సాత్విక నిరోధకులకు మాత్రమే, ఖాదీ ఉద్యమం పరిమితం చేయబడినట్లయితే నేనలా హాని కలిగిస్తూ ఉండే వాడనే. కాంగ్రెసు వాదులయినా కాకపోయినా అందరికీ జాతీయ వస్త్రంగా సూచించబడినది ఖాదీ. కొంతమంది ఆంగ్లేయులు, అమెరికనులు, ఇతర పాశ్చాత్యులూ కూడా దానిని ధరిస్తూన్నారు. మీ అభ్యంతరం సరియైనదే అయితే, సాంఘిక ఐకమత్యమునకూ అస్పృశ్యతా నివారణ మునకు, మితపానమునకూ కూడా వర్తిస్తుంది. ఈ నాలుగు, కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమంలో చేర్చబడిన పిమ్మటనే ప్రాముఖ్యతనూ, వేగాధిక్యతనూ పొందగలిగినవి. హింసతో మిశ్రితములయినట్లయితే ఇవన్నీ కూడా చట్ట విరుద్ధ ములు కాగలవు. అవి చట్ట విరుద్ధము లయినట్లయితే, అటు వంటి ఉద్యమాలు కాదు అణచి వేయబడేది. అమాయికంగా కనిపించే పేరులకింద దాగొని నిజంగా దౌర్జన్య యుతములైన సంస్థలు అణచివేయ బడతవి.

—సేవాగ్రాం, 1-4-1940.

—హరిజన్, 6-4-1940.

# 201
## ఖాదీ యాత్ర

ప్ర.—ప్రాతిపదిక విద్యావిధానంలోకి (Basic Education Scheme) తక్లీ ఆర్థికోద్దేశంతో అనగా స్వయం పోషకోద్దేశంతో ప్రవేశపెట్టబడినదా లేక విద్యా విషయికోద్దేశంతో నేనా ?

ఉ.—ప్రాతిపదిక విద్యలో యేమి ప్రవేశపెట్టబడినప్పటికి ఒకటే ఉద్దేశం; అది విద్యావిషయికోద్దేశం. ఏదో ఒక చేతిపని ద్వారా పిల్లల శారీరక, వైజ్ఞానిక నైతికాభివృద్ధి కావించడమే ప్రాతిపదిక విద్యయొక్క ఉద్దేశం. కాని విద్యా విషయిక దృష్టితో ఉత్తమమయినదై చాకచక్యంగా నడపబడిన యెడల, యే ప్రణాళికయైనను ఆర్థికంగా కూడా ఉత్తమమయినదే అయితీరవలెనని నా అభిప్రాయం. ఉదాహరణంగా, మన పిల్లలకు మనము మట్టి బొమ్మలను చేయడం నేర్పవచ్చును. తరువాత అవి చెడగొట్టబడేవే. కాని ఆ పనికూడా వారి బుద్ధిని వికసింపచేస్తుంది. అయితే మానవ కృషిగానీ, వస్తువుగానీ పనికిమాలిన వ్యర్థ మార్గాలలో ఎన్నడూ ఉపయోగింపబడకూడదనే ముఖ్యమైన నైతిక సూత్రాన్ని అది గమనించడంలేదు. మానవ జీవితంలో ప్రతి నిమిషమూ ఉపయోగకరంగా గడపవలెననే సిద్ధాంతమునకు ప్రాముఖ్యత ఈయడమే పరమోత్తమమైన పౌరశిక్షణ ; అదే యాదృచ్ఛికంగా ప్రాతిపదిక విద్యను స్వయం సంపూర్ణంగా చేస్తుంది.

ప్ర.—ఖాదీయున్నూ, నూలు వడకడమున్నూ, స్వరాజ్య మార్గదర్శకము లెలా కాగలవు ?

ఉ.—లక్షలాది జనులు సహకరిస్తే, అఖండమైన బలం ఉత్పత్తికాక తప్పదు. ఇష్టమైనవారు దానిని ఏ విధంగానైనా ఉపయోగించుకోవచ్చును. అట్టి సహకారానికి చరఖా పరమోత్తమమైన పరికరం. అది దరిద్రనారాయణకు గౌరవపూర్వకమైన వృత్తినీ, అన్నవస్త్రాలనూ ఈయగలదు. అది స్వరాజ్యసాధన కోసం ప్రజా సామాన్యంలో చైతన్యమును, అహింసా బలాన్ని కలిగిస్తుంది.

ప్ర.—ఖాదీని చేపట్టినవారు వడకడం కూడా అవలంబించవలెనా ?

ఉ.—ఆర్థిక దృష్టితో ఖాదీ చేపట్టితే చాలును. స్వరాజ్యం సంపాదించేటందుకు ఖాదీ ఒక ఆయుధంగా ఉండవలెనంటే వడకడం కూడా అవసరమే. ఖాదీ మనకు ఆర్థిక స్వయం సంపూర్ణతను ప్రసాదిస్తుంది. వడుకుపని అత్యల్పవేతనం తీసుకొనే శ్రమ జీవితో బాంధవ్యం కల్పుతుంది. యుద్ధనీతి ప్రధానంగా గల దేశాలలో యుద్ధ వ్యవహారాలకోసం ప్రతి మనిషీ కొంతకాలం వినియోగిస్తాడు. మనది అహింసాపద్ధతి గనుక, ప్రతిమనిషి, ప్రతి సంవత్సరము ఒక కనీసకాలం త్యాగంగా వడకాలి. మౌలానా మహమ్మదాలీ తక్లీనీ నూలునూ మన స్వరాజ్య సంపాదనకు ఆయుధాలు, మందుగుండు సామగ్రీ అని వర్ణిస్తూ ఉండేవాడు. ఈ ఉదాహరణం అర్థవంతంగా ఉన్నది. ఐచ్ఛికంగా చేసే యుద్ధసేవవలె, రోజుకు ఒక అరగంట కాని గంటకాని నూలు వడికేటందుకు వినియోగించడం మనకెంత కష్టమా ? నాకు జ్ఞాపకం ఉన్నది. కడచిన సంగ్రామ ప్రారంభంలో నేను ఇంగ్లాండులో ఉండగా సిపాయీలకోసం, కుట్టడానికి పైజామా సూట్లు ఈయబడ్డవి నాకు. ఇంకా అనేకమంది మహా ఐశ్వర్యవంతు

మైన కుటుంబాలలోని వారు, గౌరవనీయులు వృద్ధులు అయిన స్త్రీ పురుషులు సైతం అటువంటి పని చేస్తూ ఉండేవారు. మాకెంత పని నియోగింపబడినదో, ఆ పని అంతా ముగించాము. ఆ పని చేయడం ఎవ్వరూ తమ గౌరవానికి భంగకరమైనట్లు భావించలేదు. యుద్ధం ముగియడానికి బ్రిటిష్ జాతి యావత్తూ ఇంకా ఎక్కువ పని చేసింది. కాని ఎవ్వరూ పక్షీ గునియలేదు. ఈనాడు నేను మిమ్ములను, రోజుకు ఒక అరగంటో, గంటో వడకవలసిందని కోరుతూన్నాను కాని, పరిస్థితులు మారినకొద్దీ మిమ్ములను ఇంకా ఎక్కువగా కోరవచ్చునని ముందే మీకు చెప్పవలసి ఉంది.

ప్ర.—శాసనోల్లంఘన ఖైదీలు, జైలులో యథాప్రకారం వడకడానికీ, ఖాదీ ధరించడానికీ అంగీకారం పొందేటందుకు సత్యాగ్రహం చేస్తారా ?

ఉ.—సత్యాగ్రహి బుద్ధి పూర్వకంగానూ పూర్తిగానూ జైలు క్రమ శిక్షణకు లోబడి ఉంటాడు. అధికారులను చీకాకు పెట్టవలెనని ఆయన ఎప్పుడూ కోరడు. బయట ధార్మిక నియమంగా నీవు వడకక జైలులో వడక నీయవలసిందని పట్టుపట్టడం హింసా విధానం. ఆ పద్ధతి నే నెవ్వరికీ సిఫారసు చేయను. అయితే కొన్ని ప్రత్యేక సందర్భాలను నేనూహించగలను. ఉదాహరణంగా, అప్పాపట్వర్థన్ — ఈయన ఆ అంగీకారాన్ని పొందేటందుకు చిట్టచివరి వరకూ పోవచ్చును. గతకాలంలో మనం ఆదర్శప్రాయులయిన

ఖైదీలముగా ప్రవర్తించలేదు. మన చర్యలలో హింసా అసత్యమూకూడా ఉన్నవి. అదే తిరిగీ జరుగవలెనని నేను కోరను. మనం జైలు అధికారులతో వాదించవచ్చును. ఈ సౌకర్యములు నాకు ఈయబడక పోయినట్లయితే నేనొక సందిగ్ధావస్థలో పడవచ్చును. నూలు వడకడాన్నిగూర్చి నేను చెప్పినదే ఖాదీకి కూడా వర్తిస్తుంది.

—సేవాగ్రాం, 2-4-1940

—హరిజన్', 6-4-1940

# 202

# చరఖా – స్వరాజ్యము – అహింస

శాసనోల్లంఘనమును గూర్చిన అభిప్రాయాలు వ్యాప కంలో ఉన్నవి. గనుక, నేను మరొకతూరి, పునరుక్తి దోషమున్నకైనా భయపడకుండా, చరఖా, స్వరాజ్యము, అహింసల మధ్యఉన్న పరస్పర ప్రబల సంబంధమును నిరూపిస్తూ నా వాదములను ఒకే వ్యాసంలో సంగ్రహంగా వ్రాయవలసిందని ఒకానొక విలేఖకుడడుగుతూన్నాడు. సంతోషంగా నేనా ప్రయత్నంచేస్తాను.

నా దృష్టిలో రాటం సామాన్య ప్రజల ఆశను ప్రతిబిం బింప చేస్తుంది. చరఖా పోవడంతో సామాన్యప్రజ, పూర్వం ఉండే స్వాతంత్ర్యాన్ని పోగొట్టుకొంది. చరఖా గ్రామస్థుల వ్యవసాయమునకు తోడుగా ఉండి, దానికి గౌరవాన్ని చేకూ ర్చింది. అది వితంతువునకు మిత్రముగానూ శాంతి దాయక ముగానూ ఉండేది. గ్రామస్థులను సోమరితనమునుండి దూరంగా ఉంచేది. చరఖా అన్న మాటలో, చరఖాకు పూర్వం చేసే పనులు, తరువాత చేసే పనులుకూడా— గింజలు తీయడం, ఏకడం, పడుగుచేయడం, సరిచేయడం, రంగువేయడం, నేయడం - ఈ అన్నీ ఇమిడి ఉన్నవి. ఇవన్నీ గ్రామంలోని వడ్రంగికీ, కమ్మరికీకూడా పని కల్పించి నవి. చరఖా పదులక్షల గ్రామాలనూ స్వయం సంపూర్ణము లుగా చేసినది. చరఖా పోయేసరికి గానుగ వంటి యితర గ్రామ పరిశ్రమలుకూడా పోయినవి. ఈ పరిశ్రమలస్థానాన్ని ఇంకేదీ ఆక్రమించలేదు. కాబట్టి గ్రామాలలోని వివిధ

వృత్తులు, గ్రామస్థుల సృజనశక్తి, ఈ వృత్తులవలన లభించిన ఆ కొంచెం భాగ్యం, అన్నీ శుష్కించి పోయినవి.

ఇతర దేశాలలోకూడా గ్రామ పరిశ్రమలు విధ్వంసమైన వనే తారార్కాణం మనకు వర్తించదు. ఎందువల్లనంటే, అక్కడి గ్రామస్థులకందుకు పరిహారంగా కొన్ని ప్రయోజనాలు కలిగినవి. కాని భారతదేశములోని గ్రామస్థులకు దాదాపు అటువంటివేమీ కలగలేదు. పాశ్చాత్య పారిశ్రామిక దేశాలు తదితరజాతులను స్వార్థంకోసం వినియోగించుకొంటున్నారు. భారతదేశం ఆ విధంగా స్వార్థం కొఱకు వినియోగింపబడుతూన్న దేశమే. కాబట్టి గ్రామస్థులు తమ పూర్వ స్థితిని పొందవలెనంటే, చరఖాను, దానికి సంబంధించిన విధానాలను పునరుద్ధరించడమేనని మిక్కిలి సహజంగా దానంతటది స్ఫురిస్తుంది. చరఖా సందేశాన్ని వినిపించి, తేజోహీనమ్ములైన గ్రామస్థుల కళ్లలో ఒక ఆశాజ్యోతిని వెలుగునూ ప్రసరింపచేసేటందుకు, గ్రామాలలో ఏక మనస్కులై పనిచేసే వివేకమూ దేశభక్తీకల స్వార్థ రహిత భారతీయులెందఱో లేనిది దీని పునరుద్ధరణ నెఱవేరదు. ఇది సరియైన ప్రయోజన విద్యయెడలను, సహకారవిధానము నెడలను జరుగుతూన్న మహత్తర కృషి. నిశ్శబ్దమూ, నియతము, ప్రాణప్రదమూ అయిన చరఖా పరిభ్రమణమువలెనే, అదికూడా ప్రశాంతమూ, అమోఘము అయిన ప్లవాన్ని తీసుకొని వస్తుంది.

నాకు చరఖా పనిలోకల ఇరవై సంవత్సరాల అనుభవం నా వాదంలోని సత్యమునెడల నాకు నమ్మకం కలిగించింది. నిరుపేదలయిన హిందువులను ముస్లింలనూకూడా చరఖా దాదాపు సమానంగానే సేవించింది. గ్రామాలలోని

లక్షలకొలది ఉన్న కర్మకారుల చేతులలో, ఏమీ అడావడీ, ప్రచారమూ లేకుండా దాదాపు ఐదుకోట్ల రూపాయ లుంచ బడినవి.

కాబట్టి అన్ని మతాలకూ చెందిన సామాన్య ప్రజల భాష లోని స్వరాజ్యమునకు చరఖా మనను తీసుకొని పోతుందని నేను నిస్సందేహంగా చెపుతూన్నాను. చరఖా గ్రామా లను తమ ఉచిత స్థానాలలో పునఃప్రతిష్ఠ చేస్తుంది. గొప్ప వారికీ పేదవారికీ ఉన్న భేదాలను నిర్మూలిస్తుంది.

అయితే జాతికి అహింసలో నమ్మకం ఉంటేనే తప్ప చరఖా స్వరాజ్యం తీసుకొని రాజాలదు. నిజానికది దరించవలసినదికూడా. అది తగినంత ఉద్రేకం కలిగించేది కాదు. స్వాతంత్ర్యంకోసం తీవ్రంగా వాంఛించే వారుకూడా చరఖాను నిర్లక్ష్యం చేయవచ్చును. వారు దానినిగూర్చి వృథాగా చరిత్ర పుస్తకాలలో చూడడం మొదలుపెడతారు. స్వాతంత్ర్య ప్రియులు, విదేశీపాలకుని వెళ్లగొట్టటందుకు తీవ్రోత్సాహంతో ఉన్నారు. వారతనికి అన్ని దుర్గుణాలనూ అంటకట్టి, తమలో మాత్రం ఏ దుర్గుణాన్నీ చూచుకోరు. రక్త సముద్రములద్వారా స్వాతంత్ర్యమును సంపాదించిన దేశాలను తారాణాలుగా ఉదాహరిస్తారు వారు. హింస లేని చర్ఖా కేవలం మెత్తని వ్యవహారంగా కనిపిస్తుంది వారికి.

1919 లో, స్వరాజ్య సంపాదనకు అహింస ఒకటే నిశ్చయమగు సాధనమైనట్లు, చరఖా అహింసకు చిహ్న మైనట్లు భారత స్వాతంత్ర్య ప్రియులకు పరిచయం చేయ బడినది. 1921 లో, జాతీయ పతాకమునందు చరఖా తన గౌరవ స్థానాన్ని ఆక్రమించింది. కాని అహింస భారత

దేశపు హృదయంలో నాటుకోకపోవడంచేత, చరఖా తన అర్హస్థానాన్ని ఆక్రమించలేదు. అత్యధిక సంఖ్యాకులైన కాంగ్రెసు వాదులు అహింసలో సజీవ విశ్వాసాన్ని పెంపొందించుకొంటేనేకాని, అది దాని అర్హస్థానాన్ని పొందదు. వారలా చేసినప్పుడు, ఏ వాదమూ అవసరం లేకుండానే, చరఖాకంటె అహింసా చిహ్నం మరొకటి లేదనీ, అది సార్వజనీనం కానియెడల, అహింసాభావం ప్రత్యక్షంగా వెల్లడింపబడదనీ తమంతట తామే తెలుసుకో గలరు. అహింస లేనిదే అహింసా పూర్వకమయిన శాసనోల్లంఘనం ఉండదనేది సామాన్య విషయమే. నా వాదం తప్పు కావచ్చును. నా సిద్ధాంతాలు లోపభూయిష్ఠములు కావచ్చును. కాని నాకుగల అభిప్రాయాలనుబట్టి, నేను సూచించిన షరతులు పరిపూర్తి కానిదే నేను శాసనోల్లంఘనమును కేవలం ప్రకటింపచాలనని వెల్లడించవలసి ఉంది.

—సేవాగ్రాం, 9-4-1940

—హరిజన్, 13-4-1940

---

# 203
# జీవనభృతి

ప్ర.—జీవనభృతితో నిమిత్తం లేకుండా తమ గ్రామాలలో తయారైన నూలును గ్రామస్థులు స్వేచ్ఛగా కొనుక్కోవచ్చుననీ అ.భా.చ.సం. వారి విషయంలో జోక్యం కల్పించుకోవద్దనీ మరొక పర్యాయం హరిజన్‌లో వ్రాశారు. అటువంటి నూలుతో నేయబడిన ఖాదీ ధరించేవారు కాంగ్రెసు ప్రతినిధులుగా ఉండటానికి అర్హులేనా? ఈ సందర్భంలో గ్రామ కార్యకర్త చేయదగిన దేమిటి? అతడు సహజంగా జీవనభృతి కనుకూల ప్రచారం చేస్తూ ఉంటాడు. అ.భా.చ.సం. వారి ఖాదీ కొనేవా రెప్పుడూ కొంత మంది గ్రామాలలో ఉంటారు. అయితే చాలా మంది కొనలేనివారుకూడా ఉంటారు. వారు జీవనభృతికంటె తక్కువ ఇచ్చినప్పటికీ, వడికేవారికి ఎక్కువ ఉపకారంగా ఉంటుందనడానికిగానీ, గ్రామ జీవితంలోకూడా ఖాదీకి ఒక స్థానం ఉంటుందనడానికిగానీ యేమీ సందేహం లేదు. అక్కడి గ్రామ కార్యకర్త అటువంటి ఖాదీని ప్రోత్సహించవలెనా?

ఉ.—వ్రాసేవాని వాక్యాలలో ఆయన ఉద్దేశానికే భంగం కలిగించే అర్థాన్ని చదవకుండేటంత జాగరూకతతో నిత్యమూ మెలగుతూ ఉండినయెడల ఇటువంటి ప్రశ్నలు సకృతుగా ఉదయిస్తవి. మజూరీల ప్రసక్తియే లేకుండా, నూలు స్వంతంగా వడుకుకొన్నప్పుడు ఏ విధమైన నిషేధమూ వర్తించదు. అయితే స్వయం సంపూర్ణత అనే తప్పు నెపంతో అ.భా.చ.సం. యొక్క నియమం ఉల్లంఘింపబడడం

లేదని సహజంగా భావించవలసి ఉన్నది. గ్రామ కార్య కర్తకుకూడా ఇదే వర్తిస్తుంది.

అయితే మీప్రశ్నలలో మరొక ముఖ్యమైన విషయం ఉదాహరింపబడినది. ఏదో ఒక గ్రామంలోని అ.భా.చ.సం. యొక్క కార్యకర్త ఆ గ్రామ ఖాదీనే వాడేటట్లయితే అయన జీవనభృతి ఈయజాలడు. కాబట్టి ఆయన నూలును తక్కువ ఖరీదుకు కొని, మరొక విధంగా యేమీ సంపాదించలేని వడుకువారికి కొంత పని చూపెట్టగలడు. కాని ఆయన కాంగ్రెసు సభ్యుడు కాకపోవచ్చును. ఆయన కాంగ్రెసును వెలుపలనుండి సేవించగలడు. కొన్ని సమయాలలో అటువంటివారే కాంగ్రెసును ఎక్కువ బాగా సేవించగలరు. పైగా సభ్యత్వంతోపాటు వచ్చే పదవీ కాంక్షనుండికూడా వారు రక్షించబడతారు. అటువంటి ఖాదీ గ్రామానికి వెలుపల అమ్మజాలరని మాట నిశ్చయం. అది అంతా స్థానికంగా ఖర్చు కావలసిందే. ధ్రువ పత్రము లేని ఖాదీ అంగడిలోకి వచ్చిన తత్క్షణం, అ.భా.చ.సం. యొక్క నియమం పాటింపబడదు. ఆ కారణాన నిజమైన ఖాదీ వెనుకపడిపోతుంది. వడికేవారి మజూరీలను హెచ్చించే ప్రయత్నంలో అ.భా.చ.సం. చాలా శ్రమపడి పనిచేస్తూ న్నది. కూలివాళ్ళు తమ కూలిని హెచ్చించవలసిందని కోరకుండానే, రోజు 1 కి ఒకటి రెండు కానులనుండి 8 లేక 12 కానులవరకూ జీతాలు పెంచబడడం ప్రపంచంలో నేనెప్పుడూ విని ఉండలేదు. అ.భా.చ.సం.. ఈ విష యంలో చిరస్మరణీయమైన కార్యాన్ని నిర్వహించింది.

—సేవాగ్రాం, 27-8-1940

—హరిజన్, 1-9-1940

# 204
# ఒక అమెరికా దేశీయుని ప్రశ్నలు

ఇటీవల బొంబాయిలో జరిగిన అ.భా.కాం.సం. వారి నిర్ణయమునుండి స్ఫురించిన కొన్ని ముఖ్య ప్రశ్నలను ఒకానొక అమెరికన్ పత్రికా విలేఖకుడు అడిగినాడు. అవి కేవలం రాజకీయములకే గాక అంతర్జాతీయ సంబంధములకు వాణిజ్య సాంఘిక వ్యవహారములకు కూడా వర్తిస్తున్నవి.

"ప్రపంచాన్ని హిట్లరిజంనుండి రక్షించేటందుకు భారత దేశం చేసే సహాయ్య మేమిటి?" ఇది ఆయన మొదటి ప్రశ్న. బహుశా ఆయన అనుకొన్నట్లుగా జవాబు, సంగ్రహంగానూ చక్కగానూ ఉంది: "కాంగ్రెసు తన అహింసా ఉద్యమంలో జయం పొందినయెడల హిట్లరు తత్వం ఇంకా అటువంటి తత్వాలన్నీ కూడా సహజంగా పోనేపోతవి."

"అమెరికాలో ఇంకా ఎక్కువ బాగా విషయాలు తెలిసేటందుకు, పరస్పరం వస్తువులను అభిప్రాయాలను మార్పు చేసుకొంటూండే పద్ధతిని పెంపొందించుకొనేటందుకు, భారత దేశం యేదో కొంత పని చేయవలెనని మీరనుకోవడం లేదా? ఈ సందర్భంలో ఏమి చేయవలసి ఉంటుందని మీరనుకొంటున్నారు?" అని ఆయన మరొక ప్రశ్న వేశాడు.

"మొట్టమొదటగా సరుకులను తీసుకొందాం. ఇండియా పరిస్థితులకుగానీ, ఇండియా కోరికలకుగానీ సంబంధం లేకుండానే అమెరికా తన భాగం తాను సంపాదించు

కొన్నది. ఇక అభిప్రాయాలకు సంబంధించినంతవఱకు, అమెరికాలో కాపింపబడిన భారత ప్రతికూల ప్రచారం అక్కడ అప్రతిహితంగా స్వైరవిహారం చేసింది. అందు వల్లనే టాగూరువంటి ప్రఖ్యాత పురుషుని అమెరికా ప్రయాణం కూడా అమెరికన్ చిత్త వృత్తిపయిన యేమీ పరివర్తనం కలిగించలేకపోయింది. ఇది నా దుఃఖకరమైన అనుభవం.

"అయితే అమెరికాలో తననుగూర్చి ఎక్కువ తెలిసే టందుకు భారతదేశం ఎందుకు ప్రయత్నం చేయదు?"

"ఒక ప్రత్యేక కాలంలో ఇండియా అభిప్రాయమేమి టని అమెరికా నిజంగా తెలుసుకొన కోరినట్లయితే, వారి కందుబాటులో దినదినాభివృద్ధి పొందుతూన్న సాహిత్యం కావలసినంత ఉంది. ఇండియా పక్షాన ఒక భారతీయ ప్రతినిధి సంస్థ ప్రచారం చేయవలెనని మీ అభిప్రాయమైన ట్లయితే, మికిలి సమర్థతతోనూ పట్టుదలతోనూ అత్యధిక వ్యయంతోనూ సాగింపబడుతూన్న సామ్రాజ్యవాదుల ప్రచార మును మేమెన్నడూ అతిక్రమించలేమని మా విషాదకరమైన అనుభవము. అటువంటి ప్రతినిధి సంస్థ కాపించిన పని ఇంతవఱకూ నిరుపయోగమని నిరూపింపబడినది."

తరువాత ఆయన వేసిన ప్రశ్న కొంత వింతగా ఉన్నది: "భారతీయులు, భారత దేశంలోని వడుకు నూలు బట్టనే వాడుకొనేటట్లుగా చేసి, తా ముత్పత్తి కావించిన బట్టనూ నూలునూ ఎగుమతి చేసేటట్లుగా మిల్లులచేత ఎందుకు పని చేయించకూడదు? ఇందువల్ల పత్తి పండించేవారికి ఉప కారంగా ఉంటుందని మీరు ఊహించడం లేదా?" ఆయన నిజంగా స్వతంత్ర భారత దేశమునుగూర్చి ఆలోచించాడు.

"అటువంటిది నా కభ్యంతరం ఉండకూడదు ; కాని మా బట్టను పుచ్చుకొనే దేశముయొక్క అవసరాలనుబట్టి మాత్రమే నేము సరఫరాచేస్తూ ఉండాలి. ఇండియా క్షేమంకోసం ఇతర దేశాలను వాడుకోవలెనని నాకు లేదు. మేము పరప్రయోజనములకోసం ఉపయోగపడడమనే విష రోగమువలన పీడింపబడుతూన్నాము. మా దేశంకూడా అటువంటి అపరాధమునకు పాల్పడడం నా కిష్టంలేదు. ఉదాహరణానికి, జపాను, తానొక స్వతంత్ర దేశంగా, ఇండియా సహాయాన్ని అభిలషిస్తూ, కొన్ని సరుకులను మే మెక్కువ చౌకగా ఉత్పత్తి చేయగలమనీ, వాటిని మేము జపానుకు ఎగుమతి చేయవలసిందనీ అడిగినట్లయితే, మేము సంతోషంగా అలా చేస్తాము. కాని నా ప్రణాళిక ప్రకారం ఒక దేశంనుండి మరొక దేశానికి సైనిక నావికా దళముల సహాయంతో సరుకులను విపరీతంగా పంపడం మానివేయవలసి ఉంటుంది." అన్నారు గాంధీజీ.

"వర్తక సామగ్రిని ఎగుమతి చేయడంకాక, అమెరికాకు ఇండియా ఇంకా ఏమి ఈయగలదు? అందుకు బదులుగా అమెరికా, తనకేమి ఈయవలెనని ఇండియా అనుకుంటూన్నది?"

"మీకోసం మీ ప్రశ్నను నేను సవరించవలసి ఉంది. ఇండియా ఏమీ వర్తక సామగ్రిని అమెరికాకు పంపదు. అది ముడి పదార్థాన్ని మాత్రమే పంపుతుంది. ప్రతి జాతీయవాదీ దానినిగూర్చి శ్రద్ధగా ఆలోచించవలసి ఉన్నది. ఎందువల్లనంటే ముడి పదార్థాలను ఎగుమతీచేసే స్థితిలోనే మా దేశాన్ని ఉంచి బాధింపచాలము. ముడి పదార్థాల ఎగుమతీ అంటే చేతి పనులను శిల్పమును నిర్మూలించడమని

అర్థం. (ఆ అర్థం యిదివరకే తెలిసివచ్చింది) తన స్వప్రయోజనంకోసం ఉపయోగపడే దేశంగా కాక, నిరాయుధమైనప్పటికీ ఇండియాను స్వతంత్ర దేశంగా అమెరికా వ్యవహరిస్తూ, తనయెడల ఇండియాకూడా అదే రీతిగా వ్యవహరించవలెననే తన కోరికకు తగినట్లుగా అమెరికా ప్రవర్తించవలెనని నేను అమెరికానుగూర్చి భావిస్తూన్నాను."

"అయ్యా, తాము జీసస్ సందేశాన్ని పునరుద్ఘాటిస్తున్నారు" అన్నాడా పత్రికా విలేఖకుడు.

"నే నంగీకరిస్తున్నాను. మేము శాస్త్రి నైపుణ్యంలో చాలా తక్కువ. కాని మీరు జీసస్ బోధనలు ఆమోదించి, అనుసరించడానికి అంగీకరించిన తక్షణం, యావత్తు నైపుణ్యమూ గుత్తగొనబడుతూన్నదని ఆరోపించేటందుకు నాకవకాశముండదు. అప్పుడు మీరు, 'శాస్త్రి నైపుణ్యం అంతగా లేని తోడిదేశమున్నది. ఆ దేశాన్ని స్వార్థం కోసం వినియోగించుకోవడానికిగానీ, లేక అత్యధికంగా డబ్బు గుంజుకోవడానికిగానీ కాక ఆ దేశముయొక్క క్షేమం కోసమే ఉచితంగా, మన మాదేశానికి శాస్త్రి సహాయ్యం చేదాము' అని అంటారు. ఈ సందర్భంలో మీ క్రైస్తవ మత బోధకులనుగూర్చి ఒక మాట చెప్పవలసి ఉంది. మీరు వారిని యిక్కడకు ఉచితంగా పంపిస్తున్నారు. కాని అది కూడా సామ్రాజ్య స్వార్థ విధానములో ఒక భాగమే. ఎందువల్లనంటే, మీమీద మా కిష్టం కలిగేటట్లు చేయవలెననీ, మీ వస్తువులను మాచే యెక్కువగా కొనిపించవలెననీ మీ కారులు మీ భోగ పదార్థాలు లేనిది మాకు గడవకుండా చేయవలెననీ వారి కోరిక. కాబట్టి మీరు మాకు పంపు

తూన్న క్రైస్తవ మతం కల్తీ మతం. క్రైస్తవు లనబడే వారి సంఖ్యను ఇంకనూ పెంచవలెననే ఉద్దేశం లేకుండా మీరు మీ పాఠశాలలను కళాశాలలను ఆసుపత్రులను నిర్మించి ఉన్నట్లయితే మీ దాతృత్వం నిష్కళంకమై ఉండేది.

"ఇక శాస్త్రీ నైపుణ్యమునుగూర్చి తాతాలు చేస్తూన్న పనిని నేను చేయజాలను. వారు ఒక అమెరికా ప్రవీణుణ్ని మానేజరుగా నెలకు రూ 20,000 లు జీతంమీద తీసుకొని గాగలరు. వారు సాహస వ్యాపార తత్వమునకు ప్రతి నిధులు కావచ్చును. కాని నిరుపేద భారత దేశానికి ప్రతినిధులు కారు. ఇండియాలో 7 లక్షల గ్రామాలున్నవి. భారతదేశపు జనసంఖ్యలో నూటికి 90 పాళ్లు గ్రామాల లోనే ఉన్నారు. అమెరికా ఈ విషయాలనుగూర్చి ఆలో చించాలి. అమెరికా, నిజంగా సహాయకారిగా ఉండవలె నంటే, ఈ పద్ధతిలో తన బుద్ధి విశేషాన్ని వినియోగించ వలెను. అందుకోసం అమెరికా ఇప్పటివలె, ఎగుమతులు చేసే ప్రధాన దేశంగా ఉండడం మానుకోవాలి. జాతీయ ప్రణాళికనుగూర్చిన నా అభిప్రాయాలు ప్రస్తుతం వాడుకలో నున్న అభిప్రాయాలకు భిన్నంగా ఉన్నవి. నేనది పారి శ్రామిక పద్ధతులమీద ఉండవలెనని కోరను. పారిశ్రామిక విధానమనే అంటు రోగం మా గ్రామాలను పట్టుకోకుండా ఆపవలెనని నా కోరిక. అమెరికావారు సాగించిన స్వార్థ కార్యకలాపం అమెరికాయొక్క గానీ, అమెరికా వినియో గించుకొన్న దేశములయొక్క గానీ నైతికాభివృద్ధికి తోడ్పడ లేదు. పైగా వారి ఆధ్యాత్మికాభివృద్ధికి ఆటంకం కల్గించి, అమెరికాయొక్క నిజమైన లోకహితైషిత్వమును మొక్కవో జేసింది. అమెరికా పీడించిన విచిత్ర దృశ్యము ఇండి

యాలలో తటస్థించడానికి వీలు లేదు. అనగా టన్నుల కొలదీ పంచదారను, ఇతర వ్యవసాయికోత్పత్తులను నాశనం చేయడమని ముక్కడ నా భావం. మీ రాపంచదారను గోధుమలను ఇతర దేశాలకు పంపవచ్చును లేదా అమెరికాలో పని లేనివారికి పనిపించవచ్చును." అన్నారు గాంధీజీ.

"అయితే, మీరు మా పందులను తీసుకొన గలిగి ఉండే వారు కారుగదా!" అన్నాడు విలేఖకుడు నవ్వుతూ.

"నాకు తెలుసును. అందరూ నావలె ఆలోచించరు. పండిత నెహ్రూ పారిశ్రామిక విధానం కావలెనంటాడు. అది సమాజపరం చేయబడినట్లయితే, పెట్టుబడిదారీ విధానము యొక్క చెడుగులు అందులో ఉండవని ఆయన అభిప్రాయం. పారిశ్రామిక విధానంలో ఆ చెడుగులు సహజంగానే ఉంటవనీ, అది ఎంత సమాజపరం చేయబడినప్పటికీ అవి నిర్మూలం కావనీ నా అభిప్రాయం.

మ. దే.

—హరిజన్, 29-9-1940

## LIST OF PUBLICATIONS OF THE NAVAJIVAN TRUST, AHMEDABAD.

*(English Publications.)*

| | | Price Rs. | A. | P. |
|---|---|---|---|---|
| 1 | The Story of My Experiments with Truth An—Autobiography by Gandhiji | 7 | 0 | 0 |
| 2 | Satyagraha in South Africa by Gandhiji (out of stock). | .. | | |
| 3 | Key to Health by Gandhiji | 0 | 10 | 0 |
| 4 | Non-violence in Peace and War, Volumes I and II by Gandhiji | 7 and 5 | 0 and 8 | 0 and 0 |
| 5 | Christian Missions—Their Place in India by Gandhiji | 2 | 0 | 0 |
| 6 | Economics of Khadi by Gandhiji [under preparation] | .. | | |
| 7 | Cent Per Cent Swadeshi or the Economics of Village Industries by Gandhiji | 2 | 0 | 0 |
| 8 | From Yeravada Mandir by Gandhiji | 0 | 8 | 0 |
| 9 | The Indian States Problem by Gandhiji (out of stock). | .. | | |
| 10 | Hind Swaraj or Indian Home Rule by Gandhiji | 0 | 8 | 0 |
| 11 | Self Restraint v. Self Indulgence [Relations of the Sexes] by Gandhiji | 2 | 0 | 0 |
| 12 | Women and Social Injustice by Gandhiji | 3 | 0 | 0 |
| 13 | Delhi Diary by Gandhiji | 3 | 0 | 0 |
| 14 | The Nation's Voice by Gandhiji | 3 | 0 | 0 |
| 15 | Gandhiji's Correspondence with the Government by Gandhiji 1942-44 | 2 | 8 | 0 |
| 16 | Constructive Programme, Its meaning and Place by Gandhiji | 0 | 6 | 0 |
| 17 | Communal Unity by Gandhiji | 9 | 0 | 0 |
| 18 | To the Students by Gandhiji | 3 | 8 | 0 |
| 19 | Food Shortage and Agriculture by Gandhiji | 2 | 8 | 0 |
| 20 | Diet and Diet Reform by Gandhiji | 2 | 0 | 0 |
| 21 | Ramanama by Gandhiji | 1 | 0 | 0 |
| 22 | Bapu's Letters to Mira by Gandhiji | 4 | 0 | 0 |
| 23 | Gleanings by Mirabenn | 0 | 6 | 0 |
| 24 | Selected Letters—I by V. G. Desai | 0 | 7 | 0 |
| 25 | Selections from Gandhiji by Nirmalakumar Bose | 4 | 0 | 0 |
| 26 | Satyagraha in Champaran by Rajendra Prasad | 2 | 4 | 0 |
| 27 | Constructive Programme—Some Suggestions by Rajen Babu | 0 | 8 | 0 |
| 28 | The Gospel of Selfless Action or the Gita, according to Gandhiji by Mahadeva Desai | 4 | 0 | 0 |
| 29 | The Epic of Travancore by Mahadeva Desai (out of stock) | .. | | |
| 30 | The Story of Bardoli (Do.) | 2 | 8 | 0 |
| 31 | The Power of Non violence by Richard B. Gregg | 2 | 8 | 0 |
| 32 | Economics of Khadar by Richard B. Gregg | 2 | 0 | 0 |
| 33 | A Discipline for Non-violence (Do.) | 0 | 10 | 0 |
| 34 | Practical Non-violence by K. G. Mushruwala | 0 | 12 | 0 |
| 35 | Practice and Precepts of Jesus by J. C. Kumarappa | 1 | 8 | 0 |
| 36 | Survey of Matar Taluka by J. C. Kumarappa (out of stock) | .. | | |
| 37 | Christianity, Its Economy and Way of Life by J. C. Kumarappa | 1 | 8 | 0 |
| 38 | Public Finance and Our Poverty by J. C. Kumarappa | 1 | 8 | 0 |
| 39 | Clive to Keyne by K. J. Kumarappa | 2 | 12 | 0 |

| No. | Title | Price Rs. | A. | P. |
|---|---|---|---|---|
| 40 | Status of Indian Prince by Pyarelal (out of stock) | .. | | |
| 41 | The Epic Fast (out of stock) | .. | | |
| 42 | Cow Protection by Valji Govindji Desai (out of stock). | .. | | |
| 43 | Glances at Islam by Valji Govindji Desai (out of stock). | .. | | |
| 44 | To women by Rajkumari Amrit Kaur | 6 | 0 | 0 |
| 45 | Seven Months with Mahatma Gandhi by Krishna Das (out of stock) | .. | | |
| 46 | Gandhiji's Challenge to Christianity by S. K. George | 1 | 8 | 0 |
| 47 | Bapu my Mother by Manubenn Gandhi | 0 | 12 | 0 |
| 48 | Gandhiana, compiled by P. C. Deshpande | 3 | 4 | 0 |

*(Hindustani Publications.)*

| No. | Title | Rs. | A. | P. |
|---|---|---|---|---|
| 1 | Goseva by Gandhiji | 1 | 8 | 0 |
| 2 | Delhi Diary by Gandhiji | 3 | 0 | 0 |
| | Rachanathmak Karo kraima by Gandhiji | 0 | 6 | 0 |
| 4 | Rashtrabasha Hindustani by Gandhiji | 1 | 8 | 0 |
| 5 | Varna Vyvastha by Gandhiji | 1 | 8 | 0 |
| 6 | Satyagrahah Ashramakha Ithihas by Gandhiji | 1 | 4 | 0 |
| 7 | Arogyakhe Kunjhi by Gandhiji | 0 | 10 | 0 |
| 8 | Ramanam by Gandhiji | 0 | 10 | 0 |
| 9 | Rashtrabashaka Saval by Pandit Nehru | 0 | 6 | 0 |
| 10 | Ek Dharma Yuddha by Mahadev Desai | 0 | 12 | C |
| 11 | Mahadevabayiki Diary by Narahari Pareek | 5 | 0 | 0 |
| 12 | Himalyaki Yatra by Khaka Kalelkar | 2 | 0 | 0 |
| 13 | Jeevankha Kavya by Khaka Kalelkar | 2 | 0 | 0 |
| 14 | Bapuki Jangya by Khaka Kalelkar | 1 | 0 | 0 |
| 15 | Yesu Christh by Kisjerwal Mushruwala | 0 | 14 | 0 |
| 16 | Judmulse Kranthi by Kisherwal Mushruwala | 1 | 8 | 0 |
| 17 | Jeevan sothan by Kisherwal Mushruwala | 3 | 0 | 0 |
| 18 | Nirbayatha by Kisherwal Mushruwala | 0 | 3 | 0 |
| 19 | Sayani Khanyasa by Narahari Pareek | 1 | 0 | 0 |
| 20 | Gandhiji by Jagatram Dave | 0 | 12 | 0 |
| 21 | Prem Pante by Desai | 0 | 4 | 0 |
| 22 | Hindustan avur Britain Athriclanedoano by J. C. Kumarappa | 0 | 8 | 0 |
| 23 | Gandhi Sahitya Soochi by Panduranga Khanesh Desa Pante | 3 | 4 | 0 |
| 24 | Hamari Bali by Vanamala Pareek Susila Nayar | 2 | 0 | 0 |
| 25 | Bapu Merimah by Manubenn Gandhi | 0 | 10 | 0 |
| 26 | Marukunhj by Mathuradas Thrikamji | 1 | 4 | 0 |
| 27 | Jeevankah Sadhuvya | 1 | 0 | 0 |
| 28 | Gramasevaka Dhus Karya Karnam by Jagatram Devey | 1 | 4 | 0 |
| 29 | Hindustani Bala Kahanya by Magandai Desai | 0 | 4 | 0 |
| 30 | Hindustani Balapatavali | 0 | 5 | 0 |
| 31 | Hindustani Patavali. Pahli Kithab— | | | |
| | Nagari Lipi | 0 | 6 | 0 |
| | Urdu Lipi.. | 0 | 11 | 0 |
| 32 | Hindustani Kahani Sangrahah, Part I | 0 | 5 | 0 |
| 33 | Hindustani Kahani Sangrahah, Part II | 0 | 4 | 0 |